# బాలవ్యాకరణోద్ద్యోతము



వఝల చినసీతారామస్వామిశాస్త్రి విరచితము
విజయనగరము

శ్రీమతి కాకరపర్తి వేంకటసీతమ్మ గారిచే ప్రకాశితము
విజయనగరము
1959



[వెల : రు 5-0-0



గ్రంథకర్త

కళాప్రపూర్ణ

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు



కృ తి ప తి

శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, పి హెచ్ డి,

# కృతిసమర్పణము



శ్లో. శ్రీరస్తు, మాఙ్గళ్యపరంపరాస్తు
దీర్ఘాయురారోగ్య సమృద్ధిరస్తు
దిగన్త విశ్రాన్త సుకీర్తిరస్తు
గోపాలరెడ్డి ప్రభుశేఖరస్య ౧

ఆన్ధ్రాణా మున్నతత్వం కలయితు మనిశం భావయన్తం మహాన్తం
శ్రీమన్త్రై లిఙ్గికాన్ధ్రీపదభజనరతాన్ వణ్డితాన్ పాలయన్తమ్
భాషాదేవి దదానం సుకవిగురు రవీన్ద్రీయకావ్యాన్ధ్రభూషాః
శ్రీమద్గోపాలరెడ్డి ప్రభువర మవతా దాసుధాధామతారమ్ ॥ ౨

క. బాలవ్యాకరణోద్యో
తాలోకన ముభయభాషలందును వ్యాకృ
త్యాలోడనఫల మీయం
జాలుట నిది శబ్దశాస్త్ర సర్వస్వమగున్. ౩

క. దీనికిఁ దగియెడు నాథుం
డీనరలోకమున నీవె యెన్నిక సేయన్
గానం దీనికిఁ గృతిపతి
వై నా వాంఛితము దీర్పు మదిగాక యిలన్. ౪

తే. గీ. సర్వసన్మంగళంబులు సంతరించు
శాశ్వతంబగు సత్కీర్తి సంఘటించు
సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచుఁ
గృతి పతికి నంచు వేఁడ సమ్మతి వహించె. ౫

సీ. ఇండియాదేశంపు ఋక్థశాఖామంత్రి
యాంధ్రవిశ్వకళా సమజ్యకెల్ల
గౌరవాధ్యక్షుఁ డాంగ్లంబున వంగాంధ్ర
సంస్కృతంబులను విశారదుండు
విద్యాలయమువారి బిరుదముల్ డాక్టరు
డీ లిట్టు లలరు విశాలకీర్తి
పండిత కవిపక్షపాతి పండిత పోష
ణాభిముఖ్యుండు దేశాభిమాని

తే. గీ. కృతిపతిత్వంబు సంగీకరించె నాంధ్ర
సంస్కృతంబుల లక్షణజాల మిందు
పరఁగుచున్నది సూరిలోపములు దీర్చ
నిట్టి దీనికి సాటి వ్యాకృతులు గలవె. ౬

మ. చిరకాలంబునకున్ లభించె మరలన్ శ్రీరెడ్డిసామ్రాజ్య మీ
ధర శ్రీనాథునినాఁటికన్న గడు నాంధ్రం బుజ్జ్వలం బౌచు భా
స్వరతం గాంచుట యబ్బురంబగునె గోపాలాంధ్ర రెడ్డిప్రభూ
మరలింపం దగదే భవద్యశము వేమారెడ్డి సత్కీర్తులన్. ౭

శా. ఔదార్యం బది లక్ష్మికిం బరమశోభాధాయకంబై తగుం
గాదే యంచు నుదారశీలము వెలుంగన్ లక్ష్మి భూమీస్థలిం
బ్రాదుర్భావము నొందెనాఁ గడు నుదారత్వాఢ్యయై సార్థక
శ్రీదీప్తిన్ భవదీయజాయ దగు లక్ష్మీకాంత మాభిఖ్యయై. ౮

శా. గోపాలుండు విధాత మీకిల నొసంగు దీర్ఘ మాయుష్యముం
గోపాలుండు రమాధినాయకుఁ డొసంగు న్నిత్యకల్యాణముల్
గోపాలాఖ్యులు లోకపాలకులు శ్రీగోపాలాంధ్ర రెడ్డిప్రభూ
యాపాదింతురు లోకపాలకత మీ కాచంద్ర తారార్కముల్. ౯

క. ఆరాధిత వాగ్దేవీ
సార విబుధపోషణార్థ సంసక్తాత్ముం
డై రామాయణ భారత
పౌరాణార్థాభిధాన పాండిత్యుండై. ౧౦

క. చుట్టాలసురభి సీతమ
జెట్టం జేపట్టినట్టి జెట్టికి శ్రీమత్
పట్టాభి రామరెడ్డికి
దిట్టకు మీాపితకుఁ గలదె దీటిలలోనన్. ౧౧

క. తన కద్వైతమె సమ్మత
మనుచుఁ శివకేశవులకు నద్వైతము నం
చును జంద్రశేఖరాఖ్యుం
దనయుల గోపాల రామ నాములఁజేసెన్. ౧౨

మ. వర జాతీయపువాదియై చెఱకుఁ బో వాంఛించె నా చంద్రశే
ఖరరెడ్డి ప్రభుఁ డాత్మదేశముఎయిం గ్లాణ్యాబ్ధుఘ్యుం బూని తా
నరవిందాంచిత ఘోషనామునకు శిష్యుండన్న వాక్యంబు దా
హారణం బొందఁగ నభ్యసించె సరి నాంధ్రాంగ్లంబులన్ వంగమున్.

క. ఆ చంద్రశేఖరేంద్రుఁడు
భూచక్రము వీడి స్వర్గమును సేవింపన్
నేచెను గా కాతఁడె భువిఁ
దోఁచిన నాంధ్రం బిదెట్లు తులకించునొకో. ౧౪

క. బెజవాడ వంశహూత్తిక
విజయశ్రీ కలిత గోపవిభు నామమునకున్
సుజనుల కొంగు పసిండికి
రజనీకర విశదకీర్తి రాజిత మహికిన్. ౧౫

క. దేశక్షేమంబునకై
కోశంబు గృహంబు వీడి క్రూరపు చెఱలోఁ
గౌశల్యంబునఁ గావ్యపు
రాశిని రచియించు లోకరక్షామతికిన్. ౧౬

క. మేరు ధరాధర ధీరున
శారాద్ధ సరస్వతీ పదాంభోజునకున్
పూరిత ఫలానుమేయ
ప్రారంభున కాత్మనుతి పరాఙ్ముఖమతికిన్. ౧౭

క. పాలిత పండితకవికిఁ
లాలిత వైయాకరణ సులక్షణ కృతికిన్
శీలిత భాషావాఙ్మయ
కూలంకష పాండితీ విఘూర్ణితమతికిన్. ౧౮

క. పాపుల కతిదూరునకున్
శ్రీపతి పాదాబ్జ చంచరీకాత్మునకున్
గోపాలరెడ్డి విభునకు
భూపాల సమర్చితాత్మ పుష్కర యుతికిన్. ౧౯

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచించిన "బాలవ్యాకరణోద్ద్యోతంబు" సమర్పితంబయ్యె. ౨౦

---

# విజ్ఞప్తి

ఆంధ్ర మహాశయులారా, ఆంధ్ర గ్రాంథిక భాషాజిజ్ఞాసువుల కిపుడు బాలవ్యాకరణ మత్యంతోపకారకమై యున్నది. కాని దీని యందును దీని వివరణ మనఁదగు త్రిలింగ లక్షణ శేషమందును గొన్ని యపసిద్ధాంతములు లక్షణవిరోధములును నుండుటయే కాక యాంధ్ర గ్రాంథిక వాఙ్మయస్థములగు పెక్కు లక్షణములు పేర్కొనఁ బడలేదు. లక్షణవిరోధములును నపసిద్ధాంతములును విద్యార్థుల నెమ్మనములందు నాటుకొనుట మిక్కిలి ప్రమాదకరము. కాన నందలి యపసిద్ధాంతములను లక్షణవిరోధములను దొలఁగించి బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణములయందుఁ బేర్కొనఁబడని లక్షణ విశేషములను జేర్చి మిగిలిన బాలవ్యాకరణ విషయములను నిల్పి రచించుట విద్యార్థుల కత్యంతోపకారక మగునని తలంచి యీ బాలవ్యాకరణోద్ద్యోతమును రచించితిని.

మఱియు నాంధ్రభాషలో సగభాగము నాక్రమించియున్న సంస్కృతభాష నభ్యసించుట విద్యార్థుల కత్యావశ్యకము గాన నాంధ్రోపయోగి సంస్కృత భాషాలక్షణములు సంక్షేపముగానైనఁ దెలియుటకై యిందు సంస్కృత కృత్తద్ధిత సమాస విషయములును సంస్కృత సమాస సంధులును సంక్షేపముగాఁ జేర్పఁబడినవి. కావున దీనిని జదివిన విద్యార్థి సంస్కృత వ్యాకరణమును వేఱుగఁ జదువ నక్కఱలేదు. నేఁటికిఁ బ్రసిద్ధమైయున్న యాంధ్ర వ్యాకరణములలో నిట్టి పద్ధతి లేదనవచ్చును. పయి కారణములచే నీ గ్రంథ మాంధ్ర విద్యార్థుల కవశ్యపఠనీయ మయి యున్నది.

ఈ గ్రంథమునకుఁ గృతి నాయకత్వమును బ్రీతితో నంగీకరించిన శ్రీ యిండియా మంత్రిగారగు గౌ॥ డా. బెజవాడ గోపాలరెడ్డి, పి. హెచ్. డి. గారి నెంతయుఁ బ్రశంసించుచున్నాఁడను.

దీని ముద్రణమునకుఁ దోడ్పడుచు నాకు వేయి రూపాయ లిప్పించిన శ్రీ యాంధ్రప్రదేశ ప్రభుత్వము వారియెడలను, వారి తరఫున నట్టి వేయిరూపాయలను బ్రసాదించిన విద్యాశాఖాధ్యక్షులగు శ్రీ డైరెక్టరుగారియెడల మిక్కిలి కృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

ఈ గ్రంథమునకుఁ బ్రకాశకత్వమును వహించి ప్రూఫులు దిద్దుట మున్నగువానికిఁ దోడ్పడిన నా కొమార్తె చిరంజీవిని కాకరపర్తి వేంకట సీతమ్మను నాయురారోగ్యాద్యభివృద్ధిగా నాశీర్వదించుచున్నవాఁడను. ఈ గ్రంథము వలయువారు గ్రంథకర్తనగు నాకు వ్రాసి తెప్పించుకొనవలయును దీని వెల "అయిదు" రూపాయలు.

ఇది వ్యాకరణశాస్త్ర మగుటచేత దీని నత్యంత సమర్థతతో ముద్రించిన కాకినాడ వాస్తవ్యులగు శ్రీ పాపులర్ పవర్ ప్రెస్సు వారి నెంతయుఁ బ్రశంసించుచున్నాఁడను.

కోడుగంటివారి వీథి
విజయనగరము,
1—6—1959

ఇట్లు సుజన విధేయుఁడు
వఝుల చినసీతారామస్వామి శాస్త్రి,
గ్రంథకర్త

# విజ్ఞప్తి యనుబంధము

నా రచించిన గ్రంథముల విషయములను విమర్శించుచు వ్రాసిన యలంతి విజ్ఞుల విమర్శనములను సావధానముగఁ జదివితిని. ఆ విమర్శనములు సరిగా నుండ లేదని తోఁచి సంక్షేపముగా నీ యను బంధమును వ్రాయుచున్నాను. ఆంధ్రపత్రికా భారతీ సంపాదకులు తమ వికారి సంవత్సరాది సంచికలోఁ బ్రచురించిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి వ్యాసమును 1959 సం జూలై భారతిలోని వారి సమాధానమును దాని వెనుక సంపాదకులు వ్రాసిన యీ క్రింది పంక్తులను జూచియు నీ యనుబంధమును వ్రాసితిని.

[ప్రయోగశరణాః వైయాకరణాః—అన్నది పండితోక్తి. కాని ఈ వివాదంలో ప్రయోగాలను దిద్దివేయవచ్చునని ఒకరి మతం, 'పలుతావుల ప్రయోగించబడిన శబ్దముల నెల్ల దిద్దుట సంప్రదాయ విరుద్ధ'మని మరొక మతం, అయినట్టు స్పష్టం. కనుక ఈ వివాదాని కిక స్వస్తి. —సంపాదకుఁడు.]

శ్రీ 'తూమాటి దోణప్ప' యమ్మగారు (వాల్తేరు, ఆంధ్ర యూనివర్సిటీ) 'వికృతి వివేక కర్తృత్వము' అను శీర్షికగల వ్యాస ములో వికృతి వివేకమనెడి యథర్వణకారికావళి, యహోబల పండిత విరచితమనియు నా గ్రంథ మన్యదేశ్యమును స్మరించినది గాన నది నవ్యమనఁదగుననియు దానిని బదుమూఁడవ శతాబ్దమువాఁడగు నథర్వణుఁడు రచించుట పొసఁగదనియు నాతని కాలమున నన్య దేశ్యము తెనుఁగులోఁ జేరలేదనియు భారతిలో వ్రాసిరి. ఆనాఁటికిఁ దెల్గున నన్యదేశ్యము చేరలేదనుట సత్యవిదూర మగుటం జేసియు వారు మూలభూతమగు 'ఆంధ్రశబ్ద చింతామణి'ని గాని దాని వివ రణమగు వికృతి వివేకమునుగాని యాఘ్రాణించుటయు లేమిం జేసి వారి వ్యాసమును విమర్శించుట యనావశ్యకము.

శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులు యమ్మే గారు (చెన్నపురి యూనివర్సిటి) వికారి సంవత్సరాది సంచిక (ఆంధ్ర పత్రిక 1959-60 సం॥) 81 మొ 96 వ. కల, పుటలలోను, నాంధ్ర భారతి 1959 సం ఏప్రిల్ 54 మొ. 60 వ. కల, పుటలలోను, ౧౯-౫౯ జూలై భారతి ౨౩-౨౪-౨౫ పుటలలోను బ్రచురించిన విమర్శనములలో నన్నయాథర్వణీయకారికల యర్థము సరిగాఁ దెలియకున్నను వానిని స్మరించియుండుటచేత వారి విమర్శనములను సంక్షేపముగా నీ యనుబంధమున విమర్శించుచున్నాఁడను.

వీరి వికారి సంవత్స రాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ఇది (ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము) పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధమున వెలసిన పరవస్తు చిన్నయసూరి ప్రణీత బాల వ్యాకరణమునకు (1960 ప్రాంతమున రచింపఁబడినది) 'మహాపెద్ద' భాష్యగ్రంథము" అనియు, 1959 సం॥ ఏప్రిల్ భారతిలో "ఇది (ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము) ఆంధ్ర భాషా వ్యాకరణములలో నర్వాచీనమును పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్థమున వెలసినదియు పరవస్తు చిన్నయసూరి ప్రణీతము నగు బాలవ్యాకరణమునకు విపులమగు వ్యాఖ్యాన గ్రంథము" అనియు వ్రాసిరి. నారచించిన యాంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునకు మూలము ప్రాచీనమగు నన్నయాథర్వణీయమనియు (కారికలు) దాని వ్యాఖ్యానములలో "కల్పతరువు" వలెనె బాలవ్యాకరణమును నొక వ్యాఖ్యానమనియు నా గ్రంథము నాఘ్రాణించినవారికెల్ల విదితము కాఁగలదు. 1959 జూలై భారతి 23 మొ. 25 వ. పుటలలోని సమాధానములును సరిగ లేవు.

శ్రీ వెంకటరావుపంతులు యమ్మేగారు రచించిన 'తెలుఁగు కవుల చరిత్రము" లో నధర్వణకారికావళి ప్రాచీనమనియు నాంధ్ర శబ్దచింతామణి నవ్యమనియు వ్రాసిరి. మూలము నవ్యమనియు

దాని వివరణము ప్రాచీనమనియు వ్రాసిన వ్రాతలోని యసంగతిని నారచించిన 'ఆంధ్ర వైయాకరణ పారిజాతము ద్వితీయముద్రణము విజ్ఞప్తి యనుబంధమున' (౧౯౫౬-౨-౨౮) విశదపఱచి యున్నాను. వికారిసంవత్సరాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో (84 పుట మొ) నధర్వణకారికావళి సయిత మర్వాచీనమని 'అర్వాచీన లాక్షణికు లగు నాంధ్రశబ్దచింతామణికర్త, అధర్వణ కారికావళికర్త ..' అని వ్రాసిరి. వీరికింక నేమిచెప్పినను ప్రయోజనము లేదు.

పంతులుగారు నా గ్రంథములోని 'ప్రాచీన కవిప్రయోగము లభింపలేదు...అని యుద్ఘాటించుటచేత నట్టి ప్రయోగములు కతిపయము మాత్రమె ప్రదర్శింపఁబడినవి'' అని వ్రాసియు శాసన ప్రయోగములను నాధునిక కవిప్రయోగములను బ్రాచీన కవిగ్రంథములలోని కవిప్రయుక్తము లనఁదగని ప్రాచీన లాక్షణికసమ్మతిలేని ప్రయోగములను సంస్కర్తలు సంస్కరించిన వనఁదగిన యప్రామాణిక ప్రయోగములను జూపుట కేవల మసంగతముగా నున్నది.

ద్విపద. "ఈవిధంబున నిర్వదెనిమిదికోట్లు'' అనునది మొదలగు పండితారాధ్య చరిత్రములోని (పర్వ-౨౭౧) ప్రయోగములను 'కోట్లు' అనుదానిని నిర్వహించుటకయి చూపిరి. (౧౯౫౯-భారతి-ఏప్రెల్-౫౯ పుట) 'కోట్లు' అనునది వ్యావహారికశబ్దము. అచట 'కోటుల్' అని కవి ప్రయుక్తపాఠములను గ్రహింపవలయును. బసవ కవి సూర్యగణములచోట 'గగ' మును బ్రయోగించుట వింతకాదు.

"ద్విపద. ప్రేమం బెలర్పంగ భృత్యేవరాధః స్వామినోదండ యన్ చదువు నిష్ఠించి" (బసవ. ౧౦౬ పుట-౪ ఆశ్వా-౧౫౯ పంక్తి). "పాయక శ్రుతి రసాన్ భక్తస్య జిహ్వా గ్రే యని యే ప్రొద్దు వ్రాయు గావునను'' (బసవ పు. ౧౬౪ పుట ౫ ఆశ్వా, ౫౯౦ పంక్తి).

౧౯౫౯ జూలై భారతిలో ౨౫ పుటలో వేంకటరావు పంతులుగారు ప్రాసఘటిత మహాకవిప్రయోగములనుచు నీక్రింది

వానిని వ్రాసిరి. 'అందుఁగల పర్వతేంద్రంబు లైదు వాని చుట్లుఁ గలిగిన కొండలు కోట్లసంఖ్య'' (వరాహ పు ౧౦ ఆ ౧౫౩) ఇట్లు కడలేక బ్రహ్మాండకోట్లు మెఱయ'' (విష్ణు పు ౩ ఆ ౧౫౩ ప) కాని పైకవులు సంయు తాసంయుతప్రాసమును బ్రయోగించి యుందురని పంతులుగారు గ్రహింపరైరి. ఇట్టి యవపారములను జూచియే సూరియు ఆచ్ఛిక ౧౨ సూత్రమున నట్లు భ్రమించెను.

తే. గీ. పాఁడి దచ్చుఁగనిమ్ము నాతండ్రి కృష్ణ వేఁడుకొని యెద నందాఁకఁ బండ్లు తినుము దుండగపు చేష్టలును నోటిగాండ్ర తనము మెండు గాఁజొచ్చె నీకు నైదేండ్ల కనఁగ' (అప్పక ౩ ఆ ౩౧౫) అని యప్పకవి యిట్టి ప్రయోగములను గాంచియే చెప్పియుం దును గాన ఇట్లు కడలేక బ్రహ్మాండకోటి మెఱయు ' అని వెన్నెల కంటి సూరనయు, 'చుట్లుఁ గలిగిన కొండలు కోటిసంఖ్య'' అని నంది మల్లయ్య, ఘంట సింగయ్యాకవులును బ్రయోగించి యుందురు. "తే. గీ రలలు తమక్రింద జడ్డలై క్రాలువ్రాలు ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైనఁ గూడియైనను బెఱ యడుగులను నిల్చు సంయు తాసంయుత ప్రాస సంజ్ఞఁ దవరి.'' (అప్పక-౩ ఆ-౩౧౮ ప) అని యప్పకవి స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు.

ఋ-ౠ' వర్ణములు స్వరము లనుబుద్ధితో నన్నయాదులు ప్రయోగింపఁగా 'ఋ-ౠ' వర్ణంబులు ర-ల' తుల్యములనుచు నర్వాచీను లిట్టి ప్రాసములను బ్రయోగించిరి.

"వృషోత్సర్గ మనఁగా నాఁబోతులను విడుచుట సంప్రదాయ ముగాని యావులను విడుచుట అనునది లేదు." అని యెవ్వరో చెప్పి రట (సంవత్సరాదిసంచిక-౬౩ పుట.)

'వృషోత్సర్గః- పుం- శ్రాద్ధాదౌ వత్సతరీ చతుష్టయసహిత త్రిశూల చక్రాఙ్కిత వృషత్యాగే'' (శబ్దార్థచింతామణి కోశము) అనుచొప్పున వీరశైవులును శివచిహ్న త్రిశూలాఙ్కిత వత్సతరీత్యా

గము చేయనగునని విశదమగుచున్నది. శ్రాద్ధములందేకాక పుణ్యకాలములందందును వృషోత్సర్గమును జేయనగునని చెప్పఁబడియున్నది "హేమాద్రౌ-విష్ణుధర్మే-అయనద్వితయే చైవ మృతాహే బాంధవస్యచ ఉత్సృజేన్నీల వృషభం కౌముద్యాం స్వముపాగమే, కౌముదీ=కార్తికీ." (నిర్ణయసింధువు II ప్రక-౭౦ పుట). "శైవమతసంప్రదాయమున వృషోత్సర్గ మనఁగా గోవును విడుచుట, గోదానము చేయుట మొదలగు నాచరణవిధానము లేనేలేదు." (సంవత్సరాది సంచిక ౬౩ పుట) అని వ్రాసిరి. గోదానము చేయవలయునని చెప్పలేదే వృషోత్సర్గ మనఁగా గోదానము కాదే! "సంహితాకర్తలకు సంప్రదాయము నెఱుఁగక ..' "సంహితాకర్తలకు సంప్రదాయిక (అపశబ్దము. దీనికి లెక్కయేమి?) దృష్టి లేదు. ఆమత సాంప్రదాయముల నెఱుఁగక .' (వత్సరాదిసంచిక ౯౩ పుట) అనునవి మొదలగు ధోరణి కేవలము నసంబద్ధప్రలాపమె కదా

ప్రాణము పోయినం బోవుఁగాక. మందు గుణము చేసినదనునట్లు "పరిష్కర్తలు (కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు) 'విష్ణువన్మాట' అను నూతనపాఠమును నెలకొల్పుట ప్రామాదికమె." అని వ్రాసిరి.

'అనుకరణమున సంస్కృతవిభక్తి నిలువదనియు తెనుగు విభక్తియే నిలుచుననియు సిద్ధాంతము. పండితారాధ్యుల కృతియందిట్టి ప్రయోగమును గమనించియే సోమనారాధ్యుఁడు 'కృతం కర్మ శుభాశుభంబు' అను నిట్టి ప్రయోగములను గావించి యున్నాఁడు,"

"సంస్కృతవాక్యమయినను అనుకరణసంధియందు తెనుఁగు విభక్తితో నుండుటయే ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము" అని (సంవత్సరాదిసంచిక 96 పుట) అని యించుకేని సంకోచింపక వ్రాసిరి. ఏవో కొన్నిచోటులు పైరీతివి వీరి యపూర్వసిద్ధాంత

మునకును లక్ష్యములైనను వీరి సిద్ధాంతముచొప్పున 'శివాయ నమోాయనుచు' (శివతత్త్వసారము ౬౬ పద్య) "తనుఁవని మ్రొక్కిన దీక్షా యని" (శివతత్త్వ ౨౧౨ పద్య) "మద్భక్తా విగత కల్మషా యను" (శివతత్త్వ ౧౨౦ పద్య) అను మొదలగుకీతిని బండి తారాధ్యకవి యనుకరణసంధిలోని తుదిపదము తత్సమముగాఁ బ్రయోగింపలేదే.

వీరి సిద్ధాంతముచొప్పున నీవలకు బసవపురాణమున నున్న 'ఉమా మాతా పితా రుద్ర యనెడు" అనుచోట 'ఉమా మాతా పితా రుద్రుఁ డనెడు" (బసవ ౨ పుట) అనియు, శ్రుతి "విశ్వత శ్చక్షు ఋత యంచు" అనుచోట 'ఋతమంచు' అనియు (బసవ ౨౦ పు) 'అవు నసంఖ్యాతా స్సహస్రాణి యనుచు" అనుచోట 'సహస్రంబులనుచు" (బసవ ౨౦ పుట) అనియు, " ..స్వామి నోదండ" యన్ చదువు" అనుచో "దండమనియు, (బసవ ౧౦౬ పుట) "...బ్రాహ్మణా యన" అనుచోట "బ్రాహ్మణులన" అనియు, (బసవ-౨౧౧ పుట) "...పితామహా యనుచు" అనుచోట "పితామహులనియు" (బసవ ౨౧౨ పుట) దిద్దవలసియుండునుగదా.

(శ్రీ) గురవే నమో యనుచు' అను మూఁడు చరణములందును (బసవ ౩౫ పుట) "(శ్రీ) గురవే నమో యనుచు" (బసవ ౩౬ పుట) అనుచోటను, 'శివాయ నమోనమోయనుచు" (బసవ ౭౩ పుట) అనుచోటను "ఏక ఏవహి రూపేణ యనియు" (బసవ ౬౮ పుట) అను చోటను " ..జిహ్వాగ్రే" యని (బసవ ౧౬౭ పుట) అనుచోటను "సదాపశ్యంతి సూరయో యనఁగ' (బసవ ౨౦౨ పుట) అను చోటను "విష్ణుః పితామహా త్తన' (బసవ ౨౦౨ పుట) అనుచోటను వీరి సిద్ధాంతము చొప్పున నెట్లు దిద్దుటో వీరె చెప్పవలెను. ఇవెల్లఁ దాళపత్రమాతృకల పాఠములేకదా "వేదములవలె ... స్వర యుక్తముగ పఠించువారు కావున నిందు పాఠభేదములకు నాస్కా

-రము లేదుగదా." అని వ్రాసిరే. ఏమిగతి! ఈరీతిగ నెన్నోస్థలములు దిద్దవలసియుండఁగా "ఆంధ్రగ్రంథమాలాధిపతులు ప్రకాశ మొన ర్చిన బసవపురాణ ద్వితీయముద్రణమునఁ (1952) గల పాఠములు... మార్చవలసిన యావశ్యకత యెంతమాత్రము లేదని విమర్శకలోక మునకు విన్నవించుచున్నాను" అని వీరు వ్రాయుట యర్థ్యమా?

శివతత్త్వసారమును ముద్రింపించిన కీ. శే. కొమరరాజు వెంకట లక్ష్మణరావు యమ్మెగారు తాటియాకుల మాతృకల తప్పులు చూపుచు "కావున ..సంగతి సందర్భములనుబట్టి ప్రకాశకులు తమ బుద్ధివైభవము నుపయోగించి మూలమందుఁ దాము తప్పులనుకొనిన వానిని దిద్దవలసినదే...కాని దిద్దువాఁ డెంతపండితుఁడైనను సర్వ జ్ఞుఁడుకాఁడు - కాఁజాలఁడు..." 'ఛందోవ్యాకరణాది నియమముల ననుసరించియు నర్థసందర్భములను బట్టియు మూలమందలి పాఠములు తప్పని తోఁచినప్పుడు వానిని దిద్ది యచ్చొత్తించితిమి" అని వ్రాసిరి. (చూడుఁడు-పీఠిక. శివతత్త్వసారము ౮-౯-౭ పుటలు).

౭. "కానునది భక్తునిచేతన ధన మతనిక యిచ్చునదియు "తస్మైదేయ ' మ్మనియుఁ "తస్మాద్గ్రాహ్య" మ్మనియున్ గల దనిరి భక్తియాగ విధిజ్ఞుల్" (శివతత్త్వసారము ౧౧౫ పద్య) అని కవి ప్రయుక్తపాఠ మనఁదగును. దాని ప్రకాశకులగు కొ. వెం. లక్ష్మణ రావు పంతులుగారు వ్రాసినట్లు "అయినను కొన్ని పొరపాటులుండిన నుండవచ్చును" (శివతత్త్వ ౮ పుట) అనురీతిని ౧౭౮-౧౫౮-పద్యము మొదలగునవి యతిభ్రష్టములు. "కీర్తింపఁడు వెండి తన్నుఁ గార్యా కార్యా వర్తనల" (శివతత్త్వసారము ౧౭౮ పద్య). "శివ ద్రోహుఁడు నరకగామి యగును మహేశా" (శివతత్త్వ-౧౫౮ పద్య) ఇవి రెండును యతిభ్రష్టములె కదా.

తాళపత్రమాతృకలు సాధారణముగా నసంస్కారులు వ్రాసినవి. కాన నవి తప్పుల తిప్పలు. బసవపురాణ మాతృక లును నట్టివె యని పైసందర్భమునుబట్టి విశదమగును గదా.

ళానిని యథాస్థితముగా మహాకవి ప్రయుక్తములనుట యసంభావ్య మని యెవ్వరును సంగీకరింపక తీరదుగదా. ప్రతులు పెక్కిటిలో నొక్కరీతినే యుండిన నుండవచ్చును. ఒకదానిని జూచి యొకటి వ్రాసినదేకదా. ఆ యా వ్రాతగాండ్రును సంస్కర్తలును సంస్కరించినవేకదా. సంస్కర్తలు తామెఱింగినరీతిని సంస్కరింతురు. సంస్కర్తలె మహాకవులు కారుగదా. మహాకవులెయగు లాక్షణికులు తమకాలములందలి తాళపత్ర మాతృకలను జూచి యుండరా? 'ప్రయోగశరణా వైయాకరణాః' అను పరిభాష వారెఱుంగనట్టిదా? వారు భాషానియమనము చేయునపుడు మహాకవి ప్రయోగములనే కదా పురస్కరించుకొందురు. ఆ యా కవులు వ్రాసిన తాళపత్ర మాతృకలు లభింపవుగదా 'యథా శివమయో విష్ణుఁడు'' కృతం కర్మ శుభాశుభంబు"అని సోమనారాధ్యుఁడు ప్రయోగించెననుట కంత యభాజనుఁడా బసవపురాణకర్త వీరి సిద్ధాంతము చొప్పున (వికారి సంవత్సరాదిసంచిక ౯౬ పుట) 'కృతం కర్మ శుభాఽశుభంబు'' "విను యథా శివమయో విష్ణుఁడు'' అనికదా యుండవలయును. ఇట్టివి సాధువులని యే ప్రాచీన లాక్షణికుఁడైన వచించెనా? ఇట్టి వ్రాఁతలు తమ యజ్ఞతను వెల్లడించును గాని తమ మనోరథము చొప్పునఁ దామును విమర్శకులె యను పేరు తెచ్చునా? పండితులన్న వారు కొందఱైనను జూడరా?

వీరికి 'వైరిపదము' అనఁగా నెమో తెలియక 'కలగాయపుల గముగా'' నా యా గ్రంథములలోని యా యా సందర్భముల నెల్ల నెక్కించిరి. 'వాఁడి మయూఖములు, వేఁడిపయోధారలు'' మున్నగునవి వైరిపదము లనుట సరియా? ఇట్టివి వైరిపదములని భ్రమించియే కావలయును బంతులుగారు నన్నయాదుల ప్రయోగములలో వైరిపదములు గలవనిరి. (సంవత్సరాదిసంచిక ౮౧ పుట) కోమటిం ద్రుంచఁడనఁగ .?'' అనుపద్యమే ఛందోదర్పణమునఁ గానరాదు. వీ రే ప్రతిని చూచిరో

తద్భవపదములతో సంస్కృతపదములు సమసించుట వైరి పదము కాదని యే ప్రాచీనలాక్షణికుఁడైనఁ జెప్పినా? నన్నిచోడుని సంస్కృతసమాసమధ్యగతము అరద' శబ్దము కాదు=(౧౧ ఆ ౭౭-౮౮). 'ఓడ' శబ్దము వైకృతమని తెలిసినచోఁ బంతులుగా రిట్టి యను గమమును గల్పించియుండరు 'సంసారార్ణవయోడ" (కావ్యాలం ౯ ఉల్లా-౬౧ పు-౧౩౫ ప) అనునది వైరిపదమె. వీరు ప్రాచీనగ్రంథ ముగా నంగీకరించిన కావ్యాలంకారచూడామణిలోనే యున్నదిగదా. 'ఓడ-నావ-హోడః" (వైకృతదీపిక) ఓడ. వై. వి. కలము=నావ" (శ ర). ఓడ-వి (సం-హోడః-ప్రా-వేడో-బేడో-తమి-ఒడం-కర్ణా-ఓడ) నావ (శ్రీ-సూ-రా-ని)-

'క. క్షీరార్ణవకూఁతురు సంసారార్ణవయోడ శుభ మొసఁగు మీ కనఁగా వైరిపదం బగుఁ దెలుఁగునఁ గూరని సంస్కృతముఁ దెనుఁగు గూర్చుటచేతన్" (కావ్యాలం ౬౧ పు ౧౩౫ ప) అను పద్యమును వీరు సంవత్సరాదిసంచికలో ౮౨ పుటలో నుదా హరించియు నున్నారు. కాని యర్థమును దెలిసి యుదాహరించిరా యేమి? "పది-కొడుకు" శబ్దములు శబ్దరత్నాకరమున వైకృతము లని వ్రాయఁబడెను. అఱవ కన్నడములలో సంబంధిపదము లున్నంతమాత్రమున వైకృతములు కావనరాదు. అఱవ కన్నడములలో మాత్రము వైకృతపదములు లేవా?

'పూర్వపదము సంస్కృతసమమై ఉత్తరపదము తెనుఁగుపద మైనపుడది వైరిపదము" (వికారి సంవత్సరాది సంచిక. ఆంధ్రపత్రిక ౮౩ పుట) 'అంబుజపది' అనుటలోని 'అంబుజ' అనునది సంస్కృత సమమా? "సంస్కృతసమశబ్దము, సంస్కృతశబ్దము" అనువాని భేదము తెలియదు పంతులుగారికి. ఇట్టి యమ్మేలకు సంస్కృతము "అగ్గబుయ్య' కదా. అజ్ఞతా భూయిష్ఠములగు నిట్టి వ్రాఁతలు వ్రాయ నగునా? 'పుడమి' శబ్దము 'పృథివీ' శబ్దభవమని యొకచోఁ జెప్పినంత

మాత్రాన మజ్జోకచో నది సంస్కృతశబ్దమని సాధించుట తప్పా? ఒక్క శబ్దము సంస్కృత మొకచోటను సంస్కృతభవ మొకచోటను గారాదా? 'నిత్య' అను పదము తత్సమమని -'నిత్యసత్యవ్రత' అను ప్రయోగము సాధించునా? ఒక శబ్దమునకుఁ దద్భవశబ్దములు రెండుండరాదా? ఒక శబ్దమునకుఁ దద్భవ మున్నపుడు దానికిఁ దత్సమ రూప ముండరాదా? 'లక్ష్మి' శబ్దమునకు లచ్చి-లక్కిమి' అను తద్భవరూపములు రెండుండఁగా 'లక్ష్మి' అను తత్సమరూపమును లేదా? 'కవిలియ-కవిలె' అను శబ్దములు లేవని యెవ్వరును జెప్ప లేదే 'దమ్మకవిల-దమ్మకవిలె' అను తద్భవరూపముల నంగీకరించి పాపము బసవకవిని వైరి పదదోషము పాలుగాకుండఁ జేయరాదా? దానిని నంగీకరించినను క్షతి లేదే

ఏదో గొప్పవిషయముఁ గనిపెట్టినట్లు ' అరణ్యపర్వ శేషమున ౬ ఆ ౯౦ లో సొంతమైన యశశ్శబ్దమును 'యశశ్శాలి' అని అదం' తముగా నుపయోగించి యున్నాఁడు తత్సమ పరిచ్ఛేద వివరణమున వ్యా - సం - స - ములో పై ప్రయోగము లేవియు నుదాహరింపఁబడి యుండలేదు." అని పంతులుగారు వ్రాసిరి.- యశశ్శబ్దము సకారాం తము మాత్రము సాధింపఁబడెనా? దాని అర్శఆద్యచ్' ప్రత్యయ రూపమును సాధించుటకు సంస్కృతశబ్దముల ప్రాతిపదికములను మాత్రమె గ్రహించి యాంధ్రరూపముల ప్రక్రియ యందు సాధింపఁ బడెనని తెలియదా?

| | |
|---|---|
| కోడుగంటివారి వీథి<br>విజయనగరము,<br>1—6—1959 | ఇట్లు సుజన విధేయుఁడు,<br>వఝుల చినసీతారామస్వామి శాస్త్రి,<br>గ్రంథకర్త |

# విషయసూచిక

## సంజ్ఞా పరిచ్ఛేదము


1. సంస్కృత కావ్యభాషా వర్ణమాల. 'ఱ' సంస్కృతమునను గలదు.
3. కావ్యసంస్కృతమునఁ బ్లుతాక్షరములు లేవు-ఌకార దీర్ఘము సంస్కృతమునఁ గలదు.
5. గురులఘ్వాది సంజ్ఞలు.
7. ప్రాకృత మనఁగా మహారాష్ట్రిభాష వర్ణ సమామ్నాయము.
8. అచ్చ తెలుఁగువర్ణలు-ప్రాకృతమున దంత్య చ జలు లేవు.
9. 'ఱ-ఴ' వివరణము - ఱ కారము ప్రాచీనాంధ్రమునఁ గలదు.
10. అన్యదేశ్యమును వీడరాదు. అర్ధానుస్వారము.
12. తెల్గున వర్గపంచమాదేశము లేదు-అందులకుఁ బ్రమాణములు.
15. ద్రుతప్రకృతిక శబ్దములు. నకారమె నన్నయ మతమున ద్రుతము.
18. ద్రుతోపజీవి శబ్దములు-కళాశబ్దముల వివరణము.
19. సిద్ధ సాధ్యానుస్వారములు-ఖండ పూర్ణములు.
24. అంతస్థముల లఘ్వలఘుతలు-లకార మలఘువు.
28. తద్భవములు-సంస్కృతభవముల స్వరూపము.
30. బసవకవి ప్రయోగించిన వింత తద్భవములు.
33. అనింద్యగ్రామ్యము-కపిలకన్నులు మొదలయినవి నింద్యగ్రామ్యములు. వాని సాధురూపములు కవిలకన్నులు మొదలగునవి.


## సంధి


35. పరరూపసంధి. ద్రుతమగు 'ను' అనుదాని 'ఉ' కారపు సంధి.
36. ద్రుతలోపపూర్వ కోకారసంధి.
37. సంహితా 'య' కారము-అరుదగు సంహితా 'వ' కారము.
38. అకారసంధి బహుళము.

39. అకారసంధి లేని చోటులు-దాని నిత్యసంధి స్థలములు.
40-41. ఇకార సంధి - దాని వైకల్పిక స్థలములు - ఇకారసంధిలేని చోటులు.
42. క్త్వార్థక సంధి-ఇంకాది శబ్దముల ద్రుతలోపపూర్వక సంధి.
43. ద్రుతప్రకృతిక సంధి-ఆమ్రేడిత స్వర సంధి.
44. ప్రత్యయాచ్పరక సంధి-కుఱు శబ్దాదుల సంధి.
45. గ స డ ద వాదేశ సంధి.
47. ద్రుతమునీఁది సరళాదేశము-గ జ డ ద బాదేశసంధి.
49-50. సరళ స్థిర పరక ద్రుత సంధి-మకార పరక ద్రుతసంధి.
51. అవసాన ద్రుతలోప సంధి.
52-53. ద్రుతమునీఁది ద్రుతము-ద్రుత ద్విత్వ సంధి.
54. పదాది స్వరపరక ద్రుతలోపాభావము.
55. సామాసిక ద్రుతలోప ద్రుతాగమములు.
56. సామాసిక ద్రుతాగమ విశేషములు.
57. సామాసిక ద్రుతాగమ స్వత్వ సంశ్లేష నిషేధములు.
58-59. టుగాగమ సంధి-దాని విశేషములు.
60-61. రుగాగమ సంధి-పు-ంపుల విధానము.
62. తద్ధర్మవిశేష ణోకారమునకు నుగాగమము.
63. షష్ఠీసమాసపు 'నుక్కు'-ఉదంత స్త్రీసమాది 'ను'గాగమము.
64-66. ప్రాంతాదుల సంధి-దాని యుదాహృతులు.
67. ఆమ్రేడితములగు కడాదుల సంధి.
68. నిందా ద్యామ్రేడిత సంధి.
69. చేతాది విభక్త్యంత లోప సంధులు.
71. 'అది-అవి' అనువాని 'అ'కార లోపము.
72. ది-వి-విభక్తులు-పద్యాదిశబ్ద పరక సంధి.
73. ప్రార్థనా ద్యర్థక 'ము' విభక్తి లోపము.
74. ఆమ్రేడిత మధ్యమపురుష 'ము' విభక్తి లోపము.

75-76. సంస్కృతానుకరణ సంధి-అనుకరణ ద్విత్వము.

77. ధ్వన్యనుకరణ సంధి-ఇందలి ముగాగమము.

78-79. వాక్యాంత సంధి పాక్షికత - వాక్యాంత పాదాంత సంధ్యభావము.

తత్సమ పరిచ్ఛేదము. అజంతములు.

80. సంస్కృత విభక్తులు-సుబంతశబ్దములు.

81. నామ విభక్త్యంతోదాహరణము-ణత్వ-షత్వ విధులు.

82-88. సంస్కృత విభక్త్యంత నామ రూపములు - ఆయాశబ్దముల యుదాహృతి.

89-95. సంస్కృత సర్వనామ శబ్దముల విభక్త్యంత రూపములు.

96-97. సంస్కృత విభక్త్యాదేశములగు తెలుఁగు విభక్తులు.

98. నామ విభక్తుల విభాగము - 'ను'గాగమాదులు.

99. సంబోధన ప్రథమా విభక్తి రూప సాధనము.

100-101. మహ దమహత్తులు - సంస్కృత పారిభాషిక లింగము.

102. విశేషణముల లింగము - మిత్రాది శబ్దముల లింగము.

103. మహ దమహ ద్వివక్షాది సిద్ధ లింగములు.

104. ఇద్వర్ణ లక్షణము - 'డు'మంతముల స్వరూపము.

105-106 డుమంత శబ్ద రూపముల సాధనము - నిగాగమము.

106-108. కు 'ను' వు క్రియా విభక్తుల 'ఇ'కారాదేశ తదభావములు.

109. నగాగమ-నుగాగమముల వివరణము. బహుత్వ లడాగమము.

110-111. సంబోధన ప్రథమా విభక్తి రూపసాధనము-ప్లుత మనఁగా దీర్ఘమె తెలుఁగున.

112. 'బాలురు' మున్నగు బహువచన రేఫాదేశ విధులు.

113. అమహ న్నపుంసక శబ్దరూప సాధనము-'ఘు'వర్ణక 'ము'గాగమములు.

114-115. 'ంబు - మ్ము'ల విధులు. మువర్ణక లోప పూర్వ కాకార దీర్ఘము.

116-117. ఇగ్లారా సూత్రము – ఇకారాంత శబ్దములు. ఉపోత్త మేకారాంతములు.

118-119. వువర్ణక వుగాగ మాంతముల 'ఉ'కారాంతముల రూప సాధనము.

120-121 కద్రువ. 'ఋ'కారాంత రూప సాధనము. సంస్కృత ప్రాతి పదికముల తుది దీర్ఘము హ్రస్వ మగుట. హ్రస్వాభావము.

123. 'డు'జ్వర్ణకలోపము – స్త్రీలింగ ప్రథమైకవచన లోపము.

124. 'ము' విభక్తి లోప తదభావములు. 'ల్యుట్ – యుచ్' ప్రత్య యములు.

125. ధర్మాది శబ్దముల 'ము' వర్ణకమునకు వైకల్పిక 'వు' వర్ణ కాదేశము.

126. 'సురలు-అసుర-దూత-భువి-' మున్నగు శబ్దములు.

127. "నావ-రై-రో-గ్లా-గ్లో" శబ్దములు.

128. కంధరాది శబ్దములు-ద్విత్రి ప్రభృతులు. తెల్గు విభక్తులతో నుండని శబ్దములు.

— హ ల ం త ము లు —

129-130. ప్రథమైకవచ నాంత తుల్య ప్రాతిపదికములు.

131. ద్వితీయైకవచ నాంత తుల్య ప్రాతిపదికములు.

132. ఉభయ విభక్త్యంత ప్రాతిపదికములు.

133. ప్రథమైకవచ నాంత తుల్య ప్రాతిపదికముల విశేషములు.

134. హలంత శబ్ద రూప సాధన ప్రక్రియ.

135. కొన్ని హలంత శబ్దముల విశేషములు.

136. కొన్ని నకారాంతముల స్త్రీలింగ సమ రూపములు.

137. రాజ శబ్ద రూప సాధన ప్రక్రియ.

138. జగ దిందప్రిజి చ్ఛబ్దముల రూపసాధన విశేషములు.
139. సకారాంత శబ్దముల రూపసాధనము - దీని ద్వైవిధ్యము.
142. స్వస్వ నియత స్త్రీప్రత్యయ యుత రూపములు.
143. స్వసాదులకు 'ఈ' ప్రత్యయము రాదు.
143. నకారాంతములు. ఋకారాంతములు 'ఉ-ఋ' వర్ణేత్తులు. వీని 'ఈ' ప్రత్యయము.
144. స్వాంగ వాచకముల "ఈ" ప్రత్యయము. అంగాదులకు వైకల్పికమగు 'ఈ' ప్రత్యయము.
145. అకారాంతములకు, 'అజా'దులకు, 'టాప్' ప్రత్యయము.
145. కొన్ని హలంతములకు 'టాప్' ప్రత్యయము.
145. 'అన్' ప్రత్యయాంతముల "ఈ" ప్రత్యయము.
145, ఉకారాంతముల వైకల్పికమగు "ఈ" ప్రత్యయము.
146. ఇకారాంతముల "ఈ" ప్రత్యయము. భార్యార్థక స్త్రీ ప్రత్యయము.
146. 'ష్-ట్' అనునవి యిద్వర్ణముగాఁ గలవానికిని, 'గౌరాదులకును' 'ఈ' ప్రత్యయము. అకారాంత జాతివాచకముల 'ఈ' ప్రత్యయము.
147. ఉకారాంత గుణవాచకములకు స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము.
147. యకారోపధేతర 'ఉ'కారాంత మనుష్యవాచకముల 'ఊ' ప్రత్యయము. రజ్జ్వాది భిన్నోకారాంతాప్రాణి వాచకముల 'ఊ' ప్రత్యయము.
147. మహతీతర స్త్రీలింగ, స్త్రీలింగ విశేషణముల, క్లీబత్వము.
147. భవ చ్ఛత్రాదులకుఁ దెలుఁగు విభక్తి యోగము లేదు.

— ఆచ్ఛిక పరిచ్ఛేదము —

149. ఆచ్ఛిక శబ్దముల స్త్రీ నపుంసక సమ రూపములు. పుంలింగ సమము లరుదు.

150. ఆచ్ఛికములకుఁ బారిభాషిక లింగము లేదు. బల్లిదాదులు.
151. మహాత్ములగు మగాదులకు నేకార్థకాదులకును 'డు' జ్ఞగు-
ఉత్వము రాదు.
152. 'ఱ-ర'లు 'ండ్రు' అనునదియు వచ్చుట.
154. 'ఱేఁడు'శబ్దము 'కూఁతు'శబ్దము రూపములు.
155. పగఱు-చూపఱు శబ్దముల రూపములు.
156. ఆల్వాదిశబ్ద రూపములు-'ళ్లు' తప్పు 'ల్లు' ఒప్పు.
157. డ ల ట ర ల 'ఉ'త్వ లోపము.
158-159. 'ౘ్రాళులు' మున్నగునవి యపశబ్దములు. ఊళ్లు=ఊల్లు.
160-161. లాదేశము. ఎడ్లు-వడ్లు-అరసున్న నిండుసున్న యగుట.
162. 'లి' వర్ణ సల 'లు' వర్ణాంత శబ్ద రూపములు.
163. బహువచనముమీఁది బహువచనము.
164-165. కలన్వాదుల బహువచన రూపములు-చేను ప్రభృతుల
రూపములు.
166-167. 'యి' వర్ణాంతముల రూపములు-ఆవు ప్రభృతుల యంత్య
లోపము
168. ఇయాంత శబ్ద రూపములు-'ఎ-ఏ' శబ్దముల 'ఇయ' రూపము.
169. 'ను-లు-రు' వర్ణముల పదాంతముల 'ఉ' కార లోపము.
170. అక్కటాదుల జడ్డ లోపము-అచ్చరశత్వమున నిది లేదు.
171-172. పదాది హల్లోపము-పదమధ్య 'ఉ' కార లోపము. ప్రత్య
యస్వర లోపము.
173. నల్లేరు=నల్లెరు. ఉయ్యెల-పయ్యెద-తాయెతు శబ్దములు.
175. ఓయూరాదులు-ఏతాదులు.
176. అడంగ్వాదుల 'డా'కు ణకారము-దక్కు=డక్కు. జూదము=
జూజము.
177. నిత్యైకవచనాంతములు-నిత్యబహువచనాంతములు.

178–179. పూజ్యతా బహుత్వము – అజ్ఞాతాది బహుత్వము–అన్ని ప్రభృతులు.

180–181. సర్వనామసంజ్ఞ ప్రాచీనపు తెల్గున లేదు–అన్ని ప్రభృతుల రూపములు.

182–184. ఆధునికులు సర్వనామసంజ్ఞ నంగీకరింతురు. అందత్వాది శబ్దములు. అందఱు–ఇందఱు–కొందఱు–'పెక్కు–పలు' మొ.

185–186. తచ్ఛబ్దరూపములు–(ఆ)వాఁడు–అది–ఆమె–అంత. మొ.

187–188. 'ఈ' శబ్దపురూపములు–వీఁడు–ఇతఁడు–ఈమె–ఇది–మొ.

189–190. యత్కిమర్థక శబ్దరూపములు–ఎవఁడు–ఎవతె–ఏది–మొ.

191. 'అతఁడు' మున్నగువానికిఁ బూజ్యార్థకతా నియమము లేదు.

192. యుష్మ దస్మ దుభయార్థక శబ్దముల రూపములు.

193–194. తాశబ్ద రూపములు–తనతన–తమతమ శబ్దములు.

195. ఏకార్థకశబ్ద రూపములు–ఒకఁడు–ఒకటి–ఒకతె–మొ.

ద్విప్రభృతి సంఖ్యావాచకముల మహ దమహ ద్రూపములు.

197. ఇరువురు మొదలగు విశేష రూపములు ; ఇరువురు శబ్దములోఁ 'వ' మొదటిరూపము. 'ఇరుగురు' అనుదానిలోని 'గు' అర్వాచీన రూపములు.

198–199. సంఖ్యావాచి శబ్దరూప విశేషములు.

200. 'అవ'ప్రత్యయము 'అవు' అనుదాని తద్ధర్మార్థక విశేషణము కాదు.

201. అన్నిప్రభృతుల మహతుల బహుత్వమున మహత్తుల్యములు.

ఔ ప వి భ క్తి క ము లు

202. 'ఇ–టి–౦టి–తి–ఇతి–అటి ప్రభృతు లౌపవిభక్తికములు.

203. 'ఆలిన్–కూఁతురిన్–గోతులు' అనునవి యౌపవిభక్తికాంతములు కావు.

204. ఊర్వ్యాదుల 'అ' త్వము సప్తమ్యర్థక మాత్రమె.

205. 'టి' అను నౌపవిభక్తిక శబ్దరూప విశేషములు.
206. మాపు-గోయి ప్రభృతిశబ్దముల యౌపవిభక్తిక రూపములు.
207. ఔపవిభక్తికముల తృతీయాసప్తముల 'అ' త్వము.

## కారక పరిచ్ఛేదము

208-209. ప్రాతిపదికార్థ ప్రథమ. ఉక్తార్థ ప్రథమ.
210. అనుక్త కర్మంబున ద్వితీయా విభక్తి యగును.
211. కర్మప్రవచనీయ ద్వితీయా విభక్తి.
212. అప్రేరణకర్తకుఁ గర్మాది ద్వితీయాదులు.
213-214. 'చేత' వర్ణకము కర్తృవాచి కగు. 'చేత-తోడ'లు 'చేసి' అనుప్రయోగము.
215. 'చేసి' అనుప్రయోగము. తుల్యార్థక యోగము.
216-217. వచ్యర్థాముఖ్య కర్మము. నియమ పూర్వక విద్యా స్వీకారమున 'తో' వర్ణకము. తవ్యాది యోగమునఁ దృతీయ.
217-218. సంప్రదానాదులందుఁ జతుర్థి. కుశలాది శబ్దయోగమునఁ జతుర్థి. అపాదానాదులందు 'వలన' వర్ణకము.
220-221. 'ఉండి-ఉంచి' శబ్దానుప్రయోగము.
222. తొట్టి ప్రభృతి శబ్దముల యోగమున విభక్తులు.
223. 'కంటె-పట్టి' ప్రత్యయములు.
224-225. 'యొక్క-ది, వి' ప్రత్యయములు. 'యొక్క'కు లోపము.
226. 'ది-వి-దు-' ప్రత్యయములు వ్యస్తములు.
227. ప్రథమయందు షష్ఠి. నిర్ధారణ షష్ఠీ సప్తములు.
228. అధికరణ త్రైవిధ్యము. నిమిత్త సప్తమి.
229. సప్తమీ విశేషములు. ఒక విభక్తికి మఱియొక విభక్తి.
230. విభక్తి విపరిణామము తెలుఁగున లేదు.
231 తృతీయా సప్తమ్యర్థక ద్వితీయ.
232-233. ద్వితీయార్థక ప్రథమ. కాలాధ్వవాచక ప్రథమ.

234-235. విశేషణ-విశేష్య విభక్తులు.

236. భ్వాద్యర్థ వ్యవధానమున విశేషణము ప్రథమాంత మగుట.

237-238. సిద్ధార్థానువాద విభక్తుల సూరి విధానములు. పునరుక్త సూరి విధులు.

239. యుష్మ దస్మ ద్విశేషణ రూపములు.

240-241. అన్య యుష్మ దస్మ త్కర్తృక క్రియలు. వాక్యగత పదముల వరుస.

— సమాస పరిచ్ఛేదము - సిద్ధ సమాసములు —

241. ఏకార్థీభావ సామర్థ్యము. వ్యపేక్షా సామర్థ్యము.

242. వృత్తులైదు. కృత్తద్ధిత సమాసైకశేష సనాద్యంత ధాతు రూపములు.

243-244. అలౌకిక విగ్రహము. ప్రాదులు-ఏకదేశాన్వయము. సమాస మైచ్ఛికము.

245. సమాస మధ్య పదాంతర వ్యవధానము - అలుక్సమాసములు.

246-247. పూర్వనిపాత శాస్త్రము. సిద్ధ సమాసము లాఱువిధములు. అవ్యయీభావ సమాసము.

248-249. తత్పురుషము. దాని విశేషములు. అలుక్సమాసములు.

250-251. కర్మధారయ లక్షణము. పుంవద్భావము.

252. ఉత్తరపదలోపి సమాసములు-ఉపమాన సమాసములు.

253. ఉపమిత రూపక సమాసములు-ద్విగు త్రైవిధ్యము.

254 ద్విగువు-దానిలోని ఙీ ప్రత్యయము.

255. ద్వంద్వసమాసము.'చ'శబ్దార్థములు. ఇతరేతర యోగ ద్వంద్వము.

256-257. ద్వంద్వమందలి విశేషములు-సమాహార ద్వంద్వము.

258-259. ద్వంద్వ విశేషములు. సమానాధికరణ వ్యధికరణ బహువ్రీహులు.

260-261. పుంవద్భావము - అన్యపదార్థ ప్రాధాన్యము లేని బహువ్రీహులు.

261-262 బహువ్రీహి సమాసాంత ప్రత్యయములు.

264-265. సమాసాశ్రయవిధులు.

266-267. సంస్కృతసంధులు-గుణసంధి-వృద్ధిసంధి.

268. యణాదేశసంధి-అయాద్యాదేశ సంధి.

269. హల్సంధులు. 'ర్-స్-చవర్గ-శ్-ష్-హ్' అనువాని సంధులు.

270. శ్వాస నాద సంధులు-శ్చుత్వ-ష్టుత్వ-సంధులు.

271. దకార తకార సంధులు-న మ పరకసంధి.

272-273. ఛకార వర్గచతుర్థాదేశములు-'ఛ' ద్విత్వము. 'ఙమ్' ద్విత్వము-అనుస్వార సంధులు.

274-275. విసర్గ సంధులు-రేఫ సంధి.

— సాధ్య సమాసములు —

276-277. సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర సమాస త్రైవిధ్యము.

278. సమాసకము-జ్ఞాపకసిద్ధ సమాసములు.

279-280. షష్ఠి ద్వితీయా తుల్యముగ నిల్చును. అది షష్ఠ్యలుక్సమాసము.

281. ఉపమానవాచక సమాసములు.

282. 'పోలెన్-బలెన్-పోని' శబ్దములు. 'వజ్-ప' వర్ణకములు.

283. నామ్న్యాది కనుమ్న్యాదులు-సమానాధికరణ సాధ్య సమాసములు.

284. బిరుదోత్తరపదక సమాసములు.

285. ద్విత్వ పరక దీర్ఘము హ్రస్వ మగును-త్రికసమాసములు.

286. చోటు శబ్దపు 'అత్వ-హ్రస్వ-టాక్షర'లోపములు.

287. 'అయి-ఆయి' అనునవి వచ్చుట.

288. నల్లాదుల 'ని' గాగమము.

289. పదాంతర వ్యవధాపిత సమాసములు-కర్మధారయాభాసము.

290-291. తచ్ఛబ్ద (వాఁడు) వకారాది లోపము.

292-293. అలరుఁబోఁడి రూప సాధనము - మిశ్రాచ్ఛిక సమాహార ద్విగువులు.

294 ఆచ్ఛికబహువ్రీహి-మిశ్రబహువ్రీహి.

295. 'కటకటంటా' బహువ్రీహి సమాసాంతములు.

296-297. ద్వంద్వ సమాసము-దానివిశేషములు.

298 క్త్వార్థశబ్దము కాదు. త్వార్థశబ్దము-నిక్క-లాదులు.

— తద్ధిత పరిచ్ఛేదము —

299-300. తద్ధిత ప్రత్యయ ద్వైవిధ్యము-తద్ధితముల విశేషములు.

— ఆచ్ఛిక తద్ధితములు —

301-302. ఆచ్ఛిక తద్ధిత భావార్థకములు.

303-306. స్వార్థికములు-మత్వర్థీయములు.

307-310-311. పరిమాణార్థకాదులు.

312. అర్థవిశేష బోధకములు.

— సంస్కృత తద్ధితములు —

313. అపత్యార్థకములు-గోత్రాపత్య యువాపత్యములు.

314. ఆద్యచ్చుల వృద్ధి-మొ.

315. తద్ధితాజ్ యకార పరక విధులు.

316. బాహ్వాద్యదంతముల 'ణి' ప్రత్యయము. "అత్ర్యాబాదుల ణేయ" ప్రత్యయము.

317. గర్గాదులయు నడాదులయు 'ణ్య-ణాయన' ప్రత్యయములు.

318. ణత్వ విధి-పితృష్వస్రాదుల 'ణీయ' రేవత్యాదుల 'ణిక' శివాదుల 'ణ' ప్రత్యయములు.

319. 'య-వ'ల చోట 'ఇ-ఉ' వచ్చు విధులు,

320. ఙక్-ఇనేయాది ప్రత్యయములు.

321. బహుత్వమున నపత్య ప్రత్యయము లోపించుట.

322. వివిధార్థక వివిధ తద్ధిత ప్రత్యయములు.

323-324. కర్తృ కర్మాది వివిధకారకములందు వచ్చు ప్రత్యయముల యుదాహృతులు.

325. తద్ధిత పరకత్వమున యకార లోపాదికము.
326-328. వికార-సంఘ-భావేదం హిత స్వార్థాది ప్రత్యయములు.
329. వివిధార్థక తద్ధిత ప్రత్యయములు.
330. భావార్థక తద్ధిత ప్రత్యయములు.
331. షత్వవిధి-కల్పాది ప్రత్యయములు.
332-334. మత్వర్థీయములు.
335-336. సమూహార్థకములు-పూరణార్థకములు.
337. ధాచ్-ధాచ్ ప్రత్యయములు-సంఖ్యా సర్వనామ తద్ధితములు.
338-339. తయట్-తర-తమ-ప్రత్యయములు.
340-341. ఇమన్-చరట్-మొ. ప్రత్యయములు-వారార్థకములు.
342-343. చుంచు-చణాది ప్రత్యయములు-చ్వి ప్రత్యయము.
344. సార్వనామిక తద్ధిత ప్రత్యయములు.

— క్రియా పరిచ్ఛేదము - సంస్కృత విషయములు —

345. సంస్కృత క్రియల వివరణము.
346-347-348. సార్వధాతు కార్ధధాతుకాది సంజ్ఞలు - లడాది సిద్ధ రూపోదాహృతులు.
349-350. భ్వాది దశగణి.
351-353. ప్రేరణ-సన్నంత-యజంత-యఙ్లుగంతాదులు.
354-355. నామధాతువులు - కర్మార్థకాదులు.

— త త్స మ క్రి య లు —

356-359. ధాతురూప నిర్మాణము. తత్సమ ధాతు స్వరూప స్వభావములు. మొ-
360-361. వర్తమాన-భూత-భావి-తద్ధర్మాదులు.
362. కేతనాదుల ప్రమాదము - ఆశీరాదులు.
363. పురుష బోధక ప్రత్యయములు.
364. ఉన్నానుబంధము - 'చు' శబ్దము.

365-367. నన్నయ కాలిక వర్తమాన రూపములు - తిక్కన కాలిక వర్తమాన రూపములు - నన్నయ తిక్కనాది కాలముల భూత కాలిక రూపములు.

368-369. భవిష్యద్రూపములు - కలుగు ధాతు రూపములు.

370. లాట్రూపములు=తద్ధర్మాది రూపములు 'వు' లోపము.

371 లిఙ్లోట్టుల ప్రథమ పురుష రూపములు.

372. లూడ్రూపములు - ఆశీ శ్శాపా ద్యర్థకములు.

373. ముఙ్రూపములు - ఉభయ కర్తృక ప్రార్థనా ద్యర్థకము.

374 ముపర్ణక ద్వైవిధ్యము - చూతండు-మొ. రూపములు.

375-376. వ్యతిరేక రూపములు ప్రార్థనార్థకము లగుట.

377 చూనె-చుప్పో-చూరె-మొ. రార-రా-మొ. మఱికొన్ని జంటలు.

378-381. మఱికొన్ని జంటశబ్దములు. 'ట' మొదలగు భావార్థకములు. వ్యతిరేక భావార్థకములు.

382-384. క్త్వార్థకము.

385. తుమర్థ భావ లక్షణములు.

386. వ్యతిరేక సంక్షేప వాక్యములు - చేదర్థకము.

387. చేదర్థకము.

388. శత్రర్థకము. దీని విషయమున సంస్కృతాంధ్రభేదములు - తద్ధర్మార్థక క్రియా విశేషణము.

389-390. "ఉన్న-కలజీ-న" వర్ణకములు.

391. కర్తృకర్మా ద్యర్థముల వచ్చు 'ల'కారాదులు.

392-393. ఇయుడాగమము.

394. ఇడ్వాదుల 'న' వర్ణకమున కత్వము.

395. కొను ధాతు పరకత్వమందలి 'ఇ'త్వము.

396. 'కొన్-కొ-కు-క' అనునవి యుపేక్ష్యములు.

397. యకారము సకార మగు చోటులు.

398. అన్వాదులయొక్కయు 'ఉండు' ధాతువుయొక్కయు విశేషములు.
399. 'తి–దు–ట' పరకత్వమందలి 'అ'న్వాదుల రూపములు.
400. 'ఉండు' ధాతువు "డు"లోపము విషయము.
401. 'ముజ్' పరక 'కాను' ధాతు రూపములు.
402. ప్రేరణమునందలి 'ఇంచు'గాగమము.
403. ప్రేరణేంచుగాగమము. రంజాదుల 'ఇల్లు'–'ఇలు' అను వాని వివరణము.
404 రంజాదుల ప్రేరణ రూపములు. 'ఇల్లు' అనునది 'ఇంచు'చో వాడుక.
405. ఇంచుగర్థక 'చు'గాగమము.
406. స్వార్థిక 'చు'కుక – ప్రేరణార్థక 'పు'కుక,
407. ఇంచుగర్థక 'చుక్' 'పు'గాగమములు.
408. ఇంచుగర్థక 'చుక్–పు'గాగమ పర కాగ మాదేశ లోపములు.
410. అన్వాదుల 'పు'గాగమము. అడ్డాదుల 'గ్వా'గమము.
411. 'చిత్తగ' మున్నగు శబ్దములు. 'ఆ డోడు'ల ప్రేరణార్థక రూపములు.
412. చెఱుచు–చెర్చు–పఱుచు–మొ. రూపములు.
413. ప్రేరణేంచుక్కమీఁద మరలఁ బ్రేరణేంచుకు నిల్వదు.
414. ఉత్వమధ్య ధాతు విత్వమధ్య మగుట. ప్రేరణేంచుక్ పరక 'చ'కారము 'ప'కార మగును.
415. ముత్పరక చకారము 'ప–వ' లగుట.
416. 'ఇవ్వన్' 'ఒలువన్' మొదలగునవి వ్యావహారిక రూపములు.
4.7. "పుచున్" కవిత్రయేతరులు ప్రయోగించిరి. "చుదు" అనునది "తు" అగును.
418. పూర్ణబిందువుమీఁద "చుదు" అనునది "పుదు" అగును.
419 ముత్పరక విధులు. చొరితప్పు. 'ఇవ్వక' వాడుకపదము. "ఈవుతన్" నిరాధారము.

420. "అగు" మున్నగువానికి జీత్వరక విధులు.
421. "నేరుచు" ధాతువు రూపములు. పోవు ధాతువు విశేష రూపములు.
422. "అగు-పోవు" ధాతువుల కడవ్రాల లోపము.
423 "పిలుచు" మొదలగువాని 'చు'లోపము. ముత్వరికత లేకున్నను 'కా'దేశాదులు వచ్చుట.
424. అయి=ఐ; అవు=ఔ.
425. 'కలుగు' ధాతువునకు 'కలా' దేశము. కలుగు ధాతు రూపములు.
427. వ్యతిరేకమున 'కలుగు' ధాతువునకు 'లే' అను నాదేశము.
428. 'వలచు' ధాతువు వ్యతిరేక రూపములు.
429. ఘటక క్రియలు.
430. 'తెంచు' ధాత్వనుప్రయోగము.
432. 'శాన్-కన్' అనువాని ప్రయోగము.
434. శబ్దపల్లవములు.
435. శబ్దపల్లవములు-ఆత్మాద్యభిధానము.
436. యుష్మదస్మద్భిన్న కర్తృకత్వమునందలి వాడుకలు.
437. వివిధవాక్యములు.

— ఆచ్ఛిక కృత్పరిచ్ఛేదము —

438. ధాతువు తుదినున్న 'కా'దుల లోపము.
439. 'క' అను కృత్ప్రత్యయము.
440. 'ఇమి-తజ్' అను ప్రత్యయములు.
441. 'కువ-ట' ప్రత్యయములు.
442. 'ట-టు-వ' ప్రత్యయములు.
443. 'త-పు' ప్రత్యయములు.
444 'పు-ఇక' అను ప్రత్యయములు.
445. 'ఇక-న' ప్రత్యయములు.
445. 'బడి-గడ' ప్రత్యయములు.

447. 'ఇకి-దు-అ'-ప్రత్యయములు.
448. 'అ-అక-డు' అను కృత్ప్రత్యయములు.
449. 'డు-డు' అను కృత్ప్రత్యయములు.
450. 'వడి-ఇ' మున్నగు కృత్ప్రత్యయములు.
451. 'ఇడి-ఎన-పుర' అను కృత్ప్రత్యయములు.
452. 'మతి-వు-వలి-ఇరి-వ-దల-కడ' అను కృత్ప్రత్యయములు.

— సంస్కృత కృత్పరిచ్ఛేదము —

453. సంస్కృత కృత్తుల వివరణము.
454. 'తవ్య-అనీయ-య' ప్రత్యయములు.
455. 'భావ' శబ్దవివరణము-ఇమా(డా)గమము.
456. తవ్యాదులు-ఇడాగమ-తదభావములు.
457. తవ్యాదులు-'తృన్' 'ణక' ప్రత్యయములు.
458. 'ణిన్-అన-అన్' ప్రత్యయాదులు.
459. 'అన' ప్రత్యయోదాహృతి-పచాద్యుదాహృతి.
460. 'అన-అన్=అ' ప్రత్యయోదాహృతి.
461. 'ణక'-ఆశీరాద్యర్థక ప్రత్యయములు-'అ-ఇ' ప్రత్యయములు.
462. మకారాగమ ప్రత్యయములు.
463. క్విబాదులు-వీనిలో నన్నియు నిద్వర్ణములె.
464. 'త్ర' మొదలగు కృత్ప్రత్యయములు.
465. 'త్ర' మొదలగు ప్రత్యయముల యుదాహృతులు.
466. 'క్త-క్తవతు' ప్రత్యయములు.
467. ధాతువు తుది యనునాసిక లోపము. 'క్త' ప్రత్యయ నకారా
దేశము.
468. 'క్త' ప్రత్యయాంత నిపాతములు.
469. భావ-కర్మ-కర్త్రర్థక 'క్త' ప్రత్యయములు.
470. అధికరణార్థక-వర్తమానార్థక 'క్త' ప్రత్యయములు.

471. 'శతృ-శాన' ప్రత్యయములు.
472. శతృ ప్రత్యయాదేశములు-('క్వసు' చానశ్).
473. భవిష్యదర్థక-స్యతృ-స్యమాన ప్రత్యయములు.
474. ణ్యంతాదులపైని "ఇష్ణు-ష్ణు-స్ను" మున్నగు ప్రత్యయములు.
475. 'ఆలు' మొదలగు ప్రత్యయముల యుదాహృతి.
476. "ఘఞ్-అల్-అనట్' ప్రత్యయములు.
477. ఘఞాద్యుదాహృతి - సన్నంతముల పైని 'ఉ' ప్రత్యయము వచ్చుట-అకార యకార లోపము.
478. ఇస్ వచ్చుట - అభ్యాస లోపము-సంయోగాది 'స' లోపము. 'ఉ' ప్రత్యయోదాహృతి. 'ఊక-ఇ ప్రత్యయములు 'యఙ్' లు గుదాహృతి.
479. యఙ్ లుక్కులపైని 'ఊక' ప్రత్యయాదులు, త్రిమగాది ప్రత్యయములు.
480. 'ణిన-అథు-నఙ్' మొదలగు ప్రత్యయములు.
481. 'క్తి' 'అ-అన' ప్రత్యయములు-వాని యుదాహృతులు.
482. 'యుచ్-అన' ప్రత్యయము-'తుమ్'ప్రత్యయము.
483. 'క్త్వా' ప్రత్యయము- 'ల్యప్' అనుదాని యాదేశము.
484. 'ణమ్' ప్రత్యయము-ద్విరుక్తి.



# ఉదాహృతగ్రంథముల సంకేతములు

---x---

| | |
|---|---|
| వ్యా-సం. | ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము. |
| ద్రా-పరి. | ద్రావిడభాషా పరిశీలనము. |
| వై-పా. | ఆంధ్ర వైయాకరణ పారిజాతము. |
| చిం-పరి. | ఆంధ్ర శబ్ద చింతామణి విషయ పరిశోధనము. |
| బా-వ్యా. | బాల వ్యాకరణము. |
| ప్రౌ-వ్యా. | ప్రౌఢ వ్యాకరణము. |
| అహో. | అహోబల పండితీయము. |
| కవిశిరో. | కవి శిరోభూషణము. |
| ఆం-చిం. | ఆంధ్ర శబ్ద చింతామణి. |
| కావ్యాలం. | కావ్యాలంకార చూడామణి. |
| వికృతి. | వికృతి వివేకము. |
| నరస. | నరస భూపాలీయము. |
| ఆం- (ఆది-సభా-మొ.) | కవిత్రయాంధ్రీకృతభారతము-ఆదిపర్వము-సభా-అరణ్యా-విరా-ఉద్యో-భీష్మ- ద్రోణ- కర్ణ- శల్య-సౌప్తి- స్త్రీ- శాంతి- ఆను- అశ్వ- ఆశ్ర- మౌస-మహా-స్వర్గా. |
| ఉ-హరి. | ఉత్తర హరివంశము-నాచన సోమనాథ కృతి. |
| బసవ. | బసవపురాణము-పాల్కురికి సోమనారాధ్య కృతము. |
| నైష-(కాశీ మొ.) | శ్రీనాథకృతులు- శృంగార నైషధము- కాశీ ఖండము- మొ. |
| మనుచ. | మను చరిత్రము-స్వారోచిష మను సంభవము. |
| వానివాని సంజ్ఞలు. | వివిధ ప్రబంధములు. |
| ముగ్ధ. | ముగ్ధబోధ వ్యాకరణము. |

| | |
|---|---|
| కవికల్ప. | కవి కల్పద్రుమము. |
| దుర్గా. | దుర్గాదాస వ్యాఖ్య (ముగ్ధబోధవ్యాకరణము). |
| శ్రీరామ. | శ్రీరామ తర్క వాగీశ వ్యాఖ్య (ముగ్ధబోధవ్యాకరణము). |
| గిరిశ. | గిరిశ చంద్ర విద్యారత్న వ్యాఖ్య (ముగ్ధబోధ వ్యాకరణము). |
| సి-కౌ. | సిద్ధాంత కౌముది (భట్టోజీ దీక్షిత విరచితము). (బాల మనోరమా వ్యాఖ్యలో నున్నదాని సూత్రసంఖ్య ) |
| బాలమ. | బాల మనోరమా వ్యాఖ్య (సిద్ధాంతకౌముదిది). |
| తత్వ. | తత్వబోధినీ వ్యాఖ్య (సిద్ధాంతకౌముదిది). |
| మహాభా. | వ్యాకరణ మహాభాష్యము(పతంజలి ఋషికృతము) |
| శ-ర. | శబ్ద రత్నాకరము. |
| శబ్దా-చిం. | శబ్దార్థ చింతామణి. |
| శబ్దస్తో. | శబ్దస్తోమ మహానిధి. |
| సూ-రా-ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| లింగా. | లింగాభట్టీయము. |
| సర్వ. | సర్వశబ్ద సంబోధిని. |

# ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 11 | ట | ం |
| 48 | 23 | ... | పుట్నోట్లైను ఉంచవలెను. |
| 85 | 6 | వనాద్వ | వనాద్రం |
| 89 | 11 | సర్వావా | సర్వాసా |
| 90 | 11 | యూనా | యూనా |
| 94 | 13 | దుకా | మకా |
| 106 | 17 | నాత్య | నాతనిన్ |
| 132 | 13 | అనడ్వా | అనడు |
| 135 | 24 | యుండును | యుండును. ఇట్టి యర్వాచీన కవుల ప్రయోగములు వీలైనచో దిద్దుట లెస్స. |
| ,, | 25 | దీనిసత్వ | దీని నిండ్రి |
| 155 | 9 | తృతీయాస | దీనిని దీసివేయవలెను. |
| ,, | ,, | ప్తమ్యేక | తృతీయా సప్తమ్యేక |
| 159 | 9 | పారఅను | అను పార |
| 189 | 23 | ఎవర్తి | ఎవర్తె |
| 250 | 1 | రయల | రయ ద్వ్యగుల |
| 278 | 15 | ౧౧౭౦ పుట) | ౧౧౭౦ పుట) ౩౭౮ పుట. ౭౫ సూ. ఇంధ్రుం జేరును. |
| 310 | 5 | బాల | వాల |
| 311 | 8 | దోయిలి=(వ్యామము) ఇంచుక వంచిన బార మధ్యస్థలము. | వీనిని దీసివేయవలయును. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 330 | 25 | వష్టత్వామ్ | వష్ఠత్వామ్ |
| 335 | 18 | 'వణ' | 'వణ' (చూ-307 పుట.) |
| 362 | 13 | లూట్టును | లూట్టను |
| 388 | 12-13 | యుండును | యు నుండును |
| 389 | 18 | నామా౽ | నామా౽౽ |
| 397 | 20 | చే సమ | చేసమ |
| 411 | 16 | వానినీగగ | వాని నీ గ |
| 441 | 10 | అడ౦ | దీనిని వేఱే పేరాగా నిల్పవలెను. |
| ,, | 22 | లాం | లాం |

3-15 [illegible] [illegible]

[illegible] [illegible]

శ్రీ వాగ్దేవతాయైనమః

# బాలవ్యాకరణోద్ద్యోతము

## సంజ్ఞాపరిచ్ఛేదము

కావ్యసంస్కృతభాషకు వర్ణము లేఁబది. ౧.

(వ్యా-సం-౫-విమ) (బా-సంజ్ఞా. ౧ చూ)

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ" అనునవి (౧౪) యచ్చులు=(స్వరములు-ప్రాణములు). ం-ః. (౨) ఉభయములు. "క-ఖ-గ-ఘ-ఙ, చ-ఛ-జ-ఝ-ఞ, ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ-మ, య-ర-ల-వ, శ-ష-స-హ-ళ" అనునవి (౩౪) హల్లులు=(వ్యంజనములు-ప్రాణులు.) 'అచ్చులు - హల్లులు' అను సంజ్ఞలు మాహేశ్వరసూత్ర ప్రత్యాహారసిద్ధములు. "అ-ఇ-ఉ ణ్. ఋ-ఌ-క్. ఏ-ఓ ఙ్. ఐ-ఔ-చ్. హ-య-వ-ర-ట్. ల ణ్. ఞ-మ-ఙ-ణ-న-మ్. ఝ-భ-ఞ్. ఘ-ఢ-ధ-ష్. జ-బ-గ-డ-ద-శ్. ఖ-ఫ-ఛ-ఠ-థ-చ-ట-త-వ్ క-ప-య్. శ-ష-స-ర్. హ ల్. ఇతి మాహేశ్వరాణి సూత్రాణి."=ఇవి మాహేశ్వర సూత్రములు. వీని తుదిహల్లు 'ఇత్' సంజ్ఞ గలది. అంత్యమగు నిద్వర్ణముతోఁ గూడిన యాదివర్ణము ప్రత్యాహారసంజ్ఞ గలది.

ముగ్ధబోధవ్యాకరణమున (ముగ్ధబోధము పాణినీయానుసారి) నీ ప్రత్యాహారములకు బదులుగా 'సమాహార'ములని వ్యవహరింపఁబడును. అందును అచ్చులనియే వాడఁబడును గాని 'హల్లు' లనుటకు మాఱుగ 'హస్సు' లని వాడఁబడును. అందలి సూత్రములు "అ-ఇ-ఉ-ఋ-ఌ-క. ఏ-ఓ-ఙ. ఐ-ఔ-చ. హ-య-వ-ర-ల. ఞ-ణ-న-ఙ-మ. ఝ-ఢ-ధ-ఘ-భ. జ-డ-ద-గ-బ. ఖ-ఫ-ఛ-ఠ-థ. చ-ట-త-

శ-ష. శ-ష-సా ద్యన్తాఖ్యాః. ఏషాం మధ్యే యేవర్ణా స్తే ఆదివర్ణాన్త వర్ణ 'సమాహారః సంజ్ఞాః స్యుః" (ముగ్ధ-3సూ). పాణినిమునినాఁటికి "ఌ" (ళ) కారోచ్చారణము రాలేదు, దీనిని 'ళ' అని పల్కుట తప్పు. అది (ళ) ద్రావిడవర్ణము.

'ం' అనుస్వారము. 'ః' విసర్గము. 'క-ఖ' లకు ముందటి విసర్గము 'ᳵ'=జిహ్వామూలీయము. 'ప-ఫ' లకు ముందటి విసర్గము 'ᳶ' = ఉపధ్మానీయము. అనుస్వార విసర్గలు లుభయములు' (అచ్చులు-హల్లులు)లనఁబడును. ఇందలి యనుస్వారము నకార జన్యము-విసర్గము సకారజన్యము.

౧ వివరణము:-'ఱ' కారము సంస్కృతమందును ద్రావిడ భాషలందును * గలదు. Pleasure' అను నాంగ్లశబ్దములోని 'sure' అనుదానివంటిదానిలోనిది దీని యుచ్చారణము. 'ఱ' అను నీలిపి ప్రాచీనాంధ్రశాసనములందుఁ గలదు. "ఈఱనము=(ఈళనము)=(స్తుతి), హేఱనము=(హేళనము)=(పరిహాసము)" మున్నగు శబ్దములలోనిది 'ఱ' కారమే. దానిని 'ఌ' (ళ) కారముగాను 'డ' కారముగాను బల్కుట యర్వాచీనము. అలము 'ఌ' (ళ) కారోచ్చారణము "వ్యాళ-గోళా"ది శబ్దములలో నర్వాచీనముగా నేర్పడినది. రెండచ్చుల నడిమి 'డ' కారము నీషత్ స్పృష్టముగా ననఁగా 'ఱ' కారముగా నయితము పల్కుదురు. †

---

* సంస్కృతప్రాకృతములు- పాళీ-హిందుస్థానీ, బెంగాలీ, ఉరుదు మొదలైనవి గౌడభాషలు. అఱవము, కన్నడము, తెలుఁగు, మలయాళము మొ ద్రావిడభాషలు.

† :- 'అజ్మధ్యస్థడకారస్య' ఱ (డ) కారం బహ్వృచా జగుః (సాయనభాష్యము). 'యద్ధ స్తఖడ్గపరిభూత... (ద్వితీయ కులోత్తుంగ చోడదేవుని పొందువ గ్రామశాసనము. ఇండియన్ ఏంటిక్వెరీ ౧౪ నెంబరు).

౨. వివ :_వైదిక సంస్కృతభాషకు వర్ణము లఱువదినాలుగు.(*) అందుఁ బై నుదాహరించిన 'ఌ' కారము, (దుస్స్పృష్ట) ప్లుతాక్షరములును గలవు. కావ్యసంస్కృతమునఁ బ్లుతాక్షరములు లేవు. దూరాహ్వానగానరోదనాదులందు సంస్కృతమునఁ బ్లుతము వాడఁబడును. దానిలిపి '3' అనునది. (*) కావ్యసంస్కృతమున నట్టియెడల సైతము 'ఏక'మాత్రా ద్విమాత్రా రూపములగు (మాత్ర యనఁగా సెకెండులో నయిదవవంతు కాలము) హ్రస్వదీర్ఘస్వరములె వాడఁబడును. సీ-హా మహారాజ, మహామహీరక్షణదక్షదక్షిణబాహుదండ, దండితారాతి, నిషధరాజాగ్రణీ, నన్నిట్లు... విడిచి...... ఆ. వె. ...అఱచుచున్నదాని యాక్రందనధ్వని... (ఆర. ౨ ఆ ౧_౨-౧౧-ప)

3 వివ :_'ౠ' అను దీర్ఘవర్ణమును బాణినీయు లంగీకరింపకున్నను నితర సంస్కృత వ్యాకర్తృ ప్రభృతు లంగీకరించుచున్నారు. మాతృకాపూజలో 'ౠ' కార మావశ్యకము. వాగ్దేవతాకార లేఖనమున నీ వర్ణము గలదు. "ౠం నమో దక్షిణగణ్డే. ౠం నమో వామగణ్డే." (వర్ణోద్ధారతంత్రము, శబ్దకల్పద్రుమకోశము.) "సీ,.. ౠవర్ణద్వంద్వ ముభయదంతచ్ఛదములు..." (అప్పక. ౨-ఆ. ౩౯-3 ప.)

ర వివ :_సంస్కృతమున 'య-వ' లకు లఘ్వల ఘూచ్చారణభేదము ప్రాచీనకాలముననుగలదు. లకారమున కట్టిభేద మర్వాచీనముగఁ గల్గెను. 'వ్యాల-గోల-గరల-సరలా' ది శబ్దములం దలఘులకారోచ్చారణ మర్వాచీనముగఁ బ్రసిద్ధమై యున్నది. వర్ణసమామ్నాయమున లఘ్వలఘువులకుఁ బృథగ్గణనము లేదు. (*) లఘ్వ

---

* :_"త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా వర్ణా శ్శమ్భుమతే మతాః ।
......దుస్స్పృష్టశ్చేతి విజ్ఞేయః ౡకారః ప్లుతఏవచ" (వై. పా. ౨-౨౫ వివ. పాణినిశిక్ష). దుస్స్పృష్టమనఁగా 'ఌ' కారము.

4 (సంజ్ఞా ౧ సూ) లఘ్వలఘు 'య-వ'లు, శ్వాసనాదాది సంజ్ఞలు

లఘువులగు 'య-వ-ర' లను వేఱుగ గణింపని నన్నయ ల'=(ళ) కారమునకుఁ బృథగ్గణనము చేసెననుట విశ్వసింపఁదగినదికాదు. సూరి 'ళ' కారమును సంస్కృతవర్ణసమామ్నాయమునఁ జేర్చుట సరికాదు. అయ్యది ద్రావిడ మూర్ధన్య 'ళ' కారము. 'గయ్యాళి-కూళ-క్రొళ్ళు' మున్నగు శబ్దములలోనిది. దంత్యమగు నలము 'ల' కారమును మూర్ధన్యమగు 'ళ' కారముగఁ బల్కుటయు దాని లిపిలోఁ వ్రాయుటయు సరికావు. బొట్టు 'ల' కారముగ నలములకారమును వ్రాయవలయునని నన్నయ సూత్రించెను. "దన్త్యచజౌ గురు రళౌచ బిన్దుయుతౌ" (వ్యా-సం. ౨౯ II వి) ఇప్డు దన్త్యచజలపై 'ట్ల' అని నిల్పుదురు.

౫ వివ:—'క-ఖ-గ-ఘ-ఙ' అనునవి కవర్గము. ఇట్లె తక్కిన వర్గములను దెలియనగును. వర్గప్రథమ ద్వితీయములును విసర్గమును 'శషసహ' లును శ్వాసములు, తక్కిన యక్షరములు నాదములు. వర్గద్వితీయచతుర్థములును, శ-ష-స-హ, విసర్గములును మహాప్రాణములు. తక్కినవి యల్పప్రాణములు. 'ఙ-ఞ-ణ-న-మ' లును, ననుస్వారమును ననునాసికములు. వర్గాక్షరములెల్ల స్పర్శములు. 'య-ర-ల-వ' లంతస్థములు. శ-'ష-స-హ' లూష్మములు. వకారము దంత్యోష్ఠ్యము. 'ఏ-ఐ-ఓ ఔ' లు సంధ్యచ్చులు. ఐకారోచ్చారణమున 'అ-ఇ' అనునవియును, 'ఔ' కారోచ్చారణమున 'అ ఉ' అనునవియును, విశ్లిష్టావయవములుగా సంధించియుండును. 'ఏ-ఓ'ల

---

* వ్యో ర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య (౮-3-౧౮). (సి-కౌ ౧౬౮ సూ) "యశ్రుతిరః (౧-3-౧౦) అకారపూర్వః అకారః లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి ఆయవో" (మహాభా-౧౧పుట.) "దన్త్యచజౌ గురు రలౌచ బిన్దుయుతౌ" (వ్యా-సం-౨౯ II విష) "లఘుర్లఘువశ్చేతి ద్వేధా న్తస్థాన్ విదన్తి శాస్త్రారః" (ఆం-చిం) (వ్యా-సం. ౫౪ విష).

యుచ్చారణమున నవి ప్రశ్లిష్టావయవములుగా సంధించియుండును. (విశ్లిష్ట=వేఱయిన, ప్రశ్లిష్ట=కలిసిన) 'అ-ఆ-ఏ-ఐ-ఓ-ఔ' లును 'క' వర్గమును, '≍క' '≍ఖ' అనునవియును జిహ్వామూలీయములు. (వీనిని పాణినీయులు కంఠ్యములనుట సరికాదు.) 'హ' కారము మాత్రమె కంఠ్యము. 'ఇ-ఈ-ఏ-ఐ' లును 'చ' వర్గమును 'య-శ' లును తాలవ్యములు. 'ఉ-ఊ-ఓ-ఔ' లును 'ప' వర్గమును నుపధ్మానీయమును (≍ప-≍ఫ) నోష్ఠ్యములు. 'ఋ-ౠ' లును 'ట' వర్గమును 'ర-ష' లును మూర్ధన్యములు. రకారమును దంత్యమెయని ప్రాతిశాఖ్యములు చెప్పుచున్నవి. 'ఌ-ౡ' లును 'త' వర్గమును 'ల-స' లును దంత్యములు. వకారము దంతోష్ఠ్యము.

౬ వివ :— అచ్చులలో హ్రస్వ మేకమాత్రాకాలికము. దీర్ఘము ద్విమాత్రాకాలికము. త్ర్యాదిమాత్రాకాలికము ప్లుతమందురు. అది కావ్యసంస్కృతమున లేదు. వ్యంజన మర్ధమాత్రాకాలికము. మాత్రాకాలమనఁగా సెకెండులో (౧/౫) నయిదవవంతు కాలము. అచ్చేయక్షరము. వ్యంజన మక్షరాంగము. 'క్ర' మున్నగునవి యేకమాత్రికములె. సంస్కృతమునఁ బద్యపాదాంతము పాక్షికముగ గురువగును. తెల్గునఁ బాదాంతత్వము గురుత్వహేతువుగాదు. ఏకమాత్రికమగు హ్రస్వము లఘువు. ద్విమాత్రికమగు దీర్ఘము గురువు. హల్ సంయోగ విసర్గానుస్వారములకు ముందటి హ్రస్వాచ్చును గురువె. 'ప్ర-హ్ర' అను సంయోగములకు ముందటి హ్రస్వాచ్చు వికల్పముగా గురువగును. చ కృపకృతవర్మలం గడిమి గిట్టి శిఖండి ప్రభద్రకుల్ (శల్య ౧ ఆ ౨౨౧) కం. చూతఫలంబయ్యవనిజమువలన నమ్మౌని ప్రవరు పృథుమాత్సంగతలముపై వడిఁ బడియెన్ (సభా-౧ ఆ ౧౪౩) "ఈదంతా ఇద్వదేవ కృత హ్రస్వాః" (ఆంచిం). కం. సంద్రం బననా శతతాళదఘ్న హ్రదమునఁ బడియెన్ (కళా. ౪ ఆ ౫౧ ప). వెలిగందలనారయాది సామాన్యకవులు క్రావ

డికి ముందున్నదెల్లఁ బాక్షికముగ లఘువనునట్లు ప్రయోగించిరి. అవి ప్రామాణికములు కానేరవు. "క. ఆరయ వర్ణింపలేరు హర బ్రహ్మాదుల్ (భాగ. ౧౧ స్క-౦-౬౧) ఘనతరముగఁ జంద్ర సూర్య గ్రహములఁజూడన్ (భాగ. ౧౨ స్క-౦. ౧౨)-౧౧-౧౨ స్కంధ ములకర్త వెలిగందలనారయ.(చూ-వ్యా-సం-30.IVవిమ. విస్తరము)

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున (౨౯-౨3) పద్యాదులలో క్రారకు ముందటిది పాక్షికముగ లఘు-వనుచు మహాకవి ప్రయోగములుచూప యత్నించెను. "గీతవాద్య వినోద క్రియలఁ దగులు" (కాశీ. ౪ ఆ.) ఇది నావద్దనున్న సాతాని ప్రతిలో సైతము "గీతవాద్యవినోద కేళిఁ దగులు" అని యున్నది. ఉ. "కావునఁ గామక్రోధములఁ గ్రాచు" (శాంతి ౨ ఆ ౨౫౧). ఇది వావిళ్ళవారి ప్రతిలో "కావునఁ గామరోషములఁ గ్రాచు" అని యున్నది.

సంస్కృతమందువలెఁగాక తెల్గునఁ బొల్లు వ్యంజనమునకు ముందటియక్షరము గురువగును. ఉ......రాజమహేంద్రుఁ డున్న తీన్ (ఆది. ౧ ఆ 3) ఇందలి 'తిన్' అనునది గురువు.

తెలుఁగున వ్యస్తపదాదిస్థ హల్సంయోగమునకు ముందటి లఘువు సంస్కృతమందువలె గురువు కానేరదు. ఉ......నరపా లుఁడు శాపముఁ గ్రమ్మరింపఁగన్" (ఆది ౧ ఆ-౧౦౧). తెల్గునం దును సిద్ధసమాసములందు భిన్నపదాదిస్థసంయోగమునకు ముందటి హ్రస్వము గురువె యగును. కం......వివిధాగమ విహితక్రమ ముఁడు తుహినకరుఁ దురుకాంతిన్. (ఆది ౧ ఆ ౪) సాధ్యసమాసమం దట్లు కానేరదు కం. 'వచ్చిన క్షత్రియులెల్లను .....'సాధ్యసమా సములందును దీర్ఘము హ్రస్వమగుటకు నిమిత్తమగు భిన్నపదాదిస్థ సంయోగమునకు ముందటి హ్రస్వము గురువగును. ఉ. అమ్మది తన్ విభీతహరిణాక్షి...(సభా ౨ ఆ ౨౪౭) 'అద్రుచు-విద్రుచు'

మున్నగు నాచ్ఛికము 30-31 సూత్రిపు 'ద్రు' వర్ణకమునకు ముందటి హ్రస్వము సమానపదమయినను గురువుకాదు. 'చిద్రుపలు' (ఇది శిథిలద్విత్వము) శబ్దమందలి 'ద్రు' వర్ణమునకు ముందటి హ్రస్వమును సమానపదమైనను గురువుకాదు. ఉదా: చ. ఎద్రిచిన...... అద్రిచిన...... విద్రుపఁగ...... చిద్రుపలు...... (ఉ. హరి. ౪ ఆ. ౧౦౯) 'కద్రువ' అనుదానిలోని 'క' గురువె. ఇట్లితక్కిన సమాన పదసంయోగపూర్వాక్షరమెల్ల గురువె యగును.

మహారాష్ట్రిప్రాకృతమునకు వర్ణములు

నలువది. ౨. (శా. సంజ్ఞా. ౨.) (వ్యా-సం-౧౭ వివ)

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఓ" అనునవి (౮) యచ్చులు. 'ం' అనుస్వార ముభయము." క-ఖ-గ-ఘు-ఙ, చ-ఛ-జ-ఝు-ఞ, (*) ట-ఠ-డ-ఢ-ణ, త-థ-ద-ధ-న, ప-ఫ-బ-భ, మ-య-ర-ల-వ-స-హ" అనునవి (31) హల్లులు. 'ఎ-ఏ-ఒ-ఓ' లు వక్రములనియు 'ఐ-ఔ' లు వక్రతమములనియుఁ బ్రాచీనులు వ్యవహరింతురు. ఇట్టి సంజ్ఞలు వాని యాకృతినిబట్టి కల్గియుండును.

౧ వివ :—ప్రాకృతము లాఱువిధములు. ౧ మహారాష్ట్రి. ౨. శౌరసేని. 3 మాగధి. ౪ పైశాచి. ౫ చూళికాపైశాచి. ౬ అపభ్రంశి. ఇందలి మహారాష్ట్రికిఁ బ్రాకృతమనియుఁ బేరుగలదు. ఇదే

* ప్రాకృతమున 'ఙ-ఞ' లు గలవు. విసర్గములేదు. 'ళ' కారముగలదు గాని యలఘువుగాన దానికిఁ బృథగ్గణనము లేదు. కాన సూరి 'విసర్గ-ళ' కారముల నుదాహరించుట సరికాదు. వానిని విడిచి 'ఙ-ఞ'లను గ్రహించి చత్వారింశత్సంఖ్యను బూరించుట యుక్తము. "ఙ-ఞా' స్వవర్గసంయుక్తౌభవతఏవ. అహఙ్కారో-అఞ్జితం" (చండవ్యా. స్వరవిధా. ౧౯) 'లోలః' (3-౨-౪౦)=పైశాచ్యాం ళోలకారః స్యాత్. ముకులో (షడ్భా. ౧౪౮ పుట) మహారాష్ట్రిలో నది 'ళ' కారమె.

తక్కిన్నవానికన్న ముఖ్యము. మాగధిలో 'శ' వర్ణమును జిహ్వామూలీయమును గలవు. కావున మహారాష్ట్రియే "ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః। ప్రకృతే స్తు తే దశోనాః స్యుః" అను చింతామణి కారికచే నుద్దేశింపఁబడె ననఁగును.

౨ వివ :—ప్రాకృతమున దంత్యచజలు లేవు. (చూ. వ్యా సం-౧౮ వివ.) అవి గలవనెడి యహోబలాప్పకవ్యాదుల వ్రాఁతలు ప్రామాదికములు.

3 వివ :—సంస్కృతశబ్దములనెల్ల సాధారణముగ నాంధ్రవిభక్త్యాదియోగమున సంస్కృతసమములుగ వాడుకొనుచున్నట్లు ప్రాకృతశబ్దములనెల్ల వాడరాదు. మహాకవి వ్యవహారసిద్ధములగు "సిరి-అగ్గి" మున్నగువానినిమాత్రమె వాడుకొనవలయును.

౪ వివ :—ప్రకృతి (జనసామాన్యము) వ్యవహారసిద్ధము ప్రాకృతము. ఈ వ్యుత్పత్తిచొప్పున వ్యావహారికభాషలెల్లఁ బ్రాకృతములె. వ్యావహారికభాషలు సంస్కరింపఁబడియే గ్రాంథికభాషలగును.

అచ్చతెలుఁగునకు వర్ణములు ముప్పదియేను. 3 (బా-సంజ్ఞా. 3) (వ్యా. సం. ౨౦ వివ).

"అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ" అచ్చులు ౧౨. 'ఁ' అర్ధానుస్వారము 'ం' పూర్ణానుస్వారము. ఈ రెండు నుభయములు. 'క-గ-చ-చ-జ-జ-ట-డ-ణ, త-ద-న-ప-బ-మ. య-ర-ల-వ-స-హ-ళ-ఱ" హల్లులు ౨3

౧ వివ :—తత్సమములు తెనుఁగే గాన 'అచ్చతెలుఁగు'నకని సూత్రింపఁబడెను. 'ఎ-ఒ-ఁ-చ-జ-ఱ' అనునవి (౬) ను తెల్గున మాత్ర ముండును.

౨ వివ ;— 'చ-జ'లు తాలవ్యములు. 'చ-జ'లు దంత్యములు. 'చ-జ' లచ్చతెల్గునమాత్రమె యుండును. సం-స మం

చము. అచ్చతెల్గు-మంచము. సం-స-రాజు. అచ్చతెల్గు-రాజు. 'ౘ' అను దంత్యతకార సంక్షేపపుగుర్తును 'చ-జ' లపై నిపుడు నిల్పెదరు. 'చ-జ'లపై నొకబొట్టు నిల్పిన 'దంత్య' 'ౘ-ౙ'ల లిపి యగునని నన్నయ సూత్రించెను. (వ్యా. సం. ౨౭ II వివ). (చూ. సంజ్ఞా. ౧ సూ ౪ వి.)

3 వివ :-ప్రాచీనతమకాలమున 'ఱ' కారము 'ట-త' మధ్య స్థోచ్చారణము గల్గియుండెడిది. కావుననె "కుఱు + ఉసురు=కుట్టుసురు" మున్నగునెడల 'ట' కారస్థితి సంభవించెను. కాని నన్నయ నాఁటికె దాని కలుషరేఫోచ్చారణము గల్గెను. దానికేకాక ఌకార మునకును నలఘూచ్చారణము సంభవించెను. అట్లగుటచేతనే లఘు 'యవ' లతో పాటుగ నలఘు 'ఱ-ఌ' లకును వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయలేదు. అట్లయినను నితర ద్రావిడ మహాకవ్యనురోధమునఁ దన భారతభాగమున నన్నయ 'ర-ఱ' లకు యతి ప్రాస మైత్రిని జేయలేదు. తక్కిన కవులెల్ల నేదోయొకతీరున వానిమైత్రిని జేసిరి.

४ వివ :-'ఌ కారము నన్నయనాఁటికె తెల్గున నశించినది. అది 'డ' కారముగనో (ఏడు=ఏఌ) 'ల'-(ళ) కారముగనో (తమిల=తమిఌ) (హళసగన్నడమున పఌగన్నడ 'ఌ' కారము 'ళ' కారముగఁ బరిణమించెను) పరిణమించెను. కాననె దానిని నన్నయ యచ్చాంధ్రవర్ణమాలలోఁ బరిగణింపలేదు. కాని నన్నయకుఁ బూర్వపు యుద్ధమల్లుని బెజవాడశాసనమున నది లిఖింపఁబడి యున్నది (అఌసిన-ఒప్పిన). ఇట్టి యలవాటుననె నన్నయకుఁ దర్వాతి పాందువ్రగామ శాసనమందును (ఖఌ= ఖడ్గ) నది లిఖింపఁబడెను. తమిఌమందు నేఁటికిని నట్టి వర్ణము నుచ్చారణము గలదు గాన దాని నచ్చతెల్గున నిల్పితిని.

౫ వివ :— ప్రాచీనతమకాలమున నర్ధానుస్వారము చోటఁ బూర్ణానుస్వారమే పల్కఁబడెడిది. కాలక్రమమున నయ్యది తేలి నన్నయనాఁటి కర్ధానుస్వారముగఁ గొన్నిట నేర్పడెను. నన్నయ భారతభాగమునమాత్ర మర్ధానుస్వారప్రాసము నియమితముగఁ గలదు. ప్రాచీనతమకాలపు వాసనచే నన్నయకుఁ దర్వాతి కవులును నొండదఱు ఖండానుస్వారముచోట దీర్ఘముమీఁదనైతము పూర్ణమునే ప్రాసములలోఁ బ్రయోగించిరి. క. పోఁడిగ నగజతపశ్శిఖి మూండు జగంబుల . బ్ర । హ్మాండ. . .(నన్ని-కు-౬ ఆ. ౮౧౩ ప). నన్నయ చింతామణిలోఁ బూర్ణార్ధములు పేర్కొనఁబడెను. అట్టిపేరులే వాని యాకారమునకు నిరూపకము లనఁదగును.

౬ వివ :—నన్నయకాలమునకుఁ దురుష్కలయు నాంగ్లేయు లయు భాషలు తెల్గునఁ బ్రవేశించుట కవకాశము లేకుండుటచేత నన్నయ చింతామణిలో నన్యదేశ్యమును బేర్కొనలేదు. తన భారత భాగమునఁ బ్రయోగింపనులేదు. యయాతిచరిత్ర-మనుచరిత్రాదు లలో నన్యదేశ్య (తురుష్క) శబ్దములు ధారాళముగ వాడఁబడినవి. (నేఁటి కాంగ్లేయభాషాపదములును గలవు) కాన నేఁటి వ్యాకరణ ములలో నన్యదేశ్యము నొకభాగముగ నంగీకరించుట యుక్తము. అట్టి యన్యదేశ్యములలోని యనాంధ్రవర్ణములను దొలఁగించి వానిచోఁ దత్సన్నిహితాంధ్రవర్ణముల నిల్పుట యుక్తము. అట్టి మార్పుచే నర్థస్ఫూర్తి ప్రతిబంధము గల్గుచో నట్టి యనాంధ్రవర్ణ ముల నిల్పుటయు యుక్తమె. (షరా: షరతు-మొ). శబ్దరత్నా కరాదికోశములలో నన్యదేశ్యములందే కాక కొన్ని యాంధ్రదేశ్య ములందును ననాంధ్రవర్ణముల నిల్పుట పొరపాటు. (అవఘళించు-మొ). కొన్ని యన్యదేశ్యములు :—టాణా=(ఠాణా), టలాయించు= (ఠలాయించు), టికానా=(ఠికానా), పాయిదా = (ఫాయిదా), పిర్యాదు=(ఫిర్యాదు), సరాబు=(షరాఫు), సికారు=(షికారు),

హాజరు-హుకుము-హుజూరు-మొ. ఆంగ్ల :-కాపీ (కాఫీ), పీజు= (ఫీజు), హెడ్మేష్టరు=(హెడ్మేస్టర్) రైలు-రోడ్డు- కలెక్టరు-మొ.

కవి ప్రయోగములందును సంజ్ఞాదులలో ననాంధ్రవర్ణములు ప్రాసాదులలోఁ బ్రయోగింపఁబడినవి. అట్టి శబ్దముల ననింద్యగ్రామ్యములుగా నంగీకరింపనగును,

శా.మక్కా మండువపందువా... తుక్కార... ప్రాక్కద్యోత... (నరస. ౫ ఆ ౨౨౨). క. దుంరీశు...లోలా ర్కుంరేవమీాఙ... (కవి సింగరయ్యగారి త్రైశంకనోపాఖ్యానము. అప్పక ౫ ఆ ౧౫౨)

౭ వివ:-అనుకరణశబ్దములందలి యనాంధ్రవర్ణములను దొలఁగింపరాదు. ఉదా :-గుభుల్-గుభుల్.

౮ వివ:-'తాటాకు' మున్నగు రీతిగల శబ్దములందలి తాలవ్యతావేశము నుచ్చరింపరాదు. 'తాటాకు' అనురీతిని శుద్ధస్వరోచ్చారణమునే (యతినిబట్టి) చేయవలయును.

౯ వివ :-వర్ణనిర్దేశవిధానాదులందు బహుళముగా 'కార' ప్రత్యయమును 'ర' వర్ణమునకు 'ఇఫ' ప్రత్యయము నగును. ఉదా; అకారము-రేఫము-రకారము మొ ఇవి సంస్కృత ప్రత్యయములు. తెల్గున వర్ణనిర్దేశవిధానాదులందు హ్రస్వము దీర్ఘమగును. దీర్ఘంబు దీర్ఘంబ. ఉదా ; అకారమున కికారమగును-'ఆ' కు 'ఈ' వచ్చును.

౧౦ వివ :-ద్వంద్వమున వర్ణములకు స్త్రీ సమత్వము పాక్షికముగా నగును. ఉదా : కచటతపలు-లళములు మొ

౧౧ వివ .-పైవిధులు గణాద్యక్షరములందును నగును. ఉదా భకారము=భగణము. "నజభజజల్ జరేఫలఁ బెనంగి" "మస జమ్ము లిమ్ముగ". వర్ణసంఘాతమందును బయివిధులు యథాప్రయోగముగ గ్రాహ్యములు- ఉదా : శ్రీకారము-పుష్పు బుభుల్ మూాలకు విలసిల్లు. పాఘాబోభామూాలు-మొ దీర్ఘాంతగణాద్యక్షరము తద్గణద్వయవాచి కానోపును. ఉదా :-"భరనభారలగంబులఁగూడి" మొ

ఋ-ౠ-ఌ-ౡ-విసర్గము. ఖ-ఘ-ఛ-ఝ-ఠ-ఢ-థ-ధ-ఫ-భ-ఙ-ఞ-శ-ష-లు సంస్కృత సమాన్యదేశ్యానుకరణాదులంగూడి తెల్గున వ్యవహరింపఁబడును. ర. (బా. సం ర సూ) (వ్యా. సం. ౨౭ విష.)

ఋతువు-పిత్రృణము- (పితృ + ఋణము) (కేవల ౠకార ఘటితశబ్దములు కావ్యములం దప్రయుక్తములు) క్ౣప్తము-(రచింపఁ బడినది) ౡకారము (కేవల ౡకార ఘటితశబ్దములు కావ్యములం దప్రయుక్తములు.) దుఃఖము - ఖడ్గము - ఘటము - ఛత్రము - ఝరము - కఠరము-(తెల్గున వర్గపంచమాదేశము లేదు) ఢక్క-రథము-ధరణి-ఫణము-భయము * శార్ఙ్గము-ఆజ్ఞ-శరము-షండము-

౧ వివ :—సంస్కృతమున వర్గిపంచమాదేశము గలదు (♦) గాని యట్టి సంస్కృతశబ్దము తత్సమమగుచు తెల్గునకు వచ్చునవు డందలి వర్గపంచమముచో నిందుసున్న నిల్చును (సం-) శఙ్కరః= (సం-సమ)=శంకరుఁడు. శంకరాజ్ఞ మొ॥ పదాన్తమం దీవిధి సంస్కృతమందే వైకల్పికము ఉదా సంగమః=సఙ్గమః మొ తెల్గున వర్గపంచమాదేశము లేదనుట కీ క్రిందిరీతి మహాకవి ప్రయోగములు మూలము. కం. పంగుల మూకాంధుల విక లాంగులను న బాంధవుల దయఁం బ్రోతె భయార్తుం గడఁది శత్రునైనను సంగర రంగమునఁ గాతె శరణం బనినన్ (సభా-౧ ఆ-౨౫౪ ప) అచ్చ తెల్గున ఙ-ఞ' లు లేవుగదా. (చూ. వ్యా. సం ౨౮ విష దీని విస్తరము) బిందు యతియు వర్గపంచమాదేశము తెలుఁగున లేదని వచించుచున్నది

---

* తెల్గున వర్గపంచ మాదేశము లేమిం జేసి పంక్తి' శబ్దమును సూరి ఙకారోదాహృతిగ నిచ్చుట సరికాదు.

♦ అనుస్వారస్య యయి పరసవర్ణః. (౮-౪-౫౮) వా పదాన్తస్య (౮-౪-౫౯. సి కౌ. ౧౨౪. ౧౨౫ సూ)

'క-చ-ట-త-ప' లు పరుషంబులని 'గ-జ-డ-ద-బ'లు సరళం బులని చెప్పంబడు. ౫ (బా. సం. ౫ సూ) (వ్యా. సం. 30 విష) ఇతరములగు హల్లులు స్థిరములు. ౬. (బా. సం. ౬ సూ) (వ్యా. సం. 30 విష.)

ఖ-ఘ-ఙ, ఛ-ఝ-ఞ, ఠ-ఢ-ణ, థ-ధ-న, ఫ-భ-మ, య-ర-ల-వ-శ-ష-స-హ-ళ-ఱ-(స్థిరములు.)

౧ వివ :—సంజ్ఞ ౭ సూత్రము చొప్పునఁ దాలవ్య 'చ-జ'లు దంత్య చ-జ లకు గ్రాహకములు గాన 'ౘ' కారమును బరుషమె. ౙ కారమును సరళమె. లఘ్వలఘువులగు ద్వివిధ య-ర-ల-వ' లును స్థిరములె.

౨ వివ :— ప్రాతిపదికము=నామము ప్రత్యయము = వర్ణకము=విభక్తి క్రియ=ధాతువు న్-(నకారము) ను-ని" అనునవి ద్రుతములు

దంత్యతాలవ్యంబులయిన చ-జ' లు సవర్ణంబులు. ౭. (బా సం ౭ సూ) (వ్యా సం 31 విష). తాలవ్య 'చ'కారంబు దంత్య 'ౘ' కారంబునకును దాలవ్య 'జ' కారంబు దంత్య 'ౙ' కారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

ఇ-ఈ-ఎ-ఏ' లం గూడిన చ-జ' లు తాలవ్యంబులు. ౮. (బా. సం. ౮) (వ్యా. సం 31 I విష)

చిలుక-చీమ-చెవి-చేమ-జిల=(దురద)-జీడి-జెట్టి-జేజే=(దేవత) (జేజె రూపాంతరము.)

అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ' లం గూడిన చ-జ'లు దంత్యములు ౯. (బా సం ౯ సూ) (వ్యా సం. 31I విష)

చలి-చాప-చుక్క-చూపు-చొక్కు=(పారవశ్యము) చోటు-చౌక జముఁడు-జాతర=(ఉత్సవము) జున్ను-జూలు-జొన్న-జోలి=

(సంబంధము) జొకు=(మెత్తగిల్లు) ఇదంతములయిన చ-జ లు సమేతరములం దుండరాదు

౧ వివ —సమేతరము లనఁగా సంస్కృత సమేతరములు. అందు ఐ దంత చజ లుండరాదు గాని కొందఱు సామాన్య కవులు ప్రయోగించిరి సీ చైవుల నాకిరి చాయ మగఁడు' (ఆంధ్రనామ సంగ్రహము). ఉ చక్కెరబొమ్మ మార్మలయు చైవులకున్ . (శుకస ౧ ఆ. సూ. రా ని )

౨ వివ —దంత్య చ-జ'ల యుచ్చారణమునుబట్టి యవి దంత్యతాలవ్య చ-జ' లనఁదగియున్నను కురుపాండవ' న్యాయమున నవి దంత్య చ-జ' లని వ్యవహరింపఁబడుచున్నవి — — —

3 వివ .—సంధిస్థలములందు సంధి పూర్వావస్థలోని దంత్యతాలవ్యతలే నిల్చును. ఉదా —అచ్చు = (ముద్రణము) + ఇది= అచ్చిది

వైకృతమగు రాజు శబ్దపు జకారము దంత్యము. అచ్చులు-వాజులు-పాండురాజు-భీమరాజు-మున్నగువాని జకారము తాలవ్యమె ౧౦ (బా. సం ౧౦ సూ) (వ్యా సం 3౬ మొ. ౪౦ వివ ) సంస్కృత ప్రాకృత వర్ణసమామ్నాయములలో నె దంత్యచజలు లేవు

౪ వివ —సంస్కృత చ-జ లు కొన్ని దంత్యములు గలవని సూరిప్రభృతి నవ్యులు భ్రాంతిపడి వ్రాయుటచేత నిట్లు సిద్ధసాధనముగా సూత్రింపఁబడెను *

---

* సంస్కృతసమములం దికారాంతము లయిన శబ్దముల యుపధా (ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము ) చ-జ' లు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగు. ఉదా — అచ్చులు, వాజులు . . రాజు శబ్దంబొక్కటి దంత్యయుక్తంబు గానం బడియెడి (బాల-సంజ్ఞా-౧౦ సూ) అను సూరి వ్రాఁత కేవల

పదాంత 'ను' వర్ణంబు ద్రుతంబు ౧౧ ♦ ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు ౧౨. (శా సం. ౧౧-౧౨ సూ) (వ్యా. సం. ౪౨ విష.)

ప్రథమా-కయి-పట్టి-యొక్క-తరములైన విభక్తులు, నుత్తమపురుషైక వచనంబులు, భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైక వచనంబులు, నాశీరాద్యర్థంబయిన 'త' వర్ణకంబు (*) శతృ-తుమున్-భావలక్షణ (‡) చేదాద్యర్థకంబులు (T) 'వలెను' ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు. ఉదా — నన్నును-మమ్మును- రాములను- నా చేతను-నాతోడను-నాకొఱకును-నావలనను-నాకంటెను-నాకును-

---

ము నగ్రాహ్యము సంస్కృతిసములందలి చ-జ'ల దంత్యాతవ శాస్త్రీయము-నిరాధారము. సంస్కృతవర్ణమాలలోనే దంత్య చ-జలు లేవు. దంత్యతాలవ్య చ-జ' లకు యతి ప్రాసమైత్రియుండుటచేత వానినిబట్టి యీవిషయమును నిర్ణయింపరాదు. రాజ శబ్దభవమగు నర్వాచీన 'రాజు' శబ్దమునుబట్టి యిట్టి యపభ్రష్టోచ్చారణము సూరి భ్రాంతియుఁ గల్గెనని తోఁచెడిని. ఇట్లైయైనచో "రవితేజుఁడు-విగతసంకోచుఁడు" మున్నగువాని 'చ-జ'లు దంత్యములని యేల సూత్రింపరాదు.

♦ "నకారంబు ద్రుతంబు" (బా. సంజ్ఞా. ౧౧ సూ) అని సూరి చింతామణి వాసనచే సూత్రించుట సరికాదు. అట్లె సంజ్ఞా ౧౨-సంధి '౨-౯-౪౩' మున్నగు సూత్రములం దుదాహరించెను. ఒక్క నన్నయ భారతభాగమునందును నన్నయాథర్వణీయగ్రంథమందును మాత్రమె దృతము (న్=నకార) వ్యంజన రూపముగ వాడఁబడినది. తిక్కన దృతమును ను స్వరూపముగనె ప్రయోగించెను. కం. విని పార్థుఁడిట్లు ..జయమునీకొక్క లైనుదాని (శాంతి ౬ ఆ. ౪౪౨) చ. పాము నీరిలో నువెడలకుండి కూర్మమతను స్థిర (ఆను ౧ ఆ ౨౩౨) ఇంతయేల సూరియు దృత 'ను' స్వరూపమునె నిర్వహించుచు వచ్చెను సంధి ౨౦ సూత్రమున దృతస్వరలోపమును విధించెను. దృతస్వత్వము ను' స్వరూపమని సంధి-౧౬-౧౭-౧౮ సూత్రములలో నుదాహరించెను. ప్రౌఢ

వనమునను-మాలోపలను-మాయందును-వత్తును- వచ్చెదను-వచ్చితిని-వచ్చెను-నచ్చును-వచ్చెదను-ప్రసన్నులయ్యెదును- చేయుతను-కావుతను-కాతను కొట్టుచును-కొట్టను-కొట్టఁగను-కొట్టినను-తిట్టినను కొట్టినను-వలెను-పోలెను-ఎంతయును-అయ్యును-కొట్టుదును- ఇత్యాదు యూహ్యంబులు

---

వ్యాకర్తయు ద్రుతము ను' స్వరూపమనియె సూత్రించెను (ప్రౌఢ సంజ్ఞా 2 సూ). సూరి సుప్ తిజ్ ప్రత్యయాంతముల తుదిని ను' స్వరూపము నె సూత్రించెను.

* :—ఆశీరర్థకము ఎడు' ప్రత్యయమని (క్రియా ౨౬. బాల) సూరి సూత్రించుట పొరపాటు. అది ఎడుమ' ప్రత్యయము. (వ్యా-సం 30౪ విష) అయ్యెడుఁగా' మున్నగు నాశీరర్థకప్రయోగములు తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనములన నగును. (చూ-బాల-క్రియా ౫౯-౨౨ సూ)

+ :—సూరి భావలక్షణార్థకము నుదాహరింపకుండుట పొరపాటు. మఱియు సూరి కొట్టుదున్' అను నానంతర్యార్థకము నుదాహరించుటయు దానిని సూత్రించుటయు (బా-క్రియా-౮-౨ సూ) నవిమర్శనకృతములు 'డు' అను భావార్థక ప్రత్యయమును గలదు (చూ. ప్రౌ ౪౫ సూ) (చూ-వ్యా-సం 30౯ విష) చార్థక శబ్దముతోఁ గూడిన భావప్రత్యయ మానంతర్యమును బోధించును. (చూ-ప్రౌఢ-క్రియా ౧-౨ సూ ) (వ్యా-సం ౧౪33-౧౪3౪ పుటలు 30౯ విష )

↑ :- నేను-తాను' పదంబులు ద్రుతప్రకృతికములుకావు. వాని తుది 'ను ప్రత్యయము ప్రథమైకవచనముగాన నవి కళలు వాని తుదిస్వరము లోపించుటచే నవి ద్రుతాంతములగును. కం. కవ దోనేలును . . . ఏ నువిదపడిగియెద . (శల్య ౨ ఆ ౨33). (వ్యా-సం-౪3 II విష). 'ఏన' అని దిద్దుట పొరపాటు-అవధారణార్థకముమీద గసడదవాదేశమురాదు క. సకల ..సర్వం బకడున్ మేలనఁగ శాంతిపర్వము వెలయున్ (ఆది ౧ ఆ-౫౦ ప)

౧ వివ :—వ్యాకరణవిధులచొప్పున నట్టి 'ను' స్వరూప ద్రుత మునిందలి ఉ' కారము 'ఇ' కార మగునపు (తత్స-౨౬ సూ) డా 'ని' వర్ణమును ద్రుతమనిపించుకొనును. ఉదా :—హరికి + ను=హరికిని మొ

౨ వివ —'నేను-తాను' పదముల 'ను' ప్రత్యయము యొక్కయు, చక్కని-చక్కన' మున్నగువానియందలి 'ని-న' ప్రత్యయములయు 'ఏను'=(అయిదు) మున్నగు మఱికొన్ని శబ్దములయుఁ దుది స్వరము (ఆచ్ఛిక ౨౮ సూ ) (బా-ప్రక్రీ. ౧౬) లోపించునపుడా మిగిలిన నకారము ద్రుతకార్యముల నందును. (౮౨ III వ్యా. సం. ౨౧౦ II వ్యా సం ) 'ను' అను ద్రుతముయొక్క 'ఉ' కారము సంధి ౨౦ సూత్రము చొప్పున లోపించునపు డామిగిలిన 'న' కార మెట్లును ద్రుతమెయగును అట్టి యాచ్ఛికము ౨౮ సూత్రముచేత స్వరలోపము గల్గినపు డాసూత్రములోని బహుళశబ్దమహిమచేతఁ గొన్నియెడల నా మిగిలిన న' కారము ద్రుతకార్యముల నందును-కొన్నిట నామిగిలిన న' కారము పూర్వావస్థలోని పరిథమయొక్క లక్షణము చొప్పునఁ గళయే యగును. ఉదా :—ద్రుతకార్య :— నేఁజదివితి, తాఁజెప్పె- నే దాపినే (సభా ౨ ఆ ౩౨) తాఁజరణమెత్తె (సభా ౨ ఆ ౩౦) చక్కంగ (కాశీ ౨ ఆ) చక్కంబెట్టు (ఉద్యో ౨ ఆ ౨౫౦) కమ్మందేనె (నైష ౨ ఆ) ఏఁబది, చేసెను=చేసెన్-చేయును=చేయున్ చేసెదనున్=చేసెదను=చేసెదన్. కళాకార్య .—మిన్నవెడెన్-అన్నురము. మొ

౩ వివ .—'కందోయి' అనుచో కన్నుంగవ. (భార-ఆది-౪ ఆ ౨౫౪. మనుచ. ౨ ఆ ౩౨) మున్నగుచోటులందువలెనె సామాసిక నుగాగమము (సంధి-౨౫ సూ) చేసి యందలి 'న్ను' . అను దానికి నిక్కలాది (చూ-సమా-౯౧) సూత్రము చొప్పున లోపము చేయఁగా 'క + ను + దోయి'' అను ద్రుతసహితరూపము నిల్చును.

ఆ ద్రుతమునకు సంధి ౧౮-౨౨ సూత్రముల చొప్పున నిండుసున్న చేయఁగా 'కందోయి' అను రూపము సిద్ధించును. ఇట్లె 'ఏనియున్' అనుచోట 'యు' అను భాగము లోపింపఁగా (సంధి ౨౧ సూ). 'ఏనిన్' అనియు, ని' అనునది లోపింపఁగా 'ఏన్' అనియు చార్థక ద్రుత న' కారము నిల్చునని ప్రక్రియ నడపవలయును. ఇట్లగుట చేత ఏనియున్-ఏనిన్-ఏన్' అనునవి ద్రుతోపజీవిశబ్దము లగుచున్నవి. అవ్యయములందుత్వవిశిష్టశబ్దాంతిమ న'కారము ద్రుతమె యగును గాన సముచ్చయాద్యర్థక ను' శబ్దము ద్రుతరూపమని యెన్నఁనగును. ద్రుతప్రకృతికములవలెనె ద్రుతోపజీవి శబ్దములును ద్రుతాంతములయి యుండును. శబ్దావయవ ద్రుతము గలవి ద్రుతప్రకృతికములు. అర్థవిశేషబోధక ను' శబ్దముతోఁ గూడినవి ద్రుతోపజీవిశబ్దములు. ద్రుతప్రకృతికము లీవఱ కుదాహృతము లయ్యెను. ద్రుతోపజీవిశబ్దములు :- ఎంతయును-కొట్టుడును = (కొట్టినతోడనె) కొట్టుటయును. అయ్యును మొ. (ద్రుత=ద్రవించునది=లోపించునది.)

ద్రుతప్రకృతికములుగాని శబ్దంబులు కళ లనంబడు. ౧౩.

(బా సం. ౧౩) (వ్యా. సం ౪౨ విమ.)

రాముఁడు-రాములు-హయము-విష్ణువు-వృద్ధు- హరి- దూత- సీత-గోడ-మేడ-నేను-తాను (ఇవి కళలె.) జపముంగూర్చి-అందుండి-వనమునుంచి-రామునికయి-జ్ఞానముంబట్టి-నాయొక్క-వచ్చిరి-వచ్చితివి-వచ్చితిరి-వచ్చితిమి-వచ్చుచున్నాఁడు- వచ్చుచున్నారు- వచ్చుచున్నావు- రాఁగలఁడు- వచ్చెదము- వచ్చెదవు- వత్తురు- వత్తుము- వత్తువు-రమ్ము- రండు- రాకుము- రాకుఁడు- రాఁడు- రారు- రాదు- రావు- రాము-వచ్చెడుమ=(వచ్చుతన్) = వచ్చుఁగాక-వచ్చునది = (రావలయును)-కొట్టక-తిట్టక-ఎత్తిలి-ఒత్తిలి- విశేషణములు కళలె యనఁదగును- తెల్ల- తెల్లనిది. నల్ల-నల్లనిది. చేసిన-చేయుచున్న-చేయఁగల-చేయు-చేసెడు-చేసెడి-చేయని- మొ. విశేషణములు నన్న

యమతమున ద్రుతప్రకృతికములె యైనను నవి సదా విశేష్యముతో సమసించి కళలవలె ద్రుతలోపము నందియుండును. ఇంచుక-బళి-బాపురె-ఔర-ఆహా-అక్కట-కటకట-అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-ఏల-వాడె-వాఁడె-వాఁడే-' వచ్చెనఁట'' ఊరక - మిన్నక - ఇత్యాదు లూహ్యంబులు.

౧ వివ :—కం .. మీ మనుపమ దుఃఖితులమగుట నాధారములే కను . (ఆది ౨ ఆ-౧౨౩). ఇందలి లేకను' అనునది ద్రుతప్రకృతికమని భ్రమింపరాదు. 'అనుపమ దుఃఖితులమగుటను, నాధారము లేకను అనురీతిని వానిలోని ను' శబ్దము సముచ్చయార్థకము. (చూ-సంధి-౨౧ సూ). చ. అతిధుల . చొరంగనీ క తొలంగఁద్రోవు (శాంతి-౨ ఆ-౨౫౩). ఇట్టి ప్రాసప్రయోగముచే వ్యతిరేకక్త్వార్థకము కళయె.

హ్రస్వమునీఁది సిద్ధసాధ్య పూర్ణములు ప్రాయికముగా ఖండములు సైత మగును *. అనిర్దిష్టబిందువిధానస్థలములలో హ్రస్వమునీఁదఁ బూర్ణార్థములు రెండును నగును. ౧౨. (బా-సం-౧౨). (వ్యా-సం-౪౮ I వివ.)

సిద్ధబిందు:—అడంకువ=అడఁకువ. అనంటి=అనఁటి అరంటి=మగఁటి. ఎఱుంగుట=ఎఱుఁగుట. బలంగము=బలఁగము. మగంటిమి=అరఁటిమి. మొ. సాధ్యబిందు :— రాముండు=రాముఁడు. చదువం గలండు=చదువఁగలఁడు. వచ్చెందండ్రి=వచ్చెఁ దండ్రి.

---

* హ్రస్వమునీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగానగు" అను సూరిసూత్ర ముచ్చారణస్వభావవిరుద్ధము. చింతామణి విరుద్ధము. ఖండమును విధించి పూర్ణము దీనిచొప్పునఁ జేయు ప్రక్రియయు లేదు. పూర్ణము తేలి ఖండమగుట సహజము. కొన్నియెడల ఖండముగాఁ దేలకుండుటయుఁ గలదు. ఉదా :— అపరంజి = (బంగారు) గురివెంద- చేమంతి- కలగుండు- ఆరంజ్యోతి (అరుంధతి మొ.

౧ వివ :—ఇఁక-అఁట-చుఁడు = (చూడుఁడు శబ్దపు సంక్షేపము-చేయరుసుఁడీ) శబ్దంబులందుఁ దప్ప మఱెచ్చటను బదము మొదటి హ్రస్వముమీఁది పూర్ణము ఖండముగాఁ దేలదు. (చూ-సంధి. ౨౨ సూ) 'ఎఁడు-ఇఁడి' మున్నగునవి ప్రత్యయములు-పదములుగావు. గంపెండు=గంపెఁడు. వాలిండి=వాలిఁడి = (శోఁక లేనిది). నుడి తొలిహ్రస్వముమీఁదఁ దేలని బిందువు స్థలములు :—ఇంచు = (రుచించు) చందురుఁడు-జంత్రము-దండిగ-తంపర-నిండు-పండు-బండి-మెండు మొ. అట్టి (నుడి తొలిహ్రస్వముమీఁద తేలని) సాధ్యస్థలములు కెందామర-ముంగొంగు-క్రొంబసిఁడి-కందోయి మొ.

౨ వివ .—కొన్నియలంతిస్థలములందుఁ బ్రథమేతర హ్రస్వమునకుఁ దర్వాతసయితము పూర్ణము తేలకుండుట గలదు ఉదా·-అపరంజి=(బంగారు) అడ్డంకి-ఆరంజోతి-(అరుంధతి). కలగుండు=(సంక్షోభము). గురివెంద-చేమంతి మొ (చూ-ద్రావి-పరి. ౧౭ XVIII వివ) (వై-పా ౩౨౦ వివ)

పు-ంపు, టి-ంటి ఇంచు' అను స్థలములు ప్రత్యేకవిధానము గలవిగాన నచట ఖండమునకుఁ బ్రసక్తియే లేదు. ఉదా·-నిద్దంపు=నిద్దపు పగలింటి=పగలిటి. రక్షించు-ప్రేరక్షింపించు. ఆరగించు.

దీర్ఘముమీఁద సాధారణముగాఁ బూర్ణము నిల్వదు. అనిర్దిష్టబిందువిధానస్థలములలో దీర్ఘముమీఁద ఖండమునె నిల్పవలయును. ౧౫. *. (బా సం. ౧౫ సూ) (వ్యా సం. ౮౮-౮౯ వివ.)

---

* సూరి 'దీర్ఘమీఁద సాధ్యపూర్ణము లేదు' అని సూత్రించె[illegible]. దీర్ఘముమీఁద సిద్ధపూర్ణముమాత్రము ప్రచుర[illegible]నా ? ఉదా· వాఁడు-వీఁడు-మొ. మఱియు ' తేంట్లు=(తుమ్మెదల్లు), పండ్లు-ప్రోండ్లు = (అనేక)-విలుకాండ్రు- ఆండ్రు" [illegible] పెక్కుచోట్ల సాధ్యపూర్ణములు గలవు.

పూర్ణము నిల్వని సిద్ధస్థలములు :— సైఁచు-తోఁచు-ఆఁకలి-వేఁడు (ప్రార్థించు). సాధ్యస్థలములు :— వాఁడు- వీఁడు- రాఁడు-లేఁడు-గోఁగులు-రేఁగులు-కాఁబట్టి-కాఁబోలు-నాతోఁబల్కె—మొ.

నిర్దిష్టపూర్ణవిధానస్థలములు :—తేండ్లు- తేంట్లు=(తుమ్మెదలు). ఏంట్లు-పూంన్లు =(అనేక)-విలుకాండ్రు-ఆండ్రు- మొ. వీని సామ్యమునఁ గావలయుఁ గొన్ని సిద్ధస్థలములు సంయోగపూర్వపూర్ణములు వెలయుచున్నవి. ఉదా : శా. తండ్రీ తీండ్రిల్ గల్గిన... (మనుచ. ౫ ఆ ౧౭) కం తీండ్రమగు... వేండ్రమున ..(భాగ-౭ స్క-౧ శ-౬)

సంయోగ స్థిరపూర్వకత్వమునఁ బూర్ణము లోపించుటయుఁ గలదు ఉదా (మాండుచు) = మాఁడుచు=మాడ్చు. వేసంగి=వేసఁగి=వేసవి పోండిమి=పోఁడిమి=పోఁడిమి. మొ.

౧ విప :—భారతేతరగ్రంథములు కొన్నిటియందు దరుదుగ సిద్ధ సాధ్యములు రెండిటను దీర్ఘముమీఁది పూర్ణము తేలక నిల్చుటయుఁ గలదు. కం. వీండె.. సర్వవధ్యుండు (నన్ని-కు-౨ ఆ ౨౧౭) కం. పోండిగ .. మూండు జగంబులను . బ్రహ్మాండము... (నన్ని-కు-౬ ఆ ౮౧౩). ద్విపద-పాండురాంగంబైన .. పోండిగా- (బస వ-౧ఆ ౩౫౩). ప్రగీతి-మూండుసేసి పోండిగా . నిట్లుండ . (కవిజనా-జాత్యధి-౨౧).

౨ విప .—కొన్నియెడల దీర్ఘమునకుఁ దర్వాత తేలకయె పూర్ణము నిల్చుటయుఁ గలదు. ఉదా .—సిద్ధ :—ఏకాండము- (అఖండమైనది)-వేంచేయు-మాందాళి= (పట్టుచీర)-చాంగుబళా=(ప్రశంసార్థకము)-(పేంకణము=(ప్రియాళువృక్షము)-(చూ-నై-పా-౩౧౭ విప) సాధ్య .— వంగు-(పేర-వంచు = వాంచు. [illegible] కం. కాంచనమాలాలంకృత చంచ[illegible] మెటీయు- జవన[illegible] ములన్ బూంచిన . (విరా. ౪ ఆ [illegible]) [illegible] పేర-కాంచు

(తన్నుఁ గనునట్లుచేయు) (వీనిని సకర్మకక్రియలని కోశములు చెప్పును.)

3 వివ :—కాలక్రమమున నుచ్చారణ సౌకర్యాపేక్షచేత ఖండానుస్వారము లోపించుచున్నది. కావున నె నన్నయేతరకవులు ఖండాఖండప్రాసమును బ్రయోగింపసాగిరి. (చూ-వ్యా. సం. ౪౮ V విమ) కం కేతనకపిభయదంబై కోఁ తేరఁగ ..(కర్ణ-3 ఆ-౧౭౪)

౪ వివ -ఉచ్చారణభ్రష్టమగు ఖండమును గ్రహించు నుపాయములు -సాధారణముగా హ్రస్వముమీఁది సిద్ధఖండమును దానిచో నిల్చు పూర్ణమునుబట్టి తెలిసికొనవచ్చును. సాధ్యఖండములు వ్యాకరణమువలన సుజ్ఞేయములు. ఇంక దీర్ఘపూర్వకసిద్ధఖండజ్ఞానము కోశములవలననే తెలిసికొనవలయును. సాధారణముగ వాడుకలో వచ్చు శబ్దములు :-అందాఁక-ఆఁకలి-ఆఁడుది-ఆఁదోఁక-ఈఁగ-ఈఁత-ఈఁటె-ఊఁత-ఏఁడు (వత్సర)-కాఁక-కాఁగు-కాఁచు (వేఁడి చేయు) (కూఁత)-కూఁతురు-కోఁట-కౌఁగిలి-క్రోఁతి-గూఁడు-(గోఁగు) చీఁదు-చేఁదు (ఆకర్షించు-తిక్తము)- తాఁకు- తీఁగ-తూఁగు- తేఁటి (తుమ్మెద) తోఁక-తోఁచు-తోఁట-తోఁపు=(తోఁట) దాఁగు-దాఁటు-నాఁడు=(ఆదినము)-నేఁడు=(ఈదినము)-పాఁడి-పైఁట-ప్రాఁత. బీఁట-మాఁగు-మూఁడు-మీఁదు-మూఁగ-మూఁడు- మేఁక-మోఁకాలు-మోఁదు-మ్రోఁగు-రోఁకలి-లేఁగటి- లేఁత-వీఁగు-వీఁపు- వేఁగు-వేఁచు- వేఁట-వేఁడి- వేఁడు=(ప్రార్థించు)-సాఁకు-సైఁచు-సోఁకు-మొ.

సంస్కృతసమేతరములైన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది.

౧౬. (బా. సం. ౧౬) (వ్యా సం ౫౦ విమ.)

వంకర-కలఁకువ-కలఁత=(సంక్షోభము)-మంచు-త్రాఁచు= (పాము)-[illegible]-కొంత-కోఁత-ఇత్యాదు లూహ్యంబులు.

౧ వివ :-ఈ సూత్రప్ర నియమముచేత బిందుపూర్వకత్వమున "డ".కార[illegible]శము మున్నగు విధులు వర్తిల్లనేరవు.

ఉదా :-ఏఁడులు=ఏండ్లు. బంఁషులు=బండ్లు. ఇట్టియెడల 'ఆచ్ఛిక' ౧౪ సూత్రము చొప్పున 'డ' కారమున కలములకారము రానేరదు. 'ఏళ్ళు-బళ్ళు' ఇత్యాదులు వ్యావహారికరూపములు. పరుషసరళము లకు స్థిరవర్ణ మాదేశమగునపుడు నుందటబిందువు కొన్నియెడల లోపించును. ఉదా : వేసంగి=వేసఁగి=వేసవి. (ఆచ్ఛి-౬౯ సూ). పోండిమి=పోఁడిమి=పోణిమి. (ఆచ్ఛి ౪౦ సూ) మొ.

౨ వివ :-కొన్ని ప్రత్యేకవిధానస్థలములందు బిందుపూర్వక స్థిరము కనపట్టును. ఉదా : వచ్చెం ధాత్రీపతి. (సంధి ౧౯ సూ). తే. గీ. ధాంధమితభేరికాధ్వానముం ధులీని నాదము... (అధర్వణ భార. విరా-అప్పక ౫ ఆ ౧౫౫) క. ఢుంఠిశు...భైరవునిశితి కంఠు ..లోలా ర్కుంరేవ.. (కవి సింగరన్నగారి త్రైశంకవోపా ఖ్యానము-అప్పక-౫ ఆ ౧౫౪) గీ ప్రాసబంధ...కృష్ణుఁడుదయించి నం ధరిత్రి (ఛందో-౧ ఆ ౫). లయగ్రాహి-కమ్మని లతాంతముల కుం మొనసి (౫౬ ౧౩౭ ప) సంధి ౧౯ సూ ౨ వివ) (వ్యా-సం ౮౨. వివ) (ఇమ్ముగ...లోకవం ద్యుంముని... (ఆది-౧ ఆ ౭౭). 'కంసాలి' అనునది వ్యావహారికపదము-'కమసాలి' గ్రాంథిక పదము 'కమ్మరము' మున్నగువాని నరయునది-

యెవఁడు-యేది' అను రీతిగల పదాది 'య' కారము నన్నయ సమ్మతము-అయినను 'వూరు-వుండ-వోడ" మున్నగు శబ్దములందలి పదాది 'వ' కారమునువలెనె దానిని దర్వాతి వైయాకరణు లంగీకరింపలేదు. ౧౭. * (బా. సం. ౧౭) (వ్యా. సం ౫౩ వివ).

---

* ''యకారంబును 'వు-వూ-వొ-వో' లును దెలుఁగు మాట లకు మొదట లేవు'' (బాల. సంజ్ఞా. ౧౭) అను సూరిస్మాత మనా వశ్యకము. ప్రక్రియలో దీని యుపయోగములేధు. పదాదిన్నిలేని 'ణ-ళ' మున్నగువానికి నిషేధసూత్రము లేనట్లె యీ నిషేధము నక్కఱలేదు. వాడుకలోని యపభ్రంశముల నెల్ల సవరింపలేదుగదా.

'య-ర-ల-వ' లు లఘువులని, యలఘువులని, ద్వివిధంబు లగు. ౧౮. (బా. సం ౧౮) (వ్యా. సం. ౫౪ వివ) 'య-వ-ల'లు లఘ్వలఘువులు మైత్రింబొరయు. రేఫంబులు పొరయవు. ౧౯. (బా ప్రకీర్ణ ౨౪ సూ) (వ్యా సం ౫౬ వివ)

హరియతఁడు' ఇత్యాదులం దాగమ య' కారము లఘువు. తక్కిన య' కార మలఘువు. విఱుగు-మెఱుఁగిత్యాదులందలి (ఱ)=రకార మలఘువు. ఇదే శకటరేఫమని చెప్పఁబడును. శకటరేఫము తత్సమములందు లేదు * పెరుగు-కరుగిత్యాదు లందు రేఫంబు లఘువు. ఏల్లు-పాల్లు-త్రాల్లు' అను రీతిగల ♦ బహుత్వమందు ర-ల-డ' ల కాదేశమయిన ల' కార మలఘువు తల-నెల' యిత్యాదులందలి లకారము లఘువు (చూ సంజ్ఞా ౧ సూ ౪ వివ). అచ్చాంధ్రవర్ణ సమామ్నాయమందలి శ' కార మలఘువుకాదు అయ్యాది వర్ణాంతరము గెలుచు + అన్ = గెలు + వ్ + అన్ = గెలువన్. చిగురు=చి + వ్ + ఉ + రు=చివురు. చతుర్థి=చ - - వ్ + ఉ + తి=చవుతి ఇత్యాది స్థలములందు సమానపదములలో స్వరసంహితయందు 'వ' కారము నిల్చును - తక్కిన యెల్లయెడలను స్వరసం

---

* సూరి తద్భవములందును శకటరేఫము లేదనెను. ఒక్క నన్నయ తద్భవములందు శకటమును బ్రయోగింపలేదుగాని పెక్కురు మహాకవులు ప్రయోగించిరి. కం వెఱపెట్టెదియో .. పిఱికెతనము..(ఉద్యో. 3 ఆ. శ. ౪) పిఱికిశబ్దము భీరుక'' శబ్దభవము. మ . గఱిదోఁపన్ ..(ఉ. హరి ౪ ఆ. శ-౪) గఱిశబ్దము గరుచ్ఛబ్దభవము.

♦ ఏళులు-పాళులు-త్రాళులు' అని సూరి యుదాహరించెను ఇవి యపశబ్దములు-కవిప్రయోగములలో లేవు (చూ-ఆచ్ఛి ౧3 సూ)

సూరి గసడదవా'దేశములోని వ' కారము లఘువని (అతఁడు వలికె) వచించెను. ఇది నిరాధారము యకారసామ్యము నను సంస్కృతపద్ధతిని (అసావాదిత్యః) స్వరసంహితలోని 'వ' కారమునె లఘువనుట యుక్తము.

హితలో 'య' కారము మాత్రమె నిల్చును. (సంస్కృతమందును స్వరసంహితలో నిల్చు 'య-వ' లు లఘువులని చెప్పఁబడెను) అట్టి స్వరసంహితలో నిల్చు వకారము లఘువు. తక్కినచోటులందలి వ' కార మలఘువు-ఉదా :-వాఁడు-వీఁడు-వచ్చెను.

౧ వివ :-లఘ్వలఘురేఫముల యతిప్రాసమైత్రి దుష్టమని నన్నయాథర్వణులు వచించిరి * I ద్విత్వరేఫ మెన్నఁడును లఘువు కాదు. ఉదా :-ఇఱ్ఱి-కొఱ్ఱు-జెఱ్ఱి-మొ II అన్యహల్ సంయుక్తరేఫము లఘువే యగును ఉదా :- పేర్మి-వ్రతువ-తీర్చు=(తీఱుచు). వేర్వేఱు=(వేఱువేఱు) గుర్తు=(గుఱుతు). III దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మయ్యెనేని గురురేఫమగును. ఉదా : చేకూఱు=చేకుఱు IV తిక్కనాది మహాకవులు ర-ఱ' మైత్రిని బ్రయోగించిరనుటకు సమ్మతింపక యాంధ్రలాక్షణికు లుభయరేఫ ఘటితశబ్దముల నంగీకరించిరి † ఉదా -ఱాయి=రాయి క. ఱాయో కాకిట్లు రూపఱకవిన నోర్చెన్ (భీష్మ ౩ ఆ ౪౧౯) క. రాతిపయిని నుప్పుకొనుట రాత్రిదధిమధూ పేతంబుగ (ఆను ౪ ఆ ౧౧౦)

౨ వివ -అలఘురేఫమందలి యలఘుత్వము పైరీతి నానాఁటికి మాసిపోవుచుండుటచేతను నుచ్చారణభ్రష్టమగుచుండుటచేతను దానిని దెలిసికొనుట సుకరము కాదు. అది కోశములవలసఁ దెలియఁ దగియుండును. కాన నిటు గొన్ని ముఖ్యశబ్దములు ప్రదర్శింపఁబడును -అందఱు-అక్కఱ-అఱచు-అఱవము-అఱుఁగు=(జీర్ణించు)-

* నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్ (ఆం-చిం). అనయో స్సంగతి యస్తు కరోతి కవితాకృతౌ అస్యా అత్యన్తదుష్టత్వా ద్దుష్కవి స్సహికథ్యతే (వికృతివివేక) (చూ-వ్యా-సం-౫౯ విష)

† లఘుర్భవే ద్గురుః కుత్రచి ద్గురుశ్చ లఘుర్భవేత్ ఉచ్చారణస్యకల్ప్యత్వా న్నిదానం తత్ర సద్వచః (వ్యా-సం-౫౯ I విష)

అఱువది-ఆఱు=(౧౦౬ సంఖ్యకుపయోగించెల్లు)-ఇందఱు-ఇద్దఱు-ఇఱుకు-ఈడేఱు-ఉఱుకు-ఉఱుము-ఊఱు=(ఊటయూరు)- ఎందఱు-ఎఱుఁగు-ఎఱుపు-ఏఱు = (నది)-ఒఱగు-కఱ = (నల్లనిది) కఱచు=(కొఱుకు-అభ్యసించు)-కాఱు=((స్రవించు)-కుఱుచ-కొందఱు-కొఱకు= (చతుర్థీ ప్రత్యయము-కార్యమునకు ) కొఱంత-కొఱుకు-గఱి=(ఱెక్క)-గఱిక-గీఱు- గుఱించి- గుఱుతు- గొఱుగు- చిఱుత- చుఱుకు-చూఱ- చెఱ-చెఱకు- చెఱుచు-తఱచు-తీఱు=(నశించు)- తెఱఁగు- తెఱచు- తెఱపి-తేఱు=(మీఁదికిఁ దేఱు) = దగ్గఱ-నఱకు-నాఱు-నిగుఱు-నూఱు=(శతము-పొడిచేయు)- నెఱ=(నిండైన)- నెఱవేఱు- నెఱి=(గమ్య) పఱచు-పఱుచు-పాఱు= ((ప్రవహించు-పరుగిడు)- పిఱుఁదు- పెఱ = (అన్య)-బయలుదేఱు-మఱక-మఱచు-మఱుఁగు = (చాటు-ఉడుకు)-మఱునాఁడు-మాఱు-మీఱు=(అతిక్రమించు) మెఱయు ఱాయి-ఱెక్క-ఱేఁడు-వఱకు-విఱుగు- వెఱ- వెఱచు- వేఱు.

సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు ౨౦-
(బా-సం-౧౯) (వ్యా-సం-౫౮ విష)

| సంస్కృతము—సంస్కృతసమము | సంస్కృతము—సంస్కృతసమము |
|---|---|
| రామః — రాముఁడు | పితా — పిత |
| విద్యా — విద్య | గౌః — గోవు |
| హరిః — హరి | నౌః — నావ |
| ధేనుః — ధేనువు | ద్యౌః — దివి |
| భూః — భువి | జగత్ — జగము |

ఇత్యాదు లూహ్యంబులు

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆలిః (పంక్తి) | ఓలీ | ఓలి |
| గౌరవమ్ | గారవం | గారవము |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
| --- | --- | --- |
| జటా | జడా | జడ |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది *

౧ వివ —ఆంధ్రవిభక్తియోగము, తన్నిమిత్తకములగు మార్పులును దప్ప నితరములగు మార్పులు శబ్దావయవమున జరుగని సంస్కృతశబ్దములు సంస్కృతసమములు అట్టి ప్రాకృతశబ్దములు ప్రాకృతసమములు ఉదా :—సం-సమ-రాముఁడు=(రామ). పిత-(పితృ-పితా). రాజు = (రాజన్-రాజా)-బుద్ధిమంతుఁడు=(బుద్ధిమత్-బుద్ధిమాన్)-భువి=(భూః)-అంతము = (అన్తః-చూ-సంజ్ఞా ౪ సూ-౧ వివ)

౨ వివ :—కవిప్రయుక్తములె (చూ-సంజ్ఞా ౨ సూ-3 వివ.) ప్రాకృతసమములు గ్రాహ్యములు. ప్రాకృతసమములును నాచ్ఛికములె. (చూ-అచ్చి-౧ సూ). సిరి=(శ్రీ) మొ.

---

* 'ఆడి=(ఆటి-పర్యాయశబ్దము)=(శరారిపక్షి)' శబ్దము సంస్కృతమునఁ గలదు. కాన 'ఆడి' సంస్కృతసమమె కావచ్చును. సూరి ఆడి' అను ప్రాకృతశబ్దము నుదాహరించి ఆడి' ప్రాకృతసమమననేల ? సూరి యుదాహరించిన మిరా=(మేర) శబ్దము సంస్కృతకోశములలోఁ గానరాదు. 'కారము" క్షారశబ్దభవమని ప్రౌఢవ్యాకర్త యుదాహరించెను. (ప్రౌఢ-సంజ్ఞా-౧౦ సూ). ఇదియు వివాదగ్రస్తమె, (చూడు-వ్యా-సం-౫౯ IV-దీని విస్తరము.) సూరి సంస్కృతసమముగా నుదాహరించిన జగత్తు' అను రూపాంతరము కవి ప్రయోగములలోఁ గానరాదు. జగమనియె తత్సమరూపము గనంబడును.

సంస్కృత ప్రాకృతభవంబగు భాష తద్భవంబు. ౨౧ (౭౮-సం-౨౦ సూ) (వ్యా-సం-౫౯ విమ)

| సంస్కృతము- సంస్కృతభవము | సంస్కృతము-సంస్కృతభవము |
|---|---|
| ఆకాశః — ఆకసము | వక్రః — వంకర |
| కుడ్యమ్ — గోడ | వేసరః — వేసడము=(ఆడుగుఱ్ఱము న గాడిదవలనఁ బుట్టినది |
| చన్ద్రః — చందురుఁడు | సముద్రః — సంద్రము |
| తమఙ్గః — తమగము=(మంచె) | సూచీ — సూది |
| తామరసమ్ — తామర=(పద్మ) | స్మరః — మరుఁడు |
| నారాచః — నారసము | హరణమ్ — అరణము |
| నిభః — నెపము=నెవము | హరితాళమ్ — అరిదళము. |
| ముఖమ్ — మొకము=మొగము | |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| అఙ్గారః (నిప్పు) | ఇంగాలో | ఇఁగలము (బొగ్గు) |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ (ఏఁబది) | పణ్ణాసా | పనస (మంత్రమం దేఁబది పదము లుండును) |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము=పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
| --- | --- | --- |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

౧ వివ :—సంస్కృత ప్రాకృత శబ్దావయవములందు వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణలోప- వర్ణవ్యత్యయ- వర్ణప్లుతి- వర్ణభిన్నతాది వికారములు గల్గుటచే నేర్పడునవి తద్భవశబ్దములు. ఉదా :—ఆగమ- (సం)-రథః-(తద్భ) అరదము. పదాదిని అ' వర్ణాగమమయ్యెను. ' మిత్రవదాగమః" వర్ణవృద్ధి యాగమము. ఇందు వర్ణాగమమె కాక 'థ' కారమునకు ద' కారాదేశమయ్యెను. ' శత్రువదాదేశః' ఒక వర్ణముచోట మఱొకవర్ణము నిల్చుట యాదేశము. (సంధి-౮ సూ. చూ)-ఆదేశము-(సం) ఆకాశః-(తద్భ) ఆకసము. కకారదీర్ఘమునకు హ్రస్వాదేశమును, శ వర్ణమునకు 'స' కారాదేశము నయ్యెను లోపము-(సం) తామరసమ్- (తద్భ) తామర. 'స' కారలోపము కల్గెను వ్యత్యయము-(సం) పారావతః-(తద్భ) పారువము పావురము ఇందు ర-వ' లకు స్థానవ్యత్యయమును స్వరాదేశమును గల్గెను. ప్లుతి-ఏడు + పది=డెబది=డెబ్బది. ఇందు 'ప' అను వర్ణమునకు డకారముమీఁదికి ప్లుతి గల్గెను. కొన్ని యాదేశములును గల్గెను. భిన్నత- (సం) వక్రః-(తద్భ) వంకర. ఇందలి 'క్ర' అనునది 'కర' అను భిన్నత నందెను. అనుస్వారాగమమును గల్గెను సంయుక్తవర్ణముల నడుమ యుచితస్వరము నిల్చుటచే భిన్నత గల్గును.

౨ వివ :—'అఙ్గారః= ఇఙ్గాలః' అను రెండు శబ్దములును రెండర్థములందును (అగ్గి-బొగ్గు) సంస్కృతమునఁ గలవని సంస్కృతకోశములు నుడువుచున్నవి. (చూ. వ్యా. సం. విస్తర I. ౬౦ I విమ). ప్రాకృతశబ్దములు సంస్కృతమున ననేకములు చేరినవి. (ప్రాకృ- కల్హార-(సంస్కృత) కహ్లార. (ప్రాకృ) పట్టణ-(సంస్కృ) పత్తన. సంస్కృతమందును 'కల్హార-పట్టణ' శబ్దములు చేరినవి.

3 వివ :—"ఖంభో-థంభో" అను ప్రాకృతశబ్దములు సంస్కృత 'స్తమ్భ' శబ్దమునుండి యేర్పడెనని ప్రాకృతవ్యాకరణములు వచించును. కాని 'కమ్భః' అను సంస్కృతశబ్దమే కలదని సంస్కృత వ్యాకరణములందుఁ గలదు.

4 వివ :—ప్రాకృతపద్ధతి విలక్షణములగు వికృతులుగలవి కేవల సంస్కృతభవములనియుఁ బ్రాకృతపద్ధతిగల వికృతులుగలవి సంస్కృతభవ ప్రాకృతభవములనియు నెఱుంగునది. ఉదా :— సముద్ర' శబ్దము ప్రాకృతములోనికి వచ్చినచో సముద్దో' యగును. తెల్గున 'సముద్దము' కావలెను. అట్లుగాక 'సంద్రము' అయ్యెను గాన నది కేవల సంస్కృతభవముగా నెన్నఁబడెను. ఇట్టి యట్టి భేదమును గ్రహింపవలెను

5 వివ :—మహాకావ్యప్రయుక్తములగు పెక్కు తద్భవశబ్దములు శబ్దరత్నాకరాదికోశముల కెక్కలేదు. వానిలోఁ గొన్ని గ్రామ్యములనుచు ననింద్యగ్రామ్యములుగాఁ గోశములం దంగీకరింపఁబడెను.

| సంస్కృత - తద్భవము | సంస్కృతము - తద్భవము |
|---|---|
| వాల్మీకేశ-వాలుమీకేసుఁడు | రూఢి-రూడి |
| త్రయోదశ-తేరస | సంబోధన-సంబోదన |
| తపోనిధి-తవనిది | నిర్ఋతి-నిరుఋతి |
| తపోరాజ-తవరాజు | ఉపాధ్యాయ-ఉపద్దెయుఁడు |
| పృథివీశ-పుడమీసుఁడు | తథ్యము-తద్దె |
| భక్త-బగుతుఁడు | నిత్యము-నిత్య-నిచ్చ |
| మజ్జన-మజ్జనము | ధర్మకపిల-దమ్మకవిల-ధర్మార్థము విడిచిన కపిలగోవు |
| దాసుఁడు-దాసి | నిర్జీవి-నిజ్జీవి |
| శంకరదాస-సంకరదాసి | శ్రీమహాదేవుఁడు-సిరిమహాదేవుఁడు |
| శివుడు-సివుఁడు | |

| సంస్కృతము - తద్భవము | సంస్కృతము - తద్భవము |
|---|---|
| శమ్భుఁడు-సంబుఁడు | కార్యము-కర్జము-కజ్జము |
| ఈశ్వరుఁడు-ఈసరుఁడు | ఉజ్జయని-ఉజ్జని |
| భస్మానన్-బసుమానన్ | ఆశ్చర్యము - అచ్చరువు-అచ్చెరువు |
| ఉద్భటుఁడు-ఉదుబటుఁడు | కాళహస్తి-కాళాత్తి |
| విరూపాక్షుఁడు-విరుపాచ్చుఁడు | శ్రీ-సిరి-తిరు |
| ఉద్దేశించు-ఉద్దెసించు | |

ఇత్యాదులు పెక్కుగలవు.

త్రిలింగదేశవ్యవహారసిద్ధమగు తత్సమ తద్భవేతరభాష దేశ్యము. * ౨౨. అది రెండువిధములు,— ౧ ఆంధ్ర దేశ్యము. ౨. అన్యదేశ్యము- (బా-సం-౨౧.) (వ్యా-సం-౫౯ వివ). ౧. ఆంధ్రదేశ్యము :—ఇల్లు-ముల్లు-దూడ-మేడ-కోఁత- లేఁత- రెండు-మూఁడు-తావి=(పరిమళము) మోవి=(క్రింది పెదవి) ౨. అన్యదేశ్యము .—తురుష్కులు-ముసలిమానులు- బిబ్బీలు-కుతుపసాహి-సికారు-పాయిదా-మొ. ఆంగ్ల : పీజు-రైలు-రోడ్డు- కలెక్టరు-మొ. (చూ-సంజ్ఞా 3 సూ-౬ వివ.)

౧ వివ :—రసాయనశాస్త్రాదుల నాంధ్రీకరించుటలో నాంగ్ల సంజ్ఞలనె ప్రాయికముగా వాడుట యుక్తము. వానికి సరియగు నర్థములుగల తెలుఁగు శబ్దములను గల్పించుట సరికాదు.

౨ వివ :—కొన్ని తద్భవశబ్దము లాంధ్రదేశ్యములుగ శబ్దరత్నాకరాది కోశములలోఁ బ్రమాదమున నుదాహృతము లయ్యెను. ఉదా :—

---

* తత్సమతద్భవములును ద్రిలింగదేశవ్యవహ్రియమాణములె కాన సూరి 'తత్సమతద్భవేతర' అను దళము నిల్పకుండుట సరికాదు. తనకాలమున విస్తరించి మహాకావ్యములలోఁ జేరియున్న యన్యదేశ్యము నుదాహరింపకుండుటయు సరికాదు.

| సంస్కృతము | ప్రాకృతము | తద్భవము |
|---|---|---|
| వింశతి | వీసా | వీసము |
| శబర | సవరో | సవర |
| శాప | సావో | చావు |
| మహాన్ | మహో | మగ |
| శీర్షకమ్ | సీసఅం | సీసము |
| షోడశ | సోలస | సోల |
| జ్ఞానమ్ | ణాణం | నాణెము |

ఇట్టివి పెక్కుగలవు

౩ వివ.—త్రిలింగశబ్దభవము= తెలుంగు=తెలుఁగు. శ్రీశైల ము-ద్రాక్షారము-కాళేశ్వరము అను క్షేత్రములలోని శివలింగ ములే యీ త్రిలింగములు. అవి సరిహద్దులుగాఁగల దేశము ప్రాచీన త్రిలింగదేశము. (చూ-వ్యా=సం-విస్త III ౬౧ II వివ). ఆంధ్రు లనఁగా మహావీరులు శత్రుల నంధులనుగాఁ జేయు శక్తిగలవారు. వీరు ద్రావిడజాతులలోనివారు. విశ్వామిత్ర శప్తులగు తత్పుత్రు లార్యజాతులలోని యంధ్రులు. మనుస్మృతి యార్యజాతుల విభాగ మును వచించునది కాన నందలి సంకరజాతివారగు నంధ్రులు ద్రావిడజాతిలోని యాంధ్రులు కానేరరు ఇట్టి శబ్ద సారూప్య భ్రమచేతనె ద్రావిడాంధ్రశబ్దము శాసనములకెక్కకుండె ననఁదగును.

మహాకవి కర్తృక వ్యాకరణ సమ్మతమేని మహాకావ్య ప్రయుక్తమేని కాని-యట్టిది కావ్యములందు వాడరాదు.

౨౩ (బా-సం-౨౨ సూ) (వ్యా-సం-౧ IVవివ. ౬౨ వివ )

వస్తాడు- తెస్తాడు-వచ్చేని- తెచ్చేని- వచ్చేటివాడు- తెచ్చేటివాడు* మున్నగునవి కావ్యప్రయోగార్హములు కానేరవు.

౧ వివ :- వస్తాడు' మున్నగునవి నాగరక పండితవ్యవహారములో వెలయుచున్నను నట్టివి ప్రామాణిక వ్యాకరణసమ్మతములు కామింజేసియుఁ బ్రామాణిక మహాకావ్యప్రయుక్తములేని కామింజేసియుఁ గావ్యాదిప్రయోగార్హములు కానేరవు. ఇట్లనుటచేత నట్టివి రేడియోవ్యవహారములందును, వార్తాపత్రికలందును, దెలుఁగుపండితులుకానట్టి యపండితులగువారు రచించు రసాయనశాస్త్రాది గ్రంథములందును బ్రయుక్తములైనం గావచ్చును. 'తేదీన' మున్నగు వ్యవహారమందును లేని కృతకశబ్దము లెందును బ్రయోజ్యములు కానేరవు. మీఁద నుదాహరించిన వ్యావహారికభాషామయగ్రంథములలో నరసున్నలు శకటరేఫములు వాడుకలోలేని సరళాదేశములు మున్నగు కావ్యభాషామాత్రప్రయోజ్యముల నచ్చటచ్చటఁ బండితమ్మన్యులు నిల్పుట పొరపాటు. ఇంక 'వచ్చినుండును' మున్నగు సంహితా యకారస్థానీయద్రుతప్రయోగములు మున్నగునవి నిల్పరాదని వేఱ చెప్పనేల?

౨ వివ.—మహాభారతాది గ్రంథములలోని ప్రక్షిప్తప్రయోగాదు

* సామాన్య కవికృతి లక్ష్యలక్షణములకు సమ్మతమయినను సాధువు కానేరదు. మహాకావ్యప్రయుక్తముల ననింద్యగ్రామ్యములనుట సరికాదు. మహాకావ్యప్రయుక్తములు గ్రామ్యములు కానేరవు వానిని వ్యాకరణములలోఁ జేర్చుకొనవలసినదే. సూరి భ్రమించి కపిలగడ్డము' మున్నగునవి యనింద్యగ్రామ్యములని వ్రాయుట పొరపాటు. అవి భారతప్రయుక్తములు కావు. 'కపిలగడ్డము' మున్నగునవి భారతప్రయుక్త సాధురూపములు. 'వస్తాఁడు' మున్నగునవి గ్రామ్యరూపములనుచు వానిలో ఖండమును సూరి నిల్పుట యసంగతము.

లను బట్టి తత్తత్కవిసమ్మతములు గావనగినవి తత్తత్కవిప్రయుక్తములని భ్రమింపరాదు. ఉదా: నన్నయ భారతభాగమున 'ద్రుత ను' స్వరూపము మొ. నన్నయ ద్రుతమును న' కారరూపముగనే ప్రయోగించెను.

ప్రామాణికులు స్పష్టప్రతిపత్త్యాదికమునకై బుద్ధిపూర్వకముగా నిల్పిన లక్షణవిరుద్ధప్రయోగము లనింద్యగ్రామ్యము లనఁదగును ౨౪ (బా-సం-౨౩ సూ)

అ-ఆ-ఇ-ఈ' మున్నగురీతిని శాస్త్రీయ సంధికార్యరహితముగా వర్ణసమామ్నాయమును జూపుట, స్పష్టప్రతిపత్తికయి యుద్ధరణ చిహ్నములనడుమ "అందియుంజె' అనురీతిని సంధికార్య విరహితముగఁ బ్రయోగించుట మొ. పరా' మున్నగురీతి నన్యదేశ్య పదములను నర్థస్ఫూర్తికయి తెల్గున వాడునపు డనాంధ్రవర్ణముల నిల్పుట, (అట, 'సరా' అని నిల్పినచో నర్థస్ఫూర్తి కలుగదు.) ఖుక్షా' మున్నగువానిలో ననాంధ్రవర్ణ ప్రయోగముచేయుట, యచ్చాంధ్రకావ్యములలో సంస్కృతసమములను (సంజ్ఞావాచకాది) వాడుట మున్నగునవి యనింద్య గ్రామ్యములు.

## ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

## బాలవ్యాకరణోద్ద్యోతము-సంధిపరిచ్ఛేదము.

వివరణము :- సంధిశబ్దార్థములు :-'I సంధానము. II సంధ్యాధ్యాయోక్త వివిధకార్యములు III వాక్యగతశబ్దములకు సహజముగానుండవలసిన యర్ధమాత్రాకాలిక వ్యవధానముండునట్లు పలుకునప్పటి ధ్వనుల సాన్నిధ్యము' అను మూఁడర్థములు సంధిశబ్దమునకుఁ గలవు.

సంస్కృతమున వాక్యమునందు సంహిత (సన్నిధిగాఁ బల్కుట) వైకల్పికము. * కాన విసంహితగా ననఁగా నర్ధమాత్రా

---

* సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః నిత్యా సమాసే వాక్యేతు సా వివక్షా మపేక్షతే

కాలముకన్న నెక్కువ యెడముగా వాక్యగతపదములను బలుక వచ్చును. అనఁగా వక్త కిష్టమగునపుడు సంధికార్యములు వర్తిల్లవు. ఉదా – తస్మాత్ ఏవమ్ సః వక్తి." ఇందు సంహితను వివక్షించి నచో తస్మాదేవం స వక్తి" అని సంధికార్యయుక్తముగాఁ బల్కవలయును.

తెల్గున నట్లుకాదు. వాక్యమున సంహిత నిత్యము కాన వాక్యమధ్యమున సంధికార్యములు తప్పక వర్తిల్లును. (వ్యా-సం-౬౮-౬౮I విమ) (చూ. సంధి, ౫౦ సూ) తెలుఁగున స్వరసంధి సాధారణముగాఁ బరరూపసంధిమాత్రమే

ఉత్తున కచ్చు పరమగునపుడు పరరూపసంధి నిత్యము. ౧ (బా-సం-౧.) (వ్యా-సం-౬౫-౬౫I విమ)

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట స్వర సంధి యనంబడు. ఉదా .– రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు. సోముఁడు + ఇతఁడు-సోముఁడితఁడు మనము + ఉంటిమి=మనముంటి మి అతఁడు + ఎక్కడ=అతఁడెక్కడ ఇతఁడు+ఒకఁడు=ఇతఁడొకఁడు. నేను హరిని + అనెను=నేను హరి ననెను . వచ్చెను + అతఁడు=వచ్చెనతఁడు * మొ

౧ విమ :–ఉత్=ఉత్తు దీని తుది తకార మిద్వర్ణము ఏ యచ్చునకైనను 'త' కార మిద్వర్ణముగా నిల్చినపుడా యచ్చె కాలముననుండునో యాకాలమునకే సంజ్ఞయగును.

---

* సూరి "వచ్చెను + అతఁడు=వచ్చెనతఁడు" అను రీతిగల ద్రుతోకారసంధుల నుదాహరింపలేదు 'ను-న్' అనునవేకదా ద్రుతస్వరూపములు. ద్రుతమునకు స్వరపరకత్వమున ద్రుతెస్వర లోపమున కింతకంటె మార్గాంతరము లేదుగదా.

తపర స్తత్కాలస్య. (౧-౧-౭౦). తః పరో యస్మాత్ సచ తాత్పరశ్చ ఉచ్చార్యమాణసమకాలస్యైవ సంజ్ఞా స్యాత్"

౨ వివ.—'హరిని+అనెను=హరి వనెను' మున్నగు చోటులందును నీ సూత్రపరరూపసంధివిధి వర్తిల్లును. 'ను' కు' అనువాని నుండి'యే ౧-కి' (తత్స ౨౬ సూ) అనునవి యేర్పడెను.

పదాద్యంబులు 'ఋ-ౠ' వర్ణంబులు 'ర-ల' తుల్యంబులు. ౨. (బా-ప్రకీ-౧ సూ) (వ్యా-సం-3౭౭ వివ.)

అతఁడు+ఋషి=అతఁడు ఋషి. ఇట సంధి లేదు. ఆ+ఋషి=ఆ ఋషి-ఇట యడాగమము లేదు. వచ్చెను+ఋషి=వచ్చెఋషి=వచ్చెన్ ఋషి=వచ్చెను ఋషి. ఇట ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వములు వచ్చెను.

'నీ-నా-తా-శబ్దముల ద్వితీయావిభక్తిరూపములు, చతుర్థ్యాదివిభక్తిప్రత్యయములు, శత్రర్థక 'చు' వర్ణకము' అనువాని ద్రుతోకారములకు స్వరము పరమగునపుడు ద్రుతలోపపూర్వక పరరూపసంధి వికల్పముగ నగును. 3. (బా-సంధి-౨. (వ్యా-సం-౬౬౹. II వివ) *

నన్నును+అడిగె = నన్నడిగె = నన్ననడిగె. నాకొఱకును+ఇచ్చె=నాకొఱకిచ్చె = నాకొఱకునిచ్చె. నాకును+ఆదరువు=నాకాదరువు=నాకునాదరువు. నాయందును+ఆశ = నాయందాశ=నాయందునాశ. ఇందును+ఉన్నాఁడు=ఇందున్నాఁడు=ఇందునున్నాఁడు. ఎందును+ఉంటివి=ఎందుంటివి=ఎందునుంటివి. వచ్చుచును+ఉండెను=వచ్చుచుండెను=వచ్చుచునుండెను. చూచుచును+ఏఁగెను = చూచుచేఁగెను=చూచుచు నేఁగెను. అంతటను ద్రుతలోపపూర్వక పర

---

* బాలవ్యాకరణపద్ధతిలో 'ను' వర్ణము ద్రుతస్వరూపమగుటచేత 'నాకున్+ఆదరువు' అనురూపమె యసంభవమగును. 'నాకును' అనుదానికి స్వరపరకత్వమునఁ బరరూపసంధి యగునేకాని 'నాకాదరువు' అనురూప మెట్లు కల్గును ? ద్రుతస్వరలోప మెట్లు ?

రూపసంధి రానిపక్షమున సంధి ౧ సూత్రము చొప్పున ఉ' కార పరరూపసంధి వర్తిల్లును.

౧ వివ :– వచ్చుచున్నాఁడు' మున్నగు సమాపకక్రియాసమాసపదములందలి 'చు' వర్ణము శత్రర్థక 'చు' ప్రత్యయముకాదు. (చూ–క్రియా ౨౧ సూ). అది ద్రుతప్రకృతికమెకాదు. అచట సంధి ౧ సూత్రము చొప్పున నిత్యపరరూపసంధియె యగును.

౨ వివ :– 'అందును' మున్నగునవి సప్తమ్యర్థకములైన ప్రత్యేక ద్రుతప్రకృతిక పదములు క. ఎం దును...(ప్రాసము) (శాంతి ౨ ఆ ౧౨ర). (చూ–వ్యా–సం–౬౬ II విమ).

3 వివ :–ఆచ్ఛి ౨౭ సూత్రముచొప్పున 'నన్నును–మమ్మును' మున్నగుచోటులందలి జెడ్డకు స్వరయోగమున లోపము గల్గనేరదు గాన ననేలె–మనేలె' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు.

సంధిలేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ర. (వ్యా. సం. ౬౭ విమ) (బా. సంధి. 3 సూ).

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు ఉదా :–మా+అమ్మ=మా యమ్మ. మీ+ఇల్లు=మీయిల్లు. మా+ఊరు=మాయూరు.

౧ వివ :–టకార మిద్వర్ణముగాఁగలది పూర్వావయవము గాను 'క' కార మిద్వర్ణముగాఁగలది యంత్యావయవముగాను నిల్చును *

౨ వివ :–తమిళాదులందువలె 'వ' కారము సంహితావ్యవ

* 'ఆద్యన్తౌ టకితౌ' (౧–౧–౪౬)=టిత్ కితౌ యస్యోక్తౌ తస్య క్రమా దాద్యన్తావయవౌ స్తః. (సి.కౌ.3౬ సూ.) 'మిత్రవదాగమః–శత్రువదాదేశః' అను చొప్పున నాగమమున వర్ణవృద్ధియగును. ఆదేశ మొకదానిని ద్రోసివేసి దానిచోట నిల్చును. (చూ ౨౧ సూ ౧ విమ సంజ్ఞా).

ధాయకముగఁ బదాంతమునఁ దెల్గున నిల్వనేరదు. కాని సమానపద మధ్యమునఁ గొన్నియెడల నది నిల్చుట గలదు ఉదా :—చతుర్థి-చ+ఉ+తి=చవుతి. చిగురు —చి+ఉ+రు=చివురు. గెలుచు+అన్=గెలు+ఉ+అన్=గెలువన్ (వ్యా-సం-విస్త II ౬౭౹ విష) (చూ ౧౮ సంజ్ఞా) ఇదె లఘువకారము (చూ-౧౮-౧౯ సంజ్ఞా సూ-వివృతి).

అత్తునకు సంధి బహుళముగానగు ౫ (బా-సంధి-౫ సూ) (వ్యా-సం-౬౮ విష)

౧ విష —బహుళమనఁగా — తఱచుగా I వైకల్పికత II కొన్నిచోట్ల వర్తిల్లకుండుట III కొన్నియెడల నిత్యముగావచ్చుట. IV కొన్నిచోటులందు వేఱువిధమగు కార్యము గల్గుట ఈ నాల్గిటిలో నేదైన యథాసంభవముగా వర్తిల్లును బహువిధములగు నర్థములుగలది బహుళ మనఁబడును.

౨ విష —సంధివైకల్పికత గలచోటులు ౧ వ్యతిరేకక్త్వార్థకము - చూడక+ఉండె=చూడకుండె-చూడకయుండె. ౨ భావార్థక ట' ప్రత్యయము —ఉండుట+ఏల=ఉండుటేల ? ఉండుటయేల ? 3 ధాతుజవిశేషణములు :— చేసిన+అతఁడు = చేసినతఁడు = చేసిన యతఁడు ౪ స్నేహాదిశబ్దములు .— మేన+అత్త=మేనత్త= మేనయత్త ౫ షష్ఠీసమాసస్థలములు —రాజుల+ఒద్ద=రాజులొద్ద=రాజులయొద్ద చింత (యొక్క)+ఆకు=చింతాకు=చింతయాకు. తమ (యొక్క)+అంత=తమంత=తమయంత లేనెల (యొక్క)+అంత=లేనెలంత=లేనెలయంత మేక (యొక్క)+ఎరువు=మేకెరువు=మేకయెరువు ఈ షష్ఠీసమాసస్థలములలో— అవర్ణస్థలములు తప్పఁ దక్కినవి... భారతాది ప్రాచీనగ్రంథములలోఁ గానరావు

౩ విష —సంధి వర్తిల్లని చోటులు —భారతాది ప్రాచీన గ్రంథములలో శుద్ధసంస్కృతాకారముకును స్త్రీవాచక తత్సమ సంబోధనాంతముల అ' కారమునకును సంధి లేదు- అర్వాచీన కావ్యములందట్టి సంధులు గలవు

శుద్ధసంస్కృత :—కం .. వరదాయ నమ శ్శంకర శరణన జొచ్చెన్. (నన్ని-కు-3ఆ-౨౭౭). (శుద్ధసంస్కృత వాక్యమగుటచే, 'శరణ' అని పదచ్ఛేదము చేయకతీరదు). శరణు' అని పదమును ఛేదింపరాదు

తెత్సమ స్త్రీవాచక :— మహాత్త+అణఁగి=మహాత్త యణఁగి" అని ప్రాచీనపద్ధతి. 'మహాత్తణఁగి' (బసవ ౬ ఆ ౭౪౬). ('మహాత్తు' ఉనునది వ్యావహారిక పదము). వార్త+అని=వార్తయని' అనునది (ప్రా) వార్తని-(బసవ ౫ ఆ-౪౬౬౬౫). గంగ+అను=గంగయను' అనునది (ప్రా). గంగను కాసె (ఆము-౨ ఆ ౯) 'శ్రీరంగభర్త+అంచు=శ్రీరంగభర్తయంచు' అనునది (ప్రా). శ్రీరంగ భర్తంచు (ఆము-౬ఆ) నెలఁతే+ఇచ్చె=నెలఁతయిచ్చె (ప్రా). నెలతిచ్చె (ఆము) చేష్ట+ఉడిగె=చేష్టయుడిగె' అనునది (ప్రా). చేష్టుడిగె (ఆము ౪ఆ)

సంబోధనాంత —(అప్ప+అల=అప్పల (ఉ. హరి ౨ ఆ ౧౬) (ఓ యప్ప') (ప్రా)) అమ్మలార+అక్కలార='అమ్మలార యక్కలార' అనునది (ప్రా) అమ్మలారక్కలార (బసవ ౫ ఆ ౧౨౫). జయనులార+ఎన్నఁడు='జయనులార యెన్నఁడు' అనునది (ప్రా) జయనులారెన్నఁడు-(బసవ ౬ ఆ 3౯౨).

3 విన-సంధి నిత్య స్థలములు :—ప్రత్యయాచ్చరకత్వమందును (అందు అవ' తప్ప. సీతయందు-ఎనిమిదియవ) నామ్రేడిత పరకత్వమందును-బూజ్యార్థకశబ్ద (అన' ము) పరకత్వమందును అ'కార సంధి నిత్యము.

ప్రత్యయాచ్ :—అర్థ+ఇంచు=అర్థించు. (ఇది శుద్ధసంస్కృత సంధియు) మూర+ఎఁడు=మూరెఁడు. (చూ-సంధి ౧౨ సూ).

ఆమ్రేడితపరకత్వ :— ఔర+ఔర=ఔరౌర (చూ సంధి ౧౧ సూ).

పూజ్యార్థక :—సిద్ధ+అన=సిద్ధన. మల్ల+అన=మల్లన. అన్న+అమ=అన్నమ (ఇవి శుద్ధసంస్కృతాకారసంధులును) (విరా–౧ ఆ ౧౦ ప.) నన్న+అయ=నన్నయ. (ఆది–౧ ఆ ౨౬). (విరా ౧ ఆ ౬). నన్న+అప=నన్నప (ఆది ౧ ఆ ౯). తిక్క+అన=తిక్కన.

ఏమ్యాదుల యిత్తునకు సంధి బహుళము. ౬.
(బా–సం–౫) (వ్యా–సం–౭౦ వివ).

౧ వివ :—ఇత్తున కనఁగా హ్రస్వమగు 'ఇ' కారమునకు. 'కును' అను షష్ఠియె 'కిని' అని తత్స ౨౬ సూ. చెప్పిన మాఱును గాన "హరికిని+ఇచ్చె=హరికిచ్చె=హరికినిచ్చె" అనురీతివి సంధి 3 సూత్రముచేతనె సిద్ధించును గాన దానిని 'ఏమ్యాదు'లలోఁ జేర్ప రాదు, ఏమ్యాదిగణ మాకృతిగణము. ఈ శబ్ద మీగణములోనిదని పఠించుటకు వీలగు గణము పఠితగణము. అట్లు పఠించుటకు వీలుకాని ప్రయోగములను బట్టియె తెలిసికొనఁదగినది 'ఆకృతిగణము'.

౨ వివ :—వైకల్పికస్థలములు :—ఇది+ఏమి+ఒకొ=ఇదియేమి యొకొ (అర 3 ఆ ౨౧౨)=ఇదేమొకొ. ఏమి+అపూర్వము= ఏమి యపూర్వము (ఆది ౧ ఆ ౧౨౬) ఏమపూర్వము. నీపేరేమి+ఈవు=నీ పేరేమీ వెవ్వరి తనూజవు (ఆది ౮ ఆ ౧౨౯). ఇవి+ఏనున్=ఇవేనున్=ఇవియేనున్ (ఆది ౧ ఆ ౧౨ ప.) తెలివి+ఒంది= తెలివొంది=తెలివియొంది. తెలివి+ఆత్మ=తెలివాత్మ. (కర్ణ 3 ఆ ౨౯౨) = తెలివియాత్మ. సవతి+ఆలు=సవతాలు=(అను ౫ ఆ ౨౯౨) సవతియాలు. కుయ్యి+ఆలింపుఁడు = కుయ్యాలింపుఁడు (విరా–3 ఆ ౨౦)=కుయ్యియాలింపుఁడు. మాటగాని+ఆటగాడు= మాటగాని యాటగాడు=మాటగా నాటగాడు=(ఆశ్ర ౧ ఆ 3౪). మట్టి+ఆకు=మట్టియాకు=మట్టాకు (జైమి–౮ ఆ ౧౪౦). కట్టెఁడి+ఐన=కట్టెఁడియైన=కట్టెఁడైన (నిర్వ ౫ ఆ ౧౦౬). పడతి+అర్ఘ్య= పడఁతియర్ఘ్య=పడఁతర్ఘ్య (బసవ ౪ ఆ ౭౪). వెండి+ఉంగరము=

వెండియుంగరము=వెండుంగరము (హరవి). చేయని+అట్టి=చేయనట్టి=చేయనియట్టి. ఇట్టి 'ఇ' కారసంధులు పెక్కుగలవు. పూజ్యార్థక పరకత్వమందును 'ఇ' కారసంధ్యభావము గలదు-అమ్మాజియమ్మ 'పాండు-౧ ఆ ౬౮ ప). లక్ష్మి+అమ్మ=లక్ష్మమ్మ (పాండు ౧ ఆ ౨౮) 'ఏని' శబ్దసంధియుఁ బాక్షికమె. హరి నేనబ్జజనేని=హరినేనియబ్జజనేని (అహో). ఏనియున్ (సభా ౨ ఆ ౫౮) యులోపము-ఎనిఁ (ఆర ౨ ఆ ౨౨౨) శా. ఎందేడెందము (మను ౨ ఆ ౬౨) (ఎందేనియున్+డెందము) ఇట్టివి ద్రుతప్రకృతికములు కావు. ద్రుతోపజీవిశబ్దములు (చూ-సంజ్ఞా ౧౨ సూ 3 వివ).

3 విన :-సంధ్యభావస్థలములు :-భావార్థక 'మి' జ్యంతములు. ధాతుజవిశేషణములగు 'ఎడి' ప్రత్యయాంతములు మొ. ఉదా : చేయమి+ఉచితము=చేయమియుచితము. చేసెడి+అతఁడు = చేసెడియతఁడు. మొ. తత్సమేకారసంధులు-క్త్వార్థకేకారసంధులు-షష్ఠీసమాసేకారసంధులును భారతాది ప్రబంధములలో లేవు. అర్వాచీన కవులు ప్రయోగించుచున్నారు.

తత్సమ :-శౌరి+ఇచ్చు=శౌరిచ్చు (అహో ౧౮౯ పు) అర్చి+ఇడఁగరాదు=అర్చిడఁగరాదు (వసు 3 ఆ ౧౮౦) నళినారి+అఁట=నళినారఁట. సౌరభోద్గారి+అఁట=సౌరభోద్గారఁట (కవికర్ణ. 3 ఆ.)

క్త్వార్థక :-ఎటింగి+ఎటింగి=ఎటింగెటింగి. (భాగ ౯ స్క-౦). (ఎఱిఁగియెఱిఁగి. సభా ౨ ఆ ౨౦౪). వెఱచి+ఇట్లు=వెఱచిట్లు (నిర్వ-౫ ఆ ౮౮). చెప్పి+ఇంపఁడె=చెప్పింపఁడె. (ప్రభా ౪ ఆ ప్రౌఢ). కలిగి+ఉండు=కలిగుండు. (బసవ ౬ ఆ-౮౨౬).

షష్ఠీసమాస 'ఇ' కార :- మగని+ఆలు=మగనాలు- (కాశీ. ౨ ఆ ౮3). మగనియాలు (నిర్వ-౫ ఆ-౯౮). (విజ్ఞా-ప్రాయ-౧౦౫.) దీని (యొక్క)+అంగ్రములు=దీనంగ్రములు (నైష-3 ఆ ౨౦౨). వాని (యొక్క)+అన్న=వానన్న=(నరస ౪ ఆ ౬౮).

సమాపకక్రియలం దిత్తునకు సంధి వైకల్పికము.

౭. (బా-సంధి-౬.) (వ్యా-సం-౭౧ విమ.)

వచ్చిరి+అప్పుడు = వచ్చిరప్పుడు=వచ్చిరి యప్పుడు. చేసిరి+అంత=చేసిరంత=చేసిరియంత (ఉద్యో 3 ఆ 3౬ ప) సైరించిరి+ఇట్టి=సైరించిరిట్టి (ఉద్యో౧ ఆ) సైరించిరియిట్టి. (నన్నయమాత్రము ప్రథమపురుషము 'ఇ' కారమునకును సంధి నిత్యమనెను. అట్లైతన భారతభాగమున వాడెను.) వచ్చితిమి+అప్పుడు=వచ్చితిమి యప్పుడు=వచ్చితి మప్పుడు. (ఉద్యో-3 ఆ 3౬. ఆది ౫ ఆ ౨౩౯).

మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధి నిత్యము. ౮. (బా-సంధి-౭) (వ్యా-సం-౭౧ విమ).

ఏలితివి+అపుడు=ఏలితివపుడు. ఏలితి+అపుడు = ఏలితపుడు. ఏలితిరి+ఇపుడు=ఏలితిరిపుడు.

క్త్వార్థంబైన యిత్తునకు భారతమందుమాత్రము సంధి కానరాదు. ౯. (బా-సంధి-౮ సూ) (వ్యా-సం-౭౨-౭౨ I విమ). క్త్వార్థకేకార నేమ్యాదులలో నిది. ఉదాహృతు లచటఁగలవు. (చూ-సంధి-౬ సూ 3 విమ).

ఇఁకాదుల కచ్చు పరంబగునపుడు ద్రుతలోపపూర్వక పరరూపసంధి బహుళముగా నగు. ౧౦ (బా-సం-౯ సూ) (వ్యా-సం-23-23 I విమ. దీనివిస్తర II విమ.) *

* "వచ్చున్+ఇపుడు" అను రీతిగల సూరి యుదాహృతు లసంభవములు. అచట "వచ్చును+ఇవుడు=వచ్చునిపుడు" అను నుకారసంధియే. (సంధి ౧ సూ) వర్తిల్లును. ఇఁకాదులకు ద్రుతలోపము కల్గనిదే సూరిపక్షమున సంధి యసంభవము. 'కననయ్యెడనఘు' (హరి. న. ౮ ఆ ౫౮) సూరియు ప్రౌఢయు సాధింపలేదు.

బహుళ మనుటచేత 'ఇఁకను, ఇంకను, ఇఁగను, ఇంగను' అను శబ్దముల కచ్చు పరమగునపుడును, 'ఎట్టకును' శబ్దమునకు 'ఏల-ఏని' శబ్దములు పరమగునపుడును, "కననయ్యెడును+అనఘ" మున్నగు మహాకవి ప్రయుక్తస్థలములందును ద్రుతలోపపూర్వక పరరూపసంధి వైకల్పికముగా నగును. ఉదా:—ఇఁకను+ఏల=ఇఁకేల=(ఆది ౨ ఆ ౨౧) ఇఁకనేల. ఇంకను+ఐనను=ఇంకైనను (కర్ణ 3 ఆ ౨౭౦)=ఇంకనైనను. ఎట్టకును+ఏలకున్=ఎట్టకేలకున్ (శల్య ౨ ఆ ౪౦౫)=ఎట్టకునేలకు. ఎట్టకును+ఏని=ఎట్టకేని (శాంతి. ౧ ఆ ౧౬౪)=ఎట్టకునేని. ఒనర్పుదును+ఉరుమహిమ=ఒనర్పుదురు మహిమ (హరి-న ౨-ఆ ౫౧)=ఒనర్పుదు నురుమహిమ. దొరయఁజేయుదును+ఏను=దొరయఁజేయుదేను (హరి-న-౨ ఆ 3౮)=దొరయఁజేయుదు నేను. కననయ్యెడును+అనఘ = కననయ్యెడనఘ (హరి-న-౪ ఆ. ౫౮)=కననయ్యెడు ననఘ. చెడఁగొఱుకును+ఇంతెకాక=చెడఁగొఱు కింతెకాక (భాస్కర శతక-౧౮)=చెడఁగొఱుకు నింతెకాక. నగించును+అటుగాక=నగించటుగాక (వేంకటనాథ-పంచ.) (వ్యా-సం-విస్త II 23 I విమ). (బాలకవి శరణ్య. ౨౯ 3-303 పుటలు). నగించునటుగాక. 'కొలిచితబ్ధిజను=కొలిచితినబ్ధిజను. చేసి తచ్యుతార్చనము=చేసితి నచ్యుతార్చనము (అహో ౧౯౪ పు ౧౯౦ పుట.)

అచ్చున కామ్రేడితము పరంబగునపుడు సంధి తఱుచుగనగు. ౧౧. (బా-సంధి-౧౦) (వ్యా-సం-౭౪-౭౪ I విమ.)

ద్విస్త్రిరుక్తంబుల పరరూపము లామ్రేడితము లనఁబడును. 'రక్షింపుమ రక్షింపుమ రక్షింపుమ' (ఆది ౨ ఆ ౨౧౭) తఱుచుగ ననుటచేత నొకానొకచోట సంధిలేమియుఁ గలదని యెఱుంగనగును. ఉదా:- ఔర+ఔర=ఔరౌర. ఆహా+ఆహా=ఆహాహా. ఎట్టూ+ఎట్టూ=ఎట్టెట్టూ. ఓహో+ఓహో=ఓహోహో. ఎదుట+ఎదుట=

ఎట్టయెదుట. (కాశీ. ౪ ఆ. ౧౮౬) ఇది సంధిలేమి కుదాహృతి యనఁ దగును. ♦

అంద్వవగాగమంబులు దప్ప నపదాది స్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు. ౧౨. (బా-సం-౧౧ సూ) (వ్యా-సం-౭౫ I వివ.)

మూర+ఎఁడు = మూరెఁడు. వీసె+ఎఁడు=వీసెఁడు. అర్థ+ఇంచు=అర్థించు. నిర్జి+ఇంచు=నిర్జించు అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది. ఉదా:-రాములందు=రాములయందు. హరియందు. ఎనిమిదవది. ఎనిమిదియవది.

౧ వివ:-'అందు' సప్తమీ ప్రత్యయము. 'అవ' పూరణార్థకతద్ధితప్రత్యయము. అపదాది స్వరము=అపదమనఁగాఁ బ్రత్యయాదిశస్వరము. 'ఏని-ఏసి' శబ్దము లవ్యయములు. అపదములు కావు.

కుఱు-చిఱు-కఱు-నడు-నిడు శబ్దముల 'ఱడ'ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు. ౧౩ (బా-సంధి-౧౨). (వ్యా-సం-౭౬-౭౬ I వి).

కుఱు+ఉసురు=కుట్టుసురు, చిఱు+ఎలుక=చిట్టెలుక, కఱు+ఎదురు=కట్టెదుర్రు, నడు+ఇల్లు=నట్టిల్లు, నిడు+ఊరుపు=నిట్టూరుపు.

---

♦ "ఏమి+ఏమి=ఏమేమి=ఏమియేమి." అని సంధిలేమిని సూరి యుదాహరించెను. 'ఏమియేమి' అను సంధ్యభావమునకుఁ బ్రాచీనమహాకవిప్రయోగ మగపడదు. "ఏమియేమియొ నాఁడు నీ హృదయమందు" అను కళాపూర్ణోదయప్రయోగమున 'ఏమి' శబ్దంబులు రెండును భిన్నార్థకములు గాన నామ్రేడితస్థలము కాదనఁ దగును. 'ఏగియేగి' అనునది భారతమాత్రస్థ క్త్వార్థేకారసంధిరాహిత్యోదాహృతి. అర్వాచీనులు క్త్వార్థేకారసంధిని బ్రయోగించిరి. (సంధి ౬ సూ. 3 వివ. చూ).

౧ వివ :—ప్రాచీనతమ కాలమున 'అ' కారము 'ట-త' మధ్యస్థోచ్చారణము గల్గియుండెడిది. కానఁట 'ట' కారము రావలసెను. 'కుఱుచ-చిఱుత-నిడుద-నడుము' అనువాని కాచ్ఛిక సమాసమునఁ దుదివర్ణము లోపింపఁగా 'కుఱు' ప్రభృతులు యేర్పడెను. అట్టి వానికి 'ఉ'కార పరరూపసంధిగాని (సంధి ౧ సూ) 'టు'గాగమసంధి గాని (సంధి ౨౭ సూ) రానేరవని తాత్పర్యము.' ఉసురు' అనునది 'అ' కార ఘటితమను 'శ-ర' సరికాదు. కన్నడ-ఉసిర్. తమి-ఉయిర్.

౨ వివ:—'కడు' శబ్ద డకారమున కాచ్ఛిక సమాసమున ద్విరుక్త 'ట'కారము వచ్చును. కట్టెదురు. (సభా-౨ ఆ ౯౭). 'కడు నడలున' (సభా ౨ ఆ ౧౨౪) అనునది వ్యస్తస్థలము. ఇట 'కడు+ను' అనునది దుర్నిరోపజీవి శబ్దము. 'ను' శబ్ద మత్యంతాతిశయమును దెల్పును. ఇది ద్రుతప్రకృతికమనెడి 'శ-ర' సరికాదు. 'కట్టుగ్రముగ' (బసవ ౩ ఆ-౪౬౭) అను పాఠము ప్రక్షిప్తము. కట్టుగ్గము 'గ' అను తద్భవపాఠము కవిప్రయుక్తమనందగును. (చూ-౬౦ III వివ-వ్యా-సం.) (చూ. సంజ్ఞా ౨౧ సూ. ౫ వివ).

ప్రథమమీఁది పరుషములకు 'గ-స-డ-ద-వ'లు బహుళముగానగు. ౧౪. (బా-సంధి-౧౩ సూ) (వ్యా-సం-౭౭ మొ. ౭౯ I వివ.)

౧ వివ :—ఈ యాదేశము ప్రథమమీఁదను, ప్రథమాంతశబ్దముల తుదినుండు "గు-వు-రు-వు-ము-డు" మున్నగు ప్రత్యయముల మీఁదను భారతమున నిత్యముగాఁ బ్రయోగింపఁబడినది. (చూ-వ్యా-సం. ౭౭-౭౯ I వివ). "మానుగ-తెల్లగ-తెల్లవాఱు-ఇరువది-అఱువది-ఇరుగడ-నలుగడ" మున్నగువానియందును దీనికి భారతేతర కావ్యములందును నిత్యప్రవృత్తియె. (వ్యా-సం ౭౯ II వివ).

౨ వివ :—కాలక్రమమున మహాకవులు దీనిని ప్రథమమీఁదనే కాక కళాశబ్దములమీఁదను నైచ్ఛికముగఁ బ్రయోగించిరి. కొన్నిట

ప్రథమమీఁదను జేయ లేదు. కాననిది బహుళ ప్రవృత్తి యనఁదగును. ఉదా .—ఆ హాపుట్టింపదె (పిన-శాకుం ౨ ఆ ౧౮౮). రాజ్య। శ్రీవా లింపఁగ (ఉద్యో ౧ ఆ ౧౪౨). వయః శ్రీచన (మను-3 ఆ-౧౦౫). వారణనగరి పురమ తల్లి-(రాఘవ-౧ ఆ ౧). సమదాటోపారి పంక్తి రథుఁడు (రాఘవ-౧ ఆ ౨ ప) (నగరి+పురమతల్లి, సమదాటో పారి+పంక్తిరథుఁడు).

3 వివ :—అప్రవృత్తి .—'అ-ఆ' మున్నగు కాక్వాదిస్వరముల మీఁదను, సంబోధనాంతములమీఁదను, క్త్వార్థకములమీఁదను, ద్వంద్వేతర సమాసములయందును (చూ-౧౬ సూ-౧ వివ), విశే షించి షష్ఠీ సమాసమందును నీయాదేశమున కప్రవృత్తి నంగీక రింపఁదగు. (చూ-వ్యా-సం-౭౮ IV విష.) క-పర్వం। బకడున్ (ఆది ౧ ఆ-౫౮) కీ జే కురువంశమునకు... (ఉద్యో 3 ఆ ౧౭౧). సంబో :-క... కృ। ష్ణా తునిమెద... (కర్ణ ౨ ఆ 3౨౯)మ... చూ।చిత గం భొమ్మని... (ఉద్యో3ఆ౮౦). ఇం।టికడన యున్కి... (విరా 3 ఆ ౧౫౧). చ......పి। న్న తునియలై... (సౌప్తి ౧ ఆ ౯౦) (వ్యా-సం ౭౮ IV విష).

౪ వివ :—తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు 'గ-స-డ-ద-వా' దేశము లేదను సూరిసూత్రి మవిమర్శకృతము. (చూ-వ్యా-సం-౭౮ IV విష). చ. జగము... ఎంత గుమతులైన... (ఉద్యో ౧ ఆ ౨౮౬). శా...వీ ర గ్గోపించిన... (ఉ-హరి-౪ ఆ ౫3) మ... ఇ ట్లు దపంబు... (నిర్వ-౫ ఆ ౮). (వ్యా-సం ౭౮ IV విష). (ప్రౌఢ-సంధి ౫ సూ).

ద్వంద్వంబునం బరంబుపయి పరుషములకు 'గ-స-డ-ద-వ' లగు. ౧౫. (బా-సం-౧౫ సూ) (వ్యా-సం-౭౯.౭౯ I విష).

కూర+కాయ=కూరగాయలు, కాలు+చేయి=కాలుసేతులు, టక్కు+టెక్కు=టక్కుడెక్కులు, తల్లి+తండ్రి=తల్లిదండ్రులు, ఊరు+పల్లె=ఊరువల్లెలు.

౧ వివ :—ద్వంద్వసమాసమున నీయాదేశము గల్గునని నన్నయయు విశేషించి చెప్పుటచేత ద్వంద్వేతరసమాసములందిది రానేరదనుట యుక్తము. శబ్దరత్నాకరాది కోశములలోని 'నెలిదామర-తెలిదమ్మి' మున్నగు శబ్దములందలి కర్మధారయమునందలి యాదేశములు నిరాధారములు. 'పిన్నతునియలు' మున్నగు (సౌప్తి ౧ ఆ ౯౮) (వ్యా-సం -23 పు) ప్రయోగములకు విరుద్ధములు నగుచున్నవి. ప్రౌఢవ్యాకర్త నిషేధించిన 'రాకపోకలు' మున్నగు వ్యావహారిక ప్రయోగములు మూలముగాఁ గల నిషేధము నిరాధారము. ఇట్టివి ప్రాచీన గతి ప్రయోగములు లేవు.

ద్రుతముమీఁది పరుషములకు సరళములగు. ౧౬

(బా-౧౬ సూ). (వ్యా-సం-౮౦-౮౦ II వివ).

ఉదా :—పూచెను+కలువలు=పూచెను గలువలు, తోఁచెను+చుక్కలు=తోఁచెను జుక్కలు, చేసెను+టక్కులు=చేసెను డక్కులు, నెగడెను+తమములు=నెగడెను దమములు, మొగిడెను+పద్మము=మొగిడెను బద్మము. 'ద్రుతముమీఁది పరుషముల' కనుటచేత * ద్రుతోపజీవి శబ్దములమీఁదను నీయాదేశము గల్గును. ఉదా-ఎంతయును+కోపించె=ఎంతయును గోపించె.

౧ వివ .—శ్వాసవర్ణ పరకపరుషముల కీయాదేశము సంభవింపదు. ఉదా :—వచ్చెను+క్షత్రియుఁడు=వచ్చెను క్షత్రియుఁడు. ఇట్టివి స్థిరవర్ణములవంటివె.

౨ వివ.—'ద్రుత'ను'స్వరూపముమీఁది యీసరళాదేశమునకుఁ బ్రాచీన మహాకవి ప్రయోగములు గానరావు. తే. గీ. 'నగరమునకు మహీజాతను గొనివచ్చె' (అప్పక. ౫ ఆ ౧౬౨) అను ప్రయో

---

* సూరి "ద్రుత ప్రకృతికములమీఁది పరుషములకు" అని సూత్రించుట సరికాదు. ద్రుతోపజీవి శబ్దములమీఁదను నీయాదే/శాదులగును. ఉదా :—అదియునుగాక మొ.

గము మాత్రము గలదు. అహోబలపతియు నీ ద్రుతస్వత్వముమీఁది సరళాదేశము నంగీకరించెను. (౨౦౭ పు. అహో). నేఁడెల్లరును నిట్టి ప్రయోగము నంగీకరించుచున్నారు దీనిని బట్టి దీని (ను) రూపాంతరమగు 'ని' స్వరూపముమీఁదను (తత్స-౨౬ సూ) నీ సరళాదేశము సమ్మతమె యగుచున్నది.

ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు. ౧౭. (బా. సంధి ౧౭ సూ). (వ్యా. సం. ౮౦ II వివ).

సంశ్లేష మనఁగా ద్రుత మకారలోపపూర్వకముగఁ బరహల్లుతో సంయోగించుట* 'ను' స్వరూపమున ద్రుతము నిల్చుట స్వత్వము. సూత్రమందలి బిందుశబ్దముచేఁ బూర్ణార్ధములు రెండును గ్రాహ్యములు. పూచెఁగలువలు=పూచెంగలు వలు=పూచెన్గలువలు. తోఁచెఁజుక్కలు = తోఁచెంజుక్కలు=తోఁచె న్జుక్కలు. చేసెఁడకుక్కలు=చేసెండకుక్కలు=చేసెన్డకుక్కలు. నెగడెఁదమములు = నెగడెందమములు=నెగడెన్దమములు. మొగిడెఁబద్మము=మొగిడెంబద్మము=మొగిడెన్బద్మము. బిందుసంశ్లేషములు రానిపక్షమున ద్రుతము స్వస్వరూపముతోనె నిల్చియుండును. ఇట్టివి సంధి ౧౬ సూత్రమున నుదాహృతము లయ్యెను.

౧ వివ:—సంజ్ఞా. ౧౫ సూత్రము చొప్పున దీర్ఘముమీఁద నిండుసున్న రూప ముండరాదు. రాను+చూచెను = 'రాంజూచెను' అని కానేరదు. 'రాఁజూచెను' అని మాత్రమె నిల్చును. సంధి ౨౨ సూత్రము చొప్పున నుడి తొలిహ్రస్వముమీఁద నరసున్న

* సూరి "సంశ్లేషమనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట" అని వివరించుట సరికాదు. సూరి పక్షమునందును ద్రుతము 'ను' స్వరూపమెకదా. చింతామణిపక్షమున మాత్రము ద్రుతము నకారపుహల్లు.

నిల్వము కాన 'కెంపు+తామర=కేఁదామర' అని కానేరదు. ఇంక "కెందామర" అని మాత్రమె యగును. (సంధి, 32 సూ). ప్రకృత సూత్రములోని 'విభాష' శబ్దము వ్యవస్థితవిభాష గావున నుడి తొలి హ్రస్వముమీఁద సంశ్లేషమును రాదు. ఉదా :-'కెంపు+తామర= కెన్దామర' అనియుఁ గానేరదు. ఇట్టియెడల నకారమును స్థిరపఱచు ప్రయోగములు లేవు.

ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు. ౧౮. (బాల-సంధి-౧౮.) (వ్యా. సం. ౮౧ II విష.)

వచ్చెను+గోవులు=వచ్చెగోవులు = వచ్చెన్గోవులు = వచ్చెను గోవులు. మెఱసెను+ఖడ్గము=మెఱసెఖడ్గము=మెఱసెన్ఖడ్గము. మెఱసెను ఖడ్గము.

౧ విశ :—వెనుకటి సూత్రములోని సరళము లాదేశసరళములు, ప్రకృతసూత్రములోని సరళములు సహజసరళములు.

వెనుకటి సూత్రమున వివరించినరీతిని శ్వాసాక్షరపరకపరుషములు ద్రుతమునకుఁ బరములగునపుడీసూత్రముచొప్పున ద్రుతలోప సంశ్లేషస్వత్వము లె యగును. ఉదా :—వచ్చెను+క్షత్రియుఁడు= వచ్చె క్షత్రియుఁడు=వచ్చెన్‌క్షత్రియుఁడు=వచ్చెను క్షత్రియుఁడు. సంధి ౨౫ సూత్రముచొప్పున 'ఋ-ౠ' వర్ణపరకత్వమునను ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వము లగును. ఉదా :—వచ్చెను+ఋషి=వచ్చె ఋషి=వచ్చెన్ఋషి=వచ్చెను ఋషి. సంధి ౨౭ సూత్రముచొప్పున నుడి తొలిహ్రస్వముపైని ద్రుతలోపము లేదు. ఉదా:-"కన్+దోయి= కదోయి" అనరాదు- "కన్దోయి-కందోయి" (సంధి ౧౯ సూ) అనియె యనవలెను. ప్రకృతసూత్రముచొప్పున వచ్చు ద్రుతసంశ్లేషమునకు:—ఉ...ఇచ్చటన్ మెచ్చగు పీఠిదైన సుఖనిద్రకు...(ఆది-౬ ఆ-౨౦౦ ప.) సమాసమున నీద్రుతమునకు స్వత్వము లేదు-(సంధి

౨౬ సూ). ఆదేశసరళపరకత్వమందువలెనె యిందును బ్రాఁతాదిసూత్రసిద్ధద్రుతమునకు సంశ్లేషము లేదు- 'కెంపు+దూళి=కె+ను+దూళి=కెందూళి' అని మాత్రమె యగును-ఇందలి సంశ్లేషమును నిర్వహించుప్రయోగము లేదు-

వర్గయుక్సరళములు మకారమును బరంబులగు నవుడు కొన్నియెడల ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. ౧౯. (బా-సంధి ౧౯ సూ) (వ్యా. సం-౮౨ I. II వివ).

వచ్చెను+ధాత్రీపతి=వచ్చెం ధాత్రీపతి. పాడెను+గంధర్వుఁడు=పాడెం గంధర్వుఁడు. కన్+దోయి=కందోయి. లతాంతములకును+మొనసి=లతాంతములకుం మొనసి (ఆది ౫ ఆ ౧౩౭).

౧ వివ :- యుక్కు- లనఁగా సమసంఖ్యగలవి. వర్గయుక్కు-లనఁగా వర్గాక్షరములలో సమసంఖ్యగలవి. ఉదా :-ఖ-ఘ-ఛ-ఝ. మొ. సూత్రములోని సరళశబ్దమునకు సహజసరళములనియె యర్థము. సూత్రములోని 'పూర్ణబిందువును' అనుచోటి సముచ్చయార్థక 'ను' శబ్దముచేతఁ బూర్ణబిందువేకాక వెనుకటి సూత్రము చొప్పున "లోపసంశ్లేషసత్వములును" నగునని గ్రహింపవలెను. ఉదా :- పాడెను+గంధర్వుడు = పాడెంగంధర్వుఁడు = పాడెగంధర్వుఁడు=పాడెన్గంధర్వుఁడు=పాడెను గంధర్వుఁడు. ఇట్లె తక్కిన-చోటులందును నుదాహృతుల నెన్నవలయును. సంజ్ఞా ౧౬ సూత్రము చొప్పున స్థిరపరకబిందు వుండరాదనుట కీసూత్ర మపవాదమగుచు బాధకమగుచున్నది.

౨ వివ :-"బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్" అను నన్నయ సూత్రమును బట్టియుఁ బ్రకృతసూత్రములోని 'కొన్నియెడల' అను దానిని బట్టియు నీ సూత్రము యథాప్రయోగముగ నెన్నఁదగునని గ్రహింపవలెను. నన్నయ 'మ' కార పరకత్వమున మాత్రమె

పూర్ణబిందువును బ్రయోగించెను. ఉ. ఇమ్ముగ.. వం ద్యంముని నన్నపరాశర (ఆది. ౧ ఆ ౭౫) లయగ్రాహీ. కమ్మని లతాంతములకుం మొనసి (ఆది ౫ ఆ ౧౩౮) ఇది యనునాసిక ప్రాసమని యప్పకవి యుదాహరించెను- (అప్పక-3 ఆ-3౭౨ ప). పైవిషయములను గ్రహింపక ప్రౌఢవ్యాకర్త "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు" (ప్రౌఢ-సంధి-౨౨ సూ) అని మార్గాంతరమును ద్రొక్కుట సరికాదు. ప్రాసంబున నన్నయయే ప్రయోగించునపుడు తక్కినయెడలఁ జెల్లకుండునా? ప్రాసమునమాత్రము ద్రుతమునకు మకారాదేశ మగుననుట యసంగతము. "

తర్వాతివారీపూర్ణమును (మకారేతర పరకత్వమున) ధారాళముగఁ బ్రయోగించిరి:-ఉ. వేసెం జ్వరుఁడు ..మం టం జ్వాలనంబు ...(ఉ. హరి. ౬ ఆ. ౮౮ ప) గీ బంధమగు కృష్ణుఁ డుదయించినం ధరిత్రి (ఛందోద ౧ ఆ ౫౧ ప). క. కందోయి చల్లగా నిటు కం దోయి...(సారం-3 ఆ). .కర ణిం జనియించు (ఆము ౧ ఆ ౯౧) గీ. డాంఢమిత భేరికాధ్వాన ముం ఘలీ నినాదము .. (అధర్వణ భారత-విరాట-అప్పక-౫ ఆ ౧౫౫,. లోలా ర్కుం రేవ...(కవి సిం గరన్నగారి త్రైశంకవోపాఖ్యానము. అప్పక. ౫ ఆ. ౧౫౭.)

అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు విభాషగానగు ౨౦ (బా-సంధి-౨౦) (వ్యా-సం-౮3 II విష).

వాఁడు వచ్చెన్-వాఁడు వచ్చె-వాఁడు వచ్చెను. ఈలోపంబు పద్యాంతములందు గణానుసారంబుగ వ్యవస్థితంబయి యుండు.*

౧ విష :-అవసానమనఁగా నర్ధమాత్రాకాలిక వ్యవధాన

* "గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబులేదు. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవక" ఈ నూరి వాక్యముల నావశ్యకములు.

మునకన్న నధికకాల వ్యవధాన ముండుట. ఇట్టి వ్యవధానము గద్యములలో వాక్యాంతమందును, బద్యముల తుదిని, నుద్ధరణ చిహ్నములను నిల్పు స్థలములందును దెలుఁగున సంభవించును. ఉదా :- ఉద్ధరణ :-అదిచూచి "ఏలవచ్చె" అని నీవడిగితివి. మొ.

కొన్నియెడల ద్రుతంబుమీఁద ద్రుతంబు గానంబడియెడి. ౨౧. (బా-సం-౨౧) (వ్యా-సం. ౮౪-౮౪ I విమ).

'ను' శబ్దము సముచ్చయాద్యర్థవిశేషబోధకమును కొన్నియెడల నిరర్థకమునునై యుండును. ఇది సుబంతములమీఁదఁ దఱుచుగను దిజంతములమీఁద నరుదుగను నిల్చును. ఇయ్యది కళలమీద 'యును' లేదా 'ను' అనురూపముతోను ద్రుతములమీఁదను 'ఉ' కారాంతములమీఁదను 'నును' లేదా 'ను' అను రూపముతోను నిలుచును. కొన్నియెడల సముచ్చయాద్యర్థవిశేష మావశ్యకమైయున్నను నిది నిల్వక లోపించియె యట్టియర్థముల నిచ్చును. (ప్రౌ-శబ్ద-౧౧౬ సూ).

సుబంతములమీఁద :- అదియునుం గాక, ఇట, మీఁదఁ జెప్పిన దాని కతిశయము సముచ్చయార్థము. దివంబునుం బోలె. ఇట స్వర్గాధిక్యతాతిశయము సముచ్చయార్థము. ఇట్టివెల్ల నిరర్థకములు పాదపూరణార్థకములును నని బాలవ్యాకర్తయుఁ బ్రౌఢవ్యాకర్తయు (ప్రౌఢ. శబ్ద ౧౧౬) దలంచుట సరికాదు. యువర్ణపూర్వకతారాహిత్యము :- కం...ఏ మిని జయుఁగనిమి (ఉద్యో ౨ ఆ ౧3). తిజంతములమీఁద :- వినఁడును గానఁడున్ మఱియు... (ఉద్యో ౨ ఆ ౧౪). లోపించుట :- క. అతిమానుష మత్యద్భుత మతి దుష్కరమైన కేశవార్జునకృతి...(ఆది ౮ ఆ-3౧౯). ఒకచో నుండి మఱొకచో లోపించుట :-చ. విను మఱిఁ జంపనుం జెఱుపవేఁ చుట లెస్స. (శాంతి-3 ఆ ౨౦). నిరర్థకముగా నుచ్చారణ సౌకర్య

మునకై నిల్చుట :- అతఁడును నితఁడును వచ్చిరి. అదియును నిది యును గలవు. వీనిలో మొదటి 'ను' శబ్దము సముచ్చయార్థము. తర్వాతిది యుచ్చారణ సౌకర్యార్థకము. కం... అనవుడును నయ్య గోముఖ విప్రుల్. (ఆది ౨ ఆ-౧౮౨). ఇట్టియెడల నె ద్రుతద్విత్వస్థితి సంభవించును. 'ను-ని-న' అను ద్విత్రి 'న' వర్ణముల స్థితిలో నుచ్చారణ సౌకర్యమునకై పూర్వ 'న' కారముమీఁది స్వరము వికల్పముగ లోపించును. అట్టియెడల 'న' కారద్విత్వము భాసిల్లును. ఇట్టి ద్రుతద్విత్వమును నన్నయ పలుతావులలో వాడెను. తిక్క యజ్వ తన విశాల భారతభాగమున వాడనేలేదు. తర్వాతి కవులు పెక్కుచో వాడిరి. నన్నయ :-నృపుతుఁ డన్నసుర (ఆర 3 ఆ 3). ఇట నన్నయపక్షమున ఉత్తరస్వరకశబ్దానయున నకారమును ('అను' అనెడిదాని 'అన్' అనురూపము) ద్రుతమె. ధైర్యవృత్తికి న్నురుడుగ (ఆర ౧ ఆ 3-౨౧). మత్తి :- ఎన్నఁడు న్నేని... (ఆది ౭ ఆ ౧౮౨). అన్నిష్టసభ నూఁది యున్నదాని (ఆది 3 ఆ ౧౪౦). నందినియన్నేటి తెరంగలన్ (ఆది ౮ ఆ ౭౯). తండ్రిపంపున న్నివ్వనభూమి (ఆర ౪ ఆ 3-౧౪) ఇట్లుగ నెఱ్ఱాప్రెగడ మున్నగువారును బ్రయోగించిరి. ప్రౌఢ-సంధి-3-సూత్రమునొద్ద నితరకవుల ప్రయోగములు పెక్కు దాహృతములయ్యె. సర్వమపహ్న మన న్నెఱుంగవే (మనుచ 3 ఆ) వీనిని దుస్సంధులని కవిజనాశ్రయాప్పకవీయ నరసభూపాలీయములు వచించుట పొరపాటు. మఱియు-"కను+అను=కన్నాను=(ముఖ్యుఁడు). పలు+అఱుపులు = పల్లఱుపులు =(జల్పితములు)" మున్నగుచోటులు యథాప్రయోగముగ నెన్ను నది.

'ఇఁక-ఇఁగ-అఁట-చుఁడు' అను శబ్దంబులం దప్ప నుఁడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతం బునకు లోపంబును లేవు. ౨౨. (బా-సంధి-౨౨) (వ్యా-సం. ౮ ౫ II విమ).

నుడి=మాట. నుడి తొలిహ్రస్వము = పదాది హ్రస్వము. 'అఁట'కి లార్థకము. 'చుఁడు' శబ్దము 'చూడుఁడు' శబ్దసంక్షేపము. ఇట్లె 'చూడుము' శబ్దసంక్షేపము 'చుమ్ము' అనునది. ఈ సూత్రముచే 'క్రొత్త+పసిఁడి=క్రొ+ను+పసిఁడి=క్రొంబసిఁడి' అగునే కాని 'క్రొఁబసిఁడి' అని కానేరదు. (చూ. సంధి. 3౫ సూ.) కన్ను+దోయి=కన్ను+ను+దోయి= (సంధి. ౨౮ సూ) కన్నుందోయి=క+ను+దోయి=(న్ను లోపించి ద్రుత 'ను' శబ్దము మిగిలినది) కందోయి. ('కదోయి' అనరాదు). అఁట :- గీ. దాతవఁట నీవు మేము సంధాతలమఁట। ...గౌరియఁట...శంభుఁడఁట... (హరవి ౪ ఆ ౬౫). 'అఁట-అంట' అని యుండఁదగిన చోటులందెల్ల భారతమున 'అట-అట్టె' అనునవి సంస్కర్తలచే నిల్పఁబడినవి. ద్విపద-ఇఁగ మెడఁదుని మెద విదియేమి పుట్టె జగములలో (బసవ ౫ ఆ ౯౦). క. వనట యుడుగు మిఁక దుర్మతి యును బోలెను...(అశ్వ-౧ ఆ-౮) క. .. భయఁం కరమూర్తులు దాల్చి యుండఁగానలయుఁజుఁమీ (విరా. ౧ ఆ ౧౭౬). అనునవి, 'ఇఁగ-ఇఁక-చుఁను' అను వాని ప్రయోగములు.

౧ వివ :-తాను నేను పదంబులకు సంశ్లేషము లేదను సూరి సూత్రము భ్రాంతిమూలకము. (శా-సంధి. ౨3 సూ) (వ్యా-సం-౮౬ I విమ). "వినాద్వితీయ" మిత్యాద్యథర్వణకారిక వీరి యీ భ్రాంతికి మూలమై యుండును. 'తాన్ చదివె-తాన్ వినె' అను సంశ్లేషరూపము లుండవుగాని 'తాజ్జదివె-తాన్వినె' అను ద్రుత స్వత్వరూపములు సమ్మతములైయున్నియా యథర్వణకారికకుఁ దాత్పర్యము. నన్నయాథర్వణుల స్వత్వసంశ్లేషముల స్వరూపము తెలియని కారణమున నట్లు సూరి సూత్రింపవలసెను. బాలవ్యాకరణ వ్యాఖ్యాత లింకను భ్రామాదికముగా దీర్ఘముమీఁదనె సంశ్లేషముండదని వ్రాసిరి. క...ఏన్ప ర్వంబులను... (ఆది ౧ ఆ ౪౬). ఉ...నాలుగే న్బాడికుఱ్ఱలు నీఁడె...(ఆది ౫ ఆ-౨౧౮ ప.) (నన్న-

యాథర్వణపక్షమునందలి ద్రుత సంశ్లేష స్వత్వములు:- రెండిటియం దును ద్రుతము 'న' కార వ్యంజనరూపమె. అది పూర్వాచ్ఛన కంగమై దానిని నత్తియుండుట సంశ్లేషము. పరాచ్ఛన కంగమై పరహల్లుతో సంయోగించుట స్వత్వము.)

సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు.

౨౩. (బాల-సంధి-౨౪) (వ్యా-సం-౮౭-౮౭ I విభ).

రామునియొక్క + గుణములు = రామునిన్+గుణములు = (చూ-సమా-౭౨ సూ)=రాముని గుణములు. *

సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుం పులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు. ౨౪. (బా-సంధి-౨౫ సూ) (వ్యా. సం-౮౮-౮౮ I-II విభ).

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషములచే (సంధి. ౧౭ సూ) మూఁడు రూపంబులు. సరళం బులు పరంబులగునపుడు లోపసంశ్లేష పూర్ణబిందువులచే (సంధి-౧౮-౧౯ సూ) మూఁడురూపంబులు. విధానసామర్థ్యమువలన సంధి ౨౩ సూత్రమునుచే లోపంబులేదు. వక్ష్యమాణవిధిచే (౨౫ సూ)

---

* సూరి యిట్లుదాహరింపక మార్గాంతరగామి యయ్యెను. 'ఎల్ల' శబ్దము ద్రుతాంతమగు నవ్యయ మనుచు 'ఎల్లన్+అర్థములు= ఎల్ల యర్థములు' అని యుదాహరించెను. 'ఎల్ల' శబ్దమాచ్ఛిక సర్వ నామప్రథమైకవచనము. అవ్యయముకాదు-ఎల్లరు-ఎల్లరకు-ఎల్లయం దు-మొ- 'ఎల్లన్ శిష్యులు' మున్నగునవి చార్థక 'ను' శబ్దయోగ మున ద్రుతోపజీవి శబ్దములు. షష్ఠీ తత్పురుషమునందలి షష్ఠి ద్వితీ యా నకారముగా నిల్చుననుటయు నది దీనిచే లోపించుననుటయు నన్నయ పద్ధతి. ''షష్ఠీ భవే ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్ (ఆం-చిం) సూరి యీమార్గము నె విడుచుట పొరపాటు.

దీనికి స్వత్వంబులేదు. చిగురు+కైదువు=చిగురుఁగైదువు = చిగురుం గైదువు=చిగురున్గైదువు, తళుకు+గజ్జెలు=తళుకుం గజ్జెలు=తళుకు గజ్జెలు=తళుకున్గజ్జెలు. సింగము+కొదమ=సింగపుఁ గొదమ=సింగపుం గొదమ=సింగపున్గొదమ. ఈ యుదాహృతిచే నీ నుక్కును పుం-పులను 'సమాసంబులన్' అను బహువచనమున కనుకూలముగ శేషషష్ఠీ 'సమాసమందును నగునని యెఱుంగునది. "కన్నుంగవ" (ఆది. ౮ ఆ ౨౫౮. మనుచ ౨ ఆ 3౨). సాహసంబు తఱియె మేదినీశ యిది బుద్ధి ..(శల్య. ౨ ఆ ౧౧౮) అనుచోట్లను 'పుం-పు'ల రామి యుఁ గలదు. ఉన్నతము+గొడుగు=ఉన్నతంపుం గొడుగు=ఉన్నతంపు గొడుగు=ఉన్నతంపున్గొడుగు. ఇందలి సంశ్లేషమును నిర్వహించు ప్రయోగములు లభింపలేదు.

౧ వివ :— సంఖ్యావాచకములపయి నీయాగమము రాదు. మూఁడు కృతులు (విరా ౧ ఆ-౬). ఐదు ప్రొద్దులు (ఆది ౧. ౩ ౬౧). నలుగడలు-ఇరుగడలు- మొ.

౨ వివ :—ఉదంతతద్ధర్మార్థక విశేషణములు స్త్రీ సమములై యైనను వానిపై నీయాగమము భారతాది ప్రాచీనగ్రంథములందు లేదు. ఉదా :—ముద్దుసేయు కొడుకు (విరా ౧ ఆ ౯౨) అర్వాచీనకవుల గ్రంథములలోఁ గలదు. శా. వాలారుం గొనగోళ్ళ (మనుచ. 3 ఆ ౫౭). చెక్కులఁ బోలుం దెలనాకులు (పాండు ౧ ఆ ౨౯). మొ.

3 వివ :—కొన్ని యెడల స్త్రీ సమములపైని నీయాగమము లేకుండుట గలదు. చేటుకాలము (శాంతి ౮ ఆ. ౮3౫) కీడు పట్టొక్కఁడు లేదు (ఉద్యో ౨ ఆ ౬3) (అహో ౨౨౧ పుట) ఈ ప్రయోగములు ప్రాసగతములు లభింపలేదు.

౮ వివ :—స్త్రీ సమముల కనుటచేత నీవిధి యాచ్ఛికసమాసములందే వర్తిల్లును. ఉదా :—కడుం జెడుం దెఱఁగు (ఉద్యో 3 ఆ

(సంధి ౨౫-౨౬సూ) సామాసికద్రుతాగమస్వత్వ సంశ్లేషనిషేధము

౩౮౮.) 'చెఱుంబ్రవర్తనము' అనరాదు. పు-ంపుల పట్ల సంస్కృత సమములమీఁదను, మిశ్ర సమాసములందును నుక్కు వచ్చును. ఉదా :—వరవుడ పుంజరిత్రము (ఆను ౧ ఆ-౨౧౯ ప.)

౫ వివ :—స్థిరపరకత్వమందును నీ 'నుక్కు' అరుదుగ నగపడుచున్నది. సిబ్బెపున్ మే తెలి...(కవి పితామహుని యుత్పల మాలిక). గరువపు న్మరువు (బాల-వ్యా-సంధి-౨౫).

సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వము లేదు.
౨౫. (బా-సంధి-౨౬ సూ) (వ్యా-సం-౮౯ I వివ).

సామాసిక ద్రుతాగమమునకు స్వత్వమేకాక సంశ్లేషమును బ్రయోగారూఢముగ నగపడదు. 'తళుకును గజ్జెలు' అనరాదు సరే కదా 'తళుక్గజ్జెలు' అను సంశ్లేషమును నిర్వహించు ప్రయోగ మగపడదు.

తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతంబు
నకు లోపంబు లేదు. ౨౬. (బా-సం ౨౭) (వ్యా-సం
౯౦ I వివ).

సంధి ౨౩ సూత్రము చొప్పున సిద్ధించుచున్న ద్రుతలోప మీ సమాసస్థలములలోఁ గల్గదని తాత్పర్యము. తలఁబ్రాల్వాదులు మధ్యమపదలోపి సమాసములు. ఉదా :—తలను+ప్రాలు=తలఁబ్రాలు= తలంబ్రాలు. (వివాహ కాలమున వధూవరులు పరస్పరము తలల మీఁదఁ బోసికొనెడి (కడుగుళ్ళ) యక్షతలు. వీనిలోని ద్రుతము సప్తమ్యర్థకద్వితీయాసంబంధి. ఇట్లె - ఒడినిపాలు=ఒడిఁబ్రాలు- (మంగళార్థము నూతనవధువున కొడిలోఁగట్టు బియ్యము). సేసను+ పాలు=సేసఁబ్రాలు. (దేవతా నిర్మాల్యమునుండి కొనివచ్చు నక్షతలు) (శేషాశబ్దభవము సేస). ఊరను+పంది=ఊరఁబంది=(ఊరిలోఁ దిరిగెడి పంది). 'ఊరఁ బిచ్చిక' అనుదానికి నిట్లె. తోడను+పుట్టువు= తోడంబుట్టువు. తోను+పుట్టువు=తోఁబుట్టువు. ('తోడను-తోను' అను

నవి దు)్రతాంతావ్యయములు). ఒడను+పాటు=ఒడఁబాటు=(సమ్మతి). ఒల్లను+పాటు=ఒల్లఁబాటు=(అపేక్ష లేమి). (చూ-క్రియా-౧౧౧సూ) ఇత్యాదులు-ఆదిశబ్దముచే ఒల్లఁబోవు=(మూర్ఛిల్లు). మొ

సమానాధికరణ సమాసములందును, శేష షష్ఠీ సమాసములందును, సంఖ్యావాచకాది భిన్నములగు 'ఉ'దంతవిశేషణములకును, 'పు-౦పు'లకును, నచ్చు పరంబగునపుడు 'టు'గాగమము బహుళముగనగు.

౨౭ * (బా. సంధి-౨౮-౨౯ సూ) (వ్యా-సం-౯౧ మొ ౯-౨ III వివ).

'శ్వేతవస్త్రము' మున్నగు చోటులందు 'శ్వేతత్వ-వస్త్రత్వ ములు రెండును వస్త్రమందె యుండును గాన నవి రెండును సమా నాధికరణము లనిపించుకొనును, సమానాధికరణ సమాస మనఁగా విశేషణ విశేష్యముల సమాసము.

కఱకు+ఎఱుక=కఱకుటెఱుక. (ఆర-౨ఆ.౯౭). ఏపు+అడ వి=ఎపుటడవి (ఆర ౧ ఆ ౨౯౪) సన్నము+ఈఁక=సన్నపుటీఁక. (ఉద్యో-3 ఆ-౨౯౮). దుష్కరంపు+ఏఁడు=దుష్కరంపుటేఁడు (విరా 3 ఆ ౧3౧). రూపకాది సమాసములును గర్మధారయభేద ములే. ఉదా:-చెక్కుటద్దములు=(చెక్కులనెడి యద్దములు). పొదరు టిల్లు=(పొదర నెడి యిల్లు). షష్ఠీసమాస :-ప సరపుటెంపపో)్రవులు= (శాంతి. 3 ఆ ౨౮౪) ఐక్యంపుటెఱుక-(శాంతి ౪ ఆ ౨౪3)

౧ వివ :-బహుళ మనుటచేత 'పు-౦పు'ల పైని రాకుండు టయుఁ గలదు. క్రపపనఁటులు (యయా ౪ ఆ ౨౦) ఆముదపాకు

---

* సూరి శేషషష్ఠీస్థలములందలి టుక్కును సూత్రింప లేదు. 'పేరు టురము' అనుచు వైభాషిక టుక్కును సూరి విధించెను. అట్టి ప్రయోగమే లేదు. కం. పేరాఁకలి పేరాముని పేరాముదపాకు లనఁగఁ బేరింపనఁగన్ (ఆం. భా. ౧౨౬ ప).

(ఆం. భా ౧-౨౬ ప). నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బలు (కవిపితామహుని యుత్పలమాలిక). పట్టు పెనుంగు (పాండు ౧ ఆ ౭౭). బహుళమనుట చేత దీనికి వైకల్పికత్వమును గలదు. చిగురు+ఆకు=చిగురుటాకు (ఆను ౧ ఆ ౫౧౦)=చిగురాకు. (ఉ. హరి ౫ ఆ ౫౬). వాలుటమ్ము (శల్య ౧ ఆ ౧౬౭) వాలంపతాఁకునకు (రాఘ ౧ ఆ ౨౩) (భీష్మ ౨ ఆ) బహుళ మనుటచేతనె తద్ధర్మాద్యర్థక విశేషణముల 'ఉ' కారమునకు 'టుక్కు' రాదు. 'నుక్కు' వచ్చును. చేయు నతిథిపూజ (ఆర. ౬ ఆ. ౧౬౪).

౨ వివ :- తెలుఁగున సంఖ్యావాచక పూర్వక సమాసము ద్విగు వె. కాని సంస్కృతమున 'సప్తర్షయః' అనురీతిని కర్మధారయములు. కాన స్పష్టతకై సూత్రమున "సంఖ్యావాచకాది భిన్నములగు" అని నిల్పఁబడెను. ఉదా :- ఏడక్షౌహిణులు (ఆది ౧ ఆ ౬౯). మూఁడాశ్రమములు (శాంతి ౧ ఆ. ౭౬.) సూత్రమున "సంఖ్యావాచకాది" అను నాదిశబ్దమును నిల్పుటచేత 'పెక్కు-తక్కు' మున్నగు స్థలములందును 'టుక్కు' రాదు. ఉదా .- పెక్కేడల (ఉద్యో ౪ ఆ ౨౪౬) తక్కిన్నిగర్భములు (సౌప్తి ౨ ఆ ౮౦ ప).

౩ వివ :- "కన్=(కన్ను) పెన్=(పెద్ద) పల్=(పలు-పెక్కు)" మున్నగు నేక హ్రస్వాచ్చహలంత శబ్దముల (ఉత్వలోపము) పై వచ్చు నిల్పుటచేత సహజముగా నచటి హల్లు ద్విత్వమునందును ఈ టుక్కు రాదు. ఉదా :- కన్నాకు=(శ్లేష్మఁడు=మీఁదఁ గన్పట్టు తమ్ములపాకు). (భీష్మ ౧ ఆ ౭౬). పెన్నుద్ది (పెద్దసాటి) (పాండు ౩ ఆ). పల్లటపులు=(జల్పితములు (హరిశ్చం-౪ ఆ). (ప్రౌఢ-సంధి-౯ సూ).

౪ వివ :- "దుక్కి-టెద్దు-మిద్దెటిల్లు" అను శబ్దరత్నాకరాంగీకృతములు సాధువులుకావు. అట్టి కవిప్రయోగములు లేవు- "దుక్కి-యెద్దు-మిద్దెయిల్లు-తేనెయీఁగ" అనియె ప్రయోగింపనగును.

పేదాది శబ్దంబుల కాలు శబ్దంబు పరంబగునపుడు
కర్మధారయంబునందు రుగాగమంబగు. ౨౮. (బా-
సం-30 సూ) (వ్యా-సం-౬3 I విమ).

పేద+ఆలు=పేదరాలు, బీద+ఆలు=బీదరాలు. పేద- బీద- ముద్ద-బాలెంత-కొమ=(చక్క-నిది-కొమరుశబ్దసంక్షేపము)-జవ-అయిదువ-మనుమ-గొడ్డు-ఇట్టివి పేదాదులు. ఇందలి 'జవ' శబ్దము 'జవ్వని' శబ్దాదేశము. ఏకాంతమునందునున్న జవరాండ్ర (మనుచ ౨ ఆ ౪౧). ఐదువరాలు=(సుమంగలి)=(పుస్తె-పసుపు-కుంకుమము-గాజులు-చెవ్వాకు-గలది).

కర్మధారయంబునం దత్సమంబుల కాలు శబ్దము
పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు
నగు. ౨౯. (బా-సంధి-3౧ సూ) (వ్యా-సం-౬3
II విమ.)

ధీర+ఆలు=ధీరురాలు * గుణవంత+ఆలు = గుణవంతురాలు. బల్లిద+ఆలు=బల్లిదురాలు. (చూ-ఆచ్ఛిక 3 సూ) సంప్రతితుల్యత్వావస్థలో సైత ముత్వము వచ్చును †.

౧ విమ :-"ఇల్లుయొక్క+ఆలు=ఇల్లాలు" అను షష్ఠీసమాసమును సంబంధార్థవివక్షచేఁ గర్మధారయముగ భావింపనగును గాని యట్టి రూపములు కవి ప్రయోగాధీనములు గాన నట రుగాగము రాదు.

---

* 'ధీర+ఆలు' మున్నగు చోటులందు సూరి వచించిన "కర్మధారయంబు త్రిక...౫" (సమా-౫ సూ-బాలవ్యా) అను కర్మధారయ మెట్లు సరిపడునని యాతఁడు తలంచెనో?

† 'ఇచట వృత్తియం దాలు శబ్దము. స్త్రీ మాత్రపరము' అని సూరి వచించుట సరికాదు. చ. కలుచుట దోసమే మృగలఁ గల్వకయాండురు దొల్లి యాండురం గలుతురె... (నన్ని-కు ౮ ఆ ౧౫౧) ఆలు శబ్దమునకు స్త్రీ యను నర్థమె కలదు.

౨ వివ :—ఈ సందర్భమునందలి సమాసములెల్ల జ్ఞాపకసిద్ధములని యెఱుంగునది (సమా ౭౧ సూ). మిశ్రకర్మధారయము సామాన్యసమాసశాస్త్రసిద్ధము కాదుగాన నిట్టివి సూత్రారంభసామర్థ్యమున సిద్ధించును. మిశ్రకర్మధారయమునఁ బుంవద్భావమసంభవము.

3 వివ :—క్రుదువనిద్దయురాలై (ఆది ౨ ఆ ౧3౬) పాపజాతు రాలవు. (అర ౬ ఆ 30౭) (పాపజాత+ఆలు.)

కర్మధారయంబులందు 'ము' వర్ణకంబునకు 'పు-ంపు' లగు 30. (బా-సం-3౨). (వ్యా-సం-౯౪ I-II విమ.)

సరసము+మాట-సరసపుమాట=సరసంపుమాట. సరసములు+వచనములు=సరసపు వచనములు=సరసంపువచనములు. కయ్యముయొక్క+వెరవు=కయ్యపు వెరవు. మొ.

౧ వివ :— 'కర్మధారయంబులందు' అను బహువచనపు మహిమచేత సాంస్కృతికాచ్ఛిక మిశ్రములందును షష్ఠీసమాసమందును నీవిధి వర్తిల్లును. ఉదా :—ఘోరపుమృగములు (స్త్రీ-౧ ఆ ౪3). శోకార్తపు టోడలులతో (స్త్రీ-౨ ఆ ౧౨౪.) అగ్గలంపు సందడి (అశ్వ ౪ ఆ 3 ప). సంబంధార్థ :— క్రీడి కయ్యపు వెరవు (కర్ణ. 3 ఆ ౨౫౧) (శల్య ౧ ఆ ౨౨౧) ప్రాసస్థలములు.

౨ వివ :—'ము వర్ణకమునకు విధించు కార్యము ముగాగమంబునకు నగు' (తత్స-౪ ౨ సూ) అనుచొప్పున 'శోకార్తపు టోడలులతో' (స్త్రీ-౨ ఆ ౧౨౪) అనురీతిని ముగాగమమునకును పు-ంపు లగును. ప్రకృతసూత్రపు జ్ఞాపకమహిమచేత సమాస పూర్వావయవ విభక్తి వచనాదుల లోపమును ముగాగము వచ్చుటయు దానికి 'పు-ంపు' లాదేశమగుటయు (ఉత్తరపదస్థవిభక్తి లోపించి సామాసిక ప్రకృతి యేర్పడుట) సామాన్యశాస్త్రసిద్ధమే సంభవించును. (చూ-సమా-౭౧ సూ.)

3 వివ :—ఈ 'పు-ంపు' లు నిల్వకుండుట నచట 'ము' వర్ణకమె నిల్చుటయు నరుదుగఁ గన్పట్టును. క వాత్సల్యం బున మత్స్యమైన రూపం బున.... (అర. ౪ ఆ ౨3౨). 'మత్స్యపురూప' మనలేదు చ...లో కముసమరంబులట్లు (విరా. ౫ ఆ. 33౭) లోకపు సమరము లనలేదు. * మువర్ణము ప్రాసస్థలము.

ఉదంతమగు తద్ధర్మార్థక విశేషణమున కచ్చు
పరమగునపుడు 'ను' గాగమంబగు. 3౧. (బా-సంధి
33 సూ). (వ్యా. సం. ౯౫ మొ ౯౫ II విష).

చేయు+అతఁడు = చేయునతఁడు, చేసెఁడు+అతఁడు+చేసెడు నతఁడు. (విధానసామర్థ్యముచే దీనికి సామాసిక లోపము లేదు. (సంధి ౨3 సూ) ఉండెడు నంతకంటె (ఆది 3 ఆ ౧౪౯). క్రియా ౧03 సూ. చొప్పున వచ్చు వక్రతమహాకారము మీఁదను నీయాగమ మగును. 'ప్రబలమహానీశ...'' (హరి-నలో 3 ఆ ౨౬) ప్రబలమహా+ ఈశ=ప్రబలమహానీశ.

౧ వివ :—దీని నుపేక్షించుటయు నరుదుగ గలదు. కొల్చు రగసంఘములు- (బసవ-3 ఆ ౧౯౫౯) (తాళపత్రి మాతృకలో ''కొల్చునురగ'' అనియె యున్నది). పెడఁగ్ని దీపులనఁగ (హంస ౫ ఆ) ప్రాచీన మహాకవి ప్రయోగము లిట్టివి కానరావు.

౨ వివ :—ఇదియు జ్ఞాపకసిద్ధమగుచు మిశ్రమును గ్రాహ్య మగును- మాకుఁజేయు నతిథిపూజలు (ఆర ౬ ఆ ౧౬౪).

షష్ఠీసమాసమునందు 'ఉ'కారమునకు వికల్పము

---

* 'తామరము' అను శబ్దమే లేదుగాన 'తామరపాకు' అను నది వ్యావహారిక రూపము. దీని నాధారముగఁ గొని ప్రౌఢవ్యాకర్త 'పు' గాగమమును విధించుట (ప్రౌఢ-సంధి. ౮ సూ) సరికాదు- కం...నీ ప్రజ తామరయాకు నీటిభంగి తలంకెఁ (ద్రోణ ౪ ఆ 3౦౯)

గాను * 'ఋ'కారమునకు నిత్యముగాను 'ను'గాగమ మగును. (౩-౨. బా. సం-౩౮) (వ్యా-సం-౯౬ I-II వి).

దీపము యొక్క+అట్లు=దీపము+అట్లు-దీపమట్లు (చూ-ప్రౌఢ. సమా. ౩౮ సూ) (కర్ణ ౩ ఆ ౭౯)=దీపమునట్లు. గొడుగు యొక్క+ఈగి=గొడుగు+ఈగి-గొడుగునీగి=గొడుగునీగి. (అను-౫ ఆ-౧౯౬). నిషధరాజు యొక్క+అంతవాని=నిషధరాజు+అంతవాని=నిషధరాజంతవాని (నైష. ౨ ఆ ౯౨) బచ్చు యొక్క+ఇంట=బచ్చు+ఇంట=బచ్చింట (పాండు ౩ ఆ)=బచ్చునింట. విధాతృ యొక్క+ఆజ్ఞ=విధాతృ+ఆజ్ఞ=విధాతృనాజ్ఞ.

౧ వివ:-షష్ఠీసమాసమునం (సమా ౭౨ సూ) దలిషష్ఠి ద్వితీయా రూపమున నిల్చుటచే దానికి (సంధి ౨౩ సూ) సామాసిక ద్రుతలోపము రాఁగాఁ బ్రకృత సూత్రముచే 'నుక్కు' వచ్చెను. విధాన సామర్థ్యమున దీనికి సామాసిక ద్రుతలోపము గల్గదు.

ఉదంత స్త్రీ సమంబులకును నదంత గుణవాచకము
లకును 'తనంబు' పరంబగునపుడు నుగాగమంబగు.

౩౩. ♦ (బా-సం-౩౫. సూ) (వ్యా-సం-౯౭ I విమ.)

సొగసు+తనము-సొగసుందనము=సొగసుందనము. సొగసుద్దనము. తెల్ల+తనము=తెల్లందనము=తెల్లందనము=తెల్లద్దనము. తద్ధిత వృత్తి గాన దీనికిని స్వత్వము లేదు. (చూ-సంధి-౨౬ సూ). సంశ్లేషమునకును బ్రయోగము లేదు.

౧ వివ:-కడుం జెడుగుందనము. (శాంతి ౩ ఆ ౨౧౩).

---

* సూరి 'ఉ'కారమునకును నిత్యమె యని సూత్రించుట పై మహాకవి ప్రయోగములకు విరుద్ధము.

♦ సూరి 'పు-ంపు'ల మీఁద నయితము నుగాగమమును విధించెను- కాని యట్టి ప్రయోగములు లేవు. సూరి 'పరసపుందనము' అని సాధించెనె కాని యట్టి యెడల 'పు-ంపు' లనె విధింపలేదు.

పరుసందనము (ఉద్యో ౨ ఆ ౮౮.౩౫ -౩) ఎఱుకుందనము (హరి-పూ-౯ ఆ-౫౬ ప).

౨ వివ :-ఈ సూత్రమందలి గుణవాచక శబ్దముచేత 'తద్ధి' ట సూత్రమునకు లక్ష్యములగు 'నల్ల-తెల్ల' మున్నగునవి మాత్రము వాచ్యములగును గాని 'పెద్ద-గొప్ప' మున్నగునవి వాచ్యములు గావు. ఉదా :-పెద్దతనము=పెత్తనము. మొ.

సమాసంబునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది
వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగనగు. ౩౮. (బా-
సంధి-౩౬ సూ) (వ్యా-సం ౯౮-౯౮ 1 విష)

వికల్పము :-ప్రాఁత+ఇల్లు=ప్రాయిల్లు=ప్రాఁతయిల్లు. పూవు+రెమ్మ=పూరెమ్మ=పూవురెమ్మ.

అప్రవృత్తి .-కొత్త+కుండలు=కొత్తకుండలు.

నిత్యము :-మీఁదు+కడ=మీఁగడ. (౩౫ సూ. చో నుక్త)*

కార్యవిశేష :-క్రిందు+కాలు=క్రీఁగాలు ('క్రీ' అను దీర్ఘము విశేషము). కొత్తాదులును బ్రాఁతాదులలోనివె.

I అట్టి లుప్తశేషమునకుఁ బరుషసరళములు పరమగునపుడు కొన్నిట 'ను'గాగమము మాత్రమగును.

II కొన్నిటఁ బరుషములు పరమగునపుడు వైరీతిని 'ను' గాగమముగాని, యుత్తర పదాది ద్విత్వముగాని, యుభయమును గాని వైకల్పికముగ నగును.

---

* సూరి 'మీఁగడ' అను దానిని బ్రాఁతాదులలోఁ జేర్చి 'పందొమ్మిది' మున్నగువాని నన్యములలోఁ జేర్చుట సరికాదు. 'క్రొంజాయ - క్రొక్కారు' అను వానితో పాటుగ "పూఁదోఁట - పుప్పొడి" మున్నగువానిని 'క్రొత్తాదులలోఁ' జేర్పకుండుట సరికాదు. సూరి క్రొత్తాదులనుచు గణమునె యంగీకరింపలేదు.

III కొన్నిటఁ బగసదాది హల్ ద్విత్వము మాత్ర మగును. ౩౫. (బా-సంధి-౩౭-౩౮-౩౯ సూ) (వ్యా-సం. ౮౯ మొ. ౧౦౧ విమ.)

I ప్రాఁత+చదువులు=ప్రాఁజదువులు (మను. చ ౨ ఆ.)

లేఁత+ప్రాయము=లేఁబ్రాయము (అను ౨ ఆ-౪౬౦).

చెన్ను+తోవ=చెందోవ (ద్రోణ-౫ ఆ ౨౭౫) (చెన్ను శబ్దము వృత్తియందు శోణార్థకము.

మీఁదు+కడ=మీఁగడ-(నరస ౬౯.) పది+తొమ్మిది=పందొమ్మిది. పెను+దూళి=పెందూళి (పెనుపు శబ్దసంక్షేపము-పెను) (మార్కం ౬ ఆ ౧౦౭).

తొమ్మిది+పది=తొంబది (కర్ణ ౧ ఆ ౧౦౨-౧౧౪).

వంక+చెఱఁగు=వంజెఱఁగు-(స్త్రీ పార్శ్వచేలాంచలము).

సగము+కోరు=సంగోరు. క్రిందు+తోడ=క్రీఁదోడ (శాంతి ౧ ఆ ౨౧) క్రీఁగుప్పు-క్రీఁగాలు.

'క్రేకంటి లింగంబు డాకన్నుసూచి' (బసవ ౩ ఆ ౯౦౭. ఇట్టిది మఱొక్కచోటేని కానరాదు.)

II కెంపు+తామర=కెందామర. ¨ కెంపు+దూళి=కెందూళి (భీష్మ ౧ ఆ ౨౪౨) * కెంపు+జడ=కెంజడ.

---

¨ క్రొత్తశబ్దముతోపాటుగ 'కెంపు-పూవు' మున్నగువానిని జేర్చి క్రొత్తాదులని సూత్రించుట సూరి కర్తవ్యము. 'కెంధూళి' అని వర్గచతుర్థమును సూరి చూపుట చింత్యము. (వ్యా-సం-చూ-౯౯-విమ.) సరళపరకత్వమందును నరుదుగ 'నుక్కు' గానంబడునని సూత్రింపక 'కెంజడలు' అనుదానిని వింతగ సూరి చూపుట సరికాదు.

క్రొత్త+చీఁకటి=క్రొంజీఁకటి (వసు ౪ ఆ ౧౦).

క్రొత్త+పొగ=క్రొంబొగ (భాస్క—యుద్ధ. ౨౧౯).

క్రొత్త+కారు=క్రొక్కారు (విరా ౨ ఆ ౮౩).

క్రొత్త+తావి=క్రొత్తావి (విరా ౨ ఆ ౨౩౬) (పిన శకుం ౨ ఆ ౬౧).

క్రొత్త+గండి=క్రొగ్గండి (నన్ని-కు. ౧౧ ఆ ౭౦౨).

క్రిందు+గాలి=క్రిగ్గాలి (బసవ-౪ ఆ ౧౨౯).

పూవు+తేనె=పూఁదేనె. (మయూ ౪ ఆ ౫-౪).

పూవు+పోఁడి=పూఁబోఁడి (భీమ ౧ ఆ ౫౪).

పూవు+పొడి=పుప్పొడి (భీమ్మ ౧ ఆ ౨౪౨).

III నిండు+నెఱగు=నివ్వెఱగు. నిండు+నెఱ=నివ్వెఱ. (పారవశ్యము) నెఱ+తఱి=నెత్తఱి (నిండైన సమయము). నెఱ+నడుము=నెన్నడుము చక్కని నడుము) (సూ-రా-ని). నెఱ+మది=నెమ్మది. నెఱ+వడి=నెవ్వడి. క్రొత్త+ముడి=క్రొమ్ముడి. పూవు+విలుకాఁడు=పువ్విలుకాఁడు. మూఁడు+నాళ్ళు=మూన్నాళ్ళు. వేఁడి+నీళ్ళు=వేన్నీళ్ళు. (ప్రౌఢ సంధి ౧౯. సూ. అనావశ్యకము.) రెండు+నెలలు=రెన్నెల్లు. (భాస్కర-సుందర-౯౦౨). 'మూన్నాళ్ళు' మున్నగుచోట్ల హ్రస్వము కవిసమ్మతము కాదు. కాన 'మున్నాళ్ళు' అనరాదు.

౧ వివ :—ఈ లుప్తశేషములమీఁది 'నుక్కు'నకు సంశ్లేషము లేదు. 'ప్రాఙ్దువ్వు' అని యుండదు. (చూ-సంధి-౧౭). సామాసిక ద్రుతములకు స్వత్వములేదు. (చూ. సంధి-౨౯ సూ). దీర్ఘము మీఁద నిండుసున్న రాదు (సంజ్ఞా ౧౯ సూ) గాన నరసున్నరూపము మాత్రమె. ఉదా .-పూఁబోదలు. నుడి తొలిహ్రస్వముమీఁద నరసున్న యుండదు గాన నిండుసున్న రూపము మాత్రమె. ఉదా :— కెందామర-మొ.

౨ వివ :—కవిత్రయాది సమ్మతములు గాకున్నను నీప్రాంతాది సంధికార్యము లగుదుగ సంస్కృతోత్తరపదక మిశ్ర సమాసములందును జూపట్టుచున్నవి. (చూ-ప్రౌఢ. సంధి ౧౨ సూ). ముందు+కోపము=ముంగోపము. (ఉ. రా. 3 ఆ. ౮-౪). వెల్ల+చామరము=వింజామరము=వింజామర (ఆము ౪ ఆ.) (శేష ౫ ఆ). (౮-౪) క్రొత్త+మేఘములు=క్రొమ్మేఘములు (భీమ-3 ఆ ౬౭) నెఱ+మనము=నెమ్మనము (ఉ. హరి. ౧ ఆ. ౧౪౯.)

ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలి
యచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్త
టకారంబగు. ౩౬. (గా-సం-౪౦) (వ్యా-సం-౧౦౨.
౧౦౨ I వివ )

ఈ సూత్రంబునకు భృశార్థమునందలి ద్విరుక్తంబు విషయంబు. ఉదా :—కడ+కడ=కట్టకడ ఎదురు+ఎదురు=ఎట్టయెదురు. (ఆమ్రేడిత పరకమయ్యు సంధిలేదు) (చూ-సంధి-౧౧ సూ). కడ-ఎదురు-కొన-చివర-తుద-తెన్ను-తెరువు-నడుము - పగలు - పిడుగు-బయలు-మొదలు-ఇత్యాదులు కడాదులు.

౧ వివ :—'కట్టకడకు' మున్నగు చోటులందలి విభక్తి లోపాదిసిద్ధికయి యిట్టివానికిఁ గర్మధారయాతిదేశ మంగీకరితపఁబడెను. (చూడు-వ్యా-సం-విస్త-II-౧౦౨ I వివ). ఎదురెదురఁ (విరా. ౪ ఆ ౧౬౯ ప) మున్నగు ప్రయోగములను బట్టి యగుదుగ దీని కప్రవృత్తియుఁ గలదని గ్రహింపవలయును.

౨ వివ :—భృశార్థమందేకాక ముహురర్థమందును (మాటికి మాటికి); వీప్సార్థమందును (ఇంటింటికి) ద్విరుక్తులగును. అనుకరణార్థములందు నీషదూనార్థమందును (గుభుల్ గుభుల్ - తెల తెల వాఱె) ద్విరుక్తులగును గాని యివి భృశార్థకములె యనఁజనును.

నిందయం దామ్రేడితంబు నాద్యక్షరంబులకు

హ్రస్వదీర్ఘంబులకు 'గి-గీ' లగు. ౩౭. (బాల-ప్రకీ. ౨౨ సూ). (వ్యా-సం ౧౦౪ I వివ.)

కుంభకర్ణుఁడు గింభకర్ణుఁడు. రావణుఁడు గీవణుఁడు. భీష్ముని గీష్ముని (భీష్మ ౨ ఆ ౧౫౧). ఈ సూత్రమునకు భృశార్థ ద్విరుక్తియె విషయ మనఁదగును. అనాదరాతిశయ మిందలి భృశార్థము. ఇట్టి యాక్రోశాతిశయాదులందును ద్విరుక్తియఁగును. ఉదా .-నేను దాసినే దాసినే (సభా-౨ ఆ ౨౪౪) *

ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు. ౩౮. (బా-సం-౪౧.) (వ్యా-సం ౧౦౩ వివ.)

అప్పటికిని+అప్పటికిని= ♦ అప్పటప్పటికిని=అప్పటికినప్పటికిని. అక్కడను+అక్కడను=అక్కడక్కడను=అక్కడనక్కడను. ఇంటను+ఇంటను=ఇంటింటను=ఇంటనింటను. ఊరను+ఊరను=ఊరూరను=ఊరనూరను. అంతటను విభక్తిలోపపక్షమున సంధి ౧౦ సూత్రము చొప్పున నిత్యపరరూపసంధి నెన్నునది. విభక్తి లోపాభావపక్షమున సంధి ౧ సూత్రముచే నిత్యమగు 'ఉ' కార పరరూపసంధి గల్గును.

౧ వివ .-బహుళ గ్రహణముచేత నంతిమాక్షర లోపాదికం బును నగును. ఇంచుక+ఇంచుక=ఇంచించుక=ఇంచుకించుక. నాఁడు=నాఁడు=నానాఁడు=నాఁడునాఁడు. నాఁడు నాఁటికిన్-అంతంతటన్.

---

* ఇట్లు వచింపక 'ఆదరార్థంబున ద్విరుక్తియగు' (ప్రౌ-శబ్ద-౧౧౩ సూ) అని ప్రౌఢవ్యాకర్త సూత్రించుట వివేకరాహిత్యకృతము.

♦ స్వరపరకత్వమున ద్రుతస్వరలోప మసంభవము గానఁ సూరి ('ను-ని' అనియే యితని పక్షమునను ద్రుతస్వరూపములు) 'అప్పటికిన్+అప్పటికిన్' అని నకారస్వరూపముతో నుదాహరించుట పొరపాటు.

ము ఒక్కఁడొకండు. (ఉద్యో ౨ ఆ ౧౬౩) తుట్టందుదిదాఁక (భాస్కర-యుద్ధ-౨౬౮) హరిహరీ-హారిహరి. బలిబలీ-బలీబలి. ము.

'అందదుకు' ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౩౯. (బా-సంధి-౪౨.) (వ్యా-సం-౧౦౪ వివ).

అదుకు+అదుకు=అందదుకు=(మిక్కిలి యదుకు గలది). ఇంకులు+ఇంకులు=ఇట్టింకులు=(మిక్కిలి యింకుటలు). ఇగ్గులు+ఇగ్గులు=ఇల్లిగ్గులు=(మిక్కిలి వెనుదీయుటలు). చెదరు+చెదరు=చెల్లచెదరు=చెల్లాచెదరు. (మిక్కిలి చెదరుట). తుమురు+తుమురు=తుత్తుమురు=(మిక్కిలి చూర్ణమగుట). తునియలు + తునియలు = తుత్తునియలు = (మిక్కిలి తునుకలగుట.) మిట్లు+మిట్లు = మిఱుమిట్లు = (తేజోదర్శనమునఁ గన్నులు మిక్కిలి త్రిప్పుట). వట్టులు+వట్టులు=వఱువట్లు=(మిక్కిలి యెండుటలు) వేలు+వేలు=వేనవేలు=(పెక్కువేలు) వీఁగు+వీఁగు=విఱ్ఱవీఁగు=(మిక్కిలి వీఁగుట=మిక్కిలి నిక్కుట). ఇత్యాదులు.

౧ వివ:—తనంతన్-వానికి వాఁడె-నాకు నేనె-తను దానవాఁడె (వచ్చె). మున్నగు జంటలు స్వయమర్థకములు.

౨ వివ:—నామపదంబులారాద్యర్థపరకంబులై వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబులగు. ఉదా:—నీకిది యర్హమయ్యా=(నీకిది యర్హము కాదని యర్థము).

చేతఁదోడవలనల కిత్యంబు సమాసములం దగు.

౪౦-(బా-సంధి ౪౩). (వ్యా-సం-౧౦౫ వివ).

ఇవి మధ్యమపదలోపాలుక్ సమాసములు. నీచేతను * +ప్రోపు=నీచేతిప్రోపు=(నీచేతిసంభవించుప్రోపు). (చేతను మున్నగువాని తుది 'అను' అనుచో 'ఇ' నిల్చునని యర్థము). నీతోడను+చెలిమి=నీతోడి

* "నీచేతన్+ప్రోపు" అను సూరి యుదాహృతి సరికాదు. అట్టి దుత్వస్వరలోపమున కాధారమేమి?

చెలిమి=(నీతోనగు చెలిమి). నీవలనను+భయము=నీవలని భయము-(నీ వలనఁ గలుగు భయము).

అంద్వాందుల కలిగాగమంబు సమాసమునం దగు --

౪౧. (శా-సంధి. ౪౪). (వ్యా-సం-౧౦౬ వి).

నాయందును* +కరుణ=నాయందలి కరుణ. (ఈ సూత్రము సలుక్సమాసవిషయమె).=(నాయందున్న కరుణ) అందును+వారు=అందలివారు=(అందున్న వారు). ఇందును+వారు=ఇందలివారు =(ఇందున్నవారు).

౧ వివ :-ఈ సూత్రమందును వెనుకటి సూత్రమందును నాచ్ఛకాది ప్రకృతినిర్దేశము లేమింజేసి యివి నాంప్రకృతికాది త్రివిధములుగను నుండును. ఉదా :-రాముని చేతిప్రోపు. నీ చేతి రక్షణము. నీ యందలి గారాము. మొ.

౨ వివ :-ఈ రెండు సూత్రముల విధానసామర్థ్యము చేతనే చేతాదివిభక్తి లోపాభావము నుత్తరపదలోపి సమాసమును జ్ఞాపకసిద్ధము లగుచున్నవి.

3 వివ :-'అందును-ఇందును-ఎందును' అను సప్తమ్యర్థకశబ్దములు గలవు. కాన వాని సప్తమ్యర్థక ద్వితీయా బహువచనములు

---

† సూరి యంద్వాదులకని సూత్రించి 'అందు-ఇందు-ఎందు' అనువాని నంద్వాదులుగఁ బరించి 'ఎందు' అను దానికిఁ గొందఱు సమ్మతింపరని వ్రాయుట యసంగతము- 'ఎందలివారు' అను ప్రయోగమే లేదు

* 'నాయందున్' మున్నగుటిని నకారవ్యంజనముతో సూరి యుదాహరించుట సరికాదు- అతనిపక్షమున ద్రుతస్వరలోపమెట్లు ?

♦ 'అందు' అను సప్తమీప్రత్యయమే కాక సప్తమ్యర్థకము లగు 'అందు-ఇందు-ఎందు' అను శబ్దములును గలవు. కాన 'అందలివారు-ఇందలివారు' అనునవి సుసంగతములు.

'అందులను-ఇందులను-ఎందులను' అనియు, షష్ఠీ బహువచనములు 'అందులకును-ఇందులకును-ఎందులకును' అనియు, 'అందులవారు-ఇందులదానవు-ఎందులవారు' మున్నగునవియు వెలయుచున్నవి.

'అది-అవి' అను శబ్దంబుల † యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగనగు. ౨౨. (బా-సంధి-౨౫).

(వ్యా-సం-౧౦౭. ౧౦౭ I వి).

నా+అది=నాది=నాయది. నా+అవి=నావి=నాయవి. చేసిన+అది=చేసినది=చేసిన యది. చేయుచున్న+అది=చేయుచున్నది=చేయుచున్న యది. తెల్ల+అది=తెల్లది=తెల్లనిది. మొ. చేసినదగు-చేసినదై-మొదలగురీతి నివి విధేయ, విశేషణములు నగును.

ఉదంతములగు తద్ధర్మవిశేషణములమీఁద లోపంబు లేదనియు, 'ఇ' కంత తద్ధర్మవిశేషణములమీఁద లోపంబు నిత్యమనియు బహుళగ్రహణముచే నెఱుంగునది. ఉదా:-వచ్చు+అది=వచ్చునది. వచ్చెడు+అది=వచ్చెడునది. వచ్చెడి+అది=వచ్చెడిది.

౧ వివ :-సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో సమాసముగల్గఁగాఁ బ్రకృతి సూత్రము చెప్పునఁ దచ్ఛబ్దాకారలోపము గల్గఁగా 'నాది' మున్నగు రూపములు సిద్ధించును. సమాస. సూ ౮-౨-౨ వివరణము చెప్పిన విశేషణములకు విభక్తి వివక్షయందు "అది-అవి" అనువానితో సమాసాభాసము గల్గఁగా వాని 'అ' కారమునకును బ్రకృత సూత్రము చెప్పిన లోపము గల్గుటచేత 'చేసినది' మున్నగు రూపములు గల్గును. ప్రయో :-విననివి (ఉద్యో-3 ఆ ౫౦) కూలెడివి (భీష్మ-౨ ఆ-౨౧3).

౨ వివ :-ఉదంత తద్ధర్మార్థక విశేషణములమీఁదనే కాక

† 'అదియవిశబ్దంబుల' అను సూరి సిద్ధసమాసము ప్రామాదికము. సిద్ధసమాసమున యణాదేశాభావ మెట్లు? సంహితా 'య' కార మెట్లు?

'ఉ' దంత నామములమీఁద సైతము సమాసమున 'అది-అవి' అనుశబ్దముల 'అ' కారము నిత్యముగా లోపించును. ఉదా :-రాజుయొక్క+అది=రాజుది. ఆడు+అది=ఆడుది. (ఆడదితప్పు-'ఆటది' అని యుండును). ఇట్టియెడల సంధి ౩-౨ సూత్రము చెప్పిన 'ను' గాగమము గల్గదు. అద్యవి శబ్దేతరస్థలములందే ౩-౨ చెప్పిన నుక్కు వర్తిల్లును.

౩ వివ :-'ది-వి' అను షష్ఠీప్రత్యయములచోట దీనిని వాడుక చేసి భ్రమింపరాదు-ఉదా :- దానిది కలయఁపు (భార-౭ ఆ ౩౦ ప) వారివ (భార-ఆది ౩ ఆ ౧౫౬) (వారివి+అస వారివ)-ఇట్టివి షష్ఠిప్రత్యయములగునపుడు 'అగు' ధాతువుతో నన్వయింపవు. అనఁగా షష్ఠ్యంతములు విధేయ విశేషణములు కావు.

పడ్వాదులు పరంబులగునపుడు 'ము' వర్ణకంబునకు
లోపపూర్ణబిందువులు విభాషనగు. ౭౩ (బా-సం-౭౬)
(వ్యా-సం-౧౦౮-౧౦౮ I వి).

భయము+పడె = భయపడె=భయంపడె=భయముపడె అవమానము+పెట్టు=అవమానపెట్టు= అవమానంపెట్టు = అవమానముపెట్టు. అవమానపెట్టి (ఆశ్వ ౧ ఆ ౧౬౮) * సూత్రము+పట్టు=సూత్రపట్టు=సూత్రంపట్టు=సూత్రముపట్టు. (ఆము ౧ఆ ౫౩) పడు-పెట్టు-పట్టు మున్నగునవి పడ్వాదులు- వీని రూపవిశేషము పరమగునపుడును నిట్టి కార్యములు సంభవించును. ఉదా :-భంగపడుచు (విరా ౨ ఆ ౧౫౬) దైన్యము+పాటు=దైన్యపాటు. (శాంతి ౩ ఆ ౩౮౯).

౧ వివ :-ప్రాప్త్యర్థక పడు ధాతువే యీ సూత్రమునకు విషయము. పతనార్థకము కాదు. ఉదా :-గజము పడియె.

౨ వివ :-ఇందలిది వ్యవస్థిత విభాష గానఁ గొన్నిట నీ విధి

---

* సూరి తిక్కన ప్రయోగమును జూచి కొనలేదు-కావున నె 'పెట్టు' శబ్దము నుదాహరింపక 'పట్టు' శబ్దము నాముక్తమాల్యద లోని దాని నుదాహరించెను.

సరిగా వర్తిల్లదు. ఉదా :-'అగ్గము+పడు=అగపడు' ఇట 'అగంపడు-అగముపడు' అనునవి లేవు. 'పదపడి=పదంపడి' అనుచో 'పదముపడి' అను రూపము లేదు.

3 వివ :-దీని లక్ష్యములందు సంధి ౧౪ సూత్రము చెప్పిన వచ్చు 'వ' దేశమునకు భారతమున లక్ష్యము కానరాదు. వకారాదేశము వచ్చుట కిందలి పూర్ణబిందు విధి ప్రతిఘటిల్లును. (చూ-సంజ్ఞా ౧౬ సూ).

ప్రార్థనాద్యర్థకమధ్యమ 'ము' వర్ణకమున కంతటను లోపము విభాషనగు. ౪౪. (బా-సంధి-౪౭-౪౮ సూ). (వ్యా-సం ౧౦౯-౧౧౦ వివ). *

చూడుము+నన్ను=చూడు నన్ను=చూడుము నన్ను. నమ్ముకుము+ఇట=నమ్ముకిట=నమ్ముకుమిట, ఇటు చూడుము=ఇటు చూడు. చెప్పుము+అనినన్=చెప్పనినన్=చెప్పుమనినన్. స్వరపరకత్వమందును గవి ప్రయోగములందు 'ము' లోపము గలదు- క. నినుఁ గూల్చెదఁ। జూ యెవ్వత నైతినేమి (భీష్మ 3 ఆ 3౨౫). ఆడిదె నీదు పందెము (కళా ౬ ఆ) భవచ్చిత్తేప్సితంబెద్ది చెప్పనిన్ (మార్క-౦-౨ ఆ) (చూ-ప్రౌఢ-సంధి౧౮సూ). నెఱచియుండింతియు (బసవ. ౨ఆ౧౦3)

౧ వివ :-'అ-ఆ-ఈ' మున్నగు నేకస్వర శబ్దయోగమున 'ము' లోపము గల్గదు. ఉదా :-చూడు మీ (ఉద్యో 3 ఆ ౪౫). రక్షింపుమ...(ఆది ౨ ఆ ౨౧౭).

---

* సూరి వ్యతిరేక ప్రార్థనమందు మాత్రమె స్వరపరకత్వమున మధ్యమ 'ము' లోపమును సూత్రించెను- కేవల ప్రార్థనమందును మహాకవులు 'ము' లోపమును స్వరపరకత్వమందును బ్రయోగించిరి- కాన బాల-సంధి-౪౭-౪౮ సూత్రములు నిర్మూలములు. తిక్క-యజ్వయే స్వరపరకత్వమునందును గేవల ప్రార్థనమున 'ము' లోపమును బ్రయోగించెను. (చూ-మీఁద-భీష్మ 3 ఆ 3౨౫ ప).

౨ వివ :—ఈ 'ము' వర్ణకమే కాక దీనికి ముందటి ధాతూకారము లోపించుటయుఁగలదు-ఉదా:-భానుసమాల 'విన్'(కవిజనా)

ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ 'ము-డు' జ్ఞులకు లోపంబు విభాషనగు. ౭౫. (బా-సంధి-౭౯) (వ్యా-సం-౧౧౧ I వి).

ఉండుము+ఉండుము = ఉండుండుము = ఉండుముండుము. కొట్టుఁడు+కొట్టుఁడు=కొట్టుకొట్టుఁడు=కొట్టుఁడు కొట్టుఁడు. (ఆమ్రేడితి స్వర పరరూప సంధి నిత్యము. చూ-సంధి ౧౦).

౧ వివ .—స్వరపరకత్వమున 'డుజ్' లోపమునకుఁ బ్రయోగము లభింపలేదు-('ఉండుండుఁడు' వంటి ప్రయోగము లేదు.)

౨ :—'ము-డు' జ్ఞులు లోపించునపుడు తన్నిమిత్తక (చూ-క్రియా ౬౧ సూ) హ్రస్వము దీర్ఘమె యగును- ఉదా :-కొమ్ము+కొమ్ము=కోకొమ్ము. (భీష్మ 3 ఆ 3౧౬). కొండు+కొండు=కోకొండు. (భాస్కర. కిష్కిం-౬౫౫ ప). (చూ-ప్రౌఢ-సంధి-౬3సూ)

అనుకరణంబున 'అను' ధాతు పరకత్వమున విసర్గము లోపించును. అకార పూర్వక విసర్గము. 'ఓ' కారము విభాషనగు. ౭౬. (బా-సంధి-౭౦) (వ్యా-సం. ౧౧3 I విమ.)

వర్ధితాం శ్రీః+అనియె=వర్ధతాం శ్రీయనియె (లక్ష్మి వర్ధిల్లుగాక) తుభ్యం నమః+అనె=తుభ్యం నమోయనె=తుభ్యం నమయనె * గతానుగతి కో లోకో యటంచున్.

౧ వివ :—ఈ యనుకరణ సంధి విధులచేతనే తెల్గున ననుకరణ రహిత సంస్కృతాదిపద వాక్యములను బ్రయోగింపరాదనివిశద

* సూరి మఱికొన్నిట నీ యోత్వము వచ్చు ననవేల? ఓత్వమంతటను వైకల్పికముగ నగుననుట లెస్స. జీవస్థాయ నమోయనంగ. (ఉ-హరి. ౨ ఆ ౧3౦). రుద్రో యన్న యట్లు (బసవ ౬ ఆ ౭౫3.) సూరయో యనఁగ (బసవ ౬ ఆ ౮౦౧.) మొ.

మగుచున్నది. అనుకరణ మనఁగా భాషాంతరములలోని పదవాక్యములను యథాస్థితముగా వేఱొక భాషలో నిల్పుట యని యర్థము అట్టి యనుకరణము తెల్గున నచ్చాంధ్రశబ్దమగు "అను"=(అనిచెప్పు) అనెడి ధాతువు రూపములతోఁగాని (ఇవి 'అట్టి' శబ్ద పూర్వకములును గలవు). 'ఇతీత్థం' ప్రభృతి సంస్కృత శబ్దఘటిత సమాసములతోఁగాని చేయఁబడును. (అనుకరణ శబ్దగతమగు 'అను' శబ్దము సంస్కృతమందలి యుపసర్గము. అది తెలుఁగు శబ్దమని భ్రమింపరాదు.) అనుకృత సంస్కృతవాక్యముయొక్క యాద్యంతాక్షరములిరు ప్రక్కలనుండు తెల్గు పదములతోఁ దెలుఁగు సంధికార్యముల నందును. అట్లగుటచేత నీ యనుకరణ సంధి సూత్రములచేత 'అను' శబ్దముతో సంధులను నడపవలెను. తక్కిన యనుకృత సంస్కృత వాక్య మధ్యమున సంస్కృత సంధులె వర్తిల్లును- ఉదా:-శా."శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్ తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరాః శ్రేయసే యని... ..స్తుతియించి" (ఆది-౧ ఆ ౧౨). (అనుకృతశ్లోకములందుఁ బ్రాస విశ్రమములుండ నక్కఱలేదు).

సంస్కృత శబ్దానుకృతి :—

శా-అర్థావాగ్వి బుధ ప్రహో వచన కవ్యాహార మాహావచః
స్నిగ్ధ మ్మాః కృతతాం గతః కలిరితి శ్రీసూక్తివిద్యాధర మిద్ధాద్ధత్య
మగాల్ల యం హి కుధియా మిత్థంవదత్కిన్నరం బద్ధీరాగ్రిణి గెల్పు
టుత్సవమునం దయ్యె న్నభం బయ్యెడన్ (ఆము ౭ ఆ ౬ ప).

౨ వివ :- తెనుఁగు వాక్యముల నడుమ ననుకరణ రహితముగా 'సదా-సర్వదా-సర్వత్ర-వృథా-జయ-జయజయ' మున్నగు నలంతి సంస్కృత పదంబులు మహాకవులచేఁ బ్రయోగింపఁబడినవి.

"సర్వత్రి నిలింపకామినుల వాడకు" (ఆము-పీఠి 3౭). 'వృక-హో-స్వస్తి' మున్నగునవి యన్ననో సంస్కృత సమశబ్దములె. "వృక సేయఁగాఁదగదు" (ఆది ౨ ఆ ౨౩౨). "అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి" (జై. ౮ ఆ పౌఢ-సంధి ౧౫ సూ). అను రీతి గల వింత ప్రయోగము ('నమశ్శివాయ' అనునది పంచాక్షరీమంత్రము) లరుదుగఁ గలవు. ఇంత మాత్రమునఁ దెల్గునందును మణిప్రవాళరీతి (ఇది మలయాళమున ధారాళముగ నున్నది) గలదని తలంపరాదు. (చూ-ద్రావి-పరి-౧౫ III విమ). భాషాంతర విభక్త్యంతములు తెల్గు మున్నగు వానిలో నుండుట మణిప్రవాళరీతి.

అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు.

౮౭. (బా - సంధి - ౫౨) (వ్యా - సం - ౧౧౮ I వి).

కింతత్ + అనియె = కింతత్తనియె = (అదియేదనెను).

కస్త్వమ్+అనియె=కస్త్వమ్మనియె=(నీవెవ్వఁడవనెను).

౧ వివ:—'తత్-తద్' అను 'చర్త్వ-జశ్త్వ' రూపములు (చర్-జశ్ ప్రత్యాహారములు-చూ-సంజ్ఞా ౧ సూ) రెండును సంస్కృతమునఁ గలవు. కాని యందలి 'చర్త్వ' రూప 'త' కారమునకె ద్విత్వము గల్గును. 'కస్త్వమ్' అనుచోఁ దుదిని మకారమె నిల్చును. హల్పరకత్వము లేదుగాన నచట నిందుసున్న రానేరదు. దాసోఽహమ్+అనె=దాసోఽహమ్మనె. (నన్నయ నిత్యమె యనెను.)

అనుకరణంబునందు 'తవ్యా'దుల మకారంబునకు ద్విత్వము విభాషనగు ౮౮ (బా-సం. ౫౩) (వ్యా-సం ౧౧౫ I వివ).

తత్కర్తవ్యమ్ + అనె = తత్కర్తవ్యమనె = తత్కర్తవ్యమ్మనె. సర్వ మసహ్యమన న్నెఱుంగవే (మను 3 ఆ) భోక్తవ్య మన్మాటలున్ (ఆము ౧ ఆ ౬౮). తవ్యాదు లనుటచేత "నయనం ప్రధాన

మను (విరా ౨ ఆ ౩౫) పాతు మను తు మున్నంతములు (ఆం-భూ-౨౦ ప)" ఇత్యాదుల నెన్నునది. * ♦

అనుకరణము పరమగునపుడు సంస్కృతపదము తుదిదీర్ఘము హ్రస్వమగునని యప్పకవి వ్రాసెను. అట్టి వ్రాఁత ప్రామాదికము. "సంహార్త్రి యనఁగ (అప్పక-౫ ఆ ౯౭ ప) సహారేస్తు పరస్త్రాత యనుట" (అప్పక-పీఠిక. ౧౭ ప.) హ్రస్వము రామికి దుర్బలస్య బలం రాజా యన వినవే (మనుచ. ౪ ఆ ౭౪).

ధ్వన్యనుకరణమున ద్విరుక్తి బహుళముగ నగు. అట్టియెడల 'అను' ధాతు పరకత్వమున ముగాగమం బగు. ఉ- (ప్రౌఢ-సంధి-౧౯--౨౦) (వ్యా-సం ౧౧౫-౧౧౬ విష.)

తళతళమనియె. (కర్ణ ౧ ఆ ౬౦) కనకనమను (రామా ౬ ఆ. ప్రౌఢ.

---

* సూరి 'అహ' మాదులకు ద్విత్వము వైకల్పికమని సూత్రించుట సరికాదు. చింతామణి కర్త 'అహమాదీనాం ద్విత్వే' మ్మని నిత్యముగా ద్విత్వమును సూత్రించెను. 'దాసోహమనె' అను రీతిగల ద్విత్వాభావము మహాకవిప్రయోగములలో లేదు.

♦ ఇట సంధి ౫౪ సూత్రముగ సూరి "ఉదంత నామంబున కనుకరణంబునందు 'వు' గాగమంబగు" అని సూత్రించి యుదాహరించెను. ఉదా : ఇయంధేనుః+అనె=ఇయంధేనువనె. ఇత్యాది కేవలము ప్రామాదికము గాన నిది విడువఁబడెను. కవిజనమండనము నథర్వణ కారికల టీక మూలమునఁ గావలయు సూరి యిట్టి ప్రమాదమునకు లోనయ్యెను. (చూ-వ్యా-సం-౧౧౫-౧౧౬ విష). 'ఇయంధేనువనె' అనురీతిగల వుగాగమమునకుఁ గవి ప్రయోగములు లేవు. 'ఇయంధేననె' అనియె యుండును.

౧ వివ :—ధ్వన్యనుకరణమున 'అను' శబ్దప్రయోగ రాహిత్యమును గలదు. వడవడ జమదగ్నిసూతి వడఁకెఁ (రామా ౭ ఆ ప్రౌ) వేసవిఁ గనగనవేఁగు చట్టాతిపై (నిర్వ 3 ఆ ౬3) ధ్వన్యనుకరణమున ద్విరుక్తి రాహిత్యమును గలదు. ఉదా : ఢిండిమదుందుభుల్ గుభులనన్ (ఉ. హరి. ౭ ఆ ౨౧౨).

వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదు.

౫౦. (బా-సంధి. ౫౫ సూ) (వ్యా-సం-౧౧౭ I వివ).

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు. ఇట్టి సంధి విరహంబు పద్యకావ్యంబులందుఁ గాదాంతమంద చూపట్టెడు.

౧ వివ .—ఈ సూత్రమందలి సంధిశబ్దము వివిధసంధికార్యపరము. పరరూపసంధి-సంహితాయకారస్థితి సరళాదేశాదికమును లేకపోవచ్చునని యర్థము.

౨ వివ :—వాక్యాంతమున సంధిలేమి దోషంబుగాదనుటచేత వాక్యమధ్యమున సంధికార్యము మానరాదను నర్థము లభించుచున్నది. కాన 'అతఁడు అప్పుడు అచ్చట చంద్రుని చూచె' అనురీతి వాక్యములు దుష్టములని భావము. దోషంబు లేదనుటచే వాక్యాంతమున సంధిచేసినం జేయవచ్చును.

3 వివ :—పద్యములందు వాక్యాంత పాదాంతములు రెండును సంభవించినపుడె యని యెఱుంగునది. గీ. సత్యంబుతో సరియుఁ గావు ఎఱుఁగుము (ఆది-౭ ఆ-౯౫) పడగనున్న హనుమ భయవిహ్వలుఁడుగాఁకు అరదమునకు సూతుఁ డచ్యుతుండు (ఆహో. ౧౮౭ పుట) ఆ. వె. అంతఁ గొంచ అధిక హాస్యంబు సేసిరి అడవి నేమి రోసె దనిరి కొందఱు (అర ౨ ఆ ౧౦3) ఆ. వె. క్రమము వడసి యొకట సమయంబు సేసిరి ఒనర దాని తెఱఁగు .. (ఆది ౬ ఆ-౨౬౭). ఇవి నన్నయ పద్యములు. నన్నయ ప్రథమపురుషసంధియు

నిత్యమె యని సూత్రించె. ఆతని భారతభాగమం దిట్లు పాదాంతవా క్యాంతస్థలమందుఁ దప్ప సంధిని పూనలేదు.

౪ వివ :—గద్యపద్యాంతములందు వాక్యమధ్యమైనను నుత్తర పద్యాదివర్ణముతో సంధి చేయరాదు. గద్య :—అవ్వగంబు సొచ్చు నప్పుడు. చ. అతి రుచి రాగతుండయిన...(ఆది-౪ ఆ ౧౬-౧౭ ప).

౫ వివ :—ఏకప్రాసకములగు మాలికలందు నాల్గుపాదముల కెక్కుడైనను వాని నొక్క పద్యముగనె యెన్నవలయును.

౬ వివ :—ద్విపదలందుఁ బైనియమములు చెల్లలేదు. తుదికిఁ బదమధ్య పాదావసానమును జూపట్టుచున్నది. ద్విపద. జాతులు మాత్రానుసంధానగుణ వి నీతులు గాన యఁనియతగనైు య నియు ను బ్రాసో వాయఁనియు యతిర్వాయ నియుఁ జెప్పు (పంకితా.) ప్రాసభేదముచే నివి భిన్నపద్యము లనకతీరదుగదా.

ఇది సంధిపరిచ్ఛేదము.

---

# బాలవ్యాకరణోద్ద్యోతము

## తత్సమపరిచ్ఛేదము

### సంస్కృత సుబంత శబ్దములు

౧ వివృతి :—సంస్కృతమున ద్వివచనమును గలదు. అదియుఁ దెల్గున బహువచనమె యగును. సంస్కృతమున లింగము పారిభాషికమె. (చూ-తత్స-౧౭ సూ. ౪ వివ). ఈ శబ్ద మీ లింగముతో నుండునని కోశాదులవల్లఁ దెలియఁదగినదె. సంస్కృత నామము లజంతములు హలంతములు నని రెండువిధములు. ధాతువుపైని "కృత్ప్రత్యయ"ములు నిల్చుటచేతను నామములపయిని తద్ధితప్రత్యయములు నిల్చుటచేతను నామములనఁగాఁ బ్రాతిపదికము లేర్పడును వానిపైని సుప్పులు నిల్చుటచేఁ పదములగును. పదసముదాయము వాక్యము- ప్రాతిపదికముపైని సుప్పులు నిల్పెడి ప్రక్రియ సంస్కృత వ్యాకరణమునఁ గలదు- ఇందట్టి ప్రక్రియచే సిద్ధించిన రూపములె కొన్ని చూపఁబడును.

విభక్తులు :—'సు-ఔ-అస్'=ప్రథమా విభక్తి. ఇవే సంబోధన ప్రథమా విభక్తి ప్రత్యయములు. 'అమ్-ఔ-అస్' ద్వితీయా విభక్తి ప్రత్యయములు. 'ఆ-భ్యామ్-భిస్' తృతీయా విభక్తి ప్రత్యయములు. 'ఏ-భ్యామ్-భ్యస్' చతుర్థీ విభక్తి ప్రత్యయములు 'అస్-భ్యామ్-భ్యస్' పంచమీ విభక్తి ప్రత్యయములు. 'అస్-ఓస్-ఆమ్' షష్ఠీ విభక్తి ప్రత్యయములు. "ఇ-ఓస్-సుప్" సప్తమీ విభక్తి ప్రత్యయములు. వీనిలో 'సు' అనుదాని 'ఉ'కారమును 'సుప్' అనుదాని 'ప'కారమును 'ఇత్సంజ్ఞములు'. 'సుప్' అనునది ప్రత్యాహారము. ఇవి తుదిని గల పదములు 'సుబంతములు'. వీనిలో మొదటి దేకవచనము- రెండవది ద్వివచనము- మూఁడవది బహువచనము- ఇట

మాదిరికిఁగాఁ గొన్ని యజంతములును హలంతములును జూపఁబడును- వీనినిబట్టి తక్కినవాని నూహించునది. వీనిలో సిద్ధసమాస సంధులను యథాసంభవముగా నుపయోగించునది.

అకారాంత పుంలింగ 'రామ' శబ్దము (రాముఁడు)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | రామః | రామౌ | రామాః | చ. | రామాయ | రామాభ్యామ్ | రామేభ్యః |
| సం. | (హే) రామ | రామౌ | రామాః | పం. | రామాత్ | రామాభ్యామ్ | రామేభ్యః |
| ద్వి. | రామమ్ | రామౌ | రామాన్ | ష. | రామస్య | రామయోః | రామాణామ్ |
| తృ. | రామేణ * | రామాభ్యామ్ | రామైః | స. | రామే | రామయోః | రామేషు ♦ |

ఇకారాంత పుంలింగ 'హరి' శబ్దము (విష్ణువు)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | హరిః | హరీ | హరయః | ద్వి. | హరిమ్ | హరీ | హరీన్ |
| సం. | (హే) హరే | హరీ | హరయః | తృ. | హరిణా | హరిభ్యామ్ | హరిభిః |

* షకార-రేఫ- ఋకారములకుఁ దర్వాతనున్న 'న'కారము సమాన పదమున ణకారమగును. వాని నడుమ 'అచ్చులుగాని, 'హ-య-వ' లు గాని, కవర్గ పవర్గములుగాని వ్యవధానమున్నను నుండవచ్చును. ఉదా :-రామేణ-రామాణామ్. (చూ-సం-త. ౫ సూ ౨ వివ).

♦ అకారేతరములగు నచ్చులకును, 'హ-య-వ-ల'లకును 'క' వర్గమునకును దర్వాతనున్న ప్రత్యయాగమాదేశ సంబంధి 'స' కారము పదమధ్యమున 'ష'కార మగును. 'నుమ్-విసర్గ'ములు వ్యవధానములుగ నున్నను నుండవచ్చును. ఉదా :-రామేషు. (చూ-సం-తద్ధి ౧౫ సూ).

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| చ. | హరయె | హరిభ్యామ్ | హరిభ్యః | ష. | హరేః | హర్యోః | హరీణామ్ |
| పం. | హరేః | హరిభ్యామ్ | హరిభ్యః | స. | హరౌ | హర్యోః | హరిషు |

ఉకారాంత పుంలింగ 'గురు' శబ్దము (గురువు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | గురుః | గురూ | గురవః | చ. | గురవే | గురుభ్యామ్ | గురుభ్యః |
| సం. | (హే) గురో | గురూ | గురవః | పం. | గురోః | గురుభ్యామ్ | గురుభ్యః |
| ద్వి. | గురుమ్ | గురూ | గురూన్ | ష. | గురోః | గుర్వోః | గురూణామ్ |
| తృ. | గురుణా | గురుభ్యామ్ | గురుభిః | స. | గురౌ | గుర్వోః | గురుషు |

ఋకారాంతపుంలింగ 'ధాతృ' శబ్దము (బ్రహ్మ).

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ధాతా | ధాతారౌ | ధాతారః | చ. | ధాత్రే | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| సం. | (హే) ధాతః | ధాతారౌ | ధాతారః | పం. | ధాతుః | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| ద్వి. | ధాతారమ్ | ధాతారౌ | ధాతౄన్ | ష. | ధాతుః | ధాత్రోః | ధాతౄణామ్ |
| తృ. | ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః | స. | ధాతరి | ధాత్రోః | ధాతృషు |

ఋకారాంత పుంలింగ 'పితృ' శబ్దము (తండ్రి)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | పితా | పితరౌ | పితరః | ద్వి. | పితరమ్ | పితరౌ | పితౄన్ |
| సం. | (హే) పితః | పితరౌ | పితరః | | శేషము 'ధాతృ' శబ్దమువలె నుండును. | | |

ఇట్లు-భ్రాతృ జామాతృ (అల్లుఁడు) దేవృ (మగని తమ్ముఁడు) నృ (మనుష్యుఁడు) సవ్యేష్ఠృ (సారథి) "పితా, మాతా, ననాన్దా,। సవ్యేష్ఠృ, భ్రాతృ, యాతరః,। జామాతా, దుహితా, దేవా,। నప్తృసన్తా ఇమే దశ॥" ద్వితీయా

బహువచనమున స్త్రీ పుంలింగములకు భేదముండును. ఉ: పితౄన్ - మాతౄః మొ.

ఓకారాంత పుంలింగ 'గో' శబ్దము -(ఎద్దు) ('ఆవు' అర్థమైనచో స్త్రీ లింగము).

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | గౌః | గావౌ | గావః | చ. | గవే | గోభ్యామ్ | గోభ్యః |
| సం. | (హే) గౌః | గావౌ | గావః | పం. | గోః | గోభ్యామ్ | గోభ్యః |
| ద్వి. | గామ్ | గావౌ | గాః | ష. | గోః | గవోః | గవామ్ |
| తృ. | గవా | గోభ్యామ్ | గోభిః | స. | గవి | గవోః | గోషు |

ఆకారాంత స్త్రీలింగ 'రమా' శబ్దము (లక్ష్మి)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | రమా | రమే | రమాః | చ. | రమాయై | రమాభ్యామ్ | రమాభ్యః |
| సం. | (హే) రమే | రమే | రమాః | పం. | రమాయాః | రమాభ్యామ్ | రమాభ్యః |
| ద్వి. | రమామ్ | రమే | రమాః | ష. | రమాయాః | రమయోః | రమాణామ్ |
| తృ. | రమయా | రమాభ్యామ్ | రమాభిః | స. | రమాయామ్ | రమయోః | రమాసు |

ఈకారాంత స్త్రీ లింగ 'గౌరీ' శబ్దము (పార్వతి)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | గౌరీ | గౌర్యౌ | గౌర్యః | చ. | గౌర్యై | గౌరీభ్యామ్ | గౌరీభ్యః |
| సం. | (హే) గౌరి | గౌర్యౌ | గౌర్యః | పం. | గౌర్యాః | గౌరీభ్యామ్ | గౌరీభ్యః |
| ద్వి. | గౌరీమ్ | గౌర్యౌ | గౌరీః | ష. | గౌర్యాః | గౌర్యోః | గౌరీణామ్ |
| తృ. | గౌర్యా | గౌరీభ్యామ్ | గౌరీభిః | స. | గౌర్యామ్ | గౌర్యోః | గౌరీషు |

ఇకారాంత స్త్రీలింగ 'మతి' శబ్దము (బుద్ధి)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | మతిః | మతీ | మతయః | చ. | మత్యై, మతయే | మతిభ్యామ్ | మతిభ్యః |
| సం. | (హే) మతే | మతీ | మతయః | పం. | మత్యాః, మతేః | మతభ్యామ | మతిభ్యః |
| ద్వి. | మతిమ్ | మతీ | మతీః | ష. | మత్యాః, మతేః | మత్యోః | మతీనామ్ |
| తృ. | మత్యా | మతిభ్యామ | మతిభిః | స. | మత్యామ్, మతౌ | మత్యోః | మతిషు |

ఊకారాంత స్త్రీలింగ 'వధూ' శబ్దము (పెండ్లి కూతురు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | వధూః | వధ్వౌ | వధ్వః | చ. | వధ్వై | వధూభ్యామ్ | వధూభ్యః |
| సం. | (హే) వధు | వధ్వౌ | వధ్వః | పం. | వధ్వాః | వధూభ్యామ | వధూభ్యః |
| ద్వి. | వధూమ్ | వధ్వౌ | వధూః | ష. | వధ్వాః | వధ్వోః | వధూనామ్ |
| తృ. | వధ్వా | వధూభ్యామ | వధూభిః | స. | వధ్వామ్ | వధ్వోః | వధూషు |

ఉకారాంత స్త్రీలింగ 'ధేను' శబ్దము (ఆవు).

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ధేనుః | ధేనూ | ధేనవః | చ. | ధేన్వై, ధేనవే | ధేనుభ్యామ | ధేనుభ్యః |
| సం. | (హే) ధేనో | ధేనూ | ధేనవః | పం. | ధేన్వాః, ధేనోః | ధేనుభ్యామ్ | ధేనుభ్యః |
| ద్వి. | ధేనుమ్ | ధేనూ | ధేనూః | ష. | ధేన్వాః, ధేనోః | ధనోః | ధేనూనామ్ |
| తృ. | ధేన్వా | ధేనుభ్యామ్ | ధేనుభిః | స. | ధేన్వామ్, ధనౌ | ధేన్వోః | ధేనుషు |

ఋకారాంత స్త్రీలింగ 'స్వసృ' శబ్దము (చెల్లెలు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | స్వసా | స్వసారౌ | స్వసారః | సం. | (హే) స్వసః | స్వసారౌ | స్వసారః |

| ఏ | ద్వి | బ | | | | |
|---|---|---|---|---|---|---|
| ద్వి. స్వసారమ్ | స్వసారౌ | స్వసౄః | | శేషము ధాతృ శబ్దమువలె నుండును. | | |

ఋకారాంత స్త్రీలింగ మాతృ శబ్దము (తల్లి)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. మాతా | మాతరౌ | మాతరః | ద్వి. మాతరమ్ | మాతరౌ | మాతౄః |
| సం. (హే) మాతః | మాతరౌ | మాతరః | | | |

శేషము ధాతృ శబ్దమువలె నుండును. ఇట్లే ననకవి క్లోకములోని స్త్రీలింగములగు-దుహితృ (కూతురు) ననాన్దృ (మగనితోఁబుట్టువు) యాతృ (తోడికోడలు) శబ్దములు భేదిల్లును.

అకారాంత నపుంసక 'జ్ఞాన' శబ్దము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. జ్ఞానమ్ | జ్ఞానే | జ్ఞానాని | ద్వి. జ్ఞానమ్ | జ్ఞానే | జ్ఞానాని |
| సం. (హే) జ్ఞాన | జ్ఞానే | జ్ఞానాని | శేషము రామ శబ్దమువలెనే యుండును. | | |

'ఇ ఉ ఋ'కారాంత నపుంసకములు భాషిత పుంస్కములగునేని (చూ-సమా-౧౧ సూ) చతుర్థీ పంచమ్యేక వచనములును షష్ఠీ సప్తమ్యేకద్వివచనములును పుంలింగరూపములతో సైతముండును. ఋకారాంత నపుంసకములు భాషిత పుంస్కములె యగును. వీని తృతీయైక వచనము ఋంలింగరూపముతోను నుండును.

ఇకారాంత నపుంసక 'వారి' శబ్దము (జలము)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. వారి | వారిణీ | వారీణి | చ. వారిణే | వారిభ్యామ్ | వారిభ్యః |
| సం. (హే) వారే, వారి | వారిణీ | వారీణి | పం. వారిణః | వారిభ్యామ్ | వారిభ్యః |
| ద్వి. వారి | వారిణీ | వారీణి | ష. వారిణః | వారిణోః | వారీణామ్ |
| తృ. వారిణా | వారిభ్యామ్ | వారిభిః | స. వారిణి | వారిణోః | వారిషు |

ఇకారాంత నపుంసక 'శుచి' శబ్దము (పరిశుద్ధము) (భాషిత పుంస్కము)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| తృ. | శుచినా | శుచిభ్యామ్ | శుచిభిః | ష. | శుచినః, శుచేః | శుచినోః, శుచ్యోః | శుచీనామ్ |
| చ. | శుచినే, శుచయే | శుచిభ్యామ్ | శుచిభ్యః | స. | శుచిని, శుచౌ | శుచినోః, శుచ్యోః | శుచిషు. |
| పం. | శుచినః, శుచేః | శుచిభ్యామ్ | శుచిభ్యః | | | | |

ఉకారాంత నపుంసక 'మధు' శబ్దము (తేనె)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | మధు | మధునీ | మధూని | చ. | మధునే | మధుభ్యామ్ | మధుభ్యః |
| సం. | (హే) మధో, మధు | మధునీ | మధూని | పం. | మధునః | మధుభ్యామ్ | మధుభ్యః |
| ద్వి. | మధు | మధునీ | మధూని | ష. | మధునః | మధునోః | మధూనామ్ |
| తృ. | మధునా | మధుభ్యామ్ | మధుభిః | స. | మధుని | మధునోః | మధుషు |

ఉకారాంత నపుంసక 'మృదు' శబ్దము (మెత్తని. భాషితపుంస్కము)

| | | | | |
|---|---|---|---|---|
| తృ. | మృదునా - మృదుభ్యామ్ మృదుభిః | | ష. | మృదునః, మృదోః - మృదునోః, మృద్వోః - మృదూనామ్ |
| చ. | మృదునే, మృదవే మృదుభ్యామ్ - మృదుభ్యః | | స. | మృదుని, మృదౌ - మృదునోః, మృద్వోః మృదుషు |
| పం. | మృదునః, మృదోః మృదుభ్యామ్ - మృదుభ్యః | | | |

ఋకారాంత నపుంసక 'కర్తృ' శబ్దము (చేయునది. భాషితపుంస్కము)

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. | కర్తృ - కర్తృణీ - కర్తౄణి | | తృ. | కర్తృణా, కర్త్రా - కర్తృభ్యామ్ కర్తృభిః |
| సం. | (హే) కర్తః, కర్తృ - కర్తృణీ - కర్తౄణి | | చ. | కర్తృణే, కర్త్రే - కర్తృభ్యామ్ కర్తృభ్యః |
| ద్వి. | కర్తృ - కర్తృణీ - కర్తౄణి | | పం. | కర్తృణః, కర్తుః కర్తృభ్యామ్ - కర్తృభ్యః |

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ష. | కర్తృణః, కర్తుః | కర్తృణోః, కర్త్రోః | కర్తృణామ్ |
| స. | కర్తృణి, కర్తరి | కర్తృణోః, కర్త్రోః | కర్తృషు |

తకారాంత పుంలింగ 'మరుత్' శబ్దము (గాలి)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | మరుత్ | మరుతౌ | మరుతః |
| సం. | (హే) మరుత్ | మరుతౌ | మరుతః |
| ద్వి. | మరుతమ్ | మరుతౌ | మరుతః |
| తృ. | మరుతా | మరుద్భ్యామ్ | మరుద్భిః |
| చ. | మరుతే | మరుద్భ్యామ్ | మరుద్భ్యః |
| పం. | మరుతః | మరుద్భ్యామ్ | మరుద్భ్యః |
| ష. | మరుతః | మరుతోః | మరుతామ్ |
| స. | మరుతి | మరుతోః | మరుత్సు |

ఇట్లు పక్కా శబ్దములు-హలంతములు విభక్తి ప్రత్యయయోగ మాత్రముచేతనే సులభముగా సిద్ధించును.

తకారాంత పుంలింగ 'పచత్' శబ్దము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పచన్ | పచన్తౌ | పచన్తః |
| సం. | (హే) పచన్ | పచన్తౌ | పచన్తః |
| ద్వి. | పచన్తమ్ | పచన్తౌ | పచతః |
| తృ. | పచతా | పచద్భ్యామ్ | పచద్భిః |

శేషము 'మరుత్' శబ్దమువలె నుండును. శతృ ప్రత్యయాంతము లెల్ల నిట్లు.

తకారాంత పుంలింగ 'మహత్' శబ్దము (గొప్పవాడు)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | మహాన్ | మహాన్తౌ | మహాన్తః |
| సం. | (హే) మహన్ | మహాన్తౌ | మహాన్తః |
| ద్వి. | మహాన్తమ్ | మహాన్తౌ | మహతః |
| తృ. | మహతా | మహద్భ్యామ్ | మహద్భిః |

శేషము 'మరుత్' శబ్దమువలె నెన్నునది.

నకారాంత పుంలింగ 'రాజ (న్)' శబ్దము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | రాజా | రాజానౌ | రాజానః |
| సం. | (హే) రాజన్ | రాజానౌ | రాజానః |

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ద్వి. | రాజానమ్ | రాజానౌ | రాజ్ఞః | పం. | రాజ్ఞః | రాజభ్యామ్ | రాజభ్యః |
| తృ. | రాజ్ఞా | రాజభ్యామ్ | రాజభిః | ష. | రాజ్ఞః | రాజ్ఞోః | రాజ్ఞామ్ |
| చ. | రాజ్ఞే | రాజభ్యామ్ | రాజభ్యః | స. | రాజ్ఞి, రాజని | రాజ్ఞోః | రాజసు |

నకారాంత పుంలింగము (ఆత్మన్) శబ్దము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఆత్మా | ఆత్మానౌ | ఆత్మానః | చ. | ఆత్మనే | ఆత్మభ్యామ్ | ఆత్మభ్యః |
| సం. | (హే) ఆత్మన్ | ఆత్మానౌ | ఆత్మానః | పం. | ఆత్మనః | ఆత్మభ్యామ్ | ఆత్మభ్యః |
| ద్వి. | ఆత్మానమ్ | ఆత్మానౌ | ఆత్మనః | ష. | ఆత్మనః | ఆత్మనోః | ఆత్మనామ్ |
| తృ. | ఆత్మనా | ఆత్మభ్యామ్ | ఆత్మభిః | స. | ఆత్మని | ఆత్మనోః | ఆత్మసు |

సకారాంత పుంలింగము 'వేధస్' శబ్దము (బ్రహ్మ)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | వేధాః | వేధసౌ | వేధసః | ద్వి. | వేధసమ్ | వేధసౌ | వేధసః |
| సం. | (హే) వేధః | వేధసౌ | వేధసః | తృ. | వేధసా | వేధోభ్యామ్ | వేధోభిః |

సకారాంత పుంలింగము 'విద్వస్' శబ్దము (విద్వాంసుడు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | విద్వాన్ | విద్వాంసౌ | విద్వాంసః | తృ | విదుషా | విద్వద్భ్యామ్ | విద్వద్భిః |
| సం. | (హే) విద్వన్ | విద్వాంసౌ | విద్వాంసః | చ. | విదుషే | విద్వద్భ్యామ్ | విద్వద్భ్యః |
| ద్వి | విద్వాంసమ్ | విద్వాంసౌ | విదుషః | | | | |

కొన్ని నామములకు బుంలింగ ప్రథమా బహువచనమందును చతుర్థీ పంచమీ సప్తమ్యేకవచనములందును షష్ఠీ బహువచనమందును రూపములు భిన్నరీతి నుండును. స్త్రీలింగ షష్ఠ్యేకవచనమందును నట్లే యగును. అట్టి

సర్వాది శబ్దములు సంస్కృతమున సర్వనామ సంజ్ఞగలవగును. సర్వాదు లిటఁ గొన్ని ప్రచురముగా వాడఁబడునవి: సర్వ విశ్వ-పూర్వ అన్య-అన్యతర-అన్యతమ- (తర-తమ ప్రత్యయాంతము లెల్ల) ఏక-ఉభయ-యద్-తద్-ఏతద్-ఇదమ్-అదస్ కిమ్ అస్మద్-యుష్మద్-మొ. వీనికి సాధారణముగ సంబోధన ప్రథమావిభక్తి యుండదు. అచ్చ తెలుగునఁ బ్రాచీనులగు నన్నయాదులు సర్వనామ సంజ్ఞనంగీకరింపలేదు. నవ్యులు సంస్కృత వాసనచే "అన్ని ప్రభృతులు-సంఖ్యావాచకములును" సర్వనామములని వాడిరి. సంస్కృతమందువలె నచ్చ తెల్గున వీనికి రూపభేదములేదు.

అకారాంత పుంలింగ సర్వశబ్దము (ఎల్ల)

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | సర్వః | సర్వౌ | సర్వే | పం. | సర్వస్మాత్ | సర్వాభ్యామ్ | సర్వేభ్యః |
| ద్వి. | సర్వమ్ | సర్వౌ | సర్వాన్ | ష. | సర్వస్య | సర్వయోః | సర్వేషామ్ |
| తృ. | సర్వేణ | సర్వాభ్యామ్ | సర్వైః | స. | సర్వస్మిన్ | సర్వయోః | సర్వేషు |
| చ. | సర్వస్మై | సర్వాభ్యామ్ | సర్వేభ్యః | | | | |

ఆకారాంత స్త్రీలింగ 'సర్వా' శబ్దము (ఎల్ల)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | సర్వా | సర్వే | సర్వాః | ష. | సర్వస్యాః | సర్వయోః | సర్వాసామ్ |
| ద్వి. | సర్వామ్ | సర్వే | సర్వాః | స. | సర్వస్యామ్ | సర్వయోః | సర్వాసు |
| తృ. | సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః | | | | |
| చ. | సర్వస్యై | సర్వాభ్యామ్ | సర్వాభ్యః | | | | |
| పం. | సర్వస్యాః | సర్వాభ్యామ్ | సర్వాభ్యః | | | | |

అకారాంత నపుంసకలింగ సర్వశబ్దము (ఎల్ల)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | సర్వమ్ | సర్వే | సర్వాణి |
| ద్వి. | సర్వమ్ | సర్వే | సర్వాణి |

శేషము పుంలింగ సర్వశబ్దవలె నగును.

ఇట్లే "విశ్వ-పూర్వ-అన్య-'తర-తమ' ప్రత్యయాంత ఏక-ఉభయ" మొదలగు శబ్దములు నుండును. ద్వితీయ తృతీయ శబ్దములపై చతుర్థీ పంచమీ సప్తమ్యేకవచనములందు మాత్రము సర్వనామ రూపములు వికల్పముగా నుండును.

దకారాంత పుంలింగ 'యద్' శబ్దము (ఎవఁడు)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | యః | యౌ | యే |
| ద్వి. | యమ్ | యౌ | యాన్ |
| తృ. | యేన | యాభ్యామ | యైః |
| చ. | యస్మై | యాభ్యామ్ | యేభ్యః |
| పం. | యస్మాత్ | యాభ్యామ్ | యేభ్యః |
| ష | యస్య | యయోః | యేషామ |
| స. | యస్మిన్ | యయోః | యేషు |

దకారాంత స్త్రీలింగ 'యద్' శబ్దము (ఎవ్వతె)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | యా | యే | యాః |
| ద్వి. | యామ్ | యే | యాః |
| తృ. | యయా | యాభ్యామ | యాభిః |
| చ. | యస్యై | యాభ్యామ | యాభ్యః |
| పం. | యస్యాః | యాభ్యామ్ | యాభ్యః |
| ష. | యస్యాః | యయోః | యానామ్ |
| స. | యస్యామ్ | యయోః | యాసు. |

దకారాంత నపుంసక 'యద్' శబ్దము (ఏది)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర. యత్ | యే | యాని | | ద్వి. యత్ | యే | యాని |

శేషము పుంలింగమువలె నుండును.

దకారాంత పుంలింగ 'తద్' శబ్దము (వాఁడు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర. సః | తౌ | తే | | తృ. తేన | తాభ్యామ్ | తైః |
| ద్వి. తమ్ | తౌ | తాన్ | | చ. తస్మై | తాభ్యామ్ | తేభ్యః |

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| పం. | తస్మాత్ | తాభ్యామ్ | తేభ్యః | స. | తస్మిన్ | తయోః | తేషు. |
| ష. | తస్య | తయోః | తేషామ్ | | | | |

దకారాంత స్త్రీలింగ 'తద్' శబ్దము (ఆమె)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | సా | తే | తాః | పం. | తస్యాః | తాభ్యామ | తాభ్యః |
| ద్వి. | తామ్ | తే | తాః | ష. | తస్యాః | తయోః | తాసామ |
| తృ. | తయా | తాభ్యామ్ | తాభిః | స. | తస్యామ | తయోః | తాసు |
| చ. | తస్యై | తాభ్యామ్ | తాభ్యః | | | | |

దకారాంత నపుంసక 'తద్' శబ్దము (అది)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | తత్ | తే | తాని | ద్వి. | తత్ | తే | తాని |

శేషము పుంలింగమువలె నుండును.

దకారాంత పుంలింగము 'ఏతద్' శబ్దము (వీఁడు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఏషః | ఏతౌ | ఏతే | పం. | ఏతస్మాత్ | ఏతాభ్యామ్ | ఏతేభ్యః |
| ద్వి. | ఏతమ్, ఏనమ్- | ఏతౌ, ఏనౌ | ఏతాన్, ఏనాన్ | ష. | ఏతస్య | ఏతయోః,ఏనయోః | ఏతేషామ్ |
| తృ. | ఏతేన, ఏనేన- | ఏతాభ్యామ్ | ఏతైః | స. | ఏతస్మిన్ | ఏతయోః,ఏనయోః | ఏతేషు |
| చ. | ఏతస్మై | ఏతాభ్యామ్ | ఏతేభ్యః | | | | |

దకారాంత స్త్రీలింగము 'ఏతద్' శబ్దము (ఈమె)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఏషా | ఏతే | ఏతాః | ద్వి. | ఏతామ్, ఏనామ్ | ఏతే, ఏనే | ఏతాః, ఏనాః |

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| తృ. | ఏతయా, ఏనయా | ఏతాభ్యామ్ | ఏతాభిః | ష. | ఏతస్యాః | ఏతయోః, ఏనయోః | ఏతాసామ్ |
| చ. | ఏతస్యై | ఏతాభ్యామ్ | ఏతాభ్యః | స. | ఏతస్యామ్ | ఏతయోః, ఏనయోః | ఏతాసు. |
| పం. | ఏతస్యాః | ఏతాభ్యామ్ | ఏతాభ్యః | | | | |

దకారాంత నపుంసకము 'ఏతద్' శబ్దము (ఇది)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఏతత్ | ఏతే | ఏతాని | ద్వి. | ఏతత్, ఏనత్ | ఏతే, ఏనే | ఏతాని, ఏనాని |

శేషము పుంలింగమందువలె నుండును.

మకారాంత పుంలింగము 'ఇదమ్' శబ్దము (వీఁడు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | అయమ్ | ఇమౌ | ఇమే | పం. | అస్మాత్ | ఆభ్యామ్ | ఏభ్యః |
| ద్వి. | ఇమమ్, ఏనమ్ | ఇమౌ, ఏనౌ | ఇమాన్, ఏనాన్ | ష. | అస్య | అనయోః, ఏనయోః | ఏషామ్ |
| తృ. | అనేన, ఏనేన | ఆభ్యామ్ | ఏభిః | స. | అస్మిన్ | అనయోః, ఏనయోః | ఏషు |
| చ. | అస్మై | ఆభ్యామ్ | ఏభ్యః | | | | |

మకారాంత నపుంసకము 'ఇదమ్' శబ్దము (ఇది)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఇదమ్ | ఇమే | ఇమాని | ద్వి. | ఇదమ్, ఏనమ్ | ఇమే, ఏనే | ఇమాని, ఏనాని |

శేషము పుంలింగమువలె నుండును.

మకారాంత స్త్రీలింగము 'ఇదమ్' శబ్దము (ఈమె)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | ఇయమ్ | ఇమే | ఇమాః | తృ. | అనయా, ఏనయా | ఆభ్యామ్ | ఆభిః |
| ద్వి. | ఇమామ్, ఏనామ్ | ఇమే, ఏనే | ఇమాః, ఏనాః | చ. | అస్యై | ఆభ్యామ్ | ఆభ్యః |

| | ఏ | ద్వి | బ | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|---|
| పం. | అస్యాః | ఆభ్యామ్ | ఆభ్యః | స. | అస్యామ్ | అనయోః, ఏనయోః | ఆసు. |
| ష. | అస్యాః | అనయోః, ఏనయోః | ఆసామ్ | | | | |

సకారాంత పుంలింగము 'అదస్' శబ్దము (వీఁడు).

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమీ | పం. | అముష్మాత్ | అమూభ్యామ్ | అమీభ్యః |
| ద్వి. | అముమ్ | అమూ | అమూన్ | ష. | అముష్య | అముయోః | అమీషామ్ |
| తృ. | అమునా | అమూభ్యామ్ | అమీభిః | స. | అముష్మిన్ | అముయోః | అమీషు |
| చ. | అముష్మై | అమూభ్యామ్ | అమీభ్యః | | | | |

సకారాంత స్త్రీలింగము 'అదస్' శబ్దము (ఈమె)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | అసౌ | అమూ | అమూః | పం. | అముష్యాః | అమూభ్యామ్ | అమూభ్యః |
| ద్వి. | అమూమ్ | అమూ | అమూః | ష. | అముష్యాః | అముయోః | అమూషామ్ |
| తృ. | అముయా | అమూభ్యామ్ | అమూభిః | స. | అముష్యామ్ | అముయోః | అమూషు |
| చ. | అముష్యై | అమూభ్యామ్ | అమూభ్యః | | | | |

సకారాంత నపుంసకము 'అదస్' శబ్దము=(ఇది)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | అదః | అమునీ | అమూని | ద్వి. | అదః | అమునీ | అమూని |

శేషము పుంలింగమువలె నుండును.

మకారాంత పుంలింగము 'కిమ్' శబ్దము (ఎవఁడు)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర. | కః | కౌ | కే | ద్వి. | కమ్ | కౌ | కాన్ |

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| తృ. | కేన | కాభ్యామ్ | కైః |
| చ. | కస్మై | కాభ్యామ్ | కేభ్యః |
| పం. | కస్మాత్ | కాభ్యామ్ | కేభ్యః |
| ష. | కస్య | కయోః | కేషామ్ |
| స. | కస్మిన్ | కయోః | కేషు |

మకారాంత నపుంసక 'కిమ్' శబ్దము—(ఏది)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | కిమ్ | కే | కాని |
| ద్వి. | కిమ్ | కే | కాని |

శేషము పుంలింగమువలె నుండును.

మకారాంత స్త్రీలింగము 'కిమ్' శబ్దము—(ఎవతె)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | కా | కే | కాః |
| ద్వి. | కామ్ | కే | కాః |
| తృ. | కయా | కాభ్యామ్ | కాభిః |
| చ. | కస్యై | కాభ్యామ్ | కాభ్యః |
| పం. | కస్యాః | కాభ్యామ్ | కాభ్యః |
| ష. | కస్యాః | కయోః | కాసామ్ |
| స. | కస్యామ్ | కయోః | కాసు |

దకారాంత త్రిలింగి 'యుష్మద్' శబ్దము—(నీవు)

| | | | |
|---|---|---|---|
| ప్ర. | త్వమ్ | యువామ్ | యూయమ్ |
| ద్వి. | త్వామ్, త్వా- | యువామ్, వామ్- | యుష్మాన్, వః |
| తృ. | త్వయా | యువాభ్యామ్ | యుష్మాభిః |
| చ. | తుభ్యమ్, తే- | యువాభ్యామ్, వామ్- | యుష్మభ్యమ్, వః |
| పం. | త్వత్ | యువాభ్యామ్ | యుష్మత్ |
| ష. | తవ, తే | యువయోః, వామ్- | యుష్మాకమ్, వః |
| స. | త్వయి | యువయోః | యుష్మాసు |

ఏకవచనమున 'త్వదీయమ్', బహువచనమున 'యుష్మదీయమ్' మున్నగు రీతిని తద్ధితరూపము లేర్పడును

దకారాంత త్రిలింగి 'అస్మద్' శబ్దము=(నేను)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | అహమ్ | ఆవామ్ | వయమ్ |
| ద్వి. | మామ్, మా | ఆవామ్, నౌ | అస్మాన్, నః |
| తృ. | మయా | ఆవాభ్యామ్ | అస్మాభిః |
| చ. | మహ్యమ్, మే | ఆవాభ్యామ్, నౌ | అస్మభ్యమ్, నః |
| పం. | మత్ | ఆవాభ్యామ్ | అస్మత్ |
| ష. | మమ, మే | ఆవయోః, నౌ | అస్మాకమ్, నః |
| స. | మయి | ఆవయోః | అస్మాసు |

ఏకత్వమున 'మదీయమ్', బహుత్వమున 'అస్మదీయమ్' మున్నగు రీతిని దద్ధితరూపము లేర్పడును.



# బాలవ్యాకరణోద్యోతము

## తత్సమశబ్దవివరణము

౨ వివ :—తత్ = ఆ సంస్కృతప్రాకృతంములతో, సమము = తుల్యము, తత్సమము. (చూడు-సంజ్ఞా ౨౦ సూ). వినిలోని ప్రాకృతసమ మాచ్ఛికమె యగును. (చూ-ఆచ్ఛి ౧ సూ)

౩ వివ :—ఈ పరిచ్ఛేదమున ముఖ్యముగా సంస్కృతసమశబ్దరూపములు సాధింపంబడును. కాని యీ పరిచ్ఛేదసూత్రములెయగు డుమ్వాదివిధాయకములైన (తత్స-౧ మొ ౧౭-౨౬-౩౨-౩౩-౦౪-౪౫ మొ) సూత్రములు కొన్ని ప్రాకృతసమసాధనమందును దద్భవాచ్ఛిక శబ్దసాధనమందును నుపయోగించును. కేవలాచ్ఛికశబ్దమాత్రోపయోగివిధులు నిందుం బ్రసక్తాను ప్రసక్తముగనుపదేశింపంబడినవి. (చూ-తత్స- ౨౪- ౨౭-౪౭-౪౮ సూ). సిరీ జమ-సింగార మున్నగునవి ప్రాకృతసమప్రాతిపదికములు. 'జమో' మున్నగునవి ప్రాకృతప్రథమైకవచనరూపములు. ''రామ-హరి-గుణవంత-విద్వాంస-రాజన్- కర్మన్-వర్మన్-సదస్-పయస్'' మున్నగునవి సంస్కృత సమప్రాతిపదికములు.

౪ వివ .—ప్రాతిపదికములపై నిల్చునట్టి 'సు' మున్నగు సంస్కృతవిభక్తులకు 'డు' మొదలగు తెనుంగువిభక్తు లాదేశములు *

---

* సూరి యిట్లు నిరూపింపక నంస్కృతనామవిభక్తులను నిల్పకయె యూరక తెల్గునామవిభక్తుల నుపదేశించెను. కాని 'దేవత' మున్నగు మహత్ స్త్రీలింగములపైని, 'తండ్రి-కొడుకు' మున్నగు మహత్ స్త్రీగమములపైని, 'భ్రాత- బ్రహ్మ - విశ్వకర్మ - దూత' మున్నగు నతిదిష్ట స్త్రీత్వముగల మహద్వాచకములపైని, తెల్గు ప్రథమావిభక్తి యేకవచనము సిద్ధింపనేరమిం జేసి వానిపైని సంస్కృత'సు' ప్రత్యయము నెనిల్పి తత్స-౫౭ సూత్రముచొప్పున దానికి సూరి పక్షమునను లోపము చేసికొనక తీరదు. కావుననే నన్నయ 'సు' ప్రత్యయాదులకే 'డు' ప్రత్యయాదు లాదేశములుగ వక్కాణించియున్నాండు.

ప్రాకృతకాలమునకె ద్వివచన మంతరించినదిగానఁ దెల్గున నేకవచనము-బహువచనము నని రెండేవచనములు. వానిలో నుభయవచనములందును నిల్చునవి పెక్కులగుటచేత నట్టి వచనద్వయము మార్గాంతరమున సూత్రింపఁబడును.

సంస్కృత సుప్పుల కాదేశములగు తెల్గు నామ ప్రత్యయములు: 'డు-ము-వు-లు=ల్' ప్రథమావిభక్తి. 'ను' ద్వితీయావిభక్తి. 'చేత-తోడ' తృతీయావిభక్తి. 'కొఱకు-కయి' చతుర్థీవిభక్తి. 'వలన-కంటె-పట్టి' పంచమీవిభక్తి. 'కు-యొక్క-ది-వి-లోపల' షష్ఠీ విభక్తి. 'అందు-న' సప్తమీవిభక్తి. (౧ మొ ౭. సూ.) (శా-౧ మొ. ౭ సూ.) (వ్యా-సం-౧౧౯-౧౧౯ I వివ).

౧ వివ :–'కయి' అను దానినుండి 'కై' అనునది సిద్ధించును. (క్రి. ౧౦౩ సూ.) 'ను-కు' అనునవి రెండిటినుండి 'ని-కి' అనునవి సిద్ధించును. (తత్స-౨౬-౬౫ సూ) 'వలన' అనుదానికి 'వల్ల'అనియు, 'కంటె' అనుదానికి 'కన్న' అనియు నర్వాచీనములగు రూపాంతరములు. 'ఈ। చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబున (మనుచ-౨ ఆ ౧౦) అ న్నినదముకన్నఁ దిన్ననయి (వసు ౨ ఆ ౫౬). 'చేత' అనుదానినుండి 'చే' అనునదియు 'తోడ' అనుదానినుండి 'తో' అనియు 'లోపల' అనుదానినుండి 'లో' అనియు (తత్స ౧౦ సూ) సిద్ధించును.

౨ వివ :–'గూర్చి-గుఱిచి-గుఱించి' అనునవి ద్వితీయకుఁ (కార ౨ సూ) బరముగాను 'చేసి' అనునది 'చేతా'ర్థకశబ్దములకుఁ బరముగాను ననుప్రయుక్తములగును. (చూ-కార ౨ సూ) ఉదా : రామునిఁగూర్చి-వచ్చుటంజేసి-మొ.

3 వివ :–'మయిని-మెయిని-మైని' అనునవి చేతార్థకములుగను, 'తదర్థము, నిత్తము, పొంటెను, కోసరము=కోసము, కునయి=

కుఁగాను' అనునవి 'కొఱకు' విభక్త్యర్థములుగను 'లోను' అనునది సప్తమ్యర్థకముగను మహాకవి ప్రయుక్తములుగాన నిట్టివి విభక్త్యర్థాభిధాయకశబ్దములు. ఉదా: భక్తిమెయిన్=(భక్తితో, భక్తిచేత) నీతర్థము=నీనిమిత్తము=(నీకొఱకు) గృహములోన్=(గృహమందు)

ద్వితీయాదులకు 'నుగాగమం బగు. ౮. (బా-తత్స-౮.) (వ్యా-సం ౧-౨౦ వి). *

రామునిని-రాముని-రామునిచేతను-రామునికొఱకును-రాముని వలనను-రామునకును-రామునియందును.

"కయి-పట్టి-యొక్క-ది-వి" అను విభక్తులకు 'ను' గాగమంబు లేదు. ౯. (బా-తత్స-౯ సూ) (వ్యా-సం-౧-౨౦ వి). రాముని కయి=రామునికై. రామునిబట్టి-రామునియొక్క. రామునిది రామునివి (గుణములు) మొ.

'చేత-తోడ-లోపల' వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. ౧౦. (బా-తత్స-౧౦) (వ్యా-సం-౧-౨౧ విష).

ప్రత్యయంబును వర్ణకంబని (తత్స-వర్ణక-తద్భ-వన్నియ) ప్రాచీనులు వ్యవహరింతురు. ఉదా:-రాముచేను-రామునితోను-రాములలోను, లోపల నిర్ధారణార్థకము. (కార ౧౬ సూ) కాన నిది బహువచన మాత్రమె.

'డు-ము-వు-న-ది' అనునవి యేకవచనంబులు. ౧౧. (బా-తత్స-౧౧ సూ) (వ్యా-సం. ౧-౨-౨ విష.)

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు. రాముఁడు-వనము-ధేనువు-వనమునను. దానిది. (ఆది ౪ ఆ ౩౦).

---

* సూరి ద్వితీయావిభక్తికి 'ను' గాగమమును విధింపలేదు. కాఁగా నీతనిపక్షమున 'భాంగాసరినిన్' అను రీతిగల రూపములు సిద్ధింపనేరవు. భాంగాసరినిన్ (ఆర. ౨ ఆ ౧౬౩) తనతల్లి సత్యవతినిన్ (ఆది ౪ ఆ-౧౯౧).

లు-ల్, వి- లోపల-♦ వర్ణకంబులు బహువచనం
బులు. ౧౨. (బా-తత్స-౧౨). (వ్యా-సం-౧౨౨ విభ)

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. ఉదా :—రాములు-వనములు-ధేనువులు-రాముల్. ధేనువులలోపలం గపిల వరిష్ఠంబు. వరిష్ఠ (భాగ-ఆది-3 ఆ ౧౫౬ ప).

తక్కినవి యుభయంబులు. ౧౩. (బా-తత్స-౧౩)
(వ్యా-సం-౧౨౨ విభ).

మిగిలిన ప్రత్యయంబు లేకత్వ బహుత్వంబులకు బోధకంబులని యర్థము. ఉదా :—వనమునున్- వనములనున్- వనముచేతను - వనములచేతను, వనముతోడను-వనములతోడను. మొ.

'ఓ' యామంత్రణమునం దగు. ౧౪. (బా-తత్స-
౧౪) (వ్యా-సం-౧౨౪ విభ).

'ఓ' యను శబ్దము సంబోధనమునందగునని యర్థము. ఇది సంబోధ్య=(పిలువఁదగిన) వాచకమునకు ముందే ప్రయోగింపఁబడును. ఓ శబ్దంబు తొలంగియు సంబోధ్యవాచకంబుఁ బ్రయోగింప వచ్చును. ఉదా :—ఓ రాముఁడ-ఓరాములార-రాముఁడ-రాములార. ఓశబ్దంబునకుఁ దర్వాత నితరశబ్ద వ్యవధానమును గలదు. ఉదా :- ఓ వినువీధినున్న ఖచరోత్తములార.

ఓ శబ్దంబునకుం బురుష నీచ స్త్రీ పురుషామంత్ర
ణంబులందు 'యి-సి-రి' వర్ణకంబులు విభాష నంతా
గమంబులగు. ౧౫ (బా-తత్స ౧౫) (వ్యా-సం-
౧౨౪ వి.)

ఓయి రాముఁడ=ఓరాముఁడ. ఓసి దుష్టురాల=ఓదుష్టురాల. ఓరి దుష్టుఁడ=ఓ దుష్టుఁడ.

---

♦ సూరి 'లోపల' వర్ణకము బహువచన మాత్రబోధకమని వచింపకుండుట వింత.

ఓరి-యోసి మైత్రియందుం గలవు. ౧౬. (బా-తత్స-౧౬) (వ్యా-సం-౧౨౪ వివ),

ఓరి చిన్నికృష్ణ-ఓసి ముద్దుబాల-'ఓయి' మొదలయిన వానికి స్వతంత్రప్రయోగముం గలదు. సంగతియయోయి (ఆము. ౪ ఆ ౬౦). ఓసి పోవే. ఓరోరి యింకెందుఁబోవచ్చు. వీనికి దీర్ఘంబుం గలదు. ఓయీ విప్రకులావతంస. ఓరీ దుష్టనిశాటులారా. ఓసీ నను జెనక రాకు.

౧ వివ :-'శీలము-జాతి-విద్య-వయసు' మున్నగువానిచేఁ దన కన్నఁ దక్కువవాఁడిందలి నీచశబ్ద వాచ్యుఁడు. ఉత్తముఁడైనను శత్రువువిషయమున 'ఓరి' శబ్దమును వాడనగును. బహువచనవిషయమునను 'ఓరి' శబ్దము వాడఁబడును- ఓరోరి తొలఁగి పొండు. (హంసల-౧ ఆ-౧౮౫).

౨ వివ :-'మైత్రి' అనునది వాత్సల్యాదులకు నుపలక్షణము.

3 వివ :-'రా-రో-కాన-అల-అలా' అను శబ్దములు సంబోధ్యవాచకమునకుఁ బరమందుఁ బ్రయోగింపఁబడును. ఉదా :-అమ్మరో (విరా-3-ఆ 3౬). బసవరో (బసవ ౨ ఆ ౫౨౨). వీరభద్రయ్యరో (బసవ 3 ఆ ౨౫౪). తల్లికాన (నైష ౭ ఆ ౯) వ్యభిచారులారకాన-దురాచారులారకాన (వరాహ ౫ ఆ-౫౨ వ). అమ్మలక్కలని (ఆము ౨ ఆ) అన్నలా (ఉ-హరి ౪ ఆ) అక్కల (నిర్వ ౨ ఆ ౨౪ వ).

స్త్రీ తిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు. ౧౭. (బా తత్స. ౧౭) (వ్యా-సం-౧౨౫ I వివ).

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.

౧ వివ :-దేవమనుష్య యక్ష రాక్షసాది పురుషవాచకములు మహత్తులు. మహత్తులుకాని వమహత్తులుగాన 'సీత' మున్నగు

స్త్రీ వాచకములును సమమహత్తులె. ఈ మహతీవాచక బహువచనములు మహత్సదృశములై యుండును. (ఆచ్ఛి ౬౫ సూ). 'గంగ' ప్రవాహరూప మమహత్తు. గంగాదేవికి వాచకమగునపుడు మహతి=స్త్రీవాచకము.

౨ వివ :—ఆచ్ఛికములందు 'డుజ్' వర్ణకము ప్రథమైకవచనమున వచ్చు శబ్దములు పుంలింగసమములు. 'ము' వర్ణకము ప్రథమైకవచనమున వచ్చు శబ్దములు నపుంసకలింగసమములు. తక్కిన వెల్ల స్త్రీలింగసమములు. 'చెలువు' మున్నగునవియును స్త్రీ సమములె. ఆచ్ఛికశబ్దములకుఁ బ్రథమా 'వు' ప్రత్యయము రాదు. ఉదా :-మగఁడు-సాలీఁడు=(సాలెపురుగు) మున్నగునవి పుంలింగ సమములు. 'తండ్రి-తల్లి-చెలువు' మున్నగునవి స్త్రీలింగసమములు. పున్నెము-అన్నము-గీము=(గృహము) గాము=(గ్రహము) మొదలగునవి నపుంసకసమములు. ఆచ్ఛికశబ్దముల కిట్లు లింగసమవ్యవహారమెకాని లింగవ్యవహారము లేదు.

3 వివ :—సంస్కృతసమశబ్దములందు సంస్కృతప్రసిద్ధ లౌకిక లింగ మకించిత్కరము. 'వృషభము-మహిషము' మున్నగునవి లౌకిక పుంలింగకములె కాని మహద్వాచకములు కానేరవు. ఇంక సంస్కృతమున శాస్త్రీయలింగ మనఁగాఁ బారిభాషికలింగమె వాడుకొనఁబడును. పారిభాషికలింగ మనఁగా :-సత్వోపచయము గలది పుంలింగము. సత్వాపచయముగలది స్త్రీలింగము. సత్వసామ్యముగలది నపుంసకలింగము. ఇట్టి చిహ్నములనుబట్టి ప్రాచీనకాలపు లోకవ్యవహారమున నీ పారిభాషికలింగ మేర్పడినది. మనుష్యాదులతోపాటుగ వృక్షాదులును బుంలింగకములె, సీతాదులతోపాటుగ దేవతా లతాదికములును స్త్రీలింగకములె. ధనవనాదులతోపాటుగ దైవత కళత్రాదులును నపుంసకలింగకములె. కొన్ని ద్విలింగకములగును-కొన్ని త్రిలింగకములగును. కొన్ని నియతలింగకము లగును.

౪ వివ :—సంస్కృతశబ్దములందు విశేష్యలింగమె విశేషణమున కగును. అవి తత్సమము లగునపుడు మహతీతరామహత్ స్త్రీలింగవిశేషణము స్త్రీలింగరూపముతోను నపుంసకలింగరూపముతోను వాడఁబడును. ఉదా :—లత మనోహర. మనోహరము. (చూ. తత్స-౧౦౬ సూ). ఆచ్ఛికశబ్దమునకు విశేషణమగు సంస్కృతశబ్ద మీ క్రిందిరీతిని నిల్చును :- మహద్వాచకాచ్ఛికశబ్దమునకు విశేషణమగు సంస్కృతసమశబ్దము పుంలింగ సమరూపము నందును. ఉదా :—మగఁడు మనోహరుఁడు-తండ్రి మనోహరుఁడు. ఆచ్ఛికమహతీవాచక విశేషణ సంస్కృత సమశబ్దము స్త్రీలింగరూపమునందును ఉదా :- తల్లి-విదుషి=విద్వాంసురాలు. ఉన్మత్తవేషిణియైన లచ్చి (ఆర ౨ ఆ ౧౧౪) (లచ్చి ఉన్మత్తవేషురాలు) ఆచ్ఛిక మహతీభిన్నామహద్వాచక విశేషణ సంస్కృతశబ్దము నపుంసకలింగరూపముతో నుండును. ఉదా ;-ఇల్లు మనోహరము. (అహో॥ 3౧౭ పుట. ''వికృతౌచ స్త్రీ లిఙ్గాః'' అను సూత్రపు వ్యాఖ్య.)

క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు
విభామం బుంలింగతుల్యంబు లగు. ౧౮. (బా-౧౮)
(వ్యా-సం-౧౨౬ I విమ.)

మిత్రుఁడు=(స్నేహిత). శరణ=(రక్షక) పాత్ర=(అర్హ) ప్రధాన=(మంత్రి) ప్రభృతులు మిత్రాదులు. ఇది యాకృతిగణము. కాన రత్న-భాజనాపత్యాభరణకారణాదులు నిందలివె. సూర్యార్థకమిత్రశబ్ద మిందుఁ జేరనేరదు.

౧ వివ :—మిత్రాదులకు వైభాషిక పుంస్త్వమును మహత్త్వమును నుండుటచేత నుత్త్వాదులు (తత్స-౨౧-౨౨ సూ) వచ్చును. ఇట్టి వాచనికపుంస్త్వము లేనిపక్షమున నపుంసలింగ 'ము' వర్ణాంత రూపమె. (తత్స ౩౯ సూ). ఉదా :—మిత్రుఁడు-మిత్రము. మొ. సజ్జనస్తుతిపాత్ర మితఁడు. (విరా. ౪ ఆ. ౩౨౬.)

౨ వివ :—శేషుఁడు మున్నగు నాగములు-హిమవన్మేఘ సముద్రాదులును ప్రాణాదివాయువులును మహత్తులుగ వివక్షింపనగును. అవి పుంలింగములై కాన వానికిని ద్వైరూప్యము కవిసమ్మతము. ఉదా:-జంగమములు=జంగములు=(జంగమలింగములు=శివభక్తులు) ఉరగులు=ఉరగ్గములు: ప్రాణునపానునందు (ఆను ౫ ఆ ౨౬౦). నాగులు కలుచుచున్నవి. (హరి-పూ-౭ ఆ ౨౮).

3 వివ :—శ్రేష్ఠతావివక్షయం దమహత్తులకు మహద్ద్వివక్ష కవిసమ్మతము. ఉదా :-అశ్వోత్తమున్ (ఆది ౨ ఆ 3౦) వాయసుఁడు వెగడొందెన్ (కర్ణ ౨ ఆ ౭ర వ.) 'అశ్వరాజు' అనునపుడు మహద్ద్వివక్ష లేదు. (చూ-తత్స-౭౯ సూ).

ర వివ :—ఆరోపణమున నమహత్తులకును మహద్ద్వివక్ష గలదు. ఉదా :-పురుషసింహముల న్నిజేశుల (సభా-౩ ఆ ౨౬౭ వ). మనుజసింహులు (ఆది ౮ ఆ ౨౮౯).

౫ వివ :—స్త్రీ పురుష సాధారణవాచి జనశబ్దమునకు ద్వైరూప్యము గలదు. ఉదా :-జనులు=జనములు.

౬ వివ :—రాముఁడు ప్రధానము=ప్రధానుఁడు. సావిత్రి ప్రధాన (అశ్వ-౨ ఆ. ౧౬౧) లలామశబ్దమున కిట్టివాడుక లేదు. 'భూమిజ కాంతాలలాము' అనరాదు. 'కాంతాలలామము' అనవలెను. రాముఁడు పురుషలలాముఁడు-పురుషలలామము.

౭ వివ :—మహత్సమూహార్థక శబ్దం బమహత్కార్య యుక్తం బయ్యెఁ దద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విభాషనగు. (ప్రౌఢ-శబ్ద ౧౭ సూ). గీర్వాణగణంబు... అఖర్వపరాక్రము లుద్ధతులై రణముచేసిరి (ఆర 3 ఆర ర౧). పటుబాహులు దైత్యదానవగణంబులు దివ్యమహాస్త్రకోవిదు లుద్భవించె (ఆర ౬ ఆ ర౫). మొ.

జిత్తు బిందుపూర్వకం బగు. ౧౯. (బా తత్స-౧౯)

(వ్యా-సం-౧౨౭ విష).

జకార మిద్వర్ణముగాఁ గలదానికి ముందు బిందువు నిల్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రయోగించు నపుడు మానంబడు వర్ణ మిత్తు నాఁబడు. ఉదాహరణము మీఁద స్పష్టము.

౧ వివ :—'సానునాసికోచ్చారణం జిత్' అనెడి ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధ జిత్త్వఫలము తెల్లున వర్తిల్లదని యీ సూత్రము విశదీకరించుచున్నది. రాముఁడు మున్నగు చోటులందలి "డుజ్జు:" నందలి డకారముమీఁది 'ఉ' కారము సానునాసికమని ప్రాకృత వ్యాకరణము చెప్పున గ్రహింపవలయును. ఇట నట్లుకాదు—

౨ వివ :—ఇందలి యిద్వర్ణలక్షణము పాణినీయ ప్రసిద్ధము కాదు. ముగ్ధబోధాదీతర సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధము. కాన నిందులో నేదేని వర్ణముకాని వర్ణసంఘాతముకాని కార్యాంతరసూచకమగుచు నిద్వర్ణము కావచ్చును.

డుజ్వర్ణకంబునకుఁ బ్రకృతియైనది డుమంతంబు
నాఁబడు. ౨౦ (బా-౨౦) (వ్యా-సం-౧౨౮ వి.)

౧ వివ :—ప్రత్యయము నిల్వఁదగినది ప్రకృతి. ఇది రెండువిధములు I ప్రాతిపదికము. II ధాతువు.

౨ వివ :—ప్రథమైకవచన డుజ్జు లోపించిన శబ్దము 'డుమంత' మనిపించుకొనదు. ఉదా :—'గ్లా' దీనికి తత్స-౨౩ సూత్రము చెప్పున 'ని'గాగమము రాదు. గ్లానున్=(చంద్రుని) 'గ్లానికులజులు' తప్పు. వృద్ధు-ప్ర. వృద్ధునున్-ద్వితీ. వృద్ధుఁడు-ప్ర. వృద్ధునిన్-ద్వితీ.

పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు
తుది యత్వంబున కుత్వంబగు. ౨౧. (బా ౨౧)
(వ్యా-సం-౧౨౯ I విష.)

నామంబనఁగాఁ బ్రాతిపదికము * డిద్ధ-రామ-భార్గవ-రాజపురుష. (సంజ్ఞా కృ ద్ధిత సమాస ప్రాతిపదికములు) వీని కుత్వము రాఁగా :-డిద్ధు-రాము-భార్గవు-రాజపురుషు.

పుంలింగంబగు మహద్వాచకంబునకు 'డు' జ్ఞగు.

౨౨ (బా-౨౨) (వ్యా-సం-౧౩౦ I విష.)

ఇచ్చట 'డు'జ్ఞను దానియందు జకార మిత్తు గావున 'జిత్తు బిందు పూర్వకంబగు' (తత్స-౧౯) అను సూత్రముచేత 'డు' వర్ణకమునకు ముందు సున్న వచ్చును. జకారము లోపించును. ఉదా:- డిద్ధుఁడు= డిద్ధుండు, రాముఁడు=రాముండు, మొ.

౧ విశ:- పై రీతిగల స్థలములలోనెల్ల సంస్కృత విభక్తులగు 'సు' మున్నగువానిని నిల్పి వానికి 'డు'జ్ఞాదు లాదేశములుగాఁ బ్రక్రియ నడపవలెను. (చూడు. తత్సమ పరిచ్ఛేదాది వివృతి.) ఇచ్చటి పుంలింగ మనఁగా "పారిభాషిక పుంలింగము".

౨ విశ:- "హాహా=(ఒక గంధర్వుఁడు), విశ్వపా=(విశ్వమును బాలించువాఁడు)" ఇత్యాది దీర్ఘాంత ప్రాతిపదికముల దీర్ఘమునకు తత్స. ౫౪ సూత్రము చెప్పిన హ్రస్వము కాఁగా 'హాహ-విశ్వప' మున్నగు ప్రాతిపదికము లేర్పడును.

డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగు
నపుడు 'ని' గాగమంబు సర్వత్ర విభాషనగు. ౨౩.
(బా-౨౩); (వ్యా-సం-౧౩౧ I విష)

---

* అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్ (౧-౨-౪౫)= ధాతుం ప్రత్యయం ప్రత్యయాన్తంచ వర్జయిత్వా అర్థవచ్ఛబ్దరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్. 'కృత్తద్ధిత సమాసాశ్చ' (సి-కౌ-౧౭౮-౧౭౯). 'శబ్దానుకరణంచైవ నామ పఞ్చవిధమ్' (శబ్దా-చిం) అను చెప్పిన 'అనుకరణ' శబ్దమును బ్రాతిపదికమె.

రామునినిన్=రామునిన్. రామునిచేతన్=రాముచేతన్. రామునికిన్=రామునకున్. సర్వత్రి యనుట నగాగమ బాధనార్థము. ఇవియెల్ల (సంధి ౨౨ సూ.) నవసాన ద్రుతస్వర లోపము నందిన యుదాహృతులు.

౧ వివ:— ఈ సూత్రిమందలి విభాషను వ్యవస్థిత విభాషగ సంగీకరించి ద్వితీయైకవచన 'ను'వర్ణకమునకు యథా ప్రయోగముగ (బహుళముగ) లోపమును జేయవలయును. ఉదా — రామునినిన్=(ఇందు నిగాగమము, ద్వితీయా 'ను' ప్రత్యయము, దాని ద్రుతమును గలవు). రామునిన్=(ఇందు 'ని'గాగమము గలదు-ద్వితీయా 'ను' ప్రత్యయము లోపింపఁగా దాని ద్రుతము నిల్చినది). రామున్=(దీనియందు నిగాగమాభావమును ద్వితీయా 'ను' ప్రత్యయ లోపమును గలవు). ఇట్లె-సీతనును = (ఇందు ద్రుతాంతమగు ద్వతీయా 'ను' ప్రత్యయమున్నది). సీతను=(ఇందుఁ బై రీతిని ద్వితీయా 'ను' ప్రత్యయము లోపింపఁగా దాని ద్రుతముమాత్రము నిల్చినది). ఇట్లె-హరినిని=హరిని. (ఇందు తత్స ౨౬ సూ-చెప్పిన 'ను'వర్ణములమీఁది 'ఉ'కారముల'ఇ'కారములయ్యె)కం. 'అతని నాతనిన్' (కర్ణ ౧ ఆ ౧౧౧) అనుచో (చూ-వ్యా-సం-౧౩౧ I విమ.) 'అతఁడు' శబ్ద మాంచ్ఛికము గాన 'ని'గాగమము తత్స-౨౩ సూత్రిము చెప్పిన నిత్యము. 'ఆతనినిన్' అనుచో మొదటి 'ని' అనునది 'ని'గాగమము. తర్వాత నుండఁదగిన ద్వితీయా 'ను' ప్రత్యయము పయిరీతిని లోపించినది. కాన దాని ద్రుతమును సముచ్చయార్థక 'ను' శబ్దముచు 'నిన్' అను రూపముతో నిల్చినవి.

౨ వివ —'రాము+నున్' అను నిగాగమాభావమందలి ద్రుతాంత ద్వితీయా 'ను' ప్రత్యయస్థితియందును ద్వితీయా 'ను' ప్రత్యయము యొక్క 'ఉ' కారము తత్స-౨౬ సూత్రిము చెప్పిన 'ఇ' కారము కాఁగా 'రామునిన్' అనియే రూప మేర్పడును.

అనుదంతమగు నాచ్ఛిక డుమంతమునకు 'ని' గాగమ
ము నిత్యముగా నగు. ౨౮ (బా-౨౫) (వ్యా-సం-
౧౩౨ I విశే).

మగనినిన్ - మగనిన్. మగనిచేతన్ - మగనిచేతన్. (సంధి ౨౦ సూత్రము చెప్పిన నవసాన ద్రుతస్వరలోపము). అనుదంతంబను పర్యుదాసముచేత "అల్లునిచేతను=అల్లుచేతను, బల్లిదునిచేతను=బల్లిదుచేతను" ఇత్యాదులందు "తత్స-౨౩ సూత్రము" చెప్పిన 'ని' గాగమంబు సాక్షికంబని యెఱుంగునది- 'తమ్ముచేసిన=(తమ్మునిచేసిన) దురితములు (ఆర ౩ ఆ ౨౭). 'మగనిన్' అనుచో 'ని' గాగమమును, ద్వితీయా 'ను' ప్రత్యయలోపముచేత దాని ద్రుతమును గలవు.

౧ విశే:-నఞర్థము క్రియతో నన్వయించునప్పటి నిషేధము ప్రతిషేధ మనఁబడును. అది నామముతో నన్వయించునప్పటి నిషేధము పర్యుదాస మనఁబడును.

'డు' మంతంబుమీఁది 'ను' వర్ణంబు 'ఉ' త్వంబున
కిత్వంబగు. ౨౯. (బా-౨౬) (వ్యా-సం-౧౩౩ విశే.)

ఈ సూత్రముచేత డుమంతముమీఁద 'ను' నిల్వనేరదని తెలుచున్నది. 'రామును వీక్షించె' అను రూపము తప్పని భావము.

ఇకారంబుమీఁది 'కు - ను - వు-క్రియా విభక్తుల'
యుత్వంబున కిత్వంబగు. ౩౦ (బా-౨౭) (వ్యా-సం-
౧౩౪ వి).

హరినిన్-హరికిన్. శ్రీనిన్-శ్రీకిన్. వారసిని-వారికిన్.

౧ విశే:-'కు-ను-వు' లయుఁ గ్రియావిభక్తులగు 'ను-ము-వు-రు' లయు 'ఉ' కారము ఇకార' మగు నని యర్థము. ఉదా:-రక్షించితిని-రక్షించితిమి-రక్షించితివి-రక్షించితిరి. కవిని (నేను). కవివి (నీవు). మొ. క్రియావిభక్తు లనుదాని సాహచర్యమున నీ విధి ప్రకృతులయందు వర్తిల్లదు. ఉదా:-చివుకు-కికురించు మొ.

ఈ ధాతు యుష్మదర్థంబులమీఁదివాని యుత్వంబున
కిత్వంబు రాదు. ౨౭. (బా-౨౭) (వ్యా-సం-౧౩౪ I వి)
ఈరు=(ఇయ్యరు)-ఈవు-ఈను-ఈము. ఈకున్-నీకున్-మీకున్.

౧ వివ :—తపరకరణము (చూ. సంధి౹సూ-౭వివ) లేమింజేసి 'ఇ' కారముమీఁదనేకాక 'ఈ' కారముమీఁదసైతము ౨౭ సూ. వర్తిల్లును. కావుననే యీ విధి (తత్స-౨౭ సూ) యారంభింపఁబడెను. తత్స-౬౫ సూత్రము చెప్పిన 'ఐ'కారముమీఁద సైతము ౨౭ సూ. వర్తిల్లును.

౨ విశ :—'ఈ' అను ధాతురూపమునకే యీ నిషేధముచెల్లును. 'ఇచ్చు' ధాతువునకీ నిషేధము చెల్లదు. ఉదా :-ఇచ్చితిని-ఇచ్చితిరి మొ.

కువర్ణంబు పరంబగునపుడు 'ఉ'కారంబునకుఁ బ్రాయి
కముగను 'ఋ' కారంబునకు నిత్యముగాను 'న' గాగ
మంబగు. ౨౮ (బా-౨౮) (వ్యా-సం-౧౩౬ I విష).

రామునకును-విష్ణువునకును-సవితృనకును. 'ఉ' అంతములకు 'ని' గాగము విభాషను వచ్చునుగాన నట్టియెడల 'ఇ' కారపూర్వకముగాన 'న' గాగమము రానేరదు. నిగాగమము నగాగమబాధకము (చూ-తత్స-౨౩ సూ) కాన 'సవితృనికిని' మున్నగు రూపములు నిర్బాధములు. దీర్ఘమగు 'ఊ' కారముమీఁదను నీ విధి వర్తిల్లును. ఉదా :-భ్రూవునకును- మొ.

౧ వివ :—ప్రాయికమనుటచేతఁ గవిత్రయేతర ప్రయోగములందు 'ఉ' దంతంబులకు 'న' గాగమము రాకుండుటయుఁ గలదు. 'ఉత్సవము-కేఁగెడు క్రియ' (ఉ-హరి-౬ ఆ ౧౮౦). 'నీతూపుకోర్వక' (కవిక. 3 ఆ ౧౧౯.) ఇట్లు 'పు' వర్ణాంతములమీఁదను 'న'కు రాకుండుట గలదు. చూ-ప్రౌఢ-శబ్ద-౧౯ సూ). (చూ-వ్యా-సం-౧౩౬ II విష.)

'కంటె-అందు' అను విభక్తులు పరంబగునపుడును
నమహత్తుల 'ఉ' కారమునకుఁ దర్వాతఁ గొన్ని యెడల

నగాగమంబు చూపట్టెడి-౨౯. (బా-తత్స-౨౮.) (వ్యా-సం-౧౩౬ III విష).

క్రితుశతంబునకంటెన్ (ఆది ౭ ఆ-౯౭) తనువునయందున్. (అర ౩ అ-౧౦౪). (చూ-ప్రౌఢ-శబ్ద-౨౨-౨౧ సూ).

ఉకారఋకారముల కంటు వర్ణకము పరంబగునపుడు 'ను' గాగమంబగు. ౩౦. (బా-తత్స-౨౯) (వ్యా-సం-౧౩౭ I విష).

తత్స-౨౩ సూత్రము చెప్పిన 'ని' గాగమము రానిపక్షమందే యీ 'ను' గాగమము వచ్చును. ఉదా:-రామునందును=రామునియందును. విష్ణునందును=విష్ణునియందును-విష్ణువునందును. విధాతృనందును=విధాతృనియందును. మొ-

ఆగమ 'ము' వర్ణకంబున కందు వర్ణకము పరంబగునపుడు 'ను'గాగమంబు విభాషనగు. ౩౧. (బా. తత్స-౩౦ సూ) (వ్యా-సం-౧౩౭ I విష.) ♦

వనమునందును=వనమందును. వనమ్మునందును=వనమ్మందును. వనంబునందును=వనంబందును. "యౌవనమందు" (మను-౧౪-౫౩). ఇట్టివి భారతమున లేవు.

౧ వివ:-ఈ సందర్భమున సూరి 'న' వర్ణకము నుదాహరింపనే లేదు- (కార. ౧౮-౨౩ సూ). వనమునను=వనమునందును. దీనికిఁ దృతీయార్థమును గలదు. వనమునను=వనముచేతను- మొ.

ఈ 'న' వర్ణక మేకత్వమున మాత్రమే ప్రయుక్తమగును-(తత్స-౧౧ సూ).

బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమం బగు. ౩౨. (బా. ౩౧ సూ) (వ్యా-సం ౧౩౮ వి)

---

♦ ఆగమ 'వు' వర్ణకంబుపైని సయితము 'నుక్కు' ప్రాప్తికమని సూరి వచించెను. సూరియుదాహరించినట్లు "ధేనువందును" అనురీతి గల ప్రయోగములు లేవు.

ా్ములను-ాములచేతను-విధాతృలను-విధాతృలచేతను.

౧ వివ :- కొన్నియెడల బహువచన 'ల' కారముచోట రేఫము నిల్చును-ఇది ముందు సూత్రింపఁబడును. (తత్స-3౼ సూ) బాలురు-బాలురను. వారు-వారిని-మొ. కొన్నియెడల మా దేశాదు లగు. మేము-మాచేతను-మొ.

సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది 'ఉ'కారంబునకు 'అ'కారంబగు. 33 (బా-తత్స-3౨). (వ్యా-సం-౧3౼ I విష.)

ఓరాముఁడ-ఓవృక్షమ-ఓశంభువ-ఓకొడుక.

౧ వివ :-సంబోధన మనఁగా నభిముఖీకరణము. కావున విశేష విధులు లేనపుడు ప్రథమైకవచన బహువచనరూపములె సంబోధన రూపము లగును ఉదా: ఓహరి. ఓత్మా-ఓస్త్రీ- ఓనవలా- మొ.

సంబోధనంబునందుఁ బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు. 3౪. (బా-తత్స-33). (వ్యా-సం ౧3౼ I విష).

ఓరాముఁడా=ఓరాముఁడ. ఓహరీ=ఓహరి.

౧ వివః-ఆంధ్రవర్ణ సమామ్నాయమందె ప్లుతము లేదు. దూరాహ్వాన రోదనాదులందును హ్రస్వదీర్ఘములె ప్రయుక్తములగు చున్నవి. కానఁ దెల్గున దూరాహ్వాన రోదనాదులందును బ్లుతము లేదు. హా మహారాజ ...నిషధరాజాగ్రణీ (ఆర.౨౫౭౧) ఓజనులార యడ్డపడ రో సురలార (భాస్కర.యుద్ధ ౪౧౫)

అకారేకారములకే దీర్ఘవిధిగాన 'వదినే' అను దీర్ఘము తప్పే. కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి 'డు' జ్ఞునకుల్లోపంబు విభాషనగు. 3౫. (బా.తత్స-3౪) (వ్యా-సం-౧౪౦ I విష.)

ఓరామ - ఓరాముఁడ. పూర్వ సూత్రముచేత (తత్స-3౪సూ.) బాక్షిక దీర్ఘంబు ఓరామా-ఓరాముఁడా. సంస్కృతనామం బనుటం "జేసి, ఓతమ్ముఁడ, ఓబల్లిదుఁడ (చూ-అచ్చి-3 సూ) ఇత్యాదులందు

లోపంబులేదు. కృతోత్క మనుటచేత 'ఉ' దంత సంస్కృతనామంబున కీ విధి చెల్లదు. ఓశంభుఁడ. 'ఓశంభ' అని కానేరదు.

౧ వివ:—వాత్సల్య నీచతాద్యర్థములందుఁ గొన్నినామముల తుది నేకత్వంబున 'ఇగా' ప్రత్యయము నిల్చును. 'దీనిడుజ్జు' సంబోధనంబున నిత్యముగా లోపించును. దీని దీర్ఘముపాక్షికముగా హ్రస్వమగును ఉదా:—గోపాలిగాఁడు, ఓగోపాలిగా—ఓగోపాలిగ.

ఉదంత సంస్కృతనామంబు 'డుజ్జు' సంబోధనంబున వైకల్పికముగ లోపింపఁగా మిగిలిన పదము తుది 'ఉ' కారము దీర్ఘమగును. ౩౬. (బా-తత్స-౩౫) (వ్యా-సం-౧౪౧ I విష.) ♦

ఓవిష్ణూ—ఓవిష్ణుఁడ—ఓవిష్ణువ, ఓవిష్ణుఁడా—ఓవిష్ణువా. 'జరత్కారూ జగన్మాన్య' (ఆది-౨-౧౫౪).

సంబోధనంబునందు బహువచనంబునకు 'ఆర' గాగమంబగు-౩౭. (బా-తత్స-౩౬సూ) (వ్యా-సం. ౧౪౨ I విష.)

ఓరాములార, దీనికి (తత్స౩౪. సూ) దీర్ఘంబగు—ఓరాములారా.

మధ్యమ పురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు-౩౮. (బా-తత్స- ౩౭) (వ్యా-సం-౧౪౩ I విష).

వినుఁడు బాలకులు=వినుఁడు బాలకులార. వచ్చితిరి కాంతలు=వచ్చితిరి కాంతలార. 'అన్నలార మిమ్ము నడిగెద నొక్కమాట' అనుచో సంబోధ్య యుష్మదర్థము కర్తగా లేదు. కాన మధ్యమ పురుషయోగము

---

♦ సూరియాంధ్రవర్ణసమామ్నాయముననే లేని ప్లుతమును విధించుట సరికాదు. చింతామణిలోని ప్లుతశబ్దమునకు దీర్ఘమే యర్థము. "ఉదాత సంస్కృత నామంబుమీఁదిసంబుద్ధి 'డుజ్జు' నకు 'ఊ' కారంబు ప్లుతం బాదేశంబగు" అని సూత్రించెను.

లేదు. కావున నిట 'ఆర'ాగమము నిత్యమె. 'వృక్షములార' మున్నగు చోట్ల సంబోధనముచేతనే వృక్షాదులకుఁ జేతనత్వము వివక్షితమని విశదమగుచున్నది. కాన వాని సంబోధనము విరుద్ధముకాదు.

౧ వివ:—క్రియ బహువచనముతో నున్నను దానిపై నున్న అమ్మాదు లేక వచనాంతములె యగును. ఉదా:—'చూచి వత్తమమ్మ సుదతులార' (భాగ—౧౦ స్క—౦. పూ.)

అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన తత్సమ
మహత్తువిభాఁది విభక్తి లకారంబునకు రేఫంబగు. 3౽.
(బా—తత్స—3౮) (వ్యా-సం—౧౪౪ I వి).

బాలురు, బాలురను, బాలురచేతను. నృపాలురు✝. తుదివర్ణమునకు ముందటివర్ణ ముపధ యనంబడు. బాలా—బాలలు. బాలాశబ్ద మదంతము కామింజేసి రేఫాదేశము రాదు. దీర్ఘపూర్వ మనుటచేత 'మహాబలులు' అనుచో 'ర'త్వము లేదు. ఆచ్ఛికమగుటచేత 'బేలలు' అనుచో రేఫాదేశము లేదు. 'మాలః'=(చండాలుఁడు) అను సంస్కృతశబ్దమున్నను దానికి 'మాలుఁడు' అనురీతిగల తత్సమప్రయోగము లేదు.

౧ వివ:—'మలినురు' అను యుద్ధమల్లుని బెజవాడ శాసనప్రయోగము ప్రామాదికము. రామాభ్యుదయములోని "మ. అరశే...మల్లురకు..." అను ప్రాసప్రయోగముచేత 'మల్లురు' అను చోటి 'ర'త్వము పాక్షికముగా సాధువనఁదగున—కాని తిక్కయజ్వ స్థలద్వయమునందును బ్రాస్థలమున 'ల' కారమునే నిల్పెను. చ. వలసిన...మల్లుల...... (విరా—౧ ఆ—౨౩) చ....మల్లుల విఱుచున్...విచ్చలవిడి... (విరా—౪ ఆ 3—౨3).

---

✝ సూరి 'దయాళురు' అనునదియుఁ గలదని వ్రాసెను. కాని యట్టి కవిప్రయోగము లేదు. 'బా—గు—ప్ర' కర్త 'దయాం లాతీతి=దయాలః' అని వ్యుత్పత్తిచెప్పి 'అదంతతను' సాధించెను గాని యట్టి శబ్దము లప్రయుక్తములు. 'దయాలా' అను సంబోధనమును జూపలేరు గదా!

అమహాన్నపుంసకముల ♦ * ప్రథమైకవచనమునకు 'ము' వర్ణక మాదేశమగు. ౮౦ (బా-త-౩౯) (వ్యా-సం-౧౮౫ I వి)

వృక్షము - ఋక్షము=(నక్షత్రము) - దైవము - కళత్రము - అన్నెము=(అన్య)-పున్నెము - (పుణ్య) నాణెము - నాడెము-విడెము-పళ్ళెము-సాము=(సగము)-గాము=(గ్రహము) - గీము=(గృహము) - దీము=(దీమము) - ఏతాము - గోతాము=(సంచి) మొ. క్లీబంబులు మిత్రాదులను సూత్రింబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వం బతిదేశిం చుటంజేసి మిత్రాది శబ్దములకు ద్వైరూప్యంబు. ఉదా:—మిత్రుఁడు=మిత్రము, శరణుఁడు=శరణము, (చూ-తత్స-౧౯సూ) "సౌమ్యుఁడు మిత్రము" అను రీతిగల ప్రయోగములు సాధువులె. "ఇతఁడు స్తుతి పాత్రము" (పారా ౫ ఆ-౩-౨౬). అన్యులు పాత్రములుగారు (శాంతి-౧ఆ౧౯)

౧ వివ:— 'దారములు' (భార్యలు—అహో౩౮౬పు) అనునది కవి ప్రయోగములం గానరాదు. 'దారలయందు' (అను-౮ఆ-౩) (భాగ-౧౧స్క-౦. ౯౬) అనియె ప్రయోగములుచూపట్టుచున్నవి. 'చీర' అనునది వైకృతము, 'చీరము' అనియుఁ గలదు. "మ ......ఒకర్తు చీరము

♦ 'అన్నెము-పున్నెము-గాము-గీము' మున్నగు ననేకోదాహృతులనుబట్టి సూరిగారి 'అదంతములకు' అను దళ మనర్థక మనఁ దగును.

* 'అమహాన్నపుంసకములకు' అనుచోఁ గర్మధారయమనెడి 'బా-కౌ-ప్ర' వాదమును 'వృక్షము-దైవతము' అను ప్రయోగములే నిరాకరింపఁజాలును. (చూ-వ్యా-సం-విస్త-౧౮౫ I విష). "అన్నెము-పున్నెము-గాము-గీము" మున్నగు నుదాహృతులను జూచికొనక 'బాల వ్యాకరణ' కర్త 'అదంతములకు ము వర్ణకంబగునని' సూత్రింపఁగడం గుట మిక్కిలి పొరపాటు.

కృష్ణాజినమున్''...(నిర్వ-౫ఆ-౨౫) 'పత్తనము' అనియొకాక 'పట్టణము అనియుఁ గలదు. ''రణవిజయముఁ గైకొని పట్టణము... (నిర్వ-౫ఆ-౭౫).

'ఇహము-పరము-ఆబాలగోపాలము' మున్నగునవియుఁ గలవు- ''ఇహాపరముల నెసక మెసఁగ'' (శాంతి-౫ఆ-౨౫౭). 'చెమ నిహాముం బరంబు (ఆది-౧ఆ-౧౩౯). ఆబాలగోపాలము (మను-౧ఆ-౩౨౫).

వానికి ముపర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు 'ము' గాగమంబగు, ౨౧. (బా-తత్స-౨౦) (వ్యా-సం-౧౨౬ వివ) వృక్షములు-వృక్షమును-వృక్షములచేతను-దైవములు-దైవమును-దైవములకును- మొ,

౧ వివ:- సూత్రములోని 'వాని' కనఁగాఁ బ్రథమైకవచనమున, 'ము'వర్ణకమువచ్చుశబ్దముల కని యర్థము. 'చరిత్ర-చరిత్రలు (తత్స-౫౯ సూ) లత-లతలు (తత్స-౫౮ సూ)-గోడ-గోడలు-(చూ-తత్స-౨౨) మున్నగు 'ము', వర్ణకము నిల్వనిశబ్దములకు 'ము' గాగమమును రానేరదు. 'ముదము-ముదమున' (తత్స-౭౫-సూ) మున్నగు 'ము' వర్ణకము వచ్చు శబ్దములకు 'ము' గాగమమును వచ్చును.

ముపర్ణకమునకు విధించు కార్యము 'ము' గాగమంబునకు నగు. ౨౨ (బా-౨౧) (వ్యా-సం ౧౨౭ వివ.)

'ము' వర్ణకమునకు విధించు లోపాదేశాది కార్యములు 'ము' గాగమంబునకు సహితము వచ్చునని యర్థము. ఉదా:-చరిత్ర-చరిత్రలు-లత-లతలు-గోడ-గోడలు-మొ.

ముపర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందు పూర్వక 'బు' వర్ణకంబేని విభాషనగు ౨౩. (బా-తత్స ౨౨) (వ్యా-సం-౧౨౭ వివ).

వృక్షము=వృక్షమ్ము=వృక్షంబు. వృక్షములు=వృక్షమ్ములు=వృక్షంబులు.

౧ వివ:- దీర్ఘపూర్వక పూర్ణము నిల్వదు. (చూ-సంజ్ఞా ౧౫) తత్సమానన్యాయమున 'మ్ము' వర్ణకమును నిల్వదు. ఏతాము. 'ఏతాంబు-ఏతామ్ము' అనునవి లేవు.

'లు-ల-న-'లు పరంబులగునపుడు 'ము' గాగమంబు నకు లోపంబును దత్పూర్వాకారంబునకు * దీర్ఘంబును విభాషనగు, ౪౪. (బా-తత్స-౪౩) ♦. (వ్యా-సం-౧౪౮ I విభ.)

బోనాలు (ఉద్యో-3 ఆ. ౨౨౯) చుట్టాలకున్ (ఉద్యో-౧ ఆ. ౧౨) ప్రాణానకు (ద్రోణ-౧ ఆ ౨౬౨. ద్రోణ 3 ఆ 3౪౫). డెందానన్ (ఉద్యో-3 ఆ. ౧౯) కయ్యానకుఁ (ఉద్యో౪ ఆ ౨౬౬). బసుమానన్ (బసవ ౭ ఆ ౨౧౯). వైరానన్ (నన్ని. కు-౪ ఆ ౪౧౭). సూత్రములోని 'న' అనుదానిచే 'న' వర్ణకమునేకాక 'కు' వర్ణకపరక 'న' గాగమమును గ్రహింపనగును. ఉదా:- కయ్యానకున్ (మీఁద నుదాహృతము). సాహసానకున్ (భాస్క-ర-యుద్ధ ౭3౮) భిషానకున్ (భీమ. ౨ ఆ) వీసానకుఁ (బసవ ౭ ఆ ౪౬౦ ప).

---

* సూరి సూత్రమున 'తత్పూర్వస్వరంబునకు' అని నిల్పరాదు. అట్టి యపమార్గముచేతనే 'కొండేలు-ముత్తేలు' మున్నగువానిని గొందఱు సాధింపఁజూచుచున్నారు.

♦ ఇట్టి రూపములు గవి ప్రయోగములలో ధారాళముగా నుండుటంజేసి సూరి 'ఒకానొకచో' అని సూత్రించుటయు, "ఒకానొకచో ననుటచే..." మున్నగు వివరణము వ్రాయుటయు యుక్తమైయుండలేదు.

ఇ – గ్లౌ – రా – యుగంతంబుల ప్రథమైకవనంబునకు
లోపంబగు. ౪౫(బా-తత్స-౪౪)(వ్యా-సం-౧౪౯ I వి) *

'హరి–సుధీ'–మున్నగు 'ఇ–ఈ' లు తుదినిగల మహత్పుంలింగము లకు 'డుజ్జు'ను, 'గిరి' మున్నగు నమహత్తులకు 'ము' వర్ణకమును, (తత్స–౪౦ సూ) 'గ్లౌ'=(చంద్రుఁడు) అను మహత్పుంలింగమునకు 'డుజ్జు'ను, 'రై'=(ధనము) అను నమహత్తునకు 'ము' వర్ణకమును (తత్స–౪౦ సూ) (రై+ఉగంత=రాయుగంత); 'ఇంద్రజిత్తు' మున్నగు హలంతములగు మహత్పుంలింగోకారాంతములకు 'డుజ్జు'ను, 'వు' వర్ణకంబును, (తత్స–౪౯ సూ) ప్రాప్తించుచుండఁగా నట్టి ప్రథమైకవచనములకు లోపము నీ సూత్రము విధించుచున్నది. సూత్రమున 'ఇ' అని తపరకరణ (చూ–సంధి–౧ సూ) రహితముగా విధింపఁబడుటచేత 'ఈ' కారాంతములకును నీవిధి వర్తించును. ఉదా:– హరి, సుధీ–గిరి–గ్లో–గ్లా–రై–రో– ఇంద్ర జిత్తు–వు.

ఇత్తునకు బహువచనంబు పరంబగునప్పుడు 'ఉ' త్వం
బగు. ౪౬. (బా–తత్స–౪౫) (వ్యా–సం–౧౫౦ I వి)

హరులు–గిరులు. 'యామినులు–బామినులు' ఈ రెండును నాచ్ఛికములు కామింజేసి తత్స. ౪౭ సూత్రము చెప్పున నుపోత్తమేత్వ

* సూరి 'శ్రీ–ధీ శబ్దములను స్త్రీలింగములను నిందుదాహరింపరాదు. (తత్స–౫౮ సూ). ఏకాక్షర శబ్దంబులకు సమాసోత్తరపదత్వము నందును (వ్యా–సం–౧౫౯ విశ)నుపసర్జనత్వమునందును (బహువ్రీహిని సైతము) హ్రస్వము గలుగదు. కాన 'రాజ్యశ్రీ–సుశ్రీ–సుధీ' అనియె యవి ప్రథమైకవచనమున నుండును. 'అపీ తన్ద్రీ తరీ లక్ష్మీ శ్రీ హ్రీ ధీ భ్వాదిశబ్దతః అనీబన్తతయా సో (సే) స్న లోపో గాణ్యే న హ్రస్వతా' (ముగ్ధ ౨౫౭ సూ–దుర్గా–వ్యాఖ్య) 'సుధి'=(పండిత) అను 'శ–ర' హ్రస్వము తప్పు. 'గిరి–రై' శబ్దములకు 'డు–ము–వులు'అనువానిలో నేది యు నూరిపబొన రాదు. 'సు' నిల్పఁబడును.

మునకు 'ఉ' త్త్వము రాదు. తపరకరణంబుచే దీర్ఘంబునకు 'ఉ' త్త్వంబు లేదు. ఉదా:- శ్రీలు-స్త్రీలు-లకోరీలు మొ

౧ వివ:- 'గతాశులు-జితాశులు-ఆశ్రియాశులు' మున్నగుచోటు లందువలెనె 'రాశులు' మున్నగుచోటులందును 'శ' వర్ణస్థితియె సాధువు "రాసులు' అనునది తద్భవపదము.

వికృతియం దికారాంతముల యుపోత్త మేత్త్వంబునకు
బహువచనంబు పరంబగునపుడు 'ఉ' త్త్వంబగు. ౮౭.
(బా-తత్స-౮౬) (వ్యా-సం-౧౫౧ I వి).

ఇచట వికృతిశబ్దంబుచేత సంస్కృత సమేతరంబును గ్రహింపవల యును. మూఁడిటికిఁ దక్కువకాని యక్షరములు గల 'ఇ' దంత శబ్దము లలోని తుది యక్షరమునకుఁ బూర్వాక్షరముమీఁది 'ఇ' కారమునకు 'ఉ'కారాదేశం బగునని యర్థము. ఉదా:-కలికి-కలుకులు-ములికి-ములు కులు, చెలిమి-చెలుములు, బలిమి-బలుములు, ఉపోత్తమేత్త్వమున కనుట చేత 'జిగి-నిసి' ఇత్యాదులందు ఉత్త్వంబు లేదు. జిగులు-నిసులు. మున్నగువానియందలి తుది 'ఇ' కారమునకు తత్స-౮౯ సూత్రముతనేచే 'ఉ' కారాదేశం బగును.

రలడోపధ నవార్థాముల యుపోత్త మేత్త్వంబునకు
'ఉ' త్త్వంబు గలుగదు. ౮౮. (బా-తత్స-౮౭) (వ్యా-
సం-౧౫౧ I విమ.).

'తుదివర్ణమునకు ముందటివర్ణ ముపధ' (చూ-సంజ్ఞా ౧౦ సూ). పూర్వసూత్రమున కపవాదము. పందిరులు-(పందిరి), పిడికిలులు (పిడికిలి). రాపిడిలు (రాపిడి). తొమ్మిదులు (తొమ్మిది) ఎనిమిదులు (ఎనిమిది). మొ.

౧ వివ:- రాపిళ్ళ (మనుచ-౮-ఆ. ౭౬), 'మేలైన రెండు తొమ్మిదులు విద్యలయందు (కాశీ ౩ ఆ ౧౮౧), ఈ ప్రయోగమును బట్టి నవార్థాదులని గణముచేయఁబడెను. 'మొదలైన రెండు తొమ్మి దులు' అనునది ప్రక్షిప్తపారము. (వ్యా-సం-౫౮౭ పుట).

ఉకారాంత గోశబ్దంబుల కంతట 'వు' వర్ణకంబగు.

౪౽. (బా-తత్స-౪౮) (వ్యా-సం-౧౫-౨ I విమ.)

తరువు-ధేనువు-మధువు-గోవు. అంతట ననుట స్త్రీలింగ ప్రథమైక వచన లోప (తత్స ౫౮ సూ) బాధనార్థము. ఉదా:- వధువు-ధేనువు-మొ.

౧ వివ:- 'వు' వర్ణకము సంస్కృత సమములకు మాత్రమె యగును. 'బందువు-పుట్టువు-చేటువు' మున్నగువాని తుదివర్ణము ప్రథమైకవచన 'వు' ప్రత్యయము కాదు అది శబ్దావయవము. అట్టి శబ్దము లెల్ల స్త్రీ సమములు.

౨ వివ:- తత్స ౮౧ సూత్రము చెప్పునట్టు ప్రాతిపదికాంత 'స' కారము లోపింపఁగా మిగిలినది 'ఉ' కారాంతమగునపుడు దానికిని, 'వు' వర్ణకాది విధులు చెల్లును. ఉదా:- ధనుస్-ధనువు. ఉపసర్జనత్వమున 'ఓ' దంతము ఉ' దంతమగును అచటను నీ విధులు చెల్లును. ఉదా:- పూర్ణ+గో=(నిండిన గోవులుగల యిల్లు)=పూర్ణగువు.

3 వివ - తపరకరణ రాహిత్యమున నిది 'ఊ' కారాంతములకును నగును. ఉదా:- భ్రూవు=(కనుబొమ్మ) 'బాహావ్రుళించి' (విరా-౨ ఆ ౭) అనుచో 'బాహ+అప్రుళించి' అని ఛేదము. తత్స మాకారసంధి విరుద్ధము కాదు (మూ-సం ౪ సూ) ఈ ప్రయోగముచే 'బాహు=బాహువు' అని 'వు' వర్ణకలోపము నంగీకరింపరాదు.

౪ వివ:- స్మృత+ఉ=(శంభు)=స్మృతోశబ్దాదులు తెల్గున నప్రయుక్తములు. గోవులు = ఆవులు, సూర్యకిరణములు. ౪౦ - గోవులు సూర్యునియుజ్వల గోవుల (అను-౨-ఆ ౪౽౧). ఉపసర్జనత్వమున నిది 'ఉ' కారాంతమె యగును. ("చిత్రాః+గావో యస్యసః")=చిత్రగువు= చిత్రగుఁడు=(సూర్యుఁడు)-(మూ-తత్స-౫౧ సూ).

'వు' వర్ణ కేతరవిభక్తి పరమగుచో నమహాదుదంతము లకు విప్రకముగాను, జరత్తారూ శబ్దభిన్న స్త్రీ వాచకో

దంతములకును నూదంతములకును గోశబ్దమునకును నిత్యముగాను 'వు' గాగమంబగును. ♦. ౫౦. (బా-తత్స-౪౯) (వ్యా-సం-౧౫౩ I విష).

తరువులు=తరులు, ధేనువులు=ధేనులు, రజ్జువులు=రజ్జులు, జరత్కారువులు=జరత్కారులు - "జరత్కారున్ మదీయానుజన్" (ఆది-౨-ఆ ౧౫౪). వధువులు-భ్రూవులు-గోవులు.

ఉకారాంతంబగు మహత్తునకు 'వు' వర్ణకము వైకల్పికము. 'మను-కటు-పటు' శబ్దములకు నిత్యము. ౫౧. (బా-తత్స-౫౦ సూ), (వ్యా-సం-౧౫౪ I విష.).

విష్ణువు=విష్ణుఁడు, శంభువు=శంభుఁడు. (మహాత్వాంలింగమగుటచే 'వు' వర్ణకాభావపక్షమున 'డుజ్జు' వచ్చును. వటువు=వటుఁడు. 'డుజ్జు' వచ్చు నీ రూపము దీని కర్వాచీనము. 'చండస్ఫూర్తి వటుండు కాంచె' (భాగ. ౮ స్కం. ౫౨౯) బాహుశబ్దము వృద్ధాదులలోనిది గాన డుజ్జు లోపమును గలుగును-బాహువు=బాహుఁడు=బాహు-. (చూ-తత్స ౫౭ సూ).

మనువు - (స్వాయంభువాది). పటువు=(సమర్థుఁడు). కటువు=(చేదైనవాఁడు=అనిష్టుఁడు) ఆ వె|మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి కటువు బిరుద వినుతికరణములకుఁ జాలఁబటువు ధరణి సంగీత సాహిత్య సరణి విశ్వనాధ చక్రివర్తి, (కావ్యాలం-౯-ఉల్లా-౩౦ ప).

"విష్ణు సాక్షాత్కరించె. ఖండపరశు శిరఃకంపంబుచేసె" (రంగనాయాని-ముద్రి-౭౩-౭౫౩ పుటలు) ఇట్టి సామాన్య కవి ప్రయోగము లితర ప్రామాణిక కవుల గ్రంధములలో లేమింజేసి యిట్టివి సాధువు లనరాదు.

---

♦ ప్రయోగములనుబట్టి యిట్లు నిర్ణయింపఁదగి యుండఁగా సూరి బహుళవిధి నాశ్రయించుట సరికాదు.

క్రద్రువ-నాగమాత. ౫౨. (బా-తత్స ౫౧) (వ్యా-సం-౧౫౪-౧౫౫ III విభ.).

క్రద్రువ-క్రద్రువలు-క్రద్రువను-కద్రువలను.

౧ వివః-స్త్రీ-వ్ర రుసన యా కద్రువకు వినతకుఁ బుట్టె (ఆను-౧ ఆ ౧౬౭) ఇట్టి తిక్కయజ్వ ప్రయోగములచేఁ గశ్యపపత్నియగు నాగమాత యర్థమగునపుడు 'వు' వర్ణక 'వు' గాగమములచో 'వ' అను రూపము నిల్చునని యీ నిపాత సూత్రమున కర్థము. అల్పసంఖ్యా రూపసాధన మున సిద్ధరూపములను జేర్కొనునది నిపాత సూత్రము. పింగళవర్ణ మర్థమగునపుడు 'కద్రువు' అనియే యగును.

ఋకారాంతంబున కత్వంబును స్త్రీ వద్భావంబు నగు-
౫౩. (బా-తత్స-౫౨) (వ్యా-సం-౧౫౬ I విభ.).

స్త్రీ వద్భావమున స్త్రీ లింగ ప్రథమైకవచన (తత్స ౫౦ సూ) లోపాదిక మగును.

భ్రాత-జామాత = (అల్లుఁడు) కర్త= (చేయువాఁడు, చేయునది) హర్త=(హరించువాఁడు-హరించునది). గంత=(పోవువాఁడు-పోవునది) హంత=(చంపువాఁడు-చంపునది).

౧ వివః- ఋకారాంత స్త్రీ లింగములును, ఋకారాంత స్త్రీ వాచకములును సాధారణముగా 'తత్స-౮౬-౮౭ సూ-చెప్పునః ఙ్యంత ములె యనఁగా 'ఈ' కారాంతములె యగును. ఉదాః- కర్త్రి=(చేయు స్త్రీ-చేయు లతాది) - హర్త్రి = (హరించునట్టిది) గంత్రి=(పోవునది) హంత్రి=(చంపునది). 'స్వసృ-ననాంధృ-దుహితృ-యాతృ-మాతృ' శబ్ద ములు మాత్రమట్లు ఙ్యంతములు కావు. వానికి 'అత్వ స్త్రీత్వ'ములె యగును. స్వస=(తోఁబుట్టిన స్త్రీ). ననాంద=(మగనితోఁబుట్టిన స్త్రీ) దుహిత=(దూహితుర్లు). యాత=(తోడికోడలు). మాత=(తల్లి).

విధాతృ-ధాతృ-మాంధాతృ * -దాతృ-సవితృ-నేతృ

---

* 'మాంధాతృఁడు' (ఆర ౩ ఆ ౧౭౮) (శాంతి ౬ ఆ ౫౫౬). కాన సూరి దీనిని విధాత్రాదులతోఁ జేర్కొనకుండుట సరికాదు.

శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాష నగు. ౫౮. (బా-త-౫౩) (వ్యా-సం ౧౫౭ విసు)

విధాత = విధాతృఁడు. ధాత=ధాతృఁడు=(బ్రహ్మ.) మాంధాత= మాంధాతృఁడు = (ఒకరాజు). దాత = దాతృఁడు. సవిత=సవితృఁడు= (సూర్యుఁడు). నేత=నేతృఁడు = (పాలించువాఁడు) అత్వ స్త్రీత్వములు రానపుడు మహత్పుంలింగములకు 'ఉత్వ డుజ్జులు' వచ్చును.

౧ వివ :—మహత్తులగు విధాత్రాదులకే యనుటచేత "ప్రాచీనకర్మమె జనుల కష్టసుఖములకు విధాత" అనుచో 'ఉత్వడుజ్జులు' రానేరవు.

సంస్కృత ప్రాకృత ప్రాతిపదికముల తుది దీర్ఘమునకు హ్రస్వం బగు. ౫౯ (బా-తత్స-౫౮) (వ్యా-సం-౧౫౮ I వి).

రమా-రమ. వనితా-వనిత. విద్యా-విద్య. లతా-లత. లక్ష్మీ-లక్ష్మి. సేనానీ-సేనాని=(కుమారస్వామి). హాహా=హాహ. (ఒకగంధర్వుఁడు). సిరీ-సిరి. ఇది ప్రాకృతసమము. ఇట్లు కృతహ్రస్వంబులకు హ్రస్వాంతంబులకుంబోలెఁ గార్యంబు లగు. ఉదా :—రమలు-లక్ష్ములు-సేనానులు. హాహుఁడు. సిరులు=(లక్ష్ములు).

౧ వివ :—దేశ్యము వ్యవహారప్రవాహసిద్ధముగాన 'నవలా'= (స్త్రీ) మున్నగు దీర్ఘాంతములవలెనె 'నవల'=(స్త్రీ) మున్నగు హ్రస్వాంతములును సిద్ధించు ననఁదగును. * 'విలుకాఁడు' మున్నగు 'కా' ప్రత్యయాంతాదులకు హ్రస్వములేదు- (చూ-తద్ధి-౧౧-౧౫-౨౩ సూ).

---

* నతనాభి న్నవలాను (మనుచ-౨...) ...లల ముద్దుమోమును. (వి్ర. ౫ ఆ) (శ-...-న్' ఘంటు... నీశబ్దమే లేకుండుట వింత!



౨ వివ —యమునానది తుంగతరంగ (ఆది-౮ ఆ ౨౩-౨) 'గౌరివల్లభుఁడు మున్నగుచోట్లులందలి హ్రస్వము సాధ్యవష్ఠీసమాస సిద్ధము.

3 వివ —ఉపసర్జన హ్రస్వము వచ్చునపుడును క' ప్రత్యయాదులు వచ్చునపుడును నీసూత్రమునకుఁ బ్రసక్తియె యుండదు. ఉదా -వచస్సుధానిధిభంగి=(హరిహరనాథుఁడు) (మహా ౫-౧౩-౭౭). అతినువు=(అతిక్రమించిన యోడ గలది బ్రాహ్మణకులము) ప్రద్యువు=(ప్రకృష్టమగు స్వర్గము గలది సురకదంబము) చిత్రగువు=(చిత్రములైన కిరణములు గలవాఁడు=సూర్యుఁడు) జితసేనానీకుఁడు=(జయింపఁబడిన కుమారస్వామి గలవాఁడు పరశురాముఁడు)

ఏకాక్షరక శబ్దంబులకు హ్రస్వంబు లేదు ౫౬

(బా-తత్స-౫౫) (వ్యా-సం-౧౫౯ వివ)

క్ష్మా=(భూమి) శ్రీ-స్త్రీ-హ్రీ=(లజ్జ)-ధీ=(బుద్ధి)-భీ=(భయము)-భ్రూవు=(కనుబొమ) క్ష్మాను=(భూమిని) మొ

౧ వివ —ఉపసర్జనత్వమున (బహువ్రీహ్యాదులను) క్ష్మా' ప్రభృతి స్త్రీ ప్రత్యయాంతములకు హ్రస్వము కల్గును విజితక్ష్ముఁడు=(జయించిన భూమిగలవాఁడు) ' శ్రీ-హ్రీ-ధీ-భీ-భ్రూ శబ్దములు స్త్రీ ప్రయాంతము కావు * వాని కుపసర్జనత్వమున హ్రస్వము గలుగదు ఉదా —సుశ్రీలు=సుశ్రీకులు సుధి అను శ-ర'తప్పు 'భ్రూవు అనుచో తత్స-౪౯-౫౦ సూ చొ వువర్ణక వుగాగమములు.

నన్నయభట్టాది శబ్దములకు నిత్యముగాను వృద్ధాదిశబ్దములకు వికల్పముగాను డుజ్జు లోపించును.

---

* అనీ-తన్త్రీ-తరీ-లక్ష్మీ- శ్రీ-హ్రీ-ధీ-భ్వాదిశబ్దతః అనీబన్తతయా స్తే (సో) ర్న లోపో గౌణ్యే న హ్రస్వతా (ముగ్ధ-౧౫౭ సూ-దుర్గా-వ్యాఖ్య)

౫౭. (బా-తత్స-౫౬) (వ్యా-సం ౧౬౦ I విమ.) *

నన్నయభట్టు (ఆది. ౧ ఆ ౨౫). నారాయణభట్టు (ఆది ౧ ఆ ౨౮) కంకభట్టు (విరా ౫ ఆ ౨౫౦) వృద్ధ = వృద్ధుఁడు. మూర్ఖ=మూర్ఖుఁడు. నీచ=నీచుఁడు. ధూర్త=ధూర్తుఁడు. రాహు= రాహుఁడు=రాహువు. నీతు' మున్నగునవి తద్భవములు

స్త్రీలింగంబుల ♦ ప్రథమైకవచనంబునకు లోపం

బగు. ౫౮ (బా-తత్స-౫౭). (వ్యా-సం-౧౬౧ I విమ )

రమ-క్షమ-వనిత-ఘనత-విద్య-దేవత-మీననేత్ర

౧ విమ '-సూత్రమందలి స్త్రీలింగశబ్దము పారిభాషికలింగపరము. కావున 'దేవతా' శబ్దమునకును నీవిధివర్తిల్లును. దీనికి 'డు-ము-వు' అనువానిలో నేదియుఁ బ్రాప్తింపదు. కాన సంస్కృత సు' ప్రత్యయమునె నిల్పి ప్రకృతసూత్రముచే లోపమును జేయవలయును (చూ-తత్సమ ప్ర-వివృతి. ౪ విమ ° గుర్తు టిప్పణము.) రమాదిశబ్దములకుఁ దత్స ౫౫ సూత్రముచే హ్రస్వముచేసి తత్స ౪౦ సూత్రముచే వచ్చు ము వర్ణకమునకు దీనిచే లోపమును జేయవలయును ఉప

---

* సూరి భారతప్రయుక్తములగు నన్నయభట్టాది' శబ్దముల నిత్యతను (ఉక్త్వైనైవ భవన్త్యన్యే-అధర్వణకారిక) సూత్రింపకుండుటయు మహాకవిప్రయుక్తములు కాని గృహస్థ-చార్వాక' శబ్దముల పాక్షికతను నుదాహరించుటయు వింతగా నున్నది.

♦ సంస్కృతమున స్త్రీలింగ స్త్రీవాచక' శబ్దములు పర్యాయములుగ వాడఁబడునుగాని తెలుఁగున నట్టివాడుక లేదు. 'స్త్రీలింగ' శబ్దము-పారిభాషికలింగపరముగాను స్త్రీవాచక శబ్దము మహతీ వాచకపరముగాను వాడుట తెలుఁగు సంప్రదాయము. కావుననే యహోబలపతి 'దారశబ్దస్య స్త్రీవాచకత్వేపి స్త్రీలింగత్వాభావాత్'' (అహో ౩౪౬ పు) అని వ్రాసెను. (చూ-వ్యా-సం-విస్తర II ౧౬౧ I విమ )

సర్జనత్వమున మీననేత్రశబ్దము శాస్త్రీయః=(పారిభాషిక స్త్రీలింగము) స్త్రీలింగ మయ్యెను సంపద-ఆపద మున్నగు హలంతములవిషయము నను నీవిధి వర్తిల్లును

౨ వివ —తత్స-౪౯ సూత్రమునందలి అంతట నను దళముచే ఉవర్ణాంత’ స్త్రీలింగములయెడల నీవిధి వర్తిల్లదు ఉదా — వధువు-భ్రూవు- మొ

3 వివ — బ్రహ్మ- విశ్వకర్మ- అశ్వత్థామ- భ్రాత- దూత మున్నగువానియెడ (తత్స-౭౭-౭౮-౫౩-౬౩ సూ) స్త్రీత్వాతిదేశముచేత నీసూత్రము వర్తిల్లును ఇట్లె స్త్రీ సమాచ్ఛికశబ్దములయెడలను నీసూత్రము వర్తిల్లును ఉదా:-తల్లి-తండ్రి-అన్న-గోడ-చెలువు-పుట్టువు-మనువు (మన్నుట) మొ

దర్భాదులకు నిత్యముగాను, జరిత్రాదులకు వికల్పముగాను ము’ వర్ణకము లోపించును ౫౯
(బా-తత్స-౫౮ సూ) (వ్యా-సం-౧౬౨ I వివ )

దర్భ-కుశ-పనస ఇవి దర్భాదులు చరిత్ర=చరిత్రము చరిత=చరితము అలకలు=అలకములు అక్షతలు=అక్షతములు భ్రమ=భ్రమము వధ=వధము హంస=హంసము ఇత్యాదులు చరిత్రాదులు, ఆకృతిగణము ◆

---

◆ సూరి చరిత్రాద్యుదాహృతి సరిగాలేదు అభిలాష-ఘోష శబ్దముల ము లోపమునకుఁ బ్రయోగము కానరాదు. తరఁగ=తరంగ’ అనునవి తరంగము’ అనుదాని వికృతులు. ఇట్లె-వేగ’ అనునది వేగము’ అనుదాని వికృతి- మహాతరంగ-మహావేగ’ అను ప్రయోగములులేవు స్ఫురణము-విజృంభణము’ మున్నగునవి ల్యుట్’ ప్రత్యయాంత నపుంసకములు. స్ఫురణ-విజృంభణ’ అనురీతివి ‘యుచ్’ ప్రత్యయాంత స్త్రీలింగరూపములు. ఇవి కృదంతములు కాన నిట్టివానిని చరిత్రా’దులలోఁ జేర్పరాదు

౧ వివ :- లు గ్భవేత్ కుశాదే ర్మోః" అను చింతామణి చెప్పిన కుశ' శబ్దము దర్భాదులలోఁ జేర్పఁబడెను. పనస' వైకృత మనెడి శబ్దరత్నాకరము సరికాదు. 'పనసః-పుం-కణ్టకిఫలే. (శబ్దా-చిం.) అనుచెప్పిన పనస' శబ్దము సంస్కృతము. కాన నిది సూరిచెప్పినట్లు దర్భాదులలోని దనుటయె యుక్తము. (పంచాశచ్ఛబ్దభవము పనస' శబ్దము తద్భవము )

౨ వివ:-చరిత్రాదు లాకృతిగణముగాన ప్రయాగ=ప్రయాగము. సంసర్గ=సంసర్గము నిశ్శంక=నిశ్శంకము చామరలు=చామరములు లాజలు=లాజములు (పెలాలు). నిత్య=నిత్యము. తథ్య=తథ్యము. ప్రశ్న=ప్రశ్నము. స్పర్శ=స్పర్శము మొదలైనవి గ్రాహ్యములు. ఈచరిత్రాదు లింకను మహాకవి ప్రయోగములనుబట్టి యెన్న నగును. ఉదా - ప్రాస-అంతస్థలు-ఊష్మలు-చిహ్న-విమర్శ-మధ్య-నిష్కర్ష-అంశ-మొ.

ధర్మాదిశబ్దముల 'ము' వర్ణకమునకు ఉవు' అను నాదేశమును, రూపాదిశబ్దముల ము వర్ణకమునకు ఉ' అను నాదేశమును వికల్పముగ నగును. ౭౦-(ప్రౌ-శబ్ద-౨౫ సూ) (వ్యా-సం-౧౭౩ I వివ).

ధర్మువు=ధర్మము, కర్మువు=కర్మము వర్మువు=వర్మము=(కవచము). అర్ఘువు=అర్ఘము మొ- రూపు=రూపము శరణు=శరణము. బీభత్సు=బీభత్సము వర్గు=వర్గము- *

౧ వివ :-ప్రయోగములు :-చ-అవని . సర్వధ ధర్మువులు .. అర్ఘువులు (ఆది-౪ ఆ-౨౫౦) చిత్రరూపులభంగి (ఉద్యో-౪ ఆ ౧౧౬). బహురూపులు-(బసవ ౪ ఆ ౫౧౫) శరణు వేఁడిన (అను-౫ ఆ ౩౮౮) గీ-బీభత్సు-(శివరా)

---

* సూరి 'ధర్మువు' రూపు' శరణు' మున్నగు ప్రామాణిక ప్రయోగ సిద్ధరూపములనైన సంగ్రహింపకుండుటు సరికాదు.

సురశబ్దము తెల్గున నిత్య బహువచనాంతము స్త్రీ సమము నగును సిద్ధసమాసమున నట్లు కానేరదు ౬౧ (బా-తత్స-౫౯-౬౦) (వ్యా-సం-౧౬౪ I) ♦

సురలు-ఎల్లసురలు నిఖిలసురులు-భూసురుఁడు

౧ వివ — సుర' శబ్దము తెల్గున దేవతా' పర్యాయమందె కవి ప్రయుక్తము సుర-పుం-దేవే-సూర్యే-పణ్డితే (శబ్దస్తో)

అసురశబ్దము వికల్పముగా స్త్రీతుల్యంబగును ఇదియు సిద్ధసమాసమున నట్లు కాదు ౬౨ (బా-తత్స-౬౦) (వ్యా-సం-౧౬౪ I II వివ).

అసుర=అసురుఁడు ఎల్లయసురలు=ఎల్లయసురులు రావణాసురుఁడు నిఖిలాసురులు

దూతాదులకు స్త్రీత్వము వైకల్పికము ౬౩ (బా-తత్స-౬౧ సూ) (వ్యా-సం-౧౬౪ I II వివ)

దూత=దూతుఁడు ఉత్తమదూత= ఉత్తమదూతుఁడు కేవల యోధవే (ఉద్యో-౩ ఆ ౬౧) సింగంబు దూతుఁడు జంబుకంబు

దూత-యోధ-శూర- ఇవి దూతాదులు

పృథ్వీవాచి భూ శబ్దంబునకు భువి యగు ౬౪ (బా-తత్స-౬౨ సూ) (వ్యా-సం-౧౬౫ I వివ)

భువి-భువులు భువిని-భువులను

౧ వివ —స్త్రీలింగ ప్రథమైకవచన లోపము (తత్స-౫౮ సూ)

---

♦ దేవశబ్దము నిత్యైకవచనాంతముగ సూరి వచించెను-రాచవారలుం దేవులు (భోజ ౫ ఆ 33)

* దూత శబ్దమున కమహత్త్వమున స్త్రీత్వము నిత్యమనెడి సూరి ప్రభృతుల వాక్యములు నిరాధారములు దూతుఁడగు జంబుకము అనియుఁ జెప్పవచ్చును అశ్వసేనుఁడను భుజంగమము (ఆది ౮ ఆ-౨౭౩)

'భువి నవార్యబలుండు' (ఆది-౪ ఆ-౨౬౦) పృథ్వీవాచి యనుటచేత 'ఆత్మభూ-స్వయంభూ మున్నగుచోట్ల భువి అని నిలువదు-

నౌ శబ్దంబునకు నావ' యగు ౬౫ (బా-
తత్స-౬౩ సూ) (వ్యా-సం-౧౬౬ I వివ)

నావ-నావలు. మహానావ (తత్స-౫౮ సూ-ప్రథమైకవచన లోపము నౌ శబ్దము స్త్రీలింగము). ఉపసర్జనత్వమున అతినువు= అతినౌకుఁడు =(నావ నతిక్రమించినవాఁడు) ♦ స్తోఽవావౌ రై నా వో॰" (ఆం-చిం)

రై-గ్లా శబ్దంబల కోత్వంబు విభాషనగు ౬౬
(బా-తత్స-౬౪) (వ్యా-సం-౧౬౬ I వివ) స్తోవా
వౌ రై నావోః (ఆం-చిం)

రై-రో శబ్దములకు ము'వర్ణకమును గ్లా-గ్లో=(చంద్రుఁడు). శబ్దములకు డుజ్జు ను ప్రాప్తించుచుండఁగా వానికి ఇ-గ్లా-రా' సూత్రముచే (తత్స-౪౫) లోపము గల్గును రై=రో (ధనము) నీవు నాకు రో యిడుము ' (ఆ౪ ౨ ఆ ౨౨౨) గ్లా=గ్లో=(చంద్రుఁడు) (అహో ౩౨౩ పుట) గ్లా శబ్దము డు'మంతము కామింజేసి (తత్స-౨౩ సూ) 'గ్లాని కుల నృపతులు' (కావ్యాలం-౯ ఉల్లా-౩౭) అను ప్రయోగము ప్రామాదికమని చెప్పవలసియున్నది

ఐకారం బీ తుల్యంబు ౬౭ (శా-తత్స - ౬౫)
(వ్యా-సం-౧౬౭ వివ)

---

♦ నావి అని సూరి యంగీకరించిన రూపమేకోశమునందును గానరాదు. 'నావ అనునది వైకృతముగా సయితము సూ-రా-ని' ఘంటువున వ్రాయఁబడెను రూపమందుఁగాని యర్థమందుఁగాని భేదము లేనపుడు తద్భవత్వాంగీకారమేల ? నావ సంస్కృతసమ మనుటకు చింతామణియే పరమప్రమాణము

రైనిని-రైకిని. కైని-కైకిని. పైని-పైకిని. (చూ-తత్స-౨౬ సూ) ఐకారం బి తుల్యమని సూత్రించినచో రై + లు = రులు' కావలసి వచ్చును. (చూ-తత్స-౪౬ సూ) ఈ విధి యాచ్ఛికములందును వర్తిల్లును- కావుననె కై-పై' శబ్దము లుదాహృతములయ్యె.

కంధరాదులు క్లీబతుల్యంబులు విభాష నగు విధా శబ్దమున కీ విధి నిత్యము ౬౮ (బా-తత్స-౬౬) (వ్యా-సం-౧౬౫ I విశ)

కంధరము=కంధర=(మెడ). విధము కంధరా-నాసికా-భిక్షా-దంష్ట్రా-గ్రీవా-పాదుకోల్కా- ప్రభృతులు కంధరాదులు. ఆకృతిగణము

౧ విశ -తత్స-౫౫ సూ. చొప్పున హ్రస్వతయు, ౫౮ సూ. చొప్పునఁ బ్రథమైకవచలోపమును రాఁగా కంధర' మ్మనఁగు స్త్రీలింగ రూపము లేర్పడును ప్రకృతసూత్రముచేఁ గ్లీబత్వాతిదేశము పాక్షికముగఁ జేయఁబడుటచేత కంధరము' మ్మనఁగు రూపము లేర్పడును. (చూ-తత్స-౪౦ సూ) కంధరాదు లాకృతిగణముగాన సీమ=సీమము (ఆర-౭ ఆ ౧౭)=(సరిహద్దు) దామ=దామము=(పూలదండ)

ద్వి-త్రి-తిసృ-చతసృ-ప్రభృతులగు నల్పసంఖ్యావాచకములకును స్మృతో ప్రభృతి శబ్దములకును దెల్గునఁ దత్సమరూప విభక్తియోగము లేదు-౬౯. (బా-తత్స-లేదు) (వ్యా-సం-౧౬౮ II విశ).

ప్రత్యయాంతర యోగమున ద్వి-త్రి' ప్రభృతులకు విభక్తి యోగము గలదు ఉదా -ద్వికము-ద్వయము-త్రికము-త్రయము-త్రితయము- మొ. ద్వ్యాదులనుటచేత ఏకంబు' అను రూపము

---

* విధాశబ్దము నిత్యముగాఁ గ్లీబతుల్య మనుటకై సూరి యీ విధిని బహుళమనుట సరికాదు-

గలదు స్మృత+ఉ=స్మృతో (స్మరింపఁబడిన శంభువు గలవాఁడు) స+ఇ=సే (మన్మథునితోఁ గూడినవాఁడు)బూదంతశబ్దములు ఇదంత ఈదంత శబ్దములు మున్నగునవి స్మృతోపవిభృతులు

ఇది యజంతప్రకరణము

ఇంక హలంతప్రకరణము

హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందు
నామం బగు 20 (బా-తత్స-౬౭) (వ్యా-సం-౧౬౯-
మొ ౧౭౦ II వివ)

రుక్=(కాంతి) - రాట్=(రాజు) ♦ కర్మ - వర్మ=(కవచము) మొ శబ్దములు శ్వశబ్దంబు దప్ప నకారాంతంబులెల్లఁ బ్రథమైకవచ నాంతతుల్యంబులె యగును

౧ వివ —సంస్కృత శబ్దములలో నజంతములు మాత్రమె తత్సమములగునపుడు సంస్కృత ప్రాతిపదికరూపము తెల్గున నిల్చి యాంధ్ర వ్యాకరణకార్యముల నందును. హలంతములలోఁ గొన్నిటికి సంస్కృత ప్రథమైకవచన తుల్యరూపము ప్రాతిపదికమై నిల్చును కొన్నిటికి సంస్కృత ద్వితీయైకవచన తుల్యరూపము ప్రాతిపదికమై నిల్చును సత్య జిత్-ఇంద్రజిత్ అను తకారాంతములకును, సకారాంత మహాన్మహాత్ శబ్దములకును ద్వివిధరూపములునుండు ననఁగాఁ బ్రథమైకవచన తుల్య రూపమునను ద్వితీయైకవచన తుల్యరూపమునను బ్రాతిపదికము లుండును. అట్లు ప్రథమైకవచనాంత తుల్యరూపమును గ్రహించుటకు వీలులేనపు (నిత్యబహువచనాంతత మున్నగు కారణములచేత) డగతికముగ హలంత సంస్కృతప్రాతిపదిమె తెల్గునను బ్రాతిపదికమగును.

---

♦ సూరి మున్నగు నాధునికు లపరిశీలితముగ మరుత్- వీరుత్' మున్నగువానిని బ్రథమైకవచనాంత తుల్యము లనిరి అట్టి కవి ప్రయోగములు లేవు మరుత్తు-వీరుత్తు మున్నగునవి యప శబ్దములు

౨ వివ.— ప్రథమైకవచనాంత తుల్య ప్రాతిపదికములు - చాంతములు - రుక్కు=(కాంతి). (రుక్-రుచౌ-రుచః ప్రథ) వాక్కు= (మాట) (వాక్-వాచౌ-వాచః-ప్రథ)

జాంతములు - ప్రథమైకవచనమున 'టాంతములుగా నుండు 'జాంతశబ్దలు ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికములగును రాట్టు=(రాజు), (రాట్-రాజౌ-రాజః-ప్రథ) స్వరాట్టు=(ఈశుఁడు) స్వారాట్టు = (ఇంద్రుఁడు) (స్వరాట్-స్వరాజౌ-స్వరాజః-స్వారాట్-స్వారాజౌ-స్వారాజః-ప్రథ) విరాట్టు=(ఆదిపూరుషుఁడు) (విరాట్-విరాజౌ-విరాజః-ప్రథ) సమ్రాట్టు=(మండలేశ్వరుఁడు) (సమ్రాట్-సమ్రాజౌ-సమ్రాజః-ప్రథ) విశ్వసృట్టు=(చతుర్ముఖుఁడు) (విశ్వసృట్-విశ్వసృజౌ-విశ్వసృజః-ప్రథ)

తాంతములు — సంజ్ఞావాచకములు మాత్రమె ప్రథమైకవచన తుల్యములు ఉదా -మహత్తు=(మహదాదివాచకము-సాంఖ్యోక్త మహత్తు) 'టిత్తు-కిత్తు-జిత్తు మొ

నాంతములు — శ్వ శబ్దేతరములగు నకారాంతములు ప్రథమైకవచన తుల్యములు (సుత్రామన్) - సుత్రాముఁడు = (ఇంద్రుఁడు) (సుత్రామా - సుత్రామాణౌ - సుత్రామాణః) (సుధన్వన్)-సుధన్వుఁడు=(ఒకరాజు) (సుధన్వా-సుధన్వానౌ-సుధన్వానః) అనఙ్గు రానపుడివి నకారాంతములె యగును అపు డంత్యలోపపక్షమున -సుధనుఁడు-సుధనువు అంత్యలోపాభావ పక్షమున -సుధనుషు డు మొ (కర్మన్) కర్మము (కర్మ-కర్మణీ-కర్మాణి) (వర్మన్) వర్మము =(కవచము) (వర్మ-వర్మణీ-వర్మాణి) (చూ-౭ వివృ) (మఘవన్) మఘవ్రుఁడు=(ఇంద్రుఁడు) (మఘవా-మఘవానౌ-మఘవానః) మఘవుండు వానికి మాఱుకసంగ (ఆది ౮ ఆ రఙ) మఘవాన్-మఘవన్తౌ-మఘవన్తః (ప్రథ) అను రీతి రూపములుగల శబ్దమునకుఁ దెల్గున విభక్తియోగము లేదు.

సఖిన్ అను నకారాంత ప్రాతిపదికము గలదను శబ్దరత్నాకరము ప్రామాదికము అది 'సఖి' అని ఇకారాంతమె హరి శబ్దము

వలెనె దాని రూపములు తెల్గున నుండును 'సఖి' అను అ'కారాంత ప్రాతిపదికమును గలదు ఉదా:—సఖుఁడు పథిన్=(మార్గము), మథిన్=(కవ్వము) బుభుక్షిన్=(ఇంద్రుఁడు) అను సంస్కృతశబ్దములకుఁ దెల్గువిభక్తుల యోగము లేదు పథము—మథము—బుభుక్షుఁడు' అనురీతిని అ' కారాంతములై యివి తెల్గున వాడఁబడును

శాంతములు —దిక్కు=(దిశ) (దిక్—దిశౌ—దిశః)

సాంతనపుంసకములు —సకారాంతములగు నపుంస కామహచ్ఛబ్దములు ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికములె యనఁదగును అవి యంత్యసకారలోపము గల్గియు లేకయుఁ దెల్గున వాడంబడును ఉదా — (ఉరస్) ఉరము=ఉరస్సు (సదస్) సదము =సదస్సు (పయస్) పయస్సు (వయస్)—వయస్సు' అను నీరెంటికి నంత్యలోపము లేదు మొ.

3 వివ —తక్కినవి ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికముగలవై యుండును నకాంతములలో నొకటి శ్వశబ్దముమాత్రమె ద్వితీయైకవచనతుల్యప్రాతిపదికము—ఉదా — శ్వానము (శ్వానమ్—శ్వానౌ—శునః—ద్వితీ) (శ్వన్' శబ్దము)

జాంతములు —ప్రథమైకవచనమున కాంతములై యుండు జకారాంతములు ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికములై యుండును. రుజ=(రోగము) (రుక్—రుజౌ—రుజ —ప్రథ రుజమ్—రుజౌ—రుజః—ద్వితీ) స్రజము=(పూలదండ) (స్రక్—స్రజౌ— స్రజః—ప్రథ స్రజమ్—స్రజౌ—స్రజః—ద్వితీ) విశ్వసృజుఁడు=(బ్రహ్మ) (విశ్వసృక్ (ముగ్ధ—వ్యా ౨౧౧ సూ—దుర్గా) విశ్వసృజౌ —విశ్వసృజః—ప్రథ విశ్వసృజమ్—విశ్వసృజౌ—విశ్వసృజః—ద్వితీ) విశ్వసృజులను మునులచే (శాంతి—౨—ఆ—౨౮)

తాంత—దాంత—ధాంత—హాంత—వస్వంతములు ద్వితీయైక వచనతుల్య ప్రాతిపదికములె యగును తాంత —(గుణవత్)—గుణవంతుఁడు (గుణవాన్—గుణవన్తౌ—గుణవన్తః—ప్రథ గుణవన్తమ్—గుణవన్తౌ—గుణవతః—ద్వితీ) (శ్రీమత్) శ్రీమంతుఁడు (శ్రీమాన్—శ్రీమన్తౌ—శ్రీమన్తః—ప్రథ.

శ్రీమన్తమ్- శ్రీమన్తౌ- శ్రీమతః- ద్వితీ.) (మరుత్)- మరుతులు. (దేవతలు-వాయువులు) (మరుతమ్-మరుతౌ-మరుతః-ద్వితీ) ('మరుత్తు-మరుత్తులు' తప్పులు). (నీవృత్)నీవృతము=(దేశము). ('నీవృత్తు'-తప్పు) (పరీక్షిత్) పరీక్షితుఁడు=(అశ్వ 3 ఆ ౧౬౬) (ఒకరాజు) (పరీక్షిత్తు-తప్పు). దాంతః_(ఆపద్)_ఆపద. (ఆపదమ్_ఆపదౌ_ఆపదః ద్వితీ.) (సంపద్)-సంపద. (సంపదమ్_సంపదౌ_సంపదః_ద్వితీ) (సుహృద్) సుహృదుఁడు=(స్నేహితుఁడు) (సుహృదమ్- సుహృదౌ- సుహృదః- ద్వితీ) (బ్రహ్మవిద్) బ్రహ్మవిదుఁడు=(బ్రహ్మజ్ఞాని). (బ్రహ్మవిదమ్-బ్రహ్మవిదౌ_బ్రహ్మవిదః-ద్వితీ) బ్రహ్మవిదుల-(సభా-౨ ఆ ౧౨౧). ధాంతః_(వీరుధ్) వీరుధము=(లతాకుంజము) (వీరుధమ్_వీరుధౌ_వీరుధః-ద్వితీ.) హాంత :_(అనడ్వాహ్). అనడ్వాహము=(ఎద్దు) (అనడ్వాహమ్_అనడ్వాహౌ_అనడ్వాహః-ద్వితీ) (తురాసాహ్) తురాసాహుఁడు=(ఇంద్రుఁడు). (తురాసాహమ్_తురాసాహౌ_తురాసాహః-ద్వితీ.) (తురాసాహుఁడు_(శ_ర) తప్పు). (హవ్యవాహ్) హవ్యవాహుఁడు=(అగ్ని)-(హవ్యవాహమ్-హవ్యవాహౌ_హవ్యవాహః-ద్వితీ.) (ఉపానహ్) ఉపానహము=(చెప్పు-పాదరక్ష) - (ఉపానహమ్_ఉపానహౌ_ఉపానహః_ద్వితీ).

వసుప్రత్యయాంత-(విద్వస్) విద్వాంసుఁడు. (విద్వాంసమ్_విద్వాంసౌ_విదుషః-ద్వితీ). (ఇది కృదంతము)

౪ వివ :_ఉభయరూపములు :_ (సత్యజిత్) సత్యజిత్తు=(ఒక రాజు) సత్యజితుఁడు. (సత్యజిత్-సత్యజితౌ-సత్యజితః_ప్రథ. సత్యజితమ్_సత్యజితౌ-సత్యజితః_ద్వితీ) ఆ. వె సత్యజిత్తు మేన సాయకదశకంబు (ద్రోణ-౧ ఆ ౨౫౮). క. కినిసి వెసఁగ్ సత్యజితుని ధనువు నఱికెఁ (ద్రోణ ౧ ఆ ౨౫౯). క....శౌర్యో పేతుఁడు సత్యజితుండను (ఆది-౬ ఆ_౫౧) ఇట్లు నన్నయ దీనిని ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికము గనే వాడును ఇంద్రజిత్తు. ఇంద్రజితుఁడు. సకారాంత మహన్మహతీరూప శబ్దములకుఁ ద్వితీయైకవచన తుల్యరూపపక్షమున నంత్యలోపము:_ అంగి

రుఁడు ద్విత్రైయేకవచన తుల్యరూపపక్షమున - అంగిరసుఁడు మహతీ
రూప -అప్సరి - అప్సరసలు

౫ వివ -అలంతి యగతిళస్తలములందు సంస్కృతహలంత ప్రాతిపదికమె నిల్చును (అప్) అప్పు=(జలము) ఆప -(ప్ర బ) అప (ద్వి బ) నిత్యబహువచనము (కించిత్) కించిత్తు=(ఇంచుక) (అవ్యయము) (కిమ్) కిమ్ము=(ఏమి)-(అవ్యయము)

౬ వివ -సంస్కృత ప్రథమైకవచనము తుదిహల్లు చర్త్వము తోను (చర్-సంస్కృత ప్రత్యాహారము పరుషములతోను అనుట సుకరము) జశ్త్వముతోను (జశ్ సంస్కృతప్రత్యాహారము- సరళములతోను అనుట సుకరము) నున్నపుడందలి చర్త్వ (పరుష) రూపము వంటిదె తెల్గున ప్రాతిపదికాంతహల్లయి యుండును ఉదా -(రుక్-రుగ్ రుచౌరుచ -ప్రథమ) రుక్కు =(కాంతి) మొ

౭ వివ -సంస్కృతశబ్దమునకుఁ బుంలింగరూపమున్నపుడితర లింగరూపములున్నను బుంలింగరూపమువంటిదే ప్రాతిపదిక మగును ఉదా -శ్రీమంతుఁడు-శ్రీమంతురాలు-శ్రీమంతము (కులము) గుణవంతుఁడు-గుణవంతురాలు-గుణవంతము (వంశము) స్త్రీత్వమున వీని ఙ్యంతములు ప్రత్యేకప్రాతిపదికములగును ఉదా -శ్రీమతి=(శ్రీమంతురాలు) గుణవతి=(గుణవంతురాలు)

కర్మాదిశబ్దములకు బుంలింగరూపమే యుండదు అవి నిత్య నపుంసకములు-కాన నపుంసకలింగ తుల్యరూపమె వాని ప్రాతిపదిక మగును ఉదా -(కర్మన్) కర్మము (కర్మ-కర్మణీ-కర్మాణి (వర్మన్)-వర్మము (కవచము) (వర్మ-వర్మణీ-వర్మాణి) (మనస్) (మన -మనసీ-మనాంసి ఇట్లే అప్సరశబ్దము నిత్యస్త్రీలింగము-(అప్సరస్) అప్సర-అప్సరస (అప్సరా -అప్సరసౌ-అప్సరస -ప్రథ అప్సరసమ్-అప్సరసౌ-అప్సరస -ద్వితీ)

ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు ౭౧

(బా-తత్స-౬౫) (వ్యా-సం-౧౬౯ మొ ౧౭౦ II వి)

ఉగాగమాంతంబులకు ౩-౫౭ సూత్రముచేతఁ బ్రథమైకవచన లోపంబగు రుక్కు=(కాంతి) రాట్టు=(రాజు) ఉగాగమంబు లేవి ంజేసి నాంతంబుల కస్త్రీలింగములకుం బ్రథమైకవచన లోపంబు లేదు సుధన్వుఁడు=(ఒకరాజు) సుత్రాముఁడు=(ఇంద్రుఁడు) వర్మము = (కవచము) కర్మము-మొ

దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు వైకల్పికంబు

౭౨ *(బా-తత్స-౬౯) (వ్యా-సం-౧౬౯ మొ ౧౭౦ II వి)

వాక్కు=వాకు=(మాట) స్వారాట్టు=స్వారాట =(పరమేశ్వరుఁడు) దీ కిందుఁడని యర్థము వ్రాయుట (శ - ర) సరికాదు స్వారాట్టు = స్వారాట =(ఇంద్రుఁడు)

తకిటనమతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు

నామంబగు ౭౩ (బా-తత్స-౭౦) (వ్యా-సం-౧౭౧ I వి)

శ్రీమన్తమ్-గుణవన్తమ్-విద్వాంసమ్-అనడ్వాహమ్- శ్వానమ్- ఉపానహమ్-అప్సరసమ్-ఇత్యాదులు

వాని యంతిమ మకారంబునకు లోపంబగు ౭౮

(బా-తత్స-౭౧) (వ్యా-సం ౧౭౧ I విష)

శ్రీమంత-గుణవంత-విద్వాంస-అనడ్వాహ-ఇత్యాది- వీని కజంతంబులకుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగా నగు అతఁడు శ్రీమంతుఁడు ఇతఁడు గుణవంతుఁడు వాని వంశము శ్రీమంతము వీని వంశము గుణవంతము విద్వాంసుఁడు-విద్వాంసము అనడ్వాహము- శ్వానము-అప్సరస విశ్వమణలక్షణముచే (తత్స-౮౯ సూ) స్త్రీత్వంబున మతుబాదికంబులు ఙ్యంతంబులై యిందు గ్రహింపఁబడు శ్రీమతి- గుణవతి-విదుషి-శుని మహతి వాచ్యంబగునపుడు శ్రీమంతురాలు- (సంధి-౨౯ సూ) గుణవంతురాలు-విద్వాంసురాలు అనియు బ్రయోగింపఁదగు

---

* సూరి యిచట బహుళ మననేల? ప్రయోజనము కానరాదు

౧ వివ — వెనుక వివరించిన రీతిని (తత్ ౭౦ సూ 3 వివృతి) నకారాంతాదులందుఁ జేర్చనగును వీని సంస్కృత ద్వితీయావిభక్తి రూపములు వెనుక నుదాహృతములయ్యెను (తత్స-౭౦-3 వివరణము)

ముదాదులకుఁ బ్రథమైకవచన లోపము లేదు ౭౫

(బా-తత్స-౭౨ సూ) (వ్యా-సం-౧౭౨ I వి)

ముదము-స్రజము-ఉపానహము (పాదరక్ష-చెప్పు)

౧ వివ — ముదాదులు స్త్రీలింగములు వీనికి తత్స-౫౮ సూత్రముచేఁ బ్రథమైకవచనలోపము గల్గును గాన దాని కపవాదముగా నీ సూత్రము వచింప బడెను ఇవి ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికము గలవి (ముదమ్-ముదౌ-ముద-ద్వితీ స్రజమ్-స్రజౌ-స్రజః-ద్వి ఉపానహమ్-ఉపానహౌ-ఉపానహ-ద్వితీ)

౨ వివ — ఋత్విగాదులకుఁ బ్రథమైకవచనతుల్య ప్రాతిపదికములు లేవు ఋత్విక్కు-నీవృత్తు అను కవిప్రయోగములు లేవు * ఇవి ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికములు మాత్రమె గల్గియుండును-*

3 వివ — హనుమానుఁడు-భగవానుఁడు-ప్రశాంనుఁడు-(శాంత) మున్నగు రూపములు కవి ప్రయోగములందు లేవు-* వీని ప్రథమైకవచనము లోపించిన ఉగాగమాంతములపైని మరల డుజ్జు నిల్చుట యసంభవము హనుమంతుడు-మొ నాదువులు

---

* సూరి యుదాహరించిన ఋత్విక్కు- నీవృత్తు వీరుత్తు మున్నగునవి కవిప్రయోగదృష్టములుకాలేదు స్రుక్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి (వరాహపురాణము ౫ ఆ ౧౧౨) అను పాఠ మగపడుచున్నది ఇట స్రజములఁ జెఱిచి ఋత్విజులను బాధించి అని కవి ప్రయుక్త పాఠమై యుండును భారతమం దంతటను ఋత్విజుడు అనియే ప్రయుక్తమైయున్నది లేదా దీని సత్యాజిదాదులలోఁ జేర్చవలెను ఇవెల్ల

అశ్వత్థామాదులకు స్త్రీత్వం బగు ౭౬ తత్స-౭౫ సూ) (వ్యా-సం-౧౭౫ I సూ) *

నకారాంతములగుటచే (తత్స-౬౭ సూ) నీ యశ్వత్థామాదులు ప్రథమైకవచనతుల్య ప్రాతిపదికములై స్త్రీత్వాతిదేశముచేత ఉత్వ-డుజ్జులు లేవని యెఱుంగునది అశ్వత్థామ- (ద్రోణ- ఆ ౩౧౨) యువ=(యౌవనముగలవాడు) యజ్వ (మనుచ-౧ ఆ ౫౩ -(యజ్ఞము చేసినవాడు) కృష్ణవర్త్మ=(అగ్ని) (వసు ౬ ఆ ౩౬) ఇత్యాదులు

మహదర్థవాచకమై పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు ౭౭ (బా-తత్స-౭౬ (వ్యా-సం-౧౭౬ వి)

బ్రహ్మ ఈశబ్దము చతుర్ముఖ=(బ్రహ్మదేవుడు) ఋత్విగ్విప్రు లకు వాచకము తత్త్వ-తపో-వేద-యోగ-(విషయంభాది) వాచకంబగు నేని బ్రహ్మము నా బడు

---

ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికములు గలవి గాన ఋత్విజుడ-నివృతము-వీరుధము మున్నగు రూపములు మాత్రమె సాధువులు ఋత్విజుడు (సభా ౧ ఆ ౧౧ ప) (సభా ౨ ఆ ౬ ప) గమికర్మీకృత నైక నీవృతుండనై (నైష ౨ ఆ ౨౧ ప) కాన ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యములు విభాష నగు (బా-తత్స-౭౩ సూ)అను సూత్రము ప్రత్యాఖ్యాతమయ్యెను అట్లె హనుమానుడు-భగవానుఁడు-ప్రశానుఁడు మొదలైనవియు నపశబ్దములె కాన ఒకానొకచో మహత్త్వంబునందు మఱుప్తకారంబున కానాదేశంబు విభాష నగు (బా-తత్స-౭౪) అనునదియు బ్రత్యాఖ్యేయమె అహోబలుడు-సూచిమంచి తిమ్మకవి మున్నగువారి యనురోధమున నిట్టి ప్రమాదములు గల్గియుండును

* సూరి విశ్వకర్మామలకని సూత్రించెను విశ్వకర్ముఁడనియుఁ గలదు గాన విశ్వకర్మశబ్దము ఆత్మాదులలోనిది (ప్రౌఢ-శబ్ద-౨౭ సూ) విశ్వకర్ముని (ఉ-హరి ౪ ఆ ౪౫ ప)

ఆత్మాదులకు స్త్రీత్వంబు వైభాషికంబు ౭౮ (బా-తత్స-౭౭) (వ్యా-సం- ౭౭ పిష) †

ఆత్మాదిక మాకృతిగణము ఆత్ముఁడు (అశ్వ ౨ ఆ ౧౭) ఆత్మము ఆత్మ (శాంతి ౫ ఆ ౬౦౩) విశ్వకర్మ-(ఆది-౨ ఆ ౭౧) విశ్వకర్ముఁడు సీ విశ్వకర్మునికూతు (ఉ హరి ౪ ఆ ౪౫) పూషుఁడు=పూష (కాశీ) సూర్యవర్ముఁడు=సూర్యవర్మ కేతువర్ముఁడు=కేతువర్మ తిక్క-శర్ముఁడు=తిక్క-శర్మ అణిమము=అణిమ (అణుత్వము) గరిమము=గరిమ (గొప్పతనము) మొ ఇమనిజంతములెల్ల.

సుత్రామాదు లాత్మాదులలోను నశ్వత్థామాదులలోను జేరమింజేసి వానికి స్త్రీసమరూపములు లేవు ఉదా -సుత్రాముఁడు-సుధన్వుఁడు-కర్మము-వర్మము మొ

పుంలింగమును జేతనార్థకమును నయి స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు ౭౯ (బా-తత్స-౭౮) (వ్యా-సం-౧౭౮ I వి) ♦

రాజు=(ఱేఁడు) ఖగరాజు (గరుత్మంతుఁడు) రాజుచేత-ఖగరాజుచేత మొ అశ్వరాజు=(అశ్వశ్రేష్ఠము) (ఆర ౩ ఆ ౬౩ ప). (ఇచట మహద్వివక్షయు లేదు అమహత్తగు నశ్వరూపమె వివక్షితము) కేవలము నచేతనత్వమున మాత్రమె వృక్షరాజము అని

---

† విశ్వకర్మ-పూష మున్నగువానికిని స్త్రీత్వము వైభాషికమె కాననివి ఆత్మాదుల లోనివె సీ విశ్వకర్మునికూతు (ఉ హరి ౪ ఆ ౪౫) విశ్వకర్మ (ఆది ౨ ఆ ౭౧) పూష మకరస్థుఁడు (కాశీ) ఇట్లగుటచేతనే సూరిసూత్రము సరికాదు. దీనిం బహుళప్రయోజనము లేదు

♦ సూరి మహత్త్వంబున అనుటచేత అశ్వరాజు (ఆర-౩ ఆ ౬౩) అను నన్నయ ప్రయోగమె కుదురదు ఈ ప్రయోగమునందు మహద్వివక్షయు లేదు అశ్వశ్రేష్ఠమని యర్థమున్నను నమహత్తగానే యున్నది పురుషతా వివక్షయే లేదు

ము వర్ణకాంతమై యుండును స్వార్థపరము కానపు డన గా నుప సర్జనత్వమున ( రాజు అనుదానికిఁ గ్రియాన్వయము లేనపుడు బహు వ్రీహ్యాదులలో) రాజు అను నిపాతి ముండదు ఉదా -హతరాజు డు పరశురాముఁడు వచ్చెను హతరాజుఁడు=చంపఁబడిన రాజులు గల వాఁడు) పుంలింగ మనుటచేత రాజ్ఞి-సురాజ్ఞి అని స్త్రీత్వమున నుండును

౧ వివ -తత్పురుషాదులలో వచ్చు టచ్ అను సమాసాంత ప్రత్యయము వచ్చునపుడును రానపుడును రాజు అను నిపాతిరూప మే నిల్చును రాజ-ఖగరాజు-అశ్వరాజు మొ

౨ వివ - రాజు-హతరాజుఁడు మున్నగునవి సంస్కృతసమ ములు గాన వానిలోని జ కారము తాలవ్యమె రాజ శబ్దభవమగు రాజు అను వికృతిరూపములోని జ కారముమాత్రమె దంత్యము (చూ-సంజ్ఞా-౧౦ సూ)

జగచ్ఛబ్ద త కారమునకు నిత్యముగాను* ఇంద్రి
జిచ్ఛబ్ద తకారమునకు వైకల్పికముగాను లోపంబగు
౮౦ (బా-తత్స ౭౯) (వ్యా సం-౧౭౯ I వి)

జగము ఇంద్రజి-ఇంద్రజిత్తు తకారలోపాభావపక్షమున దీనికి సత్యజిచ్ఛబ్దమునకువలెనె ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికరూప మును గలదు ఇంద్రజిత్తుఁడు (తత్స ౭౦ సూ ౧-౪ వివ) (ఇంద్ర జిత్-ఇంద్రజితౌ-ఇంద్రజితః-ప్రథ ఇన్ద్రజితమ్-ఇన్ద్రజితౌ-ఇన్ద్రజిత -ద్వితీయావిభక్తి)

౧ వివ -ప్రథమైకవచనము లోపించిన ఉ గా గమాంత ములపై (చూ-తత్స ౭౫-౭౧ సూ) మరల డుజ్జు నిల్చుట కేవల

---

* జగత్తు అను రూపము నంగీకరించి దీని త కారలోప మును వైకల్పికమెయని సూరి సూత్రించెను కాని యట్టి ప్రయోగము కానరాదు జగత్తు అనునదియు నపశబ్దమె యననగును

ము నసంభవమగుటచే 'ఇంద్రజిత్తుడు అను రూపము సరికాదు కాని కొందఱు సామాన్యకవు లద్దానిని బ్రయోగించిరి అట్లయి నను నట్టిడు మంతరూపము గ్రాహ్యముగాదనుటయె లెస్స సామాన్యకవి ప్రయోగములు-చ గొనకొని యింద్రజిత్తుని తల (భాస్కర యుద్ధ-౧౩౭౮ అయ్యలార్యునిది) ఆ వె ఇంద్రజిత్తుఁడప్పు డినకులోద్భవునిచె (మొల్ల రా-యుద్ధ గా-౫-ప్రతత్స ౭౯ సూ) ద్విపద శ్రీమించు నయ్యింద్రజిత్తుని నగరు. (రంగ-రా సుందరకాం ౨౭౯ పు యూని-ముద్రణ)

౨ వివ -జరచ్ఛబ్దము నీ సూత్రమందుఁ జేర్పనక్కఱ లేదు. ఉ శనుఁడతనికి శాపమిచ్చె జరుఁడై యుండన్ (వి-పు-౬ ఆ) అను పద్యమున 'జరుఁడు అనునది కవి ప్రయుక్తవారము కాదు. జరియై అనునది కవి ప్రయుక్తము జరీ త్రి వృద్ధే ఇతి హేమ చన్ద్రః (శబ్దా-చిం)

సాంతంబుల తుది సకారంబునకు లోపంబు వైకల్పికంబు పయః ప్రభృతులకు సకారలోపంబు లేదు ౮౧ * (బా-తత్స ౮౦ సూ) (వ్యా-సం-౧౮౦.వి)

ఉరము=ఉరస్సు వక్షము=వక్షస్సు అర్చి=అర్చిస్సు ధనువు=ధనుస్సు ఆయువు=ఆయుస్సు హవి=హవిస్సు పయః ప్రభృతులకు - పయస్సు-వయస్సు-అయస్సు=(ఇనుము) సరస్సు=సరము అను దానికి సకారలోప మర్వాచీనము - చ కో మలి నగు చంద్రికా విసరమా సరమా సరమా సునాభి (సత్యభా-౧ ఆ)

౧ వివ - అర్చిష్-ధనుష్-ఆయుష్ మున్నగువానికి షత్వము గల్గకుండఁగనే యీ ద్విరూపత్వములుగాని సలోపముగాని వర్తిల్లును ఉరః ప్రభృతులు నిత్యనపుంసకములు గాన నపుంసక ప్రథమైకవచ

---

* ఇట్లు వివరించి చెప్పుటకు వలనుపడియుండఁగా సకారాంతములకెల్ల సకారలోపము బహుళమని సూరి సూత్రించుట సరికాదు

నతుల్యరూపమె వానికిఁ బ్రాతిపదికము నిల్చును (మూ-౭౦ సూ ౭ వివ) (ఉరః-ఉరసీ-ఉరాంసి-ప్రిథ) సకారాంతముల సకారమునకు ద్విత్వోత్వములు గల్గుట కనుకూలముగా నట్టి సకారమును విసర్గము చోట గ్రహింపవలెను (ఇచటి బా-గు-ప్రి సరికాదు మూ వ్యా సం ౧౮౦ వివ)

మహన్మహతీ వాచకములగు * సాంతంబుల కంత
లోపంబెని ద్వితీయైకవచనాంత తుల్యత్వంబే నగు ౮౨
(బా - తత్స ౮౧ సూ) (వ్యా - సం ౧౮౧ వి)

అంగిరుఁడు = అంగిరసుఁడు ఉగ్రశ్రవుఁడు=ఉగ్రశ్రవసుఁడు ఊర్ధ్వరేతుఁడు=ఊర్ధ్వరేతసుఁడు అప్సర = అప్సరస దుర్వాస మున్నగు (దుర్వాసుఁడు) అ కారాంత శబ్దములును గలవు

౧ వివ — ఏతత్సూత్రి విధానమె వీని కంత్యలోపాభావ ద్విత్వోత్వములు (మహన్మహతీ వాచకములకు) గల్గనేరవని విశదీకరించుచున్నది విశ్రవసు (భాస్కర - యుద్ధకాం - ౧౨౭౮ మఱొక ప్రతిలో ౧౨౮౩ వ అయ్యలార్యసిది) అను రీతిగల సామాన్య కవి ప్రయోగములు సాధువులు కానేరవు నత సుమనస్సునకు (ఆము- ౬ ఆ - ౯౯) అనునది కవి ప్రయుక్త పారముకాదు నత సుమనస్కునకు అనునది కవి ప్రయుక్తపారమై యుండును ఆవిర్భావమును బొందె విశ్రవస్సు (కాశీ ౪ ఆ-౧౩౮) అనునది కవి ప్రయుక్తము కాదు ఆవిర్భావమును బొందె విశ్రవసుఁడు అనునది కవి ప్రయుక్త పార మగుఁదగును

---

* సూరి మహతీవాచకములకును మహత్తులవంటి కార్యమగునని సూత్రింపకుండుట సరికాదు అప్సర=అప్సరస (ఆది - ౫ ఆ ౧౯౫) తపనతేజ=తపనతేజస (ఆర - ౨ ఆ ౨౫౯)

వేధ - పురోధ ♦ ౮౩ (బా తత్స ౮౨) వ్యా-సం - ౧౮౨ I విఘ)

వేధస్-పురోధస్ అనువానికి నిత్యముగా స లోప స్త్రీత్వములు దీనిచే నిపతింపఁబడినవి

౧ విఘ - (వేధా -వేధసౌ-వేధస - ప్రథమా) (పురోధాః-పురోధసౌ-పురోధస -ప్రథమా)=(పురోహితుఁడు) వేధ (శాంతి ౨ ఆ ౨౩౨) పురోధ (శాంతి ౨ ఆ ౩౧=)

మన ప్రభృతుల స కారంబునకు ద్విత్వంబు విభాష నగు ౮౪ (బా-తత్స ౮౩) (వ్యా-సం-౧౮౩ I వి

మనసు=మనస్సు-(రాఘు-౧ ఆ ౩౭) శిరసు=శిరస్సు సదసు=సదస్సు వీనిక స లోపపక్షమున-శిరము-సదము మొ

౧ విఘ - హ్రస్వముమీఁది హల్లునకును ద్విత్వము పాక్షికమగుట విశేషము (చూ-తత్స-౭౨ సూ)

దివ్ అను శబ్దమునకు * దివి యగు ౮౫ (గాల-తత్స-౮౪) (వ్యా-సం-౧౮౪ I వి)

దివి-దివులు (స్త్రీలింగ ప్రథమైకవచనరూపము) ద్యో-దివ్ అను రెండు శబ్దములు గలవుగాని ద్యో శబ్దమున కాంధ్ర విభక్తియోగము లేదు దివికిఁ జనిన (ఆది ౭ ఆ ౧౩౩)

---

♦ పురోధసుఁడు అను రూపాంతరమును సూరి యంగీకరించి నిపతించెను కాని దానికి మహాకవి ప్రయోగము కానరాదు

* సూరి హ్రాది అను శబ్దము నంగీకరించి ద్యుహ్రాచ్ఛబ్దంబులకు దివి హ్రాది యగు అని సూత్రించెను ఇది నిరాధారము హ్రాది శబ్దము కవి ప్రయోగ సమ్మతము గాదు దివి-దివులు తద్భవములనెడి యాంధ్రనామ సంగ్రహము తప్పు భూ దివౌ స్త్రీ తౌ యుష్మత్ (ఆం-చిం)

స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు ౮౬ (బా-తత్స-౮౭) (వ్యా-సం ౧౮౭ I వివ)

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమరూపము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| శ్రీమత్ | శ్రీమతీ | శ్రీమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖీ | వనజముఖి |
| | వనజముఖా | వనజముఖ |
| మీననేత్ర | మీననేత్రీ | మీననేత్రి * |
| | మీననేత్రా | మీననేత్ర |

౧ వివ — ఆ-ఈ-ఊ మున్నగు స్త్రీ ప్రత్యయములు సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధములు. ప్రాతిపదిక గ్రహణే లింగ విశిష్టస్యాపి గ్రహణమ్ అను న్యాయముచొప్పున స్త్రీత్వమున స్త్రీ ప్రత్యయాంత ప్రాతిపదికములనె గ్రహించి యట్టి ఆ-ఈ-ఊ అను దీర్ఘములను తత్స-౨౭ సూత్రము చొప్పున హ్రస్వములుచేసి ప్రక్రియ నడపుట సంప్రదాయము కృత్తద్ధితాంతములవలెనె యీ స్త్రీ ప్రత్యయాంతములను సంస్కృత వ్యాకరణమునుండియె గ్రహింపవగును అట్టి స్త్రీ ప్రత్యయములు దిఙ్మాత్రముగ నిటఁ గొన్ని వివ

* పాణినీయము ననుసరించి సూరి మీననేత్రి-పద్మనేత్రి మున్నగునవి యసాధువులని తలంచుట సరికాదు ముగ్ధబోధ వ్యాకరణము ౨౬౪ సూత్రపు వ్యాఖ్యలో నేత్ర శబ్ద మంగాదులలోఁ జేర్చఁబడెను

రింపఁబడును (వ్యా-సం-౧౭౫ I వి) అట్టి స్త్రీ ప్రత్యయములె (తత్స-౭౬ సూ) వెనుకటి సూత్రపు వివరణమునఁ గొన్ని ప్రదర్శింప బడినవి వానిని మున్ముందు వివరించెదను

స్వస్రాది భిన్నములగు 'ఋ కారాంత శబ్దములు
స్త్రీత్వమున ఈ ప్రత్యయము నందును ౭౭

ఉదా — (కర్తృ-కర్త్రీ)=కర్త్రి=(చేయునది) (జనయితృ-జనయిత్రీ) జనయిత్రి=(తల్లి) స్వసృ మున్నగు ఋకారాంతముల కట్లు ఈ ప్రత్యయము రాదు స్వస్రాదులు —స్వసృ)(స్వసా-స్వసారౌ-స్వసార ) స్వస=(చెల్లెలు (ననాన్దృ-ననాన్దా) ననాంద=(మగని తోఁబుట్టువు (దుహితృ)-(దుహితా) దుహిత=(కూఁతురు)(యాతృ) -(యాతా)-యాత =(తోడికోడలు) (మాతృ)-(మాతా)-మాత= (తల్లి)-(వీనికెల్ల-తత్స-౪౩ సూ- చొప్పున అ అత్వము వచ్చును)

నకారాంతములకు స్త్రీత్వమున ఈ ప్రత్యయ
మగును ౭౭

ఉదా —(భాగ్యశాలిన్-భాగ్యశాలినీ) - భాగ్యశాలిని. (బుద్ధిశాలిన్-బుద్ధిశాలినీ)-బుద్ధిశాలిని మొ

ఉ-ఋ అనునవి యిద్వర్ణముగాఁగల కృత్తద్ధిత
ప్రత్యయాంతములు స్త్రీత్వమున 'ఈ ప్రత్యయము
నందును ౭౮

'మతు-వతు-వసు మున్నగునవి ఉ వర్ణ మిద్వర్ణముగాఁగలవి ఉదా -(శ్రీమతీ)=శ్రీమతి (గుణవతీ)=గుణవతి (విదుషీ)= విదుషి శతృ ప్రత్యయము ఋవర్ణేత్తు - (పచన్తీ) పచన్తి=(వండుచున్న స్త్రీ)

అసంయోగోపధకములగు స్వాంగవాచకముల కుప
సర్జనత్వమున (అన్యపదార్థ ప్రాధాన్యమున=బహువ్రీహిని) స్త్రీత్వమున ఈ ప్రత్యయము వైకల్పిక

ముగా నగును ఈ ప్రత్యయము రానిపక్షమున ౯౩ సూ చొప్పున 'ఆ ప్రత్యయము వచ్చును-౯౦

(వనజముఖీ) వనజముఖి=(పద్మమువంటి ముఖము గలది)(వనజముఖా) వనజముఖ (మీననేత్రీ)-మీననేత్రి=(చేపవలె సొగయగు కన్నులుగలది) (మీననేత్రా) మీననేత్ర

అంగాది శబ్దములు సంయోగోపధకములయ్యె నట్టి స్వాంగవాచకత్వమున నుపసర్జనత్వమున స్త్రీత్వమున ఈ ప్రత్యయమును వైకల్పికముగా నందును పక్షమున ఆ ప్రత్యయము నందును (౯౩ సూ) ౯౧ (చూ-సంజ్ఞా ౧౦ సూ టిప్ప ఉపధ)

(కృశాఙ్గీ) కృశాంగి (కృశాఙ్గా) కృశాంగ=(కృశించిన యంగములు గలది) అంగ-ఆంత్ర = (ప్రేవులు) దంత-కంఠ-శృంగ-(కొమ్ము) కర్ణ-ఓష్ఠ=(పెదవి) పుచ్ఛ=(తోఁక) నేత్రి-గాత్రి=(అవయవము) జంఘ=(పిక్క) అనునవి యంగాదులు (చూ-ముగ్ధ-వ్యా-౨౬౫ సూ-వ్యాఖ్య)

నాసికోదరశబ్ద భిన్నములగు త్ర్యాద్యచ్చులుగల స్వాంగవాచకమున కుపసర్జనత్వమున స్త్రీత్వమున ఈ ప్రత్యయము రాదు రానపుడు ఆ ప్రత్యయమే వచ్చును (చూ ౯౩ సూ) ౯౨

(సుజఘనా)-సుజఘన=(లెస్సయిన నడుము గలది) నాసికోదర -(తుఙ్గనాసికీ)-తుంగనాసికి=(తుఙ్గనాసికా)-తుంగనాసిక (కృశోదరీ)=కృశోదరి కృశోదరా =కృశోదర (కృశించిన ఉదరము గల స్త్రీ)

అకారాంత ప్రాతిపదికములకును అజాది శబ్దములకును స్త్రీత్వమున 'ఆ'ప్రత్యయ మగును ౯౩

అజా దులకు జాతివాచకత్వాదులచే (తత్స ౧౦౩ సూ) ఈ ప్రత్యయము వచ్చును గాన నందుల కపవాదముగా 'ఆ ప్రత్యయము దీనిచే విధింపఁబడెను

ఉదా - (ఖట్వా ఖట్వా)=ఖట్వ=(మంచము) (అజ - అజా) అజ=(మేక) (అశ్వ-అశ్వా)=అశ్వ=(ఆడుగుఱ్ఱము)

కొన్ని హలంతములకు స్త్రీత్వమున ఆ ప్రత్యయ మగును ౯౮

ఉదా - (దిక్=దిశ్=దిశా)=దిశ (వాక్ = వాచ్ = వాచా) = వాచ (వసు-3 ఆ ౧౦౧)

అన్ అనినది తుదిని గల బహువ్రీహికిని మన్ అనునది తుదిని గలవానికిని (నకారాంతములయ్యు) ఈ ప్రత్యయము రాదు వీనికి డా ప్రత్యయము వైకల్పికముగ నగును ౯౯

ఇందలి డ కార మిద్వర్ణము డకార మిత్తుగాఁ గలది పరమగునపుడు ముందటి శబ్దపు తుదియచ్చు మొదలుగాఁగల్గిన్న భాగము లోపించును ఉదా -(సీమన్-సీమ్+ఆ=సీమా) సీమ=(సరిహద్దు) సురాజన్+ఆ=సురాజ్+ఆ=సురాజా)=సురాజ=(మంచిరాజు గల భూమి) 'డా' రానిపక్షమున నవి నకారాంత స్త్రీలింగములుగనే నిల్చును ఉదా (సీమన్-సీమా) సీమ (సురాజన్-సురాజా) సురాజ

ఉపధాలోపముగల అన్ అనునది తుదిని గల శబ్దములకు స్త్రీత్వమున ఈ ప్రత్యయ మగును ౧౦౦

(మా ఉపధ సంజ్ఞా ౧౦ సూ-టిప్పణము)

ఉదా - (సురాజ్ఞీ) సురాజ్ఞి ఉపధాలోపము లేనపుడు మీది సూత్రము చొప్పున సురాజ అనియే యగును

ఉకారాంతములగు 'బహు' మున్నగు శబ్దములకు స్త్రీత్వమున ఈ ప్రత్యయము విభాష నగును ౧౦౧

ఉదా -(బహ్వీ)=బహ్వి (బహు) బహువ్రు మొ-

క్తిన్ ప్రత్యయభిన్నమగు కృదంతేకారమునకు ఈ
ప్రత్యయము వైకల్పికముగా నగు ౯౮

(రాత్రి-రాత్రీ) రాత్రి క్తిన్నంతములకు -కృతి-(కార్య) వసతి =(స్థానము వీనికి ఈ ప్రత్యయము రాదు-

పురుషవాచకములకు తదీయభార్య యర్థమగునపుడు
ఈ ప్రత్యయ మగును-౯౯

ఉదా - (గోప)=గోపి-(గోపుని భార్య) ఇంకను విశేషములు గలవు (ఉపాధ్యాయుని భార్య)=ఉపాధ్యాయాని=(మాతులుని భార్య) మాతులాని (ఇంద్రుని భార్య)=ఇంద్రాణి (యౌవనముగల స్త్రీ)=యువతి (అంతర్వత్నీ)=అంతర్వత్ని=(గర్భిణీ స్త్రీ) మొ-

షకారము-టకారము నిద్వర్ణముగాఁ గల ప్రత్య
యములతో గూడిన శబ్దములకు స్త్రీత్వమున ఈ
ప్రత్యయమగును ౧౦౦

ఉదా - షిత్తు (నర్తకి)=నర్తకి=(నాట్యము చేయు స్త్రీ) ఇది నృత్ ధాతువుమీద ష్వున్ ప్రత్యయము నిల్చునది) టిత్తు - (పఞ్చమీ)=పంచమి=(అయిదవది) (ఇది పఞ్చన్ శబ్దముయొక్క పూరణార్థక మట్ ప్రత్యయాంత రూపము) టకారమిత్తు తద్ధితాంతము

గౌర మొదలగు శబ్దములకు స్త్రీత్వమున ఈ
ప్రత్యయ మగను ౧౦౧

ఉదా - గౌర-గౌరీ)=గౌరి నద-నదీ)=నది మొ

జాతి వాచకములగు అకారాంతములకు స్త్రీత్వ
మున ఈ ప్రత్యయ మగును ౧౦౨

ఉదా -(మృగ-మృగీ)=మృగి-(ఆడు లేడి) (హంస-హంసీ)=హంసి=(ఆడు హంస) నిత్యస్త్రీలింగముల కిది రాదు- (బలాకా)=బలాక=(ఆడు కొంగ) యకారోపధం శబ్దములకు రాదు-(క్షత్రియా)=క్షత్రియ=(రాజ స్త్రీ)

ఉకారాంత గుణ వాచకములకు స్త్రీత్వమున ఈ
ప్రత్యయము విభాష నగును ౧౦౩

ఉదా - (మృదు-మృద్వీ)=మృద్వి=మృదువు

యకారోపధకము కానట్టి ఉ కారాంత మనుష్య
జాతివాచికి స్త్రీత్వమున ఊ ప్రత్యయ మగును ౧౦౪

ఉదా - (కురూ)=కురువు=(కురుదేశ రాజ స్త్రీ) మనుష్యేతర
జాతికి రాదు - (ధేను)=ధేనువు-(ఆవు) యకారోపధకమునకు రాదు-
(అధ్వర్యు) అధ్వర్యువు=(అధ్వర్యు శాఖాధ్యాయిని యగు స్త్రీ)

రజ్జు ప్రభృతి భిన్నములగు నప్రాణి జాతి వాచకము
లయిన ఉకారాంతములకు స్త్రీత్వమున ఊ ప్రత్య
య మగును ౧౦౫

ఉదా - (కర్కన్ధూ) కర్కంధువు=(రేగు) రజ్వ్వాదులకు ఊ
ప్రత్యయము రాదు- (రజ్జు)=రజ్జువు=(త్రాడు)

మహాతీతరంబులగు స్త్రీలింగంబు- విశేషణంబులకుఁ
క్లీబత్వంబు విభాష నగు ౧౦౬ (బా-తత్స-౭౬ సూ)
(వ్యా-సం-౧౭౬ III IV వి)

పద్మలత మనోహరి=పద్మలత మనోహారిణి హృద్యంబగు విద్య=
హృద్య యగు విద్య మొదవులలోఁ గపిల వరిష్ఠంబు=కపిల వరిష్ఠ

౧ వివ —సంస్కృత విశేషణము విశేష్యలింగకమె కావలసియుండ
నపుంసకత్వమును గల్గునని దీనిచేతఁ బాక్షికముగా విధింప బడెను,
ఉదా - గోవు పవిత్రంబు (అను 3 ఆ ౨౭ ప)=గోవు పవిత్రి

౨ వివ —పాల్కురికి సోమనారాధ్యుడు మహతీ వాచక విశే
షణమునకును నిట్టి క్లీబత్వమును బ్రయోగించెను ఉదా —ద్రౌపద వనిత
యపూర్వలాంఛనధారి గ ౯౫ (బసవ. 3 ఆ ౨౨౭)

భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు-౧౦౭
(బా-తత్స-౭౭) (వ్యా-సం-౧౭౭ I విష)

౧ వివ - భవత్ -అనునది (భవాన్-భవన్తౌ-భవన్త ప్రిధ)= (నీవు) మున్నగు శబ్దములకును శతృ ప్రత్యయాంతాదులకును నాంధ్రి విభక్తియోగము లేదు I మహత్=(మహాన్-మహాన్తౌ-మహాన్తః)= (గొప్ప) పథిన్-(పన్థా)=(దారి)-మథిన్=(మన్థా) = (కవ్వము -ఋ భుక్షిన్ = (ఋభుక్షా) = (ఇంద్రుఁడు) అను వానికి దెల్గువిభక్తి యోగము లేదు యుష్మద్ (త్వమ్-యువామ్-యూయమ్ ప్రిథ = (నీవు) అస్మద్=(అహమ్-ఆవామ్-వయమ్ ప్రిథ = నేను) త్వద్= (నీవు-మద్=(నేను) - తద్=(ఆ -యద్=(ఏ -ఇదమ్=(ఈ) - అదస్= (ఆ) అనునవి మొదలగు సర్వనామములకును దెల్గువిభక్తుల యోగము లేదు రేఫాంతములకు -గీర్=(వాక్యము) ధూర్=(భారము) చతుర్= (నాలుగు) (చూ-తత్స ౬౯ సూ) అను రేఫాంతములకును దశావర సంఖ్యావాచకములగు (పఞ్చన్) మొదలగు వానికిని దెల్గు విభక్తులయోగము లేదు ఇవెల్ల సమాస పూర్వావయవములై తెల్గున వాడఁబడనగును భవద్గుణములు=(నీగుణములు) త్వదాశ్రియము=(నీ యాశ్రయము) మత్పుణ్యము= నాపుణ్యము)ధూర్వహము=(భారమును వహించునది) మొ మహత్తణగి=మహత్+అణగి అని పదచ్ఛేదము (బసవ ౬ ఆ ౭౮౬) మహత్తు (గొప్పది) అనునది వ్యావహారిక శబ్దము మహత్తు=అనునది సంజ్ఞావాచి గ్రాంథికమె అణువు మహదాదులకును దానతిమహత్తు (ఉ-హరి ౧౫౩౨) ఇట్లె చిత్తు-చెత్తు-జిత్తు-ముత్తు-ఇత్తు మున్నగు సంజ్ఞావాచులు గ్రాంథికములె II శతృ ప్రత్యయాంతాదులు - భవత్=(భవన్-భవన్తౌ-భవన్త)(అగుచున్న) పచత్=(పచన్-పచన్తౌ-పచన్త) (వండుచున్న) లసత్=(లసన్-లసన్తౌ-లసన్త)(ఒప్పుచున్న)= (ఇవి వర్తమాన శత్రంతములు)- ఇవియు సమాస పూర్వావయవములై ప్రయోగింప బడును లసద్రూపము-భవిష్యత్కాలము ఇందలి భవిష్యత్=(భవిష్యన్-భవిష్యన్తౌ-భవిష్యన్త)=(కానున్న) అనునది భావి శతృప్రత్యయాంతము

ఆ చివ పైని వ్రాసినవి తద్ధితప్రత్యయాంతము లగునప్పుడును డల్లు విభక్తిం నొందును ఉదా-(చతుర్)=చతుష్కము=(నాలుగు) (పఞ్చన్)=పంచకము=(అయిదు) (షట్)=షట్కము=(ఆఱు) సప్తన్)=సప్తకము=(ఏడు) (అష్టన్)=అష్టకము=(ఎనిమిది) (నవన్)=నవకము=(తొమ్మిది) (దశన్)=దశకము=(పది) (పఞ్చన్)=పంచమము=(అయిదవది) (అదస్)=అదసీయము=(దీని సంబంధి మొ-

ఇది తత్సమ పరిచ్ఛేదము

---

# బాలవ్యాకరణోద్యోతము

## V ఆచ్ఛికపరిచ్ఛేదము

సంస్కృతసమేతరంబైన యీ భాష యచ్చ యనం

బడు ౧ (బా-ఆచ్ఛి-౧) (వ్యా-సం-౧౮౫ I విష)

అచ్చ యనఁగా నచ్చ తెనుగు సంస్కృతసమము తప్పఁ దక్కిన ప్రాకృతసమము-(అగ్గి-సిరి) (మూ-సంజ్ఞా ౨౦ సూ) సంస్కృతభవము (చందురుఁడు-సందడి)ము (మూ-సంజ్ఞా ౨౧ సూ) ప్రాకృతభవము-(లచ్చి-జన్నము) మూ-సంజ్ఞా ౨౧ సూ) దేశ్యము-(మేఁక - పాయి దా-రైలు) (మూ-సంజ్ఞా ౨౩ సూ) అనునవెల్ల నాచ్ఛికములే

ఆచ్ఛిక భాషయందుఁ బ్రాతిభాషికలింగము లేదు, I

~~స్త్రీలింగసమములును నపుంసకలింగసమములున్నూ~~ సరు

దుగఁ బుంల్లింగసమములును నై యుండును-౨ (బా-

ఆచ్ఛి-౨) ~~వ్యా-సం-౧౮౫~~ I విష).

స్త్రీలింగసమములనఁగాఁ బ్రథమైకవచన లోపాదికము గలవి.

ఉదా - తండ్రి - తల్లి - అన్న - చెలువ్ర - చావు - పూవు - * వదినె - జేజే - నవలా - ముల్లో మొ - నపుంసకలింగసమము లనఁగాఁ బ్రథమైకవచనమున 'ము - మ్ము - ంబు' అను వానిలో నేదేని నిల్చు శబ్దములు ఉదా - సున్నము - సన్నము - బియ్యము - నెయ్యము = (స్నేహము) - పున్నెము - గాము = (గ్రిహము) - వేము = (వేఁపచెట్టు) - పెరిము - సేమ = (గృహము) - ఇను ము - మొ పుంలింగసమములన గాఁ బ్రథమైకవచనమున డుజు నిల్చు శబ్దములు ఉదా - కొమరుడు - (కొమర) చందురుడు - (చందుర) జముఁడు - (యము కేద్భ - జమ) మరుడు - (మర) (స్మర - పాళి) తమ్ముఁడు - (తెమ్మ) అల్లుఁడు - (అల్ల) బల్లిదుడు - (బల్లిద) మగడు - (మగ) సాలీడు - తేడు - (తే) మొ కొమరుఁడు మున్నగునవి మహత్తులును బుంలింగసమములును గాన రాముఁడు మున్నగువానికివలెనె ఉత్వ - డుజ్జులు వచ్చినవి ఆచ్ఛి - ర సూత్రపు నిషేధముచే మగడు మున్నగువాని కుత్వము లేదు

కొన్ని స్త్రీసమములు పుంలింగసమములు నగును ఉదా - ముదుకడు = ముదుకి గొల్లఁడు = గొల్ల మొ -

కొన్ని స్త్రీసమములును నపుంసకసమములును నగును ఉదా - ఏవ = ఏవము మోస = మోసము మొ -

బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు ఇవి తత్స - ౧౭ సూ ర వివృతి చొప్పున మహద్విశేషణము లగునపుడు పుంలింగతుల్యములును సమహద్విశేషణము లగునపుడు నపుంసలింగసమములును మహతీ విశేషణము లగునపు డాలుశబ్దముతో సమసించునవియు (సంధి ౨౬ సూ) నగును 3 (బా - ఆచ్ఛి - 3 సూ) (వ్యా - సం - ౧౬౦ I విష)

---

* అహోబల పత్యాదులు వ్రాసినట్లు చెలువు మున్నగునవి 'వు' అను ప్రథమైకవచనము గలవి కావు - అవి స్త్రీలింగసమములు కావుననె వానికి చెలులు మున్నగు లుప్త 'వు' వర్ణక రూపాన్తరములు లేవు

సంస్కృత తుల్యత్వాతిదేశమున్నను శ్రీరామదేవత బల్లిద అని కాని బల్లిదురాలు అని కాని కానేరదు శ్రీరామదేవత బల్లిదుఁడు అనియె యగును కళత్రము బల్లిదురాలు అనియే యగును గాని కళత్రము బల్లిదము అని కాని బల్లిద అని కాని కానేరదు *

బల్లిదాదులు — బల్లిద=(బలిష్ఠ) అక్కజ=(ఆశ్చర్య అధిక) కావల=(దుర్మద)-బెట్టిద=(ఉద్ధత)-మిసిమింత=(అలసిన)-మొక్కల=(ముష్కర) పల్లద=(దుష్ట)-నెయ్య=మిత్ర)-ఒడయ=(అధిప)-ఇత్యాదులు వీనిలోఁ గొన్నిటికి నపుంసక సమరూపములు కన్పటవు మిసిమింతము-ఒడయము అను ప్రయోగములు లేవు బల్లిదాదులు సంస్కృత తుల్యము లనుచు బల్లిద అని సంబోధన రూపమును బ్రయోగింపరాదు బల్లిదుడ అనియే యనవలయును బల్లిదున్ రామునొ అను దుమంత రూపముండును

మహత్తులగు మగాదులకు నేకార్థకాద్యమహత్తులకును డుజ్ఞు అగు ఉత్వంబు గాదు ౮ (బా-ఆచ్ఛి-౮)-(వ్యా-స-౧౯౧ విప)

మగఁడు-ఒకఁడు=(ఒక పురుషుఁడు) మొ ఏకార్థకాద్యమహత్తులు — ఒక్కఁడు=(ఒకటి)-కత్తెఁడు=(అశ్వము పెరు పలియఁడు=(ఒక కుక్క-పేరు) మగాదులు - మగ-ఒక-మనుమ-రాయ-పావ=(బాలుఁడు) మున్నగునవి (+) ఇది యాకృతిగణము ఏకార్థకాద్యమహత్తులు -ఒక-

---

* సూరిగారి సంస్కృత తుల్యత్వాతిదేశ మాత్రమున నిట్టి యర్థము లభింపనేరదు కొన్ని యనర్థములును సంభవించును. కాన వలసిన యర్థము సూత్రమందే చేర్పఁబడెను

+ వేఁడు-(గొల్లఁడు)-తేఁడు=(రాజు) ఈ ప్రత్యయాంతములు-(నాలీఁడు=సాలెపురుగు) కా ప్రత్యయాంతములు-(విలుకాఁడు) మున్నగువానిని మగాదులలోఁ జేర్పనక్కఱలేదు పుంలింగ సమత్వముచేతనే వానికి డుజ్ఞు లభించును ఉత్వమునకుఁ బ్రసక్తియే లేదు కొమ్ము కాఁడు-నాలీఁడు మున్నగునవి పుంలింగ సమములయినను మహద్వాచకములు కావు కావ డుజ్ఞు ప్రాప్తికయి యేకాద్యమహత్తులలోఁ జేర్పఁబడెను

(ఒకవస్తువు) కత్తెర-(తెల్లని గోరిజయు దోసెయు గల నల్లనియశ్వము)-
(శ-రి) కయిర=(ఒక యశ్వముపేరు) పులియ - (ఒక కుక్క-పేరు) -
కొమ్ముకాడు = (అడవిపంది) సాలీడు = సాలెపురుగు) మొ
ఇదియు నాకృతిగణమె మహత్తులగు అరటచేత మనుమరాలు-
పాప=(బాలిక) మున్నగువానికి ఏ జ్ఞు రాదు రాయడు అని ఉ
త్వమును జేయరాదు కృష్ణ రాయడు అనురీతిని సమాసమునం దుత్వ
మగును కావునే కృష్ణరాయ అను సంబోధనము సిద్ధించును

పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు ౫

(బా-ఆచ్చి-౫) (వ్యా-సం-౧౭-౨ I విష)

బహువచన లు-ల లకు రు-ర లగునని యర్థము పగతురు-
అల్లురు-నెయ్యురు-కాల్వురు-బరియురు-మార్తుర-మొ ఇది యాకృతిగ
ణము ఇవి మహత్తులను బుంలింగ సమములను గాన వీనికి ఉత్వ-డుజ్జు
లు వచ్చును పగతుడు-మొ ఇయ్యది నిత్యవిధి గాన పగతులు-పగ
తుండ్రు-అల్లుళ్ళు-అల్లుండ్రు మున్నగు రూపములు సాధువులు కావు
నెయ్యుడు-నెయ్యురు-నెయ్యురాలు-నెయ్యము అను రూపములు
గలవు గాన నీ శబ్దము ఒల్లిదాదులలోనిదియు గావచ్చును మల్లురు
అనునది సంస్కృత సమము-(చూ-తత్స ౩౯ సూ)

బహువచన లు-ల లలో రు-ర లును వానికి
ముందు పూర్ణబిందు పూర్వక డు వర్ణంబును గొన్నిట
నిత్యముగాను గొన్నిట వికల్పముగను నిల్చును ౬ *
(వ్యా-సం-౧౯-౨ II విష)

---

* సూరి యిట్లు సూత్రించి దీనిని నిత్యవిధిగా దలంచెను గం
డండ్రు-మిండండ్రు అని మాత్ర ముదాహరించెను 'మిండ లయ్యెడన్
(కవిక-) న నలకూబరాదులు ననుపు మిండల్లు-(కాశీ)-(గాణ-ఆచ్చి-౬
పద్య-౨౩౯ కారి)

ఒకరు=ఒకండురు ఉల్లోపము -ఒకండ్రు పదురు=పండురు= పండ్రు వారు=వాండురు=వాండ్రు ఇట్టివి వైకల్పికస్థలములు నిత్య — ఎనమండురు = ఎనమండ్రు తొమ్మండురు = తొమ్మండ్రు అహోబలపత్యాదులు ఎల్లండ్రు-అల్లుండ్రు అని యుదాహరించిరి ఇవి నిరాధారములు ఎల్లరు నంత నేలుకొని (రామా-౨౩ ౧౦౭) అల్లుడు నగతాదుఃకోనిది

కా ప్రత్యయంబుమీఁది బహువచన ల కారం
బునకు లఘ్వలఘు రేఫంబులును లఘు రేఫంబునకు
ముందు పూర్ణబిందుపూర్వక డు వర్ణంబు నగు 2 *
(గా-ఆచ్ఛి-2) (వ్యా-సం-౧౯౮ విమ)

విలుకాండురు-ఉల్లోపము-విలుకాండ్రు (ఆచ్ఛి-౧౨ సూ). విలుకాలు వేడుకకాండురు=వేడుకకాండ్రు వేడుకకాలు 'నిత్యం అలా రురా న్యాతా ముల్లోపో బహులతా డుజామ్' అని యిట్లధర్వ ణాచార్యుఁడు డుజ్జు నెవిధించెను కం ఆడెడువారలకిచ్చెను వేడుకకాండురకు నిచ్చె (విక్ర-౨ అ) ఇట్టియెడల ప్రౌఢవ్యాకర్త వేడుకకాండ్రురకు (అపశబ్దమును) (ప్రౌఢ-శబ్ద ౬౮౧ అనురూపము నంగీకరించి సమర్థించెను వేడుకకాండ్రురు వేడుకకాండ్రురకు' అపశబ్దములు అహోబలపతి అపి సంయుక్త సమాప్తౌ బూహో న్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్ అను చింతామణి సూత్రములోని లు అనునది రు అనుదాని కుపలక్షణమనుచు (మూ-ఆచ్ఛి-౧౭ సూ) రు' అను పునరుక్త బహువచనమును సాధించెను ముఖ్యార్థ బాధలేనిచో (మహాకవిప్రయోగరూప)లక్షణకుఁ బ్రసక్తి యేమున్నది?

---

* సూరి పూర్ణబిందుపూర్వక డ కారంబు నిట్లు విధించుచు "ఆండుడు అసాధువు-'ఆండ్రుడు సాధువు అని తలంచెను 'విలు కాండురు-అసాధువు-విలుకాండ్రురు-సాధువు అని తలంచెను ఇది సరికాదు-(చూ-ఆచ్ఛి-౧౧-*)

ప్రామాణికులు పునరుక్త బహువచన లు ప్రత్యయమును వదించిరి కాని యట్టి రు ప్రత్యయము నెవ్వరును జెప్పలేదు

కూఁతు శబ్దపు బహువచనమునకు ముందు డుజ్జక

ర (బా-ఆచ్ఛిక-సూ) (వ్యా-సం-౧౫ వి)

కేంచులు (తెన్న-౧ ఖండము హామ్రము) ఉన్నాము

(ఆచ్ఛి ౧౨ సూ) కెంపు ఆచ్ఛి ౧౭ సూ)

కూఁతు శబ్దమున కేకవచన బహువచనములు పరమగునపుడు ♦ రు వర్ణకము వైకల్పికముగ నగు ప్రథమేతర వైకవచన వరకత్వమున రు వర్ణోత్పత్తి మిధ్య మొందును (బా-ఆచ్ఛి) (వ్యా-సం-౧౫౨ వివ) (౧౯౬-౧౯౬ I వివ)

కూఁతు=కూఁతుగు కూతులు = కూతురులు కూతుళ్ళు= కూఁతుళ్ళు కూఁతును-కూఁతురిని మొ

౧ వివ — ఎకత్వే చ భవేద్వా రు స్తథా రాచ భవేత్ క్వచిత్ (వ్యా-సం-౧౯౨-౧౯౩ వివ) తమోశ్వనాహో శేమాత్ర ఉదకో ప్రాయకో ఒత్ర ఇత్ (వ్యా-సం-౧౯౬ వివ) అని యధర్వణాచార్యులు వచించిరి పరఁగఁ గూఁతురు శబ్దంబుపై రుకారమొక్క-పలుకున్ బైనైన నుండుఁ గాయుఁ బెక్కు-పలుకులపైనైఁ దక్కి-పోవు (కావ్యాలం ౯ ఉలా ౧౧౧ ప)

౨ వివ —ప్రయోగ — నాకూతురినటె (ఉ హరి ౫ ఆ ౨౧౭) కూతురి చెలువంపుజెఁ (బహుళా-౧ ఆ ౮) ప్రథమా బహువచనమున రు వచ్చుట కథర్వణుఁడె యంగీకరించెను కవులు

---

లే ప్రభృతులనుటకు (సూరి) మ రొక్క-శబ్దమునేని యుదాహరింపలేదు

♦ సూరి సూత్రమును వివరణమును ప్రయోగవిరుద్ధము లగుటచే వానిని విడిచి యథాప్రయోగముగ రచింపఁబడెను

ద్వితీయాది బహువచనములందును ప్రయోగించిరి కూఁతురులన్ (రామాభ్యు-౭ ఆ-౬౬ ప-కూ-రా-ని) రాచకూఁతురుల గాలికి చంపూ-రా-౨ ఆ. ఆం-భా-అ-ప్రయోగవిశేషప్రక ౧౮ సూ) కూతురులు -శబ్దమునుండి కూఁతుళ్లు=కూఁతుళ్ళు అని చేర్పడుట వింతకాదు

౩ వివ - ప్రాణివాచకము లోపవిభక్తికములు కానేరవు కావున కూఁతురిచే' అనుచోటి ఇత్వ మోపవిభక్తిక సంబంధి తృతీయా సకాదు స్తమ్యేకవచనములందు 'కూతురన్ అను ప్రయోగమును లేదు (చూ-అచ్చి-౧౧) * (౧-౮౦ సూ)

పగఱు-చూపఱు శబ్దములందు బహువచన ల
కారమునకు నిత్యముగా ఱ కార మాదేశ మగును
౧౦ ♦ (శా-అచ్చి-౧౦ సూ) (వ్యా-సం-౧౯౭ వివ)

పగఱు=(పగ్గఱు) పగఱును - చూపఱు = (చూచువారు) చూపఱును (చూపరి=అందమైనవాఁడు)

౧ వివ - కం కటకటంటవరకు నాకుఁ బగఱుఁ బరిమార్చ (సౌప్తి-౧ ఆ-౧౦౦) కం పఱపెను వాలమ్ములు చూపఱను (కర్ణ-3 ఆ-౨౭౮) కం కొఱవియుఁ గొఱవియు చూపఱు (భీష్మ-౧ ఆ-౨౮౮) చూపఱుల చూడ్కిక (కళా-౭ ఆ ౭౬) అనియు నగ్గపడుచున్నది (చూ-అచ్చి-౧౭ సూ)

---

* సూరి యీ ఇత్వమును సంగ్రహింపనే లేదు

♦ సూరి పగఱు-చూపఱు శబ్దములను వదింపలేదు ఆతఁడు సూత్రించిన చైవుఱు శబ్దమునకు మహాకవిప్రయోగము లేదు

ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి 'లు' వర్ణంబునకు బిందుపూర్వ 'డు' * వర్ణంబు నగు ద్వితీయాద్యేకవచన పరకత్వమున వీని తుది ఉ కారము ఇ కార మగును ౧౧ (బా-అచ్చి-౧౧) (వ్యా-సం-౧౯౮ I వి)

అండురు=(ఉల్లోష-అచ్చి ౧౨ సూ) అండ్రు అండురను=అండ్రను-అలిని ఆల్వాదులు -ఆలు-చెల్లెలు-కోడలు-మఱఁదలు-ఇవి యాల్వాదులు-

ఆల్వాదులు ప్రాణివాచకములు గాన వీనిలోని 'ఇత్వ ప్రాప విభక్తిక సంబంధి కాదు (చూ-అచ్చి ౭౧ సూ) ఆలన్ అని తృతీయా సప్తమ్యేకవచన ప్రయోగమును లేదు. (అచ్చి ౮౦ సూ)

---

* సూరి 'అండురు' అను రూపమును సాధింపనే లేదు 'అండురు' అనునది తాళపత్ర మాతృకలలో నున్నది సలలో ర్బిందుయుక్తో డు ర్వా 'లుల యోః నిత్యం దారాదేశ్చస్యా స్త్రో ర్లు లయో రురా చ తత్ర స్థ అని 'డు వర్ణమే చింతామణిలో విధింపఁబడెను సూరి డ కారమును విధించుట నిర్మూలము కం- ఇక్కురు ఖరు నాండురలో అను రీతిగల యీ ప్రయోగములను ఇక్కురువరు నాండ్రురలో అను నపశబ్దముతో నింపి యీ పక్షము వారు సమర్థించుచున్నారు (చూ-అచ్చి-౧౭ సూ) అపి సంయుక్త సమాప్తౌ భూయోన్తే లు ప్రదృశ్యతే నామ్నామ్ అని పునరుక్త బహువచనము లు అనునదే కాని రు కాదు అహోబలపతి- రు అను దానికి లు ఉపలక్షణ మనుట సరికాదు కవి ప్రయోగరూప ముఖ్యార్థబాధ లేనిదే లక్షణాప్రసక్తియే లేదు మఱియు అపి సంయుక్త సమాప్తౌ భూయోన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్ అను చొప్పున అండ్రరలో మున్నగువానియందు సంయుక్తసమాప్తత యెట్లు కుదురును భూయశ్శబ్ద ప్రయోజన మేమి

(మా-ఆచ్చి-౯ టీ) ఆ-నె-వను బంధువ్యక్తులకు నాలితనములో (రాఘు-౩ ఆ ౮౩) ఆలితనము = భార్యాత్వము-భారతా నాలితనము=కొంచెపుందనము-రామాయ ఉ కొంకక కోడఁబుట్టువులు కూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱున్ (శృం-నైష-౭ ఆ-౧౧) క వలిన వానిని దైవము నాలిని (ఉద్యో ౩ ఆ 33 ప) దీనిని సూరి సంగ్రహింపనే లేదు-

బహువచనము పరంబగునపుడు డ-ల-ట-ర ల
ఉత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు ౧౩
(బా-ఆచ్చి-౧౩) (వ్యా-సం-౧౯౯ I II విమ)

గుండ్లు=గుండులు గిండ్లు=గిండులు కాళ్ళు(ళ్ళు)=కాలులు ♦ మొసల్లు(ళ్ళు)=మొసలులు (ఆచ్చి-౧౬ సూ) గొంల్లు=గొంవలు తుంట్లు=తుంటులు గోర్లు=గోరులు సివిర్లు=సీవిరులు (వింజామరలు) బహుళ గ్రహణముచేత పిలులు-వలు లిత్యాదులందు లోపంబు లేదు-†

---

♦ కాళ్ళు మున్నగురీతి నపభ్రష్టముగా నిల్లు ద్రావిడ ళకారము వాడుక కెక్కినది ఇట్టియెడల 'కాల్లు' అని యంతయు లకారము లుండవలయును దంత్యమగు లకారముయొక్క యుల్లఘూచ్చారణము ద్రావిడ ళకారమునకుఁ గొంత సన్నిహితమగుటచే నది వాడుక కెక్కినది ఆలము ల్తకారలిపి ల అనునది దన్త్య చజ్జ గురురాచ బిన్దుయుతౌ (ఆం-చిం-వ్యా-సం-౩౯ II విష) సూరి యీ సందర్భమున నెల్ల ళ అని (మా-ఆచ్చి-౧౮) వ్రాయును

† సూరి పిల్లులు అను దానితోపాటు విల్లులు అనియు వ్రాసెను- ఇది సరికాదు విల్లు(ళ్ళు) అని యుండనగును సలో లోశ్చ అని లవర్ణ సహిత లు వర్ణమునకును న్లోపమును జింతామణి విధించుచున్నది- ఈ చింతామణి సూత్రమునకు అంబళ్ళాచి అనునది లక్ష్యమని యహోబలపతి వ్రాయుట పొరపాటు- విల్లు(ళ్ళు) ముల్లు(ళ్ళు) అను రీతివె లక్ష్యములు

సూరి యీవిధి తత్సమములందును వర్తిల్లుననుట పొరపాటు*

౧ వివ.—ద్విరుక్త డ ల ట'లందును నీ ఉ'ల్లోపము గల్గును. కాని హలంతర సంయుక్తమగు ద్విత్వములో నొకటి లోపించును. ఉదా :- తెడ్డు- తెడ్డులు=(తెడ్ల్డు)= తెడ్లు. చెట్టు-చెట్టులు=(చెట్ల్టు)-చెట్లు. విల్లు-విల్లులు=(విల్ల్లు) విల్లు(ళ్ళు)=విండులు=వింట్లు. (అచ్చు౧౬ సూ). ముల్లు-ముల్లులు=(ముల్ల్లు=)(ళ్ళు)=ముల్లు(ళ్ళు). ముండులు=ముంట్లు (అచ్చు-౧౬. సూ).

౨ వివ.—సూత్రమునందలి 'ర' అనునది కొన్ని యెడలను ఱకారములకును నుపలక్షణము. ఉ :-నూఱు - నూఱులు - నూర్లు. ఏఱు-ఏఱులు=ఏర్లు. సీ. అలయనాది ప్రవాహములైన యేర్ల వంకలు దిద్దుఁ జే వివేకంబు కలిమి (నరస-౪ ఆ ౧ ౭౩).

బహువచన శ్లిష్టమగునపుడే (ఉల్లోపముచేత) రేఫ
మునకుఁ గొన్ని యెడల నలము లకారాదేశ మగును.
౧౩. (బా-అచ్చు-౧౩) (వ్యా-సం-౨౧౦ వి) ♦

* సూరి 'కోట్లు' మున్నగు తత్సమములందును వర్తిలునని వ్రాయుట సరికాదు. 'సుర పితృ కోట్లుం పూర్వా ..'' అను పాఠము సరికాదు. "సుర పితృ కోటులు పూర్వా " (శాంతి. ౨ ఆ ౨౫) అనునది కవిప్రయుక్త మనందగును- సూరి వ్రాసిన 'పిప్పళ్ళు' అనునది వ్యావహారికము. 'దృష్ట్లు' అను దానిని ముద్రణ సంస్కర్తలు భారతమున నింపిరి. అట్టియెడ 'దృష్టి' అని మాత్రమె గ్రహింపవలయును.

♦ సూరి "బహువచనము పరమగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన 'డ-ల-ర'ల కలము లకారంబు బహుళంబుగా నగు" (బా-అచ్చు-౧౩ సూ) అని సూత్రించి "త్రాళులు - మొగిళులు-ఊళులు" మున్నగువాని నుదాహరించెను. ళ' అను ద్రావిడ

ఊరులు= ఊర్లు_ఊళ్లు=(ళ్ళు). గోరులు=గోర్లు=గోల్లు=(ళ్ళు)* కొన్ని యెడల ననుటచేత 'తేరులు-తేర్లు-రెండుసారులు= రెండుసార్లు" మున్నగు చోటులందు నలఘు లకారాదేశము లేదు

౧ వివ :-మఱికొన్ని యలము లకారాదేశస్థలములు:-పేర్లు= పేల్లు (ళ్ళు) పందిర్లు=పందిల్లు=(ళ్ళు) వెదుర్లు= వెదుల్లు=(ళ్ళు) మఱి కొన్ని యలఘు లకారాదేశము రాని స్థలములు: దారు-దార్లు (మార్గములు). ఆఱు-ఆర్లు. నూఱు_నూర్లు. ఏఱు_ఏర్లు

౨ వివ – ఏళ్ళు నీళ్ళను నొండె వేన్నీళ్ళ నొండె' వారి అనుము సరికాదు. 'ఏర్లనీల్ల=(ళ్ళ)ను నొండె వేన్నీర్ల నొండె' (మార్కం 3 ఆ) (పౌఢ-సంధి ౧౭ సూ). అని కవిప్రయుక్తపారము

బహువచన శ్లిష్టంబులై యద్విరుక్తంబులైన డ'
కార 'ల' కారంబుల కలుగు లకారంబు నిత్యంబు

శకార మెట్లును తప్పే. ల' అని వ్రాయవలెను అది యట్లుండఁగా- "తాళ్లు(ళు)లు- మొగిలు(ళు)లు-ఊలు(ళు)లు' అను రూపములును నిర్మూలములు. అట్టి చోట్టుల నలఘు ల'కారమును నిర్వహించు ప్రామాణిక (ప్రాచీనగత) ప్రయోగము లేదు. అట్టి యలఘు లకారమును గ్రామాణిక వైయాకరణు లెవ్వరును సాధింపలేదు-మీఁదు మిక్కిలి నన్నయసూత్రి మిందులకు విపరీతము. బహువచన లకార సంయుక్త రేఫమునకె నన్నయ యలఘు లకారము నాదేశించెను. అథర్వణుఁడును సుత్వాలోపమందే యలఘు లకారము వచించెను. (వ్యా-సం-౧౯౯ విష).

సూరి చింతామణి సాధించిన ('రోలో' వ్యా-సం-౧౯౨వి) "నీల్లు=(ళ్ళు)ఊల్లు=(ళ్ళు)' మున్నగు రూపములను సాధింపకుండుటయుఁ జింతామణి సమ్మతములు కానట్టియుఁ బ్రయోగప్రామాణ్యమేనిలేనట్టియు 'నీళులు-ఊళులు మున్నగువానిని సాధించుటయు వింతగా నున్నది.

౫ నగును. అలము లకారపూర్వక (అవ్యవహితపూర్వక=సంయుక్త) లములకార మలసు లకారంబగు ౧౪ (వ్యా-సం-౨౦౭ విమ) (బా-ఆచ్ఛి-౧౪ సూ).

ౘ్రాడులు-(ౘ్రాన్లు)=త్రాళ్లు = (ళ్ళు). కాలులు = కాల్లు (ళ్ళు). అద్విరుక్తంబు లనుటచేత "తెల్లు-గుల్లు-తెల్లు-కల్లు" (మధ్యము) మున్నగు శబ్దంబులం దట్లు ౬ాదేశము గల్గదు.

౧ విమ :-నన్నయ కాలమున గుడి-గుడులు=గుడ్లు అనున వె సాధువులుగా నుండెడివి. గుడ్లు-'గుల్లు'=(ళ్ళు) అను లాదేశము దిక్కయజ్వనాటికిఁ గాలక్రమమునఁ గల్గెను. 'కాలు-కాలులు-కాల్లు'=(ళ్ళు) మున్నగుచోట్ల 'లా' దేశమె పల్కఁబడెడిది ఇచట యీ యలమూచ్చారణమునకు వేఱుగ విధి యనావశ్యకము. గోళ-గరళాదిశబ్దము లందువలెనె యలమూచ్చారణము లోకప్రసిద్ధమె. కానసె చింతామణిలో 'రోలః' అని రేఫకు మాత్రమె లాదేశము విధింపఁబడెను. (వ్యా-సం-౧౯ విమ. 23౬ పుట.)

౨ విమ:- తెలుఁగున స్థిరపరక పూర్ణ ముండనేరదు గాన (సంజ్ఞా ౧౬ సూ). ఏండ్లు-పూండ్లు=(అనేకములు) మున్నగు స్థలములందుఁ బ్రకృతసూత్రము చొప్పున నలము లకారాదేశము రానేరదు. ఈ న్యాయముచేతనే మూల్లు=(ళ్ళు)-పల్లు = (ళ్ళు) = (ఫలములు) బల్లు=(ళ్ళు)=(శకటములు) మున్నగునవి యసాధువులు. వ్యావహారిక మాత్రములు 'మూండ్లు-పండ్లు-బండ్లు' అనునవే గ్రాంథికరూపములు. సాధువులు. తేటీ 'విలు పట్టిన పదునేను నాల్లె=(ళ్ళ) లోన (కాళ 3 ఆ శ-ర') అను కవిప్రయోగ ముండుటచేత 'నాల్లు"=(ళ్ళు)అనుదాని కర్వాచీనముగ నిపాతన్యాయమున సాధుత్వము నంగీకరింపనగును. "నాఁడులు-నాంస్లు' అనునవి సాధువు లనుట నిర్వివాదమె

3 వివ :- తే. గీ. దుత్వ మబ్బు నెద్దునకు వరికి నెడ్లు వడ్లు ను నాఁజను. (కావ్యాలం ౯ ఉల్లా ౯౧ ప). ' గీ కడఁక నెడ్లను దటిమి (అను ర ఆ-3౧౭) కం. రెన్నెల్లలోన నాకున్ .. .. (భాస్కర-సుందర-౨౦ర పద్య). (సూ-రా-ని)" అను ప్రమాణము లనుబట్టి "ఎడ్లు=(ఎద్దులు) వడ్లు=(ధాన్యము) నెల్లు=(నెలలు)'' అనునవి సాధువు లనఁదగును. ♦ ' సీ. నట్టింట దేవల్ల=(ళ్ళ) పెట్టెఁ బెట్టిన తిన్నె'' (శుక. 3 ఆ. ౫౦ ప) (సూ-రా-ని). అనుచొప్పున ''దేవరలు=దేవల్లు=(ళ్ళు)'' అనియు సాధువు లనఁదగును.

సమాన పదంబునందు సంయోగంబు పరంబగు నపు డెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు. ౧౫. (బా-అచ్చి-౧౫) (వ్యా-సం ౨౦౨ I వి). సమాన పదము=అఖండపదము.

అనఁటులు=అనంట్లు. పనఁటులు=పనంట్లు=(కుండలు). గోఁటులు=గోంట్లు=(ఒయ్యారములు). తేఁటులు=తేంట్లు=(తుమ్మెదలు). ఏఁడులు = ఏండ్లు = (వత్సరములు). కాఁడులు = కాండ్లు = (నాఁగలి మున్నగువాని యుగములు).

౧ వివ:-పయిరీతిని బహువచన పరకత్వమున నీ విధి యవ్యభిచరితమె యైనను దచ్ఛిన్నస్థలములందు బహుళముగా ననఁగా యథాప్రయోగముగ నెన్నఁదగును. ఉదా :- తీఁడిరించు = తీండ్రించు. మూఁడుచు=మూడ్చు. (ఇట బిందులోపము). స్థిరపరకత్వ రూపాంతర మందును బిందువు లోపించుట గలదు. ఉదా :- వేసఁగి=వేసవి. పోఁడిమి=పోణిమి. మొ-

ఔపవిభక్తికంబుల (అచ్చి-౭౦-౭౧ సూ) (టి-ంటి) లివర్ణ - సల లువర్ణంబులకు బహువచనంబు పరం

♦ "ఎడ్లు-వడ్లు-నెల్లు-దేవల్లు=(ళ్ళు)'' అనువానిని సూరి ప్రభృతులు సాధింపలేదు.

బగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళముగా నగు. ౧౬. (బా-ఆచ్ఛి-౧౬) (వ్యా-సం-౨౦౩ I II విమ)

లివర్ణ :— కొడవలి-కొడవండులు. ఉల్లోపము - (ఆచ్ఛి ౧౨ సూ) కొడవన్లు. పక్షంబునం దలఘు లకారంబు:- కొడవల్లు(ళ్ళు) = కొడవలులు. (చూ-ఆచ్ఛి ౧౭ సూ) రోఁకలి ప్రభృతులకును నిట్లె ద్వివిధరూపంబుల నెఱుంగునది. కొడవలి శబ్దము భారతకాలమున కనౌపవిభక్తిక మెయయ్యు నర్వాచీనముగా నౌపవిభక్తిక మయ్యెను. 'ఒలయు వైరాగ్యమను కొడవలిన కాని' (శాంతి-౪ ఆ-౧౯-౨ ప) కొడవటఁ గోయు నురవడి (వరాహ-౧౨ ఆ-౨౪)''.

సల లు వర్ణ :— ఇల్లు-ఇండులు-ఉల్లోపము-(ఆచ్ఛి ౧౨ సూ) ఇండ్లు=ఇల్లులు. పక్షంబున-ఇల్లు=(ళ్ళు) (ఇంటికిన్ - ఔప). ఇట్లు-కల్లు=(ఱాయి) పల్లు=(దంత) ముల్లు-విల్లు'', మున్నగు శబ్దంబులకును ద్వివిధరూపంబులను గ్రహింపవలెను 'కల్లు=(మద్యము) పల్లు=(పల్లము)'' మున్నగునవి యనౌపవిభక్తికములు గాన వాని కీ సూత్రము వర్తింపదు.

బహుళగ్రహణముచేత 'పెండిలి' మున్నగు వానియందును నీ కార్యము చూపట్టుచున్నది ఉదా .— పెండిలి- పెండిండులు-ఉల్లో

* ఈ సూత్రపు వివరణమున సూరి 'ఇల్లు' ప్రభృతి సల లువర్ణంబులకు బిందుపూర్వక డు వర్ణము రానిపక్షమున ఆచ్ఛి-౧౨-౧౭ సూత్రముల చొప్పున ఉల్లోపము-అలఘు లకారాదేశమును నుదాహరింపలేదు. బహుళ విధాన ఫలముగా నట్లు చేసెనేమో? 'సలో లో శ్చ'' అను చింతామణి చొప్పున 'ఉల్లోపము'' లేఁగా 'ముల్లు' అని కాల్లు' అను దానివలెనె యేర్పడును. లకారాలమూచ్చారణము లోకప్రసిద్ధినిబట్టి సిద్ధించును. కాల్లు=(ళ్ళు) అను దానివలెనె (చూ-౧౨ సూత్రము-ఉదాహృతులు) ముల్లు=(ళ్ళు) అనియును సిద్ధించును.

పము - పెండిండ్లు, "ద్విపద-పెండిండ్ల నోములఁ బేరంటములను బండుగు దినముల ..(బసవ-3-ఆ-3౨౬ ప).

ఒకా నొకచో నామంబు 'లు' ప్రత్యయాంత
తుల్యంబయి ♦ 'లు' ప్రత్యయంబు నెనయు ౧౭.
(బా-అచ్చి౧౭) (వ్యా-సం ౨౦౬ I వివ )

నీల్లు(ళ్ళు)లు మొసల్లులు(ళ్ళు) ♦ ఇట్లు ప్రయోగ దృష్టంబులు గ్రాహ్యంబులు. "అపి సంయుక్త సమాస్తే భూయోన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్" అనుచు 'లు' ప్రత్యయ మాత్రమే మరల నిల్చునని చెప్పఁబడుటచేతను (చింతామణి యందు) ప్రయోగములందును 'లు' అనునది మాత్రమె మరల నిల్చుట కన్పట్టుచుండుటచేతను నీల్లు(ళ్ళు) లన్' మున్నగునవి సాధువులు కారనేవు.

౧ వివ:- ప్రౌఢ వ్యాకరణములో సహోబలపండితీయము చొప్పున "కోడంద్రురయందు ' (ప్రౌఢ-శబ్ద-౨౮ సూ) మున్నగు నవి యుదాహరింపఁబడుట కేవలము పొరపాటు. 'రు-ర'లు పునరుక్త బహువచనములగుట నిరాధారము. ప్రయోగ బాధ లేనపుడు లక్షణమునకుఁ బ్రసక్తియే యుండదు గాన 'లుః' ప్రదృశ్యతే" అను 'లు' వర్ణకము 'రు' వర్ణకమున కుపలక్షణము కానేరదు. అచట తాళపత్ర మాతృకల చొప్పున ' కోడందురి యందు" మున్నగు పాఠములు కవి

---

♦ సూరి 'సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి" అని సూత్రించి " కొడవండ్లులు-కొడవళ్ళులు-కొడవండ్లులన్-కొడవళ్ళు లన్" అని యుదాహరించెను. చింతామణి సూత్రమును బ్రయోగములను బట్టి ద్విరుక్త లు' ప్రత్యయమె నిల్వవలెనుగాని 'డల' సంయోగ ముండరాదు. 'లుః' 'ప్రదృశ్యతే' అనుటచేత 'లన్' అను ద్వితీయ నిల్వరాదు. భారతకాలమునాఁటికి కొడవలి' శబ్ద మూపవిభక్తికమే కాదు గాన "కొడవండ్లు" అను రూపము భారత ప్రయోగములలో నుండనేరదు. (అచ్చిక ౧౬ సూ. చూ).

ప్రయుక్తములయి యుండును (సూ-ఆచ్ఛి-౧౧ సూ) గాన౯ ప్రయోగ బాధ లేదు. 'కోడంద్రుడు-కోడంద్రురయందు'' మున్నగునవి యప శబ్దములు. ''రథో దాకులగుచు నెనమండురు'' (ద్రోణ-౩ ఆ ౨౧౬) ఎనమండ్రురు' అపపాఠము.

౨ వివ – ప్రయోగ:- మొసళ్లు(ళ్ళ)లు లోఁగొను౯ (ఆది ౪ ఆ ౧౪౮) సీ-సీతనూభవులు కన్నీళ్లు-(ళ్ళ)లు దొరఁగ (ద్రోణ ౪ ఆ 333) ఊళ్లు=(ళ్ళు) లిట్లమర (హరి-పూ-౫ ఆ ౭ ప).

కలన్వాదుల ను' వర్ణకంబునకు బహువచన* ము పరంబగునపుడు కు' జ్జగు ౧౮ (బా-ఆచ్ఛి ౧౮) వ్యా-సం-౨౦౫ I విష).

కలఁకులు=కలంకులు, కలన్వాదులు :- కలను=(కళ్ళము) (యుద్ధభూమి). కెలను=(పార్శ్వము). కొఱను=(బీడునేల). కొలను. గవను=(ద్వారము)-నెఱను=(మర్మస్థానము) వరను=(చిక్కు)వలను=(దిక్కు)-(ఉపాయము-కుడిప్రక్క), మ్రాను ఇది పరిత్తగణము కలన్వాదు లోపవిభక్తికములు. ఇ' అనునది విభక్త్యలకు ముందు నిల్చును. ఉ మ్రానను ఱాతనుం గలదె మాంసము-(అను-౨-ఆ ౨౯౪ ప).

౧ వివ:- ఇది తమిట కళ్=కు+లు' ప్రత్యయ వికృతియనియు నేకవచనపు కజ్జు' ప్రాచీన ద్రావిడభాషలోఁ గలదనియు నా. కాల్డువెల్లుగారి ననుసరించి శ్రీ కోరాడ రామకృష్ణయ్యపంతులుగారు (M A) వ్రాయుట సత్యవిదూరము (ద్రా పరి ౭౮ I విష)

౨ వివ:-కొంద ఱర్వాచీనులు బహుత్వమందును 'కుజ్జు' నుజ్జగించుట గలదు.ఉదా:-నూఱులు వేలు మ్రోయ గవను ల్వడి వెల్వడి (రామాభ్యు-౯ ఆ ౬౯-సూ-రా-ని) ముసలిమానుల్ గా (శ్లేషఘటితము) వసు-౧ ఆ ౪౫ ప).

---

* సూరి యేకవచన పరకత్వమున 'కుజ్జు' వికల్పముగా నగునని సూత్రించెను. ఇందులకు మహాకవి ప్రయోగ ప్రామాణ్యము లేదు. చింతామణి విరుద్ధము. ఆంధ్రభాషార్ణవ (క్రీ-శ-౧౭౫౦) కోశమున మాత్ర మేకవచనమున 'కుజ్జు' గలదు. (సూ-రా-ని) (శ-ర).

అట్లు రేను గోను శబ్దముల ను' వర్ణంబునకు బహుత్వమున 'గు'జ్ఞగు ౧౯. (బా-ఆచ్ఛి-౧౯) (వ్యా-సం-౨౦౬ వి).

రేఁగులు-గోఁగులు (రేను=బదరి, గోను = జనుము). దీని కేకత్వమందలి పాక్షిక 'గుజ్ఞు'న కాంధ్రభాషార్ణవ మాత్రమే యాధారము. 'గోఁగునార' మున్నగునవి యేకత్వ గుజ్ఞు సాధకము లనరాదు. "గోఁగులయొక్క + నార=గోఁగునార. రేఁగులయొక్క + మాను=రేఁగుమాను'' అని విగ్రహము నెన్నవగును. 'వేల్పుటావు-వేల్పుమాను' మున్నగునవి లేవా? (వేల్పులయొక్క+మాను).

బహువచనంబు పరంబగునపుడు చేను - పేను - మీను' శబ్దంబుల ను' వర్ణంబు లోపించు-౨౦-(బా-ఆచ్ఛి-౨౦) (వ్యా-సం-౨౦౭ I వివ.).

చేను-చేలు. పేను-పేలు. మీను-మీలు, (చేఁపలు). 'చేను-పేను-మీను' శబ్దములకే యనుటచేతఁ, కౌనులు=(నడుములు)-వీనులు=(చెవులు)-మేనులు = (శరీరములు) మొన్నగువాని యందలి 'ను' వర్ణము లోపింపనేరదు

౧ వివ.- ఆచ్ఛి-౨౪ సూత్రము చొప్పున నీచేన్వాది 'ను' వర్ణాంతముల తుది 'ఉ'కారము పాక్షికముగా లోపించును, మీనొప్పల వల్పు (ఆది-3 ఆ-౪౦) చేన్మేసిన (ఉ-హరి-౫ ఆ ౪౨) "గండు మీనులన్ (కవిక-౨ ఆ ౨౮) అను నపపారము నంగీకరించి మీను శబ్ద 'ను' వర్ణలోపము పాక్షిక మనరాదు. ఆచట 'గండుమీలనున్' అని కవి ప్రయుక్తమై యుండును.

౨ వివ:- 'పేను-మీను' శబ్దంబులు ప్రాణివాచకములు గాన నౌపవిభక్తికములు కానేరవు-'చేను' శబ్ద మౌపవిభక్తికమె. సీ. చేనఁ బండిన విత్తు చేనికె. (నన్ని-కు-౧ ఆ-౪౯.)

బహువచనంబు పరంబగునపుడు I 'రేయి' ప్రభృతుల 'యి' వర్ణంబు లోపించును. II రాయి శబ్దపు

'యి' వర్ణమునకు లోపముగాని 'లు-తి' అనువానిలో నేదేని యాదేశమగుటగాని సంభవించును. III 'గోయి' ప్రభృతుల తుది యి' వర్ణమునకు తి'' వర్ణాదేశము నిత్యముగా నగును. (ఏకత్వమున నౌప విభక్తిక తి' వర్ణము వక్ష్యమాణ మగును) (ఆచ్ఛి-౭౮ సూ). IV దోయి శబ్దము తుది యి' వర్ణమునకు లోపము వైకల్పికము. ౨౧ (బా-ఆచ్ఛి-౨౨ సూ). (వ్యా-సం-౨౦౮-౨౦౮ I విష). *

I యి' లోపనిత్యత '- రేయి-రేలు-రేలన్. వేయి-వేలు-వేలన్. వ్రాయి-వ్రాలు. పాయి-పాలు

II ఱాయి=ఱాలు-(ఱాలులు) ఱాల్లు=(ఋ). (ఉల్లోపము-నిత్యము-ఆచ్ఛి-౧౨ సూ). ఱాతులు. 'రాలు-రాల్లు=(ఋ)-రాతులు' అని యిట్లుగ నిది రేఫముతోను నుండును. (ద్విరేఫకము). ఈ శబ్దము 'తి' వర్ణము వచ్చు నౌపవిభక్తికము గాన రాతన్=ఱాతన్' ఇత్యాది రూపములును నుండును రాతిపయిని నినుముగొనుట రాత్రి దధి (ఆను-ర ఆ ౧౦౦) ఉ. మూరినను ఱాతనుం గలదె మాంసము (ఆను-౨ ఆ-౭౯ ర ప). కేషాంచిద్ య్యన్తశబ్దానాం లు తీ స్యాతాం యథోచితమ్" (అధర్వణాచార్య) (వ్యా-సం-౨౦౮ విష).

* సూరి యిట్లు సూత్రింపనే లేదు. ఇతఁడు 'గోతులు-(గోయి)' మున్నగువాని నౌపవిభక్తిక ప్రకరణమున సాధించుట సరికాదు. ఔపవిభక్తికత బహువచనవిషయమే కాదు. గోతిచేత' మున్నగు వీని యేకవచనపు తి' వర్ణ మూపవిభక్తికము. కావుననే యధర్వణాచార్యుఁడు "క్వచి త్త్యాదేశ ఏవ స్యాత్" అని బహువచనపు 'తి' వర్ణాదేశమును వేఱుగ విధించికొనెను. (వ్యా-సం ౨౦౮ విష.) సూరి 'ఱాయి' శబ్దమును రేయి ప్రభృతులలో (బా-ఆచ్ఛి-౨౧ సూ)ఁ జేర్చుటచేతను గోయి ప్రభృతులలోఁ జేర్పమిచేతను 'ఱాతులు' మున్నగు రూపముల నధర్వణాచార్య విరుద్ధముగా నంగీకరింపలేదు.

III గోయి-గోతులు-గోతులన్. చేయి - చేతులు - చేతులన్. గోయి-చేయి-దాయి=(సమీపము) నూయి-నేయి-వాయి=(నోరు) రోయి (భస్మము). ఇత్యాదులు.

IV దోయి=(ద్వయము) దోయులు=దోలు. "రెండుచే దోల ...(కావ్యాలం-౫ ఉల్లా ౧౮ ప).

౧ వివ :- కుయి =(మొఱ్ఱ) ప్రభృతులకుఁ బై కార్యము లెవ్వియుఁ గలుగవు. ఉదా :- కుయి=కుయులు "ఆ- వె-అధిపవినఁగఁ దగదె యాఁచు కుయులు ... ... (భాగ ౧౦ స్క-౦=పూ ౨౨౫ ప). పొయి-పొయ్యి-పొయులు. మొ.

౨ వివ :-గోయి ప్రభృతులలోఁ గొన్నిటికిఁ బ్రథమైకవచనమున "గొయ్యి-చెయ్యి-నుయ్యి-నెయ్యి" అను రూపాంతరములు గలవు. 'పొయి-పొయ్యి' అనియుఁ గలదు.

బహువచనంబు పరంబగునపుడు 'ఆవు' ప్రభృ
తుల తుది యక్షరంబునకు లోపంబు విభాష నగు.
౨౨ (బా-ఆచ్ఛి-౨౭) (వ్యా-పం-౨౦ I వి).

ఆవులు=ఆలు = జాములు = జాలు. చుట్టములు = చుట్టలు = చుట్టాలు. (తత్స-౪౪-సూ). నీ చుట్టాలకున్ (ఉద్యో 3 ఆ ౧౨). మీసములు=మీసలు=మీసాలు. (మీసాలపైఁ దేనియల్- (మనుచ -౨-ఆ-౬౫). ఆవు శబ్దమునకు సమాసమున నుగాగమము గల్గును. ఉదా .- ఆఁదోఁక=(ఆవు తోఁకవలె నుండు) ఆవు+పోతు=ఆఁబోతు. ఆవు=దూడ=ఆదూడ. మొ.

ఇయకు మాఱుగా నామంబులం దెత్వం † బు
బహుళంబుగా నగు. ఇయలోని 'ఇ' కారము లోపిం

---

† సూరి నామాంతమం దనుట సరికాదు. ఉదా :- చెలియలు=చెల్లెలు. మొ-

చుటయుఁ గలదు. ♦ 'ఎ-ఏ' శబ్దంబుల చోట 'ఇయ' నిల్చుటయుఁ గలదు. ౨౩. (బా-అచ్చి-౨౩) (వ్యా-సం-౨౧౦-౨౧౦ I విష).

"ముత్తియము=ముత్తెము=ముత్యము" జన్నియ=జన్నె-(జన్నె కట్టు=మీఁదుగట్టు). వన్నియ=వన్నె. కొంచియము=కొంచెము. కొండియము = కొండెము = కొండ్యము. ('కొండేలు'-అపశబ్దము) ((శ్రీ)రంగ-౫ ఆ ౩౪). (సూ - వ్యా - సం - విస్త I ౧౪౮ విష). దివ్వియ=దివ్వె=దివ్య. (అను-౪ ఆ ౧౧౯) కళ్ళియము=కళ్ళెము=కళ్యము. (విరా ౧ ఆ ౯౫). (కర్ణ ౧ ఆ ౧౪౦). కన్నియ=కన్నె=కన్య. (రాఘవ-౧ ఆ-౭ వ). పళ్ళియము=పళ్ళెము=పళ్యము. (కాశీ ౫ ఆ). పీడియము=పీడెము=పీడ్యము. (పాండు-౩ ఆ) విడెము. నిత్తియము=నిత్తెము=నిత్యము=నిత్య=(బసవ-౨ ఆ-౪౩౭).

'ఎ-ఏ' లచో 'ఇయ' నిల్చుట .- అంతే=అంతె=అంతియ. (ఆది ౫ ఆ ౧౧) ఇంతే=ఇంతియ(ఉద్యో-౧ ఆ-౩౨౧)ఇంతియకాలం బగు నట్టి నీ మనము శాంతిం బొందఁగా నేర్చునే (ఉద్యో-౪ ఆ-౪౭)

పదాంతంబులగు 'ను-లు-రు'ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు. ౨౪. * (బా-ప్రకీ-౧౬ సూ). (వ్యా-సం-౨౧౦ III విష),

---

♦ ఇయ' శబ్దంబునందలి 'ఇ' కార లోపము 'ముత్తియ' శబ్దమందు మాత్రము గలదనుట సత్యవిదూరము. దివ్వియ=దివ్య. కన్నియ=కన్య. పళ్ళియము=పళ్యము. మొ.

* ఇట్టి యాచ్ఛిక విధులు పెక్కు ప్రకీర్ణము లనుచు సూరి సూత్రించెను. మఱియు సూరి యీ ప్రకీర్ణసూత్రమున "అసంయుక్తంబులయిన" అను దళము నిడెనుగాని సంయుక్తంములందును నీ లోపము గలదు. ఉదా :- నీరుకోళ్ళు=నీరుకోళ్ (ఆము-౧ ఆ-౭౧). అఱువుళ్ళు=అఱువుళ్ -(భాస్కర-యుద్ధ-౫౪౮). మఱియు నీ విధి హల్పరకత్వమందే 'ను-రు' లకు వర్తించునని సూరి వ్రాసెను. అది సరికాదు, ఉ..... ముదంబును బొందితి నీకు దోహిగాన్ (కాను) (పద్యాంతము). ఎట్లు సహింతున్ (సభా-౨ ఆ-౧౪౧) పద్యాంతము.

మ్రాను+పడె=మ్రాన్పడె. మిన్ను = మిను + పడె = మిన్పడె. అను+పురము=అన్పురము. (సభా-౧ ఆ-౧౭౩). నేను=నేన్. నన్నున్=నన్. నిన్నున్=నిన్. తన్నున్=తన్. తాను=తాన్. ద్రోహిన్+గాను=ద్రోహిఁగాన్. వత్తురు+వారు=వత్తుర్వారు. కారు+కొనియె=కార్కొనియె. మీరు+వలదు=మీర్వలదు. (అర ౫ఆ ౩౮౩) నీరు+వావిరి=నీర్వావిరి (అను-౩ ఆ-౩౧౬). సహింతురు=సహింతుర్. (సభా ౨ ఆ-౧౪౧). విల్లు-విలు+పూనె=విల్పూనె. రాములు=రాముల్-వనములు=వనముల్ (చూ-వ్యా-సం-౭౯౧ పు)

౧ వివ బహుళగ్రహణముచే 'ను-రు-లు' అనువానికి భిన్నస్థలములందును స్వరలోపము. మాఱు+పల్కన్-మార్పల్కన్' (శల్య-౧ ఆ-౬౧). కీడు+పాటిల్లు=కీడ్పాటిల్లు (స్త్రీ-౨ ఆ-౫౮) చేటు+పాటు=చేడ్పాటు (విరా-౪ ఆ-౯౫). గుండు+రాయి=గుండ్రాయి (ఉ.హరి. ౨ ఆ-౧౬౭). వెల్లి+విఁజియన్=వెల్విఁజియన్ (బసవ ౧ ఆ ౨౬౬) వెల్ల+వెల్ల=వెల్వెల్ల (శల్య-౧-ఆ-౪౦) వెల్వెఁబ్రాఁటె (మను చ ౩ ఆ ౫౬). అయి+ఉను=అయ్యును (ఆది-౨ ఆ-౨౦౯) నీరుకోళ్ళు=నీరుకోళ్ (ఆము ౧ ఆ-౭౧) అణువుళ్ళు=అణువుళ్ (భాస్క-యుద్ధ-౫౪౮).

౨ వివ:-బహుళగ్రహణముచేతనే 'ఏమి-ఇంద్రుని' మున్నగు వాని తుది 'ఇ' కారాదులు లోపించును. "నీకే బ్రాఁతియే (హరి-పూ-౫ ఆ-ప్రౌఢ-సంధి-౧౬సూ)=(నీకేమి బ్రాఁతియే) ఇంద్రు న్వలెన్=(ఇంద్రుని వలెన్)=(ఉ రా-౨ ఆ-ప్రౌఢ-సంధి-౧౭ సూ) పల్కు-ల్వంటి=(పాండు-౧ ఆ-)=(పల్కుల వంటి).

ఉకారంబు క్రింది ఉకారంబునకుం దుది 'ను-లు'
లక్రింది 'న-ల'లకును లోపంబు బహుళంబుగా నగు
౨౫ (బా-ప్రకీ-౭ సూ) (వ్యా-సం-౨౧౦ IV వివ).

ఉట్టు=ఉటు=(మెడ). గొట్టియ=గొటియ. కన్ను=కను. నన్నున్=ననున్. నిన్నున్=నినున్ తన్నున్=తనున్. పల్లు=పలు విల్లు=విలు. మొ.

అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు ౨౬
(బా-ప్రకీ. ౮ సూ) (వ్యా-సం-౨౧౦ V విష).

అక్కట = అకట అక్కటాదులు :-అక్కట-అట్టిక = (కుండ). అట్టుక=(అటుక) అట్టె=(అంట+ఎ) అయ్యో-అయ్యారె అవ్వారి= (సమృద్ధి). ఇట్టిక=(ఇటిక). ఉప్పవడము=(మేల్కొనుట) ఉమ్మి-ఎక్క సక్కియము-ఎక్కరింత=(వాహనము)-ఎడ్డ = (హృదయము) ఎన్నిక-ఎమ్ముక-కజ్జాయము=(భక్ష్యము)-కట్టా-కట్టిక=(వెండిబెత్తము వాఁడు)-కప్పురము- కమ్మటము=(అగసాలెవాని కుంపటి)-కమ్మతము=(పెక్కురు చేరి చేయు పని)-కువ్వాడము=(కపటము)-కొట్టిక=(గ్రామము)-కొమ్మ-కొయ్యగూర-గయ్యాళము=(ధిక్కారము)-గిజ్జిగాఁడు = (పచ్చపిట్ట)గుజ్జరాతి-చిట్టి-చిన్న-చిమ్మట-చెన్నటి-చెప్పుము - చెప్పుఁడు-చెమ్మట-చెల్లియలు-జవ్వాజి - జాబిల్లి - తమ్మటము = (తప్పెట) - తమ్ములము-తల్లి-తుమ్మికి-తువ్వరి =(తుంపర)-తెల్ల-దవ్వు-దివ్వియ-నవ్వు-నిద్దుర-నివ్వరి-నివ్వాళి-నువ్వులు - నెట్టిక=(వేళ్ళ కీళ్ళ చప్పుడు)-నెమ్మిలి - పవ్వళించు-పిన్న-పుల్లియ=(విస్తరాకు)-పువ్వు-పెద్ద-పొట్టి-పాకెన్న=(పెండ్లిమూఁడవనాఁటి బువ్వము)-ప్రెగ్గడ-బెగ్గడు-బొమ్మ-బొమ్మికము=బొమ్మిడికము= బొమ్మిడికము = (కిరీటము) మజ్జా=(పరిశంపార్థకము) మత్తాబు-మల్లారము=(మట్టి గాజుల గుది) - ముక్కు-ముద్దియ - మెట్టిక=(సోపానము) మొక్కరము=(స్తంభము) మొగ్గరము = (వ్యూహము) మొల్లాము= (బంగారు లోనగు పూఁత) రడ్డి=(రెడ్డి)-లొట్టిపిట్ట-వట్టి-వయ్యాళి=(విహారము)-సన్నియ =(సన్నెకల్లు) సవ్వడి - సివ్వంగి - అట్టు - ఇట్టు-ఎట్టు-అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-మమ్మున్-మిమ్మున్-తమ్మున్-అమ్మ-అక్క-అవ్వ-అయ్య-అన్న-అప్ప-అచ్చోటు=ఇచ్చోటు-ఎచ్చోటు-అచ్చటు-ఇచ్చటు-ఎచ్చటు-అద్ది-ఇద్ది-ఎద్ది-ఎవ్వఁడు-ఎవ్వాఁడు ఇత్యాదు లక్కటాదులు.'

జడ్డక్షరంబుతోఁ బదాద స్వరంబు గూడుచో "౨౫-౨౬" (అచ్చి) సూత్రములకులక్ష్యములగుజడ్డలకులోపము లేదు ౨౭. (బా-ప్రకీ-౯ సూ) (వ్యా-సం-౨౧౦ V వి).

౹అట్టెత్తె-కన్నదరె-నన్నడిగె-పల్లొత్తె-విల్లండె-'౨౫-౨౬సూత్రములకు లక్ష్యములగు' అనుటచేత 'మన సేకాగ్రత (శాంతి-౫ ఆ-౧౨౧)" మున్నగునవి విరోధింప నేరవు

హాదులయు నీలుగు ప్రభృతులయుఁ బదాది హల్లు విభాషను లోపించు ౨౮ (బా - ప్రకీ - ౧౦ సూ) (వ్యా-సం-౨౧౦ VII వి).

హాడపము=అడపము=(నకిలాకుల తిత్తి). హారిదళము=అరిదళము = (హరితాళ శబ్దభవము) హళఁది=అళఁది=(హరిద్రా వర్ణము). నీలుగు=ఈలుగు=(ఒడలు విఱుచుకొనుచు వచ్చు). నీలుగు-నెగయు-పొందు-పొను-పూను-పొదవు=(సంభవించు=కలుగు).

అచ్చికంబులం బదమధ్యంబుల I 'న-ల-గ-ర'ంల మీఁది 'ఉ' త్వంబునకు లోపంబు విభాష నగు. II తద్భిన్నాక్షరముల మీఁదను, 'ఉ' కారేతర స్వరంబులును, గొన్ని యెడల లోపించును. III ప్రత్యయపూర్వ స్వరంబులును యథాప్రయోగంబుగ లోపించును ౨౯ (బా-ప్రకీ-౧౮-౧౯ సూ) (వ్యా-సం-౨౧౦ XI వి)

I కినుక=కిన్క-కొనుక=కొన్క, చిలుక=చిల్క-కాలువ-కాల్వ; కడుగు=కడ్గు-ఈడుచు=ఈడ్చు. పెరుఁగు=పెర్గు-కూరుకు=కూర్కు-మొ.

II అబ్బురము = అబ్రము (అచ్చి-౨౬ సూ. బకార లోపము)-(కప్పురము=కప్రము నెత్తురు=నెత్రు అప్పుడు=అప్డు ఇప్పుడు=ఇప్డు. ఎప్పుడు=ఎప్డు-మొ వలచు=వల్చు-కలికి=కల్కి - పొలితి=పొల్తి-

ములికి=ముల్కి - బుడిపి=బుడ్పి-మొ.

III వినుము=విన్ము-(ఆది-౮ ఆ-౧౭౮)-(శాంతి-౩ ఆ-౩౭౧)- భానుసమాన విన్ (కవిజ-వృత్తా. ౧౦౨). నిలుము=నిల్ము (హరి-ఉ- భా-౭ ఆ-౨౨౭). చనును=చన్-(చనును+ఎ=చన్నె). (సభా-౨ ఆ- ౨౨౮-౨౽౩). నెగడుతన్=నెగ డ్తన్-(సన్ని-కు-౩ ఆ-౨౭౭).వలదు= వల్దు-(ద్రోణ-౫ ఆ-౩౨౭). చెడక=చెడ్క (ఉ-హరి-౬ ఆ-౧౭౩). కాలుదుము=కాల్దుము-(బసవ-౭ ఆ-౫౭౬).

౧ వివ :—ప్రథమా బహువచన 'లు' ప్రత్యయ పరకత్వము నందలి 'ఉ' త్వలోపము (ఆచ్ఛి-౧౨ సూ), ప్రేరణ 'చు' వర్ణకాది పర త్వమునందలి లోపాగమాదేశాదులు (క్రియా-౭౦ సూ), శత్రర్థక 'చు' వర్ణక పరకత్వమందలి 'ఉ' త్వలోపాదికము (క్రియా-౬౫ సూ), క్రియా ప్రత్యయ 'రు' వర్ణక పరకత్వమందలి 'ఉ' త్వలోపము(క్రియా- ౭౨ సూ), మున్నగునవి వేఱుగ సూత్రింపఁబడును కాన వాని నిం దుదాహరింపరాదు

'చు' పరక 'రు' వర్ణకంబునకు ముందట్రి 'దు' వర్ణంబు 'ఉ' త్వంబునకు లోపంబు విభాష నగు. అగువోఁ దత్పూర్వ స్వరంబు గురువు కాదు ౩౦-౩౧. (బా- ప్రకీ-౨౦ సూ) (వ్యా-సం-౨౧౦ XI వివ. ౩౭౮ I వివ).

అదురు=అదురుచు=అద్రుచు-ఎదురుచు=ఎద్రుచు - విదురుచు= విద్రుచు (విదలించు)-పదురుచు=పద్రుచు=(ప్రేలు-త్వరపెట్టు) (చూ- ఉ. హరి-౭ ఆ-౧౦౯ ప) (చూ-౧ వివ).

౧ వివ :—వీనిలో 'అదురుచు' అప్రేరణము. అద్రిపడ. 'చు' అవయవికము. 'ఎదురుచు-ఎదిరించు' అనునవి యౌగమములై యయ్యు ప్రేరణార్థకములు కావు ఎద్రుచున్-ద్రుపన్. "విద్రుచు-పద్రుచు"

అనునవి ప్రేరణరూపములు. విద్రుపక్-ప్రద్రుపన్-మొ * (చూ-వ్యా-సం-3_౨౮ I వివ. ౧౫౨_౩ పుట) (చూడు-సంజ్ఞా పరిచ్ఛేదము-౧ సూ. ౬ వివ). చ॰- ఎదిరించిన.. .. అదిరించిన..... విదుర్పగ... ... చిదురించలు... .. (ఉ. హరి. ౪ ఆ-౧౦౯ ప). ఇందలి 'చిదురి పలు' అను దానిని మాత్రము శిథిలద్విత్వముగా నెన్నవలెను. 'క్రదువ' లోని 'క' వర్ణము గురువె.

ఆచ్ఛిక సమాన పదంబులం దుత్తమంబులగు 'రు-లు-డు'ల ముందటి ఏ'త్వంబునకు హ్రస్వంబు విభాష నగు. 3_౨ (బా-ప్రకీ-౨ సూ) (వ్యా-సం-3౭ వివ).

నల్లేరు=నల్లెరు - (ఉత్తమ=మూఁడు వర్ణములు గల పదములోని మూఁడవ వర్ణము-చూ-తత్స-౪౭-౫౮ సూ)-పల్లేరు=పల్లెరు-పెన్నేరు=పెన్నెరు=(అశ్వగంధ)- మానేరు=మానెరు=(జ్యోతిష్మతీ లత)-ఆడేలు=ఆడెలు=(శారికపక్షి) -కుందేలు=కుందెలు-తోఁడేలు=తోఁడెలు-నాఁగేలు=నాఁగెలు-నేరేడు=నేరెడు-మారేడు=మారెడు-పూరేడు=పూరెడు (పక్షి విశేషము) తంగేడు=తంగెడు-ఇత్యాదులు.

'ఊయేల-పయ్యేద-తాయెతు'లం ద్రిక్క నామంబులందు 'యా'కుఁ దాలవ్య వక్రయోగంబు లేదు. 33. (బా-ప్రకీ-3 సూ) (వ్యా-సం-3౯ I వివ).

త్రిక్కన్-తక్కన్ ఈ మూఁటియందుఁ దప్పఁ దక్కిన సమాన పద మధ్యమునందలి య'కారమునకు 'ఎ-ఏ'ల యోగము లేదని యర్థము. "ఊఁచు+హేల=ఏల=ఎల=ఊయెల పయి+ఎద=పయ్యెద. తాయి+ఎత్తు=ఎతు=తాయెతు" అని ఛేదమనియు నివి సమానపదములు కావనియుఁ జెప్పెడి యప్పకవ్యాదుల వ్రాఁత సరికాదు "ఎల-ఎతు" శబ్దములు తెల్గున నప్రసిద్ధములు 'పయ్యెద" లోని ద్విత్వమునకు విధి లేదు. 'పయెద' అను రూపము లేదు.

---

* ఇవెల్ల ప్రేరణార్థక చుక్క'తోఁ గూడినవె యను సూత్ర వ్రాఁత సరికాదు.

ఊయేల-యూయాల చాపుల నొంకొంటికిం గుఱుచ
యొండె నగు. ౩౬ (బా-ప్రకీ-౪) (వ్యా-సం-౩౯-
I విష)

ఉయేల = ఊయేల = ఊయెల = ఉయాల = ఊయాల=ఊయల=
( ఉయెల' అనరాదు) (వక్ష్యమాణంబు యద్విత్వంబు) (ఆచ్ఛి - ౩౭
సూ)=ఉయ్యేల=ఉయ్యెల=ఉయ్యాల=ఉయ్యల. (వీనియందు సమా ౭౭
సూత్రపు ద్విత్వపరక హ్రస్వము గల్గుచున్నది)

పయ్యెద-పయ్యెద. ౩౭ (బా-ప్రకీ-౭ సూ) (వ్యా-
సం-౩౯. I)

ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు
ద్విర్వచనం బొండె నగు ౩౮. (బా-ప్రకీ-౮) (వ్యా-సం-
౩౯ I విష)

ఉయ్యేల=ఊయేల ఉయ్యెల=ఊయెల ఉయ్యాల=ఊయాల.
ఉయ్యల=ఊయల. ఆయెను=అయ్యెను. ఆయెదను=అయ్యెదను ఆయె
డిని=అయ్యెడిని. ఆయెడును=అయ్యెడును ఏలిదము=ఎల్లిదము=(చుల్క
దనము) ఓయన=ఒయ్యన=ఒయ్య=(ఋజువు) ఓయారము=ఒయ్యా
రము. కోపు=కొప్పు=(ధను రగ్రము) జాజర=జజ్జర=(మోసము). తేని
య=తిన్నియ తీయము=తియ్యము తేప=తెప్ప=(ప్లవము) తేమ=
తెమ్మ తోయలి=తొయ్యలి. దీవియ=దివ్వియ నూవు=నువ్వు. నోవి=
నొవ్వి=(నొప్పి) నోవు=నొవ్వు=(నొప్పి) పూవు=పువ్వు వేయ=వెయ్య.
మోక = మొక్క మోటిక = మొట్టిక మోవు = మొవ్వు వీయము =
వియ్యము ఇత్యాదు లూయేలాదులు.

ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు
విభాష నగు. ౩౯. (బా-ప్రకీ-౧౧) (వ్యా-సం-౩౮౦ వి)

ఆరాటము=ఆరటము= పరితాపము). కకూ్రటిటి = కక్కుటిటి.
కేళాకూళి=కేళకుళి. కేళాకుళి=కేళకూళి (క్రీడా సరస్సు=ఖేలాకూల శబ్ద
భవము) కొమారుఁడు=కొమరుఁడు. కొమారిత=కొమరిత గంబూ

రము=గంబురము=(కస్తూరము) పెండారము=పెండరిము=పెండేరము=పెండెరము=(అందె) బంగారము=బంగరము బేహారము=బేహారము=(వాణిజ్యము=వ్యవహార శబ్దభవము) వీటతాటము=(వీటతటము)=(తాంబూలము) సంతోసము=సంతోసము మొ

ఓయారాదులం దొకానిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు 38 (బా-ప్రకీ-౧౨సూ) (వ్యా-సం-3౮౧ విప).

ఓయారము=ఒయారము కేళాకూళి=కెళాకూళి. కోలె=కొలె=(మొదలుకొని) గూడారము=గుడారము=(పట కుటీరము). గోరువంక పక్షి=గొరువంక పక్షి. జోహారు=జొహారు=(నమస్కారము) నీలుఁగు=నిలుగు=(చచ్చు) పేఁడ=పెండ (సంధి-౨౨ సూ) బేహారము=బెహారము (దీర్ఘమధ్యంబు) మూఱు=మఱు=(తడవ). మూలుగు=ములుగు=(వేదనచేత మూలుగు) మోఱకు=మొఱకు=(మూర్ఖ శబ్దభవము) వీటతాటము=విటతాటము వీడియము=విడియము=(వీటికా శబ్దభవము) ఇత్యాదు లోయారాదులు-

ఏతాదులకు 'ము' వర్ణకంబు వరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. 39. (బా-ప్రకీ ౧౫) (వ్యా-సం 3౮౨ వి)

ఏతము=ఏతాము (యన్త్రి శబ్దభవము), కళ్ళము=కళ్ళాము. గాలము=గాలాము గుడ్డము=గుడ్డాము గోణము=గోణాము=(కౌపినము). గోతము=గోతాము=(చిన్న గోనె సంచి). జాజము=జాజాము=(పాలికలందలి నవధాన్యముల నారు) జుంజము=జుంజాము=(దీపావళి నాఁటి బాలురు కాల్చు కాష్టదీపిక). జోతము=జోతాము(నమస్కారము), తణగము=తణగాము=(ఎద్దుమీఁది నీళ్ళ తోలుసంచి)బొండ్లము=బొండ్లాము. (బూసికతోడి బెంకాయ). మండము=మండాము=(చేపలఁ బొడుచు చిల్లకోల). లాతము=లాతాము=(సన్యాసులచేతి దండము). వీణము=వీణాము ఇత్యాదులు-

అడంగ్వాదుల 'డా'కు 'ణ'కారంబు విభాషనగు.

౮౦. (బా-పరి ౧౩ సూ) (వ్యా-సం-౩౮౮ విష).

అడఁగు=అణఁగు. కడఁగు=కణఁగు=(యత్నించు) చిల్లాడము=చిల్లాణము=(బాకు) తడగము=తణగము=(ఎద్దుమీఁది నీరుతెచ్చు తోలు సంచి) నాడెము=నాణెము. పోడి = పోణి = (ఒప్పిదము) మిడుఁగు=మిణుఁగు=(మిణుఁగురు పురువు) మిడుఁగురు = మిణుఁగురు=(అగ్నికణము=మిడుఁగు) వడఁకు=వణఁకు. ఇత్యాదులు—

దక్కులోనగు వాని దా' కు 'డ' కారంబు విభాషనగు. ౮౧. (బా-ప్రకీ-౧౮ సూ) (వ్యా-సం-౩౮౮ విష)

దక్కు=డక్కు దగ్గఱు=డగ్గఱు=(సమీపించు). దాఁగు=డాఁగు దాకలి=డాకలి (సూరి ప్రథమ ముద్రణమం దిది నిర్ధిష్టము) దిగు=డిగు. దిగ్గియ=డిగ్గియ=(దీర్ఘికా శబ్ద వైకృ). దూయు=డూయు. దెందము=డెందము దెప్పు=డెప్పు=(మర్మోద్ఘాటనము చేయు) దెప్పరము=డెప్పరము=(దుష్ట వచనము). దొంగ=డొంగ దొప్ప=డొప్ప ఇత్యాదులు

జూదాదుల 'గా' కు జ' కారంబు విభాష నగు

౮౨. (బా-పరి-౨౧) (వ్యా-సం-౩౮౮ విష.

జూదము=జూజము. (ద్యూత-వైకృ). అవుదు=అవుజు=(పంకము). జవాది=జవాజి జాది=జాజి (జాతి శబ్దభవము) జాదు=జాజు=(రక్తవర్ణము) విరవాది=విరవాజి=(నవమాలిక=విరజాజి).

అక్కడాదులు నిత్యైకవచనాంతములు ౮౩ (ప్రౌఢ-శబ్ద-౨౮) (వ్యా-సం-౨౧౧ III విష).

అక్కడ-ఇక్కడ-ఎక్కడ-అక్కడికిన్-ఇక్కడికిన్-ఎక్కడికిన్. అచ్చటు-ఇచ్చటు-ఎచ్చటు అచ్చటికిన్-ఇచ్చటికిన్-ఎచ్చటికిన్. ఆదిశబ్దముచే 'ఇరులు' మొదలగువాని నెన్నఁదగును. "ఇరులున నొంటిఁబో" (విజ్ఞా-పాయ. ౧౦౨) 'కేలు' శబ్ద మిట్టిది కాదు, "పెడకేళ్ళు" (ఆర-౭ ఆ ౧౧౧)

జాతి వివక్షయందు బహుత్వమున నేకవచనము నిల్వవచ్చును. ౪౪. (అహో-౪౫౩ పు). (వ్యా-సం-౨౧౧ III వి).

పుప్పొ పరిమళించును = పువ్వులు పరిమళించును. స్తనము = స్తనములు. మొ.

సస్య వాచకములు-లోహ వాచకములు-కతిపయ సంభార వాచకములు. నిత్యైకవచనాంతములు. ౪౫. (ప్రౌఢ-౨౯-౩౧ సూ) (వ్యా-సం-౨౧౧ III వివ. దీని విస్తరము III).

వరి=(వరిచేను). చోడి-ఆసుగ-నెండి-బంగారము-ఇనుము-ఇంగువ-ఉప్పు-చమురు-మొ *

అదరులు లోనగు శబ్దములును ధాన్యవాచకములును, క్రీడా విశేష వాచకములును, సంబంధార్థమందలి యుష్మదస్మదాత్మార్థక శబ్దములును, నిత్య బహువచనాంతములు. ౪౬. (ప్రౌఢ. శబ్ద-౩౬-౩౭-౩౮-౪౬ సూ) (వ్యా-సం-౨౧౧ III వివ)

అదరులు=(మిడుఁగులులు). ఎండువులు=(ఎండఁబోసిన ధాన్యములు) మిడుఁగులులు-మొ. ధాన్యవాచక :- అళ్ళు-చోళ్ళు-మొ. క్రీడా విశేష :- గుజ్జెనగూండ్లు - గొబ్బిళ్ళు - కనుమూసి గంతలు- వెన్నెల పోవులు-మొ. సంబంధార్థక :- మీయిల్లు=(నీయిల్లు). మాయిల్లు=

---

* ప్రౌఢ. శబ్ద-౩౨ సూత్రము "సమానార్థక .." అను సూత్రము వ్యర్థము. కారక-౩౦ సూత్రముచేతనె యట్టియేకత్వము సిద్ధించును. ఈడు-ఎన' శబ్దములు సమానార్థకములును గావు (ప్రౌఢ శబ్ద-33 సూత్రము చొప్పున గుణవాచకములు నిత్యైకవచనాంతములు కావు. 'తెలుపులు-నలుపులు' అన్నియుండవచ్చును. గీ. నలుపు లెల్లను దెల్లుపులుగఁ జేసి (మను-౩ ఆ-౨౭ప).

(నాయిల్లు). తమ మామ=(తన మామ). అస్మత్పతులు=(నాపతులు) (విరా-౧ ఆ-౩౯). "మిన్నక కినువడక పొమ్ము మీ గృహమున కున్". (విరా-౪ ఆ-౨౧౮). (కినుపు+పడు=కోపపడు).

పూజ్యతా వివక్షయందు మహత్తుల యేకత్వమున బహువచనము విభాష నగు. ఔచితినిబట్టి కవికి రుచించు నెడల నస్మదర్థకమునకును బూజ్యతా బహువచన ముండును. పూజ్యతా వివక్షయం దేకవచనాంతము పయిని 'గారు' శబ్దమును డుమంత బహువచనాంతములపై 'వారు' శబ్దమును షష్ఠీ సమాస గతములయి నిల్చును. కొన్ని యెడల నేకవచనాంతములపైని 'వారు' శబ్దము నిల్చుటయుఁ గలదు-౪౭. (ప్రౌఢ. శబ్ద-౩౯-మొ. ౪౩.) (వ్యా-సం-౨౧౧ IV విష)

I పూజ్యత :- గురువులు=(గురువు). (విరా-౫ ఆ-౧౨౦).
II కవికి రుచించినచో :- మేము వచ్చితిమి=(నేను వచ్చితిని) (ఆది-౪. -౨౭-దుష్యంత వాక్యము). గారు శబ్దము :- రాజుగారు=(రాజు యొక్క+గారు=రాజుకా+గారు=రాజుగారు. అత్తగారు-మామగారు-తండ్రిగారు- మొ వారు శబ్దము :- స్వాములవారు-రాములవారు- మొ. ఏకవచనముమీఁది వారు శబ్దము :- అత్తవారు-అమ్మవారు-రావువారు-పూసపాటివారు-రాచవారు-ఆర్వేటివారు- మొ.

పూజ్యతాతిశయంబున యుష్మద్బహువచనమున నాత్మార్థక బహువచనము నిల్చును. ౪౮. (ప్రౌఢ. శబ్ద-౪౫). (వ్యా-సం-విస్త-౨౧౧ IV విష).

స్వామీ తాము దయచేయవలయు. మొ-

అజ్ఞాత వస్తుప్రశ్నమునందును, నిర్దేశించి చెప్ప వీలులేని వస్తువు నుద్దేశించునపుడును నేకత్వమున

బహువచనము తఱుచుగా నిల్చును. ౪౯. (ప్రౌఢ. శబ్ద-౪౭). (వ్యా-సం-విస్త-౨౧౧ IV వివ).

అజ్ఞాత :- ఎవరక్కడ? నిర్దేశించి చెప్ప వీలులేని :- సీతా రాములలో నెవరు ముందు వచ్చిరి. ఒకరి వెనుక నొకరు వచ్చిరి. వీరిలో నొకరి నంపెదను. నీ వెవ్వరు. (విరా-౧ ఆ) తండ్రి పే రెవ్వరు? (జై-౬ ఆ) అది యెవ్వరు (నైష-3 ఆ) (చూ-ప్రౌఢ-శబ్ద-౪౭ సూ).

'అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పలు-పెక్కు-' శబ్దంబులయు, ద్విప్రభృతి సంఖ్యావాచకంబులయు, మహన్మహత్వార్థకంబులు నిత్యబహువచనాంతములు అన్నాదుల యమహదర్థకంబులు (సమూహార్థకములవలెనె) నిత్యైకవచనాంతంబు లగుచు బహుత్వమును బోధించును. ౫౦. (బా-అచ్చి-౨౪ సూ) (వ్యా-సం-౨౧౧ II వి).

అన్ని-అన్నిటిని (వస్తువులను). అందఱు (పురుషులు-(లేదా) స్త్రీలు)-అందఱన్-ఇన్ని-ఇందఱన్-మొ.

౧ వివ :-"వాని యన్నింటికంటె' (అను ౪ ఆ ౪3) అను రీతిని "అన్నాదు" లాపవిభక్తికములగుటంజేసి యివి యేకవచనాంతరూపమున నుండి బహుత్వార్థమును బోధించును. ఆవులు మూఁడు వచ్చుచున్నవి' అనురీతి నివి యేకవచన రూపమున నుండి బహువచన విశేషణక్రియలతో నన్వయించుచుండును. "జాతులు" మూఁటన్ (అను ౧-ఆ-౯౫). అన్నాదులవలెఁ గాక ద్విప్రభృతి సంఖ్యావాచకముల కమహత్త్వమునందును బహువచన రూపములు రుమగఁ గలవు. తొమ్మిదులు (చూడు-తత్స-౪౮ సూ) రెండువేలు-(చూడు-అచ్చి-౨౧ సూ). శరము లాఱయిదుల్ (కర్ణ-౧-ఆ-౧౧౧)

౨ వివ .-పలుశబ్దమున కమహత్త్వమున వ్యస్త ప్రయో

గము లేదు. పెక్కు-శబ్దమున కమహత్త్వమున నేకవచన బహువచన రూపములు రెండును గలవు. ఉదా.— పలు పలుకులు. మాటలు పెక్కేల? మాటలు పెక్కులేల? మహత్త్వమున 'పలువురు-పెక్కురు=పెక్కండురు-పెక్కండ్రు' అని యుండును.

అన్ని ప్రభృతుల ♦ విభక్త్యంత రూపసాధన ప్రక్రియను సూత్రించుటకన్న వాని సిద్ధరూపముల నుదాహరించుట లెస్స-౨౧. (బా-అచ్చి-౨౮). (వ్యా-సం-౨౧౧ I II విమ,).

"అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-ఆ - ఈ - ఏ-నీ-నా-మన - తా - శబ్దములును సంఖ్యావాచకములును" అన్ని ప్రభృతులు. వీనికిం గొన్ని సిద్ధరూపంబులు మాత్రము చూపెదను. శేషం బూహించుకొననగును. వీనిలోని డుమంతంబుల కెల్ల న్వాగమంబు పూర్వోక్తంబు (తత్స ౨౦ సూ) స్మరించునది. కొన్నిటి బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును నెఱుంగునది.

సంస్కృతమున సర్వాది శబ్దముల పయిఁ గొన్ని సుబ్విభక్తులు నిల్చునపుడును, గొన్ని తద్ధిత ప్రత్యయములు నిల్చునపుడును, బ్రుంవద్వ్యాద్వాది సామాసిక విషయములందును, దక్షిణ నామముల కంటె రూప వైలక్షణ్యా ముండుటం జేసి వాని కట్టె ప్రత్యేక సంజ్ఞ ప్రక్రియాలాఘవమునకయి సంస్కృత వైయాకరణులచేఁ గల్పింపఁ బడెను. విభక్తి రూపాదు లందలి యట్టి ప్రత్యేకత తెల్లున "అన్ని"

---

♦ సూరి సంస్కృతానుకరణంబున వీనికి సర్వనామసంజ్ఞ నంగీకరించి "అన్ని ప్రభృతులు సర్వనామంబులు" అని సూత్రించి (బా-అచ్చి-౨౮ సూ) అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు-ఆ-ఈ-ఏ-నీ-నా-మన-తా-సంఖ్యావాచకంబులు, అన్ని ప్రభృతులు" అని వివరించెను. ప్రాచీనాంధ్ర వ్యాకర్తలు సర్వనామసంజ్ఞ నంగీకరింప లేదు.

ప్రభృతులకు లేదు కొంద ఱాధునికులు చూపు ప్రత్యేకత యీ క్రింది రీతి నవిమర్శమూలక మనఁదగి యున్నది.

I బహుత్వమున 'లు-ల'ల చోట 'రు-ర'లు (ఉ-అ) వచ్చుట. ఉదా :- వారు-ఇరువురు-ఇరువురన్-అందఱు- మొ ఈ లక్షణము సర్వనామేతర నామములందును గలదు. ఉదా :- పగతురు-పగతురన్-అల్లురు-అల్లురన్-విలుకాండ్రు-విలుకాఁడు-చూపఱు- మొ.

II బహుత్వమున మహదాప్రదములవంటి నె "మహతీవాచకములు కగుట. ఉదా :- వారు=ఆ పురుషులు-ఆ స్త్రీలు. అమహన్మహత్త్వైకవచన రూపము లొక్క-రీతి నె యుండుట - అది-ఇది. ఇదియు సర్వనామేతర నామములందును గలదు. ఉదా :- హరి-నది-గురువు-వధువు. వచ్చిరి=పురుషులు (లేదా) స్త్రీలు. పక్షి వచ్చెను- మొ

III 'సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందుఁ బ్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు' (బా-కార-౨౬ సూ). ఇట్టి వ్రాఁత యవిమర్శనమూలకము. "మా యేపురందు(శల్య-౨.ఆ-౧౦౮). వాని యన్నింటి కంటె (ఉద్యో-౨-ఆ-౮౫)" అని పయి సూత్రమునకు విరుద్ధముగఁ బ్రయోగములు గలవు. మఱియుఁ బై సూత్రపుపద్ధతి సర్వనామేతర నామములందును గలదు. ఉదా :-తల్లి ద్రౌపదికోడన్ (జై-౧-ఆ) (చూ-ప్రౌఢ-కార-౨౨ సూ). సుగుణాభిరాముఁడు రామునకున్ (చూ-కార-3౨ సూ).

IV ఔపవిభక్తికత్వము. ఇది సర్వనామేతర నామములకుఁ బెక్కింటి కమహదేకత్వమునఁ గల్గును. సర్వనామములకును నన్నిటికినిలేదు. ఉదా :-నీటిని-నీటిన్-దానిన్-దానిచేతన్-ఆపక్షి తనచేతన్ ఓపక్షి నీచేతన్. మొ.

మఱియు సర్వనామ తాంగీకారమున సంస్కృత విలక్షణము

గను నీ యాధునికుల యాశయము వెలయుచున్నది వీరి మతమున 'తా' శబ్దము సర్వనామము తదర్థక సంస్కృత 'ఆత్మన్' శబ్దము సర్వనామము కాదు. సంస్కృతమున "ఏక-ద్వి" శబ్దములు తప్పఁ దక్కిన సంఖ్యావాచకములు సర్వనామములు కావు. ఆధునిక మతమున సంఖ్యావాచకము లెల్ల సర్వనామములె (చూ-బాల-అచ్చి-౨౮ సూ)

ఇంతియఁ కాక=సూరి ఎల్లన్' అనునది యవ్యయమని కంఠోక్తముగా వచించెను (చూ-బాల-సంధి-౨౮ సూ). ఎల్లరు' సర్వనామమని సూరి యుదాహరింపకున్నను ప్రౌఢవ్యాకర్త 'ఎల్లరు-ఎల్లరన్' మున్నగునవి సర్వనామములని సూత్రించి యుదాహరించెను. (చూ-ప్రౌఢ-శబ్ద-౧౬ సూ) తదాది శబ్ద సంబంధులగు-'అతఁడు' మున్నగునవి సర్వనామములని చెప్పియు సూరి తదాది శబ్ద సంబంధులె యగు "అంత-ఇంత-ఎంత-అందు-ఇందు-ఎందు-అపుడు-ఇపుడు' మున్నగు వానిని సర్వనామములుగా నుదాహరింపలేదు. ఇంతేకాక 'అంద్వాదు లవ్యయములనియు నాధునికులు తలంతురు. 'శ-ర' కోశమునందును సూ-రా-నిఘంటువునందును బై వానిలోఁ గొన్ని సర్వనామములుగా వ్రాయఁబడెను.

"అందఱు-ఇందఱు' మున్నగువాని వంటి రూపములె కల 'చూపఱు-పగఱు అనునవి, అందఱ్వాదులనఠె సర్వనామములు కావు

సర్వ-తావదర్థకము. ౫౨. (బా-3/౨౭. I అచ్చి)
(వ్యా-సం-౨౧౨ -I విష) ఇది 'ఆ' శబ్దమూలకము.

| మహ న్మహాత్వర్థకము. | అమహాదర్థకము. |
|---|---|
| ప్రథ. అందఱు=అందొఱు | అన్ని+అని (అచ్చి-౬౬సూ) |
| ద్వితీ. అందఱను=అందొఱను=అందఱిని | అన్నిటిని=అన్నింటిని-మొ. |

౧ వివ :- 'అంత+వారు = అందఱు. ఇంత+వారు = ఇందఱు' మున్నగు- ప్రౌఢ వ్యాకరణోక్త (ప్రౌఢ. శబ్ద-౮౮ సూ) వ్యుత్పత్తి

సరికాదు. అర్థసందర్భము లేదు. కాన నిది ఆ' శబ్ద సంబంధి యని మాత్రము చెప్పనగును.

౨ వివ :— అం దొఱకు నిట్టులనియె దుౖపద విభుఁడు (ఆది -౭ ఆ-౨౫౮). అందఱ కును మెలపునఁ జెప్పి వగలఁ గుందుచు (శల్య-౧ ఆ-౧౨ ప). అందఱి కిని దానవబాధఁ దీర్చి కృత కృత్యుండై. (పినవీర-శకుం-బాలక. ౧౨౮ పుట).

3 వివ :— సర్వతావదర్థక=సర్వార్థకమును 'తావ' దర్థకమును నని యర్థము.

ఇయ దర్థకము. ౫3. (బా - అచ్చ - 3/౨౮. II) (వ్యా-సం-౨౧3 వివ). ('ఈ' శబ్ద మూలకము. ఇయ చ్ఛబ్దార్థకము).

| మహ న్మహత్యర్థకము | అమహదర్థకము |
|---|---|
| ప్రథ. ఇందఱు............ | ఇన్ని=ఇని (అచ్చ-౨౬ సూ). |
| ద్వితీ. ఇందఱను=ఇందఱిని. | ఇన్ని టిని=ఇన్నింటిని- మొ. |

కియ ద్యావ దర్థకము-౫౮. (బా-అచ్చ-3/౨౮. III).(వ్యా-సం-౨౧3 వివ.)(సంస్కృత-కియ చ్ఛబ్దార్థకము. సంస్కృత యావ చ్ఛబ్దార్థకము. ఏ శబ్ద మూలకము)

| మహన్మహత్యర్థకము | అమహదర్థకము |
|---|---|
| ప్రథ. ఎందఱు .. | ఎన్ని=ఎని (అచ్చ ౨౬ సూ) |
| ద్వితీ. ఎందఱను=ఎందఱిని | ఎన్నిటిని=ఎన్నింటిని- మొ |

౧ వివ:— కియ దర్థము=ప్రశ్నార్థము. యావ దర్థము=సంబంధార్థము. ఉదా:- వీ రెందఱు. ఇవి యెన్ని. ఎన్ని గలవో యన్నియు, ఎందఱు గలరో యందఱును- మొ.

కతిప యార్థకము ౫౫. (బా-అచ్చ-3/౨౮. IV) వ్యా-సం-౨౧3. వివ.) (ఒక శబ్ద మూలకము. ఒక=

అల్ప 'కొంచెము' శబ్దపు మూలకమనెడి 'శ-ర' 'సూ-రా-ని' కోశములు సరికావు).

| మహ న్మహాత్మ్యర్థకము | అమహాదర్థకము |
|---|---|
| ప్రథ. కొందఱు .. .. .. .. | కొన్ని=కొని (ఆచ్ఛి-౨౬ సూ) |
| ద్వితీ కొందఱను=కొందఱిని | కొన్నిటిని=కొన్నింటిని- మొ. |

౧ వివ:—సంస్కృత కోశముల చొప్పున 'కతిపయ'' శబ్దము కతిశబ్దార్థకము. మహాకవి ప్రయోగములలో నది యల్పార్థకమై యున్నది కతిపయ దివసైః (నైష ౮ సర్గ-౧౨౧ శ్లో) "కతిపయ దివసైః=ద్విత్రై రేవ దివసైః'' (నారాయణీయ వ్యాఖ్య).

౨ వివ:— 'అందఱు-ఇందఱు-ఎందఱు-కొందఱు' శబ్దముల వలెనె చూపఱు-చూపఱున్=(చూచువారు). పగఱు=(పగవారు) పగఱున్'' అనువానిని సాధించికొనవలయును.

బహ్వర్థకములు. ౫౬. (గా-ఆచ్ఛి-3/౨౮. VI)
(వ్యా-సం-౨౧౮ విష) ('పెక్కు-పలు' శబ్దములు).

| మహ న్మహాత్మ్యర్థకములు | అమహాదర్థకములు |
|---|---|
| ప్రథ. పెక్కండురు=పెక్కండ్రు. | పెక్కు=పెక్కులు. |
| ద్వితీ. పెక్కండురను=పెక్కండ్రను | పెక్కిటిని=పెక్కింటిని |

| | |
|---|---|
| ప్రథ. పలువురు=పలుగురు<br>పలువుండురు=పలుగుండురు<br>పలువుండ్రు=పలుగుండ్రు<br>ద్వితీ పలువురను=పలుగురను<br>పలువుండురను=పలుగుండురను=పలువుండ్రను=పలుగుండ్రను | దీని కమహత్త్వమున వ్యుత్పత్తి లేదు. పలు పలుకు లు' మున్నగు రీతిని సమాసగతమె యిది యగును. |

తదర్థకము. ఆ-శబ్దము-౫౭ (బా-ఆచ్ఛి - ౪/౨౮)
(వ్యా-సం - ౨౧౫ II విష.) (ఆ-శబ్దము. వాఁడు-అది- మొ)

| | మహద్వాచక రూపములు ఏ | మహద్వాచక రూపములు బ | మహతీవాచకములు ఏ | మహతీవాచకములు బ |
|---|---|---|---|---|
| ప్ర. | వాఁడు, అతఁడు, ఆతఁడు | వారు=వారలు=వాండ్రు ('వాండ్రురు' అపశబ్దము) | అది | వారు—వారలు |
| ద్వి. | వానిని, ఆతనిని, అతనిని | వారిని=వారలను=వాండురను=వాండ్రను ('వాండ్రురను' అసాధువు) | దానిని | వారిని, వారలను |

— అమహద్వాచకములు —

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర:- | అది=అద్ది=ఆయది=అయ్యది | అవి=అవ్వి=ఆయవి=అయ్యవి |
| ద్వి:- | దానిని=ఆదానిని=అద్దానిని | వానిని=ఆవానిని=అవ్వానిని |
| తృ:- | దానిచేన్ = ఆదానిచేన్=అద్దానిచేన్ = దానన్ (ఇది తృతీయా సప్తమ్యర్థకము) | వానిచేన్=వానన్ (ఇది తృతీయా సప్తమ్యర్థకము) |

౧ వివ:- తదర్థకము=సంస్కృత తచ్ఛబ్దార్థకము. నామ పునర్గ్రహణమందును యచ్ఛబ్ద సంబంధమునందును నిది వాడఁబడును. ఉదా:- నామ:- రాముఁడు వచ్చె. వాఁడు గొప్పవాఁడు. సంబంధ:- ఏ రాముఁడు వచ్చెనో; వాఁడు గొప్పవాఁడు. నామ పునర్గ్రహణమునందును నామమునే వాడుట యరుదుగఁ గలదు. దేవతలను మాని, నలుని వరించుట వేల్పులు కోపించిరి (ఆర-౨ ఆ ౧౧౭). నామ పునర్గ్రహణమున 'ఈ' శబ్దము నిల్చుటయుఁ గలదు. ఉదా:- పురుషునకుఁ దేజంబు కర్మంబు-దీని విడిచి (సభా-౨-ఆ-౨౯౯).

౨ వివ:- అంత=(ఆ పరిమితి)-అందు = (ఆ చోటు) అప్పుడు=(ఆ కాలము)-అట్టు=అటు = (ఆ విధము)-అటన్ = (ఆ చోటియందు)-=అల్ల(నిర్దేశార్థకము) మున్నగునవి 'ఆ' శబ్దమూలకములు. వీనిలోఁ

గొన్నిటికిఁ గొన్ని విభక్తులందు మాత్రము వాడుక గలదు. అంతః- అంతన్-అంతటన్-అంతలు-అంతకున్- అంతనుండి - అంతకంటెన్-అంత లోన్- మొ. అందుః-అందుకయి-అందులకున్-అందుకున్-అందున్-అం దుండి-అందులోన్-మొ. అప్పుడుః-అప్పటినుండి-అప్పటికంటెన్-అప్పటి లోన్-అప్పటికిన్-మొ.అట్టు అట్టులు-అటులు-అట్టులన్-అట్లు-అట్లన్. మొ ("అక్కడ=అచ్చటు" అనునవి సమాసములు.)

3 వివః- 'ఆ' శబ్దము తచ్ఛబ్దార్థకమే యైనను వాని వాడుకలలో భేదము గలదు. 'తస్య + పుత్రః=తత్పుత్రః' అని యైనట్లు "వాని యొక్క+కొడుకు=ఆ కొడుకు" అని కానేరదు. 'వాని కొడుకు' అనియే యగును. (చూ-సమా-౭౨ సూ)

౪ వివః- ఆ శబ్ద రూపములు కొన్ని యెడల నర్థశూన్యము లగును ఉదాః- ఒక్క సత్క్రతువది మేలు (ఆది ౪ ఆ ౯౪) పుప్పుల యువ్విధంబునన్ (ఆది ౮ ఆ ౭౬).

౫ వివః- అల్ల శబ్దము నిర్దేశవాచకమగును ఉదాః-అల్ల యతి ధవళంబైన యశ్వంబు (ఆది-౨ ఆ-3౧).

౬ వివః-'అ-ఈ' శబ్దముల ప్రథమాంతములమీఁద 'ఎ' శబ్దము నిల్చిన నవి నిర్దేశవాచకము లగును. ఇవి ప్రాచీన రూపములు వీఁడె వచ్చెం గుంతిసుత మధ్యముండు (విరా ౪ఆ ౯౫) వాఁడె-అదె-ఇదె-అవె -ఇవె-వారె-వీరెః మొ. ఆ-ఈ' శబ్దముల ప్రథమాంతముల పయిని కొమ్ము రూపాంతరమగు 'కో' శబ్దము నిల్చినను నిర్దేశవాచకములె యగును. ఇవి యర్వాచీన రూపములు వాఁడుగో-వీఁడుగో-వారుగో- వీరుగో-అదిగో-ఇదిగో-అవిగో-ఇవిగో.(అడుగో-ఇడుగో-అరుగో-ఇరుగో -అదుగో-ఇదుగో-మొదలగునవి వ్యావహారిక రూపములు) ఇది 'కొమ్ము' శబ్దరూపాంతరము గాన "కళ" "అది గో కానంబడియె (వరాహ-౬ ఆ- ౮౪-సూ-రా-ని)". ఇది ద్రుత ప్రకృతికముగాను వాడఁబడును. "ఇది గోఁ బురుషాయితము (కళా-౧ ఆ-3౫)" ఈ పక్షమున నిది 'కొను'

ధాతువుయొక్క 'తుము'న్నంతరూప మనఁదగును. "నీవెత్త బంగారుగాను" అను దానివలెనె యర్థ విశేషబోధ మనఁదగును. 'ఇదె కొనుఁగాళ' అని దీని కర్థమెన్నునది. కళ యగునపుడు "ఇదె కొమ్ము" అని యర్థము చేయనగును "వీఁడు గొమ్మని చెయి సాచి (ఉ-హరి-౫ ఆ-౧౪౮). "ఇదియో" (ఆది-౬ ఆ-౧౭౩) ఇది యపపాఠము 'ఇదియాన్' అని కవి ప్రయుక్త మనఁదగును కాన 'ఇదియో' అనునది 'ఇదిగో' అను దాని పర్యాయ మనరాదు.

ఇదమర్థకము 'ఈ' శబ్దము. ౪౮. (బా-ఆచ్ఛి-౫/౨౪)
(వ్యా-సం. ౨౧౬ వివ)

| మహద్వాచకము ఏ | మహద్వాచకము బ | మహతీవాచకము ఏ | మహతీవాచకము బ |
|---|---|---|---|
| ప్ర-వీఁడు=ఇతఁడు ఈతఁడు. | వీరు=వీరలు=వీండురు=వీండ్రు-("వీండ్రురు" అసాధువు). | ఇది | వీరు-వీరలు |
| ద్వి-వీనిని=ఇతనిని=ఈతనిని | వీరిని=వీరలను=వీండురను-వీండ్రను ('వీండురన"అపశబ్దము") | దీనిని | వీరిని=వీరలను |

— అమహదర్థకరూపములు —

| ఏ | బ |
|---|---|
| ప్ర-ఇది=ఇద్ది=ఈయది=ఇయ్యది — | ఇవి=ఇవ్వి=ఈయవి=ఇయ్యవి. |
| ద్వి-దీనిని | వీనిని. |
| తృ-దీనిచేన్ | వీనిచేన్ |
| తృ-సప్త-దీనన్ — | వీనన్. (తృ-సప్త) |

౧ వివ :-ఇది 'ఇదమ్-అదస్-ఏతద్' అను సంస్కృత శబ్దముల యర్థము గలది. 'పురోవర్తిని-సమీపవర్తిని' దెలుపును నామ పునర్గ్రహణమున 'ఈ' శబ్దరూపములను వాడుటయుఁ గలదు. (చూ ౫౭-సూ. ౧ వివ). పురుషునకుఁ దేజంబు కర్మంబు దీని విడిచి (సభా-౨-ఆ-౨౬౫)

౨ వివ :_ఇంత= (ఈపరిమితి)-ఇందు = (ఈస్థలము) - ఇప్పుడు= (ఈసమయము) ('ఇక్కడ-ఇచ్చటు' అనునవి 'ఈ' శబ్దముతోడి సమాసములు) ఇట్టు=ఇటు (ఈవిధము) - ఇల్ల = (ఈసమీపస్థలము-నిర్దేశవాచకము)-ఇటన్ =(ఈస్థలమందు)-మున్నగునవి 'ఈ'శబ్దమూలక రూపములు. వీనిలో గొన్నిటికిఁ గొన్ని విభక్తుల రూపములు మాత్రము గలవు. ఇంత:_ఇంతన్-ఇంతటన్-ఇంతలు-ఇంతకున్-ఇంతనుండి - ఇంతటినుండి - ఇంతకంటెన్-ఇంతలోన్-మొ. ఇందు:_ఇందుకై - ఇందులకై - ఇందులకున్-ఇందున్-ఇందుండి-ఇందులోన్-మొ. ఇప్పుడు:-ఇప్పటినుండి-ఇప్పటికంటెన్-ఇప్పటికిని-ఇప్పటిలోన్-మొ.ఇట్టు=ఇటు:-ఇట్టులు=ఇటులు=ఇట్లు-ఇట్టులన్=ఇటులన్=ఇట్లన్-మొ.

౩ వివ :_'ఈ'శబ్ద మిదమాద్యర్థకమె యైనను వాడుకలో భేదము గలదు "ఏతస్య+పుత్త్రః=ఏతత్పుత్త్రః" అన్నట్లు "వీనియొక్క+కొడుకు=ఈకొడుకు" అని కానేరదు "వీనికొడుకు" అనియె కావలయును.

౪ వివ :_ ఈ' శబ్దరూపములును నరుదుగ నర్థశూన్యములుగా వాడఁబడును. ఉదా:_ఈమునిపల్లె నుండు టిది యేల?" (ఆది-౪-ఆ-౫౪). 'ఈ' శబ్ద మత్యంతసామీప్యమును దెల్పును. ఉదా._ఈయున్న పౌష్య ప్రోలికి (ఆది-౧-ఆ-౧౧౭).

౫ వివ :_'ఇల్ల' శబ్దము నిర్దేశవాచకము. "ద్రుపద-ఇల్ల కప్పడి సంగమేశ్వరంబందు (బసవ-౧-ఆ-౫౫౧). ఇతర ద్రావిడ భాషలలో విస్తారముగా వాడుకయున్నను దెల్గున ('ఉ'దూరసమీప మధ్యస్థవాచి) 'ఉ' శబ్దమునకు 'ఉల్ల' శబ్దమాత్రము గలదు ఉల్లతెల్లని తురగోత్తము వాలంబు (ఆది-౨-ఆ-౩౪).

౬ వివ :_'ఆ' శబ్దమునుండినలెనె (అచ్చు-౫౭-సూ-౬-వివ) ఈ శబ్దమునుండియు వివిధములగు నిర్దేశ వాచకములు బయల్వెడలును. వీఁడె-వీరె-ఇదె-ఇవె-(ఇవి ప్రాచీనరూపములు - వీడుగో = వీడుగోవ్=

వీరుగో-ఇదిగో-ఇవిగో-మొ (ఇడుగో-ఇరుగో-ఇదుగో - ఇవుగో-వ్యావహారిక రూపములు). ఇవి యర్వాచీన రూపములు.

యత్కిమర్థకము='ఏ' శబ్దము. ౫౯ (బా-ఆచ్ఛి-౬/౪౮ ౭/౪౯ సూ). వ్యా-సం-౪౭౭ విష).

— మహద్వాచక రూపములు —

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | ఏఁడు-ఏవాఁడు ఎవ్వాఁడు-ఎవ్వఁడు - ఎవఁడు-వేఁడు-(ఎతఁడు - ఏతఁడు - వీనికిఁ బ్రయోగములు లేవు) | ఏరు-ఏవారు-ఏవారలు - ఏవాండురు-ఏవాండ్రు-ఎవ్వారు-ఎవ్వారలు-ఎవ్వాండురు-ఎవ్వాండ్రు-ఎవ్వరు-ఎవ్వండురు-ఎవ్వండ్రు. ఎవరు-ఎవండురు-ఎవండ్రు-వేరు. |
| ద్వి. | ఏనిఁ-ఏవానిని-ఎవ్వానిని-ఎవ్వనిని - ఎవనిని - వేనిని. (ఎతనిని-ఏతనిని-ప్రయోగములు లేవు) | ఏరిని-ఏవారిని-ఏవారలను - ఏవాండురను-ఏవాండ్రను - ఎవ్వారిని- ఎవ్వారలను-ఎవ్వాండురను-ఎవ్వాండ్రను-ఎవ్వరిన్-ఏవ్వండురను-ఎవ్వండ్రను-ఎవరిని ఎవండురను-ఎవండ్రను-వేరిని. |

— మహతీవాచక రూపములు —

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | 'ఏది'=(ఎ స్త్రీ) అనెడి 'శ.ర' 'సూ-రా-ని' కోశములు ప్రామాదికములు. మహతి వాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థకశబ్దంబు "ఎవ్వరిత-ఎవ్వర్త-ఎవ్వత-ఎవరిత-ఎవర్త-ఎవత- ఎవ్వరితి-ఎవ్వర్తి-ఎవ్వతి-ఎవరితి. ఎవర్తి-ఎవతి-ఎవ్వరితె-ఎవ్వర్తె-ఎవ్వతె. ఎవరితె - ఎవర్తి - ఎవతె-ఎవ్వర్తుక-ఎవ్వతుక-ఎవర్తుక-ఎవతుక-" అని యిరువది రెండు రూపంబులు వడయును. | ఏరు-ఏవారు- ఏవారలు - ఎవ్వారు - ఎవ్వారలు-ఎవ్వరు ఎవరు-వేరు. |
| ద్వి. | ఎవ్వరితను-ఎవ్వర్తను - ఎవ్వతను - ఎవరితను - ఎవర్తను-ఎవతను-ఎవ్వరితిని-ఎవ్వర్తిని-ఎవ్వతిని-ఎవరితిని-ఎవర్తిని-ఎవతిని- మొదలగునవి | ఏరిని-ఏవారిని-ఏవారలను - ఎవ్వారిని-ఎవ్వారలను - ఎవ్వరిని-ఎవరిని-వేరిని. |

— అమహద్వాచక రూపములు —

| ఏ | బ |
|---|---|
| ప్ర ఎది-ఏది-ఎద్ది-ఏయది-ఎయ్యది | ఎవి-ఏవి-ఎవ్వి-ఏయవి-ఎయ్యవి. |
| ద్వి దేనిని-ఎదానిని-ఎద్దానిని | వేనిని-ఏవానిని-ఎవ్వానిని. |
| తృ దేనిచేతన్.. ......... | వేనిచేతన్ |
| తృ-స ప్త. దేనన్ (దీనికిఁ బ్రయోగములు లేవు) | వేనన్. (దీనికిఁ బ్రయోగము లేదు) |

౧ వివ :- సంస్కృతమందలి యచ్ఛబ్దము తచ్ఛబ్ద సంబంధమును దెల్పును కింశబ్దము ప్రశ్నార్థకము. తెలుఁగున నీ రెండర్థములను నొక్క- "ఏ" శబ్దమె యొసంగును. కాన నిది యత్కి-మర్థక మయ్యెను. ఉదా - ఎది హృద్యమో యది మాకిష్టము (ఆ-౧ ఆ-౩౦) ఎవ్వరు కురు పాండవులలో మొదట రణమునకు దిగిరి (భీష్మ-౧ ఆ-౨౩౨).

౨ వివ :- 'వేఁడు' శబ్దము మహాకవి ప్రయుక్తము. క పార్థుఁడు వేఁడీ (ద్రోణ-౩ ఆ-౪౬). వేఁడు రాముండు (రామా-౭ ఆ-ప్రౌ-శబ్ద-౫౩) వేఁడీ డాఁగె నొకో (ద్రోణ-౧ ఆ-౩౭౪). వేఁడీ దయోదార విమల మానసుఁడు వేఁడీ... వేఁడీ.. (రంగ-రా-౧౨౨౧-౧౨౨౨-పద్య-౧౪౦-పుట యూని-ముద్రి).

౩ వివ :- ఏ శబ్దరూపములు 'ను' శబ్దాంతములై సాకల్యముం దెల్పును. ఉ :- ఎవ్వరుం జెప్పరు. ఎవ్వరికం జెను (ఆర-౨ ఆ-౩౪౧). 'అందరును-అందఱికం జెను' అని యర్థములు.

౪ వివ :- 'ఇ-ఈ' లతోఁ గూడిన 'ఏ' శబ్ద ప్రథమా రూపములు 'ఎక్కడ నున్నాఁడు' మున్నగు నర్థ విశేషముల నిచ్చును. "క పార్థుఁడు వేఁడీ (ద్రోణ-౩ ఆ-౪౬) ఏది యేదీ యిది చాలఁ గ్రొత్త (కళా-౧ ఆ-ప్రౌఢ-శబ్ద-౮౭).

౫ వివ :- ఇది యత్కి-మర్థకమె యయ్యు వాడుకలో భేదము లున్నవి. "యస్య+పుత్రః=యత్పుత్రః" అనునట్లు "ఎవ్వనియొక్క+ కొడుకు=ఏకొడుకు" అని కానేరదు. "ఎవ్వని కొడుకు" అనియే యగును.

౬ "ఎంత=(ఏ పరిమితి) - ఎందు=(ఏచోటు) - ఎప్పుడు=(ఏ సమయము)-(ఎక్కడ-ఎచ్చటు' అనునవి 'ఏ' శబ్ద ఘటిత సమాసములు). ఎటక్=(ఏస్థలమందు)"-మున్నగునవి 'ఏ' శబ్దమూలకములు. వీనిలోఁ గొన్నిటికిఁ గొన్ని విభక్తుల రూపములు మాత్రము గలవు ఎంత--ఎంతన్-ఎంతటక్-ఎంతకున్-ఎంతలోక్-ఎంతటినుండి - ఎంతనుండి. ఎందు :- ఎందుకున్-ఎందులకున్-ఎందున్ - ఎందుండి - ఎందులోన్. ఎప్పుడు :- ఎప్పటినుండి-ఎప్పటికిన్ - ఎప్పటికంటెన్ - ఎప్పటిలోన్. ఎట్టు=ఎటు :- ఎట్టులు-ఎటులు-ఎట్లు-ఎట్టులన్-ఎట్లన్. మొ.

తదాదులు మహతీవాచకంబులు "ఆమె-ఆపె-ఆకె. ఈమె-ఈపె-ఈకె. ఏమె-ఏపె-ఏకె' అను పూజ్యార్థక రూపంబులు వడయు. ౬౦. (బా-ఆచ్ఛి-౮/౨౮). (వ్యా-సం-౨౧౮ విమ). †

'అతఁడు-ఆతఁడు-ఇతఁడు-ఈతఁడు' అను మహద్వాచకముల కిట్టి పూజార్థకత లేదు "అతగాఁడు-ఆతగాఁడు-ఇతగాఁడు-ఈతగాఁడు" అను రూపము లర్వాచీనములు 'ఆయన-ఈయన' మున్నగు సమాస రూపము లుత్తరపదముల శక్తిచేఁ పూజ్యార్థకములు కానోపును. 'ఏమె'=(ఏపూజ్యురాలు) అను వాడుకకుఁ గవి ప్రయోగము లభింప లేదు

యుష్మదర్థకము 'నీ' శబ్దము ౬౧ (బా-ఆచ్ఛి-౯/౨౭ సూ) (వ్యా-సం-౨౧౯ I విమ).

---

† 'అతఁడు-ఇతఁడు' మున్నగునవియుఁ బూజ్యార్థకములె యని సూరి వ్రాసెను. కాని కవి ప్రయోగములం దట్టి పూజ్యతా నియమము లేదు "ఏమిసెసె నితఁ డీతని తమ్ముని గూలనేసియు క్రేక్కిన పార్థు పైఁ గవిసెనే.. అక్కడ వీఁడు లేఁడె (ఉద్యో-౨ ఆ-౧౬-౨ ప). "వాఁడిట వచ్చువాఁడొ యే సందుల కేఁగుదాన నొ రయంబున నాతని నిశ్చయింపఁగా" (ఆర-౨ ఆ-౨౦౩) దమయంతి నలునివిషయమున వాడిన వాడుక లివి.

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | నీవు=ఈవు (ఆర-౧-ఆ-౪౬) | మీరు = మీర్ = మీరలు = మీరల్=ఈరు=ఈరలు = (ఆది-౭ ఆ-౨౧౯) |
| ద్వి. | నిన్నునున్=నిన్నున్=నినున్=నిన్ (ఆది ౬ ఆ-౧౪౫) | మిమ్మున్=మిమున్ ('మిమ్ములన్' అపశబ్దము). |
| తృ. | నీచేతన్ .. ........ | మీచేతన్. |
| ష | నీకున్=ఈకున్ (చాదా౨-౩ ఆ-౧౧౮) | మీకున్ = ఈకున్ (శివరా - ౪ ఆ-౬౩ |

అస్మదర్థకము-'నా' శబ్దము. ౬౨ (బా-ఆచ్ఛి-౧౦/౨౪ సూ) (వ్యా-సం-౨౧౯ I విష).

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | నేను=ఏను=నేన్=ఏన్—— | మేము=ఏము = నేము (శ్రీరంగ-౩ ఆ-౫౯-౧-ప) |
| ద్వి | నన్నునున్=నన్నున్=ననున్-నన్ (అను-౩-ఆ-౨౬౨ ప). | మమ్మున్=మమున్ ("మమ్ములన్" అపశబ్దము) |
| తృ | నాచేతన్... ..... | మాచేతన్ |

ఉభయార్థకము 'మన' శబ్దము. ౬౩ (బా-ఆచ్ఛి-౧౧/౨౪ సూ) (వ్యా-సం-౨౧౯ I విష)

'నీవును నేనును' అని యర్థము. నిత్యబహువచనము.

ప్ర- మనము ద్వితీయ.- మనలను (ఆది-౮ ఆ-౬౩) తృతీ:- మనచేతన్. మనలచేతన్ (ఇది నన్నయ సమ్మతము కాదు) (ఉ-హరి-౬ ఆ-౫౪).

ఆత్మార్థకము='తా' శబ్దము ౬౪. (బా-ఆచ్ఛి-౧౨/౨౪ సూ) (వ్యా-సం-౨౧౯ I విష)

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | తాను... ... ... | తాము=తారు_తమరు(ఇద్ది నన్నయ సమ్మతముకాదు) (కృష్ణ-౨-ఆ-3౮) (సూ-రా-ని). ఇట 'తారు' అనియు నిల్పనగును. |
| ద్వి | తన్నునున్=తన్నున్=తనున్=తన్ (ఆది 3 ఆ ౧౧౦) | తమ్మున్=తమున్. |
| తృ. | తనచేతన్ ... ... ... | తమచేతన్. |

౧ వివ:_'తా' శబ్ద మర్థ విశేష బోధకమునగు (నామాస్మ దర్థాభిధాయి) (ప్రౌఢ శబ్ద-౭౮). తనకు మఱి తాన చుట్టంబు (ఆది_౪_ఆ ౫౮) (తనకు=స్త్రీకి) తన కిష్టుఁడున్ (ఆది_౧ ఆ_౨౫) (తనకున్=నాకున్) నామ పునర్గ్రహణంబునందును 'తా' శబ్దము నిల్చుట గలదు. ఉదా:_ విదురుఁడు తాను ప్రబోధించె (ఆది_౬_ఆ_ప్రౌఢ_శబ్ద_౭౭ సూ)

౨ వివ _కర్తృ బహుత్వంబున 'తన తనకు' 'తమతమ యగు'. తమతమ పుత్త్రుఁడుగా (ఆది_3_ఆ_ప్రౌఢ_శబ్ద_౭౯) తనతన (శల్య_౨_ఆ_౧౮౦).

3 వివ :_ 'తా' శబ్ద బహువచనము సంబంధార్థమునందును నిల్చును. "ద్విపద_తమయన్న... అమలమానసుఁడు ... (రంగ_రా_అయోధ్యా_౧3౨_పుట. యూని_ముద్ర)) (చూ - వ్యా_సం_౨౧౧ IV వివ. ౮౪౦ పుట)

ఏకార్థక సంఖ్యావాచి 'ఒక' శబ్దము. ౬౫. (బా-ఆచ్ఛి-౧3-౧౪_౧౫/౨౪ సూ) (వ్యా-సం_౨౨౦. I II వివ).

మహదర్థక రూపములు

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. | ఒకఁడు | ఒకరు_ఒకండురు_ఒకండ్రు. |
| | ఒకొఁడు | ఒకొరు_ఒకొండురు_ఒకొండ్రు. |
| | ఒకట్టఁడు | ఒకట్టరు_ఒకట్టండురు_ఒకట్టండ్రు. |

| ఏక | బహు |
|---|---|
| ఒక్కొ్కఁడు | ఒక్కొ్కరు-ఒక్కొ్కండురు-ఒక్కొ్కంద్రు |
| ఒకరుఁడు | ఒకరులు-ఒకర్లు-ఒకళ్ళు |
| ఒకొరుఁడు | ఒకొరులు-ఒకొర్లు-ఒకొళ్ళు |
| ఒక్కరుఁడు | ఒక్కరులు-ఒక్కర్లు-ఒక్కళ్ళు |
| ఒక్కొ్కరుఁడు | ఒక్కొ్కరులు-ఒక్కొ్కర్లు-ఒక్కొ్కళ్ళు |
| ఒకరువుఁడు | ఒకరువులు |
| ఒకొరువుఁడు | ఒకొరువులు |
| ఒక్కరువుఁడు | ఒక్కరువులు |
| ఒక్కొ్కరువుఁడు | ఒక్కొ్కరువులు |
| ఒరుఁడు | ఒరులు-(ఇతరార్థకము-ఏకార్థకము) |
| ఒరువుఁడు | ఒరువులు ( |
| ఒండు | ఒండులు=ఒండ్లు-( |
| ఒడ్డు | ఒడ్డులు=ఒడ్లు-(          ) |

౧ వివ —ఒకొఁడు —సీ-అతిగించు కొనఁడె భూదేవుఁడొక్కొ్కరుఁడు గినిసి (ఆర-౫-అ-౨౦) కం-కురిసినఁ దత్క్షణమె యొక్కొ్కొనిపై నేనున్ (ఆర-ర ఆ-౬౧) ఒకళ్ళు - ఒరువులు -కం-గిరిజయు గిరీశుఁడును నొం డొరువులకై తపమొనర్చి యొకరు నొకళ్ళన్ (అను-3-ఆ-౧ర౧) ఒరులు=ఇతరులు -క మాయ ట్లిడుమలఁ బడిన నరులు కులకైయొరులు పరమ మునీందా్రి (ఆర-౨-ఆ-3 ప) ఒకళ్ళు=స్త్రీ వాచకము చ. ఒకళ్ళొకళ్లకై యెదురుగ వచ్చి యొక యిద్దఱు ముద్దియ లొత్తి రవ్విభున్-(నైష-3-ఆ-౮౬ ప) ఈ శబ్దము రూపముల కెల్లఁ బ్రయోగము లియ్యలేదు గాన యథా ప్రయోగముగ నెన్నునది

మహత్వార్థకములు

(వీనిని సైతము యథా ప్రయోగముగ నెన్నునది)

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | ఒకరిత-ఒకర్త-ఒకర్తు-ఒకర్తుక-ఒకత-ఒకతుక - | ఒకరు - ఒక్క- |
| | ఒకొరిత-ఒకొర్త-ఒకొర్తు-ఒకొర్తుక-ఒకొత-ఒకొ | రు-ఒకొరు- ఒ |

| ఏక | బహు |
|---|---|
| తుక-ఒక్కరిత-ఒక్కర్త-ఒక్కర్తు-ఒక్కర్తుక-ఒక్కత - ఒక్కతుక-ఒక్కొరిత-ఒక్కొర్త-ఒక్కొర్తు-ఒక్కొర్తుక-ఒక్కొత-ఒక్కొతుక-ఒకరితి-ఒకర్తి-ఒకతి-ఒకొరితి- ఒకొర్తి-ఒకొతి-ఒక్కరితి-ఒక్కర్తి-ఒక్కతి-ఒకొక్కరితి-ఒకొక్కర్తి-ఒకొక్కతి-ఒకరితె-ఒకర్తె-ఒకతె - ఒకొరితె-ఒకొర్తె-ఒకొతె-ఒక్కరితె-ఒక్కర్తె-ఒక్కతె-ఒకొక్కరితె-ఒకొక్కర్తె-ఒకొక్కతె-ఓర్త-ఓర్తి - ఓర్తు-ఓర్తుక | కొరు -ఒకరులు - ఒకర్లు ఒకళ్ళు-ఒకొరులు- ఒకొర్లు ఒకొళ్ళు)-మొదలగునవి—— |

అమహద్వాచకరూపములు

| ఏక | బహు |
|---|---|
| ప్ర ఒకటి-ఒకొటి-ఒక్కటి-ఒకఁడు - ఒకొఁడు-ఒక్కఁడు-ఒకొక్కఁడు-ఒండు-<br>ఎక్కటి-ఒంటి' అనునవి యసహాయార్థకములై యేకత్వమును బోధించును<br>ఒకఁడు-ఒకొఁడు - ఒక్కఁడు - ఒకొక్కఁడు-ఒండు అనునవి యాపవిభక్తికములు——<br>ఉదా -ఒకఁటన్=ఒకంటన్ మొ | అమహత్త్వమున బహువచనము లేదు- 'ఒకట్లు' 'ఒక్కట్లు' అనునవి యగపడుచున్నవి |

౨ వివ. ఒకొఁడు-(ఒకటి) '-క ఒకొక్కండును లేదధిప నీదు కొడుకులు (స్త్రీ-౧ ఆ-౮౩) ఒకొక్కట నందఱు గురు ననుజ్ఞ గొని (ఆది-౫ ఆ-౨౩౩) క-యాగ కరణం బునఁ దక్కఁగ నొంటఁ గలుగఁ బోలునె చెపుమా (శాంతి-౫ ఆ-౩౦౮) ఒకటి -చేయుక౦! లెను హితమైన కృత్య మొకటిం గలదే (ఉద్యో-౩ ఆ-౧౫౮) ఎక్కటి ఒంటి -ఎక్కటి కయ్యము చ-అసమున ఒంటి ననుట (విరా-౫ ఆ-౨౩౮)

ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు మహన్మహత్త్వమహదర్థకంబులు ౬౬. (బా-అచ్చి-౧౬-౧౭/౨౮ సూ). (వ్యా-సం-౨౨౨-౨౨౩ వివ)

| మహన్మహత్త్వర్థకములు | అమహదర్థకములు |
|---|---|
| ఇద్దఱు=ఇరువురు | రెండు |
| మూవురు=మువ్వురు=మువురు | మూఁడు |

| మహ న్మహత్యర్థకములు | అమహ దర్థకములు |
|---|---|
| నలుగురు | నాలుగు |
| ఏదుగురు=ఏవురు | అయిదు=ఏను |
| ఆఱుగురు | ఆఱు |
| ఏడుగురు | ఏడు |
| ఎనమండురు=ఎనమండ్రు (చూ-ఆచ్ఛి-౧౭ సూ ౧ వివ). | ఎనిమిది |
| తొమ్మండురు=తొమ్మండ్రు | తొమ్మిది |
| పదురు=పదుండురు | పది |
| పదుండ్రు=పదువుండురు=పదువుండ్రు | |
| పదునొకరు | పదునొకటి |
| పన్నిద్దఱు=పన్నిరుగురు | పండ్రెండు |
| పదుమూవురు | పదుమూఁడు |
| పదునలువురు | పదునాలుగు |
| పదునైదువురు | పదునైగు=పదునేను |
| పదునాఱువురు | పదునాఱు |
| పదునేడువురు | పదునేడు |
| పదునెనమండురు | పదునెనిమిది |
| పందొమ్మండురు | పందొమ్మిది |
| ఇరువండురు | ఇరువది |
| ఇరువదియొక్కరు | ఇరువదియొకటి |
| ముప్పండురు | ముప్పది |
| నలువండురు | నలువది |
| ఏఁబండురు | ఏఁబది |
| అఱువండురు | అఱువది |
| డెబ్బండురు | డెబ్బది |
| ఎనుబండురు | ఎనుబది |
| తొంబండురు | తొంబది |
| నూఱువురు | నూఱు |
| వేవురు | వేయి |

— ఇత్యాదులుహ్యాంబులు —

౧ వివ — ఇరువురు' మున్నగువాని వు వర్ణముచోట గు వర్ణ మర్వాచీనముగా నాదేశమగుచున్నది. *. కాన 'ఇరువురు' మున్నగు పై యుదాహృతులం దెల్ల ఇరుగురు' అను గ' కార ఘటిత రూపాంతరములను గ్రహింపవలయును. లక్ష్లై ఏనమండురు-తొమ్మండురు-పదుండురు' మున్నగుచోటులం దుల్లోపము (చూ-ఆచ్ఛి-౧౨ సూ) చేసి ఎనమంద్రు' మున్నగు రూపాంతరములను గ్రహింప వలయును అక్లై 'నల్వురు-ఆర్వురు మున్నగు రూపాంతరములను గ్రహింపవలయును (ఆచ్ఛి-౨౯ సూ) అక్లై అయిదు=ఐదు-పదునయిదు=పదునైదు మున్నగురీతిని రూపద్వయమును గ్రహింపవలయును (క్రియా-౧౦౭ సూ)

౨ వివ — గ్రంథ విస్తరభీతిచే నుదాహరింపలేదు గాన పై పట్టికలో ఒకరు' మున్నగుచోట్ల వాని వాని రూపాంతరములను జేర్చిన రూపములను సయితము గ్రహింపనగును ఉదా -పదునొకరు=పదునొక్కరు=పదునొకొరు=పదునొక్కొరు-మొ (చూ-ఆచ్ఛి-౬౫సూ) పదునొకర్తు-పదునొకొర్తు-మొ (చూ-ఆచ్ఛి-౬౫ సూ) పదునొకట=పదునొక్కొటి=పదునొక్కఁడు-పదునొక్కొఁడు = పదునొకంటన్-మొ (చూ-ఆచ్ఛి-౬౫ సూ)

---

* సూరి గు వర్ణమునె నిల్పి గ కారమునకు వ కారమును విధించెను (బా-ఆచ్ఛి-౨౭ సూ) కాని వీనిలోని గ కార మర్వాచీనము వ కారమె ప్రాథమికము మూఁడు + వారు=మూవురు వేయి+వారు=వేవురు ' అని వాని వ్యుత్పత్తిని గ్రహింపవలయును గకార ఘటిత రూపములు ప్రాచీనకాలమున లేనే లేవు క దేవర వేవురు (ఆర-౨-ఆ-3৯3) ఉ ఆర్వురు ఉర్వి (విక్ర-౨-ఆ 3౭) ఆదేశాశ్చ వు రూ రశ్చ అని యధర్వణుఁడు వ కార ఘటితమునే విధించెను (వ్యా-సం-౨౨౦-౨౨౮ వివ) ' బాంధవ=బంధుగు'' మొ వికృతులు నిట్టివి గలవు

3 వివ — పం(డెండు' మొదలగుచోటులందు యును' శబ్ద ఘటిత రూపములును గన్పట్టుచున్నవి ఉదా - పదియు రెండు = పం (డెండు-మొ. అక్క-అ-వనమునఁ బదియు రెండేఁడులు (ఆది 3 ఆ ౧౯) పదియు నొక్కం(డు రు(దుల (కాశీ 2 ఆ (పౌఢ)

౪ వివ — ఇరువది' మున్నగువానికి ఇరునై' మున్నగునవి యర్వాచీన రూపాంతరములు గన్పట్టుచున్నవి మ-ఇరునై నాలుగు మూర్ల మేర (కాశీ ౧ ఆ ౫3)

౫ వివ —' ఎనిమిది + నూఱు = ఎనమన్నూఱు - తొమ్మిది+ నూఱు = తొమ్మన్నూఱు అను రూపములును వానికి ఎనమ నూఱు-తొమ్మనూఱు అను రూపాంతరములును గన్పట్టుచున్నవి గీ తొమ్మనూఱును దొంబదితొమ్మిదియును (భీమ ౬ ఆ - ౬౮) తొంబనూఱును' అనెడి 'శ-ర సూ-రా-ని కోశముల పారము లపపారములు

౬ వివ —సంఖ్యావాచకములకు మహత్త్వమున వారు శబ్ద ముతో సమాసము( వురు=గురు' అనునవి నిల్వనపుడని తాత్పర్యము) గల్గనపుడు మహత్త్వమందును పదులు-నూఱులు-వేలు మున్నగు లు' వర్ణక ఘటిత రూపములై యరుదుగ నిల్చును ఉదా - అబ్జ నాభులు నూఱు నైదు పదులు (కాశీ ౬ ఆ) అసుర లఱువది వేలు (ఆర-౪ ఆ-౮౧) బ్రాహ్మణు లెనిమిది వేలు .. యతులు పది వేలు (ఆర-౪ ఆ-3౦౬) పౌఢ వ్యాకర్త వీని నమహత్కార్య ఘటిత విశేష రూపములుగ సూతి)ంచుట సరికాదు ((పౌఢ-శబ్ద-౧౦౪ సూ) (చూ-వ్యా-సం-౧౮౬ IV ౨౧౧ I ౨౨౨-వివ) పై స్థలము లందు ఎనిమిది వేవుర' మున్నగునవి వారు శబ్దసామాసిక రూప ములని గ్రహింపవలయును

2 వివ —షష్ఠీ సమాసమున 'షష్ఠి ద్వితీయా తుల్యరూప మున నిల్వక సంఖ్యావాచక సమాసమునఁ బ్రధమా రూపమున

నిల్చుట కొన్ని యెడలఁ గలదు (చూ-సమా-౭౨ సూ విస్మృతి) ఉదా - ఇరువది యొకటి - ముప్పది రెండు- మొ ఇట షష్ఠి ద్వితీయా రూపమున నిల్చినచో ఇరువదిటియొకటి-ముప్పదిటి రెండు మున్నగు రీతి గల యనిష్టరూపము లవతరించును- ♦

౮ వివ - అమహదర్థక సంఖ్యావాచకములగు 'ఒకఁడు'*. రెండు- మొదలగునవి రూపవిభక్తిక శబ్దములగుటం జేసి వాని ద్వితీయాద్యేకవచనములందు టి-ంటి అనునవి వచ్చును (రూపవిభక్తికముల వివరణము ముందు చేయఁబడును). ఉదా -ఒకటిని-ఒకటన్- రెండిటిని=రెండింటిని = రెంటిని=రెంటను- మూఁడిటిని=మూఁడింటిని= మూఁటిని=మూఁటన్ ఇత్యాదులు

౯ వివ - ఒక శబ్దంబునకు ఒకానొక - ఒరిమ (ఐకమత్యము) ఒంకొక (మఱియొక)-కొండొక (అల్ప) ఒండొండ=(ఒకటి నెంబడి నొకటి) ఒండొరులు-(పరస్పరము) మున్నగు రూపము లర్థవిశేషము లందుఁ గన్పట్టును క ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్ - (విరా ౧ ఆ ౧౬) దీనికి సూరి వాడిన శ్లోకానొక యను నర్థము (శా-ఆచ్ఛి-౨౮ సూ) కానరాదు ఒక శబ్దమున కల్పార్థకత్వమును గలదు ఒక నూఱేఁడులు(మార్క-౦-౫ ఆ) ద్వి శబ్దార్థంబునకు ఇనుమడి =(రెండు రెట్లు) ఈరాఱు' = (పండ్రెండు) ఈ రేడు'=(పదునాల్గు) ఇబ్బడి= ఇమ్మడి = (ద్విగుణిత) అనునవి యర్థవిశేషంబులం జూపట్టును ఇరాఱు = (పండ్రెండు) అను రూపమును కూచిమంచి తిమ్మకవి' మాత్రము వాడెను (రుక్మి ౧-ఆ-౯౩)

---

♦ శాల - ప్రౌఢ వ్యాకరణ పద్ధతి నిట్టి యనిష్టరూపములు దుర్వారములు

* సూరి రెండు మొదలగునవి రూపవిభక్తికము లనుట పొరపాటు తే గీ తక్కొకటను లేదు-(స్వర్గా-౧-ఆ-౫౨)-ఒక్కట (ఆది-౫ ఆ-౨౩౩) పదునొకొంటికి (ఉద్యో-౪ ఆ-౧౪౦) సూరిగా రుదాహరించిన ఒకట్టు శబ్ద మేకోశమందును గానరాదు

సంఖ్యకుఁ బూరణార్థమున 'అవ' ప్రత్యయము
తుదిని నిల్చును అది యుత్తరపదముతో సమసించియె
యుండును ౬౭. (బా-ఆచ్ఛి-౨౪ సూ) (వ్యా-సం-
౨-౨౮ విప).

రెండవవాఁడు రెండవది. మూఁడవ పారము.

౧ వివ —దేనిచేత సంఖ్య పూరింపఁబడునో యది పూరణార్థక మనఁబడును రామకృష్ణు లిద్దఱిలోఁ గృష్ణుఁడు రెండవవాఁడు" అనుచో 'రామకృష్ణు' లిద్దఱును ద్విత్వ సంఖ్యావయవములె యైనను గృష్ణుఁడు ద్విత్వసంఖ్యను బూరించుచున్నాఁడు గానఁ గృష్ణుఁడు రెండవవాఁ డనవలసెను

౨ వివ — అందు-కై ప్రత్యయ స్థలములందు వలెన అవ' ప్రత్యయ స్థలమందును స్వరయతియె చెల్లును ఉదా - సీ ఆయువు మొదలి నాలవ పాలు (శాంతి-౫ ఆ-౧౩౬) (ద్విపద-ఆదట ద్వాపర మందు విష్ణుండు (బసవ-౬ ఆ-౮౦౯) అనఘ మా మామ శకుని నాకై కడంగి (సభా-౨ ఆ-౧౭౮).

3 విన — అవు-అగు' అను తద్ధర్మార్థక ధాతుజ విశేషణములె యేతత్ప్రత్యయ స్థలములం దెల్ల గ్రహింపఁదగుననుట సరికాదు. పైయి శాంతిపర్వపద్యమందు 'నాలవ పాలు అనుచో నాలవు అనిన యెడల నాలుగు భాగములను ననిష్టార్థంబు గల్గును మఱియు నాల్గవు పాలు' అనక నాలవు పాలు' అనుటలో 'గ'కార లోపము గల్గు టెట్లు? అవ' ప్రత్యయస్థలమన్ననో ప్రకృతి ప్రత్యయముల యోగమున నట్టి వర్ణలోపాదికము సహజమై యుండును ఇంతియ కాక ప్రామాణికాగ్రసరుఁడగు నథర్వణుఁడు 'సమాసేఽవ స్తు సర్వదా'' అని అవ ప్రత్యయ స్థితి నంగీకరించి యున్నాఁడు సీ ఆయంబునందు నాలవ, భాగ మొండె మూఁడవ భాగ మొండె నం దర్థమొండె (సభా - ౧ ఆ-౮౭) అని నన్నయయుఁ బ్రయోగించియున్నాఁడు

అన్ని ప్రభృతులకును తదన్విత క్రియలకును మహతీ
బహుత్వమున మహద్బహువచన రూపములె యగు
౬౭ (బా-అచ్చి-౬౬ సూ) (వ్యా-సం-౨౨౫ I విష)
(చూ-తత్స-౧౭ సూ-౧ వివ)

వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు వీరు ముగ్గురును శ్రీ భూ నీ
ళలు వారు=(ఆ స్త్రీలు) వచ్చిరి స్త్రీ లందఱును వచ్చుచున్నారు.
పదుగురు స్త్రీలు గలరు- మొ --

అచ్చిక గ-వ లు కొన్ని యెడలఁ బరస్పరము విభా
షగ నాదేశము లగును పదాది గ కారమునకు వ
కా రాదేశము లేదు ౬౯ (బా-అచ్చి-౭౭ సూ)
(వ్యా-సం-౨౨౬ I)

వకారమునకు గకారాదేశము - ఆర్వురు=ఆర్గురు పలువురు=
పలుగురు మువ్వురు=ముగ్గురు నల్వురు=నల్గురు ఇరువురు=ఇరుగురు
బందువు = బందుగు (బాంధవ) పనడము = పగడము (ప్రవాళ)
ఇవము=ఇగము (హిమ) గ కారమునకు వ కారాదేశము -అగిసె=
అవిసె (అగస్త్య) అగు=అవు తిగ=తివ (త్రికము) దుగ = దువ
(ద్వికము) వేసఁగి=వేసవి (వైశాఖ) చిగురు=చివురు- పదాది వ
కారము గకారమగుట - వారు=గారు వాఁడు = గాఁడు గీము,
గాము మున్నగుచోట్ల గకారమునకు వకారాదేశము లేదు ♦
కొన్ని యెడల ననుటచేత చవుతి-వీడు-ఎవఁడు-చదువు మున్నగు
చోట్ల గకారాదేశము లేదు చాగము-(త్యాగ) అగసాలె-అగిని
మొదలగు చోటులందు వ కారాదేశము లేదు ♦

---

ఆర్వురు మున్నగు చోటులలోని వురు=గురు ' అనునవి
వారు శబ్ద రూపములె కదా చూ - ౬౬ - అచ్చి - టిప్పణము)
(చూ-సమా-౯౧)

♦ సూరి అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు
వకారంబు విభాష నగు అని సూత్రించుట కేవలము నవిమర్శన
మూలకమని పై వివరణోదాహృతులవలన విశదమగుచున్నది గదా.

'ఇ-టి-ంటి-ఇంటి ~ తి - ఇతి-అటి' ప్రభృతు లౌపవిభక్తికములు ౨౦ (బా-అచ్చి-౩౮ సూ)(వ్యా-సం-౩౩౨ I వివ )

కొన్ని జడవాచక స్త్రీసమ నామముల విభక్తులకుఁ బూర్వమున నాగమములుగాను గొన్ని యెడల నాదేశములుగాను 'ఇ-టి' ప్రభృతులు నిల్చును అవి యౌపవిభక్తికము లనఁబడును.

ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరమగునపుడు మాత్రమె యాచ్ఛిక స్త్రీ సమ జడవాచకములకు బహుళముగా నగును ♦ -౨౧ (బా-అచ్చి-౩౯ సూ) (వ్యా-సం-౩౩౨ I వివ )

'పరివాళము-బాన్ధవము మున్నగు పరికృతులనుబట్టి పవడము-బందువు' మున్నగునవి పారిథమిక రూపము లనుటలో సందియము లేదు గదా ఇరు+వారు అను వ్యుత్పత్తి చొప్పున 'ఇరువురు' అను వ' కార ఘటిత రూపము పారిథమిక మనకతీరదు గదా (చూ-అచ్చి-౬౬ సూ టిప్పణి).

---

* సూరి ఇ-టి-తి వర్ణంబు లౌపవిభక్తికములని సూత్రించి హ్రస్వముమీఁది టి వర్ణము పూర్ణబిందు పూర్వకమగునని సూత్రించెను (భా-అచ్చి-౩౮-33 సూ) దీర్ఘముమీఁద నీంట అని కలదే. (చూ-౨౩ సూ-౧ వివ) ఈ రీతినె క్రిందంటికి-అప్పంటిని-నెత్తుంటిని-అంతంటికంటె మున్నగు పూర్ణబిందు ఘటితములగు ననిష్టరూపములు దుర్వారములగును మఱియు పదియింటిని (ద్రోణ-3-ఆ ౩౮) (ఆశ్వ ౪ఆ౧౫౩) (అను 3-ఆ-30)మున్నగు రూపము లీతని పక్షమున లభింపనేరవుగదా

♦ ఔపవిభక్తికత్వము బహుళమని సూరి చెప్పకుండుట సరికాదు నెత్తురురొంపి (కర్ణ-౧ ఆ ౧౨౯) నెత్తుటఁ జొత్తిల్లె (ద్రోణ ౩ ఆ ౩౦౨) (ద్రోణ ౫ ఆ-౮౩) మొదలిటి సంపదలంతో (సభా-౩ ఆ ౩౦౩) మొదల నప్రియ మయ్యె (సభా-౩ఆ ౧౯౩) నీరన్ (శాంతి ౩ ఆ ౧౨౧) నీటిని (ఉద్యో ౩ ఆ ౩౯) అంతకంటెన్ (శాంతి ౬ ఆ ౫౯౮) అంతటికంటె (శాంతి ౬-ఆ-౬౦౩,

(అచ్చి-౭౨ సూ ౧-౨ వివ ఔపవిభక్తికము. ఆలిన్-కూఁతురన్-గోతులు అనా

టి-ంటి – అన్ని-అన్నిటిని-అన్నింటిని రెండు-రెండిటిని-రెం డింటిని-రెంటిని (ఆదేశ) నెత్తురు-నెత్తుటిని ఇంటి '- పది-పదియిం టిని-పదిటిని-పదింటిని తి -గోయి-గోతిని-నేయి-నేతిని ఇతి '-అట్టు- అటితిని-కొట్టు-కొటితిని అటి -క్రిందు-క్రిందటిని-అప్పుడు-అప్పటిని.

౧ వివ –ఆలు-ఆలిని-కూఁతురు-కూఁతురిని మున్నగు నజడ వాచకములందలి ఇ వర్ణ మౌపవిభక్తికము కామింజేసియే వానికి వేఱుగ ఇ వర్ణము సూత్రింపఁబడెను (చూ-అచ్చి-౯-౧౧ సూ) *

౨ వివ – గోతులు-నేతులు మున్నగు బహువచన స్థలము లౌపవిభక్తిక విషయములు కామింజేసి యచటి తి'వర్ణము వేఱుగ సూత్రింపఁబడెను (చూ-అచ్చి-౨౧ సూ) ♦

ఊరు మొదలగువాని కిత్వంబగు ౭౨ (బా- అచ్చి-౩౦ సూ) (వ్యా-సం-౨౨౮ విష)

ఊరు-ఊరిని-(చూ-తత్స-౨౮ సూ) కాలు-కాలిని (మాను -మ్రానిని నోరు-నోరిని చోటు-చోటిని

౧ వివ.– ఇ వర్ణము వచ్చు స్థలములందు 'టి-ంటి అను నవి నిల్చుటయుఁ గలదు ఉ -నోఁరికి వచ్చిన (కర్ణ-౩ ఆ-౮౭). కమ్మని నోరన్ (మనుచ-౩ఆ-౧౨౩) గీ నోటి మాట నోటనె యుండ (కాశీ-౨ ఆ-౩౬) నీరు -నీరన్ (శాంతి-౨ ఆ-౧౭౧) మున్నీటన్ (ఉద్యో-౨ ఆ-౩౯) సౌఖ్యరసంబు నీంట (విరా-౨ ఆ-౩౧౦). ఉ నీంటను మనం బొంటికి (హరి-ఉ భా-౭ ఆ-౯౪) దీర్ఘము మీఁదను గందు సున్న వచ్చెను

౨ వివ – ఇ అను నౌపవిభక్తికము వచ్చు శబ్దములలోఁ

---

* ఇట్టి ఇ' వర్ణమును సూరి సూత్రించి సంగ్రహింపనే లేదు.

♦ సూరి గోయి-గోతులు-గోతులన్ అను బహువచనమం దలి తి వర్ణకమును నౌపవిభక్తికమె యను తలంపున నౌపవిభక్తిక ముల సందర్భమున నేకవచనముతో పాటుగ విధించెను

20½ (అచ్చి-౨౩ సూ ౨/౭౨) ఊర్వ్యాముల ఆ త్త్వము సప్తమ్యర్థకము మాత్రమె

గొన్నిటికిఁ (అచ్చి-౮౦ సూ) తృతీయా సప్తములు రెంటను 'అ' త్వము వచ్చును కొన్నిటికి - ఊరు-చోటు-మేను' ప్రభృతులకు సప్తమ్యర్థమున మాత్రమె అత్వము వచ్చును తృ-స -కాలన్= కాలియందున్-కాలిచేతన్ చేతన్=చేతిచేతన్-చేతియందును- మొ. సప్తమి మాత్రము -ఊరన్=(ఊరియందు) ( ఊరిచేతన్ అను నర్థము లేదు) చోటన్=(చోటియందు) మేనన్=(మేనియందు)-మొ వీనికి 'నన్' అను సప్తమీ ప్రత్యయము వచ్చుటయుఁ గలదు ప్రోలన్= ప్రోలునన్ (ఆర-౬ ఆ-౮౦) పోరన్-(ఆర-౩ ఆ-౧౧౩) - పోరునన్ (శల్య - ౧ ఆ-౧౨౧) తేరన్ = (తేరియందు) (ప్రాస) (ఉద్యో-౨ ఆ-౧౫౨) తేరునన్ (ఆము-౫ ఆ-౧౦౧ 'కడ శబ్దము త్రిక సమాసమున నొపవిభక్తిక మగును ఎక్కడియది (ఆది-౬ ఆ-౩౪) ఏకడకు నైనన్ (ఉ-హరి-౬ ఆ-౨౭౬) అక్కడన్=(ఆచోటియందు)- ఇక్కడన్-ఎక్కడన్-( అక్కడన్ ఆచోటిచేత ననరాదు)

'టి వర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదే
శంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిఁ
బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు కొన్ని
టికి ఇంటి అనునది యాగమమగును ౨౩ (బా-
అచ్చి-౩౧ ) (వ్యా-సం-౨౫ విష ) (౭౬-౭౫-
చొప్పున బూర్ణము)

ఆదేశము - త్రాడు-త్రాటిని కాడు-కాటిని నోరు-నోటిని ఏఱు-ఏటిని నీరు-నీటని నీంటిని (హరి-ఉ భా ౭ ఆ-౯౬) (చూ- వ్యా-సం-౯ ౩౬ పుట) ఆగమము -అన్ని-అన్నిటిని=అన్నింటిని ఎని మిది-ఎనిమిదిటిని=ఎనిమిదింటిని వేయి-వేయిటిని=వేయింటిని. ఉభ యంబు - ఏమి-ఏటిని_ఏమిటిని పగలు-పగటిని = పగలిటిని=పగలిం టిని మొదలు-మొదటిని మొదలిటిని రెండు-రెంటిని=రెండిటిని= రెండింటిని మూఁడు-మూఁటిని=మూఁడిటిని=మూఁడింటిని నాలు-

నూటిని=నూఱిటిని=నూఱింటిని ఇంటి —పది-పదియింటిని-(ద్రోణ-౩ ఆ-౨౨౮-మూ-వ్యా-సం-౯౩౦ పుట) = పదిటిని = పదింటిని మొ 'టి-ంట విధానముచే 'టి' వర్ణకము ఖండపూర్వకము కానేరదని యెఱుంగునది

ద్రుతప్రకృతికమీఁది టి' వర్ణకంబునకు ముందు పూర్ణబిందువు బహుళంబుగ నగు-౭౮ (బా-అచ్చి ౩౨ సూ) (వ్యా-సం-౨౫ విమ)

అన్నిటిని=అన్నింటిని ఎనిమిదింటిని పగంటిని - పగలింటిని రెండింటిని-మూఁడింటిని బహుళగ్రహణముచేత నెత్తుటిని - మొదటిని-క్రిందటిని - మీఁదటిని - తంగెటిజున్ను (మను-౧ ఆ-౬౬) మున్నగు చోటులందుఁ బూర్ణబిందువు రానేరదని యెన్నునది

పదాద్యంబగు ద్రుతప్రకృతికమీఁది 'టి'వర్ణంబునకు ముందు పూర్ణబిందువు నిత్యముగా నగు ౭౯ (బా-అచ్చి-౩౩ సూ) (వ్యా-సం-౨౨ విమ)

కన్ను-కంటిని మిన్ను-మింటిని ఇల్లు-ఇంటిని పల్లు-పంటిని ఎఁడు' ప్రత్యయాంతములకు నిత్యమె బారెంటను- జుట్టెంటిలో (చూ-తద్ధి ౩౦ సూ ౨ విమ)

ట వర్ణంబు పరంబగునపు డుత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు ౮౦ (బా - అచ్చి-౩౬ సూ) (వ్యా - సం - ౨౨ విమ) (౭౯_చొప్పున నిందు తి' వర్ణము విధువఁబడెను)

రెండు-రెండిటిని మూఁడిటిని-పెక్కిటిని కొన్ని యెడల నీ 'ఇత్వము గలుగదు ఉదా - నెత్తుటిని ఎదుటికిన్ పుసుటికిన్- మొ (దీనిచే 'పదియింటిని అను రీతివి సంగ్రహింపఁబడనేరవు)

క్రిందు-మీఁదు-ముందు పువర్ణంబులకు అటి అనునది బహుళముగ నిల్చును ౮౧ (బా-అచ్చి-౩౭ సూ) (వ్యా-సం-౨౩౦ విమ)

క్రిందు-క్రిందటిని మీఁదు-మీఁదటిని ముందు - ముందటిని. పువర్ణ —మాపు-మాపటిని. అప్పుడు - అప్పటికిన్ సేపు - సేపటికిన్ బహుళంబనుటచే సేపునకున్' అనియుఁ గలదు ఆ-వె ఒక్కించుక సేపునకుఁ దేటి యిట్టులనియె నాదు . ..(అశ్వ-౨-ఆ౭౯) కం. ౯ వదిలో మఱికొంత సేపునకు (శాంతి ౪-ఆ ౧౦) (నిర్వ ౧౦ ఆ ౯-౫)

గోయి ప్రభృతుల తుది యక్షరంబున కాదేశముగా
తి' వర్ణంబు నిల్చు ౭౮ (బా-అచ్చు - ౩౫ సూ)
(వ్యా-సం-౨౩౨ I వివ).

గోయి-గోతిని తాయి-తాతిని. చేయి-చేతిని దాయి-దాతిని (సమీప) నూయి-నూతిని నేయి - నేతిని వాయి - వాతిని (నోరు) రోయి-రోతిని (భస్మము) (శ-ర రొయ్యి-రోయి-మాత్రము) (బహుత్వపు 'తి యౌపవిభక్తికము కాదు చూ ౨౧-అచ్చు గోతులు-నేతులు మొ )

అట్టు మొదలగు శబ్దంబుల కంతాగమంబు ఇత్తి'
వర్ణంబును శకటంబున కొక్కటికి లోపంబు నగు ౭౯
(బా-అచ్చు-౩౮ సూ) (వ్యా-సం-౨౩౧ వివ)

అట్టు-అటితిని అట్టు-(మెడ) కట్టు-గొట్టు-(దుక్కిసాధనములు) - కొట్టు - మిట్టు - వట్టు '=(పరివాహము) ఇవి యట్టు ప్రభృతులు. వీనికి 'అచ్చు-౮౦ సూ- చొప్పున అత్వమునిల్చునపుడు ఱు' అనునదె నిల్చును అట్టు-అటుతన్=(కంఠమందు) 'గొట్టు-గొటుతన్-'గొటుతన్' అని శ్లేషస్థలమునఁ గవిపితామహుఁడు వాడెను. (మను-పీఠ-౯ ప) దానికి నిపాత న్యాయమున సాధుత్వ మంగీకరింప నగును స్వరలోపమున గొర్తన్' (సంజ్ఞా ౧౮ సూ ౧ వివ) అనియుఁ గలదు ద్విపద-పంపి మాండవ్యుండు సరిఁ గొర్తఁ బడియె (బసవ ౫ ఆ ౩౮-౨)

ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం
బాదేశంబు బహుళంబుగా నగు ౨౦ (బా-అచ్ఛి-
౩౭ సూ) (వ్యా-సం-౨౩౩ వివ)

గోరను గీఁతెను. ఊర నున్నాఁడు. గొడ్డట నఱికెను ఇంట లేఁడు వఱుతఁ గలిసె కఱుత దూఁటె పక్షంబునందు- గోరిచేత ఊరియందు ఇత్యాదులు

౧ వివ —బహుళ గ్రహణముచేత ఊరను-ఇంటను-చోటను-మేనను మున్నగునవి సప్తమ్యర్థకములు మాత్రమె యని గ్రహింపవలయును (చూ-ప్రౌఢ-శబ్ద-౧౦౬ సూ)

౨ వివ —సూత్రమున విధింపఁబడిన 'అత్వము తస్సె-౨ సూత్రము చొప్పున నుగాగమాంత మగును గాన ద్రుతప్రకృతిక మగును ఉదా -గోరు-ద్వి-గోరిని తృ-స-గోరను-ము

— ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము —

---

# బాలవ్యాకరణోద్యోతము

## V కారకపరిచ్ఛేదము

వివ — విభక్త్యర్థములను విశదపఱుచునది కారకపరిచ్ఛేదము కర్తృ కర్మ కరణసంప్రదానాపాదానాధికరణములలో నొకటి కారక మనఁబడును కారకము క్రియనాకాంక్షించును అనఁగాఁ గారకము క్రియాన్వయము గల్గియుండును శేష షష్ఠి ( యొక్క-షష్ఠి) సంబంధార్థకము కారకము కానేరదు. రామునియొక్క ధనము అనుచో రామునియొక్క' అను శేషషష్ఠి ధనము' అను విశేష్యముతో నన్వయించును కారక శేషమె శేషషష్ఠి ప్రతిపదికార్థ ప్రథమయు సం

బోధనమును గారకములు కానేరవు

ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు

౧ (బా-కార-౧) (వ్యా-సం-౨౩౮ I విమ)

ప్రాతిపదికార్థమునందును సంబోధనమునందును బ్రత్యయాదులచేఁ జెప్పఁబడిన యర్థమునందును బ్రథమా విభక్తి యగును

౧ విమ —శబ్దములు మూఁడు విధములు I ధాతువులు (వ్యాపార బోధకములు) II ప్రాతిపదికములు III ప్రత్యయాదులు ధాతువు గానట్టియు సుప్తిజ్ ప్రత్యయములు గానట్టియు 'సుప్_తిజ ప్రత్యయాంతమును గానట్టియు నర్థవంతమగు శబ్దము ప్రాతిపదిక మనఁబడును ఇది కృత్తద్ధిత ప్రత్యయాంతమును సమాస రూపమును గావచ్చును అవ్యుత్పన్నమగు శబ్దమును గావచ్చును

౨ విమ — నియతోపస్థితికము ప్రాతిపదికార్థము అనఁగా శబ్దముచ్చరింపఁబడునంతనె దోఁచెడి యర్థము ప్రాతిపదికార్థము జాతి వ్యక్తి లింగ వచనము లన్నియుఁ బ్రాతిపదికార్థములె ప్రాతిపదికము మీఁద నిల్చు సుప్పులు ద్యోతక మాత్రములు అనఁగా నన్నియం దుండు దహానశక్తి ప్రకటితమగుటకు శుష్కేంధనము సాధనమైనట్లె ప్రాతిపదికమువల్లనే వచ్చెడి యర్థములకు సుప్పులు మున్నగునవి ద్యోతకము లగునని తాత్పర్యము

౩ విమ — ప్రాతిపదికార్థ పరిధము సాధారణముగాఁ గోశాది ప్రసిద్ధము ఉదా రాముఁడు-వనము-పుస్తకము-అన్న-తండ్రి-తల్లి- మొ అన్యవిషయమునఁ దగిలియున్న వాని నభిముఖీకరించుట సంబోధనార్థము ఇందును బ్రథమయె నిల్చును ఉదా -ఓరాముఁడ-రాముఁడ-

---

* తేనసంబంధస్య క్రియానిమిత్తత్వాభావా న్న కారకత్వమేవం లిఙ్గార్థ సంబోధనయోరపీతి ' (ముగ్ధ-౩౧౬ సూ - దుర్గాదాస వ్యాఖ్య

రామా-మొ వృత్తాది సంబోధనమున నభిముఖీకరణ మౌపచారిక మని యెఱుంగునది.

౮ వివ — ఉక్తార్థ ప్రథమోదాహరణములు–రాముఁడు రావణుని జంపెను ఉక్తమనఁగాఁ బ్రత్యయాదులచేఁ జెప్పఁబడినది పై వాక్యమున నాఖ్యాత మనఁగా ధాతువు మీఁది లిట్టు (ఎను ప్రత్యయము) కర్త్రర్థకమనఁగాఁ (క్రియా–౫౮ సూత్రము చొప్పునఁ గర్తను జెప్పుచున్నది గానఁ బునరుక్తముగాఁ (ఉక్తార్థానా మప్రయోగః) గర్త్రర్థమున రావలసిన తృతీయ రానేరదు. ఇంకఁ గేవల ప్రకృతి ప్రయోగ యోగ్యము కాదు గావున (న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాపి ప్రత్యయః) వాక్య ప్రయోగ యోగ్యమగు పదత్వపు సిద్ధికయి ప్రాతిపదికార్థ ప్రథమ వచ్చునని గ్రహింపవలయును ఇట్లె రామునిచే రావణుఁడు చంపఁబడెను' అనుచో నాఖ్యాతముచేఁ గర్మము చెప్పఁబడుచున్నది గానఁ (క్రియా ౫౮ సూత్రము చొప్పున) గర్మార్థమందు రావలసిన ద్వితీయా విభక్తి రానేరదు ఇంక వాక్య ప్రయోగార్హతకై ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును

౫ వివ — కృత్తద్ధిత ప్రత్యయాదులచేఁ జెప్పబడిన యర్థమందును బయిరీతిని బ్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును * ఉదా – 'ఈశ్వరుఁ డర్చ్యుఁడు' అనుచో (అర్చ్+య=అర్చ్య) ఘ్యణ్ ప్రత్యయముచేతఁ గర్మార్థము చెప్పఁబడుచున్నది. (ముగ్ధ–౨౮౦ - దుర్గాదాస వ్యాఖ్య) (మా–సి–కౌ–బాల–మ–వ్యాఖ్య ౫౩_౨ సూ) కావునఁ గర్మార్థమందు రావలసిన ద్వితీయ రానేరదు ఇంకఁ బ్రాతిపదికార్థ ప్రథమయె పదత్వ సిద్ధికయి వచ్చును ఇట్లె కరణాద్యర్థక ప్రత్యయాంతముల యెడలను

---

* బాల వ్యాకరణమున సమాపక క్రియలందలి యాఖ్యాతము మాత్రమె యుదాహరింపఁబడెను కృత్ప్రియాదుల యర్థములం దితర విభక్తులు రాక ప్రాతిపదికార్థ ప్రథమ వచ్చుట యుదాహరింపఁబడ లేదు

 (కార-౨ సూ ౧-౨ వి) అనుక్తకర్మంబున ద్వితీయ యగును

ద్వితీయాదులు రాక ప్రాతిపదికార్థ ప్రథమయే వచ్చుచుండును

క్రియా ప్రకరణము ౨౮ సూత్రమందలి యాది శబ్దముచే భావార్థకాది ప్రత్యయములను (క్రియా ౮౬ మొ-౨౭ వ-క్రియా ౬౭ సూ) గర్తృకర్మాద్యర్థములను వచించును గాన నట్టి యర్థములందు రావలసిన తృతీయా ద్వితీయాదులు రానేరవు అట్టి యెడల నయితము ప్రాతిపదికార్థ ప్రథమయె వాక్యప్రయోగ యోగ్యపదత్వ సిద్ధికై వచ్చును ♦ క' నిను సౌమ్యుఁడవని యెఱిఁగితి (శాంతి-౩-ఆ-౨౬.) మున్నగుచోటులందు అని అనెడి శబ్దముచేతఁ గర్మము చెప్పఁబడెను గాన ద్వితీయ రాక ప్రాతిపదికార్థ ప్రథమయె వచ్చెను

కర్మంబున ద్వితీయ యగు ౨ (బా-కార-౨)

(వ్యా-సం-౨౩౫. I విమ)

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు. దేవదత్తుఁడు వంటకమును వండెను ఇట వండెననుటకు వంటఁ జేసెనని యర్థము వంట ఫలము చేయుట వ్యాపారము వంట యనఁగాఁ బాకము (మెత్తనగుట) పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యె నని యెఱుంగునది

౧ వివ —తిఙాది ప్రత్యయములచే ననుక్తమగు కర్మంబున ద్వితీయ యగును కారకార్థ ముక్త మయిన నో ద్వితీయాదికము రానేరదని యీవఱకు వివరింపఁబడె (కార-౧ సూ ౬-౫-విన)

౨ వివ —సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధములగు కర్మ ప్రవచనీయార్థములలో నొకటగు నిత్థం భూతాఖ్యానార్థమునఁ దెలుఁగునందుఁ

---

♦ వయి సంకర్భమునుబట్టి భావార్థకాది (క్రియా-౮౬ మొ. ౨౭-వ) యోగంబునం గర్తకుం బ్రథమ యగు (బా-కార-౩-౨ సూ) అను సూత్రము వ్యర్థమె యనఁదగు రామునిచేఁ గార్యము చేయఁబడుట సంభవించె మున్నగుచోట్లఁ గర్మకారకాదులందును బ్రాతిపదికార్థ ప్రథమయె వచ్చుచు కర్తకే యన నేల ?

గొన్ని యెడల కూర్చి విభక్తి నిల్చును (గుఱిచి-గుఱించి మున్నగు నవియు విభక్త్యర్థాభిధాయక శబ్దములు)-ఒకానొక ప్రకారము నొందిన దాని విషయమును దెల్పునది 'ఇత్థం భూతాఖ్యానము'' ఇట్టి యర్థమున వచ్చు కూర్చి. విభక్తి పరమగునపుడు ప్రాతిపదికమునకు 'ను'గాగమ మగును ఉదా - ఆశమీకపుత్త్రుఁ డంబుజ సంభవుఁ గూర్చి (గుఱిచి-ప్రారా) తపము చేసె' (ఆది-౨ ఆ-౧౯౯) అంబుజ సంభవ విషయక తపశ్చరణ మిందుఁ జెప్పఁబడినది. ఇట్టి వైషయిక సప్తమీస్థలములె తెల్గునఁ గర్మ ప్రవచనీయ కూర్చి' కుదాహృతులు (సంస్కృతమునకు మాఱుగ నుండవలెనని యిట్లు చెప్పఁబడెను కాని యివియు నుద్దేశార్థకములు కాకపోవు ఆపతి కురుజననాథుం గూర్చి పలికె (శల్య-౨ ఆ-౫౦) అను రీతిగల చోటులందలి కూర్చి = గుఱిచి = గుఱించి' శబ్దములు వైషయిక సప్తమీస్థలములు కామింజేసి ద్వితీయ కనుప్రయుక్తములగు శబ్దవిశేషములని యెఱుంగునది ఏది లోపించినను నర్థభంగము కల్గదో యది యనుప్రయుక్త మనఁబడును అట్టి యనుప్రయుక్త కూర్చి' ప్రభృతులు లోపించుటయుఁ గలదు సుతున్ హతుఁ డయ్యెనని విని (సుతుం గూర్చి విని) (ద్రోణ-౫ ఆ-3౦౫) వేఁటఁ బోయిరి (వేఁటం గూర్చి పోయిరి) (అర-౬ ఆ-౧౬3) ఇట్టి యెడల 'కూర్చి' మున్నగునవి లేకున్నను నర్థభంగములేదు గాన నివి యనుప్రయుక్త శబ్దము లనవలసెను.

3 వివ – తెల్గునందును ద్వికర్మకముల వాడుక గలదు. ఉదా - వాఁడు రాజును ధనమును యాచించెను. ఇట్టి యెడల ధనము' ముఖ్య కర్మము - రాజును' అనునది యముఖ్యకర్మము మైత్రేయుఁడు చైత్రుని గూర్చి యీ క్రింది వాక్యమును బల్కెను 'కట్టుము పట్ట మతని'(ద్రోణ-౧ ఆ-౬౨) ఈ ద్వికర్మకస్థలములం దముఖ్యకర్మవాచకమునకు 'ను' వర్ణకాదులు వచ్చుట తెలియుచు (చూ-కార-౯ సూ) యాచ్ఞార్థకము లును-పచాది ధాతువులును ద్వికర్మకములు అప్రేరణమున సకర్మకము

ప్రేరణమున ద్వికర్మకము కొన్ని యెడల నగును.

గతి-బుద్ధి-ప్రత్యవసానార్థ-శబ్దకర్మ-కాకర్మకంబుల
కప్రేరణంబునఁ గర్త యగునది ప్రేరణంబునం గర్మం
బగు. 3. (బా-క్రియా-౧౨౩) (వ్యా-సం-౨౩౬ I వి)

పొందు మొదలగునవి గత్యర్థకంబులు. తెలియు మొదలగునవి బుద్ధ్యర్థకంబులు తిను మొదలగునవి ప్రత్యవసానార్థకంబులు విను-చెప్పు-చదువు మొదలగునవి శబ్దకర్మంబులు. వచ్చు-పోవు మొదలగునవి యకర్మకంబులు ప్రసిద్ధంబులు. ఉదా-గత్యర్థ-అప్రే-మైత్రుండు గ్రామంబుం బొందెను ప్రేర-చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించె చైత్రుండు ప్రేరణకర్త. లాంతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి-అప్రే-మైత్రుండు పుడమి నేలెను. ప్రేర-చైత్రుండు మైత్రుని బుడమి నేలించెను చైత్రుండు మైత్రునిచేఁ బుడమి నేలించెను

౧ వివ'-ప్రయోగ-ద్రోణ గాంగేయులు. నిన్నద్ది గఱపిరి (ఆది-౮ ఆ-౪౩) శిష్యులను వేదంబులఁ జదివించె (శాంతి-౬ ఆ-3౯౯). ఆచార్యులజ్జనపతిని శాస్త్రములను వినిపింతురు (శాంతి-౪ ఆ-3౪౦). అబ్బాదిని శుక్రుని దాగించిరి (ఆది-3 ఆ-౧౧౪) లాంతి చోటులు-దేవతల నేలించున్ దివిలోకంబులన్ (నన్ని-కు-౧౦ ఆ-౫౦౬). క్రతువుల నమ్మహాత్మ్మని జేయింపరే (శాంతి-౧ ఆ-౨౮౭). అవనీభర మాతనిం బూన్చి (సభా-౧ ఆ-౫౯) మొ

అప్రేరణ కర్త్రు వాచకము ప్రేరణమున ద్వితీయాం
తము కానపు డది కొన్ని యెడలఁ దృతీయాంతమును
గొన్ని యెడల షష్ఠ్యంతమును నగును. ౪ (బా-క్రియా-
౧౨౪ సూ) (వ్యా-సం-౨౩౭ I విష) (ఇచట షష్ఠి
తృతీయా పర్యాయమని సూరి భ్రమించెను.)

ద్వితీయ-అప్రే-భరతుఁడు రాజ్యము నేలెను ప్రేర-రాముఁడు భరతుని రాజ్యమును నేలించెను (ఇది యీావల నుదాహృత మయ్యె)

(కార-3 సూ) ప్రేరణకర్త ప్రయోజకకర్త యనిపించుకొనును అప్రేరణ కర్త ప్రయోజ్యకర్త యగును. షష్ఠి -అప్రే-అర్జునుండు తత్వంబుం డెలిసెను ప్రేరి-కృష్ణుఁ డర్జునునకుఁ దత్వంబుం డెలిపెను (కృష్ణుఁ డర్జునుని దత్వంబుం డెలియఁజేసెను) అప్రే-రాముఁడు రామాయణమును వినెను. ప్రేర-కుశలవులు రామునికి రామాయణమును వినిపించిరి=కుశలవులు రామునకు రామాయణమును వినిపించిరి అప్రే-ఉత్తరుఁ డర్జునుని యన్నలం దమ్ములం గనియె ప్రేర-అర్జునుఁడు త్తరునిఁ దన యన్నలం దమ్ములం గానిపించెను (విరా-౫ ఆ-౩౭ ౨) అచట వీరులకు నా భుజావిభవముం గానిపించి (విరా-౪-౨-౨=3) ఇట్టి ప్రయోగములచేఁ గన్యాదియోగంబునందును షష్ఠి వైకల్పికమె యని విశదమగుచున్నది *.

చేతవర్ణకంబు కర్త కగు ౫ (బా-కార - 3 సూ)
(వ్యా-సం-౨౩౮ I విష)

ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త నాఁబడు దేవదత్తునిచే వంటకము వండఁబడియె ననఁగా వంట చేయఁబడెనని యర్థము చేయుట కాశ్రయుం డగుటంజేసి దేవదత్తుఁడు కర్త యయ్యె కావున నట్టి కర్తృవాచకము చేత' వర్ణకాంత మయ్యె

౧ వివ — దేవదత్తునిచే అను వాక్యము కర్మార్థకము. దీని కర్త్రర్థకవాక్యము — దేవదత్తుఁడు వంటకమును వండెను అనునది

౨ వివ —కర్మార్థమునందు ద్వికర్మక వాక్యములలో నొక కర్మము నిల్చును తక్కిన కర్మ మభిహితమై ప్రాతిపదికార్థ ప్రథమాంత

---

* సూరి యిట్టి స్థలమునఁ గర్మార్థకము నుదాహరించుటయుఁ గన్యాదియోగంబున షష్ఠి నిత్యమనుటయు భ్రాంతి మూలకములు (చూ-వ్యా-సం-౨౩౭ I విష ౯౭ పుట) బాల-క్రియా ౧౨౭ సూత్రము నుదాహృతులు ప్రామాదికములు రామునకు మిథిల గనంబడియె' ననఁగా రామునకు మిథిల యగపడెనని యర్థము రామునిచే మిథిలఁ గనంబడియె' అనఁగా రామునిచే మిథిల చూడఁబడెనని యర్థము

మగును. ఉదా - రాజును బెద్ద దొరలును జీరల నొలుపఁబడిరి (మా-క్రియా-౧౧ సూ ౨ వివ) దీని కర్త్రర్థకవాక్యము - రాజును పెద్ద దొరలను జీరల నొలిచితిరి (విరా-౫-ఆ-౨౨౨) ఇట్టి ప్రయోగములు మిక్కిలి యరుదు ద్వికర్మకములలో నేకర్మము నిల్చునో యేది ప్రథమాంత మగునో యను విషయము సంస్కృత వ్యాకరణములనుండి తెలియ నగును.

చేత-తోడ వర్ణకంబులు కరణంబునకుఁ బర్యాయం బున నగును హేతు మాత్రమునకు చేత-వలన వర్ణకం బులు పర్యాయముగ నగును గ్రహ్యాది యోగంబున చేత వర్ణకంబును నగును ౬ (బా-కార ౭) (వ్యా-సం-౨౩౯ I విష) (గ్రహ్యాదులు - ఎఱుఁగు-విను మొ)

I కరణంబునకు-చేత-తోడ-క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు ఉదా - కోలచేఁ గూలనేసె=కోలతోఁ గూల నేసె

II హేతువాచికిఁ చేత-వలన - ఫలసాధన యోగ్యంబగు పదా ర్థంబు హేతువు ఉదా - విద్యచేత యశము గల్గును=విద్యవలన యశము గల్గును.

III గ్రహ్యాదియోగ - రాజులవలనఁ గష్టంబుఁ గొనియె=రాజులచేతఁ గష్టంబుఁ గొనియె-(సభా-౧-ఆ-౨౬౭) (చూ-కార-౧౭ సూ) ఇందలి తృతీయా ప్రయోగము సంస్కృతమున లేనేలేదు నీ గుణంబులు హంస వలన విని=నీ గుణంబులు హంసచేత విని (అర-౨ ఆ-౭౭) కథకుచేత విను వేడ్క=కథకువలన విను వేడ్క (ఆది ౧ ఆ-౨౫)

చేతి-వర్ణకార్థక ప్రత్యయములకును వలన వర్ణక మునకును చేసి శబ్దము పాక్షికముగ ననుప్రయుక్త మగును పెక్కేటి కొక్కటి యనుప్రక్త మగుటయుఁ గలదు ౭ (ప్రౌ - కార ౭) (వ్యా-సం-౨౩౯ I విష.

౫౮౬ మొ ౫౮౮ పుటలు)

'చేసి' శబ్దము లోపించినను నర్థభంగ ముండదు గాన నది యను ప్రయుక్త మనిపించుకొనును చేత వర్ణకార్థకముల కనుటచేత 'చేతను-చేన్' అనువానిపైని 'చేసి' శబ్దానుప్రయోగము లేదని యెన్నునది (చేతి వర్ణకార్థకములు -ఆచ్ఛి ౮౦-కారక -౨౪-౨౬ సూ)

౧ వివ — తన గదంజేసి (ఆర-౩-ఆ-౩౬౭) నీ-రత్నంబులను వధూరత్నంబులనుజేసి (ఆది-౮ ఆ-౯౬) ధర్మ తనూభవువలనంజేసి (విరా ౨-ఆ-౨౨౪) పెక్కిటి కొకట-ట్టి -అట్టి గాత మానుగ్రహంబు నను నీ దుర్గబలంబుననుజేసి (సభా-౧-ఆ-౧౭౬) వ్యవహిత ప్రయోగ ములును గలవు - దానవచేసి (సభా-౧-ఆ-౫౮) నా తప్పునంగాచెస్సి (బసవ-౩-ఆ-౨౯౫ కా౯కవా)

౨ వివ - భీష్ముపనవుంజేసి' (సభా-౨ ఆ-౧౧) అనుచో 'చేసి=ఆచరించి' అని యర్థము నెన్నునది. చేసి శబ్ద మనుప్రయుక్త మనరాదు ఇచటి ద్వితీయ 'నన్' శబ్దార్థక మనరాదు

సహార్థ పృథగర్థ యోగంబున 'తోడ' వర్ణకంబగు
తుల్యార్థ యోగంబున తోడ-కు' వర్ణకంబులగును ౮.
(బా-కార-౫ సూ) (వ్యా-సం-౨౪౦ I విష)

సహార్థ - రాజు సేనలతోడ వచ్చెను సేనాసహితుండయి వచ్చె నని యర్థము సహార్థక శబ్దప్రయోగ ముండ నక్కఱలేదు అనుజులతో వచ్చి (ఆర ౨-ఆ-౫) బాలుం బొంటి యిట్లు పలువురతోడం జోరంగ (ద్రోణ-౨-ఆ-౬౧) పాండవులతోడం గృష్ణుండు వేఱగునె (ఉద్యో-౩-ఆ-౧౬౩) తుల్యార్థ - తపశ్చరణముతో సరిగావు (ఆది-౩-ఆ-౨౧౬) నాతోడం జతుర్దశాబ్దమున మూఁడై పోరు (సభా-౨-ఆ-౨౯౭) అవి దీనికి సరియుం గావు (సభా-౧-ఆ-౬౦) ఇట్టి యెడ ద్వితీయ వచ్చు టయుం గలదు నను మాఱొకని (భీష్మ-౧-ఆ-౧౪౮) వినికి మాఱొకంజాలు (విరా ౧-ఆ-౫)

౧ వివ –'తోడ'కుఁ బ్రత్యేకప్రయోగమును బెక్కింటికొక్కటికి తుది దానికిఁ బరముగా నిల్చుటయుఁ గలదు ఉదా –తోడరా (ఆర–౧–ఆ–౧౧ ప) (ఉద్యో–౧ ఆ–౪౭) అధికుల హీనులతోడ (ఉద్యో–౨–ఆ–౪౬) * కంటె వర్ణకమునకు నిట్టి ప్రయోగము గలదు సూనుల తమ్ములకంటె (ఉద్యో–౪–ఆ–౩౯) తోడుతన్ అను శబ్దపు ప్రయోగ మును గలదు అడఁకువతోడుత ననికి (విరా–౧ ఆ–౧౧౮)

వచ్యర్థాఽముఖ్య కర్మంబునకు తోడ–కు వర్ణకం
బులు పర్యాయంబునఁ బ్రాయికముగా నగును ౯ (బా
కార–౬ సూ) (వ్యా–సం–౨౪౧ వివ )

ఇట్లను నాతనితోడన్ (విరా–౫–ఆ–౨౭౪) రురునకు నిట్లనియె (ఆది–౧–ఆ–౧౫౬) అముఖ్యకర్మమును ద్వితీయాంత మగునపు డివి ద్వికర్మకము లగును ఏమంటి వృపేంద్ర నన్ను (ఉద్యో–౩–ఆ–౫౯ ప) నన్నుఁ బలికిన (ఆర–౨–ఆ–౮–౨) (చూ–కార–౭ సూ ౩ వివ)

ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకంబగు
౧౦ (బా–కార–౭ ) (వ్యా–సం–౨౭ ౨ I వివ)

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనంబడు (ఆఖ్యాత=(ఆఖ్యాతృ) వక్త=ఉపాధ్యాయుఁడు) రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులెం జదివిరి (సాందీపని=సందీపన పుత్రి)–('సాందీపుని' తప్పు)

౧ వివ – ఇట్టి యెడల సంస్కృతమందుఁ బంచమి యగును తెలుఁగున నట్టి పంచమి మిక్కిలి యరుదు 'భూవరులవలన వేదంబులను గఱచుచు ‡ (ఆది ౩ ఆ ౧౨ ప) వసిష్ఠుతోడఁ జదివె (ఆది ౪ ఆ ౧౬౯)

---

* సూరిగాని ప్రౌఢవ్యాకర్తగాని యిట్టి ప్రయోగములను సంగ్రహింపలేదు

‡ సూరి పంచమియు వచ్చునని తలంపక తోడ' వర్ణకము నిత్యమని తలంచెను

సంస్కృత తవ్యాది ప్రత్యయ యోగంబునఁ దృతీ
యాషష్ఠులు పర్యాయముగ నగును _ సహితము=
సయితము=సైతము” అనునవి సముచ్చయార్థమును
బోధించును. ౧౧. (ప్రౌ-కార-౧౩ సూ) (వ్యా-సం-
౨౮౩ విమ)

నీకు నారాధ్యను (ఆరాధింపఁ దగినదానను) (ఆది-౩ ఆ-౧౩౪) నీచేత నారాధ్యను దానితో సైతము-వాఁడు సైతము-వానిని సైతము మొ-

త్యాగంబునం దుద్దేశింపఁబడినది సంప్రదానంబు
దానికిం జతుర్థి యగు ననుట సంస్కృత సంప్రదా
యము ఉద్దేశమాత్రమునఁ జతుర్థియు కు-కి' షష్ఠియు
నగును ౧౨ (బా-కార-౮) (వ్యా-సం-౨౮౮ I
విమ)

('కొఱకు-కయి' అను చతుర్థి 'కు'వర్ణక మూలకమె కొఱ=కార్యము కొఱకున్=కార్యమునకున్ కు+అయి=కయి=కై')

రామునికొఱకుఁ గన్యనిచ్చెను=రామునకుఁ గన్యనిచ్చెను పురుషార్థముకొఱకు యత్నింపవలయు=పురుషార్థమునకు యత్నింపవలయు. చతుర్థియందు కై-కొఱకు” లేకాక కు-కి-కునై-కుఁగాన్-తదర్థము-పొంటెఁ మొదలగునవియు వాఁడఁబడును ఇవి విభక్త్యర్థాభిధాయక శబ్దము లనఁదగును నన్నయ కొఱకు' అనుదానిని వాడనే లేదు-దానికి బదులుగా తదర్థము అనుదానిని దఱుచుగా వాడెను నీ తదర్థము (సభా-౧ ఆ-౨౪౯) చైద్యునకై పూని (సభా-౨ ఆ-౩౮) శాంతికొఱకున్ (శాంతి-౫ ఆ-౬౦) కార్యసిద్ధి పొంటెఁ (ఆర-౩ ఆ-౩౮౮) నీకుఁగాన్ (ఉద్యో-౩ ఆ-౩౮౧) పొలియుటకునై (శాంతి-౧ ఆ-౨౦౬)

రుచి-క్రోధము - సహనము - మున్నగునవి దేనికో
యచటఁ జతుర్థి యనఁగా 'కు-కి వర్ణకములగు అట్లె

కుశలము-స్వస్తి-నమస్కృతి-హితము-ఇష్టము-దూర
ము-సమీపము-సామర్థ్యము-నేర్పు-ప్రవేశము - కాల
ము-గమనము- ” మున్నగువాని యర్థములు గల శబ్ద
ముల యోగమునఁ జతుర్థి యనఁగా ‘కు-కి’’ వర్ణ
కంబులగు ౧౩ (ప్రౌఢ-కార-౧౩-౧౪) (వ్యా-సం-
౨౪౫ I విమ).

ఇతనికిఁ గూర్తురు (సభా-౨ ఆ-౧౦) యయాతికి నలిగి (ఆది-౩ ఆ-౯౮) నీ మఱంది కపరాధ శతము సైఁపుము (సభా-౨ ఆ-౫౯). మనకుఁ గుశలము (అర-౨ ఆ-౧౪౩). దేవతాతతికి న్నమస్కృతి చేసి (ఆది-౧ ఆ-౨౧) ఇది యుపపదయోగజ విభక్తి ఇట్టి యెడలఁ గారక విభక్తియు నగు. పరాశరసుతుం బ్రణమిల్లి (ఆది-౧ ఆ-౭౭) నాకిది యిష్టము (ఆది-౬ ఆ-౫౧) మీరు నాకు నేను మీకు నెన్నఁడు నహిత మాచరింప లేదు. (సభా-౧ ఆ-౧౮౬) మాకు సమీపస్థుండవ దూరంబున నుండియు (సభా-౨ ఆ-౮౨). నీ కులంబునకుఁ దగఁగ (ఆది-౬ ఆ-౫౬) ధర్ము వెలుంగ వీనికిం బోలునె (సభా-౨ ఆ-౨౨) విధాతృన కైనను నేరఁబోలునె (ఆది-౧ ఆ-౮౯). నే మగుడి వచ్చునంతకు (అర-౩ ఆ-౩౧). మీఁదికిఁ జూచి యమునా నదీతీరమున కేఁగి (ఉద్యో-౪ ఆ-౩౬౩) * ప్రాని మాప్రి కరిగి’ ఇదియు గమనార్థ దాహృతియె దీనిని ప్రౌఢవ్యాకర్త పీపన కుదాహరించుట సరికాదు (చూ-ప్రౌఢ-కార-౧౪ సూ)

భయ-జుగుప్సా-పరాజయ - ప్రమాద - గ్రహణ -
భవన-త్రాణ-విరామాంతర్ధి-వారణంబు లెద్దాన నగు
దానికి వలన’ వర్ణకం బగు ౧౪. -(ప్రౌ-కార-౯)
(వ్యా-సం-౨౭౬ I విమ)

---

* ఇట్టి వానిని సూరి సంగ్రహింపనే లేదు- ప్రౌఢవ్యాకర్తయు నిందుఁ గొన్నిటిని మాత్రమె సంగ్రహించెను.

౧ వివ .— వలనను అనుదానికి వల్లను' అనునది యర్వా చీన రూపాంతరము (చూ-తత్స-౧-౭ సూ ౧ వివ) అపాయ మనఁగా విశ్లేషము విడిపోయిన వస్తువులలో నేది నిల్చియుండునో యది యపాదానసంజ్ఞ గలదనియు నది పంచమ్యంతమగుననియు సంస్కృత వ్యాకరణమునఁ జెప్పఁబడెను 'వృక్షమువలననుండి వర్ణము పడెను' అనుచో వృక్షము నిల్చిపోయినది వర్ణమున కపాయము గల్గెను గాన వృక్ష శబ్దము పంచమ్యంతమగునని సంస్కృత వైయాకరణుల యాశయము (వృక్షాత్పర్ణం పతతి) కాని యట్టి యర్థము తెల్గున వృక్షమందుండి వర్ణము పడెనని వాడఁబడును వృక్షమందు గొంత సేపుండి పర్ణముపడెనని యర్థము వృక్షమువలనఁ బర్ణము పడె ననుచోట సయితము వలనన్ అనునది యాపవిభక్తిక వలను' (దిక్కు) శబ్ద సప్తమ్యంత రూపమే యనియు వృక్షమువలననుండి పర్ణము పడెననియె వాడుక యనియు నందలి ఉండి శబ్దము లోపించి యధ్యాహార్యమగు నపుడు వృక్షమువలనఁ బర్ణము పడె నను వాక్యము సిద్ధించుననియు నెఱుంగునది కాన భయాదు లెద్దాన నగునో యది యపాదాన సంజ్ఞ గలదనియు నద్దానికి వలన వర్ణక మగుననియు నెఱుంగునది ఇట్లు వలనన్ శబ్దమును బంచమీ విభక్తి పరముగాను సప్తమ్యంత పరముగాను గ్రహింపవలెను "పరే ష్వాంద్యాది శబ్దేషు సప్తమ్యాద్యా విభక్తయ అని యధర్వణా చార్యుఁడు వచించెను (వ్యా-సం-౨౮౭ విష ౧౧౧౩ పుట) కావున నపాయస్థలములందలి వలనన్ శబ్దము సప్తమ్యంతమె కాని పంచమీ ప్రత్యయమని తలంపరాదు

౨ వివ —భయాదు లెద్దాన నగునో యది యపాదానసంజ్ఞ

---

* సూరి యిట్టి సంస్కృత వ్యాకరణ పద్ధతినే యనుసరించి అపాయము అను దానిని సైతము సూత్రమున నిల్పి యపాయస్థలము లను నపాదాన పంచమీస్థలములుగా సూత్రించి యుదాహరించెను

గలదనియు నట్టి దానిపై వలన వర్ణకము నిల్చెననియు నెన్న నగును.

భయము :-చోరునివలన భయము పడియె. జుగుప్స:-(ఏవ). పాపంబువలన నేవగించె. పరాజయము:-అధ్యయనంబువలన డస్సె. ప్రమాద:-పాడివలనం బరాకు వడియె గ్రహణ:-మైత్రినివలన ధనంబు గొనియె. (చూ-కార-౬ సూ. III వివ. మైత్రినిచే ధనంబు గొన్నియె.) హంసవలన విని. నావలన నెఱింగి-యె. ఇవియు గ్రహణమునకె యుదాహృతులు. భవనంబు.-మనువువలనఁ బ్రజలు పుట్టిరి. త్రాణంబు:-చోరునివలనం గాచె. విరామ -భోగంబువలన విరమించె. అంతర్ధి:-(దాఁగుట). కృష్ణుండు తల్లివలన దాఁగె. వారణంబు:-శోకంబువలన వారించె. ఇట్టి వాడుకలు దెల్గునం దరుదుగఁ గలవు. భీష్మువలనం బ్రభవించె (ఆది ౧-ఆ-౧౪౫). క్షితిపతులవలన సముపార్జితమైన ధనము (సభా-౧ ఆ-౨౭౭). ఇట్టి యెడఁల దెల్గున "కు" షష్ఠి తఱుచు ఉదా:-వానికి భయంపడుచుండుదురు. (ఆది-౪ ఆ-౩౭). పాండవులకు నెఱతు (ఆది-౬ ఆ-౧౨౧). కర్ణున కేనోడితి (కర్ణ-3 ఆ-౫3). చ్యవనునకు సుకన్యక కుద్భవ మయ్యె ..ప్రమతి (ఆది-౧ ఆ ౧౪౫).అనుచితకృత్యంబునకుఁ దొలంగఁ ద్రోచితివి (కర్ణ-3 ఆ-౭౯)

"ఉండి-ఉంచి" అనెడి శబ్దములు కూర్చి-గుఱిచి-గుఱించి-చేసి" అనువానివలె ననుప్రయుక్త శబ్దములు కావు. (చూ-కార-౨ సూ-౨ వివ ౭ సూ. ౧ వివ.), అవి వాక్యావయవములగు పదములు. ♦. ౧౫. (బా. కార-౧౦-౧౧ సూ.)(వ్యా-సం-౨౪౭ I. వివ).

---

♦. సూరి 'ఉండి' శబ్ద (బా-కార-౧౦-౧౧ సూ) మనుప్రయుక్తమని సూత్రించెను. అది వాక్యమం దర్థవంతమగు శబ్దము గాన ననుప్రయుక్తము కానేరదు. ఉదా:-వనమునం దుండి వచ్చెను. యె.

ఇవి వాక్యములోని 'సప్తమి-ద్వితీయ" అను విభక్తులు గల పదములతో నన్వయించుచు వాక్యగత పదములై యుండును. ఉదా.- సప్తమి-ఉండి'-దేవపథమునం దుండి .. చనుదేరవలయు (అర-౩-ఆ-౭౦) (దేవపథమునందుఁ గొంతసేపుండి చనుదేరవలయునని యర్థము) ఉంచి-ద్వితీయ:-కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె (కృష్ణరాయ విజయము-౪ ఆ-౨౬౦ ప). (బాలక-౧౼౪ పుట). (ఏదో చోటి నచట నుంచి వెళ్లి వచ్చెనని యర్థము). ఉండి' అనునది 'ఉండు' ధాతు క్త్వార్థకము 'ఉంచి' అనునది ఉంచు' ధాతు క్త్వార్థకము. (ఉండు ధాతు ప్రేరణము 'ఉంచు' ధాతువు).

౧ వివ :-సందర్భయోగ్యపద వ్యవధానమును గలదు. 'ఎం దేని నుండి వచ్చి" (ఆది-౩ ఆ-౧౭౦). పెక్కిటి కొక్కటి నిల్చుటయుఁ గలదు. ఆ. వె. విష్ణుపదమువలన విధునివలన సూర్యు వలన త్రిపురవిజయి మౌళివలన నుండి ..(అను-౨ ఆ-౧౧౮ ప) *

౨ వివ :-సప్తమిమీఁది 'ఉండి' శబ్దము లోపించి యధ్యాహార్య మగుటయుఁ గలదు. 'ముఖ నేత్ర నాసికా రంధ్రములం దు... వెడలె (అర-౬ ఆ-౩౧౬ ప). † చ. నూతిలో వెలువడఁ గోమలిం దిగిచి (ఆది-౩ ఆ-౧౪౪). ఒడలన్ వెలువడి (అర-౨ ఆ-౧౭౯).

* సూరి పయి రూపములను సాధించుటకు 'వలన" కుండి యనుప్రయుక్త మగుననియు నట్టి 'వలనకు' ద్వితీయా సప్తము లాదేశము లగుననియు సూత్రించెను (బాల-కార-౧౦-౧౧ సూ). ఉండి' శబ్దానుప్రయోగము గల 'వలనన్' అనునది సప్తమ్యంతమె. అది యపాదాన పంచమీవిభక్తి కాదు. (చూ-కార-౧౪-సూ-౧ వివ) ఇంక ద్వితీయ - వనమునుండి వచ్చెను అను వాక్యమె యసాధువు. ఉండి నిల్చునప్పటి ద్వితీయ కవిప్రయోగారూఢము కాదు.

† అందు విభక్తిమీఁది ఉండి'కి లోపము లేదను ప్రౌఢ వ్యాకరణము ప్రామాదికము. (ప్రౌఢ-కార-౧౧ సూ).

(కార-౧౫౩-౧౬ సూ. 3-౪/౧౫౫ వివ.) తొట్టి మొ-ప్రభృత్యర్థకములు

వీపు వెడలిన (అశ్వా-౪ ఆ-౬౪). ఈ సప్తమ్యంతములపైని "ఉండి" శబ్దము నధ్యాహారము చేయనిచోఁ గారకమునకుఁ గ్రియాన్వయము లేక యన్వయభంగ మగును.

3 వివ :- ఉంచి' శబ్దపు వాడుకకుఁ బ్రాచీన మహాకవి ప్రయోగములు లభింపలేదు. 'కాంచి యమ్మంత్రి యెచ్చోటి నుంచి వచ్చె" అను కుమార ధూర్జటి ప్రయోగము బలమైనది దొరకినది. '♦ ఇట్టి 'ఉంచి' శబ్దము లోపించి యధ్యాహార్య మగుట ప్రాచీన కావ్యములందె కన్పట్టుచున్నది. ఉదా:-చేదినం దను తనువున్ బృహ ద్రుధిర ధారలు బోరన మీఁది కొల్కఁగాఁ (సభా-౨ ఆ-౬౮). పృథు దేహము వెల్వడి (సభా-౨ ఆ-౬౯). ఇట్టి యెడలను 'ఉంచి' శబ్దాధ్యాహారము లేనిచో నట్టి యెడల ద్వితీయ కన్వయము లేక యర్థభంగ మగును.

౪ వివ :-'ఉండి-ఉంచి' శబ్దములవలెనె యనుప్రయుక్తములు కాక వాక్యమునం దన్వయముగల మఱికొన్ని శబ్దములును గలవు- ప్రభృత్యర్థకములు ప్రథమాంతముతో నన్వయించును. ఉదా:-ఇది మొదలు (ఆది-3 ఆ-౧౨). సంస్కృతమున నిట్టియెడలఁ బంచమి నిల్చును. ఉదా.- కార్తిక్యాః ప్రభృతి = కార్తికపు పున్నమ మొదలు. తొట్టి=(మొదలుకొని) శబ్దము ద్వితీయతో నన్వయించును. ఉదా:-హిమకరుఁ దొట్టి (ఆది-౧ ఆ-౧౪) కోలెన్-కొలెన్' శబ్దములు (ప్రభృతి) సప్తమ్యంతముతో నన్వయించును ఉదా:-నాటం గోలె (విరా-౧ ఆ-౭౪) పుట్టిన కోలెన్=పుట్టిన దానం గోలెన్ (ఇట తచ్ఛబ్దలోపము గల్గెను).

కంటె వర్ణకం బన్యార్థాది యోగజంబగు పంచమి
కగు ౧౬ (బా-కార-౧౨) (వ్యా-సం-౨౪౮ I వి).

ఉదా :-రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు.

---

♦ ఇట్టి కవిప్రయోగము లుండఁగా 'ఉంచి' శబ్దప్రయోగమె యసాధువని సూరి వివరించుట సరికాదు. (బాల-కార-౧౧ సూ).

అంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కంటె ఁ లెను హితమైన కృత్య మొకటిం గలదే (ఉద్యో-౩ ఆ-౧౩౯). ఇట నొక శబ్ద మన్యార్థకము. ఇట్టి 'కంటె' విభక్తి పెక్కటి కొక్కటి నిల్చుటయుఁ గలదు. "సూనుల తమ్ములకంటె (ఉద్యో-౪ ఆ-౩౯). కంటె కర్వాచీనపర్యాయము 'కన్న' విభక్తి (చూ-తత్స-౧-౭ సూ. ౧ విప). ఇట్టియెడల షష్ఠీ కు-కి' ప్రత్యయ ప్రయోగము తఱుచు. ఉదా:-రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు. (చూ-ఉద్యో-౩ ఆ-౧౬౦). ఇట్టివి. నీ కగ్గల ముగ=(నీకంటె నగ్గలముగ) (ఆది-౫ ఆ-౨౩౯) 'నీకంటె నితరుఁడు. దానికి బరముగ' మున్నగునవి యాది శబ్దగ్రాహ్యములు.

కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమికి నగు. ౧౭
(బా-కార-౧౩ సూ) (వ్యా-సం-౭౪ విమ).

ఎచట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబే కలిగి యుండు నచటం బంచమి యగు. (చూ-కార-౨౧ సూ) అట్టి పంచమికిఁ గంటె వర్ణకం బగునని యర్థము ఉదా-మానహానికంటె మరణము మేలు. ఇట్టి యెడల షష్ఠీ- కు=కి' ప్రత్యయస్థితియుఁ గలదు. మానహానికి మరణము మేలు. మహాదారుణ మది విషముకంటె దహనముకంటెన్ (సభా-౨-ఆ-౧౭) విత్త రక్షకుఁ గడు మేలు వృత్త రక్ష (ఆర-౪-ఆ-౧౩౦) (నీ-నీకంటె హరిబుద్ధి లేకయే (నన్ని-కు-౨ ఆ-౧౬౪). (హరి నీకంటె నెక్కుడని యర్థము చూ-కార-౧౩ సూ) పెక్కటి కొక్కటి నిల్చుటయుఁ గలదు సూనుల తమ్ములకంటె నాకు నం ప్రీతి యొనర్చు (ఉద్యో ౪ ఆ ౩౯)

గుణవాచకము హేతు వగునప్పుడు పట్టి యు ప్రథమ పూర్వకముగ నిల్చును. హేతునకు నవ్యాంతి క్రియ మీఁద పట్టి' విభక్తి మాత్రమే నిల్చు ౧౮. (బా-కార-౧౪ సూ) (వ్యా-సం-౨౨౦ I విమ)

జ్ఞానముంబట్టి మోక్షము గల్గును పట్టీతి తు పంచమీ గుణే హేతౌ అను చింతామణి సూత్రము దీనికి మూలము ష్ఠియు

నిల్చు ననుటచేత (కార-౬ సూ) "జ్ఞానముచేత-జ్ఞానమువలన" అను హేతు తృతీయా పంచములు నగు. ♦ నుజ్యంతః-గల్గంబట్టి (ఆర-౬ ఆ-౬౧) ఈవు గలుగంగఁబట్టి (కాశీ-3 ఆ-౭౭) (ప్రౌఢ-కార-౧౨సూ)

స్వస్వామి భావాది సంబంధములందు స్వామ్యాది వాచకములకు యొక్క వర్ణకం బగు అయ్యాది లోపించును. అట్టి యెడల 'యొక్క' చోట నేకత్వంబున 'ది' వర్ణకంబును బహుత్వమున వి' వర్ణకంబును వైకల్పికముగా నిల్చును. 'నీ-నా-తా-మన' శబ్దముల 'యొక్క' చోట 'దు' వర్ణకము వికల్పముగ నిల్చును. (ఈ 'ది-వి-దు' ప్రత్యయములు సమాసగతము లని భ్రమింపరాదు). ఈ ది-వి ప్రత్యయములు పరమగు నప్పుడును 'తన' అను తద్ధిత ప్రత్యయము పరమగు నపుడును బూర్వావయవమగు ప్రకృతి (షష్ఠీ తత్పురుష పూర్వావయవమువలె) ద్వితీయా విభక్తి రూపమున నిల్చును (చూ-సమా-౭౨ సూ). కొన్ని యెడల 'యొక్క' అనుదానిచో 'కు=కి' అను విభక్తి నిల్చుటయుఁ గలదు. ౧౫. (బా-కార-౧౫ సూ). (బా-సమా-౮-౯-౧౧ సూ) (వ్యా-సం-౨౫౧-౨౫౧ I. II విష).

స్వస్వామి భావాది' అను చోటి ఆది' శబ్దముచేత 'అవయవావయవి భావము-జన్యజనక భావము' మున్నగు వివిధ సంబంధ

---

♦ సూరి తృతీయా పంచము లగునని యేల వచింపలేదో తెలియకున్నది. (బా-కార-౧౭ సూ). ఇందు 'జ్ఞానముంబట్టి' అని యుదాహరించుటకు సూరికి దురిత మెట్లువచ్చెనో? నుజ్యంతము మీఁది 'పట్టిని' సూరి సూత్రింపకుండుట సరికాదు.

ముల నెన్నునది. 'యొక్క' లోపము:-చిన్ని రామచంద్రుని నగు మోము (రాఘు-౨ ఆ-౯ ప) (చిన్ని రామయొక్క-భారతార్థ. చిన్ని రామచంద్రునియొక్క-రామాయణార్థ). ధర్మజు నలువురు తమ్ములు (సభా-౨ ఆ-౨౬౧). (నలువురు-ప్రథమా బహువచనము) ఎవ్వనియేని ముఖామృతాంశు బింబమ్మున (ఆది-౧ ఆ-౭౭). దుర్మర్షణునియు దుర్ముఖునియు నింద్యు (శాంతి-౧ ఆ-౩౯౬) నీ నాయెడఁబాటు (అను-౧ ఆ-౨౬౩) భూ పతులయు విప్రముఖ్యుల సభన్ (సభా-౨ ఆ-౧౦) మనవారల వారివారి మానములు (ఉద్యో-౪ ఆ-౨౧౯). యొక్కార్థక డి-వి' ప్రత్యయములు. షష్ఠి ద్వితీయాకారమున నిల్చుట:-హా నిది కలరూపు (ఆది-౪- ఆ-౩౦) (సామాసిక ద్రుతిలోపము-సంధి-౨౩ సూ) వారివ=(వారివి+అ) ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్పదామములయు (ఆది-౩ ఆ-౧౫౬). 'దు ప్రత్యయము -నీదు కొడుకులు (స్త్రీ-౧ ఆ-౮౩). తమదు వీధులఁ దమదు లోఁగిళ్ళ (రంగ-రా-యుద్ధ-౬౦౭) మద్భక్త దేహంబు మాదు దేహంబు (బసవ-౪ ఆ-౧౨) *

---

* సూరి డి-వి' ప్రత్యయములను జెప్పనే లేదు. 'అది-అవి' శబ్దముల సమాసమునఁ (బా-సమా-౮ సూ) దచ్ఛబ్దాకార లోపముచే (సంధి-౪౨ సూ. బా-సంధి-౪౫ సూ) నట్టివి సాధ్యములగునని సూరి తలంపు. ఇంక 'దు' సామాసికాగమమని సూరి సూత్రించెను. (బా-సమా-౧౧ సూ) అది సరికాదు. (చూడు-వ్యాసం. ౨౫౧ 1 వివ) చ . నీహృదయము నాదు చొచ్చుటకు (శాంతి-౬ ఆ' ౨౦౨) ఇత్యాదులు దాని యొక్క' అను నర్థమును వ్యస్తతను స్థిరపఱచునుగదా. 'డి-వి' అనునవి ప్రత్యయము లగునపుడు వానికి అగు' ధాతువుతో నన్వయముండదు. 'రామునియొక్క'' అనుదానికి 'అగు' ధాతు జన్యవిశేషణములతో నన్వయముండదు గదా అది విశేష్యముతో నన్వయించును రామునియొక్క గుణ

'ది-వి-దు' ప్రత్యయములు 'యొక్క' ర్థకము లనునపుడే 'నాదు - మాదు - నీదు - మీదు - తనదు -తమదు-దానిది-వారివి-' మున్నగురూపములు కుదురుపడును- దు' సామాసిక ప్రత్యయమన్నచో నది ప్రకృతిపైని (నీ - నా - తా) నిల్వవలయును. యొక్కకు వ్యస్తతయందును లోపము కవి ప్రయోగసిద్ధమగుటచేత 'నాపుస్తకము-వానిపుస్తకము' అనురీతివి సమాసములన్నను వ్యస్తములన్నను క్షతిలేదు. 'దా నిది కలరూపు' మున్నగువానిలో ది' అనునది ప్రత్యయ మనుటయె యుక్తము. ఇంగ్లీషునందలి My-Mine శబ్దములవలెనె 'దానిది' 'అది' శబ్దాంతములును నగుననుట యుక్తము. 'నాది-నావి' మున్నగు రీతిని 'అది-అవి' అను శబ్దముల సమాసములు నిర్బాధములు 'దు' సామాసిక మను పక్షమున నివి ('నాది-నావి' అనునవి) బాధితము లగును. విశేషవిధిచే 'దు అనునదియే రావలయును. "ది స్స్వ త్వసంబన్ధార్థే యుష్మదస్మ దాత్మభ్యో ద్వితి వర్ణకః" (ఆం-చిం-వ్యా-సం-౨౫౧ I-విప.) యొక్కచోట కు=కి' ప్రత్యయస్థితి:-పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు (ఆది-౬ ఆ-౨౫). ఇట్లే జగమునకుఁ గర్త=జగముయొక్క కర్త-మొ.

ధాతుజ విశేషణ భావార్థకాది ప్రత్యయములచే
నభిహితమగు కర్తృపదముయొక్క ప్రథమచోట

---

ములు దానిది కలరూపు (ఆది-౮ ఆ-30) (వారివి+అ) వారివ పువ్వు దామములు (భార-ఆది-3 ఆ-౧౫౬) అది-అవి' అను శబ్దములు నిల్చునపుడవి విధేయవిశేషణములై అగు' ధాతుజ విశేషణములతో నన్వయింపనగును ఉదా॰ చేసినదగు పని-చేసినవైన పనులు-తనదగు రూపము. నాదగు పుస్తకము ఇది నాదియై యున్నది. (నా+అది+ఐ)- మొ. (చేసినది. తనది మున్నగు నవి విధేయవిశేషణములు.)

సంబంధార్థవివక్షచే యొక్క షష్ఠియు వచ్చును. అట్టి యొక్క విభక్తి లోపించును. యొక్క షష్ఠి యర్థ విశేషబోధకమును నగు. ౨౦. (ప్రౌఢ-కార-౧౫-౧౬ సూ). (వ్యా-సం-౧౦౩౩-౧౦౩౪ పుటలు. ౨౫౧ వి.)

ఉదా –సంబంధార్థ వివక్ష :–తన మును పడ్డ బన్నములు (ఉద్యో-౩ ఆ-౧౦౨). ప్రథమ:–తాను మును వడ్డ బన్నములు ఇట్లె-అర్కుండు వెలిఁగించునట్లు (సభా-౨ ఆ ౬)=అర్కుని వెలిఁగించు నట్లు. పరీక్షి జ్జనపాలు చనుట (ఆది ౨ ఆ)=పరీక్షి జ్జనపాలుఁడు చనుట. యొక్క షష్ఠి యర్థవిశేషబోధకము –దృఢ దీర్ఘబాహువీ ర్యమ్ములవారు (ఆది-౭ ఆ ౧౮౦)=(దీర్ఘబాహు వీర్యములు గలవారు) దర్భపూరి పఱపులు (ఆది-౭ ఆ ౨౨౬). (దర్భగడ్డితో నిర్మించిన పఱపులు). (వట్టుపుట్టముదొర=పీతాంబరుఁడు).

సముదాయమునం దేక దేశమును బృథక్కరించు నపుడు సముదాయవాచి లోపల షష్ఠ్యంతము సప్త మ్యంతమును బర్యాయముగ నగును ౨౧. (బా-కార-౧౬ సూ) (వ్యా-సం-౨౫౨ విష)

ఉదా –మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు. పూజ నీయులైన పురుషులలోపల నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁడు (సభా-౨ ఆ-౧౧) గోవులందుఁ గపిల బహుక్షీర. సీ జ్యోతిస్సులందు వర్యుఁడు రవి... . విద్యలఁ బ్రధాన సావిత్రి . అనిలచయమునఁ బ్రాణ మగ్ర్యము ధాతువులలోన నుత్తమము పసిఁడి. (అశ్వ-౨ ఆ-౧౬౧) నలుగాలివాన గోవును ..మనుజుల విప్రుండు సమధికత్వభాజన ములు (శాంతి-౧ ఆ-౭౧ ప). ( మనుజులన్' అను నజడ ద్వితీ యయు సప్తమ్యర్థకముగ వాడఁబడెను).

౧ విష .–చింతామణ్యనురోధమున (సంస్కృత వ్యాకరణము చొప్పునను) లోపలన్' అనునది షష్ఠి' యనఁబడెను గాని నాపవిభ

క్తికములగు "లోపలన్-లోనన్" శబ్దములును సప్తమ్యంతములె. 'లోన్' అను నదియు సప్తమ్యర్థకమె.

౨ వివ:-నిర్ధార్యమాణము భిన్నవస్తు వగునపుడు పంచమి యగును. (చూ-కార-౧౭ సూ) నిర్ధార్యమాణము సముదాయము లోనిదే యగునపు డీసూత్రము వర్తిల్లును. 'మనుష్యులలో క్షత్త్రియుఁడు శూరుఁ' డనునపుడు క్షత్త్రియుఁడును మనుష్యులలోని వాఁడేకదా.

అధికరణంబునకు సప్తమి యగు. ౨౨ (బా-కార-౧౭) (వ్యా-సం-౨౫౩-౨౫౩ I వి).

అధికరణంబు నా నాధారంబు. ఇది త్రివిధంబు. I ఔపశ్లేషికము=ఏకదేశ మాధార మగును. ఉదా-చాపయం దున్నది-(చాపయొక్క యేకదేశమం దున్నది) పగవారి యింటఁ గుడిచి (ఉద్యో-౩ ఆ-౨౨౭). మీయందుఁ గల వస్తువులు (సభా-౧ ఆ-౨౩౯). ఇంద్రునం దునికి (సభా-౧ ఆ-౮౯)=(ఇంద్రుని సన్నిధియం దని యర్థము) II అభివ్యాపకము=(సర్వావయవ సంబంధము గలది) ఉదా:-అంతటను నీశ్వరుఁ డున్నాఁడు. ఎల్లయందును దా వసియించుట (ఉద్యో-౨ ఆ-౩౨౬) ఎక్కడఁ జూచినం దానయై (భీష్మ-౨ ఆ-౧౩౭). III వైషయికము:-(విషయతా సంబంధమున గోచరించునది). ఇది మిక్కిలి విరివిగా నుండును. ఉదా.-మోక్షమున నిచ్ఛగలదు. (మోక్షవిషయమున నిచ్ఛ గలదు) వాఁడు కేళిం గుశలుఁడు=(వాఁడు కేళీవిషయమునఁ గుశలుఁడని యర్థము) ధర్మమున వేదములు ప్రమాణము=(ధర్మవిషయమున వేదములు ప్రమాణ మని యర్థము). ఆతఁడు గురుసేవయం దున్నాఁడు=(అతఁడు గురు సేవావిషయమున నున్నాఁడు)

౧ వివ:-సంస్కృత వ్యాకరణసిద్ధమగు నిమిత్తార్థజ సప్తమియు విషయసప్తమియె యనఁదగును ఉదా:-(చర్మణి ద్వీపినం హన్తి) చర్మము నిమిత్తమునఁ (=విషయమున) బులిని జంపుచున్నాఁడు-మొ.

౨ వివ :-సంస్కృత ప్రసిద్ధమగు సత్యర్థ సప్తమిచోటఁ దెలుఁగున భావలక్షణార్థక నుజ్యంతము వాడఁబడును. (చూ-క్రియా-౫౧ సూ) ఉదా:-గోషు దుహ్యమానాసు దేవదత్తో గతః=గోవులు పిదుకఁబడుచుండఁగా దేవదత్తుఁడు వెళ్ళెను. మ: కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండఁగ్ (సభా-౨-ఆ-౨౩౩ ప). ఇట్టియెడల భావలక్షణార్థక నుజీచే నచటి కర్తృ కర్మార్థము లభిహితములగును గాన నచటఁ బ్రాతిపదికార్థ ప్రథమయే వచ్చును. (కురువృద్ధుల్. మొ)

3 వివ -స్వామీశ్వరాధిపతి దాయాద సాక్ష్యాది శబ్దయోగమున సంస్కృతమందు వచ్చు షష్ఠీ సప్తములచోటఁ దెల్గున శేషషష్ఠియె వచ్చును ఉదా:-సంస్కృ-గవాం గోషు వా స్వామీ=గోవులయొక్క స్వామి=గోవులకు స్వామి-మొ.

ఉకారాంత జడంబునకు న' వర్ణకంబగు ౨3.
(బా-కార-౧౮) (వ్యా-సం-౨౫3 III వివ).

న' వర్ణకమును సప్తమీ ప్రత్యయమె యైనను అందు' వర్ణకము సిల్చినచో నెల్ల నిది నిల్వనేరదు. ఉదంత జడములమీఁద నేకత్వమున మాత్రమె 'న' వర్ణకము నిల్చును అస్మదీయ వంశమునఁ బ్రసిద్ధులై (ఆది ౧ ఆ ౧౮)

౧ వివ – న' వర్ణకము తృతీయార్థ మందును నిల్చును. (కార-౨౬ సూ) ఊరుతటము కరతలంబున నప్పళించె (శల్య-౨-ఆ-౨౭౨)

ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు
నగు. ౨౮ (బా-కార-౨౧ సూ) (వ్యా-సం-౨౫౮
-౨౫౮ I వి)

సంస్కృత ప్రసిద్ధ విభక్తులకు విలక్షణములగు విభక్తులు సైతము (కార-౧౦-౨౫-౨౬-౨౭-మొ) పెక్కులు తెల్గున వచ్చు

నని యీసూత్రమున కర్థము. కాన నిందు విధింపఁబడిన విభక్తులే కాక యీ వ్యాకృతియందు విధింపఁబడని విభక్తులు సైతము తెల్గునఁ బ్రయోగింపఁబడుట గలదని దీనికిఁ దాత్పర్యము. ఉదా.—బేరోలగం బుండు (ఉద్యో-౧-ఆ-౨౭౦) (ఇట-'పేరోలగమం దుండు' అను సప్తమి రావలయును) (ఇట్లె యంతటను నరయునది). నెఱకులాడి వేదనఁ గావించు (ఆర ౧ ఆ ౩౧౮). తీర్థములాడ నోపరు (ఆర-౨ ఆ-౨౮౬). వారు సుఖ మున్నారు (ఆది ౭-ఆ-౧౨౯). నీయందైన సంబంధము (ఆది-౮ ఆ-౫౨). నీయం దర్పితం బయ్యె (సభా-౨ ఆ-౧౦౨).

౧ వివ.—'వాహనమును దిగెను' అను దాని నీ సూత్రము నకు లక్ష్యముగ * నుదాహరింపరాదు 'వాహనమునుంచి దిగెను' అను చోటి 'ఉంచి' అధ్యాహార్యమని తలంపవలయును. 'వాహనమునుండి దిగెను' అను వాక్యము సాధువే కాదు అట్టి ప్రయోగము మృగ్యము.

౨ వివ.—ఏకవాక్యమున రెండు విభక్తు లొక్క శబ్దముపైని నిల్వవలసి వచ్చునపుడు కర్తృ-కర్మాఽధికరణ సంప్రదానాఽపాదానములలోఁ బరవిభక్తి బాధితమై పూర్వ పూర్వ విభక్తులు నిల్చును. ఉదా-'గంగనుగూర్చి యేగి స్నానముం జేసెను' అనుచో 'గంగయం దనెడి యధికరణము బాధిత మయ్యె ఇట్లె యంతటను నెఱుంగునది. ♦

---

* సూరి దీనికి మైత్రుండు గృహమును వెడలెను. వాఁడు వాహనమును దిగెను'' అని యుదాహరించెను. ఈతఁడు 'ఉంచి' నంగీకరింపలేదు-ఉండికి ద్వితీయ మీఁదఁ బ్రయోగము లేదు

♦ ఇట్టి యుక్త మార్గమును గ్రహింపక ప్రౌఢవ్యాకర్త "కొన్ని యెడల విభక్తి విపరిణామంబు గ్రాహ్యంబు ఉదా:-ఈతనితో సాటి యనంగ మెలనఁగ (నిర్వ-౩ ఆ) ఇచ్చటఁ దృతీయకుఁ బంచమి మార్పు గల్గెను. (ప్రౌఢ-కార-౨౬ సూ)'' అని సూత్రించి యుదాహరించెను. ఇది సరికాదు. తెల్గున విభక్తి విపరిణామాన్వయమే సమ్మతము కాదు (చూ-వ్యా-సం-౨౧౯ విష ౮౮౧-౮౮౨ పుటలు).

ఉదంతైక వచనేతరములయు నౌపవిభక్తికైకవచ
నేతరములయు జడముల తృతీయా సప్తములకు ద్వితీయ
వైకల్పికముగ నగుః ౨౫. (బా-కార-౨౨) (వ్యా-
సం-౨౫౫ I విమ).

మహిమన్ మహి నొప్పు (ఆది-౧ ఆ-౬)=('మహిమచేత మహి
యం దొప్పు' అని యర్థము). దిక్కుల నించె యశము (సభా-౧
ఆ-౧౭). ఉదంతైకవచన-ఆశ్రిత పోషణంబునన్ (ఆది-౧ ఆ-౬).
చిగురునన్. ( ఆశ్రిత పోషణంబుల్-చిగురున్' అను ద్వితీయైకవచన
ములకుఁ దృతీయా సప్తమ్యర్థములు లేవు ఆశ్రిత పోషణంబులన్-
చిగుటలన్ అను ద్వితీయా బహువచనములకుఁ దృతీయా సప్తమ్యర్థ
ములును గలవు.) ఇక్లై యౌపవిభక్తికైకవచన.-అన్నిటన్=(అన్నిటి
చేతన్-అన్నిటియందున్). ( అన్నిటిన్' అను ద్వితీయైకవచనమునకుఁ
దృతీయా సప్తమ్యర్థములు లేవు). తాౖటన్=(తాటిచేతన్-తాౖటి
యందున్) ( తాౖటిన్' అను ద్వితీయైకవచనమునకుఁ దృతీయా
సప్తమ్యర్థములు లేవు. తాౖడులన్' అను ద్వితీయా బహువచనము
నకుఁ దృతీయా సప్తమ్యర్థములు గలవు).

౧ వివ-అజడవాచకముల ద్వితీయా బహువచనంబునకును నీ
విధి వర్తిల్లును. మనుజుల విప్రుండు (మనుజులలో విప్రుండు)సమధికత్వ
భాజన (శాంతి-౧ ఆ-౭౧) ఘనతర స్తన చక్రవాకముల నలరు
(చక్రవాకములచేత) (హరి-ఉభా-౭ ఆ-పౌఢ-కార-౧౭ సూ) పురు
షులను దృష్టిఁ బొందుట (అను-౨ ఆ-౧౭౫). (పురుషులచేత) పశువు
లను మేటి యజ మఖల చతుష్పదములను ధేనువు మిక్కిలి మానవు
లను ఎగీ బ్రాహ్మణుండు వరిష్ఠించు పక్షులందు శ్యేనము...
(అశ్వ-౨ ఆ-౧౬౧). (పశువులన్=పశువులందు- మొ),

ఉదంత జడంబు తృతీయకు న' వర్ణకంబగు ౨౬
(బా-కార-౨౩) (వ్యా-సం-౨౫౬ I విమ).

నా కతం బున బహు దుఃఖముల్ గలిగె (కర్ణ-3 ఆ-౯౭).
(చూ-కార-౨౩ సూ. ౧ వివ). *

సహజమగు జడంబు ♦ ద్వితీయకుఁ బ్రథమ వైకల్పికంబుగ నగు. ౨౭ (గ్రా-కార-౨౮) (వ్యా-సం-౨౫౭ I వి).

'భరతామ్నాయులకు పాండవేయుల శ్రీ యిమ్మోయిఁ గొనిన... .. (సభా-౨ ఆ-౧౮౫). ఒకట ద్వితీయయు నొకట ద్వితీయార్థక ప్రథమయు నిల్చి సముచ్చితములు గావచ్చును. ఉ. లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగుదు. (ఆది-?-ఆ-౧౫౬).

౧ వివ :—'సహజమగు' అనుటచేతఁ ద్వితీయా సప్తమ్యర్థము లందు వచ్చిన ద్వితీయకుఁ బ్రథమ రాదు. ఉదా:'లంకం గలకలంబు

* అజన్తోదంత తృతీయకును 'న' వర్ణక మేకత్వంబునఁ గలుగు నని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను గాని దానికి బలమైన కవిప్రయోగము లభింపలేదు. (ప్రౌఢ-కార-౧౭ సూ) ఏనుఁగున నేనుఁగు వైచుచు (భాస్కర-యుద్ధ). అని యాతఁ డిచ్చిన ప్రయోగమున "ఏనుఁగుల నేన్గుల వైచుచు" అనునది కవిప్రయుక్త మనవచ్చును. ప్రయోగాంతరము లేదని యాతఁడే వ్రాసెను.

కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి" (ప్రౌఢ-కార-౧౯ సూ). దీనికిని బలమైన ప్రయోగము కానరాదు. ప్రౌఢ వ్యాకర్త యిచ్చిన యుదాహృతు లన్యథా సిద్ధములు: 'మదనాగ మెదిర్చి' అనుచో మగనాగ మెదుర్పన్" అనియు, 'తననారసేంద్ర మ కుక్కురు కులవీరుమీఁద నెపకొల్పి" అనుచో 'తనవారసేంద్రమ న కుక్కురు కుల.." అనియు "త్రక్కతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంచి" అనుచో 'త్రక్కతుహయోత్తము నొక్కెడఁ గట్టఁ బంచి" అనియుఁ గవి ప్రయుక్త పాఠములని చెప్పఁ దగును

పుట్టెను'=(లంకయందుఁ గలకలంబు పుట్టె) అనుచోట 'లంక కలకలంబు పుట్టెను' అనరాదు. (పాము=కూర్మము) కూర్మము నీటిలో నుండి వెడలి విక్రమింపనేరదు గాన "అను-౧ ఆ-౨౩౨' పద్యములోని నీటిలోను వెడలకుండి"అను పాఠము సరి. 'అను-౧ ఆ-౨౩౩' పద్యములోని 'నీర్వెడలి' అను పాఠము కవిప్రయుక్తము కాదు. "నీర్వడసి" అనునది తిక్కయజ్వ ప్రయుక్త మనఁదగును". తీర్థములాడనోపరు'అనుచోట సైతము తీర్థములన్'అను సప్తమ్యర్థక ద్వితీయకుఁ బ్రథమ వచ్చెనని తలంపరాదు ఇది కార-౨౮ సూత్రమునకె లక్ష్యము. ఇట్లె 'పేరోలగంబుండు' మున్నగు స్థలములు సప్తమి కాదేశమగు ద్వితీయ చోట వచ్చిన ప్రథమ యని చెప్పుటకు వలను పడదు. పేరోలగంబు మున్నగునవి ఉదంతములగుటచేత నట్టియెడఁ 'పేరోలగంబునన్' అనియే నిల్చును గాని ద్వితీయయే నిల్వదు కాన నట్టి స్థలములెల్ల కార-౨౮" సూత్రమునకె లక్ష్యములని తలంపకతీరదు

కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు

౨౯ (బా-కార-౨౫) (వ్యా-సం-౨౫౮-౨౫౯ I వివ)

నిన్నవచ్చె=(నిన్నటి దినమందు వచ్చె) రేపు గన్గొనియెదంగా కేమి నేఁడె గెదన్ (మనుచ-౨ ఆ-౧౨) రేపు జనపతి యనికిం జనుట(భీష్మ-3-ఆ-౯) (రేపు=ప్రాతఃకాలమందు) వారు క్రోశము నడచిరి ఆ చోటిచ్చటికొక యోజనంబు గలదు (అర-౨ ఆ-౧౭౩) (యోజనంబు=యోజనమందు)

౧ వివ.—'పేరోలగంబుండు' మొదలగువానిని దీని చొప్పున 'దేశ వాచకముల సప్తమికిని బ్రథమ యగు'నని సూత్రించి సాధింపరాదా యని శంకింపరాదు. (చూ-ప్రౌఢ-కార-౨౦ సూ) 'సూర్యుఁడు తూర్పున నుదయించె' అనుచో 'తూర్పుదయించె" అనరాదు గదా. ఇట్టివెల్ల కార-౨౮ సూత్రమునకు లక్ష్యములనుటయె యుక్తము

విశేష్యంబునకుం బోలె విశేషణంబునకును బ్రాయి

కంబుగ లింగవిభక్తి వచనంబు లగు. ౨౯ (బా_కార_౧౯) (వ్యా_సం_౨౪౯ విష).

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు. దేవకీ పుత్త్రి హరిని నుతింతు నెపుడు. శుభ విధాయుల రామకృష్ణుల భజింతు. భువనవంద్యను రుక్మిణిం బ్రస్తుతింతు ‡

౧ వివ :_పైది సామాన్యవిధి ఇది వర్తిల్లని విశేషస్థలములును గలవు ఉదా:_రాముఁడు నా మిత్త్రము. (తత్స_౧౭ సూ). హనుమంతుఁడు దూత. (తత్స_౬3 సూ). సురలు మహాత్ములు. (తత్స_౬౧ సూ) ఉన్మత్తవేషిణియైన లచ్చి (ఆర_౨ ఆ_౧౧౬) (చూ_తత్స_౧౭ సూ ౪ వివ) తల్లి విదుషి_తండ్రి విద్వాంసుఁడు_మొ

౨ వివ :_నీవలిగిన నడ్డము పుర హరాజకేశవులైనన్ (ఆది_౪ ఆ_౧౯) హరుఁడు వానికిఁ బ్రత్యక్షమై (ఆర_౪ ఆ_౨౪౪) (చూ_వ్యా_సం_విస్త II ౨౪౯ విష). ఇవియు విశేషప్రయోగములె.

3 వివ :_ 'కొన్ని యెడల విధేయ విశేషణ మొండ బహువచనాంతంబయి విశేష్యములు పెక్కిటి కన్వయ యోగ్యంబగు" (ప్రౌఢ_కార_౨౫ సూ). ఉదా_క ఇది దక్షిణాపథంబున కిదియు విదర్భాపురమున కిది కోసలకిం దిది యుజ్జయినికిఁ దెరువులు (ఆర_౨ ఆ_౭౦)చ. నలదమయంతు లిద్దఱు మనః ప్రభవానలదహ్యమానలు (ఆర_౨ ఆ_౨౪) ఇట్లు ద్వంద్వ తత్పురుషములలో నుత్తరపద లింగమే నిల్చును.

౪ వివ _ప్రకృతి వికృతులు చెప్పఁబడునపుడు ప్రకృతి పద వచనమే నిల్చును ఉదా _పదిబల్ల లొక తలు పగుచున్నవి

అప్రాణివాచకములగు స్త్రీసమంబులయిన విశేషణంబులయు మువర్ణకాంత విశేషణములయు బహువచనంబున నేకవచనంబు వికల్పముగా నగు. 30 (బా_కార_౨౦) (వ్యా_సం_౨౬౦_౨౬౦ I వి)

---

‡ 'విశేష్యస్యచయల్లిఙ్గం విభక్తివచనేచయే తాని సర్వాణియోజ్యాని విశేషణ పదేష్వపి" (ముగ్ధ_వ్యాఖ్యా_కార_3౯ సూ)

స్త్రీసమ -మాటలు పెక్కేలె?=మాటలు పెక్కులేల? మువన్నె కాంత -ఇష్టమగు పదార్థములు=ఇష్టములగు పదార్థములు. అప్రాణి వాచకముల కనుటచేత వంద్యములగు దైవతములు జితసింహములగు నేనుంగులు మున్నగుచోట్ల నేకవచనము నిల్వదు *

అన్ని ప్రభృతులయు, సంఖ్యావాచకములయు వాడుకలో మొదట వాడఁబడుదానికిఁ బ్రథమయుఁ దర్వాతి దాని కితర విభక్తియు బహుళముగ నగును. ఇట్టి యెడలఁ గొన్నిచోట్ల షష్ఠీ సమాసమాత్రమె వర్తిల్లుటయుఁ గలదు 3౧ (బా-కార-౨౬ సూ) (వ్యా-సం-౨౬౧ I విష)

అన్ని ప్రభృతులు-అచ్చి-౨౧ సూత్రవివరణమునఁ జేర్పఁబడెను. ఉదా -గుఱ్ఱము లన్నింటికిని=గుఱ్ఱముల కన్నింటికిని, గుఱ్ఱములు నాల్గింటికిని=గుఱ్ఱములకు నాల్గింటికిని. గుఱ్ఱములు లక్షకును=గుఱ్ఱములకు లక్షకును. (సంఖ్యావాచకము లన్నిప్రభృతులలోనివె యైనను నిట్టి సంస్కృత స్థలములకై 'సంఖ్యావాచకములయు' అని వేఱుగ గ్రహింపఁబడెను) కీచకు లందఱును (విరా-౫ ఆ 33౧) దిశలు పదింటను (మహాప్ర-౧ ఆ-౭౮) లోకముల కన్నిటికిన్ (అను-౪ ఆ 3౧౭) షష్ఠీ సమాసమాత్ర-మా యిరువురతో (ఉద్యో ౨ ఆ ౧3౫) వాని యన్నింటికంటెను (ఉద్యో-౨ ఆ ౮౪) మీ యిరువురలో (శల్య-౨ ఆ ౧౦౮) ఇట్టి యెడల 'మేమిరువురతో. అవి యన్నింటికంటె - మీ రిరువురలో'' అను రీతిగల ప్రయోగములులేవు. ♦. కార 3౨

---

* సూరి అప్రాణి వాచకములగు' అని చెప్పకుండుటచేత 'వంద్యమగు దైవతములు జితసింహమగు నేనుంగులు'' మున్నగు ననిష్టరూపము లాతని పక్షమున దుర్వారములు. అట్లే ''అన్నయగు మానిసులు'' మున్నగు ననిష్టరూపములును దుర్వారములే యగు

♦ సూరి యిట్టి షష్ఠీ సమాసస్థలములను జూచికొన్నట్లె యగపడదు

భావ్యర్థ వ్యవధా నాభావస్థలములకన్న నించు కభేద ముండుటచే నిది వేఱుగ నుపదేశింపబడెను

భావ్యర్థక వ్యవధానమున విశేషణము ప్రథమాంతమును విశేష్య మితర విభక్త్యంతమును వికల్పముగ నగును భావ్యర్థ వ్యవధానము లేకున్నను (అధ్యాహృతము కావచ్చును) నట్టి కార్య మగుట గలదు ... ఈవిధి షష్ఠీస్థలమునఁ దఱచుగా నగును. ౩-౨ (బా-కార-౨౭-౨౮). (వ్యా-సం-౨౬-౨ I విష)

'అగు=అవు=ఔ - అయిన=ఐన - అయి=ఐ' మొదలగు నగు ధాతుజ రూపములు భావ్యర్థకములు భవత్యర్థ వ్యవధానమున - సుగుణాభిరాముఁడగు రామునకున్=సుగుణాభిరామునకు రామునకున్. సుగుణాభిరాముఁడగు రామునిచేన్=సుగుణాభిరామునిచే రామునిచేన్. భావ్యర్థవ్యవధానము లేనపుడును-సుగుణాభిరాముఁడు రామునకున్. సుగుణాభిరాముఁడు రామునిచేన్. ప్రయోగములు ౧ వివరణమునఁ జూపఁబడును

౧ వివ -అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేశవార్జున కృతిని (ఆది-౮-ఆ ౩౧౯) ఆచార్యుఁడు ద్రోణునకున్. (ఆది-౫ ఆ-౨౩౩) విద్యాగురుఁడు భార్గవుచే † (ఉద్యో-౪ ఆ-౨౪౬). మాతండ్రి పరాశర సుతుచేతన్ (ఆశ్ర ౧ ఆ ౮౨). దుశ్చారిత్రికుం డాసుయోధనున్ (ఉద్యో-౩ ఆ-౯౮) అస్త్రకళా సముజ్జ్వలుఁడు పార్థుతోడ (కర్ణ-౨ ఆ-౪౨) పార్థివసుతు బిద్దఱన్ (ఆర-౭ ఆ-౧౧౧). తల్లి ద్రౌపదితోడన్ (జై-౧ ఆ-౯౭). ఆద్యుఁడు హిరణ్యగర్భునందున్ (ఆము-౩ ఆ-౮౦) ఉద్దండ ..ఖడ్గవ్యాఘ్రము మిమ్మంచుకొండకు (మనుచ -౨ ఆ-౧౬).

---

† ఇట్టి మహాకవి ప్రయోగములు పెక్కుగలవని సూరి చూచి కొనలేదు

౨ వివ :— భావార్థ వ్యవధాన మనుచోటి యాదిశబ్దముచేత సుగుణాభిరాముఁడని యెన్నఁబడిన రాముఁడు" పుణ్యశ్లోకుఁడనఁగ .. యజ్ఞరతుఁడనఁగఁ దనరిన నలు భార్యను దమయంతి యనఁగఁ బఱఁగిన దానన్ (ఆర-౹ ఆ-౯౯). మున్నగు స్థలములు సంగ్రహింపఁబడు చున్నవి

3 వివ :— ఉన్న-కల-వ' వర్ణకాదులగు కర్త్రర్థకాదులే కాక భావార్థక స్థలములగు 'రాముఁడు వచ్చుట మేలు' మున్నగువాని యందును గ్రియ నిరాశ్రయమై యుండుట యసంభవమగుటచేత నా భాస కర్తృత్వము వెలయుచుండును (చూ-వ్యా-సం-౹౬౫ II వివ). కాన నచటి కర్త్రర్థ మభిహిత మగుటచేతఁ దృతీయాదులు రాక ప్రాతి పదికార్థ ప్రథమయె వచ్చుచున్నదనఁదగును గాన నట్టి భావార్థకా (ట-అమి-మొ) ద్యన్వయమునందును బ్రథమావిభక్తి వచ్చునను విధాన ములు (సూరిగా * రివి) సిద్ధార్థానువాదములె కాన వానిని వేఱుగ నుపదేశింప నక్కఱలేదు

---

* ఇట్లు వాక్య న్యాయసిద్ధములగు ప్రాతిపదికార్థ ప్రథమలని భావింపఁజాలక సూరి యీ క్రింది సూత్రములను సయితము పునరుక్త ముగా సూత్రించెను. అవియెల్లఁ బ్రతాఖ్యేయములు. వాని నిటఁ జూపు చున్నాను.

భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకు నద్దాని
ముందటి విశేషణంబులకయి పదంబును బహుళంబుగా
ననుప్రయుక్తం బగు. ౨— (వ్యా-సం-౹౬3 I వివ).

అతులుఁడై యప్రమేయుఁడౌ హరిని గొలుతు. (వాక్యసం బద్ధాతమగు. 'అయి' శబ్ద మనుప్రయుక్త మనుట సరికాదు )

అయి పదానుప్రయోగంబు లేనిచోఁ దుది విశేష
ణంబునకేని విశేషణాబు లన్నింటికేని మీఁద సముచ్చ

యార్థంబు విభాషం బ్రయోగింపఁబడు ౩ం (వ్యా-
సం ౨=3 I వివ).

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరినిఁ గొలుతు ఆద్యుఁడు నప్ర మేయుఁడునౌ హరినిఁ గొలుతు ఆద్యుఁ డప్రమేయుఁడగు హరినిఁ గొలుతు.

ధాతుజ విశేషణవ్యవధానంబున విశేషణంబు లన్నింటి
కయి పదం బనప్రయుక్తం బగు. ౩౧. (వ్యా-సం_౨=3
I వివ)

ఆద్యుఁడై యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు. ఇచట మఱియుం బ్రయోగ వైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది ఇట సూరి యుద్దేశించిన వీక్రింది రీతివి కానోపును - క ..బ్రాహ్మణప్రియమయి ధర్మ్యంబయి క్షత్రియ వైశ్యకు లం బవిరత పుణ్యకర్మలాలసమగుచున్ (ఆది_౮ ఆ_౮) ఆయతమతులయ్యు నోరుల కలవియె చెప్పన్ (ఆర ౦_ఆ ౧_౨") (ఇట ధాత్వంతర జన్య విశేషణ ప్రయోగము లేదు)

భావార్థకాది యోగంబునం గర్తకుఁ బ్రథమ యగు.
౩౨ (వ్యా-సం_౨=3 I వివ ౧౦౮ పుట)

క్రియా_3" సూ_మొ ౪౭ వ. కల సూత్రములలో విధింపఁబడిన 'ట' వర్ణకాదులును గ్రియా ౧_౨_౨ సూత్రమున విధింపఁబడిన 'నుజ'యు భావార్థకాదు లనఁబడును. ఉదా _రాముఁడు వచ్చుట రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె. రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులం బగు, రాముఁడు పట్టిన ప్రతిన. వీనిని బురోహితుండుగా._వీనిని బురోహితునిగా మున్నగు వానియందు 'కాన్' అనునది యనుప్రయుక్త శబ్దమనియు, (బా_క్రియా-౧౧" సూ) విశేష్య విభక్తి వచనములు విశేషణమున కయ్యెననియు నట్టి 'కాన్' శబ్దాంతము క్రియావిశేషణమయ్యెననియు నెఱుంగునది

ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేక త్వంబున 'వు_ను'లును బహుత్వంబున 'రు_ము'లును నం తాగమంబులు ప్రాయికంబుగ నగు. 33 (బా-కార_33)

ఈ యాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వంబగు. 38 (బా_కార_38) (వ్యా-సం_౨౬ I విమ).

నీవు ధన్యుఁడవు నేను ధన్యుఁడను. మీరు ధన్యులరు. మేము ధన్యులము. ఇకారంబుమీఁది 'సు_ను_వు_క్రియా విభక్తుల' యుత్వం బున కిత్వంబగు". (తత్స-౨౬) అను సూత్రముచేత 'వు_ను'ల కిత్వం బగు నీవు సుకృతివి. నేను సుకృతిని. షష్ఠీ విశేషణ ప్రథమయందును నీ విధి వర్తిల్లును ఉదా-మహాత్ముఁడవగు నీకు_మొ.

గీ ఆర్తిహరుఁడగు నినుఁ గొల్తు నంబుజాక్ష' † 'గర్వగరిష్ఠుండగు

ఇట్లే ప్రౌఢవ్యాకరణమునందును కార ౨౧ సూత్రమును ననా వశ్యకమగుటచేఁ బ్రత్యాఖ్యేయము భుజాటోప భయంకరుఁ డర్జును కోపానలము'' (ఉద్యో-౧ ఆ ౪౬) మున్నగు ప్రయోగముల లోని అర్జును'' మున్నగునవి యొకట' విభక్తి లోపించిన వ్యస్త షష్ఠ్యంత పదములనుటలో క్షతి యేమియుఁ గానరాదు (చూ-కార- ౧౯ సూ).

అట్లే ప్రౌఢ-కార_౨3 సూత్రమును బ్రత్యాఖ్యేయమె అందలి యుదాహృతులన్నియుఁ గారక సూత్రాంతరసాధ్యములె. (చూ-వ్యా- సం_౨౬ ౨ విమ ౧౦౮౦ పుట). 'నన్నుఁ గొన్ని వెడమాటలాడుచు నతఁడు చెట్టవట్టినన్' అని వాక్యాన్వయసిద్ధముగా నన్వయింపనగునుగదా. దీనికై క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామిభావ సంబం ధముగలచో సంబంధి పదంబు షష్ఠకి ద్వితీయ యగు''నని సూత్రింపనేల?

† 'ఆర్తిహరుఁడవౌ నిను' అను పాఠము (బాల_కార_38 సూ) ప్రామాదికము బాల వ్యాకరణ ప్రథమ ముద్రణముననును నిట్లే యున్నది.

నన్ను (నిర్వ-2 ఆ-౯౧) మీరలు పెద్దలు" ఇత్యాదులు ప్రాయిక గ్రహణంబుచే రక్షితంబులయ్యె.

అదిశబ్దంబునకు 'వు-ను' లు-పరంబు లగునప్పుడును సంబోధనంబునందును దాన' యను నాదేశంబగు 31 (బా-కార-31) (వ్యా-సం-౨౬౮ I)

నీవు చిన్నదానవు నేను చిన్నదానను, ఓచిన్నదాన.

అన్య యుష్మ దస్మ త్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు 33 (బా-కార-33) (వ్యా-సం-౨౬౮ II విష)

వారును మీరును ధన్యులరు మీరును మేమును ధన్యులము.

౧ వివ :- ఈ కార్యము క్రియలయందును గల్గును ఉదా వారును మీరును జయించితిరి. మీరును మేమును (మనము) జయించితిమి. ప్రార్థనాద్యర్థమునందు (చూ-క్రియా 33) 'అ'త్వము సైతము వచ్చును మీరును మేమును ననఁగా మనము చదువుదము ప్రార్థనము లేనపుడు తద్ధర్మాద్యర్థమున మనము చదువుదుము అనియె యగును (చూ- వ్యా-సం-350 విష ౧౬౯-౧౭౦ పుటలు)

ఏకవాక్యంబునం దొకానొకండు దక్క సర్వపదంబులును గ్రమనిరపేక్షంబుగం బ్రయోగింపం జను 32. (బా-కార-32) (వ్యా-సం-౨౬౫-౨౬౭ I విష)

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు ముఖ్యముగాఁ బద్యములందుఁ బ్రకృతార్థ ప్రకాశకతకు భంగము లేకుండఁ బ్రయోగింపందగును. * ఏని ప్రభృతి శబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబులయి యుండును. ఉదా -రాముఁడేనిఁ గృష్ణుఁడేనిఁ భజింపందగును మె. (ఏని రాముఁడ' మున్నగు రీతిని బ్రయో

---

* సూరి 'వలచినట్లు అని సూత్రించుట సరికాదు.

గింపరాదు) ప్రకృతార్థ ప్రకాశకతకు భంగము లేకుండునట్లుగ నను టచేత 'రాముఁడు రావణుని జంపెను గుంభకర్ణుని' అను రీతిని బ్రయోగింపరాదు ప్రకృతార్థ ప్రకాశకతకు భంగములేకుండ విశేషణ విశేష్యములును బదాంతరవ్యవహితములు కావచ్చును. ఉదా:- చ. భవ జ్జనకుఁ బరీక్షితున్... చేసె .. అతిదాంతు- (భార ఆది ౧ ౧౨౮ ప).

౧ వివ :- వాక్యాంతర గర్భితవాక్యముల ప్రయోగమును గలదు. ఉదా - ...ఆయుధిష్ఠిరుఁడు దమ్ములకు ..మీరు ..అంబికేయుని . పంచిన యట్లచేసి చరింపుఁడు అని యను దినంబుఁ జెప్ప .. (ఆశ్ర-౧ ఆ ౧౦) తెల్లున నర్థర్చము తుదిని బదావసానము కాన క్కఱ లేదు- అధ్యాహారములు సంస్కృతమునవలెఁ జేయనగును. పద్యాంతరములతోఁ గులకము నుండవచ్చును. ఉ . తానొకపందు చెచ్చెరన్ క. కొని వచ్చుడు.. (ఆది ౨ ఆ ౧౯౯-౨౦౦).

ఇది కారక పరిచ్ఛేదము

(సమా-౧ సూ.) సామర్థ్య ద్వైవిధ్యము-సమాసము

# బాలవ్యాకరణోద్ద్యోతము

## VI సమాస పరిచ్ఛేదము

పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థమునందు వృత్తి యేకార్థీభావ సామర్థ్యంబు. ఇది సమాసము లందలి సామర్థ్యము. వాక్యములందలి పదముల యన్వయము (రాముఁడు రావణుని జంపె) వ్యపేక్షా సామర్థ్యము. ౧. (బా-సమా-౧ సూ) (వ్యా-సం- ౨౬౬-I-II-III-IV వి).

పరస్పరాన్వయముగల పదములు సముదాయశక్తిచే విశిష్టైకార్థ బోధకంబులగుట సమాసమని తాత్పర్యము. సమాసార్థ

బోధక వాక్యము సమాస విగ్రహము. సమాస మనఁగా సంక్షే పము. విభక్త్యాది లోపమునఁ బదము సంక్షిప్త మగుటయు ననేక పదంబు లేకీభవించి యొక్క పదంబగుటయు నిందు సంభవించును.

౧ వివ :—వృత్తు లయిదు విధములు - కృత్తద్ధిత సమాసైక శేష సనాద్యన్త ధాతు రూపాః పఞ్చ వృత్తయః' విగ్రవాక్యావయవ పదార్థేభ్యః పరః అన్యః యోాయం విశిష్టైకార్థః తత్ప్రతిపాదికా వృత్తి రిత్యర్థః" (సి-కౌ-౪౧౭ పుట బాలమ-వ్యా). సమాస వృత్తియందును దద్భిన్నవృత్తులందును విభక్త్యాదుల లోపము గల్గును ౧ కృద్వృత్తి:- ఏలిక=(జనుల నేలువాఁడు. ఇది దీని విగ్రహము. ఇందలి 'ఇక' అను కృత్ప్రత్యయము కర్త్రర్థకము). ఇది సాధ్యము. (అచ్చ తెల్గుది) సిద్ధమగు కృద్వృత్తి:-సరోజము (సరసి జాయత ఇతి సరోజమ్. ఇది దీని విగ్రహము) (సరస్సునందుఁ బుట్టునది) ౨ తద్ధితవృత్తి.-రాముని తనము=(ఇది సాధ్యము )=రామత్వము=(ఇది సిద్ధము). (రాముని యొక్క భావము). ఇందలి 'తన' ప్రత్యయము భావార్థక తద్ధితము. 3. ఏకశేషవృత్తి. దీనికి ద్వంద్వసంజ్ఞయు సమాససంజ్ఞయు లేవు. ఉదా-పితలు=(మాతాచ+పితాచ=పితరౌ=తల్లిదండ్రులు). రాములు= (రామశ్చ+రామశ్చ+రామశ్చ=రామాః) ఇది సిద్ధము. సాధ్యము:- తల్లులు=(తల్లియుఁ+దల్లియు) తండ్రులు = (తండ్రియుఁ+దండ్రియు). ౪ సనాద్యంత ధాతువృత్తి-చికీర్షువు = (కర్తుమిచ్ఛుః)=(చేయ నిచ్ఛ గలవాఁడు). (ఇది సన్నంతధాతువృత్తి) జేగీయమానుఁడు=(పునః పున రత్యన్తం వా గీయమానః)=(మాటిమాటికిని లేదా మిక్కిలిగను గానము చేయఁబడినవాఁడు) ఈవృత్తి సిద్ధమాత్రమె. ౫ సమాస వృత్తి:-ఈ ప్రకరణమున వివరింపఁబడు తత్పురుషాదికము. ఉదా:- రాజపురుషుఁడు=(రాజ్ఞః+పురుషః)=(రాజుయొక్క పురుషుఁడు) (ఇది సిద్ధము). రాజుపురుషుఁడు=(ఇది సాధ్యము).

౨ వివ :— 'రాజపురుషః' అను దానికి 'రాజ్ఞః+పురుషః' అను

నది లౌకికవిగ్రహము లౌకికవిగ్రహమనఁగాఁ బ్రయోగయోగ్యము. ప్రయోగయోగ్యము కానిది యలౌకిక విగ్రహము. 'రాజన్+అస్+పురుష+సు' ఇది యలౌకికవిగ్రహము. ఇట్టి యలౌకిక విగ్రహము నందె కృత్తద్ధిత సమాసముల వివక్షచేతఁ గృత్తద్ధిత సమాసంజ్ఞలు గలిగి కృత్తద్ధిత సమాసాంతత్వమునఁ బ్రాతిపదిక సంజ్ఞలు గల్గును. అట్టి ప్రాతిపదికమున కవయవముల లోనివగు సుప్ప్రత్యయాదులు(ఆది శబ్దముచే ద్వంద్వ చకార మధ్యమ పదాదులు గ్రాహ్యములు) "సుపో ధాతు ప్రాతిపదికయోః" (౨-౪-౭౧) (సి-కౌ ౭౨౦ సూ. సి-కౌ ౩౧౯ పుట) అను సూత్రముచే లోపించి కృత్తద్ధిత సమాస ప్రాతిపదికము లేర్పడును. కృత్-సరోజ-రామ తద్ధిత-రామత్వ-దాశరథి. సమాస -రాజపురుష ఇట్లె సాధ్య ప్రాతిపదికములను నెన్నవలయును

౩ వివ — సాధారణముగా సుబంత పదములకే సమాసము గల్గును. తిజంతములకు సమాసము సాధారణముగాలేదు. 'ప్ర+నమతి=ప్రణమతి=(నమస్కరించుచున్నాఁడు). ని+సిధ్+తి=నిషేధతి=(నిషేధించుచున్నాఁడు)" మున్నగునవి సమాస విశేషములని ముగ్ధబోధవ్యాకర్త వచించెను. ఏకార్థీభావ సామర్థ్య ముండుటచే సమాసత్వ మంగీకరించినను వానికి ద్వంద్వాది సంజ్ఞలులేవు (ముగ్ధ ౩౧౯ సూ) ప్రణమతి" మున్నగునవి 'ప్ర-నమతి-" మున్నగు రీతిని వ్యస్తపదములె యని పాణినీయ సిద్ధాంతము. "ఉపవసించెను-నమస్కరించెను - అలకరించుచున్నాఁడు - అనుభవించు" మున్నగునవి యాంధ్ర మహాకవి ప్రయుక్తములగుచుండుటచేతను దెలుంగునఁ బ్రాదులకుఁ బ్రయోగము లేకుండుటచేతను నవి సమాసములౌ యనుట యాంధ్ర మహాకవి సమ్మత మనఁదగును.

౪ వివ —సాధారణముగ వ్యస్తపదాకాంక్షితమగు పదమునకుఁ బదాంతరములతో సమాసము గల్గనేరదు. అట్టి యేకదేశాన్విత పద సమాసము సాధారణముగా దుష్ట మందురు. కాని "బుద్ధస్య రాజ్ఞో

మాతఙ్గాః=బుద్ధస్య రాజమాతఙ్గాః'' అను రీతిగల సమానాధికరణా న్వయము గల్గిన యేకదేశాన్వయముగల పదములకు సమాసము కాద నియు "దేవదత్తస్య గురుకులమ్-బాణేన భిన్నహృదయః'' అను రీతి గల్గిన వ్యధికరణాన్వయముగల యేదేశాన్వయ సమాసములు సాధు వులనియు సంస్కృత వైయాకరణ సిద్ధాంతము. అట్లయినను ప్రామా ణికాంధ్ర మహాకవులు వ్యధికర ణైకదేశాన్వయ సమాసములతో పాటుగ సమానాధికరణైకదేశాన్వయ సమాసములను సయితమం గీకరించి ప్రయోగించిరి. వ్యధికరణాన్వయ:- అవనీశులెల్ల నీ యనుజ వీర్య విజితులు (సభా-౧ ఆ-౨౭) అతని కరతల ద్వయావమర్దిత ములై (అర-౨ ఆ-౧౯౭). నావీర్య ప్రభవులు (ఆది-౮ ఆ-౩౦౧). తన యశోవిశద ముక్తాసౌధపాళికి (వసు-౧-ఆ-౧౧౬). సమానాధికర ణాన్వయ:-ఆ నారాయణ పాండవేయగుణమాహాత్మ్య మలజ్యోత్స్న (ఆది-౩ ఆ-౨౧) ఆ రథాధిరూఢుఁడు (అర-౨ ఆ-౧౮౩). ఆ పర్వ తాగ్ర హేమైక శృంగంబు (నన్ని-కు-౧ ఆ-౨). దానవికిఁ జేసిన నెయ్యము (ఆది-౩ ఆ-౧౮౬). దానముచేసిన తత్ఫలంబు (ఆది-౧ ఆ-౧౫) అరయ భూమి కుచాగ్రహారాభమైన శ్రీతెనాల్యగ్రహార నిర్ణేతవు (పాండు-౧ ఆ-౨౩). ఇట్టి ప్రయోగములనుబట్టి చౌదళా ఞ్జంబు-(బస-౧ ఆ-౩౮) ముల్లోకవంద్య (బసవ-౨ ఆ-౬౦౭) మున్న గునవెల్ల వైరి సమాసములని తత్పూరికాకర్తవలె భ్రమింపక యేకదే శాన్వయ సమాసములని తలంపవలయును.

౫ వివ :-సామాన్యముగా సమాస మైచ్ఛికము. అట్లయినను 'కృష్ణసర్పము'=(నల్లని సర్పము) మున్నగునవి నిత్యసమాసము లని యెఱుంగునది. "రాముఁడు జామదగ్న్యుఁడు. 'అయం రామః'' మున్నగు చోటులందు సమాసము గల్గనేరదు.

౬ వివ,- సమాసము పదాంతర వ్యవధాపితము సాధారణ ముగాఁ గాదు. కాని కొన్ని యెడలఁ గ్రియాజన్య విశేషణ ఘటి

తంబులు సందర్భయోగ్య పదవ్యవధాపితములగుచు విశేషణోభయ పద కర్మధారయంబు లగును (ప్రౌఢ-సమా-౧౮ సూ) ఉదా:- ఈ కన్నులు తెఱవని శిశువు (భోజ-౬ ఆ). ఇరుల గెలిచిన తుమ్మెద గఱులc దెగడు కురుల (భాగ-౧౦ స్క-౦). ఏకతమ తిరుగు నదరు లు మిసెడు కొఱవిదయ్యంబు (నైష-౨ ఆ) బాగుగc గొన్న రవి ప్రకాశమై యలరుచు నున్న పుష్పకమునందు (భాస్కర-ఆరణ్యకాండ) ఆనక దుందుభి నరాని వినరాని దుర్వాక్య సూచుల...(విష్ణు-౭ ఆ) క చిక్కని చక్కని నున్నని ప్రుక్కని సోలూడ్వcబడని ఘుల్లి సెగ లచే నొక్కcబడని దండంబులు (విజ్ఞా-ఆచార కాండ) ఇట్టి ప్రయోగములు కవిత్రయము వారివి దొరకలేదు.

౭ వివ — సమా-౧ సూ-౨ వివరణమునc జెప్పcబడిన రీతిగా సమాసవిభక్తి లోపించునుగాని కొన్ని యలుక్ సమాసములు విధానసామర్థ్యమున సాధువులగును. 'జనుపాంధుcడు-పశ్యతోహరుcడు-మాతుష్ష్వస'' మున్నగునవి సిద్ధములగు నలుక్సమాసములు (చూ-సమా-౮సూ) ఇంక సాధ్యములగు నలుక్సమాసములు రాముని గుణములు-రాముల గుణములు-(సమా-౭౨) నీచేతి ప్రోపు-నాతోడి చెలిమి-దొంగవలని భయము-నీయందలి కరుణ.(చూ-సంధి-౪౦సూ) తలcబ్రాలు-ఒడిcబ్రాలు-సేసcబ్రాలు-ఊరcబంది-ఊరcబిచ్చుక (సంధి ౨౬ సూ) ఉత్తరపదలోపి సమాసములు నీ చేతి ప్రోపు-మొదలొక్కన్నవి.

౮ వివ .— "సంస్కృత వ్యాకరణమునc బూర్వనిపాతము పరనిపాతము' అను విషయమున మిక్కిలి విస్తృతముగాc గలదు. కాని యది కవి ప్రయోగానుసారమె. వధూవరులు-వరవధువులు (సోఽభవ ద్వరవధూ సమాగమః)(రఘువం-ముగ్ధ-3.౨౧ సూ-దుర్గా.వ్యా) లక్షణహేతువులు (పాణిని సూత్రము). అల్పాచ్చులు గలదగుటచేత హేతుశబ్దము పూర్వస్థమై యుండి హేతులక్షణములని యుండ

వలయునుగదా. అల్పాచ్చులుగల శబ్దము లఘ్వక్షరములుగల శబ్దము నభ్యర్హితవాచకము మున్నగునవి ద్వంద్వమునఁ బూర్వనిపాతము కావలెనను నది సత్యముకాదని యెఱుంగునది ఇట్లె సమానాధికరణములలో విశేషణము పూర్వస్థము కావలెను మున్నగునవియు. మయూర వ్యంసకము'=(ధూర్తమగు మయూరము) మున్నగునవి విశేష విధుంచే సాధువులు.

సిద్ధసాధ్య భేదమున నీసమాసము రెండువిధములు. సంస్కృతమందే సిద్ధించిన దనఁగా సంస్కృత విభక్త్యంత విగ్రహము గలది సిద్ధము. ఆంధ్ర విభక్త్యంత విగ్రహము గలది సాధ్యము. ౨. (బా-సమా-౨-3) (వ్యా-సం-౨౬౭ I విష).

సిద్ధ సమాస లక్షణము సంస్కృత వ్యాకరణాదుల వలననే తెలిసికొనవలయును సాధ్య మాంధ్రవ్యాకరణ సాధ్యము ముందు వివరింపఁబడును

— సి ద్ధ స మా స ము లు —

సిద్ధసమాసము లాఱు విధములు - ౧ అవ్యయీభావ సమాసము. ౨ తత్పురుష సమాసము. 3 కర్మధారయ సమాసము. ౪ ద్విగు సమాసము. ౫ ద్వంద్వ సమాసము. ౬ బహువ్రీహి సమాసము. 3 (వ్యా-సం-౨౬౮ I విష)

సాధారణముగాఁ బూర్వ పదార్థ ప్రధానము 'అవ్యయీ భావము'. ౪ (వ్యా-సం-౨౬౮ II విష).

యథాశక్తిగ నిచ్చెను. (శక్తి మనతిక్రమ్య=యథాశక్తి). ఇందలి యథా' అను పూర్వావయవము ప్రధానము గాన నిది యవ్యయీ భావము ప్రధాన మనఁగాఁ క్రియతో నన్వయించునది. ఈ సమాసమునం దవ్యయము పూర్వపదమై యుండును. ఇది నపుంస

కమువలె నుండి యవ్యయ మగును. ఇట్టి సిద్ధసమాసావ్యయీభావ
ము పైనిఁ దెల్గు విభక్తులు గొన్నియెడల నిల్చుటయుఁ గలదు ఉదా:-
నా యథాశక్తిఁ జేసి (సభా-౧ ఆ-౫౭) కేవలావ్యయముల మీఁది
విభక్తులు.-చెడు నిహాముం బరంబు (ఆది-౧ ఆ-౧౩౯).

తత్పురుష కర్మధారయ ద్విగువులు సాధారణ
ముగా నుత్తరపదార్థ ప్రధానములు. ౫. (వ్యా-సం-
౨౬౮ III విష)

ద్విగుకర్మధారయములు తత్పురుషాంతర్భూతములె యం
దురు తత్పురుషము వ్యధికరణము. ద్విగుకర్మధారయములు
సమానాధికరణ సమాసములు.

సమానావయవ శబ్దధర్మములు విభిన్నాధికరణము
లగును గాన తత్పురుషము వ్యధికరణ సమాసము.
౬. (వ్యా-సం-౨౬౮ III విష).

రాజపురుషుఁడు వచ్చెను (రాజ్ఞః పురుషః-రాజ పురుషః)=
(రాజుయొక్క పురుషుఁడు) ఇందు రాజత్వము రాజునందును బురు
షత్వము పురుషునందును నుండును గాన నిది వ్యధికరణ సమా
సము. ఇందలి యుత్తరపదమగు 'పురుషుఁడు' అనునది క్రియతో
నన్వయించుచున్నది గాన నిది యుత్తరపదార్థ ప్రధానము. తత్పు
రుష సమాస మేడు విధములు-

I ప్రథమా తత్పురుషము-ఉదా-పూర్వకాయము=(పూర్వః
+కాయస్య)=(శరీరముయొక్క పూర్వభాగము). II ద్వితీయా తత్పురు
షము-ఉదా:-దుఃఖాతీతుఁడు=(దుఃఖ+మతీతః) = (దుఃఖము నతిక్ర
మించినవాఁడు). III తృతీయా తత్పురుషము-ఉదా -మాసావరుఁడు=
(మాసేన+అవరః)=(మాసముచేత జిన్నవాఁడు) IV చతుర్థీ తత్పురు
షము-ఉదా:- యూపదారువు=(యూపాయ + దారుః) = (యూపము
కొఱకు దారువు) V పంచమీ తత్పురుషము-ఉదా -చోరభయము=

(చోరాత్ + భయమ్) = (చోరునివలన భయము). VI షష్ఠీ తత్పురుషము-ఉదా.-రాజపురుషుఁడు = (రాజ్ఞః+పురుషః) = (రాజుయొక్క పురుషుఁడు) VII సప్తమీ తత్పురుషము-ఉదా:-దానశౌండుఁడు = (దానే+శౌణ్డః)=(దానమందు సమర్థుఁడు)

ఉత్తరపదార్థ ప్రాధాన్యము లేకున్నను గొన్ని తత్పురుషములై యనఁబడును. ఇట్టివి తత్పురుష విశేష విధులు ౭. (వ్యా - సం - ౨౬౮ IV వి ౧౧౩౧ పుట)

ఉదా -అకించనుఁడు=(నాస్తి కిఞ్చన యస్యసః)=(ఏమియు లేనివాఁడు). అకుతోభయుఁడు=(నాస్తి కుతో భయం యస్యసః)=(దేనినుండియు భయము లేనివాఁడు). ఇట్టివి త్రిపద తత్పురుషము లనఁబడును. అబ్రాహ్మణుఁడు=(న బ్రాహ్మణః=అబ్రాహ్మణ )=(బ్రాహ్మణుఁడు కానివాఁడు). ఇట్టివి 'నఞ్' తత్పురుషము లనఁబడును. అతిమాలుఁడు=(మాలను=మాలిక నతిక్రమించినవాఁడు) (అతిక్రాన్తో మాలామ్=అతిమాలః) ఇట్టివి పూర్వపదార్థ ప్రధాన తత్పురుషము లనఁబడును. ప్రాచార్యుఁడు = (ప్రకృష్టః+ఆచార్యః=ప్రాచార్యః)=(ప్రకృష్టుఁడగు గురువు). ఇట్టివి ప్రాది సమాసము లనఁబడును.

విశేష విధులచేఁ గొన్ని సమాసములందు విభక్తి లోపము గల్గదు అవి యలుక్సమాసము లనఁబడును. ఇవి తఱుచుగాఁ దత్పురుషము లగుచుండును. ౮. (వ్యా-సం-౨౬౮ X విష).

I తృతీయా ఽలుక్సమాసము-ఉదా :-జనుషాంధుఁడు=(జనుషా+అన్ధః)=(జన్మముచేతనే యంధుఁడు=జాత్యంధుఁడు=పుట్టుగ్రుడ్డి).

II చతుర్థ్యలుక్సమాసము-ఉదా:-ఆత్మనే పదము=(ఆత్మనే+పదమ్)=(ధాతురూప విశేషము) పరస్మైపదము=(పరస్మై+పదమ్)=(ధాతురూప విశేషము).

III పంచమ్యలుక్సమాసము - ఉదా .- పశ్యతోహారుఁడు = (పశ్యతం + హారః =పశ్యన్త మనాదృత్య హారతీత్యర్థః). (చూచుచున్న వానిని వంచించి దొంగిలించువాఁడు).

IV షష్ఠ్యలుక్సమాసము-ఉదా.-పితురన్తేవాసి=(పితుః+అన్తేవాసీ)=(తండ్రియొక్క శిష్యుఁడు) హోతుః పుత్త్రుండు=(హోతుః+పుత్త్రః)=(హోతయొక్క కొడుకు - యజ్ఞములో హోమము చేయువాఁడు హోత) పితుఃష్వస=పితుఃస్వస=పితృష్వస (పితుః+స్వసా)=(తండ్రికి సోదరి=మేనత్త) మాతుష్వస = మాతుఃస్వస - మాతృష్వస=(మాతుః+స్వసా)=(తల్లికి సోదరి=పినతల్లి-పెదతల్లి). దేవానాంప్రియుఁడు=(దేవానామ్+ప్రియః)=(మూర్ఖుఁడు-బౌద్ధుఁడు)

V తత్పురుషేతరములును నలుక్సమాసములు గలవు. కృద్వృత్తి-సప్తమ్యలుకులు -యుధిష్ఠిరుఁడు=(యుధి+స్థిరః)= (ధర్మరాజు= యుద్ధమున స్థిరుఁడు). సరసిజము=(సరసి+జాయతే)=(సరస్సునందుఁ బుట్టినది=పద్మము) మనోజుఁడు=(మనసి+జాయతే)=(మన్మథుఁడు= మనసునందుఁ బుట్టువాఁడు)

VI వ్యధికరణ బహువ్రీహి-సప్తమ్యలుక్సమాసము-ఉదా:- కంఠే కాలుఁడు=(కణ్ఠే+కాలో యస్యసః)=(శివుఁడు=కంఠమునఁ గాలకూటపు నలుపు గలవాఁడు )

సమాసావయవ శబ్దముల ధర్మములు సమాసావయవములలోని యొక్క యాధారమందే యుండును గాన ద్విగుకర్మధారయములు సమానాధికరణ సమాసములు ౯. (వ్యా-సం-౨౬౧ IV విష).

సంఖ్యావాచక విశేషణ పూర్వము ద్విగువు. తక్కిన విశేషణము మొదటఁ గలది కర్మధారయము. ద్విగు :- చతుర్యుగము. ఇందు 'చతుష్ట్వమును యుగత్వమును యుగమందే యుండును, కర్మ-నీలోత్పలము. ఇందు నీలత్వమును నుత్పలత్వమును నుత్పల

మందే యుండును. కాన నివి సమానాధికరణములు. 'చతుర్యుగము వర్తిల్లును' 'నీలోత్పలము రాజిల్లును' అను రెండిటియందును నుత్తర పదములే క్రియతో నన్వయించుచున్నవి కాన నివి యుత్తరపదార్థ ప్రధానములు.

కర్మధారయ సమాసమునఁ బూర్వావయవము సాధారణముగా విశేషణమై యుండును. కొన్నిటి యందు విశేష్యపూర్వ పదత్వమును గలదు. ౧౦. (వ్యా-సం-౨౬౮ IV విష.).

ఉదా :- నీలోత్పలము = (నీలం చ తత్ ఉత్పలంచ = నీలోత్పలమ్.)=(నల్లని కలువ).

సమానాధికరణ సమాసములందు భాషిత పుంస్కములకుఁ బుంవద్భావ మగును, ౧౧. (వ్యా-సం-౨౬౮ IV విష) (౧౧33 పుట).

విశేషణము స్త్రీలింగమైనను బుంలింగ రూపముతో నిల్చునని యర్థము. భాషిత పుంస్కమనఁగాఁ బున్నపుంసకత్వములందుఁగాని పుంస్త్వ స్త్రీత్వములందుఁగాని యర్థభేదములేక యేకాకారమున వర్తిల్లునది (తుల్యప్రవృత్తి నిమిత్తకము) "రక్తః పురుషః-రక్తాస్త్రీ-మృదుః పురుషః-మృదువస్త్రమ్." అను రీతిని-'రక్త-మృదు' మున్నగునవి (విశేషణములు) (విశేష్య నిఘ్న విశేషణములు) భాషిత పుంస్కములు. ఉదా:-రక్తలత=(రక్తా చ సా లతాచ=రక్తలతా)=(ఎఱ్ఱని లత). మహానవమి (మహతీ చ సా నవమీచ=మహానవమీ) = (గొప్ప నవమి) సమానాధికరణ సమాసములలో మహచ్ఛబ్ద తకారము లోపించును. ముందటి 'అ'కార మాకార మగును. ఉదా:-మహారాజు మొ. సూత్రమున సమానాధికరణసమాసములందనుటచేత సమానాధికరణ బహువ్రీహులందును బుంవద్భావ మగును. ధ్వస్తమాయుఁడు=(ధ్వస్తా+మాయా యేనసః) మొ.

౧ వివ :- సర్వనామ శబ్దములకు వృత్తి మాత్రమున బుంవ

ద్భావమగును. ఉదా:-పూర్వశాలుఁడు=(పూర్వస్యాం శాలాయాం భవః) = (తూర్పుదిక్కునందలి శాలయందుఁ బుట్టినవాఁడు). సర్వపతి=(సర్వాసాం స్త్రీణాం పతిః=సర్వపతిః)=(అందఱు స్త్రీలకును బతి) (సర్వస్యామ్=సర్వత్ర)=(ఇది తద్ధితవృత్తి).

తత్పురుష కర్మధారయ ద్విగువుల తుదిని గొన్ని యెడల సమాసాంత ప్రత్యయములు నిల్చును. ౧౨.

౧ వివ :- 'సఖి-అహన్-రాజన్' శబ్దములకు 'ష' ప్రత్యయమగును. షకార మిద్వర్ణము. ఉదా:-కృష్ణసఖుఁడు=(కృష్ణస్య+సఖా) పరమాహము =(పరమంచ తత్ అహశ్చ-అహః-అహ్నా = అహనీ-అహాని. 'అహన్' శబ్దము సమాసమునఁ బులింగ మగును). అతిరాజు= (రాజాన మతిక్రాన్తః) (రాజు నతిక్రమించినవాఁడు) మహారాజు=(మహాం శ్చాసౌ రాజాచ=మహారాజః) ('రాజన్' శబ్దము). 'ష' ప్రత్యయము షిత్తుగాన నేతదంతములకు 'ఙీప్' వచ్చును. మహారాజ్ఞి-మొ.

౨ వివ :-అహోరాత్రముల భాగము లేకదేశము లనిపించుకొనును. ఏకదేశవాచకములకును, సర్వాది శబ్దములకును, బరమగు రాత్రి. శబ్దమునకు 'ష' ప్రత్యయమగును. ఉదా:-పూర్వరాత్రము, అపరరాత్రము, అతిరాత్రము. ఇది తత్పురుష సమాసము-మొ.

3 వివ :-ఏకదేశవాచకములకును, సంఖ్యావాచకములకును నవ్యయములకును సర్వాది శబ్దములకును బరమగు 'అహన్' శబ్దమునకు 'అహ్న' అను నాదేశమగును. ఉదా:-మధ్యాహ్నము. ద్వ్యహ్నప్రియుఁడు. ప్రాహ్ణము (ప్రకృష్ట దినము. ఇట ణత్వము తత్స-౧ వివ). సర్వాహ్ణము (దినమంతయు. ణత్వము).

౪ వివ:-ఇట్టివి పెక్కు గలవు. అర్ధనావము (నౌ=నావ) మహోక్షము (ఉక్షన్=ఎద్దు) మహానసము ('అనస్' శబ్దము) పురుషాయుషము (ఆయుః శబ్దము) మొ.

శాకపార్థివాది మధ్యమ పద లోపి (ఉత్తరపదలోపి) సమాసములును గర్మధారయ భేదములె. ౧౩. (వ్యా సం-౨౬౮ IV విష.)

ఉదా:-శాకపార్థివుఁడు=(శక్తి ప్రియుఁడగు రాజు)=(శాకప్రియః పార్థివః=శాకపార్థివః). (శాకః=సామర్థ్యమ్). ఇందు "ప్రియ" శబ్దము లోపించినది. ఇట్లె శతాబ్దములు=(శతసంఖ్యాకాః+అబ్దాః=శతాబ్దాః) "చతుశ్శతాబ్దముల్" (ఆరణ్య-2 ఆ-౨౫౧.). (శతావయవః+అబ్దః=శతాబ్దః) శతాబ్దము. (వ్యా-సం-౧౧౩౬ పుట). త్రిలోకములు=(త్రిసంఖ్యాకాః లోకాః=త్రిలోకాః). "త్రిలోక సౌన్దర్య మివోదితం వపుః" (కుమార-౫ సర్గ-) ఇట్లే:- సప్త పదార్థములు-షోడశ పదార్థములు. శ్రీహర్ష నృపతి = (శ్రీహర్ష ఇతి నృపతిః). దధ్యోదనము=(దధ్నా సహితః+ఓదనః)=(పెరుఁగుతోఁ గూడిన యన్నము) ద్వావింశతి=(ద్వ్యధికా వింశతిః)=(ఇరువది రెండు-) మొ.

సమాస పూర్వపద ముపమానవాచియు నుత్తర పదము సామాన్యధర్మవాచియు నయియుండునది యుపమాన పూర్వపద కర్మధారయము. ౧౪. (వ్యా-సం-౨౬౮ IV వి).

ఉదా:-ఘనశ్యాముఁడు =(ఘన ఇవ శ్యామః)=(మేఘమువలె నల్లనివాఁడు). ఇందు సమాసోత్తరపద ముపమేయవాచిగా నుండ రాదని వైయాకరణ సిద్ధాంతము. కాని యిట్టివి కవి ప్రయోగములు గలవు- ఉదా:-బింబోష్ఠములు చంద్రబింబాననములు. (రంగ-రా-యుద్ధ-౫౩౩౪ ప. యూనివర్సిటీ ముద్ర). కరభోరులు (నన్ని-కు-3 ఆ-౨౯౧). కాళిదాసును నిట్లు ప్రయోగించెను."మోహేమకుమ్భస్తన నిస్సృతానామ్" "సః-న్దపక్షే హేమకుమ్భ ఇవ స్తనః ఇతి విగ్రహః" (మల్లినాథ వ్యాఖ్య). (రఘువం-౨ సర్గ-౩౬). 'చంద్రముఖి'=(చంద్ర సదృశం ముఖం యస్యాస్సా చంద్రముఖీ)=(చంద్రునివంటి ముఖము

గలది) అను రీతి బహువ్రీహులు నిర్వివాదముగా సర్వసమ్మతములు.

ఉపమేయవాచి పూర్వపదమును నుపమానవాచి యుత్తరపదమును నయి యుండి సామాన్య ధర్మ ప్రయోగము లేనిది యుపమానోత్తర పద కర్మధారయము. ౧౭. (వ్యా-సం-౨౬౭ IV).

దీని నుపమిత సమాసమనియు వాడుదురు. ఉదా:-పురుష వ్యాఘ్రుఁడు=(పురుషో వ్యాఘ్ర ఇవ)=(వ్యాఘ్ర సదృశ పురుషుఁడు) 'పురుష వ్యాఘ్రుఁడు శూరుఁడు' అని ప్రయోగింపరాదు. 'వ్యాఘ్రము వంటి పురుషుఁడు శూరుఁడు' అని వ్యస్తముగనె ప్రయోగింపవలెను.

ఉపమేయమం దుపమానము నారోపించునపుడు రూపక సమాసము. ౧౮. (వ్యా సం. ౨౬౮ IVవి).
(ఇది మయూర వ్యంసకాది సమాసము).

ముఖచంద్రుఁడు=(ముఖ మనెడి చంద్రుఁడు)=(ముఖమేవ చన్ద్రః) మయూరవ్యంసకుఁడు (మయూరమనెడి వ్యంసకుఁడు)=(మయూర ఏవ వ్యంసకః)=(వ్యంసకుఁడనఁగా ధూర్తుఁడు) ఇదియుఁ గర్మధారయ భేదమె.

౧ వివ :—పయి ౧౭-౧౮ సూత్రములలోఁ జెప్పఁబడిన యుపమిత రూపక సమాసముల నాయా సందర్భములను బట్టి నిర్ణయింపవలయును. ఉదా:-'ముఖపంకజము' పరిమళించుచున్నది. అనుచో రూపకము ''ముఖపంకజమును ముద్దాడెను'' అనుచో నుపమితసమాసము. 'ముఖపంకజమును జూచెను' అనుచో రూపకోపమితముల సందేహ సంకరము.

"I తద్ధితార్థ ద్విగువు, II ఉత్తరపద ద్విగువు, III సమాహార ద్విగువు-" అను మూఁడు విధములు మాత్రమె సంఖ్యాపూర్వములలో ద్విగు వనంబడును. ౧౯. (వ్యా-సం-౨౬౮ V వివ).

I తద్ధితార్థ ద్విగువు:-సమాసముచేఁ దద్ధిత ప్రత్యయార్థము

చెప్పఁబడినది. పంచగువు—(పఞ్చభి ర్గోభిః క్రీతః=పఞ్చగుః)=(అయిదు గోవులచేఁ గొనఁబడినది).

II ఉత్తరపద ద్విగువు:-పంచగవ ధనుఁడు—(పఞ్చ గావో ధనం యస్యసః = పఞ్చగవ ధనః)— (అయిదు గోవుల మొత్తము ధనము గాఁ గలవాఁడు). ఇందిట్లు మూఁడు పదములు వెలయుచుండును.

III సమాహార ద్విగువు :- పంచగవము=(పఞ్చానాం గవాం సమాహారః=పఞ్చగవమ్)=(అయిదు గోవుల మొత్తము). ఇది యేక వచనాంత మయియే యుండును.

౧ వివ :—పయి మూఁడు విధములలోఁ జేరని సంఖ్యాపూర్వక సమాసములు సిద్ధ ద్విగువులు కానేరవు. ఉదా:-సప్తర్షులు-పంచపాండవులు-త్రిలోకములు-త్రిపురుషులు మున్నగునవి సిద్ధ కర్మధారయములె యగును. 'ముల్లోకములు' ఇది సాధ్యద్విగువు

అకారాంత సమాహార ద్విగువు స్త్రీలింగమై ఙీప్ప్రత్యయము నందును. పాత్రాది శబ్దముల కట్లు కాదు. ౧౮. (వ్యా-సం-౨౬౮ V వివ).

త్రిలోకి = (త్రయాణాం లోకానాం సమాహారః త్రిలోకీ). "యది త్రిలోకీ గణనా పరా స్యాత్" శ్రీహర్ష నైషధము (మూఁడు లోకముల మొత్తము). త్రిభువనము = (త్రయాణాం భువనానాం సమాహారః = త్రిభువనమ్) భువన శబ్దము పాత్రాదులలోనిది. ద్విపాత్రము.

౧ వివ :—పయి పద్ధతి చొప్పున 'శతాబ్ది' అనియే సాధువని కొందఱు తలంతురు. అది సాధు వగుఁగాక. "శతావయవః అబ్దః" అను మధ్యమ పదలోపి సమాసము చొప్పున 'శతాబ్దము' అనియు సాధువె యనఁదగును. (సమా-౧౩ సూ). లోకశబ్దమును పాత్రాదులలోఁ జేర్చి సాధింపరాదు. 'త్రిలోకీ' శబ్దమునుబట్టి యిది పాత్రాదులలోనిది కాదనక తప్పదు. కాన "త్రిలోక సౌన్దర్య" అను కాళిదాస ప్రయోగము చొప్పున నిది మధ్యమ పద లోపి సమాస మగు

టచే సాధువనకతీరదు

ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వ సమాసము
౧౯ (వ్యా-సం-౨౬౮ VII విమ)

ఉదా - రామలక్ష్మణులు వచ్చిరి ఇందు సమాసగత పదములు రెండిటికిని గ్రియాన్వయము గలదు ఇందు ద్వంద్వగత పదార్థముల సాహిత్యమే యేకార్థీ భావ సామర్థ్యము చ శబ్దార్థమున ద్వంద్వ సమాస మగును సముచ్చయాన్వాచ యేతరేతర యోగ సమాహార ములు 'చ' శబ్దార్థములు (I సముచ్చయ - ఈశ్వరం గురుంచభజస్వ) = (ఈశ్వరుని గురునిని భజింపుము) ఈశ్వరుని భజింపుము ' అనునది యన్వయించిన పిదప క్రియయొక్క యావృత్తిచేత గురునిని భజింపుమ ను నన్వయము గల్గును కావుననే యిందేక చ' శబ్ద ప్రయోగ ముండును (II అన్వాచయ - భిక్షామట-గాం చానయ) = ఇందు 'భిక్షకేగుము' అనునది ప్రధానార్థము పిదప గోవును నయితము తెమ్ము" అను నప్రధానార్థము భాసిల్లును కావున నీసముచ్చ యాన్వాచయములు రెంటను సముచ్చిత పదార్థములకు సాహిత్యము లేమింజేసి యేకార్థీభావ లక్షణ సామర్థ్యము లేదు కావున వీనికి సమాసము లేదు కాన ఇతరేతరయోగ-సమాహారములందె ద్వంద్వసమాస మగును

పరిస్పర సాపేక్షముగల యనేక పదార్థముల కొక
క్రియతో నన్వయ ముండిన నితరేతర యోగ
ద్వంద్వము ౨౦ (వ్యా-సం-౧౬౮ VII వి)

ఇందలి పరస్పర సాహిత్య సూచనకయి చ శబ్దద్వయము ప్రయుక్త మగును ఉదా - హరిహరులు వచ్చిరి (హరిశ్చ+హరశ్చ= హరిహరౌ)=(హరియు హరుడును వచ్చిరి) ఇందలి 'చ' శబ్దార్థము సమాసమాసము ననగా సాహిత్యమును దెల్పును గాన నీ సమాస మున చ శబ్దములు లోపించును బహుపద ద్వంద్వము - రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు

౧ వివ —కొన్నియెడల ద్వంద్వపదార్థముల సాహిత్యము శాబ్ద బోధమందు మాత్రమె యుండును క్రియానిష్పత్తిలో నట్టిదాని ప్రసక్తి లేకపోవచ్చును ఉదా —మా తాపితల మృతదినము— ఇటఁ దల్లి దండ్రు లిద్దఱును నొక దినమందె మరణించి రనుట వక్తృతాత్పర్యము కాదు గదా

౨ వివ —యదాసంఖ్యాన్వయమున సాహిత్యము లేకున్నను మహాకవి ప్రయోగ ప్రామాణ్యమున నట్టి యెడల నితరేతర యోగ ద్వంద్వము సాధు వగుచున్నది ఉదా —రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులను జంపిరి

3 వివ —ద్వంద్వఘటిత పదార్థములను బట్టి యిందు బహువచన మేర్పడును ద్వంద్వ చర మావయవశబ్ద లింగమె సమాసాంతమున నిల్చును ఉదా —సీతారాములు ద్వంద్వాంతమున నున్న శబ్దము ద్వంద్వ ఘటిత పదార్థము లన్నిటితోను బ్రత్యేకముగా సంబంధించును ఉదా — సీతారాముల దయ=(సతియొక్కయు రామునియొక్కయు దయ)

౪ వివ —ద్వంద్వఘటిత పదముల పౌర్వాపర్యము విషయమున సంస్కృత వ్యాకరణమున ననేక నియమములు సూత్రింపఁబడెను కాని యవెల్లఁ బ్రాయికములు మాత్రమె I అల్పాచ్చులు గల పదము మొదట నిల్చును ఉదా —ధవఖదిరములు=(రెండును వృక్షవిశేషములు) II లఘ్వక్షరఘటితము మొదట నిల్చును ఉదా —కుశకాశములు=(దర్భయు రెల్లును) III పూజార్హము మొదట నిల్చును ఉదా — దేవాసురులు—మొ ఇట్టినియమములు పెక్కుగలవు

ద్వంద్వఘటిత పదార్థముల మొత్త మర్థ మగు నపుడు
సమాహార ద్వంద్వ మగును ౨౧

సమాహార మనఁగా సమూహము. సమాహారద్వంద్వము నపుంసకము నేకవచనాంతము నగును ఏయే జాతి పదములకు సమాహార ద్వంద్వ మగునో వ్యాకర్తలు పెక్కు సూత్రముల వచించిరి

౧ వివ — I ప్రాణితూర్యసేనాంగములకు సమాహార ద్వంద్వ మగును ఉదా —ప్రాణ్యంగ —పాణిపాదము=(పాణిశ్చ పాదశ్చ తయోః స్సమాహారః)=(పాణిపాదముల మొత్తము) తూర్యాంగము — (తూర్యము=వాద్యము) మార్దంగిక పాణవికము=(మార్దంగిక పాణవికయోః స్సమాహారః)=(మృదంగ పణవ వాద్యముల మొత్తము) సేనాంగ —రథగజ తురగ పాదాతము=(రథాశ్చ గజాశ్చ తురగాశ్చ పాదాతంచ తేషాం సమాహారః)=(రథములయు గజ్జములయు గుఱ్ఱములయుఁ బదాతుల సముదాయముయొక్కయు సమూహము) మొ. ఇట్టివి పెక్కుగలవు ప్లక్షన్యగ్రోధము=(ప్లక్ష న్యగ్రోధముల మొత్తము)

౨ వివ —ద్వంద్వమందును సమాసాంతప్రత్యయములు మున్నగునవి యగును చ వర్గాంతములకు దకార షకార హకారాంతములకును సమాహారద్వంద్వమునందు అ' ప్రత్యయమగును ఉదా —వాక్త్వచము (వాక్ చ + త్వక్ చ ద్వయోః స్సమాహారః) (వాక్త్వక్కుల మొత్తము) శమీదృషదము=(శమీ చ+దృషచ్చ తయోః స్సమాహారః) (జమ్మియు ఱాయియు ననువాని మొత్తము) ఇట్టివి పెక్కుగలవు — అహోరాత్రము (దినరాత్రుల మొత్తము) మొ

3 వివ — సమాహార ద్వంద్వమును ద్విగు సమాహారమును నవ్యయీభావమును నపుంసకలింగము లగును

౪ వివ —ఋకారాంత ద్వంద్వమునఁ బూర్వస్థిత పద ఋకారము ఆ కారమగును ఉదా —మాతాపితలు=(మాతా చ పితా చ) (తలిదండ్రులు) పుత్రశబ్దపరకత్వమునందును ఆ కార మగును ఉదా — పితాపుత్రులు=(పితా చ+పుత్రశ్చ) మాతరపిత లనియుఁ గలదు తెనుఁగున మాతృపితలు' అనియుఁ గలదు (చూడు-సమా-౨౬౮ సూ).

౫ వివ —యజ్ఞీయ దేవతావాచక ద్వంద్వమునందును బూర్వపదాంతమునకు 'ఆ' కారమగును ఉదా — సూర్యాచంద్రమసులు= (సూర్యశ్చ + చంద్రమాశ్చ) మిత్రావరుణులు (మిత్రశ్చ + వరుణశ్చ).

అగ్నీషోములు (ఇట 'ఈ' వచ్చినది) ద్యావాపృథివులు=(ద్యౌశ్చ+పృథివీచ) (ఆకాశము భూమియు)

౬ వివ - వృత్తిపంచకమున నేకశేషవృత్తి వివరింపఁబడెను. (చూ-సమా-౧ సూ-౧ వివ) పుంస్త్రీద్వంద్వమునఁ బుంలింగము నిల్చి యుండును ఉదా -పితలు=(మాతాచ+పితాచ)=(మాతాపితలు) హంసములు (హంసీచ+హంసశ్చ=హంసౌ) పుత్రులు=(పుత్రశ్చ+దుహితాచ) (కొడుకును కూఁతురును) ఇట్లే-భ్రాతలు=(సోదరుఁడును సోదరియు)

౭ వివ -నపుంసకానపుంసకద్వంద్వమున నపుంసకము నిల్చును. అది సమాహారద్వంద్వమును గానచ్చును ఉదా -శుక్లములు=(శుక్లశ్చ+శుక్లీచ+శుక్లంచ) సమాహార ద్వంద్వ రూపము, శుక్లము

౮ వివ -త్యద్-తద్-యద్-మున్నగునవాని కి నితర పదములకు ద్వంద్వమగునపుడు త్యదాదులు నిల్చును ఉదా -వారు=(సచ+దేవదత్తశ్చ=తౌ)=(వాఁడును దేవత్తుఁడును)

అన్యపదార్థప్రధానము బహువ్రీహి ౨౨ (వ్యా-సం ౨౬౮ VI విష).

పీతాంబరుఁడు వచ్చెను=(పీత మమ్బరం యస్యసః)=(పచ్చని బట్ట యెవనికిఁ గలదో యట్టి విష్ణువు వచ్చెను-ఇందు **సమాసగతములగు** 'పీత, అంబర' అనువానికిఁ గ్రియాన్వయము లేదు 'విష్ణువు' అను నన్యపదము నకుఁ గ్రియాన్వయము గలదు)

౧ వివ -సమానాధికరణములగు (విశేషణ విశేష్య) ప్రథమాంతములకే బహువ్రీహి సంభవించును అట్టి విశేషణ విశేష్యములు ప్రథమా ద్వితీయాది విభక్త్యంతములగు నితరపదార్థములను జెందును అట్టి యితరపదముల (విశేష్య) లింగ మాబహువ్రీహికిఁ గల్గును (ద్వంద్వ తత్పురుషములకుఁ బరపదలింగమే యగును కొన్ని యెడల మాఱుటయుఁ గలదు వృక్షచ్ఛాయము - వృక్షచ్ఛాయ మొదలైనవి) ఉదా -వీరపురుష=(సేన)=(వీరాః పురుషాః యస్యాం సా సేనా=వీరపురుషా)=(వీరు

లగు పురుషు లేసేనయందుఁ గలరో యాసేన- వీరపురుష' యనఁబడును).
ప్రి-బ-వీరపురుషలు=(సేనలు)=(వీరాః పురుషాః యాసు సేనాసు తాః=
వీరపురుషాః=సేనాః) వీరపురుషము సైన్యము=(వీరాః పురుషాః యస్మిన్
సైన్యే తత్ సైన్యం వీరపురుషమ్) ఇవి సప్తమీ బహువ్రీహులు-ఇట్టి
బహువ్రీహు లేడువిధములు I ప్రథమా బహువ్రీహి -సమాతృకుఁడు=
(సహ మాత్రా వర్తతే యోఽసౌ)=(తల్లితోఁ గూడినవాఁడు) (ప్రథమా
బహువ్రీహిని పాణినియులు చెప్పలేదు-ముగ్ధబోధ వ్యాకర్త వచించెను).
II ద్వితీయా బహువ్రీహి -ఆరూఢవానరము వృక్షము=(ఆరూఢో వాన
రో యం వృక్షం స = ఆరూఢవానరః)=(ఎక్కిన క్రోఁతి గల చెట్టు)
III తృతీయా బహువ్రీహి -ఊఢరథము అశ్వము. (ఊఢో రథో యేన
సః) = (వహింపఁబడిన రథము గలది) IV చతుర్థీ బహువ్రీహి -దత్త
పశువు మనుష్యుఁడు-(దత్తః+పశుః యస్మై సః)=(ఈయఁబడిన పశువు
గలవాఁడు) V పంచమీ బహువ్రీహి -ఉద్ధృతశరము తూణీర మనఁగా
నమ్ముల పొది=(ఉద్ధృతాః శరాః యస్మాత్ సః)=(ఎత్తఁబడిన శరములు
గలది) VI షష్ఠీ బహువ్రీహి -మహాబలుఁడు మనుష్యుఁడు=(మహాత్
బలం యస్య సః)=(గొప్పబలము గలవాఁడు) VII సప్తమీ బహువ్రీహి -
వీరపురుష సేన-(వీరాః పురుషాః యస్యాం సా) = (వీరులగు పురుషులు
గలది)

బహుపద బహువ్రీహులును నుండును. ఉదా-నీలోజ్జ్వల శరీ
రుఁడు పురుషుఁడు=(నీల ముజ్జ్వలం శరీరం యస్య సః)=నల్లని యుజ్జ్వల
మగు శరీరము గలవాఁడు)

వ్యధికరణ బహువ్రీహులు గలవని మునిత్రయేతర
(పాణిని కాత్యాయన పతంజలి) వైయాకరణులు
వ్యాఖ్యానించిరి ౨౩ (వ్యా-సం-౨౬౮ VI వి)

కంఠేకాలుఁడు=శివుఁడు=(కణ్ఠే కాలో యస్య సః)=(కంఠమందుఁ
గాలకూటపు నలుపు గలవాఁడు) ఉష్ట్రముఖుఁడు=మనుష్యుఁడు=(ఉష్ట్రస్య

ముఖం యస్య సః)=(ఉష్ట్రముఖమువంటి ముఖము గలవాఁడు)

౧ వివ -పయి యుదాహృతులను సైతము సమానాధికరణ బహువ్రీహులుగనే సమర్థింప నగును కంఠేకాలుఁడు = (కంఠేస్థః కాలః యస్య సః)=(కంఠమందున్న నలుపు గలవాఁడు) ఉష్ట్రముఖుఁడు=(ఉష్ట్ర సదృశం ముఖం యస్య సః) = (ఉష్ట్రసదృశమగు ముఖము గలవాఁడు) ఇట్లు మధ్యమపద లోపి బహువ్రీహులను గ్రహింప నగును. మధ్యమ పదలోపి సమాసము సర్వసమ్మతమేకదా (చూ-బాల-మనో)

౨ వివ .-సమానాధికరణ కర్మధారయమునందు వలెనె సమానాధికరణ బహువ్రీహియందును భాషిత పుంస్కములకుఁ బుంవద్భావ మగును (చూ-సమా-౧౧ సూ) (వ్యా-సం-౨౬౮ VI విష) మహాసేనుఁడు=(గొప్ప సేన గలవాఁడు=కుమారస్వామి)=(మహతీ సేనా యస్య సః) ('మహతీ సేనుఁడు'అని కానేరదు) రూపవద్భార్యుఁడు=(రూపవతీ+ భార్యా యస్య సః)=(రూపవతియగు భార్య గలవాఁడు) సుందర భార్యుఁడు=(సున్దరీ భార్యా యస్య సః)=(సుందరియగు భార్య గలవాఁడు).

ఊఙంతములకును తద్ధిత క ప్రత్యయాంతములకుఁ బూరణీ ప్రత్యయాంతములకును వృత్తగు తద్ధితాంతమునకును జాతిస్వాంగవిహితేఙంతములకును బుంవద్భావము లేదు క్రియా-శుభగా-దుర్భగా-భక్తి-తనయాద శబ్దములు పరమగునపుడును బుంవద్భావము లేదు ౨౪.

ఉదా -వామోరూభార్యుఁడు (సుందరమైన తొడలుగల భార్య గలవాఁడు). క -రసికాభార్యుఁడు పాచికాభార్యుఁడు పూరణీ-షష్ఠీ భార్యుఁడు వృత్తద్ధిత -మైథిలీభార్యుఁడు జాతి -బ్రాహ్మణీభార్యుఁడు. స్వాఙ్గ - సుకేశీభార్యుఁడు ( బ్రాహ్మణమానినీ అని మానినీ శబ్ద పరకత్వమున నగును) వృత్తులగు తద్ధితాంతము లయినను ఇఞ్-ఉఞ్ అనునవి నిల్చునపుఁడు పుంవద్భావ మగును (మాడు - సంస్కృత - తద్ధిత - ౬ సూ). వైయాకరణ భార్యుఁడు=(వ్యాకరణము తెలిసినది భార్యగాఁ గలవాఁడు)

సావశ్వభార్యుఁడు=(లెస్సయిన గుఱ్ఱములు గలది భార్యగాఁ గలవాఁడు) ప్రియాది శబ్ద పరకత్వమున :- కల్యాణీప్రియుఁడు = (కళ్యాణవతి యగు ప్రియురాలు గలవాఁడు) (కళ్యాణీ ప్రియా యస్యసః) దృఢభ క్తి' అను రఘువంశ ప్రయోగమున భావ క్త' ప్రత్యయాంతమ(ని) యెన్నదగును కర్మార్థ విహిత క్త' ప్రత్యయాంకమైనచో 'దృఢాభక్తి అనియే యుం డును పూరణ ప్రత్యయాంత పరకత్వమందును బుంవద్భావము లేదు ఉదా -కల్యాణీ పంచమములు (రాత్రులు)=(కల్యాణీ పఞ్చమీ యాసాం రాత్రీణాం తాః)=(కల్యాణముగల యైదవ రాత్రి గలవి) (ఇట అ' అను సమాసాంతముతోఁ బూరణ ప్రత్యయాంతము కూడినది)

అన్యపదార్థ ప్రాధాన్యము లేకున్నను గొన్ని బహు వ్రీహులుగనే యెన్నఁబడును ఇట్టివెల్ల బహువ్రీహి విశేష విధులు ౨౫ (వ్యా-సం-౨౬౮ VI వి ౧౧౪౩ పుట)

I సంఖ్యోత్తర పద బహువ్రీహి -ఉప దశములు=(దశానాం సమీ పే యే సన్తి తే=ఉపదశాః)=(పదికి దగ్గఱగా నుండు సంఖ్యలు తొమ్మిది-పదునొకండు-మొదలగునవి) II సంఖ్యోభయ పద బహువ్రీహి -ద్విత్రి ములు-దినములు=(ద్వౌవా త్రయోవా=ద్విత్రాః)=(రెండు మూఁడు దినములు) III దిగంతరాళ బహువ్రీహి -దక్షిణ పూర్వ దిక్కు=(దక్షి ణస్యాః పూర్వస్యాశ్చ దిశోరన్తరాళే యా స్థితా సా దిక్)=(తూర్పునకును దక్షిణమునకును మధ్యదగు దిక్కు=ఆగ్నేయము) IV వ్యతీహార బహు వ్రీహి ముష్టీముష్టి=ముష్టాముష్టి ముష్టాముష్టి అను రూపము పాణినీయ సమ్మతము కాకున్నను ముగ్ధబోధ వ్యాకర్తృసమ్మతము-కవిసమ్మతము. (ముష్టిభిః ముష్టిభిశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తమ్)=(పిడికిళ్ళతో మొత్తుకొనెడి యుద్ధము) ఉం భీమాసురవీరుల ముష్టాముష్టి రణోచ్చ టాచ్ఛటల శబ్దం బు ద్దామ . (ఆర-3 ఆ-3౯౫) యుద్ధేతరస్థలము లందును నిది గన్పట్టుచున్నది ఉదా -కర్ణాకర్ణి గ వినుము

౧ వివ -'అతిమాలుఁడు' మున్నగుచోట్ల నన్యపదార్థ ప్రాధాన్య

మున్నను నవి బహువ్రీహులు కావు తత్పురుషములె (చూ-సమా-౭ సూ)

౨ వివ -బహువ్రీహి సమాసమందును ననేకములకు సమాసాంత కార్యము లగును -ఈ యప్రధానత్వమున ఆ-ఈ-ఊ అను స్త్రీ ప్రత్యయములకు హ్రస్వము కల్గును గో శబ్దము గు అను రూపము నందును ద్వస్తమాయుఁడు శీతగువు=(చంద్రుఁడు)=(శీతా+గావః=(కిరణ) యస్యసః = శీతగుః) ఈయస్' ప్రత్యయాంతమునకుఁ గాదు బహుప్రేయసి = (బహ్వ్యః ప్రేయస్యః యస్యసః = బహుప్రేయసీ = కృష్ణ) (అనేకలగు ప్రేయసులు గలవాఁడు=కృష్ణుఁడు)

3 వివ -స్త్రీ లింగమగు పూరణీ ప్రత్యయాంతమునకు అ ప్రత్యయమగును ఉదా-(కల్యాణీ పఞ్చమీ యాసాంతాః) కల్యాణీ పంచమాః=(మంగళప్రదయగు పంచమిగల రాత్రులు)

౪ వివ -స్త్రీ ప్రత్యయాంతములగు 'ఈ-ఊ అనునవి తుదిని గల శబ్దములకును ఋకారాంత శబ్దములకును బహువ్రీహిలో క ప్రత్యయమగును ఉదా-కల్యాణ పంచమీకము=(కల్యాణీ పఞ్చమీయస్మిన్ సః)=(కల్యాణవంతమగు పంచమిగల శుక్లాదిపక్షము) మృతపితృకః=(మృతః పితా యస్యసః). బహువ్రీహియందు సహశబ్దముచో స అని నిల్చును (సహ మాత్రా వర్తతే యోఽసౌ)=సమాతృకుఁడు (తల్లితోఁ గూడినవాఁడు)

౫ వివ -బహువ్రీహియందుఁ గొన్నియెడల అ' (ష) ప్రత్యయమును గొన్నియెడల డ ప్రత్యయమును సమాసాంతమగును ఉదా-పుండరీకాక్షుఁడు=(పుణ్డరీకవ దక్షిణీ యస్య సః) (పుండరీక=తెల్లతామర) ద్విమూర్ధుఁడు = (రెండు శిరస్సులు గలవాఁడు) ఇట్లే-త్రిమూర్ధుఁడు-పంచ ష ములః=(అయిదాఱు పరిమాణము గలది)(డిత్తు పరమైనచో తుది యచ్చునకుఁ దర్వాతి భాగము (టి) లోపించును) ద్విత్రములు=(రెండు మూఁడు రోజులు) పద్మనాభుఁడు=(నాభియందుఁ పద్మము గలవాఁడు).

(సమా-౨౫-౨౬ సూ ౬-౮/౨౫ ౧-౨/౨౮ వివ బహువ్రీహి సమాసాంతము లు-

౬ వివ -ప్రజాది శబ్దములకు 'అస్ ప్రత్యయ మగును ఉదా - అప్రజుడు (నవిద్యతే ప్రజా యస్యన) (అప్రజాస్' అనునది సకారాంతము) సుమేధుడు=(సుమేధస్ శబ్దము)=(మంచి మేధ గలవాడు)

౭ వివ -కొన్నియెడల పాద శబ్దముచో పాత్' అని నిల్చును వ్యాఘ్రపాదుడు (వ్యాఘ్రమువంటి పాదములు గల) గూఢపాదము (పాము-గూఢమగు పాదములుగల)

౮ వివ -వ్యతీహార (యుద్ధము) బహువ్రీహియందు 'ఇ' ప్రత్యయ మగును అది పరమగుచుండగా పూర్వహ్రస్వము దీర్ఘమగును 'ఆ' కారమును నగును ఉదా -ముష్టాముష్టి = ముష్టీముష్టి (యుద్ధము) (పిడికిండ్లతో గుద్దుకొను యుద్ధము) (ముష్టిభి ర్ముష్టిభిః ప్రహృత్యేదం యుద్ధం ప్రవర్తతే)

వివిధ సమాసములందు వివిధసమాసాంత ప్రత్యయములు వివిధసమాసాశ్రయవిధులును వర్తిల్లుచున్నవి ౨౮ (వ్యా-సం ౨౬౮ XII వివ ౧౧౫౧ పుట)

సమాసాంతములు —

౧ వివ - పథిన్-అప్-పుర్' అను శబ్దములకు 'అ' అను సమాసాంత ప్రత్యయ మగును దక్షిణాపథము (దక్షిణా+పథిన్) ఇట్లె ఉత్తరాపథము చతుష్పథము (నాలుగు దారుల మధ్య ప్రదేశము) విమలాపము (సరస్సు) విష్ణుపురము అప్ శబ్దపు అ' కారపు మార్పులు అంతరీపము-ద్వీపము అనూపము=(పచ్చిక ప్రదేశము) అవ్యయముల మీది రాత్రి శబ్దమునకు అ ప్రత్యయ మగును అతిరాత్రము

౨ వివ -సమాసమున సమానశబ్దము కొన్నియెడల 'స' అను రూపము నందును (సమానః పిణ్డో యేషాం తే=సపిణ్డాః) సపిండులు. సతీర్థుడు=(సమానమగు గురువు గలవాడు=సహాధ్యాయి) సపత్ని=(సవతి-సమానుడగు పతి గలది) కొన్నిట విభాష -సగోత్రులు = సమానగోత్రులు సవర్ణులు=సమానవర్ణులు-మొ

3 వివ — కు శబ్దము సమాసమున కా మున్నగు రూపముల

నొందును. ఉదా - కాపురుషులు=కుపురుషులు - కాపథము=కుపథము-
కాజలము = (ఈషజ్జలము) కదుష్ణము=కోష్ణము=కవోష్ణము = (ఇంచుక
వేఁడి గలది) కదన్నము=(కుత్సితమగు నన్నము)

౪ వివ -ఉపమానసమాసమందును 'సు మున్నగువానికిఁ బర
ముగా నుండునపుడును గంధ శబ్దమునకు ఇ' ప్రత్యయమగును ఉదా -
పద్మగంధి=(పద్మమువంటి గంధము గలది) సుగంధి=(మంచి వాసన గలది)
ఇట నిత్యము ఉపమానమందు వికల్పము పద్మగంధము అనియు
నుండును

౫ వివ -ఋచ్-అక్షి-వర్చస్-తమస్-భూమి-మున్నగు శబ్దము
లకును సమాసమున అ' ప్రత్యయమగును ఉదా - అర్ధర్చము
(శ్లోకములో సగము) పుండరీకాక్షుఁడు-గవాక్షము-బ్రహ్మవర్చసము-
అంధతమసము-ద్విభూమము=(రెండంతస్థుల మేడ)సప్తగోదావరము-మొ

౬ వివ -పూజాద్యర్థములలోఁ గొన్నిట ను శబ్దమునకు సమా
సాంత ప్రత్యయము రాదు ఉదా -సురాత్రి మొ

సమాశ్రియవిధులు ___

౧ వివ -స్త్రీ ప్రత్యయముకాని ఈ కారము వికల్పముగా
సమాసమందు హ్రస్వమగును ఉదా - గ్రామణిపుత్త్రుఁడు - గ్రామణి
పుత్త్రుఁడు సంజ్ఞావాచకత్వమున ఆ-ఈ అను స్త్రీ ప్రత్యయములకును
హ్రస్వమగును-ఉదా-రేవతిపుత్త్రుఁడు=(ఒకని పేరు)

౨ వివ -కొన్ని యెడల ఉదక శబ్దమునకు ఉదా దేశమగును.
ఉదా-ఉదధి = (సముద్రము) క్షీరోదము=(పాలసముద్రము) ఉదవా
సము=(ఉదకవాసము)

3 వివ -కొన్ని యెడల సమాసపూర్వపదాంతమున మ్=ం కార
ము నిల్చును ఉదా-రాత్రించరుఁడు=(రాక్షసుఁడు) తిమింగిలము=(ఒక
జలజంతువు) మొ

౪ వివ -కొన్ని యెడల దృశ్ శబ్దమునకు 'అ' ప్రత్యయ

మగును ఉదా- తాదృశము-ఈదృశము-కీదృశము సదృశుఁడు-మొ.

౫ విన - తుమ్' ప్రత్యయాదుల కంత్యలోపము కొన్ని యెడల నగును ఉదా-రంతుమనుఁడు-అవశ్యసేవ్యుఁడు మొ

౬ విన -కొన్నియెడలఁ బూర్వపదదీర్ఘమగును ఉదా-విశ్వామిత్రుఁడు-అమరావతి=(స్వర్గము), పరీపాకము-నీకాశము-ప్రతీకాశము.

౭ విన -కొన్నియెడలఁ బూర్వపదాంతమున 'శ'కార 'స' కారములు నిల్చును ఉదా- గోష్పదము=(చిన్న ప్రదేశము) ఆస్పదము. ఆశ్చర్యము విష్కిరము=(పక్షి) మస్కరి=(ముని) తస్కరుఁడు=(దొంగ) ప్రాయశ్చిత్తము వనస్పతి మొ (తత - ౨ విన 'స' 'ష' యగు )

౮ విన -పృషోదరాదులు యథాప్రయోగముగ గ్రాహ్యములు. ఉదా - పృషోదరము = (బిందు గర్భితము) వలాహకము (వారిని వహించునది=మేఘము) భవే ద్వర్ణాగమా ద్ధంసః సింహో వర్ణ విపర్యయాత్ గూఢోత్మా వర్ణవికృతే ర్వర్ణనాశాత్ పృషోదరమ్" సింహము=(హింసించునది). హంసుఁడు=(సూర్యుఁడు చీఁకటిని బోఁగొట్టువాఁడు) మొ

సిద్ధసమాసములందు ఙీ ప్రత్యయము దీర్ఘము
పాక్షికముగా హ్రస్వమగుటయుఁ గలదు ౨౬౩.
(వ్యా-సం-౨౭౬ విన)

నదిసుత గురు కర్ణ శల్య నాగపురీశుల్ (ఆది-౧ ఆ ౬౯). కుంతిదేవి (ఆది ౬ ఆ ౬) (సభా ౨ ఆ ౨౮౧). మాద్రిదేవి (ఆది ౫ ఆ ౧౫౭) గౌరిదేవి (నన్ని. కు ౬ ఆ ౭౭౬) ఇట్లు సంస్కృతమందును గలదు "యమ వహ్ని విశాఖ యుక్తమితి దీపికా-కాళిదాస కవితా-ఇత్యుద్భటః వైదేహిబన్ధో రితి రఘుః రతి దూతి పదేషు (కుమార సం ౪ సర్గ-౧౬. శ్లో)" (ముగ్ధ-౭౫౬ పుట దుర్గా-వ్యా)

సిద్ధ బుదంత (పుత్త్రి) శబ్దోత్తర పదకత్వమందును)
ద్వంద్వంబునందలి ఆనఙ్' ఆదేశము చోటఁ దెల్గున

విభాషగా రేఫాదేశ మగును. ౨౬b (వ్యా-సం-౨౮౬-౨౮౬ II విష ౧౨౪౫-౧౨౪౮ పుటలు (దీనికి మంచి ప్రామాణిక కవి ప్రయోగము దొరకలేదు )

మాతాపితలు=మాతృపితలు పితాపుత్త్రులు=పితృపుత్త్రులు.
'మాత్ర పితృ బుద్ధి నంభోధి పుత్త్రిఁ దలఁతు' (అహో-3 ౨౪ పుట) మాతర పిత లనియు నుండును చ. వరములు గన్న మాతర పితృ వందనంబును. (ఉ హరి-౪ ఆ-౧౭ ప).

౧ విష - మాతా శబ్దమాకారాంత స్త్రీలింగమును గలదని కొందఱు 'మాతా-స్త్రీ-జనన్యామ్ (మా+ఆతచ్) విశ్వేశ్వరీం విశ్వమాతామ్ దుర్గాస్తవః' (శబ్దస్తో) ఋదంత ముత్తరపదముగా లేని ద్వంద్వమందును నీ రేఫాదేశము వచ్చునని బా-గు-ప్ర-వ్యాఖ్యయుఁ గవిసంశయ విచ్ఛేదమును బ్రామాదికములు-

సిద్ధసమాసాదులందు సంస్కృతసంధులు వర్తిల్లును సిద్ధసమాసగతపదములు సంస్కృతపదములని గ్రహింపవలయును ౨౭

సిద్ధసమాససంధు లిట దిఙ్మాత్రముగఁ జూపఁబడును.

## — స్వ ర సం ధు లు —

సవర్ణదీర్ఘసంధి –

ఏయచ్చున కాయచ్చే (హ్రస్వమైనను దీర్ఘమైనను) పరమైనపు డారెండిటికిని దానిదీర్ఘ మేకాదేశమగును. ఈవిధి 'ఏ-ఐ-ఓ-ఔ ల యెడల వర్తింపదు. ౨౮. (దీనిని సవర్ణదీర్ఘసంధి యందురు )

ముర+అరి=మురారి సీతా+అధిప=సీతాధిపుఁడు హరి+ఇచ్ఛా=హరీచ్ఛ గౌరీ+ఈశ=గౌరీశుఁడు. శమ్భు+ఉదయ=శంభూదయము గురు+ఊహా=గురూహము. పితృ+ఋణ=పితౄణము.

'అమ్ ప్రత్యయేతర విభక్తి పరకత్వమందును నీవిధి చెల్లును. ఉదా - 'రామ+అస్=రామాః' మొ

గుణసంధి -

అ-ఆ'లకు, ఇ-ఈ లు పరమైనచో ఏ'కారమును ఉ-ఊ' లు పరమైనచో ఓ'కారమును 'ఋ-ౠ' లు పరమైనచో అర్ అనునదియుఁ బూర్వపరములు రెండిటికిని నేకాదేశము లగును ౨౮ ('అర్-ఏ-ఓ' అనునవి గుణ సంజ్ఞికములు)

I ఇ-ఈ -రమా+ఈశ=రమేశుఁడు ఉప+ఇన్ద్ర=ఉపేంద్రుఁడు. విభక్తి పరకత్వమంగును నీవిధియగును ఉదా - రామ+ఇన=రామేణ' II ఉ-ఊ - అక్ష+ఊహినీ=అక్షోహిణి (అక్షౌహిణి అనియుఁ గలదు) గఙ్గా+ఉదక=గంగోదకము III ఋ-ౠ -రాజ(న్)+ఋషి=రాజర్షి. ("శీత+ఋత=శీతార్తుఁడు. దశ (న్)+ఋణ=దశార్ణములు" అనుచో వృద్ధిసంధియే (సమా-30 III సూ) యగును)

వృద్ధిసంధి -

అ-ఆ లకు 'ఏ-ఐ'లు పరమైనచో 'ఐ'కారమును ఓ-ఔ లు పరమైనచో 'ఔ'కారమును ఋ-ౠ'లు పరమయినచో ఆర్' అనునదియుఁ బూర్వపరములు రెండిటికిని నేకాదేశము లగును 30 (ఆర్-ఐ-ఔ' అనునవి వృద్ధి సంజ్ఞికములు)

I ఏ-ఐ -కృష్ణా+ఏకాదశీ=కృష్ణైకాదశి. అఖణ్డ+ఐశ్వర్య=అఖండైశ్వర్యము

II ఓ-ఔ -వన+ఓకస్=వనౌకసులు (హనుమదాది వానరులు) మహత్+ఔదార్య=మహౌదార్యము (చూ సమా ౧౧ సూ-వృత్తి) విభక్తిపరకత్వమందును నీవిధి యగును రామ+ఔ= రామౌ మొ

III ఋ-ౠ :- శీత+ఋత=శీతార్తుఁడు  దశ (న్)+ఋణ=దశార్ణములు=(దేశవిశేషములు)

యణాదేశసంధి :-

అచ్చు పరమగునపుడు-'ఇ-ఈ' లకు యకారమును ఉ-ఊ' లకు వకారమును 'ఋ-ౠ' లకు ర' కారమును నాదేశములగును సవర్ణదీర్ఘసంధి దీనికి బాధకము (దీనిని యణాదేశసంధి యందురు) ౩౧. (విభక్తి పరకత్వమందును నీవిధి యగును. ఉదా -'హరి+ఓస్=హర్యోః గురు+ఓస్=గుర్వోః పితృ+ఓస్=పిత్రోః మొ

ఇ-ఈ :- హరి+ఆజ్ఞా=హర్యాజ్ఞ. ఉ-ఊ -గురు+ఈశ=గుర్వీశుఁడు ఋ-ౠ -పితృ+అర్పణ=పిత్రర్పణము

అయాద్యాదేశ సంధి .-

అచ్చు పరమగునపుడు ఏ' కారమునకు అయ్' అనియు ఐ' కారమునకు ఆయ్ అనియు 'ఓ' కారమునకు అవ్' అనియు, ఔ' కారమునకు ఆవ్' అనియు నాదేశములగును ౩౨

ఏ -ప్రయోగము తెల్గున మృగ్యము. 'ఐ -రై + ఈశ=రాయీశుఁడు (రై=ధన) 'ఓ' -గో+ఆస్య=గవాస్యము=(గోముఖము) 'ఔ .-గ్లౌ+ఉదయ=గ్లావుదయము=(చంద్రోదయము).

ఏ-ఓ' లకు హ్రస్వమగు అ కారము పరమగు నపుడది వికల్పముగా లోపించును ౩౩

గో+అగ్రి=గోఽగ్రిము=(లోపాభావమునఁ గ్రింది సూత్రము చొప్పున) అవ' వచ్చును గవాగ్రిము (గోవు మీఁది భాగము).

గో'శబ్దమున కచ్చు పరమగునపుడు పదాంతమున 'అవఙ్' అను నాదేశము వికల్పముగా నగును. ౩౪.

గో + అగ్ర = గవాగ్రము-గోఽగ్రము-(మీఁది సూత్రము చేత లోపము వచ్చెను)

— హ ల్ స ం ధు లు —

ప్రాతిపదికాంతమున నున్న నకారము లోపించును. ౩౫.

రాజన్+ఆజ్ఞా=రాజాజ్ఞ రాజన్+పురుష=రాజపురుషుఁడు హలాది విభక్తి పరమగునపుడును నీ విధి యగును. రాజభ్యామ్' మొ-

ప్రాతిపదికాంతమున నున్న 'రేఫ - సకార'ములు విసర్గము లగును. ౩౬ (విభక్తుల సకారమును విసర్గమే యగును)

స్వర్+కాన్తా=స్వఃకాంత మనస్+కఙ్జ=మనఃకంజము. రామ+భ్యస్=రామేభ్యః విద్వస్ అనుదాని సకారమునకు తకారమగును ఉదా - విద్వస్+చయము=విద్వచ్చయము-విద్వద్భ్యామ్ మొ

ప్రాతిపదికాంతమున నున్న 'చ' వర్గమునకు 'క' కారాదేశమగును ౩౭

వాచ్+కాన్తా=వాక్కాంత అసృజ్+కణ=అసృక్కణము=(రక్తబిందువు) హలాది విభక్తి పరకత్వమందును నిట్లగును- ఉ- 'వాగ్భ్యామ్'

ప్రాతిపదికాంతమున నున్న శ'వర్ణమునకుఁ గొన్ని యెడల క' కారాదేశమును గొన్ని యెడల ట' కారాదేశమును నగును ౩౮

దిశ్+కాన్తా=దిక్కాంత విశ్+కాన్తా=విట్కాంత=(కోమటి స్త్రీ) హలాది విభక్తి పరకత్వమందును నిది యగును ఉ- దిగ్భ్యామ్'.

ప్రాతిపదికాంతమున నున్న 'ష' కారమునకు 'ట కారాదేశమగును ౩౯

త్విష్+చయ=త్విట్చయము హలాది విభక్తి పరకత్వమందును నిది చెల్లును ఉ- త్విడ్భ్యామ్ తద్ధిత ప్రత్యయాదుల త' వర్గము పరమగుచో నా షకారము 'ట' వర్గముగా మాఱును షష్+థస=షష్ఠము=(ఆఱవది) షష్+తి=షష్టి=(అఱువది)

ప్రాతిపదికాంతమున నున్న హకారమునకుఁ గొన్ని యెడల క' కారమును గొన్నియెడల ట కారమును గొన్నియెడల త కారమును నాదేశము లగును వస్ ప్రత్యయాంతములకును నిట్లు తకార మగును. కకారాదేశ మగునపుడు దాని ముందటి వర్గ తృతీయ మునకు వర్గ చతుర్థ మాదేశ మగును ౮౦

కామదుహ్+చయ=కామధుక్చ్ఛయము=(కామధేనువుల సమూహము). మధులిహ్+చయ = మధులిట్చ్ఛయము = (తుమ్మెద సమూహము. ఉపానహ్ + చయ = ఉపానచ్ఛయము (తకారము చకారమయ్యెను) (చూ-సమా-౮౮ సూ) (ఉపానత్=చెప్పు=కాలి చెప్పు) విద్వస్+చయము=విద్వచ్ఛయము హలాది విభక్తి పరకత్వ మందును నిది చెల్లును 'విద్వద్భ్యామ్' కామధుగ్భ్యాః మొ

అవసానమున నాదములకు శ్వాసములు వికల్పముగా నాదేశము లగును ౮౧

హృద్=హృత్ తద్=తత్ మొ-

అవసానమున శ్వాసములకు నాదములు వికల్పముగా నగును ౮౨

కామధుక్=కామధుగ్ (కోరికలను బిదుకునది) ఈ కార్యము సంస్కృత హలాది విభక్తి పరమగునపుడును సంభవించును ఉదా - 'కామదుగ్భ్యామ్ మొ-

శ్వాస నాదములకు శ్వాసములు పరమగునపుడు వర్గ ప్రథమము లాదేశములగును శ్వాసనాదములకు నాదములు పరమగునపుడు వర్గ తృతీయము లాదేశము లగును ౮౩.

(శ్వాసనాదాదులు సంజ్ఞా-౧ సూ-౫ వివృతిలోఁ జేర్పఁబడెను) కామధుక్+కాన్తా=కామధుక్కాన్త తద్+కాన్తా=తత్కాంత.

జగత్+గురు=జగద్గురువు వాక్+ఈశ = వాగీశుఁడు = (బ్రహ్మ). ఈ కార్యము విభక్తి పరకత్వమందును నగును ఉదా.- జగద్భ్యామ్'.

సకార తవర్గములకు శకార చవర్గయోగమున శకార చవర్గములగును (దీనిని శ్చుత్వసంధి యం దురు) షకార టవర్గయోగమున షకార టవర్గము లగును (దీనినిష్టుత్వసంధి యందురు) ౪౪.

యాచ్+నా=యాచ్ఞా యాచ్ఞ=(యాచన) తత్+చిన్తా= తచ్చింత=(ఆచింత) తత్+టీకా=తట్టీక=(ఆటీక)

దకారమునకు 'జ-ఝ' లు పరమగునపుడు జ' కార మాదేశ మగును ౪౫

తద్+జయ=తజ్జయము జగద్ + జయ = జగజ్జయము తద్+ ఝంకార=తజ్ఝంకారము (చూ-సమా-౪౩ సూ)

తకారమునకు 'ట-ఠ లు పరమగునపుడు 'ట' కారాదేశ మగును. ౪౬

సత్+టీకా=సట్టీక తద్+టీకా=తట్టీక (చూ-సమా-౪౩ సూ) తద్+ఠకారము=తట్ఠకారము (చూ-సమా-౪౩ సూ)

దకారమునకు డ-ఢ'లు పరమగునపుడు డ' కారాదేశ మగును ౪౭

తద్+డయనము=తడ్డయనము=(ఆయెగురుట) తద్+ఢక్కా= తడ్ఢక్క మరుత్=మరుద్+ఢక్కా=మరుడ్ఢక్క (సమా-౪౩)

వర్గ తృతీయములకు న కార మ'కారములు పర మగునపుడు తత్తద్వర్గ పంచమాదేశము వికల్పముగా నగును ప్రత్యయ మ కార పరకత్వమున వర్గ తృతీ యమునకు వర్గ పంచమము నిత్యముగ నగును. ౪౮

వాగ్+మణ్డల=వాఙ్మండలము=వాగ్మండలము వాగ్+నిపుణ= వాఙ్నిపుణుఁడు=వాగ్నిపుణుఁడు మరుద్+మాన్ద్య=మరున్మాంద్యము= మరుద్మాంద్యము ప్రత్యయ -వాగ్+మయ=వాఙ్మయము మరుద్+ మాత్ర=మరున్మాత్రము (చూ-సమా-౪౩ సూ).

దకారమునకు 'ల' కారము పరమగుచో ల' కార మాదేశమగును. ౪౯.

తద్+లయ=తల్లయము=(ఆనాశనము) జగత్+లయ=జగద్+లయ=జగల్లయము (చూ సమా. ౪౩ సూ)

వర్గప్రథమములకు శ' వర్ణము పరమగునపు డా రెండిటికిని ఛ' కార మాదేశమగును ౫౦

మరుత్+శివ = మరుచ్ఛివులు (సమా ౫౨ సూ. చూ). వాక్+శయ=వాక్ఛయములు=(వాక్కును చేయియు) తత్+శివ=తచ్ఛివుఁడు (చూ-సమా-౪౩ సూ) (సమా ౫౨ సూ)

వర్గతృతీయములకుఁ బరమగు హ' కారము తత్తద్వర్గ చతుర్థాక్షరముగ వికల్పముగా నగును ౫౧. (సమా-౩౭ సూ)

వాచ్+వాక్=వాగ్+హరి=వాగ్ఘరి వాగ్హరి షట్+హయ=షడ్ఢయములు=షడ్హయములు (చూ-సమా-౩౯ సూ) =(ఆఱు గుఱ్ఱములు) తద్+హయ=తద్ధయము=తద్హయము=(ఆగుఱ్ఱము) కకుభ్=కకుబ్+హస్తి=కకుబ్భస్తి=కకుబ్హస్తి=(దిగ్గజము) (చూ-సమా-౪౩ సూ)

హ్రస్వముమీఁది ఛ' కారము నిత్యముగాను దీర్ఘముమీఁది 'ఛ' కారము వికల్పముగాను ద్విరుక్తినందును. మహాప్రాణ ద్విత్వమున మొదటిది యల్పప్రాణ మగును. ౫౨

తరు+ఛాయా=తరుచ్ఛాయము సీతా+ఛన్ద=సీతాచ్ఛందము=సీతాఛందము.

అచ్చు పరమగునపుడు 'ఙ-ణ-న'లకు ద్విత్వము బహుళముగా నగును. (నిత్యమని పాణిని సూత్రము-ఆతని వాడుకలందే వైకల్పికము) ౫౩.

సన్+అన్త=సన్నంతము=సనంతము. తిఙ్+అన్త=తిఙ్ఙంతము=తిఙంతము అణ్+అన్త=అణ్ణంతము=అణంతము.

## — అనుస్వార సంధులు —

పద మధ్యమునం (సమాన పదమందు) దలి 'మ' కార 'న'కారములు హల్లు పరమగునపుడు పూర్ణాను స్వార మగును అట్టి యనుస్వారమునకు వర్గాక్షరము లు పరమైనచోఁ దత్తద్వర్గ పంచమము లాదేశ మగును పదాంతమందు వర్గపంచ మాదేశము పాక్షికము ౫౭

అఙ్కుర - అఞ్చిత - కణ్ఠ - శాన్త - కుమ్భ - సఙ్కర - సంకర' మున్నగు రీతిని సంస్కృతమం దీ వర్గపంచ మాదేశము కలదు గాని యీ సంస్కృత శబ్దములు తత్సమము లగునపు డాంధ్రకవు లీ వర్గపంచ మాదేశము నుజ్జగించి యున్నారు- కావున నవి తత్సమము లగునపుడు ' అంకురము_అంచితము_కంఠము_శాంతము_కుంభము_సంకరము'' అను రీతి ననుస్వారయుక్తములుగానే యుండును శా సింగం బాఁకటితో .. మాతంగ స్ఫూర్జిత . ఓ జం గాంతార నివాస . వచ్చెం గురుతీసుత... (విరా_౭ ఆ_౯౫)

హల్లు పరమగునపుడు పదాంతమున మ'కార మను స్వార మగును అవసానమునఁ గానేరదు. ౫౫

'రామం నమామి' యనెను. 'నమామి రామం' అనరాదు. ఇంక 'నమామి రామ మ్మనెను' అనియె ప్రయోగింపవలయును

కొన్నియెడల పుమ్' శబ్ద మకారము స'కార పరక మగును. ౫౬.

పుమ్ + కోకిల = పుంస్కోకిలము 'పుంలింగము' 'పుంభావము' మున్నగు చోట్ల నట్టి సకార పూర్వకత్వము లేదు.

## — విసర్గ సంధులు —

హ్రస్వాకార పూర్వకమగు సకార జన్య విసర్గము నకు హ్రస్వాకారము పరమగునపుడు ఓ'కార మాదేశ

మగును ఆ పరస్థమగు అ'కారము లోపించును ౫౭.
(చూ-సమా-౩౬ సూ).

మనస్=మనః+అబ్జ=మనోఽబ్జము.

అట్టి విసర్గమునకుఁ దక్కిన యచ్చులు పరమైనచో లోపముగాని 'య'కారముగాని యగును ౫౮.

మనస్=మనః+ఆదర=మన ఆదరము=మన యాదరము మనస్=మనః+ఈశ=మన ఈశుఁడు=మన యీశుఁడు.

అట్టి విసర్గమునకు నాదవర్ణములు పరమైనచో ఓ'కారాదేశ మగును ౫౯.

మనస్=మనః+నిశ్చయ=మనోనిశ్చయము. హలాది విభక్తి పరకత్వమునందును నిది యగు ఉ-మనోభిః.

పయి మూఁడు విధములయిన స్థలములందును విసర్గము రేఫజన్య మయినచో దానిచోట రేఫమే నిల్చును ౬౦ (చూ-సమా-౩౬ సూ)

స్వర్=స్వః+అధిపతి=స్వరధిపతి=(ఇంద్రుఁడు) స్వర్=స్వః+ఆగత=స్వరాగతుఁడు=(స్వర్గమునందుండి వచ్చినవాఁడు) స్వర్=స్వః+నివాసి(న్)=స్వర్నివాసి=(స్వర్గనివాసి). ధూర్భిః.

హ్రస్వాకారేతరాచ్చులమీఁది విసర్గమునకు నచ్చులుగాని నాదములుగాని పరమయినచో రేఫాదేశమగును ౬౧.

ధనుస్=ధనుః+అగ్రి=ధనురగ్రము=(వింటికొన). ధనుస్=ధనుః+గుణ=ధనుర్గుణము=(వింటి నారి). హలాది విభక్తి పరకత్వమునను నిది యగు ఉదా-ధనుర్భిః

విసర్గమునకు క-ఖ, ప-ఫ'లు పరమైనచో జిహ్వామూలీ యోపధ్మానీయములు వైకల్పికముగ నగు. ౬౨.

మనస్=మనః+కమల=మనᳵకమలము=మనఃకమలము పయస్=పయః+పాన=పయᳶపానము=పయఃపానము.

అట్టి విసర్గము రేఫజన్యమైనచో రేఫము వికల్పముగా నిల్చును ౬౩

స్వర్=స్వః+పతి=స్వర్పతి=స్వఃపతి (ఇందుౖడు)

క-ఖ ప-ఫ' లు పరమగునపుడును గొన్నియెడల విసర్గమునకు సకారాదు లగును. ౬౪

నమస్కారము-పురస్కారము - దుష్కృతము - ఆవిష్కృతము - అయస్కాంతము-నిష్ప్రత్యూహము=(విఘ్నము లేకుండునట్లు) మొ

విసర్గమునకు చ-ఛ లును శవర్ణమును బరమైనచో 'శ' వర్ణ మగును ౬౫.

మనస్=మనః+చిన్తా=మనశ్చింత మనః+శాన్తి=మనశ్శాంతి

విసర్గమునకు ట-ఠ లును ష'వర్ణమును బరమైనచో షకార మగును ౬౬

ధనుస్=ధనుః+టఙ్కార=ధనుష్టంకారము పయస్=పయః+షణ్డ=పయష్షండము (పాల సమూహము)

విసర్గమునకు త-థ లును సకారమును బరమగు నపుడు సకార మగును ౬౭

మనస్=మనః+తత్వ=మనస్తత్వము. స్వర్=స్వః+సఙ్గతి=స్వస్సంగతి (స్వర్గసంగతి)

రేఫమునకు రేఫము పరమయినచో లోపము గలిగి పూర్వాచ్చునకు దీర్ఘమగును ౬౮

ధనుస్-ధనుర్+రాశి=ధనూరాశి. స్వర్+రాజ్య=స్వారాజ్యము

## — సాధ్య సమాస ప్రకరణము —

సాధ్య సమాస మవ్యయీభావము లేదు. తక్కిన తత్పురుషాదులు సాధారణముగా సిద్ధ సమాస లక్షణములతోనే సాధ్య సమాసములును వర్తిల్లును. ౬౯.

(బా-సమా-౩ సూ) (వ్యా-సం-౨౬౮. ౨౬౯ వివ).

సాధారణముగా ననుటచేత ద్వంద్వ బహువ్రీహులు కేవలాచ్ఛిక పద ఘటితములు మాత్రమె సాధ్యములు సాధువులు సంఖ్యావాచక పూర్వక సాధ్యము లెల్ల ద్విగువులె. (చూ-సమా-౧౭ సూ) ముల్లోక ములు మున్నగు ద్విగువులును సాధ్యములు సాధువు లగును. షష్ఠీ తత్పు రుష కర్మధారయ ద్విగువులు సాధ్య సాంస్కృతిక మిశ్రి సమాసములు కావచ్చును సమాస యోగ్యత లేని పదములతో సైతము సంధ్యాది సూత్రముల విశేష విధులచే జ్ఞాపితములగు సమాసములును (షష్ఠీ తత్పు రుషమును బిరుదాది శబ్ద ఘటిత సమాసములును) సమాస సామాన్య పద్ధతులకు లోనుగాక తత్తద్విశేషవిధి సూత్రముల కనుకూలముగా వర్తి ల్లును. † షష్ఠీ తత్పురుషేతర సాంస్కృతిక మిశ్ర సాధ్య తత్పురుషములు సాధువులు కావు 'దొంగ భయము' అనునది సూరి వ్రాసినట్లు పంచమీ తత్పురుషము కానేరదు అదియు షష్ఠీ తత్పురుషమె. సాంస్కృతిక మిశ్ర కర్మధారయ ద్విగువులును శాస్త్ర ప్రయోగాభ్యనుజ్ఞాతములు సాధువు లగును

---

† సూరి యీ సందర్భమున మిక్కిలిగఁ బ్రమాద పడెను. 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' (బా-సమా-౩ సూ) అని సూత్రించియు దాని కాచ్ఛిక సమాసములను మాత్రముదాహరింపక లక్ష్యములుకాని మిశ్రి సమాసములను సాం స్కృతిక సమాసములను గొన్నిటి నుదాహరింప సాగెను 'దొంగ భయము' అనునది మిశ్రి సమాసము. ఇది 'చోరభయము' అను దాని వలెఁ బంచమీ తత్పురుషము కానేరదు ఇది షష్ఠీ తత్పురుషము కానో పును. ఇట్లె 'రాముని బాణము' అనునది తత్పురుషాదులకు . అను నీ సూత్రమునకు లక్ష్యము కానేరదు సూరి 'సమాసకము' బిరుదా ద్యుత్తర పద సమాసములు' అను వానిని గ్రహించినట్లె యగపడదు-చింతామణి షష్ఠీ తత్పురుష పద్ధతి నీతఁడు గ్రహించినట్లు తోఁచదు.

సాంస్కృతిక మిశ్రాచ్ఛిక భేదంబులచే సాధ్య సమా
సములు మూఁడు విధములు. ౭౦ (బా-సమా-౨ సూ)
(వ్యా-సం-౨౬౭ I విమ)

I తత్సమ పద ఘటిత సాధ్యసమాసము సాంస్కృతికము ఉదా - రాముని బాణము (రామునియొక్క బాణము) తటాకము నుదకము= (తటాకముయొక్క+ఉదకము) పోషించు ప్రభువు-మొ. II తత్సమా చ్ఛిక పద మేళిత సమాసము మిశ్ర సమాసము ఉదా -రామునికొడుకు= (రామునియొక్క + కొడుకు) తేయాజ్ఞ =(తేనియొక్క + ఆజ్ఞ). తెల్ల వస్త్రము మూఁడు లోకములు వాఁడి మయూఖములు వేఁడి పయో ధారలు

షష్ఠీ తత్పురుషేతర తత్పురుషములవలెనె కర్మధారయద్విగువు లును చింతామణిసూత్రములచేతను, మహాకవిప్రయోగములచేతను జ్ఞాపి తములగునవి యభ్యనుజ్ఞాతము లగును III కేవలాచ్ఛికపదములతో ఘటిల్లిన సమాస మాచ్ఛికము దీనిని సమాసకమనియు నందురు. సాధ్యములగు నీయాచ్ఛికములందు వెనుక వివరించిన సిద్ధసమాసభేదము లన్నియు యథాప్రయోగముగ గ్రాహ్యములగును - నెలతక్కువవాఁడు= (నెలచేతఁ దక్కువవాఁడు) దొంగబయము=(దొంగవలనిభయము). మాటనేర్పరి=(మాటయందు నేర్పుగలవాఁడు) మున్నగునవి తృతీయాది తత్పురుషములన్నను నవచ్చును కాని యట్టి యాచ్ఛికములును షష్ఠీ తత్పురుషములెయని సమర్థింపనగును నెలయొక్క+తక్కువవాఁడు= నెల చేతఁ దక్కువవాఁడనియర్థము. సంబంధషష్ఠి సకలకారకార్థములను నియ్యఁ గలదు ఆచ్ఛికతత్పురుషము - కన్నుంగవ = (కన్నులయొక్క+కవ)' (ఆది ౪ ఆ-౨౫౪) పులుఁగుఱేఁడు=(పులుఁగులయొక్క+ఱేఁడు)' ఇట్టి యెడల కన్నులకవ అని యుండ నక్కఱలేదు సమాససామాన్యలక్షణము చొప్పున నలౌకికవిగ్రహమందే సమాససంజ్ఞ గలిగి కన్నులయొక్క' మొద లగు రూపములు కలుగకముందే విభక్తిలోపాదికమున సమాసప్రాతిపది

కము సిద్ధించును ఇట్లె యీక్రింది కర్మధారయాదులందును గ్రహింప వలెను. కర్మధా -వాఁడినారసములు, వేన్నీళ్ళు ద్విగు -ముచ్చిచ్చు= (మూఁడుచిచ్చుల మొత్తము) ద్వంద్వ -తల్లిదండ్రులు - కాలేఁయి= (కాళ్లయుఁ జేతులయు మొత్తము) బహువ్రీ -వేనెలుఁగు=(వేయి కిరణములు గలవాఁడు) ముక్కంటి=(మూఁడు కన్నులు గలవాఁడు=శివుఁడు) ఉపమానపూర్వపద బహువ్రీహి -చిగురుంగేలు=(చిగురువంటి కేలుగలది), మోముదమ్మి=(ముఖమనెడి పద్మము) (ఇది రూపకసమాసము) మధ్యమ పద లోపి సమాసము -ఇరువదియొకటి=(ఇరువదిటిచేత నధికమగు నొకటి).

జ్ఞాపకసిద్ధసమాసములు సమాససామాన్యశాస్త్రము చెప్పున సాధ్యములు కావు వానియందాయాసంధ్యాది సూత్రముల విశేషవిధుల చెప్పునఁ దత్తద్విశేషవిధ్యను కూలముగా నా యా సమాసముల ప్రక్రియ నడచును. ౨౧ (వ్యా-సం-౨౯౮I ౨౭౦I విష ౧౧౨౧ పుట- ౧౧౭౦ పుట )

నిర్దయ+ఆలు)=నిర్దయురాలు వీనికి సమాసమె సాధువు కాదు అయినను సంధి ౨౯ సూత్రపు విశేషవిధిచే వీని సమాసము జ్ఞాపితమై ఉత్వమును సిద్ధించును ఇట్లె శోకార్తములు+ఒడలులు= శోకార్తపు టొడలులు' మున్నగుచోట్ల (శ్రీ-౨ ఆ ౧౨౮) సంధి ౩౦ సూత్రముచెప్పున వీని సమాసాదికము జ్ఞాపితమై తత్సూత్రానుకూలముగా 'ము' గాగమము నిల్చుట దానికి పుంప్వాదేశము మున్నగునవి యగుట సంభవించును. తలంబ్రాలు' మున్నగునెడల సంధి ౨౬ సూత్రము చెప్పున జ్ఞాపితమై యుత్తరపదలోపాదికము సిద్ధించుచున్నది 'రామునివలని భయము' అనుచో సంధి ౪౦ సూత్రముచెప్పున మధ్యమపదలోపాదికము సాధువగుచున్నది కృష్ణ+రాయఁడు=కృష్ణరాయఁడు' మున్నగుచోట్ల సమా-౨౧ సూత్రముచెప్పున శుద్ధసంస్కృతపదముతోడి సమాసము సాధువగుచున్నది

సాంస్కృతికమిశ్ర తత్పురుషము షష్ఠీసమాసమే సాధువు. అట్టి షష్ఠీ తత్పురుషమునందలి పూర్వావయవపు షష్ఠ ద్వితీయారూపమున నిల్చును ఇది సమాసక ములందును వర్తిల్లును. మధ్యమపదలోపాదిసమాసము లందును నీవిధి వర్తిల్లుట గలదు ఇట్టివి షష్ఠ్యలుక్స మాసము లనఁదగును షష్ఠ్యర్థక 'ది-వి-గు' ప్రత్యయ పరకత్వమందును(కార-౧౯ సూ) ద్వితీయయే నిల్చును.

౭౨ (బాల-సమా-౨౫ సూ) (వ్యా-సం-౨౭౦ విష)

రాజుయొక్క+ఆన=రాజున్+ఆన=రాజు+ఆన (సంధి ౨౩ సూ) రాజున్+ఆన=(సంధి-౩౨ సూ)=రాజునాన. (సంధి ౨౩ సూ-చే సామాసిక దుగ్తిలోపము-సంధి-౩౨ చే షష్ఠీసమాస నుగాగమము) ఏత త్సూత్రవిధానసామర్థ్యముచేతనే సమాస సామాన్యపద్ధతిచొప్పున (సమా-౧ సూ ౧-౨ విష.) నలౌకిక విగ్రహమునందే సమాససంజ్ఞగల్గి విభక్తిలోపమున 'రాజయాన' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు. ఇట్టి స్థితిలో నితరతత్పురుషములందు విభక్తిలోపమునకు విధియే లేదనుట స్పష్టమేకదా వారణావతమున వారెల్ల (ఆది ౬ ఆ) మున్నగు స్థలము లందు 'న' వర్ణకము సప్తమ్యర్థకము కాదనియు షష్ఠ్యర్థకమె యనియు నట్టివెల్ల షష్ఠ్యలుక్సమాసములెయనియు గ్రహింపవలయును ప్రకృత సూత్రజ్ఞాపకముచేత సమాస పూర్వావయవషష్ఠి లోపింపక ద్వితీయా రూపమున నిల్చును 'యొక్క' విభక్తి లోపించిన షష్ఠి యాకారముగల ద్వితీయారూపముమాత్రమె నిల్చునని వ్యాఖ్యానము చేయనగును*

---

* సూరి సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు (బా-సమా-౨౫ సూ) అని సూత్రించెను గుణముల ప్రోకలచేతన్ ' మున్నగు చోటులందు గుణములప్రోకల మున్నగురీతిగల సామాసిక ప్రాతిపదికము లేర్పడవలసివచ్చును. సమాస పూర్వావయవవిభక్తికి మాత్రమె లోపమును సూరి యుద్దేశించె నన్నచో సమాసమున సము

కాన సీతయొక్క+రూపము=సీతనురూపము ' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు ఇంక సీతయొక్క+రూపము=సీతన్+రూపము=సీతరూపము' అనురీతిగల ప్రక్రియయే సంభవించును ఇట్లె రాముని గుణంబులు=రాముగుణంబులు మున్నగువానిని సాధింపనగును నీ-నా-తా-మన శబ్దములపట్ల ద్వితీయాకారస్థితి ప్రయోగవిరుద్ధముగాన వాని షష్ఠీసమాసములో నేకత్వమున 'నీ-నా-తన శబ్దములును బహుత్వమున మీ-మా-తమ-మన శబ్దములును నిల్చునని వ్యాఖ్యచేయవలయును. ఉదా -నీగుణములు-మీగుణములు-నాగుణములు-మాగుణములు-తనగుణములు - తమగుణములు - మనగుణములు జవ్వాదియొక్క+సెట్టి=(జవ్వాది నమ్మెడి సెట్టి) జవ్వాదిన్+సెట్టి=జవ్వాదిసెట్టి (ఇది మధ్యమపదలోపి) ఇట్లె శాకముయొక్క+పార్థివుఁడు = (శక్తిప్రియుఁడగు పార్థివుఁడు) శాకపార్థివుఁడు-మొ రూపక -మోముయొక్క+తమ్మి=(మోమనెడి తమ్మి)=మోమున్ + తమ్మి=మోముఁదమ్మి వేపల్లెయొక్క+వాడ=వేపల్లెన్+వాడ=(వేపల్లె యను వాడ) వేపల్లెవాడ (ఇట్టివానిని సంభావన పూర్వ పద కర్మధారయము లనియు నందురు రెండు వేలయొక్క+నలువది=(రెండువేలచే నధికమగు నలువది) = రెండువేల నలువది ఇట్టివియు మధ్యమ పదలోపి ద్విగువు లనఁబడును ఇట్లె-ఇరువదిటియొక్క + అయిదు = ఇరువది యైదు ఇట్టియెడల నోప విభక్తికముల బాహుళ్యముచేత టి-ంటు లు రాక ప్రథమ నిల్చెనని యెఱుంగనగు (అచ్చి-౭౧ సూ) ఇట్టివియును ద్విగువులె డి-వి-దు -దానిది కలరూపు (ఆది-౪ ఆ-౩౦) వారివ (ఆది-౩ ఆ-౧౫౬) నీదు కొడుకులు (స్త్రీ-౧ ఆ-౮౩) (నీయొక్క+కొడుకులు

---

దాయమున నేకపదీభావమే దుర్ఘటమగును విశిష్టైకార్థబోధమే లేను-సమాసమునకుఁ బ్రాతిపదికత్వమే సిద్ధింపనేరదు మఱియు సమాసపూర్వావయవ విభక్తిమాత్ర లోప విధానముచేత నుత్తరపదలోపిసమాసములు చ లోపాదికముగల ద్వంద్వాదులును సిద్ధింపనేరవు గదా-

౧ వివ:-ఉపమాన వాచకములగు శబ్దములతోఁ దఱచుగా షష్ఠీ తత్పురుషమె యుపమేయము ప్రథమాంతమై యున్నపుడు సంభవించును సంస్కృతమున నన్ననో యుపమానోపమేయములు సమాన విభక్తికము లయియే యుండును. తెల్గునందును నుపమేయ మితర విభక్తులలో నున్నపు డెల్ల యుపమానోపమేయములు సమాన విభక్తికములే యగును. సంస్కృతమున సదృశాది శబ్దములకువలెనె తెల్గున నుపమాన శబ్దములకు షష్ఠీ తత్పురుషమె కల్గును (వ్యా-సం-వి_స్త-౨౭౦ వివ. ౧౧౬౩ పు)

'అట్లు-కరణి' ప్రభృతులును 'అట్టి-వలెను-వంటి-బోఁటి' శబ్దములును నుపమేయము ప్రథమాంతమై యున్నచో నుపమాన శబ్దములతో షష్ఠీ తత్పురుష మగును. వలె శబ్ద ముపమాన వాచక మగునపుడు యుష్మ దస్మ దాత్మ శబ్దములు షష్ఠ్యంతములగుటయే కాక ద్వితీయాంతములును నగును బోఁటి వంటి శబ్దము లుపమానవాచకము లగునపుడు యుష్మ దస్మ ద్వాచకములు షష్ఠ్యంతములగుటయే కాక ద్వితీయాంతములును నగును ఉదా-అట్లు-నారాయణునట్లు (ఆది ౧ ఆ ౨౫ ప) అట్టి-రాముని యట్టి-నా యట్టి-మొ. వలె-రామునివలెను. నావలెను=నన్నువలెను. నీవలెను=నిన్నువలెను. తనవలెను=తన్నువలెను బోఁటి-వంటి-రామునిబోఁటి=రామునివంటి. నాబోఁటి=నన్నుబోఁటి నావంటి=నన్నువంటి బోఁటి తనంతఁ బ్రత్యయార్థంబగును-ఉదా-మముబోంట్లకున్-మొ.

౨ వివ:-ప్రసంగవశమున షష్ఠీ తత్పురుష సంబంధము లేకున్నను నీ క్రింది శబ్దము లుదాహరింపఁబడుచున్నవి. 'పోలెన్-బలెన్-పోని' శబ్దము లుపమానవాచకములగునపు డుపమేయము ప్రథమాంతమై యున్నచో నుపమాన శబ్దములగు యుష్మదస్మ దాత్మార్థకములు ద్వితీయాంతము లగుచుండఁగాఁ దక్కినవి ప్రథమాంతము లగును అట్టి ప్రథమాంతముల తుదిని 'చా'ర్థక శబ్ద మర్థవిశేష బోధక మగుచు వికల్పముగా నిల్చును పోని శబ్దము నుపయోగించునపు డట్టి చార్థకశబ్దము

'ను'వంతములపై నిత్యముగా నిల్చును ఉదా:-పోలెను-రాముఁడు వోలెన్=రాముఁడునుం బోలెన్. వాఁడు వోలెన్=వాడుం బోలెను. నన్నుం బోలెన్-నిన్నుఁ బోలెన్-తన్నుఁ బోలెన్. బలె-రాముఁడు బలెన్-రాముఁడును బలెన్. వాఁడు బలెన్=వాఁడును బలెన్. నన్ను బలెన్-నిన్ను బలెన్-తన్ను బలెన్. పోని-రాముండును బోని-సీతయుం బోనిదాని. సీతవోనిదాని. వాఁడునుం బోని. నన్నుం బోని-నిన్నుఁ బోని-తన్నుఁ బోని.

3 వివ.-పెక్కింటి కొఱకు వాచకము నిల్చుట గలదు ఉదా-సోమములేని యధ్వరంబును శశిలేని రాత్రియు రవిలేని నభమును బుష్ప సంపదలేని భూజంబును బోలె. (అను-౨ ఆ-౧౦౬).

౪ వివ.-వాచకద్వయ ప్రయోగమును గలదు ఉదా-శబ్దంబు నట్ల పోలె (ఆది-3 ఆ-౧౨౭)

౫ వివ-'ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ'అను వార్తికము నియతము కాదని వ్యాకరణ మహాభాష్యము నుడువుచున్నది 'ఉద్బాహు రివ వామనః' అని యిట్లు వ్యస్తప్రయోగములు గలవు ఆంధ్ర మహాకవులును వ్యస్తతను బ్రయోగించిరి హిమ మయూఖుఁడ పోలెన్ (ఆది-3 ఆ-౧౨౫). 'ఆదిత్యుండును బోలె' అని (నరస-౫ ఆ-౧౮ ప) సమాస గత శౌత్రికి బట్టుమూర్తి యుదాహరించెను

కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వా
దుల మువర్ణకంబులు పజ్-ప' వర్ణకంబు లగు 23.
(బా-సమా-౧౯) (వ్యా-సం-౨౭౨ I విష ౧౧౮-౨
పుట)

పజు-(నాము + చేను) = నాఁపచేను (కర్మధారయము) పాఁప ఱేఁడు=(పాములయొక్క+ఱేఁడు) పజు జిత్తుగాన బిందుపూర్వక మయ్యె. (ప్రేముయొక్క+బెత్తము) ప్రేఁపబెత్తము (వేము+చెట్టు) వేఁపచెట్టు. (అమ్ములయొక్క + శయ్య)=అంపశయ్య=(అమ్ములతోఁ గల్పింపఁబడిన

శయ్య (మధ్యమ పద లోపి సమాసము) (ఎమ్మురొయొక్క+ముక్క) ఎంప ముక్క. తొది రెండుచోట్లను నుడి తొలి హ్రస్వమువీూఁదఁ గావున నర్థ బిందువు లేదు (నాము-పాము-ప్రేము-వేము-అమ్ము-ఎమ్ము' ఇవి నామ్యాదులు) కనుముయొక్క+పులు=కనుపపులు (తెల్లుగడ్డి) (ఇనుము యొక్క+ముక్క) = ఇనుపముక్క. ఉడుపకుక్క = (ఉడుముయొక్క+ కుక్క)=(ఉడుము మున్నగువానిని వేటాడెడు కుక్క - మధ్యమ పద లోపి) ఎనుపతేలు=(ఎనుముయొక్క+తేలు)=(ఎనుమువలె నల్లని తేలు- మధ్యమ పదలోపి) జనుపనార=(జనుముయొక్క+నార) మినుపగింజ= (మినుముయొక్క+గింజ) కనుము-ఇనుము-ఉడుము-ఎనుము-జనుము- మినుము- ఇత్యాదులు కనుమ్యాదులు

ఈ షష్ఠీ-షష్ఠి కము లును నొపవిభక్తికములె యయ్యు సమాసములందు మాత్రమె వచ్చును గాన నొపవిభక్తిక ప్రకరణమునఁ జేర్కొనఁబడలేదు.

౧ వివ - నదిసుత' మున్నగువాని సాధనము - (చూ-సమా- ౫౬ ౩ సూ)

— సమానాధికరణ సమాసములు —

సమానాధికరణ సమాసములగు కర్మధారయ ద్విగు వులలో సమాస పూర్వావయము 'డు'మంతము కా రాదు 'ము'వర్ణకాంతము కావచ్చును కాని యా 'ము' వర్ణకమునకు పుంపు లాదేశము కావలయును ము వర్ణక విరహితము కారాదు ౨౪ (బా-సమా-౫ సూ) (వ్యా-సం-౨౭౭ విష) †

---

† సూరి కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశేషణ పూర్వకంబయి యుండు (బా-సమా-౫ సూ) అని సూత్రించెను ఆ-ఈ-ఏ' అనునవి పదములు కావు కావున నట్టి త్రికమునకు సమాసయోగ్యతయే లేదు కావున సమా-౨౬ సూత్రము చొప్పున

'బల్లిదుఁడగు మగఁడు' అను విగ్రహము గల బల్లిదమగఁడు' అను రీతివి యుండరాదు. బల్లిదకోలము' అనెడి లుప్త ము' వర్ణకమును నుండరాదు ము'వర్ణక ముగాగమములకు 'పు_ంపు'లు వచ్చిన బల్లిదపు కోలము_బల్లిదంపుకోలము' అనునవి నిర్బాధములు సంధి_౩౦ సూత్రము చొప్పున జ్ఞాపితములైన సాంస్కృతిక మిశ్రములును సాధువులె సరసపు మాట_సరసంపు వచనము_మొ

౧ వివ _ఆంధ్ర విభక్త్యంతముకాని శుద్ధ సంస్కృత శబ్దము మాచ్ఛిక శబ్దముతో సమసింపదు ఉదా _అనేకమాఋలు_అల్పదండులు_బల్లిదపురుషుఁడు_శ్వేతగుఱ్ఱము_మృదుబట్ట_మొదలగునవి యసాధువులు.

అన్న=అన_అమ్మ=అమ_రాయ_రావు_రెడ్డి' మొదలగు బిరుద వాచకము లుత్తరపదములుగాఁ గల మిశ్ర కర్మధారయములును సమ్మతములగుచున్నవి. (పయి సూత్రమున కపవాదము) అట్టి సమాసములలోఁ బూర్వావయవమగు సంస్కృత శబ్దము తుదిని అ_ఇ_ప_మ" మున్నగునవి చేరుటయుఁ గలదు. ౭౫ (వ్యా సం_౨౭౩ వివ) (ప్రౌఢ-సమా_౨ సూ)

సిద్ధుఁడు+అన=సిద్ధన మల్లుఁడు+అన=మల్లన (విరా-౧ ఆ-౧౦) భీముఁడు+అన=భీమన. రాముఁడు+అయ్య=రామయ్య సీత+అమ్మ=సీతమ్మ కృష్ణుఁడు+రాయఁడు=కృష్ణరాయఁడు శ్రీపతి పండితుఁడు+

---

వాని సమాసము ప్రత్యేకముగా సూత్రింపనగును ధాతుజ విశేషణములును స్త్రీ సమములె అట్లంగీకరింపనిచో వానికిఁ బ్రథమైకవచనలోపము గల్గు టెట్లు? కల్గనిచో వానికి వాక్య ప్రయోగయోగ్యమగు పదత్వము సిద్ధించు టెట్లు? ము వర్ణకాంత అనినచో ముగంతసిద్ధి యగును గాని 'ముగంత' అనుటచే ము' వర్ణకాంత' అను నర్థము రాదుగదా. ఆ పట్టున సరసపు వచనము' అనుదాని సిద్ధి యెట్లు? స్త్రీ సమము తోడి కర్మధారయమును వేఱ చెప్పనేల?

అయ్య=శ్రీపతిపండితయ్య ఆకారాదియోగము - రామారావు-సుబ్బారావు-సుబ్బారాయఁడు-రామిరెడ్డి-కృష్ణమరాజు. బిరుద సమాసము లందు యథేష్టవర్ణకల్పనమును యథాప్రయోగముగా గ్రహింపనగును. మాగంటిపట్టణము తెనాల్యగ్రహారము. వేపల్లెవాడనగరి తిర్మల మహారాయఁడు-మొ

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు పదద్వయ
సంధిలో నాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు ౭౬
(బా-సమా-౧౩ సూ) త్రికంబుమీఁది హల్లునకు
నూష్మ రేఫభిన్నమునకు ద్విత్వంబు విభాషనగును ౭౭
(బా-సమా-౧౪) (వ్యా-సం-౨౦౧వివ)

ఆ-ఈ-ఏ అను సర్వనామ ప్రాతిపదికములు త్రికమనఁబడును (బా-సమా-౪ సూ) ఈ సూత్రపు జ్ఞాపకముచేతఁ ద్రికాది మిశ్రసమాస మభ్యనుజ్ఞాతమగుచున్నది ' అది+కన్య=అక్కన్య-వానికిన్+పురుషునకున్=అప్పురుషునకున్'' మున్నగుచోటులందు అది-వానికిన్' మున్నగు రూపములు సిద్ధింపకముందే సమాససంజ్ఞ గల్గి విభక్తిలోపాదికము గల్గుటచేత ఆ-ఈ-ఏ' అనెడి ప్రాతిపదికములు నిల్చుటయు ఆకన్య-ఆపురుష' మున్నగు సమాస ప్రాతిపదికములు సిద్ధించుటయు సంభవించెను (చూ-సమా-౧ సూ-౨ వివ)

ఆకన్య=అక్కన్య ఈకాలము=ఇక్కాలము ఏలోకము=ఎల్లోకము. ఆయశ్వము=అయ్యశ్వము ఊష్మ రేఫములకు -ఆశ్వము-ఈషంఅము-ఏసుకృతి ఆరూపము-ఈరెక్కలు ఆఋషి-(చూ-సంధి-౨ సూ) ఈధరణి=ఇద్ధరణి (చూ-సమా ౫౨ సూ) (సభా ౨ ఆ ౨౭)

౧ వివ -సంయుక్త హల్ పరకత్వమున త్రికహ్రస్వము హల్ ద్విత్వము గ్గఁవని యధర్వణుఁడు చెప్పినను నట్టి హ్రస్వద్విత్వములకుఁ దదనంతర మహాకవిప్రయోగములు గలవు. నీవిప్రభావము (రాఘ ౨ ఆ ౧౦౪ ప) నీవు-ఈ+ప్రభావము ' అని భారతార్థచ్ఛేదము-' నీ+

విప్రభావము''=(విప్రత్వము) అని రామాయణార్థచ్ఛేదము భారతార్థ మునఁ బ్రకృతవివరణముచే హ్రస్వద్విత్వములు వచ్చెను-పిదప ద్విత్వము లో నొకహల్లు హలంతరసంయోగమున లోపించినది (చూ-అచ్చి-౧౨ సూ ౧ వివ)

౨ వివ .- వేఁడి+నీళ్ళు=వే+నీళ్ళు=వేన్నీళ్ళు మూఁడు+నాళ్ళు= మూ+నాళ్ళు=మూన్నాళ్ళు అను రీతిగల చోటులందు వర్ణలోపనిమిత్తకమగు ద్విత్వము హ్రస్వమును గల్గింపదయ్యె (చూ-సంధి-3౪సూ)

3 వివ .- ఆయెడ=ఆడ. ఈయెడ=ఈడ. ఏయెడ=ఏడ'' అను చోటులందు 'ఎడ'' శబ్దపు ఎ కారము లోపించినదిగాన ప్రకృత సూత్రము చొప్పున హ్రస్వద్విత్వములు గల్గనేరవు

కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు ౭౮. (బా-సమా-౧౪ సూ) (వ్యా-సం-౨౮౧I వివ)

ఈ సమాసము (ఆచోటు-అచ్చోటు) పూర్వసూత్రముచేతనే సిద్ధించినది అట్టి కృతహ్రస్వ చోటుశబ్దపు నోత్వంబున కత్వహ్రస్వము లగును. అచ్చోటు=అచ్చొటు=అచ్చటు ఇచ్చోటు=ఇచ్చొటు-ఇచ్చటు-ఎచ్చోటు-ఎచ్చొటు-ఎచ్చటు 'అచ్చొటు-అచ్చటు' మున్నగువాని ద్విత్వంబునకు 'అచ్చి-౨౬ సూత్రముచే లోపము-అచొటు=అచటు ఇచొటు=ఇచటు-ఎచొటు=ఎచటు' ముచ్చోటులు = ముచ్చొటులు= ముచ్చటులు' అనియు రూపంబులు గలవు తే ॥ చరణములు కేళ్ళు గడిగి ముచ్చట్లు చదిచి (విజ్ఞా-ఆచార. శ-ర).

ఉత్తరపదంబగు 'చోట' శబ్దము 'టా క్షరంబునకు లోపంబు విభాషనగు ౭౯ (బా-సమా-౧౬ సూ) (వ్యా-సం-౨౮౧II వివ)

చోటుశబ్దం బౌపవిభక్తికంబుగాన దాని యంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన అ' కారంబు (అచ్చి-౮౦ సూ) తోడఁ బాక్షికముగా

లోపించునని యర్థము. అచ్చోటనున్నాఁడు = అచ్చోనున్నాఁడు "అట్టివో (సభా_౨ ఆ_౩౦)

ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబునకు
అయి_ఆయి' అను శబ్దంబులు విభాషనగు. ౮౦
(బా_సమా_౨౧ సూ) (వ్యా_సం_౨౩౯ వి)

ఈ సూత్రపు జ్ఞాపకముచేత నిట్టి యామ్రేడితమును వానితోడి మిశ్రసమాసమును నభ్యనుజ్ఞాతమగుచున్నవి. 'అది+అది+కాలము= ఆయాకాలము వాఁడు+వాఁడు+పురుషుఁడు=ఆయాపురుషులు' మున్నగు చోటులందు 'అది _ వాఁడు' మున్నగు రూపములు లభింపకముందే సమాససంజ్ఞ గల్గి విభక్తి లోపాదికము గల్గుటచేత ఆ' అను ప్రాతిపదికము నిల్చుటయు ఆయాకాల_ఆయాపురుష' మున్నగు సమాస ప్రాతిపదికములు సిద్ధించుటయుఁ సంభవించెను (మూ_సమా_౧ సూ ౧_౨ వివరణములు) అట్టిచోటి యామ్రేడితమగు 'ఆ' శబ్దమునకు అయి_ఆయి' శబ్దములు పర్యాయముగ విభాషను నిల్చునని యర్థము. వక్ష్యమాణవిధిచేత (క్రియా-౧౦౬ సూ) అయి' అనుదానికి ఐకారా దేశంబునగు ఆయయికాలము=ఆయాయికాలము=అయ్యాయికాలము=అయ్యాయికాలము=ఆయైకాలము=అయ్యైకాలము=ఆయాకాలము= ఆయకాలము=అయ్యాకాలము=అయ్యక్కాలము (సమా_౭౬_౭౭ సూత్రముల చొప్పున త్రికముమీఁది హల్లుచోట హ్రస్వద్విత్వములు గల్గె).

౧ వివ _ఈ యాదేశం బననేల (మను-౧ ఆ-౭౧) మున్నగు ప్రయోగములను ఆయా యీ విషయములను మున్నగు వాడుకలను బరిశీలించునది

గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు వైకల్పికంబుగ నగు ౮౧ (బా-సమా-౧౨ సూ). (వ్యా - సం - ౨౮౨ - ౨౮౨ I విష).

ఇది జ్ఞాపక సమాసము కాన మిశ్రి సమాసములందును గ్రాహ్యములు ఉదా -నల్లగుఱ్ఱము=నల్లనిగుఱ్ఱము=నల్లయశ్వము=నల్లనియశ్వము. (పదచ్ఛేదకాలమున ని'గాగమము నిల్వదు) నల్ల- తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - తియ్య-"మ్మ-పుల్ల-విన్న=(వివర్ణ-శబ్దభవము) తిన్న-చిక్క-చక్క-సన్న-నున్న-అల్ల-మెల్ల-చప్ప-తిమ్మ=(స్వస్థమగు) మెత్త-ప్రిన్న=(మనోజ్ఞ) ఇత్యాదులు నల్లాదులు అహోబలపతి చేర్చిన 'సవురు'నకుఁ బ్రయోగము లేదు *

౧ వివ — ని - న' వర్ణకముల ( న' తద్ధితము) తుది స్వరము లోపించి సరళాదేశసంధి జరుగుట గలదు ఉదా -కమ్మనితేనె = కమ్మందేనె (నైష-౨ ఆ-౯౯) చక్కన+పడు=చక్కంబడు (ఉద్యో-౧ ఆ-౩౧౨) చక్కన+పెట్టు=చక్కంబెట్టు- (ఉద్యో ౨ ఆ ౨౪౦)

౨ వివ — చక్కన' గలది చక్కని అనెడి శబ్దరత్నాకర (చూ-శ-ర-అలకన) మార్గము సరికాదు 'ని అనునది సామాసికాగమము ఆవయవికము కాదు చక్కజాయ' అను నప్పక వ్యంగీకృత (అప్పక-౫ ఆ-౧౬౬) దుష్రితలోపమును నసాధువె

౩ వివ —ధ్వన్యనుకరణ శబ్దంబులందును నీ ని' గాగమము చూపట్టుచున్నది ఉదా -గనగనని ః ప్పులు (మనుచ ౪ ఆ) నిగనిగని కుందనమ్ము (ప్రౌఢ-సమా-౧౨ సూ)

---

* తద్ధి ౬ సూత్రమునందును నీ నల్లాదిగణము పేర్కొనఁబడెను ఈ రెండు స్థలములకు భేద ముండరాదు సూరి ఒయ్య' శబ్దము నిందుఁ జేర్చెను గాని 'ఒయ్య-ఒయ్యనన్'=(తిన్నగ-మెల్లగ) అనునవి క్రియావిశేషణములు వ్రేఁక =(భారమైన) శబ్దము లేదుగానఁ వ్రేఁకన బండివానికి-వ్రేఁకనమోపు' అనియే గ్రహింపనగును (విజ్ఞా-ప్రా-కాం). వ్రేఁకని' అను శ-ర' సరికాదు సూరి చామ' శబ్దము నిందుఁ జేర్చెనుగాని యది 'శ్యామల శబ్దభవము చామనచాయ చామని' అను ప్రయోగము లేదు

[37] ౮ వివ -త్రిక క్రియాజన్యవిశేషణోభయపద ఘటిత సమాసములు సందర్భయోగ్యపద వ్యవధాపితములు కవిత్రయేతరప్రయోగములం దరుదుగఁ గన్పట్టుచున్నవి. (చూ-సమా-౧ సూ-౬ వివ.) (చూ-వ్యా-సం ౨౭౯ వివ. విస్త ౨౭౬ వివ ౧౨౦౭ పుట).

కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు.
౮-౨ (బా-సమా-౨౬ సూ) (వ్యా-సం-౨౭౮-౨౭౮ I వివ)

రాముఁడు రక్షించిన భృత్యుఁడు రాముఁడు వాలి నేసిన బాణంబు రాముఁడు గోవు నిచ్చిన విప్రుండు రాముఁడు వెడలిన వనంబు. రాముఁడు వసించిన పర్ణగృహము రాముఁడు వసించిన చోటు. 'రాముఁడు వసించుచున్న పర్ణశాల' మున్నగురీతిని వర్తమానాద్యర్థక ధాతుజ విశేషణములను నిట్లె యుదాహరింపనగును.

౧ వివ - కర్మాదికారకములకుఁ గ్రియాపేక్షచే నధికప్రాధాన్యము వివక్షింపఁబడునపు డనఁగా "క్రియ ధాతుజవిశేషణ మగుచుఁ గర్మాదికారకములు విశేష్యములై యుండ నట్టి విశేష్యములతో ధాతుజ విశేషణము లన్వయించునపు డని' యర్థము. అట్టి కర్మధారయమునందలి విశేషణ విశేష్య భావము కుదురుపడి యుండదు కావున నట్టివి కర్మధారయాభాసము లనిపించుకొనును ఒక్క- కర్తృకారకముతో నన్వయించునపుడుమాత్రమె విశేషణ విశేష్య భావము కుదురుపడి కర్మధారయము సరిగ నుండును రాముఁడు రావణుని జంపె ననుచో 'రావణుని జంపిన రాముఁడు అను రీతిని గర్తతో ధాతుజవిశేషణము సరిగ నన్వయించును ఉదా -ప్రశ్న-రాముఁ డెట్టివాఁడు? ఉత్త -రావణుని జంపిన వాఁడు రాముఁడు తినిన పళ్ళెరము' అను రీతిగల చోటులఁ బైరీతిని విశేషణ విశేష్యభావము కుదురుపడదు 'రాముఁడు పళ్ళెరమం దన్నమును దినెను ' అనుచో నధికరణకారకమునకుఁ బ్రాధాన్యమును వివక్షించి

'రాముఁ డన్నమును దినిన పళ్ళెరము' అని వచించినచో తినినది పళ్ళెరముకాదు గాన విశేషణ మాభాసరూపము. ఇట్టివాక్యమునకు రాముఁడే పళ్ళెరమున నన్నమును దినెనో యా పళ్ళెరము అని యర్థము. కావున నిచటి విశేషణాన్వయము కేవలము వాచనికముమాత్రమె. కర్మాదికారకములతోనే కాక శేషషష్ఠితోడను నన్వయించును ఉదా॰-'తెక్కలు విఱిగిన పులుఁగులు ' (అహో ౪౦౭ పుట). పులుఁగుల యొక్క తెక్కలు విఱిగనని సహజవాక్యము

కర్త్రర్థకత్వమం దువలెనె కర్మార్థకతాదులందును నీకార్యములు సంభవించును. ఉదా॰ రామునిచే నన్నము తినఁబడిన పళ్ళెరము-మొ॰

౨ వివ—విశేషణములకు విభక్తి వివక్షయందుఁ దచ్ఛబ్దం (అది-వాఁడు-అవి-వారు-మొ ఆశబ్దరూపములు) బహుప్రయుక్తం బగు. (చూ-బాల-సమా-౯ సూ) అట్టివానియందును విశేషణ విశేష్యభావ మాభాసరూపమె. కాన నట్టి సమాసములును గర్మధార యాభాసములె. ఉదా—చేయుచున్నవాఁడు వాఁడు (ఆది-౭ ఆ-౩౬). విదితంబగువాని సభాంతరంబులఁ (ఆది-౩ ఆ-౧౦).

ఉన్న-కల-న' వర్ణకములమీఁది తచ్ఛబ్దపు 'వ' కారంబునకును, 'అట్టి-ఇట్టి-ఎట్టి' శబ్దములమీఁది తచ్ఛబ్దపు 'వా' కారంబునకును, వీనిమీఁది యమహ త్తచ్ఛబ్దంబునకును, కొఱకు-పోంటె-కింటె-క్రోలె' శబ్దపరకత్వమందలి ధాతుజవిశేషణములమీఁది యమహ త్తచ్ఛబ్దమునకును 'తన' వర్ణకపరకత్వమున విశేషణములమీఁది తచ్ఛబ్దమునకును, లోపంబు విభాష నగును. ౮౩ (బాల-క్రియా ౧౧౭) (ప్రౌఢ-క్రియా ౧౪-౨౧-సమా ౬ సూ) (వ్యా-సం ౨౧౦ IX విష) (౨౧౦ VIII విష)

ఉన్న-కల-న-వర్ణక-తచ్ఛబ్ద 'వ' కారలోప—చేయుచున్నవాఁడు=చేయుచున్నాఁడు-చేయఁగలవాఁడు=చేయఁగలాఁడు, చేసినవాఁడు=చేసినాఁడు, చేయుచున్నవాఁడను=చేయుచున్నాఁడను= 'చేయుచున్నాను' ఇది చాలవఱ కర్వాచీనము. నన్నయ తచ్ఛబ్ద వకారలోపమునే సమ్మ

(సమా-౫౩-౫౪ సూ ౧/౫౪) తచ్ఛబ్ద డకార వాకారాది లోపములు-అలరుఁబోఁడి

తింపఁడు చేయుచున్నవాఁడు-మొ. తిక్కయజ్వాదులు తచ్ఛబ్ద పాక్షిక లోపమును జేయుదురు. చేయుచున్నవాఁడు=చేయుచున్నాఁడు-మొ. ధూర్జటి మొదలుగ 'డ' కారలోపమును నారంభించినది చేయుచున్న వాఁడను=చేయుచున్నాఁడను=చేయుచున్నాను మొ తచ్ఛబ్ద వాకార లోపము -అట్టివాఁడు=అట్టిఁడు అట్టివారు=అట్టిరు ఇట్టివాఁడు=ఇట్టిఁడు మొ అమహ త్తచ్ఛబ్ద లోపము - అట్టిదానియందును=అట్టియందును. ఇట్టిదానియందును=ఇట్టియందును మొ. కొఱకు ప్రభృతులమీఁది యమహ త్తచ్ఛబ్ద లోప -చూపు దానికొఱకున్=చూపుకొఱకున్ (కళా-౩ ఆ (ప్రౌ) పట్టుదాని పొంటెన్=పట్టుపొంటెన్ (హరి-పూ-భా-౭ ఆ-ప్రౌ) కలుగుకంటెను=కలుగుదానికంటెను(విక్ర-౭ ఆ-ప్రౌ) పుట్టినదానికోలెన్= పుట్టినకోలెన్ విశేషణములమీఁది తచ్ఛబ్దలోపము -గొప్పవానితనము= గొప్పతనము గొప్పదానితనము=గొప్పతనము మొ.

అలరుఁ బోఁడీత్యాదు లుపమాన పూర్వపద కర్మ ధారయంబులు ౫౪ (ప్రౌఢ-సమా-౧౯) (బా-సమా-౨౩ సూ). (వ్యా-సం-౨౮౪ III వి ౧౨౩౯ మొ-౧౨౪౦ పుటలు)* ఇట 'పోఁడి పరంబగుచో నెల్లెడలను 'ను'గాగమం బగు

౧ వివ -అలరుఁబోఁడి=(అలరువలె మనోజ్ఞురాలు) పూఁబోఁడి-విరిఁబోఁడి-ననఁబోఁడి- అలరువంటి యొప్పిదముగలది' అనెడి విగ్రహము

---

* సూరి బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబు మీఁది మేను నకు బోఁడియగు" అని సూత్రించెను ౧౮౬౭ సంవత్సరపు మొదటి ముద్రణము పిదప సంస్కర్తలు- బహువ్రీహిని-స్త్రీవాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేనునకుఁ బోఁడి యగు" అని సవరించిరి ఇట్లు సవరించినదియు సరికాదు- 'పోఁడి' శబ్దమె యుండఁగా 'పోఁడి'అను నాదేశ మసంగతముకదా మఱియు చిగురుంబోణి మున్నగురూపము లీపక్షమున సిద్ధింపనేరవుగదా (అచ్చ ౪౦ సూ-చూ) (బా-ప్రకీ-౧౩ సూ).

గల యుపమాన పూర్వపద బహువ్రీహిని గ్రహించినను సరియే. "ఘనశ్యాముఁడు-చంద్రముఖి' అనురీతివి సంస్కృతమున సుప్రసిద్ధములు.

౨ వివ -ప్రయోగ-ము చిగురుంబోఁడి యెఱుంగుదే (కళా 3 ఆ) శా. దోర్వదన్ తీయంబోఁడి వరింపఁగా . .. (పాంచా-3ఆ). వేల్పుం బువుంబోండ్లు (యయా ౧ ఆ). (ప్రౌఢ-సమా ౧౯ సూ).

సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దపు తుది బిందుపూర్వక 'డు' వర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబును విభాష నగు ౨౫. (బా-సమా-౧౭ సూ) (వ్యా-సం-౨౬3 I పిప.)

మూఁడు+జగములు=ముజ్జగములు=మూఁడు జగములు. మూఁడు+లోకములు=ముల్లోకములు=మూఁడు లోకములు (సమా ౭౬ సూత్రముచేఁ బ్రాప్తిన లుప్త డు' వర్ణంబగు మూ' శబ్దంబునకు హ్రస్వంబు. ముల్లోకములు' మున్నగు మిశ్రసమాసములు ప్రకృతసూత్రపు జ్ఞాపకముచే సాధువులు. శ్లో 'ద్విగో రమిశ్రితాయాం తు ప్రాయ ఏకత్వ మిష్యతే మిశ్రితాయాం బహుత్వం స్యా'' త్తను నధర్వణవచనముచేఁ బ్రాప్తిన 'ముల్లోకములు' మున్నగునవి తెల్గున సాధువులగు మిశ్ర ద్విగువులని గ్రహింప నగును.

౧ వివ .-మధ్యమపదలోప ద్విగుసమాసములగు 'ముయ్యే' డ్వాదులందు హ్రస్వద్విత్వములు నిత్యముగ నగును (చూ- ప్రౌఢ-సమా-౧౦ సూ) రాముఁ డలుకన్ ముయ్యేడు మాఱుల్ (ఆది-౧ఆ-౭౯)

౨ వివ .-మధ్యమపదలోపి కానట్టి ద్విగువున హ్రస్వద్విత్వములు వైభాషికములు. మూఁ డగ్నులు (సభా-౧ ఆ ౧౧౫-౧౨౬ప). మూఁడు కృతులు (విరా ౧ ఆ ౬)*

---

* పయిరీతిని నన్నయ తిక్కనల ప్రయోగము లుండఁగా ద్విగుమాత్రమున హ్రస్వ ద్విత్వములకు నిత్యత్వమును సూరి సూత్రించుట పొరపాటు

3 వివ .—మూఁడు శబ్దము సమాస పదాది నున్నపుడు మాత్రమె నైకల్పికముగా నైన హ్రస్వ ద్విత్వము లగును ఉదా –పదుమ్మూఁడేఁడులు నీవునుం దిరిగి రా (ఉద్యో-3 ఆ-౯3 ప)

ద్విగువున (ఆచ్ఛిక) సమాహారంబున నేకవచనం
బగు ౮౬. (బా-సమా-౧౭ సూ) (వ్యా-సం-౨౮౪.
౨౮౪ I వివ)

ముచ్చిచ్చు=(మూఁడగ్నుల మొత్తము) ముక్కాలు=(మూఁడు కాలముల మొత్తము) ముప్పాతిక = (మూఁడు పాతికల మొత్తము) ముత్రోవ=(మూఁడు త్రోవల మొత్తము) నల్గడ=(నాలుఁగు కడల= దిక్కుల= మొత్తము) ఇరుగడ=(ఇరు కడల మొత్తము) ఆచ్ఛిక సమాహారము కానపుడు బహువచనమె నిల్చును -ముప్పిధములు-ముల్లోకములు -నల్గడలు - ఇరుగడలు (ఆది-౮ ఆ-౨౭౦) (ఆది-౪ ఆ-౯౫). పదుమూఁడేఁడులు=(ఉద్యో-3 ఆ-౯3). ఈ తుదివి యాచ్ఛికములె యైనను సమాహార ద్విగువులు కావు

౧ వివ –మిశ్రద్విగువునందును సమాహారమున నేకవచనమును బ్రయోగదృష్ట మగుచున్నది అది నిపాతమై సాధువగును. ఉ-ముల్లోకము దానయేలు గతి (పారి-౧ ఆ-౭౯) నల్దిక్కు తిరిగి (ఉ-హరి-౬ ఆ-౧౬౮) ముమ్మూర్తమునకు (జై-౭ ఆ) (ప్రౌఢ-సమా-౨౦)

౨ వివ –'పండ్రెండు-పదుమూఁడు-పదునాల్గు' మున్నగునవి మధ్యమ పదలోపి ద్విగువులు సమాహార ద్విగువులు కావు

3 వివ – నల్గడ-నల్గడలు-ఇరుగడ - ఇరుగడలు - ఇరువది - నలువది-ఆఱువది-మున్నగు స్థలములందలి గసడదవాదేశములు ద్విగుసమాసాశ్రయవిధులు కాని యడి సంధి-౧౪ సూత్రపు లక్ష్యములని భ్రమింపరాదు 'పదునొకండు-పండ్రెండు-పదుమూఁడు - పదునాలుగు - పదునైదు-పదునాఱు-పదునేడు-పదినెనిమిది-పందొమ్మిది-ఇరువది- ముప్పది-నలువది-ఏఁబది-అఱువది-డెబ్బది-ఎనుబది-తొంబది" మున్నగు దిగువ్వ

లలోని వ్యాకరణ కార్యవిశేషములును సమాసాశ్రియ విధులె యని యెఱుంగునది- (చూ-వ్యా-సం-౨౨౦-మొ ౨౨౮ విష. ౭౭౯-మొ ౭౯౬ వ. పుటలు)

స్త్రీ సమ ఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు-౭౭ (బా-సమా-౬ సూ) (వ్యా-సం-౨౭౫ I విష)

ముక్కంటి=(శివుఁడు) వేగంటి=(ఇంద్రుఁడు-వేయికన్నులు గల వాఁడు) చలివెలుఁగు=(చంద్రుఁడు) వేవెలుఁగు=(సూర్యుఁడు-వేయి కిరణములు గలవాఁడు) మోటబరి=(బరువుమోసెడి యెద్దు) (దీనికిఁ బ్రయోగము లభింపలేదు) ఇత్యాదులు కవి ప్రయుక్తంబులు గ్రాహ్యంబులు.

౧ విష -పూర్వోత్తరపదంబులు రెండును నాచ్ఛికములగుటయె కాక యవి స్త్రీ సమములై యుండవలెను ఆచ్ఛిక బహువ్రీహులు కవి ప్రయుక్తములె గ్రాహ్యములు తెల్లకంటి అని ప్రయోగింపరాదు. 'మచ్చెము+కన్ను=మచ్చెకంటి' అని ప్రయుక్త మగుచున్నది. ఇందలి పూర్వపదము నపుంసక సమము అయినను సమాసములో నట్టి ము' వర్ణకము లోపించి మచ్చె' అను స్త్రీ సమమువంటి రూపమె నిల్చును కవి ప్రయుక్తము. కాన సాధువె. కవ+వడి=కవ్వడి=(కవ=జంట- రెండు చేతులు- రెండుచేతులందును బాణప్రయోగపు వడి గలవాఁడు-అర్జునుఁడు) ఇందు సమా-౯౧ సూత్రము చెప్పున వ'కారము మీఁది 'అ'కారము లోపించెనని గ్రహింపవలయును

౨ విశ - కలకంఠుఁడు'=(అహో-౭౩౬ పుట) అను మిశ్ర బహువ్రీహి సాధువు కానేరదనియు 'గరకంఠ' శబ్దభవ మనియు ననాంధ్ర వర్ణ ఠ' కార యోగమున నింద్యగ్రామ్య మనియుఁ బ్రౌఢ వ్యాకరణ 'ళ-ర'ముల యాశయము- (చూ-ప్రౌఢ-సంజ్ఞా-౯ సూ-ళ-ర- కల కఠుఁడు). నన్నయ ప్రయుక్త మనింద్యగ్రామ్యమన్నపు డింక నహో

బలపతి యన్నట్లు మిశ్రబహువ్రీహి నేల యంగీకరింపరాదు. ప్రౌఢ వ్యాకర్తృపద్ధతిలో రెండు దోషము లనివార్యములు గన్పట్టుచున్నవి. నన్నయభట్టారకుఁడు తద్భవములలో శకటరేఫమును బ్రయోగింపఁడు. మఱియు నాచ్ఛికములం దనాంధ్రవర్ణ రకారమును బ్రయోగింపఁడు. కావున కఱకంటు'' అని నన్నయ ప్రయోగించి యుండుననియు కఱ కంఠా' అను చోటి మహాప్రాణ 'ఠ'కార పాఠము ప్రక్షిప్తమనియుఁ జెప్పనగును. నన్నయయె కాక యెవ్వరును 'కఱకంఠా' అను మహాప్రాణ ఠ'కార ఘటిత పాఠమును బ్రయోగింపలేదు- క. ఎఱుకని యెఱుఁగక . కఱకంటా క్షమియింపుము (అర-౧ ఆ-3_౨౬) ' (చూ-వ్యా-సం-౬3 I విష ౧౮౮ పుట).

నన్నయభట్టు ప్రయోగించినదానిని గ్రామ్యమనుటయు ననింద్య గ్రామ్యమని దాని నంగీకరించుటయు నసంగతములు నన్నయయె ప్రయోగించునపు డింక నద్దానికి గ్రామ్యత యెట్లు ?

బహువ్రీహి నోపవిభక్తి కాదులవంటివి సమాసాంతము లగును ౮౮. (బా-సమా-౨౨ సూ) (వ్యా-సం-౨౮౫ II విష).

ముక్కంటి-కడలిరాచూలి-నలువ-గట్టువిలుతుఁడు-మొ.

౧ విష -ఆచ్ఛిక-౭౦ సూత్రమునఁ జేర్కొనఁబడిన ' ఇ-టి-ంటి-తి ప్రభృతులు బహువ్రీహిని సమాసాంత ప్రత్యయములుగా నిల్చునని తాత్పర్యము. ఆది శబ్దముచే' అ-ఇ-ఉ' మున్నగు మత్వర్థీయ ప్రత్యయములును బహువ్రీహిని సమాసాంత ప్రత్యయములుగా నిల్చునని యెన్నవలెను. ఉదా - మూఁడు+కన్ను+ంటి=ముక్కంటి ఇట సమా-౮౫ సూత్రము చెప్పిన హ్రస్వద్విత్వములు వచ్చెనని యెఱుంగునది. కడలిరాచ+చూలు+ఇ=కడలిరాచూలి' ఇట సమా-౯౨ సూత్రము చెప్పిన రాచ' శబ్దపు చ' కారము లోపించినది. 'నాలుగు+వాయి+అ= నలువ' ఇటను సమా-౯౨ సూత్రమునె యుపయోగించునది గట్టు+విల్లు+తి+ఉ=గట్టు విలుతుఁడు=(మేరువు ధనువుగాఁగలవాఁడు=శివుఁడు).

౨ వివ :- షష్ఠీ తత్పురుషము మూలమున బహువ్రీహ్యర్థము లభించును అట్టివి బహువ్రీహి లక్షణలక్షితములు కావుగాన బహువ్రీహ్యాభాసము లనిపించుకొనును ఉదా -పీతాంబరమువాఁడు=(పీతాంబరముయొక్క+వాఁడు) పీతాంబరము గలవాఁడని యర్థము మూఁడు కన్నులవాఁడు=(మూఁడు కన్నులు గలవాఁడు=శివుఁడు) మొ

ఆచ్ఛికంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా
ద్వంద్వం బగు ౮౯ (బా-సమా-౭ సూ) (వ్యా-సం-
౨౮౬ I వివ)

అన్నదమ్ములు-తల్లిదండ్రులు-ఊరువల్లెలు- (చూ- సంధి- ౧౪ సూ గసడదవాదేశము) ఆలుమగలు. 'మగఁడును+బిడ్డలును', 'పల్లమును+కళ్ళెమును' (గుఱ్ఱముమీఁదఁ బఱచునది పల్లము) ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున తెలియుగునది సాధ్యములలో నాచ్ఛిక ద్వంద్వము మాత్రమె సాధువనియు నందును బూర్వపద మాచ్ఛిక స్త్రీసమము కావలయుననియు నుత్తరపద మాచ్ఛికమయినం జాలుననియుఁ దాత్పర్యము.

౧ వివ .- ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమం బగు, అగుచో నా 'ము' వర్ణంబునకు లోపంబగు ఉదా -అందచంద ములు (అని-౪-ఆ) వెచ్చసచ్చములు-(వేంక-పంచ-౧ ఆ) (ప్రౌఢ-సమా-౨౯ సూ) ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును నందలి పూర్వపదంబు క్లీబసమంబును గానంబడియెడి ఉదా -అవసరమక్కఱలు. (రామా-౨ ఆ) (ప్రౌఢ-సమా-33 సూ) ఇట్టివి ప్రయుక్తములు మాత్రము నిపాతన్యాయమున సాధువులని యెఱుంగ నగును ఇట్టివి ప్రాచీనమహాకావ్యములలోఁ గానరావు

౨ వివ -ఈ యాచ్ఛిక ద్వంద్వమును రెండువిధములుగ నున్నది I ఇతరేతరయోగ ద్వంద్వము II సమాహార ద్వంద్వము ఇది యేకవచనాంతమే యగును (ఇది మిక్కిలి యరుదు) ఇతరేతర -తల్లిదండ్రులు-

మొ సమాహార-కూడుసీర (శాంతి-3 ఆ-౧౬౪ ప) కూడుగుడ్డ-దరిదాపు కూరగాయ-వేవగలు-తాఁకుడఁగులు మొ (చూ-ప్రౌఢ-సమా-3౦ సూ) సిద్ధసమాసములవలెఁ బ్రాణ్యంగాదులందేకాక స్థలాంతరములందును బైరీత్రిని సమాఁహారద్వంద్వము లుండుననియెన్ననది. (చూ-వ్యా-సం-౨౪౬ విశ ౧౨౫౪ పుట)

3 వివ -సమాహార ద్వంద్వముల నితరేతరయోగద్వంద్వములుగాను బ్రయోగింప నగును. ఉదా-కూరగాయలు-కూడుగుడ్డలు మొ

౪ వివ.-ఇతరేతర యోగ ద్వంద్వమున నుత్తరపద లింగమే (మహత్త్వాది) నిల్చును అది బహువచనాంతమె యగును సమాహార ద్వంద్వ మేకవచనాంతమె యగును ఉదా -తల్లిదండ్రులు-అన్నదమ్ములు-కూడుసీరకై

౫ వివ.-ద్వంద్వఘటిత శబ్దము పౌర్వాపర్యవిషయము సిద్ధసమాసమందువలెనె యగును ఉదా.-తల్లిదండ్రులు-అన్నదమ్ములు-మొ-

౬ వివ -సిద్ధములందువలెనె యాచ్ఛికములందును నేకశేషవృత్తిని గ్రహింప నగును ఉదా -తల్లియు=తల్లియుఁ దల్లులు-మొ.

౭ వివ -ద్వంద్వాంతమున నిల్చు పదము ద్వంద్వ ఘటితపదము లన్నిటితోను సిద్ధస్థలములందు వలెనె యన్వయించును. ఉదా -పుట్టు గుర్రంకు గట్లు=పుట్టు గట్టను గుర్రంకు గట్టును. (సిద్ధ-ఉదయాస్తాచలములు) మొ-

భావ ద్వంద్వంబునం దొలి పదంబు ట' వర్ణకాదు
లకు లోపం బగు నం (ప్రౌఢ-సమా-3౧ సూ).
(వ్యా-సం-౨౪౬ వి. ౧౨౪౨ పుట).

ఔగాములు=(ఔట+కామి). చెల్లుచెల్లములు=(చెల్లుట+చెల్లమి) వచ్చురాములు=(వచ్చుట+రామి). వినివినములు=(వినికి+వినమి)

౧ వివ —ఇందుఁ బూర్వపదము భావార్థకమును నుత్తర పదము వ్యతిరేక భావార్థకమును నై యుండును "ద్వంద్వః కేషాంచి దిష్టః స్యాత్ త్వార్థ శబ్దేన కుత్రచిత్" అను నధర్వణకారికయందు 'క్త్వార్థ శబ్దేన" అను నపపాఠము నంగీకరించి నమ్మీ నమ్మక" (శాంతి-౨ ఆ-౩౫౧) అని సంస్కర్తలు ప్రక్షిప్తము చేసిరి ఇట 'నమ్మిన్ నమ్మక' అనునది కవిప్రయుక్తమై యుండ నోపును (చూ-అహో-౭౩౫ పు).

౨ వివ —ఋదంత ద్వంద్వ రేఫాదేశము వెనుక వివరింపఁబడెను (చూ - సమా -౨౬ సూ)

నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు ౯౧ (బా - సమా - ౨౦ సూ) (వ్యా - సం- ౨౭౮ I వి)

నిక్కల=(నిక్కము+కల)=(నిజమైన స్వప్నము) కవ్వడి=(అర్జునుఁడు). పువ్విలుకాఁడు=(పువ్వుల విల్లు గలవాఁడు).

౧ వివ :— ఆచ్ఛిక సమాసములం దఱుచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్య వైకల్పికంబులుగాఁ బెక్కులు గానంబడియెడి- (ప్రౌఢ-సమా-౩౬ సూ) కొన్ని యుదాహృతులు :- అందాఁక(అంత+దాఁక) ఇట్లు ఇందాఁక-ఎందాఁక . అచ్చతెలుపు=(అచ్చము+తెలుపు) ఆఁదోఁక=(ఆవు+తోఁక)ఆవలను=(ఆ+వలను)ఇట్లు - ఈవలను ఎగుదల=(ఎగువ+తల)-ఇట్లు దిగుదల ఏటవాలు=(ఏటము+వాలు) కుఱుమాపు=(కుఱుచ+మాపు) గందవొడి=(గందము+పొడి) చిమ్మనగ్రోవి=(చిమ్మనము+గ్రోవి) చిఱుచప్పుడు=(చిఱుత+చప్పుడు). చనుమఱ=(చను+మఱక) తెగుదారి=(తెగువ+దారి). దొంతర=(దొంతి+తరఁగ) నడురేయి=(నడుము+రేయి). నాన్నాళ్ళు=(నాలుగు+నాళ్ళు) నిడుమోము+(నిడుద+మోము). నెత్తపలక=(నెత్తము+పలక) పసిపట్టు=(పసిమి+పట్టు). పెందుఱుము=(పెను

పు+తుఱుము) పెత్తనము=(పెద్ద+తనము). పొంగట్టు=(పొన్ను+గట్టు) బాపురె=(బాపు+పురె) బెబ్బులి=(పెద్ద+పులి) బొందళము=(బొంత+దళము) బోనపుట్టిక=(బోనము+పుట్టిక) మిండతపసి=(మిండఁడు+తపసి) ముంగల=(ముందు+కలను) మోసల=(మొగ+సాల) వలచెవి=(వలను+చెవి) వాతెఱ=(వాయి+తెఱపి) సగపాలు=(సగము+పాలు) సాఁగాలు=(సాము+పాలు) (రెండు+వారు)=ఇరువురు మూవురు=(మూఁడు+వారు)=మూఁగురు=ముగ్గురు (నాలుగు+వారు)=నలువురు=నల్వురు (వేయి+వారు)=వేవురు=వేగురు-మొ.

— ఇది సమాస పరిచ్ఛేదము —

---

# బాలవ్యాకరణోద్యోతము

## తద్ధితపరిచ్ఛేదము

౧ వివ :— తద్ధిత -పుం-వృత్తి విశేషే. 'తద్ధితా' ఇత్యధికార విహిత ప్రత్యయేషు తేచ ద్వివిధాః -I ప్రకృత్యర్థ భిన్నార్థాః II స్వార్థికాశ్చేతి- తేభ్యః ప్రయోగేభ్యో హితః" (శబ్దా-చిం) అను కోశము చొప్పున నా యా ప్రకృత్యర్థ భిన్నార్థములను స్వార్థములను దెల్పునవి తద్ధితములని యర్థము సుబంత శబ్దములనుండి యర్థవిశేషములను బోధించుట కేర్పడినవి తద్ధితప్రత్యయములనియు ధాతువులనుండి యర్థవిశేషములను బోధించుట కేర్పడినవి కృత్తులనియు తెలియఁగునది

అట్టి తద్ధితములు తెల్గున రెండువిధములు,- I ఆచ్ఛిక తద్ధితములు II సాంస్కృతిక తద్ధితములు I ఆచ్ఛికతద్ధితములు .—

'రాముని తనము- తెల్లఁదనము-పెద్దతికము' మున్నగు శబ్దములందుఁ గనఁబట్టు తన-తిక' మున్నగు భావార్థకాది ప్రత్యయము లాచ్ఛికములు. II సాంస్కృతికములు - రామత్వము-శ్వేతత్వము-శ్వైత్యము' మున్నగు శబ్దములందుఁ జూపట్టు- త్వ-య' (ష్యఞ్) మున్నగు భావార్థకాది ప్రత్యయములు సాంస్కృతిక తద్ధితములు-

౨ వివ :-సమాస వృత్తియందువలెనె తద్ధిత వృత్తియందును దద్ధిత విగ్రహ వాక్యమునందలి ప్రాతిపదికమున కవయవములగు సుబ్విభక్తులు (వ్యా-సం-౨౬౮ I వివ) మున్నగునవి లోపింపఁగా మిగిలిన ప్రాతిపదికము పైని దద్ధిత ప్రత్యయములు నిల్చును- అట్టి తద్ధితాంతమునకు కార-౧ సూత్రము'' చొప్పున ప్రాతిపదికత్వము కల్గును వానిపైని సుబ్విభక్తులు నిల్చి వాక్యాన్వయ యోగ్యతను గలిగించును. (చూ-సమా-౧ సూ-౧-౨-వివ)

— ఆచ్ఛిక తద్ధిత ప్రత్యయములు —

తన వర్ణకంబు త్వార్థంబునం దగు ౧ (బా-తద్ధి ౧ సూ) (వ్యా-సం-౨౮౯ I వివ)

త్వార్థం బనఁగా భావంబు ప్రకృతిజన్యబోధంబునం బ్రకారంబు భావంబు ఉదా - రామునితనము. సమా-౭౨ సూత్రము చొప్పున షష్ఠికి ద్వితీయ సంధి ౨౩-సూ చొప్పున ద్రుతలోపము రాముఁడనఁగా రామత్వ ధర్మముతోఁ గూడినవాఁడు రామత్వము ప్రకారము సంస్కృతమందలి 'రామత్వ' మనఁగాఁ దెల్పున 'రామునితనము' ఇట్లె-మనుమనితనము సీతతనము గొప్పవానితనము గొప్పదానితనము. గొప్పతనము (చూ-సమా-౮౩ సూ తచ్ఛబ్దలోపము).

౧ వివ -ఇది కార-౧౯ సూత్రముచే జ్ఞాపితస్థలమగుటచే నీ 'తన' ప్రత్యయము తత్సమములపైని సయితము నిల్చుటయు దానితో ద్వితీయాతుల్యరూపము నిల్చుటయు మున్నగు కార్యములు సంభవించును.

ఇట విశేషం బుత్సర్గంబునకు (సామాన్యమునకు)
విభావను శాధకం బగు. ౨. (బా-తద్ధి-౨ సూ.)
(వ్యా-సం-౨౮౯ II విమ)

ఇట=ఈ యాచ్ఛిక తద్ధిత పరిచ్ఛేదమున ఇట్లనుటచేత 'చిన్న' మున్నగువానికి భావార్థమున ఱిక' మొదలగు ప్రత్యయములు విశేషవిధిగ సూత్రింపఁబడినను సామాన్య శాస్త్రసిద్ధమగు 'తన' ప్రత్యయమును సంభవించునని యెన్నదగును ఉదా -చిన్నఱికము (తద్ధి 3 సూ)=చిన్నతనము (తద్ధి-౧ సూ)

చిన్నాదులకు ఱికవర్ణకం బగు 3 (బా-తద్ధి-3
సూ ) (వ్యా-సం-౨౮౯ II విమ)

చిన్నఱికము-కన్నెఱికము- చిన్న-కన్నె-చుట్ట(ము)-దొంగ-పేద-మిండ-లంజె- ఇత్యాదులు చిన్నాదులు. ఱికము ద్విరేఫకము-చ. అరయఁగ . చుట్టరికము (ప్రభా-3 ఆ- శ-౭') క. ఎఱుఁగమి నీపెద్దఱికము (విరా-౫ ఆ-3౫౭) 'కన్నెరికము అను రీతియియుఁ గలవు (పండితా-పురా-౧౧౫ పుట)

ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగు నపుడగు
౪ (బా-తద్ధిత-౪) (వ్యా-సం-౨౮౯ II వి)

తొత్తఱికము-(తొత్తు=దాసి) వెడ్డఱికము -(వెడ్డు=వంచన) వెజ్జఱికము-(వెజ్జు=వైద్య)

పేర్వాదుల కిమి వర్ణకం బగు ౫ (బా-తద్ధి-౫)
(వ్యా-సం-౨౮౯ III విమ)

పేరిమి=పేర్మి (పేరు=పెద్ద) కడిమి - (కడు=గొప్ప) "పేరు - కడు-మ్రుచ్చు=(దొంగ). మేలు-చెలి-పోఁడి=(ఒప్పయిన)-వాఁడి=(నిశిత)- వేఁడి ఇత్యాదులు పేర్వాదులు పేరు-కడు లకు 'తన' వర్ణకము కానరాదు.

న' వర్ణకంబు గుణవచనంబులగు నల్లా'దుల కగు.

౬ (బా-తద్ధి-౬ సూ) (వ్యా-సం-తద్ధి IV విభ)

నల్లన- తెల్లన నల్ల- తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-తియ్య - కమ్మ - పుల్ల- చప్ప-విన్న=(వివర్ణ)-తిన్న-అల్ల=(మెల్లన)-తిమ్మ (స్వస్థ) చక్క- చిక్క-సన్న-నున్న-మెత్త-ప్రిన్న = (మనోజ్ఞ) (చూ-సమా-౧౧ సూ దాని టిప్పణ వివృతులు-) చక్కం బెట్టు=(చక్కన+పెట్టు) (ఉద్యో-౨ ఆ-౨౫౦) ఇత్యాది ప్రయోగముల చేతఁ గ్రియా విశేష ణత్వమున నీ న వర్ణకము బిందు వగుటయుఁ గలదు నల్లఁదనము- (సంధి-33 సూ- తన పరకత్వమున నుక్కు-) ఈ న' వర్ణకాంతములు ధర్మవాచకములు ని' వర్ణకాంతములు ధర్మివాచకములు ఉదా నల్లన=నలుపు నల్లని=నల్లనయినది

ఇక వర్ణకం బగ్గలాదుల కగు ౭ (బా-తద్ధి-౭ సూ) (వ్యా-సం-తద్ధి V)

అగ్గలిక=(ఆధిక్యము) ఒమ్మిక=(ఒప్పిదము)

మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రా హ్యంబులు ౮ (బా-తద్ధి-౮ సూ) (వ్యా-సం- తద్ధి VI వి)

మగఁటిమి=(మగతనము) పేదఱికము=(దారిద్ర్యము) (పేదర్కి- రూపాం) ఒజ్జనము=(ఒజ్జతనము) కోటరము=కోడఱికము=(కోడలి తనము)=కోడంట్రము = కోట్రము = కోడంట్రికము కోమలికము= (సౌందర్యము) (సంస్కృ-కోమల-తద్భ-కోమలి-దీని భావార్థకము 'కోమలికము ) చెలికారము=(చెలిమి=స్నేహము) నయగారము= (గకారాదేశము)=(మృదుత్వము) తెలుపు=(తెల్లన-భావత్వము) ఎఱుపు=(ఎఱ్ఱన) పసుపు=(పచ్చన) నలుపు=(నల్లన) ఈ తెలుపు' మున్నగు వానికి తెల్లనిది మున్నగు రీతిని ధర్మి పరముగాను నర్థ ము గలదని శ-ర మున నున్నది

నాయఁకరము (నాయఁక శబ్ద భావార్థకము) బంటి (బంటు శబ్దజ భావార్థకము)

తికాదులు రానపు డెన్నయెడల భావార్థమున తన' వర్ణకం బగు ఉదా .-చిన్నతికము=చిన్నతనము-మొ

అరమరాదులకు స్వార్థంబునం దిక వర్ణకం బగు.
౯ (బా-తద్ధి-౯) (వ్యా-సం-౫౯౦-౫౯౦ I విధ)

అరమరిక=(సందేహము=భేదము)-ఆమిక=(మదము) అరమర ఆము-అల్లిబిల్లి=(పెనఁకువ) - గండి=(రంధ్రము) - నడవడి-నాడు=(దేశము)-నివ్వాళి-పొత్తి=(మెత్తని వస్త్రము) మూన=(ఒక కొల పాత్రము)-మెలి=(పెన) వాలు=(పొడుగు) ఇత్యాదులు-

ఉక' వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు ౧౦ (బా-తద్ధి-౧౦) (వ్యా-సం-౫౯౦ II వి).

చిఱుతుక=నాతుక చిఱుత-నాతి-నెలఁత-మెలఁత- మెలుఁత' అనఁదగును క లోకము సేసుటయు నమ్మెలుఁత యెలుఁ గెసఁగన్. (ఆను-3 ఆ-౨౨౧) పడఁతి-మడఁతి-పొలఁతి-వెలఁది (నాతి శబ్దము మొదలుగ నింతవఱకు స్త్రీవాచకములౌ నిష్టా-ఎమ్మె' ఇత్యాదులు చిఱుతాదులు అంతటను నపదాదిస్వరసంధి (సంధి ౧౨సూ.) (స్వార్థమందును కా-క త్తియ లగు-చూ-తద్ధి-౧౯ సూ) ఈ' ప్రత్యయము నగు (చూ-తద్ధి-౨౨ సూ)

వేఱునకు 'అడ వర్ణకము- వెల్లకు అడి' వర్ణకమును స్వార్థమునం దగు. ౧౧. (ప్రౌఢ-తద్ధి-౬౭ సూ) ఉదా -వేఱడము- వెల్లడి.

తెలివి-విరివి-వినికి-లేమి - రాపు' లకు స్వార్థమునందు 'ఇడి' వర్ణకంబగు ౧౨ (ప్రౌఢ-తద్ధి-౮). తెలివిడి-విరివిడి-వినికిడి-లేమిడి--రాపిడి.

ఇత' వర్ణకంబు ఇంపు-బిగి-పోరు'లకు స్వార్థమునం దగు-
౧౩ (ప్రౌ-తద్ధి-౯) ఇంపితము-బిగితము-పోరితము

ఇద వర్ణకంబు ఒప్పు-తప్పు-పెల్లు లకు స్వార్థమునం దగు.
బెట్టు క్రొవ్వులకు మతుబర్థంబునను నగు ౧౪ (ప్రౌ-౧౦ తద్ధి).

ఒప్పిదము-తిప్పిదము-పెల్లిదము-బెట్టిదము-క్రొవ్విదము

చలికి మిరి వర్ణకంబును వాపునకు ఇరి' వర్ణకంబును స్వా-
ర్థమున నగు ౧౫ (ప్రౌఢ-౧౧ తద్ధి) చలిమిరి-వాపిరి

నుడి-క్రోల'లకు కార-గార లు స్వార్థమున నగు ౧౬.
(ప్రౌఢ-తద్ధి-౧౩ సూ) నుడికారము-క్రోలగారము

కా-కత్తియ' వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల
మతు బర్థంబునం దాటాదుల కగు ౧౭ (బా-తద్ధి-
౧౧) (వ్యా-సం-౭౯౧ I విమ)

కా-కత్తియ'ల క కారంబునకు గ కారంబు
కొండొకచోఁ గానంబడియెడి ౧౮ (బా-తద్ధి-౧౨
సూ) (వ్యా-సం-౭౯౧ I విమ)

'కా-గా' ప్రత్యయాంతములకుఁ బుంలింగ సమత్వము చేతనే
డు జ్ఞగు ఉదా -ఆటకాఁడు-బేరగాఁడు-మొ అందగాఁడు-కొండె
గాఁడు- (మా-ఆచ్చి-౪ సూ దీని టిప్పణము)

'ఆట-అడపము=(వక్కలాకుల తిత్తి) అడప-(అడపకాఁడు-
'తద్ధి-33 సూ' ఈ పట్టున అడపకాఁడు అనునది స్వార్థిక మను
కొనవలయును, ఏమ్మె =(విలాసము) ఒయారము =(విలాసము)
(దీనిపైని దీని రూపాంతరములపైని కా-కత్తియ'లు నిల్చిన శబ్ద
ములు- శ-ర మున్నగు కోశములందు లేవు) కటారి=(కత్తి) కొల్ల-

చెలిమి-చేరువ=(సేన-సమూహము). చొరవ=(ప్రవేశము) జట్టి=(శరీరము నిచ్చు) జాజర=(కపటము). జూదము-తిండి-తేర=(సంబంధము లేమి). దొడ్డ-కొల్ల-నీటు-నేస్తము-(ములోపము-నేస్తకాఁడు-మొ) -బేరము-(బేరగాఁడు) వగ-విలు-వెచ్చము - (వెచ్చకాఁడు) - సొగసు - ఇత్యాదు లాటాదులు ఆద శబ్దముచే 'కొండెము-అందము' మున్నగునవి గ్రాహ్యములు.

౧ వివ - మతుబర్థకము లనఁగా నస్వార్థకములు= కలుగు' అను నర్థము గలవి కాఁడు గ్గాఁడు ర్భనే ద్దీఁడు'' అను నధర్వణవచనము చొప్పున గ'త్వము లేదనఁజాలము గాని యట్టి గ కారమునకుఁ బ్రాసాదిగత ప్రయోగము దొరకలేదు

౨ వివ - కార-కర్త్రి' శబ్దములతో వీనికి సంబంధము గల దనుటకన్న 'కల' అను నాచ్ఛిక శబ్దముతో (కలవాఁడు=కలాఁడు=కాఁడు) వీనికి విదూరసంబంధము గలదనుట లెస్స ఎవతె-ఒకతె-ఎవతి-ఒకతి' మున్నగువానియందు వలెనె కత్తియ' శబ్దమునందును (కలస్త్రీ=కత్తియ) తి' అను స్త్రీ ప్రత్యయస్థితి సంగీకరింప నగును 'ఇయ' కు ఎ' అను నాదేశము (ఆచ్ఛి-౨౩ సూ) వచ్చునుగాన కత్తియ' శబ్దమునుండి 'కత్తె' అనునది యేర్పడనగును (ఒకతె=ఒకతి)

3 వివ -' ఆటకాఁడు-ఆటకత్తియ అనువానిఁ బర్యాయములుగా ' ఆటవాఁడు-ఆటది ' అను నాభాస బహువ్రీహి రూపములును (సమా-౮౮ సూ ౨ వివ) గన్పట్టుచున్నవి. ఇట్లె 'పూనికవాఁడు' అను శబ్దమునుండి యేర్పడిన పూనికాఁడు' శబ్దమును నన్నిచోడ కవి ప్రయోగించెను పూనికాఁడవై (నన్ని-కు-౪ ఆ-౪౮ ప).

౪ వివ -గీ- అన్న మీ తండ్రి కోపగాఁ డౌనో కాఁడొ (కాశీ ౪ ఆ-౭౦) మున్నగు ప్రయోగములనుబట్టి యీ 'కా-కత్తియ' వర్ణకము లరుదుగా సంస్కృత శబ్దములమీఁద నిల్పుటయుఁ గలదని కొందఱి యాశయము. ఇట్టి యెడల కోపకుండు' అనునది కవిప్రయుక్తపార

మనుట యుక్తము. ఇట్లె 'అభిమానకర్త్రి' (బసవ) మున్నగుచోట్ల 'అభిమానకర్త్రి' అనునది కవిప్రయుక్తపాఠ మనుట యుక్తము. (చూ-వ్యా-సం-౨౯౧-౨౯౧ I విష. ౧౨౭౮-౧౨౮౯ పుట)

౫ వివ.—భూమ నిన్దా ప్రశంసాసు నిత్యయోగేతిశాయనే సంసర్గేఽస్తి వివక్షాయాం భవన్తి మతుబాదయః' అను చొప్పున సంస్కృతమందు వలెనె తెల్గునందును నీ మతుబర్థకములకు భూమ-నిన్దా' ద్యర్థ విశేషములను గ్రహింపఁ నగును తిండికాఁడు' మున్నగుచోట్ల నెల్లరును తిండికాండ్రే' యగుటచేతఁ గొన్ని యుచిత స్థలములందు 'అధికమైన తిండిగలవాఁడను' భూమార్థమును గ్రహింపనగును. ఇట్లే-'జూదగాఁడు' మున్నగుచోట్ల 'నిందా'ర్థమును గ్రహింపనగును. ఇట్లె తక్కిన యర్థములను నాయా సందర్భములందు గ్రహింపనగును.

'కా-కత్తియ'లు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు. ౧౯ (బా-తద్ధి-౧౩ సూ) (వ్యా-సం-౨౯౧ II విష).

చెలికాఁడు-చెలికత్తియ-హెగ్గడికాఁడు-హెగ్గడికత్తియ-(హెగ్గడికాఁడు=అంతఃపురపు కావలి)

కా' వర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. ౨౦. (బా-తద్ధి-౧౪ సూ) (వ్యా-సం-౨౯౧ II వి)

ఇబ్బందిగాఁడు=(సంకరజాతి మృగము అడవిపందికిని నూరఁబందికిని బుట్టిన పంది) ఒంటిగాఁపు=(అసహాయ శూరత్వముగల మృగము). కొమ్ముకాఁడు=(అడవిపంది) పరికాఁడు = (ఏనుఁగుల యూథపు పతి) ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు

అటమిటాదులకు మతోబర్థంబునందు 'ఈ' వర్ణకంబు పుంస్త్వంబునం దగు ౨౧ (బా-తద్ధి-౧౫ సూ) (వ్యా-సం-౨౯౧ III విష).

'ఈ' ప్రత్యయాంతంబునకుం బుంలింగ సమత్వముచేతనే 'డు'జగు. (చూ-ఆచ్ఛి-౭ సూ. దీని టిప్పణియు). అటమటీఁడు=(మాయావి)-

కమ్మతీఁడు=(కృషికుఁడు)-అటమటము-కమ్మతము-కన్నడము-కొండెము-బానసము=(వంట)బూటకము=(మాయ)-మందడి=(అశ్వశాల)-మన్నెము=(సన్మానపూర్వకముగా నిచ్చిన భూభాగము)-(మన్నీఁడు=భూపతి). సుంకము=(పన్ను)-ఉక్కీవంబునకు వ' లోపంబు-(ఉక్కీఁడు)=(మూర్ఖుఁడు) ఇత్యాదులు వీనికెల్ల ము' వర్ణక లోపము నెన్నునది- వీనికి మత్వర్థీయేతర ప్రత్యయములు నగు- అటమటకాఁడు-అటమటకత్తియ-కొండెగాఁడు-కొండియఁడు-సుంకరి-మొ

ఈ ప్రత్యయంబు గొన్నింటికి స్వార్థమునం దగు

౨౨ (బా-తద్ధి-౧౬ సూ) (వ్యా-సం-౨౯౧ III వి)

మొక్కలీఁడు-(ముష్కరుఁడు-)కల్లరీఁడు=(అసత్యవాది) కల్ల శబ్ద మతుబర్థ రూపము కల్లరి

అరి' వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు ౨౩.

(బా-తద్ధి-౧౭) (వ్యా-సం-౨౯౧ IV వి)

అరి ప్రత్యయాంతములు స్త్రీసమములు గానఁ బ్రయోగానుసారముగ మహన్మహత్రివాచకత్వము వీనికిఁ గలదు జాలరి-ఒఱపరి=(చక్కఁదనముగల)-జాల=(వల)-ఒఱపు=(చక్కఁదనము)-కల్ల-చదువు-జూదము-(ములోప)-టక్కు-తగవు-తీరుపు-తెంపు-తెరువు-నేరుపు-మతకము=(మాయ)-వెరవు=(ఉపాయము)-వేఁట-సిగ్గు-సుంకము-(ములోప) బొంకు-ప్రాజ=(ప్రాజ)-ప్రాజారి=ప్రాజరి సొన్నము=(ములోపము). సొన్నరి-సొన్నారి=(అగసాలె) ఇత్యాదులు జూదరికత్తె=జూదకత్తె-జూజగాఁడు-జూజకత్తె-సిగ్గరికత్తె- ఇత్యాది ప్రయోగములును గలవు.

ఇ' వర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు

౨౪ (బా-తద్ధి-౧౮) (వ్యా-సం-౨౯౧ V వి)

ఒయారి-(విలాసి)-అక్కసి=(సంతాపముగల)-ఓయారము=(విలాసము)=ఒయారము=ఒయ్యారము-(ములోప)-కడలు=(తరంగము) (కడలి=సముద్రము). చాగము=(త్యాగము)-జోగము=(యోగము)-

(జోగి = రోగి)-తమకము = (త్వర)-తుటారము = (దిట్టతనము)-బండారము=(బొక్కసము)-బిత్తరము=(శృంగారచేష్ట)-బిటారము=(విలాసవిశేషము-)బేహారము=(వ్యవహారము)=బేహరము-మచ్చరము-నిటారము=(నిక్క)-విన్నాణము=(విజ్ఞానము)-వెక్కసము=(దుస్సహత్వము) ఇత్యాదులు ఆది శబ్దముచే జవ్వని=(యువతి) మొ

౧ వివ _సూ_రా_నిఘంటుకర్తలు కైవారి' శబ్దము 'ఇ' ప్రత్యయాంతముగా నుదాహరించుట సరికాదు_ అది సంస్కృత 'కైవార'' శబ్దపు అస్వార్థక మగు 'ఇన్' ప్రత్యయాంతము. (చూ-వ్యా-సం-౨౯౧ V విష) (౧౨౯౭-౧౨౯౮-౧౨౯౯ పుటలు) కైవార దుర్భాషణంబులకున్' (నైష ౭ ఆ ౮౯) (కైవార=స్తుతి)

వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యంబగునపుడు మత్వర్థమునందు ఆఁడి' వర్ణకంబగు. ౨౫ (బా_తద్ధి_౨౨ సూ) (వ్యా-సం-౨౯౧ VII విష)

వగలాఁడి వగ_చిన్నె_కులుకు_(శృంగారముగా కుదలు) వన్నె-ఎమ్మె-(విలాసవిశేషము) * ఇత్యాదులు వగాదులు

కులవాచకములు మహద్వాచకములునగు బోయ' ప్రభృతిశబ్దములపైని 'వాని స్త్రీ' అను నర్థమున త' ప్రత్యయ మగును_౨౬_(బా_తద్ధి_౧౯ సూ) (వ్యా-సం_౨౯౧ VI విష)

---

* ఆఁడి' ప్రత్యయాంతములు ప్రాచీన మహాకావ్యములలోఁ గానరావు ఇవి వగలాఁడు' మున్నగువాని సమానన్యాయమున నర్వాచీనముగా నేర్పడిన 'మహతీ' వాచకరూపములని తోఁచును వగలవాఁడు=వగలాఁడు (ఆభాసబహువ్రీహి సమా_౫౫ సూ_౨ వివ) ఇట్టివి తచ్ఛబ్ద వ కారలోపమున సిద్ధించును (చూ-సమా ౮౩ సూ) గాన వీనికై మత్వర్థీయమగు ఆ' ప్రత్యయమును విధించి దానిని వగాదిగణములోఁ (ఆచ్ఛి-౮ సూ, జేర్చుపద్ధతి సరికాదు (బా-తద్ధి-౨౩ సూ)

బోయత = (బోయవాని స్త్రీ) చాకిత = (చాకలివాని స్త్రీ). పాఱుత = (బ్రాహ్మణుని స్త్రీ). గొల్లత-గ్రేత = (గొల్లవాని స్త్రీ). వానెత=(వైశ్యుని స్త్రీ) ♦

త వర్ణకంబు పరంబగుచో నొకానొకచోట నె
త్వంబు చూపట్టెడు ౧౭ (బా-తద్ధి-౧౦ సూ)
(వ్యా-సం-౨౯౧-VI విష)

మాలెత=(మాలవాని స్త్రీ) చెంచెత=(చంచువాని స్త్రీ). చంచెతలం బింఛపత్ర చేలాంచితలన్ అను పాఠమం దంత్యానుప్రాసభంగము లేదు (భాగ-౧౦ స్కం-పూ) (ప్రౌఢ-తద్ధి-౪ సూ) గాన దాసరిపాటల నాధారముగాఁ ( చంచీత ) గొని చంచిత అను ఇ' త్వఘటితరూపమును సాధించుట ప్రౌఢవ్యాకర్తకు సరికాదు

గుబ్బెత-ముట్టుత-మిండత' ల స్వార్థకములె ౧౮.
(బా-తద్ధి-౧౧ సూ) (వ్యా-సం-౨౯౧ VI విష)

గుబ్బెత=(ప్రశంసార్హములగు కుచములు గలది) (ఇచటి మతుబర్థము ప్రశంసాపరము)-ముట్టుత=(రజస్వల) (ముట్టు= తాఁకుడు-రజస్సు తాఁకుడు గలది) మిండత=(మిండలుగల స్త్రీ) *

---

♦ బాలవ్యాకర్త తవర్ణకంబు కుల' వాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబునందగు (బా-తద్ధి ౧౯ సూ) అని సూత్రించెను-కాని 'చాకి-బోయ ప్రభృతులు కేవల కులవాచకములు కావు. కం కొట్టెన్ . మదావివేకిన్ చాకిఁ (భాగ - ౧౦ - స్కం - పూ - ౧౨౬౦) (సూ-రా-ని) చాకి' అనఁగా సిట రజకుఁడు. అట్లె బోయ-కిరాతుఁడు కొందఱుబోయలు (ఉద్యో-౨ ఆ-శ-౪).

* సూరి యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు " అని సూత్రించెను (బా-తద్ధి-౨౧ సూ) యువతి గుబ్బెత కావచ్చును గాని కఠినకుచ' కాకపోవచ్చును ఇట్లె తక్కినయెడలను న స్వార్థకత్వ మంగీకరించుట లెస్స

ముక్కు లోనగువానికిం దదభావద్యోతకంబయి
మతుబర్థంబునందు ఇఁడి' వర్ణకంబగు ౨౯. (బా-
తద్ధి-౨౮ సూ) (వ్యా-సం-౨౯౧ VIII విష.)

ముక్కిఁడి=(ముక్కులేనివాఁడు)-ముక్కు- వాలు-(త్రోఁక బాల శబ్దభవము)-సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది ఆదిశబ్దముచే వెరవిఁడి=(ఉపాయములేనివాఁడు) కట్టిఁడి=(క్రూరుఁడు=కట్టులేనివాఁడు) వెఱిఁడి=(వివేకములేనివాఁడు) పెఱిఁడి అను రూపాంతరము ముద్రణములలోఁ గలదుగాని పెఱు' శబ్దములేదు పరువిఁడి=(పరువు గౌరవములేనివాఁడు) మున్నగువానిని గ్రహించునది

మానార్థంబున కేకత్వంబునందు ఎఁడు' వర్ణకం బగు
30 (బా-తద్ధి-౨౭ సూ) (వ్యా-సం-౨౯-౨ I వి).

తూమెఁడు=తూమెండు ముంతెఁడు=ముంతెంతు. ఎత్తెఁడు=(రెండు వీసెలు) వీసెఁడు-జేనెఁడు-మూరెఁడు-కుండెఁడు గంపెఁడు-(అంతటను నపదాది నిత్యసంధి-సంధి ౧౧సూ). ఏకత్వమునం దనుటచేత-నాలుగు గంపల పెసలు అనుచో ఎఁడు' ప్రత్యయము రానేరదు బారెఁడు త్రాడు=బారత్రాడు' మున్నగు కొన్నిచోట్ల నిది విభాషగ నగును.

౧ వివ-విభాగమందలి పరిమాణార్థమునఁ గొన్నిట ఏసి' వర్ణకమగును ఉదా - నాలుగేసి-గంపెఁడేసి-అంతలేసి దొరలు-ఇంతలేసి అంతలు నెప్పి గోరంతలు-గోరంత-కొండంత-కొండంతలు అంత-ఇంత' ఇత్యాదులు తద్ధితప్రత్యయములు గావు అవి ప్రత్యేక శబ్దములె.

౨ వివ - ఎఁడు' ప్రత్యయాంతము లొపవిభక్తికవర్ణములతో వ్యస్తముగా వాడఁబడును బారెంటన్-మూరెంటన్ (బసవ ౪ ఆ ౮౭౭) అడుగెంటనె (పాండు ౧ ఆ ౧౧౪) పదాది హ్రస్వముమీఁద వలెనె యిందును నిండుసున్న మాత్రమె (చూ-సంధి-౨౨ సూ) బారెటన్-మూరెటన్' అని యుండరాదు (చూ-అచ్చి-౭౫ సూ)

ఎఁడు వర్ణకంబు పరంబగునపుడు లి వర్ణంబు లోపించును. ౩౧. (బా-తద్ధి-౨౬ సూ (వ్యా-సం-౨౯-౨ I వివ)

కమికెఁడు = (కమికిలి = వంపఁబడిన వ్రేళ్ళుగల పుడిసిలి) కొండెఁడు=(కొండిదిలి = బొట్టవ్రేలు గాక తక్కిన నాల్గు వ్రేళ్ళును వంపఁగా నేర్పడు చేర) దోసెఁడు=(దోసిలి=అంజలి). పిడికెఁడు (పిడికిలి) సందెఁడు (సందిలి)=దోయిలి=(వ్యామము) ~~(ఇంచుక తెంచిన బార మధ్యస్థలము)~~. అపవాద స్వర సంధి సంధి ౧౧ సూ)

పరిమాణార్థంబున 'బంటి-కొలఁది' లగు ౩-౨ (బా-తద్ధి-౨౭ సూ) (వ్యా-సం-౨౯౩-౨౯౩ I వివ).

మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది ఱొమ్ముబంటి - ఱొమ్ముకొలఁది

౧ వివ -సంస్కృతమందు 'మయ-మాత్ర' శబ్దములవలెనె యీ బంటి-కొలఁది' శబ్దములును బ్రత్యేక ప్రయోగార్హములు నగును కావుననె యివి ప్రత్యయపూర్వకముగను షష్ఠ్యంతపూర్వకముగను గన్పట్టును తత్సమ శబ్దములమీఁద సయితము నిల్చును ఉదా-ముక్కున బంటి మోఁకాలిబంటి-మోఁకాలికొలఁది తత్స-కంటిబంటి సంస్కృతనమయము మొ †

౨ వివ - కొలఁది అను దాని బ్రత్యేక శబ్దముగానె కోశకారులు చూపెదరు ప్రత్యయముగాఁ జూపరు. కొలఁది-దే వి. పరిమితి-విణ-శక్యము . కొలఁది మిగిలి నాకు భరియింపఁ గొలఁది గాక (హరి-పూ-భా-౪ ఆ) (శ-ర).

---

† సూరి దఘ్నార్థంబున బంటి కొలఁదులగు ' (బా-తద్ధి-౨౭) అని సూత్రించెను కాని సంస్కృతమున 'దఘ్న' ప్రత్యయ మూర్ధ్వ పరిమాణవాచి ఉదా-ఊరు దఘ్నము -ఊరుబంటి' అనువో సదోమానము 'చేతికొలంది' (పెద్దన యుత్పలమాలిక)

అర్థ విశేషంబులఁ వర్ణకాంతరములును మహాత్ప్రయో
గంబుల నెఱుంగునది. 33. (బా-తద్ధి-౨౮ సూ) (వ్యా-
సం-౭౯౪ [1] విష)

మంటమారి=(జ్వలనశీలుఁడు-కోపశీలుఁడు) తిండిపోతు - తాచ్ఛీ
ల్యంబున మారి పోతు' వర్ణకంబులు. అడప (తాంబూల కరండవాహి).
మతుబర్థంబునందు అ' ప్రత్యయము (అడపము+అ=అడప=(నక్క
లాకుల తిత్తిని బట్టికొనువాఁడు. అట్టి యాఁడుదియు అడపకాఁడు-
అడపకత్తియ' అనియుఁ జెప్పనగును ) పెండ్లము=(ఊఢ)-పెండ్లి శబ్దంబు
నకు మతుబర్థంబునందు అము' ప్రత్యయము. చెడుగఁడు=(క్రూరుఁడు)
ముడుకఁడు = (దుష్టుఁడు) నిడుపఁడు = (పొడుగైనది-పాము = దీర్ఘ
పృష్ఠము). వీనియందు మతుబర్థంబున 'అ' ప్రత్యయము. ఇత్యాదు
లూహ్యంబులు

౧ వివ - సంఖ్యకుఁ బూరణార్థమున 'అవ' ప్రత్యయ మగును '
(ఆచ్ఛి-౬౭ సూ) మున్నగునవియు నిందుఁ జేరఁదగినవె.

— ఇది యాచ్ఛిక తద్ధిత పరిచ్ఛేదము —

---

# బాలవ్యాకరణోద్యోతము

## సంస్కృత తద్ధితములు - అపత్యార్థకములు

అదంతములకును, బాహ్వాదులకును ష్ణి -స్త్రీ ప్రత్య
యాంతములకును అత్రి' ప్రభృతులకును ష్ణేయ -
గర్గాదులకు ష్ణ్య '-నడాదులకు ష్ణాయన -పితృష్వస్రాదు
లకు 'ణీయ'- రేవత్యాదులకు ష్ణిక '- శివాదులకును
జక్కినవానికిని ష్ణ '-అను ప్రత్యయము లపత్యార్థమున
నగును ౧ (ముగ్ధ-౭౧౪ సూ).

తద్ధితములకు 'త' అనునది ముగ్ధబోధవ్యాకరణ సంజ్ఞ. వయి ప్రత్యయములలోని 'ష' కారము 'స్త్రీత్వమున' 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పు నిదర్శనము. (చూ-తత్స-౧౦౦ సూ) ఉదా — (శైవీ)=శైవి=(శివాపత్యము. స్త్రీ.) 'ణ' కారము ప్రకృత్యాద్యచ్చ నకు వృద్ధి యగునని తెల్పు నిదర్శనము. (సం-తద్ధి-౨ సూ వృద్ధి.) ఉదా :-(శివ స్యాపత్యం పుమాన్=శివ+ష్ణ=శైవః)=శైవుఁడు

౧ వివ —("న పతతి వంశో యేన జాతేనేతి,తదపత్యమ్")= ఎవని పుట్టుకచేత వంశము పడిపోదో యట్టి దపత్యమని యర్థము. పుత్త్రి పౌత్త్రి ప్రపౌత్త్రాదులని భావము ఇక్లై కన్యావిషయమును నెన్నునది. 'రాఘవ' శబ్దము రఘుని ప్రపౌత్త్రులగు రామలక్ష్మణుల విషయమున రఘువంశములో వాడఁబడెను 'రాఘవా వపి నినాయ" (ముగ్ధ-దుర్గాదాసవ్యాఖ్య) ఇక్లై యపత్య ప్రత్యయమొక్కటే పౌత్త్రాదు లను దెల్పును గాని నపత్య ప్రత్యయాంతముపైని మరల నపత్యప్రత్యయమును నిల్పరాదు కాని 'గర్గ-నడాదుల' పట్ల నట్లుగాదు వాని పైని గోత్రాపత్య ప్రత్యయము నిల్చిన పైని యువాపత్య ప్రత్యయము నిల్చుట గలదు. ఉదా :-(గర్గ స్యానన్త రాపత్యమ్=గోత్రాపత్యమ్= గార్గ్యః)=గర్గుని గోత్రాపత్యము=గార్గ్యుఁడు గార్గ్యుని యువాపత్యము=గార్గ్యాయణుఁడు. (గార్గ్య స్యాపత్యం యువా = గార్గ్యాయణః. ఏవం వాత్స్యాయనః) '(దక్ష స్యానన్త రాపత్యం=దాక్షిః తస్యాపత్యం యువా=దాక్షాయణః)=దక్షుని గోత్రాపత్యము=దాక్షి. వాని యువాపత్యము=దాక్షాయణుఁడు అనురీతిని గర్గాది భిన్న స్థలమునందును రెండవ ప్రత్యయ మగుటయుఁ గలదు కన్యాపత్యమున నిట్లు గాదు ఉదా —దక్షుని యపత్యము స్త్రీ=దాక్షాయణి= (దక్ష స్యాపత్యం స్త్రీ దాక్షాయణీ)

౨ వివ —పాణినీయాదులలో నెల్లెడలను గోత్రాపత్యార్థకములు యువాపత్యార్థకములు నను భేదములతో నీవిషయము న

మిక్కిలి విపులముగా వివరింపఁబడెను. కాని పై "రఘువంశాది మహాకావ్యములలోని ప్రయోగములం దట్టి భేదము గన్పట్టలేదు. కాన వోపదేవుఁ డట్టి భేదముల నుపేక్షించెను.

పయిరీతినె 'త్రైకాయని' 'తికాదిభ్యః ఫిఞ్' (సి. కౌ ౧౧౭౮ సూ) 'ఆలాయని' (ఆది-౭-ఆ-౨౫౭ ప) 'గాంగాయని' (భీష్మ-) మున్నగునవి 'ష్ణాయన' ప్రత్యయముపైని 'ష్ణి' ప్రత్యయము నిల్చుటచేత నేర్పడినవని గ్రహింపవలెను.

3 వివ - ప్రసంగవశమున నిట గోత్రవివరణము చేయఁబడు చున్నది. పౌత్రాది గ్గోత్ర మేక స్త్యః (త్య=ప్రత్యయ) . వంశ్యే జీవ త్యపత్యాంత స్య పౌత్ర ప్రభృతే ర్యువా జీవతి భ్రాతరి జ్యేష్ఠే కనీయాంస్తు స ఉచ్యతే। వృద్ధతరేస వాన్యస్మిన్ సపిణ్డే సతిజీవతి పూజ్యే వృద్ధం యువా వా స్యా త్కుత్సాయాం వా ఉయువాయు వా ' (ముగ్ధ-౮౧౫ సూ-శ్రీరామతర్క వ్యాఖ్య. ౩౬౭ పుట. ౩౭౫ పుట.)

ణిత్తగు తద్ధితము పరమగునపుడు శబ్దాద్యచ్చునకు వృద్ధి యగును. (చూ-సమా-౩౦ సూ-వృద్ధి). సుభగా దులయెడ వాని యవయవములు రెండిటి యాద్యచ్చుల కును వృద్ధి యగును సుపంచాలాదులయెడల వాని యుత్తరావయవము నాద్యచ్చునకు మాత్రము వృద్ధి యగును. ౨ (ముగ్ధ ౮౧౬ సూ) (సి-కౌ-౧౧౭౫సూ.)

(సి-కౌ-సుభగాదులు ౧౧౩౩-౧౮౩౮ సూ. సుపం చాలాదులు ౧౩౯౬ మొ ౧౮౦౦-వ-సూ)

తద్ధితములగు నచ్చులును యకారమును బరము లగునపుడు పూర్వస్థములగు అ-ఇ' అను నక్షరము లు లోపించును. 3. (ముగ్ధ ౨౫౮ సూ) (సి-కౌ-౩౧౧ సూ).

ఉదా -శివుని యపత్యము=శైవుఁడు. (శివ స్యాపత్యం శైవః) (శివ+ష్ణ=శైవ్+అ=శైవ.)

తద్ధితములందు నచ్చులును యకారమును బరము లగునపుడు పదాంత నకారము లోపించును. పదాంత మందుండు ఉ'కారము 'ఓ' కార మగును. కొన్ని యెడల నట్టి నకారము లోపింపదు. అట్టి 'ఉ'కారము లోపించును. ౪ (ముగ్ధ 332 సూ) (సి_కౌ_౬౭౯_ ౮౪౭ సూ) (నలోపాభావము _ ముగ్ధ ౪_౨౪ సూ. ఉ'కారలోపము. ముగ్ధ ౪_౨౦ సూ) (సి_కౌ_నలో పాభావము ౧౧౫౯ సూ ౧_౨౪౫ సూ. ఉ' కార లోపము ౧౧౪_౨ సూ)

ఓ_ఔ అనువానికిఁ బరమగు తద్ధితసంబంధి 'య' కారము స్వరతుల్యమగును. ౫ (ముగ్ధ_౪_౨3 సూ) (సి_కౌ_౬3_౬౪ సూ)

ఉదా _బభ్రువు నపత్యము=బాభ్రవ్యుఁడు = (బభ్రు+బభ్రో= బభ్రవ్+(ష్య)=య=బాభ్రవ్యః) స్తుతింపఁదగిన వాఁడు=స్తవ్యుఁడు= (స్తు_స్తో_స్తవ్+య)

బాహ్వాద్యదంత 'ష్ణి' :_బాహువను ఋషి (తత్వా_౨_౨౦ పుట) యపత్యము=బాహవి =(బాహో రపత్యం బాహవిః=బాహు+ష్ణి= బాహో+ఇ=బాహవ్+ఇ_) (సం_త_౪ సూ సమా_3_౨ సూ) (సి_కౌ_౧౧౯౬ సూ). అగ్నిశర్మ యపత్యము=ఆగ్నిశర్మి=(అగ్నిశర్మణో ౨పత్యమ్=ఆగ్నిశర్మిః అగ్నిశర్మన్+ష్ణి=ఆగ్నిశర్మన్+ఇ సం_త_ ౨_3_౪_సూ)

బాహ్వాది :_బాహు_సుమిత్రా_అగ్నిశర్మన్_లోమన్ (ఉడు లోమన్ మొ) యుధిష్ఠిర_అర్జున_సామ్బ_కృష్ణ_గద_ప్రద్యుమ్న_ రామ_సత్యకా_ మొదలగునవి బాహ్వాదు లాకృతిగణము. కాన 'పణిన'_పాణిని'. (శ్లో_నైవ ౯ ౨ ౧౯ వ 'పణినాపత్య') ('ఫలా దేరిను" ఫలం_బర్హాం_పణో_గర్భ మలం శృఙ్గంచ కథ్యతే ముగ్ధ

 (సంస్కృ. తద్ధి. ౧ సూ ఉదా. బాహ్వాద్యదన్త-అత్ర్యాది-
౪౪౭ సూ-వ్యాఖ్య- (శ్రీరామతర్క. చూ-చిం-పరి. ౮౮ విమ.)
'కశ్యప' శబ్దమునుండి 'కాశ్యపి-కాశ్యపేయ-కాశ్యప' అను మూఁడు రూపములు గల్గును. ఇట్లె దక్షుని యపత్యము = దాక్షి = (దక్షస్యాఽపత్యం దాక్షిః. దక్ష+ష్ణి=దాక్ష్+ఇ). (సం-త-౨-3-సూ)

అదంతములకు ష్ణి' ప్రత్యయ మగునని చెప్పియు బాహ్వాదులలోఁ గొన్ని యదంతముల నేల పఠింపవలయునని శంకింపరాదు. అవి శివాదులలోను నుండుటచేత నట్లు పఠింపవలసెను. యుధిష్ఠిరాది ద్వయోః కురువంశత్వాత్, రామాది పఞ్చానాం వృష్ణివంశత్వాత్, శివాది బాధనార్థః' (ముగ్ధ ౪౧౬ సూ. శ్రీరామతర్క-వ్యాఖ్య 3౬౫-3౮౫ పు)

అత్రి-'స్త్రీ'-ప్రత్యయాంత 'ష్ణేయ" .-అత్రి (ముని) యపత్యము=ఆత్రేయుఁడు=(అత్రే రపత్య మాత్రేయః. అత్రి+ష్ణేయ=ఆత్ర్+ఏయ)-(సం-త-౨-3-సూ). (సి-కౌ-౧౧౨౪ మొ ౧౧౨౬. వ సూ).

స్త్రీ ప్రత్యయ -గంగ -యపత్యము=గాంగేయుఁడు=(గఙ్గాయా అపత్యం=గాఙ్గేయః గఙ్గా+ష్ణేయ=గాఙ్గ్+ఏయ.) (సం-త-౨-3 సూ). (సి-కౌ-౧౧౨3 సూ) ( గాంగుఁడు-గాంగాయని' అనియు రూపాంతరములు గలవు). మహియొక్క యపత్యము=మాహేయుఁడు=(మహ్యా అపత్యం=మాహేయః. మహీ+ష్ణేయ =మహ్+ఏయ.) (సం-త-౨-3-సూ) కద్రువ యపత్యము=కాద్రవేయుఁడు=(కద్ర్వా అపత్యం=కాద్రవేయః కద్రూ+ష్ణేయ=కాద్రో=కాద్రవ్+ఏయ)(సం-త-౨-౪-సూ- సమా-3౨ సూ.) ఇట్లె-పాండవేయుఁడు. కొన్ని యెడల ఉ' కార లోపము :- కమండలువు నపత్యము = కామండలేయుఁడు = (కమణ్డలో రపత్యం=కామణ్డలేయః. కమణ్డలు+ష్ణేయ=కామణ్డల్+ఏయ) (సం-త-౨-౪ సూ).

అత్ర్యాది గణము :- అత్రి-శుభ్ర-సునాభ-అశ్వినీ- మృకణ్డు-అమ్బికా-రోహిణీ-పాణ్డు- కమణ్డలు- కద్రూ- కశ్యప- మొ. ఆకృతి

గణము. ( కాశ్యప-కాశ్యపి' అనునవి 'కాశ్యపేయ' అనుదాని రూపాంతరములు.

గర్గాది ష్ణ్య'-గర్గుని యపత్యము = గార్గ్యుఁడు = (గర్గస్యా౽పత్యం=గార్గ్యః. గర్గ+ష్ణ్య=గార్గ్+య) - (సం-త-౨-3 సూ). ఇట్లే-వాత్స్యుఁడు-జామదగ్న్యుఁడు-పారాశర్యుఁడు-మొ గర్గాదు లాకృతి గణము. కాన-బాభ్రవ్యుఁడు=(బభ్రో రపత్యం=బాభ్రవ్యః. బభ్రు+ష్ణ్య-బభ్రో-బాభ్రవ్+య). (సం-త-౨-౪-౫ సూ సమా-3-౨ సూ) (సి-కౌ-౧౧౦౭. సూ).

గర్గాది '-గర్గ-వత్స-పులస్తి-రేభ-శక-ధూమ - బభ్రు - మను-శకల-శండిల-ముద్గల-చళుక-జమదగ్ని-పరాశర-దల్భ-మణ్డు- (మాణ్డవ్యః). ఇత్యాది-ఆకృతిగణము.

నడాది 'ష్ణాయన' -నడుని యపత్యము=నాడాయనుఁడు=(నడస్యా౽(పురాణ ప్రసిద్ధ సంజ్ఞానామము-చూ-తత్వ-౨-౨౦ పు) పత్యం=నాడాయనః=నడ+ష్ణాయన=నాడ్+ఆయన)-(సం-త-౨-3 సూ).

నడాది '-నడ-శకట-యుగంధర - దణ్డిన్ - బదర - న (నాః) ర (నారాయణ) శలఙ్కు-ద్వీప-(ద్వైపాయన)-అముష్య - (ద్యాముష్యాయణ)-ద్రోణ-(ద్రోణాయన) ద్రోణాయనః క్రోధనః - (వేణీ సంహార)". ఇత్యాదులు నడాదులు నాకృతిగణమె

౧ వివ- గర్గ-నడా' దులకు మొదట గోత్రాపత్య ప్రత్యయముగ ష్ణ్య' ప్రత్యయమును దానిపైని యువాపత్య ప్రత్యయముగ 'ష్ణాయన" ప్రత్యయమును నిల్చు సంప్రదాయమును గలదు. కాని "గార్గ్యుఁడు-వాత్స్యుఁడు-జామదగ్న్యుఁడు-పారాశర్యుఁడు-నాడాయనుఁడు-శాకటాయనుఁడు-ద్రోణాయనుఁడు - యౌగంధరాయణుఁడు-బాదయణుఁడు-నారాయణుఁడు, మొదలగు రూపములు ప్రయోగ దృష్టము లగుటచేతఁ దక్కినవానితోపాటుగ నపత్యార్థమున 'ష్ణ్య-ష్ణాయన' ప్రత్యయములు ప్రత్యేకముగను నగునని చెప్పఁబడెను.

అట్లయినను ననేక స్థలములందు 'గార్గ్యాయణ - వాత్స్యాయన' మున్నగు ప్రయోగములును గలవు కాన వానిపైని మొదట గోత్రాపత్య 'ష్య' ప్రత్యయమును నిల్పి దానిపైని యువాపత్య 'ష్ణాయన' ప్రత్యయమును నిల్పి యట్టి వానిని సాధింపనగును. (చూ-సం-త-౧ సూ ౧ వివ)

౨ వివ.— షకార - రేఫ - ఋకార'ములకుఁ బరమగు పద మధ్యగత న' కారము ణ కార మగును. అచ్చులును, హ-య-వ' లును, క' వర్గ ప' వర్గములును వ్యవధాన మున్నను 'ణ' త్వము గల్గును. పదాంతర గత ష-ర-ఋ' కారములకుఁ బరమగు పదాంత రస్థ న' కారమును గొన్నియెడల ణ' కార మగును. (ముగ్ధ-౧౦౭ సూ). (సి-కౌ-౧౯౭. ౨౩౪ ౨౮-౨ సూ) ఉదా :-(చూ-తత్స-౧ వివ. రామ' శబ్దము) బాదరాయణుఁడు-యౌగంధరాయణుఁడు-నారాయణుఁడు-ద్వ్యాముష్యాయణుఁడు-మొ.

పితృష్వస్రాది-ఢీయ -పితృష్వసయొక్క యపత్యము=పైతృ ష్వస్రీయుఁడు=(పితృష్వసు రపత్యం = పైతృష్వస్రీయః పితృష్వసృ+ ఢీయ=పైతృష్వసృ+ఈయ) (సం-త-౨ సూ-సమా-౩౧ సూ)

పితృష్వస్రాది .-పితృష్వసృ - మాతృష్వసృ - భ్రాతృ - మొ (షష్ఠ్యలుక్ వైకల్పికము కానరాలేదు). (సి-కౌ-౧౧౩౮. సూ-౧౧౪౦ సూ). 'పైతృష్వసేయుఁడు-మాతృష్వసేయుఁడు' అను రూపములును గలవు

రేవత్యాదిష్ఠిక -రేవతియొక్క యపత్యము = రైవతికుఁడు= (రేవత్యా అపత్యం=రైవతికః. రేవతీ+ష్ఠిక=రైవత్+ఇక). (సం-త-౨-3 సూ).

రేవత్యాదులు :-రేవతీ-అశ్వపాల-ద్వారపాల-మణిపాల-మొ (సి-కౌ-౧౧౬౯ సూ)

శివాదులయు, శేషములయు 'ష్ణ' -శివుని యపత్యము=శైవుఁడు = (శివ స్యాపత్యం = శైవః శివ+ష్ణ = శైవ్+అ) (సం - త-౨-3 సూ).

శివాది :- శివ-వశిష్ఠ-కకుత్స్థ-హైహయ-విశ్రవణ-ఊర్ణనాభ-జరత్కారు-పృథా-గఙ్గా-యస్క-కర్ణ-విరూపాక్ష-భూమి-ఇలా-సపత్నీ-దశరథ-యుధిష్ఠిర-అర్జున-రామ-సామ్బ-కృష్ణ-గద-ప్రద్యుమ్న-కశ్యప- మొ (ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. రామాయణ 'దాశరథి' అనునది ప్రసిద్ధమె).

శేషముల ష్ణ :-యదువు నపత్యము=యాదవుఁడు=(యదోరపత్యం=యాదవః. యదు+ష్ణ=యాదో=యాదవ్+అ) (సం-త-౨-౪ సూ సమా-౩౨ సూ).

శేష - యదు-అఙ్గిరస్-రఘు-ఉపగు-పశు-మధు" మొ

౩ విప - సం-త-౪ సూ సలోపాభావము -యజ్వ యపత్యము=యాజ్వనుఁడు=(యజ్వన్) భద్రవర్మ యపత్యము=భాద్రవర్మణుఁడు=(భద్రవర్మన్). చక్రి యపత్యము=చాక్రిణుఁడు. (చక్రిన్).

౪ విప :- మాతృ-పుంస్-స్త్రీ' శబ్దముల విశేషరూపములు - ద్విమాతల యపత్యము=ద్వైమాతురుఁడు ఇట్లె - త్రైమాతురుఁడు-షాణ్మాతురుఁడు పుమాంసుని యపత్యము=పౌంస్నుఁడు. స్త్రీయొక్క యపత్యము=స్త్రైణుఁడు

ణిత్తగు తద్ధితము పరమగుచుండఁగా నాద్యచ్చ స్థానమునఁ బుట్టిన పదాంత స్థలములగు య-వ ల చోట 'ఇ-ఉ' అనునవి వరుసగా నిల్చును స్వఙ్గ-వ్యఙ్గాదుల కట్లు గాదు ద్వార న్యగ్రోధాదులకుఁ బ్రసక్తి లేకున్నను నవి వచ్చును ౬ (ముగ్ధ-౪౧౭-౪౧౮ సూ). (సి-కౌ-౧౦౮౮-౧౩౮౬ ౧౫౪౩-౧౫౪౮ సూ)

విగతమగు నశ్వము గలవాఁడు=వ్యశ్వుఁడు. వాని యపత్యము-వైయశ్వి=(వ్యశ్వ స్యాపత్యం=వైయశ్విః వి+అశ్వ+ష్ణి=వై+ఇ+అశ్వ+ఇ). శోభనమగు (సు) నశ్వము గలవాఁడు=స్వశ్వుఁడు. వాని యపత్యము=సౌవశ్వి=(స్వశ్వ స్యాపత్యం=సౌవశ్విః సు+అశ్వ+ష్ణి=సౌ+ఉ+

అశ్వ+ఇ). (సం-త-౨-3 సూ). స్వాంగాదుల కిట్లు కాదు. స్వాంగుని యపత్యము=స్వాంగి. వ్యంగుని యపత్యము=వ్యాంగి. ద్వారాదుల కపత్యప్రసక్తి లేదు గాన ద్వారమున నియుక్తుఁడు=దౌవారికుఁడు" (ముగ్ధ-౪3-౨ సూ-చూ) మున్నగురీతిని ఇ-ఉ' అనువానిని గ్రహింప వలయును

వ్యాసాదులకు ష్ణి' ప్రత్యయము పరమగుచుం డఁగా ఇక్' అను నాదేశ మగును. ౭. (ముగ్ధ-౪౧౯ సూ) (సి-కౌ-౧౧౯౭. సూ. దీని వార్తికము)

వ్యాసుని యపత్యము=వైయాసకి=(వ్యాస స్యాపత్యం=వైయాసకిః. వ్యాస+ష్ణి=వై+ఇ+అస్+అక్+ఇ). (సం-త-౨-౬-౭-సూ)

వ్యాసాది :-"వ్యాస-సుధాతృ-విశ్వ-చణ్డాల-వరుథ - నిషాద" మొ. 'వాణీం కాణ భుజీ మజీగణ దవాసాసీచ్చ వైయాసకీమ్' (మల్లినాథ వ్యాఖ్య)

కల్యాణీ ప్రభృతుల ష్ణేయ" ప్రత్యయస్థానమున 'ఇనేయ' ప్రత్యయ మగును. ౮ (ముగ్ధ-౪-౨౧ సూ). (సి-కౌ-౧౧3౧-౧౧3౨. సూ)

'ష్ణేయ' ప్రత్యయస్థానమున ననుటచేత షిత్త్వ'మును 'ణిత్త్వ' మును దీనికి లభించును. 'ష్ణేయ' అనుటచే నిది స్త్రీ ప్రత్యయముల విషయమున (సం-త-3 సూ) వర్తిల్లుననియు నెఱుంగునది. ఉదా - కల్యాణి యపత్యము = కాల్యాణినేయుఁడు స్త్రీ కాల్యాణినేయి= (కల్యాణ్యా అపత్యం=కల్యాణినేయః-(స్త్రీ)-కాల్యాణినేయీ. కల్యాణీ+ష్ణేయ=కాల్యాణ్+ఇనేయ) (సం-త-౨-3 సూ). ఇట్లె-సౌభాగినేయుఁడు-దౌర్భాగినేయుఁడు పారస్త్రైణేయుఁడు. మొ

కల్యాణ్యాది :- కల్యాణీ-సుభగా-దుర్భగా - పరస్త్రీ - బన్ధకీ-రజకీ-జ్యేష్ఠా-కనిష్ఠా-కులటా ఇత్యాదులు.

నట్యాది క్షుద్రావాచకముల 'ఢ్రేయ' ప్రత్యయ స్థానమున 'ఏర' ప్రత్యయమును, గోధాదుల 'ఢ్రేయ' ప్రత్యయస్థానమున 'ఏర_ఆర'' ప్రత్యయములును విక ల్పముగా నిల్చును ౯ (ముగ్ధ-౪_౨_౨ సూ) (సి-కౌ-౧౧౩౫_౧౧౩౬_౧౧౩౭ సూ).

కుల, శీల హీనులు నంగహీనులును క్షుద్రు లనఁబడుదురు. (దాసీ_విటీ_నటీ_కాణాదులు) ఉదా _నటి యపత్యము=నాటేరుఁడు_ నాటేయుఁడు=(నట్యాఅపత్యం=నాటేరః=నాటేయః_నటీ+ఢ్రేయ=నాట్+ ఏర=నాట్+ఏయ) (సం_త_౨_౩ సూ) గోధ (ఉడుము) యపత్యము= గాధేరము_గాధారము=గాధేయము = (గోధాయా అపత్యం=గాధేరః= గాధారః=గాధేయ. గోధా+ఢ్రేయ=గోధ్+ఏర=ఆర=ఏయ) (సం_త_ ౨_౩ సూ)

గోధాది _ 'గోధా=(ఉడుము) మృగీ=(లేడి) కాకీ=మూషికా_ చటకా=(పిచ్చుక) . మొ.

గర్గాదులకును యస్కాదులకును భృగ్వాదులకును, రూఢరాజవాచకములకును, బహుత్వమున నపత్య ప్రత్య యము లోపించును. స్త్రీత్వమున లోపింపదు. ౧౦. (ముగ్ధ_౪_౨౮ సూ) (సి-కౌ-౧౧౯౩ - ౧౧౪౬ మొ- ౧౧౪౯. వ సూ) (చూ_సి_కౌ_౧౧౭౬ సూ)

(ఏక) గార్గ్యుఁడు (బహు)' గర్గులు ('గార్గ్యులు' అనరాదు). (ఏక_) యాస్కుఁడు=(బహు) యస్కులు. ( యాస్కులు' అనరాదు). (ఏ) భార్గవుఁడు-(బహు) భృగువులు ('భార్గవులు' అనరాదు)

గర్గాదు లీవఱకు వచింపఁబడెను

యస్కాదులు _ 'యస్క_లహ్య_క్రోష్టుపాద _ మస్తక _ వర్తుక'' మొ_ యస్కాద్యన్తర్గణము విదాది _' వి (బి) ద_కశ్యప_కుశిక_భర ద్వాజ_ఉపమన్యు_శరద్వత్_రథన్తర_విశ్వానర మొ_ ఇవెల్ల ఋషుల పేర్లు

భృగ్వాద .-"భృగు-అత్రి-కుత్స-అంగిరస్-వశిష్ఠ-గోతమ" మొ. (ఏక)-భార్గవుఁడు-(బహు)-భృగువులు. (ఏ) ఆత్రేయుఁడు (బ) అత్రులు (ఏ) కౌత్సుఁడు (బ) కుత్సులు (ఏ) ఆంగిరసుఁడు (బ) అంగిరులు (ఏ) వాశిష్ఠుఁడు (బ) వశిష్ఠులు (ఏ) గౌతముఁడు (బ) గోతములు) ఇవెల్ల ఋషుల పేర్లు.

దేశతుల్యాఖ్య క్షత్త్రియ శబ్దము రూఢ మనిపించుకొనును ఉదా - (ఏ) వాంగుఁడు (బ) వంగులు (ఏ) కాళింగుఁడు (బ) కళింగులు. ఇచటి రూఢ శబ్దము కొన్నియెడల ప్రసిద్ధ క్షత్త్రియులకును' నుపలక్షణమగును. (ఏ) రాఘవుఁడు. (బ) రఘువులు. (ఏ) యాదవుఁడు (బ) యదువులు. "నాథో రఘూణా మాధవా యదూనామ్ ఇత్యుద్భటః' (ముగ్ధ-౮-౩౮ సూ. దుర్గా-వ్యాఖ్య) పాణినీయు లిచట లక్షణావృత్తి నాశ్రయింతురు

స్త్రీత్వమున నీట్లపత్య ప్రత్యయము లోపింపదు ఉదా -(ఏ) భార్గవి (బ) భార్గవులు (స్త్రీలు) ఇచట ' భృగువులు (స్త్రీలు) అనరాదు

వివిధార్థక తద్ధితములు :

వెనుకఁ జెప్పిన ష్ణి-ష్ణేయ-ష్ణ్య-ష్ణాయన-ణీయ-ష్ణిక-ష్ణ" అను నేడు ప్రత్యయములును ' ష్ణిక-కణ్-ణీన-ఇయ" అను నాల్గు ప్రత్యయములును, నిర్వర్ణరహితముగాను, నిర్వర్ణసహితముగాను, మహాకవి ప్రయోగానుసారముగాఁ గారకము లన్నిటికంటెను గర్త్రర్థమంతును, గర్మార్థమందును నిల్చును ౧౧ (ముగ్ధ-౮-౭౯ సూ 'ష్ణి' ప్రభృతులు వెనుక 'సం-త-౧ సూ' చెప్పఁబడెను.

పాణినీయాదులందును 'తర్క-' శబ్దముకంటెఁ బరముగ ష్ణిక ప్రత్యయమును, వ్యాకరణ శబ్దముకంటెఁ బరముగ 'ష్ణ' ప్రత్యయమున్న

నిల్చునని చెప్పఁబడలేదు. అది మహాకవి ప్రయోగైకవేద్యమె. 'కృత్త ద్ధిత సమాసానా మభిధానం నియామకమ్ లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞాన సూచకమ్ ' (ముగ్ధ-౧౧౮౩ సూ క్రింద.) తద ధీతే తద్వేద" (౪-౨-౫౯). తదధీత ఇత్యర్థే-తద్వేత్తి త్యర్థేచ ద్వితీయాన్తా దణా దయ స్స్యు రిత్యర్థః (బాల మనోరమా వ్యాఖ్య) (సి-కౌ-౧౨౬౯ సూ ) ఉదా -తర్కము నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియుచున్నాఁడు = తార్కికుఁడు = (తర్కం వేత్త్యధీతేవా=తార్కికః. తర్క+ష్ణిక) వ్యాకరణము నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియుచున్నాఁడు = వైయాకరణుఁడు=(వ్యాకరణం వేత్త్యధీతేవా= వైయాకరణః వ్యాకరణ+ష్ణ=వి+ఇ+ఆకరణ) (సం-త-౨-3-౬ సూ ) పదమును (లేదా) క్రమమును నధ్యయనము చేయుచున్నాఁడు (లేదా) తెలియుచున్నాఁడు = పదకుఁడు-క్రమకుఁడు=(పదం క్రమంవా వేత్త్యధీతేవా=పదకః-క్రమకః పద+క. క్రమ+క ) (సం-త-౨-3-సూ) (సి-కౌ-౧౨౭౧ సూ ) పై ప్రత్యయములు కర్త్రర్థమున వచ్చినవి.

కర్మార్థక -వాక్కుచే జేయఁబడినది=వాచికము=(వాచా కృతమ్=వాచికమ్ వాచ్+ష్ణిక. వాచ్+ఇక) ఇటుఁ గర్మార్థమునఁ గరణకారకముపై నిల్చినది. (ముగ్ధ ౪౩౧ సూ ) సం-త-౧౧ సూ 3 వివ చెప్పునఁ బడత్వము లేమింజేసి సమా-3౭ సూత్రము చెప్పిన 'క' కారాదికము (వాక్కాన్తా) లేదు) (సి-కౌ-౨౧౦3 సూ) సందేశ వాగ్ వాచికం స్యా త్తని యమరము పాణినిచే జెప్పఁబడినది=పాణినీయము-(పాణినినా ప్రోక్తమ్=పాణినీయమ్=పాణిని+ఛీయ) కర్మార్థమునఁ గర్తృకారమున నిల్చినదిచటఁ ఛీయ' ప్రత్యయము (సం - త - ౨-3 సూ) (సి - కౌ - ౧౪౫౧ సూ)

కర్త్రర్థక కరణకారక -శక్తిచే యుద్ధము జేయుచున్నాఁడు= శాక్తీకుఁడు=(శక్త్యా యుధ్యతే=శాక్తీకః శక్తి+ష్ణిక=శాక్త్+ఈక) (సం-

త-౨-3 సూ) (సి-కౌ-౧౬౦౯ సూ) ఇట్లె యాష్టికుఁడు (యష్టి-ఠగ్ ఱ).

౧ వివ -తిష్య= (పుష్యమి) నక్షత్రముతోఁ గూడిన రాత్రి= తైషి=(తిష్యేణ యుక్తా రాత్రిః = తైషే తిష్య+ష్ణ=తైష్+అ-(స్త్రీ-ఈ=తైషీ)

'సూర్యాగస్త్యతిష్యపుష్య' శబ్దముల యకారము నక్షత్రవిహిత ష్ణ ప్రత్యయ పరకత్వమున లోపించును". (ముగ్ధ-౨౬౦ సూ)(సి-కౌ ౪౯౯ సూ) ఇదియుఁ గర్త్రర్థమునఁ గరణకారకముపై ష్ణ ప్రత్యయము నిల్చుటచే సిద్ధించినది ఇట్లె పౌషి' మొ

సంప్రదానకారకము కాకున్నను జతుర్థిపై వచ్చినది -క్షత్త్రము నిమిత్తము సాధువు=క్షత్త్రియుఁడు (క్షత్త్రియజాతి)=(క్షత్త్రాయ సాధుః= క్షత్త్రియః క్షత్త్ర+ఇయ=క్షత్త్ర+ఇయ) (సం-త-3 సూ). (సి-కౌ- ౧౬౬౫ సూ).

అపాదానకారక కర్త్రర్థ -మధురనుండి వచ్చినవాఁడు=మాధురుఁడు=(మధురాయా ఆగతః=మాధురః మధురా+ష్ణ=మాధుర్+అ) (సం-త-౨-3 సూ) (సి-కౌ-౧౪౫3 సూ)

అధికరణకారకము కర్త్రర్థము - ఈ లోకమునం దగునది = (ఇహ)=ఐహికము=(ఇహ భవ మైహికమ్=ఇహ+ష్ణిక=ఇహ్+ఇక) (సం-త-౨-3 సూ).

ఒకానొకప్పు (కదాచిత్) డగునది = కాదాచిత్కము=(కదాచిద్భవం=కాదాచిత్కమ్ కదాచిత్+కణ్ = కాదాచిత్+క) (సం-త-౨ సూ ) (సి-కౌ-౧౪౨౪ సూ) గ్రామమునం దగునది=గ్రామీణము= గ్రామ్యము=(గ్రామే భవః=గ్రామీణః=గ్రామ్యః గ్రామ+ణీన. (లేదా) గ్రామ+ష్ణ్య.) (సం-త-౨-3-సూ) (సి-కౌ ౧3౧౪-౧3౯3 సూ). మూర్ధమునం దగునది=మూర్ధన్యము = (మూర్ధని భవమ్ = మూర్ధన్యమ్- మూర్ధన్+య. నకారలోపాభావము) (సం-త-౪ సూ) ఇట్లె-కణ్యము-

చ స్త్ర్యము-మొ (సి-కౌ-౧౬౬౬ సూ) నదియం దగునది=నాదేయము=(నద్యాం భవః=నాదేయః. నదీ+ఢక్=నాద్+ఏయ ) (సం-త-౨-౩ సూ) (సి-కౌ-౧౩౧౮ సూ). శాలయం దగునది=శాలీయము = (శాలాయాం భవః=శాలీయః. శాలా+ఛీయః=శాల్+ఈయ ) (సం-త-౨-౩ సూ) (సి-కౌ-౧౩౩౮ సూ) నగరమం దగునది=నాగరము=(నగరే భవః=నాగరః నగర+అణ్=నాగర్+అ ) (సం-త-౨-౩ సూ) (సి=కౌ-౧౩౫౨ సూ) నగరప్రావీణ్యము గలవాఁడు=నాగరకుఁడు=(నగరప్రావీణ్యవాన్=నాగరకః నగర+కఞ్=నాగర+క) (సం-త-౨-౩ సూ (సి-కౌ-౧౩౫౨ సూ) అగ్రమం దగునది=అగ్ర్యము = (అగ్రే భవః=అగ్ర్యః అగ్ర+య=అగ్ర్+య) (సం-త-౩ సూ) (సి-కౌ-వైదిక ౪ అధ్యాయ. ౩౪౬౨ సూ) అగ్రియము=అగ్రీయము అనియు రూపములు గలవు (ముగ్ధ-౪౨౯ సూ. శ్రీకామతర్క-వ్యాఖ్య-౪౨౨ పుట)

౨ వివ.—కొన్నియెడలఁ దద్ధితాచ్చుగాని తద్ధిత యకారముగాని పరమగునపు డవ్యయముయొక్క యంత్యాచ్చు మొదలుకొన్న భాగము లోపించును (ముగ్ధ-౪౩౦ సూ) (సి-కౌ-౧౩౨౪ సూ. వార్త్తికము). ఉదా — సాయం ప్రాతఃకాలములం దగునది=సాయం ప్రాతికము=(సాయం ప్రాతః భవతీతి=సాయం ప్రాతికః సాయం ప్రాతర్+ఠక=సాయం ప్రాత్+ఇక) మాటిమాటికిని=(పునఃపునః) నగునది=పౌనః పునికము=(పునః పునః భవతీతి = పౌనః పునికః పునః పునర్+ఠక= పౌనః పున్+ఇక) పయినయినది (బహిర్)=బాహ్యము=(బహిర్భవః=బాహ్యః. బహిర్+ష్యఞ్=బాహ్+య) (ముగ్ధ ౪౩౦ సూ) (సి-కౌ-౧౩౨౪ సూ. వార్త్తికము.)

౩ విన —తద్ధితమగు నచ్చుగాని యకారముగాని పరమగునపుడు కొన్నియెడలఁ బూర్వమునకుఁ బదత్వము లేదు. తాంత సాంతముల కస్వర్థమునఁ బదత్వములేదు (ముగ్ధ-౪౩౧ సూ) (సి-కౌ-౨౨౬౧-౨౧౫౬ సూ) ఉదా :-దిశ్యము-(దిశ్+య). త్వాచ్యము=(త్వచ్+

ష్ణ్య) వాచ్యము (వాచ్+ష్ణ్య) (చూ-సమా-3౭-3౮ సూ) ఇట నీ సూత్రములవొప్పున 'క' కారాదులు రానేరవు ( త్వాక్యము' కాదు)

తాంత సాంతములకు -తటిత్వాంతుఁడు-పయస్వి-తేజస్వి-మొ వీని యందుఁ బదాంతత్వము లేమింజేసి జ స్త్వము సకారమునకు విసర్గమును రాలేదు-(చూడు-సమా-3౬-౪3 సూ )

౪ వివ -తద్ధితమగు నచ్చుగాని యకారముగాని పరమగునపుడు కొన్నియెడల అహన్' శబ్దమునకు అహ్న' దేశ మగును ఉదా ఆహ్నికము (అహ్ని భవః=ఆహ్నికః) (అహన్+ష్ణిక=అహ్న+ఇక) (ముగ్ధ-౪3౨ సూ) (సి-కౌ ౧౭౪3 సూ )

వికార సంఘ భావేదం హిత స్వార్థాదులంమను బయి
పదునొకండు ప్రత్యయములును నిద్వర్ణసహితముగాను,
నిద్వర్ణరహితముగాను నగును ౧౨ (ముగ్ధ-౦33 సూ)

వికారార్థక :- హేమముయొక్క వికారము = హైమము-(హేమ్నో వికారః=హైమః-హేమన్+ష్ణ=హేమన్+అ). (సం-త-౨-3-౪ సూ) (సి-కౌ-౧౫౧౪ సూ) అప్పుల (జలముల) వికారము= ఆప్యము = (అపాం వికారః=ఆప్యమ్ అప్+ష్ణ్య=ఆప్=య) అగ్ని యొక్క వికారము=ఆగ్నేయము=(అగ్నే ర్వికారః=ఆగ్నేయః=అగ్ని+ష్ణేయ) సంఘార్థక -భిక్షుల సమూహము=భైక్షము=(భిక్షూణాం=సమూహో భైక్షమ్=భిక్షూ+ష్ణ) (సి-కౌ-౧౨౪3-౧౨౪౪ సూ) సమూహార్థకములు నపుంసకములు) అహముల సమూహము=ఆహ్నము=(అహ్నాం సమూహః ఆహ్నమ్ అహన్+ష్ణ) (సం-త-౧౧ సూ ౪ వివ అహ్న దేశము) గణికల సమూహము=గాణిక్యము=(గణికానాం సమూహ = గాణిక్యమ్ గణికా=వేశ్యా గణికా+ష్ణ్య=గాణిక్+య) (సం-త-౨-3 సూ) (సి-కౌ-౧౨౪౮ సూ దీనిలోని వార్తికము ౨౭౯ ) బ్రాహ్మణుల సమూహము=బ్రాహ్మణ్యము రాజుల సమూహము=రాజకము=(రాజ్ఞాం సమూహః=రాజకమ్. రాజన్+కణ్) (సం-త-౨-3-౪ సూ)

వృద్ధుల సమూహము=వార్ధకము (సి-కౌ-౧౨౪౬ సూ) హస్తిసమూహము= హాస్తికము= హస్తినాం సమూహః=హాస్తికమ్. (హస్తిన్=గజ) (హస్తిన్+ష్ణిక = హాస్త్+ఇక). భావార్థక -గురువుయొక్క భావము (ధర్మము)=గౌరవము=(గురో ర్భావః=గౌరవమ్= గురు+ష్ణ=గౌరో-గౌరవ్+అ) (సి-కౌ-౧౭౬-౪) ఇట్లు బ్రాహ్మణ్యము (బ్రాహ్మణ + య) యౌవనము (యూనో భావః) బహిఃప్రదేశము = బాహ్యము= (సి-కౌ-౧౭౮౮ సూ) (బహి ర్భవమ్ = బాహ్యమ్ బహిర్+ష్ణ్య) సామ్యము (సమస్యభావః=సామ్యమ్) వైరూప్యము=(విరూపస్య భావః= వైరూప్యమ్) రాజ్యము=(రాజ్ఞో భావః=రాజ్యమ్) సుహృదుని భావము= సౌహార్దము=(సుహృదో భావః=సౌహార్దమ్) ఇది సుభగాదులలోనిది గాన నవయవములు రెండిటియొక్కయు నాద్యచ్చులకు వృద్ధి వచ్చెను (సం-త-౨ సూ) (సుహృద్+ష్ణ=సౌహార్ద్+అ) ఇదమ్=సంబంధి - విష్ణుసంబంధి=వైష్ణవము=(విష్ణో స్సంబన్ధీ=వైష్ణవః. విష్ణు+ష్ణ=వైష్ణో=వైష్ణవ్+అ) (సి-కౌ-౧౫౦౦ సూ) (త్వద్)=నీ సంబంధి=త్వదీయము (తవ ఇదమ్= త్వదీయమ్ త్వద్+ఈయ) మఘువుని సంబంధి=మాఘవనము=మాఘవతము=(మఘోనః ఇదమ్=మాఘవనమ్. మఘవతః ఇదమ్=మాఘవతమ్ మఘవన్+ష్ణ=మాఘవన్+అ. మఘవత్+ష్ణ=మాఘవత్+అ). కుక్క (శ్వన్) సంబంధి=శౌవనము=(శునః ఇదమ్=శౌవనమ్ శ్వన్+ష్ణ=శౌవన్+అ) (సం-త-౨ సూ)

౧ వివ -తద్ధిత 'య' కార పరకత్వమున ఋ' కారము రేఫమగును. ఉదా - పితృసంబంధి=పిత్ర్యము=(పితు రిదమ్ = పిత్ర్యమ్ = పితృ+య)

౨ వివ - ష్ణ-ణీన' ప్రత్యయములు పరమగునపుడు 'యుష్మద్-అస్మద్-త్వద్-మద్' అను వానికి యుష్మాక-అస్మాక-తవక-మమక" అను నాదేశము లగును ఉదా -యౌష్మాకము=యౌష్మాకీణము=(మీ సంబంధి) = (యుష్మాక మిదమ్=యౌష్మాకమ్=యౌష్మాకీణమ్) ఆస్మా

కము=ఆస్మాకీనము=(మా సంబంధి)=(అస్మాక మిదమ్=ఆస్మాకమ్=ఆస్మాకీనమ్) తావకము=తావకీనము=(నీ సంబంధి)=(తవ+ఇదమ్=తావకమ్=తావకీనమ్) మామకము = మామకీనము = (నా సంబంధి) = (మమ ఇదమ్=మామకమ్=మామకీనమ్)

హితార్థకములు -సూర్యుని హితము=సౌరీయము=(సూర్యాయ హితమ్=సౌరీయమ్ సూర్య+ణీయ=సౌర్+ఈయ) (సం-త-౧౧ సూ ౧ వివ. యలోపము) (సి-కౌ-౧౬-౭౭ సూ) ఆత్మన్ (తనకు) హితము= ఆత్మనీనము = (ఆత్మనే హితమ్ = ఆత్మనీనమ్ ఆత్మన్ + ణీన) (సి-కౌ-౧౬౭౦ సూ)

స్వార్థిక -చోరుఁడే = చౌరుఁడు=(చోర ఏవ చౌరః-చోర+ణ్ణ = చౌర్+అ) త్రిలోకి యే= త్రైలోక్యము = (త్రిలోక్యేవ త్రైలోక్యమ్= త్రిలోకీ+ణ్యా=త్రైలోక్+య) రాముఁడే=రామకుఁడు=(రామ ఏవ=రామకః = రామ + కణ్) స్వార్థిక ప్రత్యయాంతములు పూర్వలింగములే యగును.

"అజ్ఞాతే-కుత్సితే చైవ సంజ్ఞాయా మనుకమ్పనే తద్యుక్తనీతా వప్యల్పే వాచ్యే హ్రస్వేచ కః స్మృత అను నర్థములందు 'క' ప్రత్యయము వచ్చును ఎవ్వరిదో తెలియని యశ్వము=అశ్వకము కుత్సితమైన యశ్వము=అశ్వకము=(అజ్ఞాతః కుత్సితోవా అశ్వః=అశ్వకః) అనుకంపన -పుత్రకుఁడు హ్రస్వ -చిన్నచెట్టు = వృక్షకము=(హ్రస్వో వృక్షః=వృక్షకః) అల్ప -అల్పమగు తైలము = తైలకము=(అల్పం తైలమ్ = తైలకమ్) (సి-కౌ-౨౦౭౫-మొ ౨౦౩౭-వ ౨౦౪౦- ౨౦౪౧ సూ)

వికారేత్యాది సూత్రములోని యాది శబ్దముచేత -శివుఁడిష్ట దైవముగాఁ గలవాఁడు=శైవుఁడు=(శివో దేవతా అస్య=శైవః = శివ+ ణ్ణ) శక్తి దేవతగాఁ గలవాఁడు=శాక్తేయుఁడు=(శక్తి ర్దేవతా అస్య- శక్తి+ణ్ణేయ). పశుపతి దేవతాకము = పాశుపతము =(పశుపతి ర్దేవతా అస్య=పాశుపతమ్=పశుపతి+ణ్ణ) ఇట్లే-ఐంద్రము (సి-కౌ-౧౨౭౬ సూ).

అపూపములు దీనికి వెల=ఆపూపికము=(అపూపా అస్య పణ్యమ్=అపూపశ్+ష్ఠక) (సి-కౌ-౧౬౦౧సూ) మృదంగ వాదనమున నేర్పు గలవాఁడు=మార్దంగికుఁడు=(మృదఙ్గ వాదనే శిల్పమస్య మార్దఙ్గికః=మృదఙ్గ+ష్ఠక) (సి-కౌ-౧౬౦౫ సూ) ధనుస్సు ప్రహరణసాధనముగాఁ గలవాఁడు=ధానుష్కుఁడు = (ధనుః ప్రహరణసాధన మస్య=ధానుష్కః=ధనుస్+కఙ్)-(సి-కౌ-౧౬౦౭సూ) గురుని దోషముల నావరించువాఁడు(ఛత్రమువలె)=ఛాత్రుఁడు=(గురో ర్దోషావరణే ఛత్రవత్ శీలమస్య=ఛాత్రః ఛత్ర+ణ్ణ) (సి-కౌ-౧౬౧౧ సూ). ఆకరమున నియుక్తుఁడు. (రత్నాదుల గని=ఆకరము)=ఆకరికుఁడు (ఆకర+ష్ఠక)(సి-కౌ-౧౬౨౦సూ). సర్వభూమీశ్వరుఁడు = సార్వభౌముఁడు=(సర్వభూమే రీశ్వరః=సార్వభౌమః=సర్వభూమి+ణ్ణ) (సి-కౌ-౧౭౦౮ సూ)

3 వివ :-'క ప్రత్యయమునకు సంస్కృతమున మిక్కిలి వ్యాప్తి గలదు స్వార్థమందు క'' ప్రత్యయమగునని పైని వివరింపఁబడెను క కావించు విచిత్రవీర్యకక్షేత్రములన్ (భార-ఆది-ర ఆ ౨3౮) (విచిత్రవీర్యుఁడె విచిత్రవీర్యకుఁడు)

ఈకారాంతోకారాంతములగు (నదీసంజ్ఞగల) శబ్దములకును ఋదంతశబ్దములకును బహువ్రీహిలోఁ దుదిని 'క' ప్రత్యయమగును. ఉదా -పూజిత గౌరీకుఁడు బహుకర్తృకము (చూ-సమా-౨౫ సూ ౨ వివ) బహువ్రీహిని దుదిని క' ప్రత్యయము వైకల్పికముగా నగును ఉదా -మహాయశస్కుఁడు=మహాయశుఁడు. మొ (చూ-ప్రౌ-పరి-౭౫I వివ ౧౨IV వివ ర౬ పుట) (ముగ్ధ ర3౬ సూ. దుర్గాదాసవ్యాఖ్య రర౮ పుట) అజ్ఞాతే కుత్సితే..' మున్నగు శ్లోకము మీఁద వివరింపఁబడెను. సంజ్ఞాయామ్-దేవదత్తకః .. అనుకమ్పాయుక్తనీతౌ-గుప్తకమ్- (ముగ్ధ-వ్యా- శ్రీరామతర్క. ర౫౨-ర౫3 పుటలు).

ర వివ :-'క' ప్రత్యయ పరకత్వమున ఆ-ఈ-ఊ-ఋ' అను

దీర్ఘాచ్చులు హ్రస్వములగును. బహువ్రీహి సమాసమున వైకల్పికముగా నగును. (సి-కౌ-౮౩౪ సూ) ఉదా:-కన్యక. (కన్యాకా= కన్యకా.) బహువ్రీహి-సుకన్యకుఁడు. సుకన్యాకుఁడు.

కొన్ని యెడల స్థలాంతరములందును హ్రస్వమగును ఉదా - కాళిదాసుఁడు-వైదేహీబంధుఁడు రతిదూతిపదము మొ (ముగ్ధ ౪౩౭ సూ. దుర్గా-వ్యా ౪౫౬ పుట) (చూ-సమా-౨౬౩ సూ)

భావార్థమున త్వ-త' అను ప్రత్యయములగును
త్వాంతము నపుంసకము, తాంతము టాబంతము
నగును ౧౩ (ముగ్ధ ౪౩౮ సూ) (సి-కౌ-౧౭౮౧ సూ)

ఇచటి భావము "ప్రకృతిజన్యబోధంబునఁ బ్రకారంబు= ప్రవృత్తి నిమిత్తము ఉదా -గురువుయొక్క-భావము=(ధర్మము) గురుత్వము=గురుత = గౌరవము-(తద్ధి ౧౨ సూ చూపఁబడెను)- గురోర్భావః = గురుత్వమ్ = గురుతా-గౌరవమ్) ఇట్లే-బ్రాహ్మణత్వము= బ్రాహ్మణత=బ్రాహ్మణ్యము మొ. (సి-కౌ-౧౭౮౮ వ్యాఖ్య) ఇట్లే ఆధిక్యము=అధికత్వము=అధికత మొ )

త్వాదిపరకత్వమున భాషితపుంస్కములకుఁ బుంవ
ద్భావమగును (త్వ-తా-తర-ఇమన్- మొ) అందలి
'త్వ-త' లు పరమగునపుడు జాతి సంజ్ఞావాచకములకుఁ
బుంవద్భావము లేదు. ౧౪ (ముగ్ధ ౩౨౭-౩౫౦సూ)
(సి-కౌ-౮౩౬ సూ)

సాధ్వియొక్క-భావము (ధర్మము) = సాధుత్వము = సాధుత = (సాధ్వ్యా భావః = సాధుత్వమ్ = సాధుతా) జడయొక్క-భావము. (ధర్మము) జడత్వము=జడత=(జడాయా భావః=జడత్వమ్ = జడతా). షష్ఠియొక్క-భావము=షష్ఠత్వము=షష్ఠత=(షష్ఠ్యా భావః=షష్ఠత్వమ్= షష్ఠతా.) జాతిసంజ్ఞా - బ్రాహ్మణియొక్క భావము=బ్రాహ్మణీత్వము=బ్రాహ్మణీత=(బ్రాహ్మణ్యా భావః=బ్రాహ్మణీత్వమ్=బ్రాహ్మ

ణీతా) అనసూయాత్వము=అనసూయాత=(అనసూయాయా భావః=అనసూయాత్వమ్=అనసూయాతా)

త్వాదులు "- త్వ-తా-తర-తమ =ఇమన్-ఇష్ఠ-ఈయసు-కల్ప-శస్-రూప-చతరామ్ - చతమామ్-దేశ్య- దేశీయ-బహు-పాశ-చర" ఇవి త్వాదులు

క వర్గమునకంటెను 'అ' వర్ణేతరాచ్చులకంటెను, 'హ-య-వ-ల'ల కంటెను బరమైన పదమధ్యగతమగు ప్రత్యయాగ మాదేశసంబంధి సకారము 'ష' కారమగును నుణ్ - విసర్గ - వ్యవధానమున్నను నీ ష' త్వము గల్గును ప్రాతిపదికముయొక్క దీర్ఘముకానట్టి యిక్కులకుఁ బరమగు 'స' కారము తద్ధిత థ' కార పరకత్వమున 'ష' కారమగును ౧౫ (ముగ్ధ-౧౧౧-౮౩౯ సూ) (సి-కౌ-౨౧౦-౨౧౧-౨౧౨-౮౩౮-౧౩౨౫ సూ)

యుజుస్సుయొక్క భావము=యుజుష్ట్వము=(సమా ౬౬సూ-చూడు) (యజుషోభావః=యజుష్ట్వమ్ యజుస్=యజుష్+త్వమ్=యజుష్ట్వమ్. సమా ౩౯ సూ. చొప్పున త' కారము టకారమగును) మాటలయొక్క (గీర్=మాట) భావము=గీస్త్వము=(గిరో భావః=గీస్త్వమ్) (ధాతువుయొక్క ఇకుక'లకు విసర్గ రేఫ పరకత్వమున దీర్ఘమగును గిర్=గీర్=గీః ధుర్=ధూర్=ధూః)

ఈ షదూనార్థమున "కల్ప"- ప్రత్యయ మగును.

౧౬ (ముగ్ధ-౮౭౭ సూ) (సి-కౌ-౨౦౨౨ సూ).

ఈ యర్థమున దేశ్య-దేశీయ' ప్రత్యయములును నగును. ఉదా -ఈషదూనముగా విద్వాంసుఁడు=విద్వత్కల్పుఁడు = విద్వద్దేశ్యుడు=విద్వద్దేశీయుఁడు ఈ షదూనముగా దీర్ఘము=దీర్ఘకల్పము=దీర్ఘదేశ్యము=దీర్ఘదేశీయము ఇవి పరమగునపుడు భాషితపుంస్కము

లకుఁ బుంవద్భావమగును. (సమా-౧౧-౨౪ సూ). (సం-త-౧౪ సూ). విదుషి కించుక తక్కువ=విద్వత్కల్ప=(చూ-సమా-౪౦ సూ) (విద్వస్' వసు ప్రత్యయాంతము-సకారాంతము.)

౧ వివ :-సంస్కృతమున నవ్యయములగు వతి' ప్రత్యయాంతములు గలవు గాని యట్టి యవ్యయములు తెల్గున నిల్వనేరవు. (ముగ్ధ ౪౪౦) (సి-కౌ-౧౭౭౮-౧౭౭౯ సూ) ఉదా :-కృష్ణఇవ= కృష్ణవత్ భాతి. కృష్ణమివ = కృష్ణవత్ మన్యే క అల తద్ధితముల యందుం దెలియ వతి ప్రత్యయంబు దెలుఁగున లేమిం గలిగిన 'కల్ప' ప్రత్యయ మలరుచు నయ్యర్థియంద యది గనుపట్టుః' (నరస-౫ ఆ. ౧౧ ప.)

అస్త్యర్థమున 'మతు ప్రత్యయ మగును. ౧౭.
(ముగ్ధ-౪౪౧ సూ) (సి-కౌ-౧౮౯౪ సూ).

ఇందలి ఉ' కారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము (దీర్ఘాదులు వచ్చుననియుఁ దెల్పును శ్రీమాన్-మొ). (తత్స ౮౯. సూ) శ్రీమంతుఁడు=(శ్రీ రస్తి యస్యాసౌ= శ్రీ+మత్=శ్రీమత్ శ్రీమాన్-ఏవం-విదుష్మాన్-దోష్మాన్-ఇట్లు-విదుష్మంతుఁడు=(విద్వాంసుఁడు). దోష్మంతుఁడు=(బహుబలశాలి) స్త్రీలింగమున.-శ్రీమతి-విదుష్మతి-(విదుషి)-దోష్మతి-మొ.

౧ వివ :- 'భూమ నిన్దా ప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే సంసర్గేస్తి వివక్షాయాం భవన్తి మతుబాదయః దీనికి వరుసగ నుదాహృతులు :-భూమ=అనేక :-గోమంతుఁడు = (పెక్కు గోవులు గలవాఁడు) నిన్దా -పాపి=(మిక్కిలి పాపాత్ముఁడు). ప్రశంసా :-రూపవంతుఁడు=(ప్రశస్తమగు రూపముగలవాఁడు). నిత్యయోగ .-క్షీరవంతము = (పాలుగల వృక్షము). అతిశాయన :-ఉదరవతి = (పెద్ద కడుపుగల కన్య). సంసర్గ -ఛత్రీ = (గొడుగుగల పురుషుఁడు). (పురుషుఁడుగలది ఛత్రీ మనరాదు).

౨ వివ :—అస్త్యర్థక ప్రత్యయముపైని భిన్నరూపముకాని యస్త్యర్థక ప్రత్యయము నిల్వదు. ఉదా – ధనవద్వంతుఁడు' అన రాదు. ధనిమంతుఁడు' అనవచ్చును.

3 వివ —బహువ్రీహిపయిని సయితము మత్వర్థీయ మతిశయాద్యర్థ విశేషబోధకమై నిల్వవచ్చును. ఉదా -తరుణజ్వరి=(తరుణజ్వర మధికముగాఁ గలవాఁడు) కోకప్రీతి చకోర పారణపటు జ్యోతిష్మతీలోచనే (అనర్ఘరాఘవము)

౪ వివ – శుక్లము=(శుక్లతగల). కృష్ణము=(కృష్ణతగల) -ఇత్యాదులందు మత్వర్థీయము నిల్వనక్కఱలేదు. రసవంతము' అని వాడుదురు కాని రసి' అని వాడుటలేదు

మకారోపధకములకును అ'కారోపధకములకును, మకారాంతములకును, అ' కారాంతములకును, ఝయ్' ప్రత్యాహారాంతములకును నస్త్యర్థమున 'వతు' ప్రత్యయ మగును. యవాదులకు 'మతు' ప్రత్యయమే యగును. ౧౮. (ముగ్ధ-౪౪౨ సూ) (సి-కౌ-౧౮౯౭-౧౮౯౮ సూ).

మకారోపధక --లక్ష్మీవంతుఁడు = (లక్ష్మీ+వత్ =లక్ష్మీవాన్) -అకారోపధక -యశస్వంతుఁడు = (యశస్వాన్) మకారాంత .-కింవంతుఁడు=(కింవాన్) అకారాంత -జ్ఞానవంతుఁడు = (జ్ఞానవాన్). తపరకణము లేమింజేసి 'ఆ'కారాంతములకు ఆ కారోపధకములకును 'వతు' ప్రత్యయ మగును. ఆకారాంత -విద్యావంతుఁడు = (విద్యావాన్). ఆకారోపధక -భాస్వంతుఁడు=(తేజస్సు గలవాఁడు)= (భాస్వాన్) 'ఝయ్' ప్రత్యాహారాన్త -విద్యుత్వంతుఁడు = (మెఱపులుగల మేఘుఁడు) (విద్యుత్వాన్). యవాది -యవమంతుఁడు (ధాన్యముగలవాఁడు) (యవమాన్). యవాదులు '-యవ-ఊర్మి= (తరంగ)-భూమి-కృమి = (పురుగు)-కకుత్ = (ఎద్దు మూపురము)-కకు

భ్ = (దిక్కు)-హరిత్ = (దిక్కు)-మరుత్ = (గాలి)-గరుత్ =(ఱెక్క) ఇత్యాదులు. యవాదులు అ కారాంతములు 'ఊర్మి మున్నగునవి మకారోధకములు 'కకుత్ మున్నగునవి ఝయ్' ప్రత్యాహారాంతములు.

౧ వివ .—సంజ్ఞావాచకములు వత్వంతము లగును ఉదా ఉదన్వంతుఁడు=(సముద్రుఁడు) = (ఉదన్వాన్) (ఇది అ కారోపధకము-ఉదకశబ్దము అ'కారాంతము). చర్మణ్వతి = (ఒకానొక నది) (చర్మణ్వతీ) (ఇదియు అ కారోపధకమె) రాజన్వతి=(మంచిరాజు గల భూమి) (రాజన్వాన్-రాజన్వతీ) (ఇదియు అ'కారోపధకమె).

అనేకాచ్చులుగల దానికిని అ వర్ణాంతములకును
న స్త్యర్థమున ఇన్' ప్రత్యయము వైకల్పికముగ
నగును. ౧౯. (ముగ్ధ-౮౮౮ సూ) (సి-కౌ-౧౯౨౨సూ)

(వ్రీహి+ఇన్=వ్రీహీ)=వ్రీహి=(ధాన్యముగలవాఁడు). జ్ఞాని= (జ్ఞానముగలవాఁడు) = (జ్ఞాన+ఇన్=జ్ఞానీ) శిఖి = (శిఖగలవాఁడు)= (శిఖా+ఇన్=శిఖిన్=శిఖీ) మాలి=(మాలగలవాఁడు)=(మాలా+ఇన్= మాలిన్=మాలీ). వైకల్పికమగుటచేతఁ వ్రీహిమంతుఁడు-జ్ఞానవంతుఁడు-మున్నగు రూపములు నగును.

౧౯ వివ .— అస్' అనునది తుదినిగల శబ్దములకును, స్రజ్మేధా మాయా శబ్దములకును విన్ ప్రత్యయ మస్త్యర్థమున వికల్పముగా నగును. ఉదా :-యశస్వి=(కీర్తిగలవాఁడు) (యశస్+విన్=యశస్వీ). స్రగ్వి=(పూలమాలిక గలవాఁడు)=(స్రజ్+విన్=స్రగ్వీ) మేధావి= (ధారణావంతమగు బుద్ధిగలవాఁడు)=(మేధా+విన్=మేధావీ). మాయావి=(మాయగలవాఁడు)=(మాయా+విన్=మాయావీ) ఇవియు వైకల్పికములై కాన "యశస్వంతుఁడు-మేధావంతుఁడు" మున్నగునవియును సాధువులె.

శంభ-కంభాదులు పెక్కు మత్వర్థీయములు 'భ'
ప్రత్యయాంతాదులు ప్రయోగవేద్యములు ౨౦.

(ముగ్ధ-౪౪౫ మొ ౪౪౭ వ) (సి-కౌ-౧౯౧౪ మొ)

శంభము=(మాంగళ్యముగల)=(శమ్+భః=శమ్భః) కంభము=
(మూర్ధముగల)=(కమ్+భః=కమ్భః)=(స్తంభము) సుఖ-శీర్ష-జలేషు'
'కమ్'(విశ్వప్రకాశః)(సి-కౌ-౧౯౪౪). స్వామి=(స్వ+మిన్=స్వామీ)
(సి-కౌ-౧౯౩౨సూ) రజస్వల=(రజస్సుగలది = ముట్టుది)=(రజస్+
వల=రజస్వలా) కృషీవలుఁడు=(వ్యవసాయదారు)=(కృషీ+వల=కృషీ
వలః)(సి-కౌ-౧౯౧౯సూ) మధురము=(మధు+ర=మధురః)(సి-కౌ-
౧౯౧౪ సూ). కేశవుఁడు=(మంచి కొప్పుగల విష్ణువు) = (కేశ+వ =
కేశవః) (సి-కౌ-౧౯౧౬ సూ) శాృద్ధము=(శ్రద్ధగల)=(శ్రద్ధా+అ)
(సి-కౌ-౧౯౦౭ సూ) పణినుఁడు=(పాణినితండ్రి) పణ=వ్యవహారము
గల)=(పణ+ఇన=పణినః) (సి-కౌ-౧౯౨౭ సూత్రమునొద్ద (ఫల
బర్హాభ్యామినచ్) 'పణ శబ్దాదులు నుండవలెను) వాగ్మి=(వాక్చా
తుర్యగల)=వాచ్+మిన్=వాగ్మీ) (సి-కౌ-౧౯౩౦) వాచాలుఁడు=
(వాగ్మి)=(నిపాతము) (సి-కౌ-౧౯౩౧). (వీని కర్త్రర్థమే కాక
యర్థవిశేషములును గలవు

౧ వివ - తా మున్నగు ప్రత్యయములు సమూహార్థకములు.
ఇందు వాతూల' శబ్దము మాత్రము పుంలింగము. తక్కిన యీసమూ
హార్థకములెల్ల స్త్రీలింగములు. ఉదా -జనత=(జనసమూహము)=
(జనతా). ఇట్లె గ్రామత-బంధుత-గజత-మొ ఖలిని=(దుర్జనసమూ
హము)=(ఖల+ఇన్ = ఈ) ఇట్లె హలిని=(హలసమూహము) మొ
గోత్ర=(గోవులసమూహము)=(గో+త్రా)=గోత్రా) రథకడ్య = (రథ
ములసమూహము)=(రథ+కడ్యా=రథకడ్యా) వాతూలము=(వాయు
సమూహము)=(వాత+ఊల=వాతూలః) వాత్య = (వాయుసమూహ
ము)=(వాత+య+ఆ=వాత్యా-)

పూరణార్థమున నీ క్రిందిరీతిని రూపసిద్ధి గల్గును.
'ద్వి' శబ్దమునకు 'ద్వితీయ' అనియు 'త్రి' శబ్దము

నకు తృతీయ' అనియుఁ బూరణార్థకములు నిల్చును. 'చతుర్-షష్' శబ్దములకు థట్' ప్రత్యయమగును సంఖ్యావాచకశబ్ద మాదియందు నిల్వని న కారాంతముల పయిని 'మట్' ప్రత్యయము నిల్చును 'షష్టి-సప్తతి-అశీతి-నవతి' శబ్దములపైని 'తమట్' ప్రత్యయము నిల్చును శత శబ్దముపైని నిత్యముగాను వింశత్యాదులపైని వికల్పముగాను తమట్' ప్రత్యయము నిల్చును తక్కినయెడల సంఖ్యావాచకములపైని 'డట్' ప్రత్యయము నిల్చును ౨౧ (ముగ్ధ-౮౫౦ మొ. ౮౫౭ వ సూ) (సి-కౌ-౧౮౪౯ మొ ౧౮౫౮-వ సూ)

సంఖ్యను పూరించునది' పూరణార్థకము 'ద్వితీయ' అనునది ద్విత్వ' సంఖ్యను బూరించుచున్నదిగదా 'ఏక' శబ్దముపైని బూరణార్థక ప్రత్యయము నిల్వదు ప్రథమాదిశబ్దములె వాడఁబడును 'డ' కార 'ట' కారములు పైవానిలో నిద్వర్ణములు డ' కారము టి' లోపమును దెల్పును అంత్యాచ్చు మొదలుగాన్నది టి' సంజ్ఞగలది. టకారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును (చూ-తత్స-౧౦౦ సూ) ఉదా. ద్వితీయుఁడు-ద్వితీయము-ద్వితీయ (స్త్రీ-ద్వితీయా) (రెండవది) తృతీయుఁడు-తృతీయము-తృతీయ-(స్త్రీ-తృతీయా) (మూఁడవది) చతుర్థుఁడు-చతుర్థము-చతుర్థి-(స్త్రీ-చతుర్థీ) (నాల్గవది) పంచముఁడు-పంచమము-పంచమి- (స్త్రీ-పఞ్చమీ) (ఐదవది) షష్ఠుఁడు-షష్ఠము-షష్ఠి (స్త్రీ-షష్ఠీ) (ఆఱవది) సప్తముఁడు-సప్తమము-సప్తమి (స్త్రీ-సప్తమీ) (ఎడవది) అష్టముఁడు-అష్టమము-అష్టమి-(స్త్రీ-అష్టమీ) (ఎనిమిదవది) నవముఁడు-నవమము-నవమి-(స్త్రీ-నవమీ) (తొమ్మిదవది). దశముఁడు-దశమము-దశమి (స్త్రీ-దశమీ) (పదవది). ఏకాదశుఁడు—

ఏకాదశము-ఏకాదశి (స్త్రీ-ఏకాదశీ) (పదునొకండవది) ద్వాదశుఁడు-ద్వాదశము-ద్వాదశి (స్త్రీ-ద్వాదశీ) (పం(డెండవది) త్రయోదశుఁడు-త్రయోదశము-త్రయోదశి (స్త్రీ-త్రయోదశీ) (పదుమూఁడవది) మొ. వింశతితముఁడు-వింశతితమము-వింశతితమి (స్త్రీ-వింశతితమీ) వింశుఁడు-వింశము-వింశి (స్త్రీ-వింశీ) (ఇరువదవది). త్రింశత్తముఁడు-త్రింశత్తమము-త్రింశత్తమి (స్త్రీ-త్రింశత్తమీ) త్రింశుఁడు-త్రింశము-త్రింశి (స్త్రీ-త్రింశీ) (ముప్పదవది) మొ షష్టితముఁడు-షష్టితమము-షష్టితమి-(స్త్రీ-షష్టితమీ) (అఱువదవది) శతతముఁడు-శతతమము-శతతమి (స్త్రీ-శతతమీ) (నూఱవది) మొ

౧ వివ:-కతిథము-కతిథి (స్త్రీ-కతిథీ)=(ఎన్నవది) కతిపయథము కతిపయథి-(స్త్రీ-కతిపయథీ)=(కొన్నిటిది) బహుతిథము-బహుతిథి (స్త్రీ-బహుతిథీ)=(అనేకకాలపుది). తుర్యము = తురీయము=(కొనది)

ప్రకారార్థమున సంఖ్యావాచకములపైని ధాచ్ ప్రత్యయమును, సర్వనామములపైని థాచ్ ప్రత్యయమును నగును. ౨౨ (ముగ్ధ-౮౫౮-ధాచ్ ౫౬౩ థాచ్) (సి-కౌ-౧౯౮౮-౧౯౭౧ సూ).

ఇందలి చకార మవ్యయ మిదియని తెల్పు నిదర్శనము. ఏకధా=ఐకధ్యమ్. ద్విధా=ద్వైధమ్=ద్వేధా త్రిధా=త్రైధమ్=త్రేధా షడ్ధా=షోఢా (ముగ్ధ ౮౫౯). (సి-కౌ-౧౯౯౦-౧౯౯౧-౧౯౯౨ సూ).

౨ వివ - ద్వి-అస్మద్-యుష్మద్' అను సర్వనామములకు 'థాచ్' ప్రత్యయము లేదు.

౩ వివ:-బహు శబ్దముపైని ప్రకారార్థమున 'ధాచ్-థాచ్ ప్రత్యయములు రెండును రావచ్చునని తోఁచును ఉదా -బహుధా-బహుథా శబ్దస్తోమ మహానిధి-శబ్దార్థచింతామణి' మున్నగు ప్రామాణిక కోశములలో వర్గచతుర్థమగు 'ధాచ్' ప్రత్యయము మాత్రమె చూపఁబడెను.

" తేన సంఖ్యా వాచకేభ్యః డత్యతు బహుగణేభ్యశ్చ ధాచ్ స్యాత్ ప్రకారే (ముగ్ధ-దుర్గా-వ్యా-౮౫౮-సూ) "తేన సి)=(సర్వనామ) బహుభ్యశ్చ ధాచ్ స్యాత్ ప్రకారే (ముగ్ధ-దుర్గా-వ్యా-౫౨౩ సూ)

కిం సర్వనామ బహుభ్యో విశేష విహితేనాపి ధాలో (తత్వ బో-౨౯౬ పుట)

సంఖ్యావాచకములకు అవయవార్థమున 'తయట్'
ప్రత్యయ మగును ౨౩ (ముగ్ధ-౭౬౦ సూ) (సి-కౌ-
౯౮౮౩-౧౮౮౮ సూ)

ఇందలి టకార మిద్వర్ణము ఇది స్త్రీత్వమున ఈ' ప్రత్యయమగు నని తెల్పును. (తత్స-౧౦౦ సూ) ఉదా -ద్వితయము- ద్వితయి (సంస్కృ-ద్వితయమ్-స్త్రీ-ద్వితయీ) త్రితయము-త్రితయి (సంస్కృ-త్రితయమ్-స్త్రీ-త్రితయీ.)

౧ వివ -ద్వితయము=ద్వయము ద్వితయి=ద్వయి త్రితయము= త్రయము. త్రితయి = త్రయి. (రూపాంతరములును గలవు) ఉభయము'అను నిత్యరూపమె వెలయుచున్నది(రెండు) )(సి-కౌ-౧౮౮౫సూ)

రెండిటిలో నొకటి కతిశాయన మర్థమగునపుడు
తర ప్రత్యయమును, ననేకములలో నొకటి కతిశాయన
మర్థమగునపుడు తమ' ప్రత్యయమును నగును ౨౮.
(ముగ్ధ-౮౬౨ సూ) (సి-కౌ-౨౦౦౭-౨౦౦౫ సూ)

ఇందలి యతిశాయన ముత్కర్షాపకర్షములు రెంటిలో దేని కయినం గావచ్చును తరాది' ప్రత్యయపరకత్వమందును భాషిత పుంస్కములకుఁ బుంవద్భావము వచ్చును (చూ-సం-త-౧౮ సూ సమా ౧౧-౨౮ సూ) ఉదా -విద్వత్తమ-స్త్రీ = (విదుషీతమా) ఈ స్త్రీ లందఱిలో నీమె విదుషి యన్ని యర్థము. ఇట్లె సాధుతర-సాధుతమ-యోగ్యతర-యోగ్యతమ ( ఈ స్త్రీలలో నీమె యోగ్యురాలు" అనురీతి నర్థము నెన్నునది )

తరాదులు -తర-తమ-ఇష్ఠ-ఈయస్-కల్ప-ఇమన్- మొ (చూడు-ముగ్ధ-3_౨౭-సూ-దుర్గా-వ్యాఖ్య )

౧ వివ - వీరిద్దఱిలో నీతఁడు ఉత్తరుఁడు' అను వాడుక గన్పట్టదు.

౨ వివ -' కిం-యద్-తద్-ఏక-అన్య''అను శబ్దములకు డతర-డతమ ప్రత్యయములగును. అనఁగా టి' లోపము గల్గునని యభిప్రాయము. వీరిద్దఱిలోఁ గతరుఁడు రాముఁడు వీరందఱిలోఁ గతముఁడుత్తముఁడు అన్యతరుఁడు-అన్యతముఁడు మొ (ముగ్ధ ౫౧౦ సూ.) (సి-కౌ-౨౦౮౭-౨౦౮౮-౨౦౮౯ సూ )

గుణవాచకములపై (గుణవద్వాచకములపై) నతిశాయనమాత్రి మర్థమగునపుడు ఇష్ఠ-ఈయస్ ' ప్రత్యయములు వైకల్పికముగ నగును. ౨౫. (ముగ్ధ-౮౬౬ మొ-౮౭౮వ)(సి-కౌ-౨౦౦౧-౨౦౦౫-౨౦౦౬-౨౦౦౮ ౨౦౧౬-౧౭౮౬-౨౦౨౦ సూ.)

గరిష్ఠము=గరీయము (గురుశబ్దమునకు గరాదేశము ) పక్షమున 'గురుతరము-గురుతమము' అనియు నుండును

౧ వివ - తర' ప్రత్యయమునకు 'ఈయస్' ప్రత్యయము సమమనియు తమ' ప్రత్యయమునకు ఇష్ఠ' ప్రత్యయము తుల్యమనియుఁ బాణినీయులు చెప్పుదురు గాని 'తర-తమ ప్రత్యయములకువలె 'ఇష్ఠేయస్' ప్రత్యయముల కర్థభేదము మహాకవి ప్రయోగములలో నగపడమింజేసి ముగ్ధబోధకారుఁ డిట్లు మార్చి చెప్పెను

౨ వివ - ఇష్ఠేయస్" ప్రత్యయములు పరమగునపుడు ప్రకృతికి వివిధములగు నాగమాదేశ లోపాదులు గల్గును వానిని మహాకవి ప్రయోగములనుబట్టి యెఱుంగనగును టిలోపము - లఘిష్ఠము=లఘీయము. (మిక్కిలి లఘువైనది) మత్వర్థీయలోపము - మతిష్ఠము=(మిక్కిలి గొప్ప మతిగలది). మేధిష్ఠము=(మిక్కిలి గొప్ప మేధ (బుద్ధి)

గలది) వీనియందు 'టి' లోపమును గలదు. తృన్ ప్రత్యయలోపము - కరిష్ఠము = (మిక్కిలి గొప్పకర్త) ఆదేశాదులు - గరిష్ఠము = గరీయము=(మిక్కిలి గురువు) (గురుశబ్దమునకు గరాదేశము) నేదిష్ఠము= (మిక్కిలి యంతికము) (అంతిక=సమీప) ద్రాఘిష్ఠము (మిక్కిలి దీర్ఘము) శ్రేష్ఠము=(మిక్కిలి ప్రశస్యము) జ్యేష్ఠుడు=(మిక్కిలి పెద్ద వాడు=మిక్కిలి ప్రశస్యుడు) ద్రఢిష్ఠము (మిక్కిలి దృఢమైనది). కనిష్ఠుడు=(మిక్కిలి చిన్నవాడు. మిక్కిలి యల్పుడు) భూయిష్ఠము= (బహుశబ్దమూలకము)=భూయము=భూయాంసము-భూమము-మొ

గుణవాచకముపైని (గుణవద్వాచకముపైని) భావార్థమున వైకల్పికముగా ఇమన్" ప్రత్యయ మగును.
౨౬ (ముగ్ధ-౪౭౫ సూ) (సి-కౌ-౧౭౮౪)

లఘిమము (సంస్కృ-లఘు+ఇమన్ = లఘిమా) ఇమన్" ప్రత్యయ పరకత్వమందును టి' లోపమగును. ఇట్లె-గరిమము-అణిమము నీలిమము. పక్షమున లఘుత లఘుత్వము లాఘవము నీలిమము = నీలిమ=నీలత్వము=నీలత=నైల్యము (నీల+ఇమన్+నీలిమన్).

౧ వివ -రూపాది గుణవాచకములపై ఇమన్' ప్రత్యయము నిల్వదు ఉదా:-రూపత్వము=రూపత రసత్వము-రసత-గంధత్వము-గంధత మొ

౨ వివ -పృథ్వాది శబ్దములమీద ఇమన్' ప్రత్యయము వికల్పముగా నిల్చును-ఋవర్ణము రేఫమగును ఉదా -ప్రథిమము=(పృథు+ఇమన్=ప్రథిమా) ద్రఢిమము=దార్ఢ్యము=దృఢత్వము=దృఢత=(దృఢ+ఇమన్+ద్రఢిమా=దార్ఢ్యమ్=దృఢత్వమ్ మొ) ఇట్లె క్రశిమము=కార్శ్యము=కృశత్వము మ్రదిమము=మృదుత్వము పటిమము=పటుత్వము చండిమము=చండత్వము-మహిమము-మహత్త్వము-భూమము = బహుత్వము-మొ.

భూత పూర్వార్థమున 'చరట్' ప్రత్యయ మగును.
౨౭. (ముగ్ధ-౪౭౦ సూ) (సి-కౌ-౧౯౯౯)

(సంస్కృ-తద్ధి ౨౭-౨౮-౨౯-30 సూ , చర-శస్-కృత్వస్-సుచ్-మయ'' ప్రత్య.

జ్ఞాతచరము (పూర్వము తెలిసినది) టిత్తుగాన స్త్రీత్వమున ఈ ప్రత్యయము వచ్చును. జ్ఞాతచరీ. (తత్స ౧౦౦ సూ) (జ్ఞాత+చరట్ = జ్ఞాతచరః )

బహ్వాల్పార్థశబ్దముల కారకములపైని సంఖ్యావాచకములపైని వీప్సార్థమున 'చశస్' ప్రత్యయమగును ౨౮ (ముగ్ధ-౪౮-౨-౪౮3 సూ) (సి-కౌ-౨౧౧౯-౨౧౧౦ సూ).

ఇందలి చ' కార మిద్వర్ణము. ఏతత్ప్రత్యయాంత మవ్యయమగునని తెల్పును ఉదా -బహుశః-అల్పశః-ద్విశః-త్రిశః ఇది సంస్కృతావ్యయముగానఁ దెల్గున వాడుకలేదు సిద్ధసమాసములలో నిల్వవచ్చును. బహుశోదానము శ్రేయము

వారార్థమున 'చకృత్వస్' ప్రత్యయమగును ద్వి-త్రి-చతు' శ్శబ్దములపైని సుచ్' ప్రత్యయము నిల్చును ౨౯ (ముగ్ధ-౪౮౪-౪౮౫ సూ) (సి-కౌ-౨౦౮౫-౨౦౮౬ సూ.)

ప్రత్యయాంత మవ్యయమగునని చ' కారేద్వర్ణము తెల్పును. రెండిటిలోని చ కారములు నిద్వర్ణములె ఉదా - పఞ్చకృత్వో భోజనము = (అయిదుసార్లు భోజనము) (పఞ్చ+కృత్వస్=పంచకృత్వః) సుచ్ -ద్విః=(రెండుసార్లు) ఇవియు నవ్యయములుగానఁ దెల్గున సిద్ధసమాసములలో మాత్రమె నిల్చును. 'త్రిస్సప్త కృత్వో జగతీపతీనాం। హన్తా (భారవి)=ఇరువదియొక్క-మారు (త్రిః+సప్తకృత్వః)

తదూప్రార్థమున మయట్ ప్రత్యయమగును 30 (ముగ్ధ-౪౮౬ సూ) (సి-కౌ-బహ్వర్థములందీ ప్రత్యయము కన్పట్టును ౧౫౨౩-౧౫౨౪-సూ )

ఇందలి ట' కారేద్వర్ణము స్త్రీత్వమున ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును ఉదా -విష్ణుమయము. స్త్రీత్వమున-విష్ణుమయి '(తత్స ౧౦౦ సూ) ఏకాచ్క-మునకు నిత్యము-వాఙ్మయము

ఖ్యాతార్థమున "చుంచు-చణ" ప్రత్యయములగును. ౩౧. (ముగ్ధ-౮౮౫ సూ) (సి-కౌ-౧౮-౭౭ సూ).

విద్యాచుంచువు = విద్యాచణుఁడు=(విద్యచే ఖ్యాతుఁడు) (విద్యయా ఖ్యాతః=విద్యాచుంచుః=విద్యాచణః).

సంజాతార్థమున 'ఇత' ప్రత్యయ మగును. ౩౨. (ముగ్ధ-౮౯౭ సూ) (సి-కౌ-౧౮౩౭ సూ).

ఫలితము=(సంజాతఫలము వనము). తారకితము=(సంజాతతారకము ఆకాశము). పాణినీయులు 'తారకాదులకే యీ ప్రత్యయ మగు నందురు. తారకాదు లాకృతిగణము.

అభూత తద్భావార్థమున 'భూ-కృ-అస్' ధాతు రూపములు పరమగునపుడు 'చ్వి' ప్రత్యయ మగును. చ్వి ప్రత్యయము పరమగునపు డవ్యయేతరశబ్దముల తుది 'అ' వర్ణ, హ్రస్వములకు వరుసగా 'ఈ కార-దీర్ఘము' లగును. ౩౩. (ముగ్ధ-౮౯౫ సూ) (సి-కౌ-౨౧౧౭-౨౧౭౮ సూ).

ఇందలి చకార మిద్వర్ణము. చకారేత్తు 'అవ్యయ' మగును. ఇందలి 'ఇ' కార ముచ్చారణార్థకము. 'వ' కార ప్రత్యయము లోపించును. కాఁగా నిందేమియుఁ బ్రకృతిపై ని నిల్చునది లేదు. "చ్వి-విణ్ (ముగ్ధ ౧౦-౭౫), విట్ (ముగ్ధ-౧౦౩౦), విచ్-క్విప్ (౧౦౩౭)" అను నీ మైదును నిట్టివె. కావున నివి తత్తత్ప్రత్యయాంతము లనిమాత్రము వాడుక గల్గించును ఉదా:- చ్వి:-కృష్ణీకరణము = (కృష్ణుఁడు కాని వానిని గృష్ణునిగాఁ జేయుట)=(అకృష్ణం కృష్ణం కరోతి=కృష్ణ+చ్వి+కరణ). హరీభవనము=(హరి కానివాఁడు హరియగుట). (ఇట దీర్ఘము). మహత్కరణము (అచ్చు తుదిని లేదుగాన 'ఈ' కార దీర్ఘములలో నేదియు లేదు)=(గొప్పవాఁడు కానివానిని గొప్పవానినిగఁ జేయుట). గంగీకరణము=(గంగ కానిదానిని గంగనుగాఁ జేయుట). (ఆకారమును 'అ'

వర్ణమే కాన 'ఈ' కారమయ్యెను.) అవ్యయముల కుదాహృతి :- దివా భూతము, దోషాభూతము. (పగలుగా నయినది. రాత్రిగా నయినది).

౧ వివ :- 'చ్వి' ప్రత్యయ పరకత్వమున 'ఋ' కారము 'రీ' యగును. ఉదా :- మాత్రీకృతి=(తల్లి కానిదానిని దల్లిగాఁ జేయుట). (ముగ్ధ-౪౯౭ సూ). (సి-కౌ-౧౨౩౪ సూ).

౨ వివ :- "మనస్-చక్షుష్-చేతస్-అరుస్-రజస్" అనువానికి 'చ్వి' ప్రత్యయపరకత్వమున నంత్యలోప మగును. ఉదా :- ఉన్మనీభూతము=(ఆవేగముతోఁ గూడునదిగా నగుట.) మొ.

౩ వివ :- అవ్యయమునకు దీర్ఘము రాదని ముగ్ధబోధకర్త సూత్రించెను. పాణినీయులు దీర్ఘము రావచ్చుననిరి. ఉదా :- సాచీకృతము=(అడ్డుగా నుండఁ జేయఁబడినది) ముగ్ధబోధపక్షమున 'సాచి' శబ్ద మంగీకార్యము. "సాచీకృతా చారుతరేణతస్థౌ ముఖేన" (కుమారసం), "వినాయ సాచీకృత చారువక్త్రః" (రఘు) (దుర్గాదాస వ్యాఖ్య-ముగ్ధ).

౪ వివ :- వర్ణములపై ని నిర్దేశాద్యర్థములందు 'కార' ప్రత్యయమును 'ర' వర్ణముపై ని 'ఇఫ' ప్రత్యయమును నిల్చును ఉదా - అకారము-ఇకారము-కకారము-రేఫము మొ. (చూ సంజ్ఞా ౩ సూ.౯,వివ).

సాకల్యముగా నధీన మయ్యెనను నర్థమున 'కృ-భూ-అస్' ధాతురూపపరకత్వమున వికల్పముగ 'చసాత్'-ప్రత్యయ మగును. ౩౪. (ముగ్ధ ౪౯౯ సూ) (సి-కౌ-౨౧౨౨ మొ. ౨౧౨౫ వ) (ఈ సకారమునకు షత్వము లేదు.)

ఉదా :- "అసుర భస్మసాత్ కృతుఁడయ్యెన్" (ఆది ౧, ఆ ౧౩౨ ప) పక్షమున "భస్మీభూతుఁ డయ్యెను" అని మీఁది సూత్రముచొప్పున 'చ్వి' ప్రత్యయము వచ్చును. ఇందలి 'చ' కార మవ్యయత్వాద్యోతక మగు నిద్వర్ణము. షత్వాభావ :- అగ్నిసాత్ కృతుఁ డయ్యెను.

"ఊర్ధ్వపరిమాణార్థమున "దఘ్నట్-మాత్రట్-ద్వయసట్" అను ప్రత్యయములగును. ౩౫. (ముగ్ధ-౫౦౬ సూ) (సి-కౌ-౧౮౩౮ సూ)

ఇందలి 'ట' కారము 'ఈ' ప్రత్యయము వచ్చును స్త్రీత్వమున నని తెల్పు సిద్వర్ణము. (చూ-తత్స-౧౦౦ సూ°). ఉదా :-గజదఘ్నము-గజమాత్రము-గజద్వయసము. 'ఏనుఁగు' ఎత్తు పరిమితి). స్త్రీత్వమున:-గజదఘ్నీ-మొ.

కొన్ని సర్వనామశబ్దములపై నీక్రిందిరీతిని ప్రత్యయములు నిల్చును. వీః వాడుక తెలుఁగున మిక్కిలి యరుదు. కవిప్రయోగైకవేద్యము 3౬. (ముగ్ధ-౫౧౦ మొ. ౫-౨౬ వ.)

౧ వివ :-'తస్' అనునది విభక్త్యర్థమున వగును. ఉదా :-సర్వతోముఖముగ. కృష్ణతోగతి-మొ.

౨ వివ :-సర్వనామములకును, బహుశబ్దమునకును సప్తమ్యర్థమున 'త్ర' ప్రత్యయ మగును. ఉదా:-'సర్వత్ర' నిలింప కామినుల వాడకు (ఆముక్త)

3 వివ :-సర్వదా=సదా = (ఎల్లప్పుడు). ఏకదా = (ఒకప్పుడు). కదా = (ఎప్పుడు). తదానీమ్ = (అప్పుడు). పూర్వేద్యుః = (పూర్వదినమంధు). పరేద్యుః = (పరదినమందు). ఉభయేద్యుః = (రెండుదినములందును). పురస్తాత్ =(ఎదుట). కుతః=(ఏకారణముచేత). క్వ=(ఎక్కడ). కుత్ర=(ఎక్కడ). ఇతః=(ఇచ్చటినుండి). అతః=(అచ్చటినుండి). అత్ర=(ఇక్కడ). ఇహ=(ఇక్కడ-ఈలోకమున). అధునా=(ఇపుడు). ఉపరి=(మీఁదుభాగమున). సద్యః=(తత్‌క్షణము). అద్య=(ఇప్పుడు). ఇత్థమ్=(ఇట్లు). కథమ్=(ఎట్లు). తత్రత్యుఁడు = (అచటనున్నవాఁడు). అద్యతనము=(ఈదినము). దాక్షిణాత్యుఁడు=(దక్షిణదేశస్థుఁడు). పాశ్చాత్యుఁడు=(పశ్చిమదేశస్థుఁడు). ప్రాచ్యుఁడు=(తూర్పుదేశస్థుఁడు-ప్రాచీనుఁడు). ఆదిమము=(మొదటిది). మధ్యమము=(నడిమిది). చిరత్నము (ఇవి సర్వనామములు కావు)=(చిరకాలపుది). కించిత్ = (ఇంచుకంత-ఒకానొకటి). కదాచన=(ఒకప్పుడు). కించన=(ఇంచుకంత)-మొ.

— ఇది సంస్కృత తద్ధిత పరిచ్ఛేదము —

# బాలవ్యాకరణోద్ద్యోతము

## క్రియాపరిచ్ఛేదము

## సంస్కృతక్రియల వివరణము

౧ వివ:-సంస్కృత ధాతువులనుండి యేర్పడిన సంస్కృత సుబ్విభక్తిరూప తిజంతరూపములకుఁ దెలుఁగు వాడుక లేదు. సంస్కృత సుప్పులకువలెనె యీ తిఙ్ఙులకును నాదేశముగాఁ దెలుఁగు డ్వాది విభక్తులు సంస్కృతసమములు నాచ్ఛికములు నగు ధాతువులు రెండు విధములపైని నిల్చును.

౨ వివ :—సంస్కృతధాతువులు ౧-పరస్మైపదములు, ౨-ఆత్మనేపదములు, 3-ఉభయపదములు నని మూఁడు విధములు-ప్రథమాది పురుషములలో "తిప్-తస్-అన్తి" మున్నగు ప్రత్యయములు నిల్చు ధాతువులు పరస్మైపదములు. (భవతి-భవతః-భవన్తి-మొ). ప్రథమాది పురుషములలో "తే = ఆతే = అన్తే" మున్నగు ప్రత్యయములు నిల్చు ధాతువులు 'ఆత్మనేపదములు'. (భూ ధాతువు ప్రాప్త్యర్థమున నాత్మనేపదము. భవతే-భవేతే-భవన్తే-మొ). ప్రథమాది పురుషములలో ద్వివిధ ప్రత్యయములును నిల్చునవి యుభయపదములు. (రాజతి-రాజతః-రాజన్తి. రాజతే-రాజేతే-రాజన్తే-మొ. ఙకార మిద్వర్ణముగాఁగల ధాతువు లాత్మనేపదములు. (ఏధఙ-వృద్ధౌ-మొ). ఞకార మిద్వర్ణముగాఁ గలవి యుభయపదములు. (రాజృఞ్ దీప్తౌ). తక్కినవి పరస్మైపదములు. (భూ సత్తాయామ్-మొ). (ముగ్ధ-౫౩౧ సూ) (సి-కౌ-౨౧౫౫ మొ. ౨౧౫౯ వ.. సూ). ఇవి "ఆత్మనేపదములు". ఇవి 'పరస్మైపదములు నివి యుభయపదములు నని ధాతుపాఠములలో నుండును. ఙకార ఞకారములు కవికల్పద్రుమమున 'ఆత్మనేపదాదుల కిద్వర్ణములుగా' నిలుపఁబడును.

3 వివ :—ఇట్టి ధాతువులపైని "లట్-లిట్-లుట్-లృట్-లేట్-

లోట్-లఙ్-లిఙ్-లుఙ్-లృఙ్" అను సమాపక క్రియా లకారములు నిల్చును. "ప్ర:-తిప్-తస్-అన్తి. మధ్య:-సిప్-థస్-థ. ఉత్త:-మిప్-వస్-మస్" ఇవి పరస్మైపద ప్రత్యయములు. "ప్రథ:-తే-ఆతే-అన్తే. మధ్య:-సే-ఆథే-ధ్వే. ఉత్త:-ఏ-వహే-మహే" ఇవి యాత్మనే పద ప్రత్యయములు. ఈ రెండు విధములును 'లట్' అనుదాని కాదేశములు. ఇట్లే 'లిట్' మున్నగువానికిని ద్వివిధ ప్రత్యయములు నగును. ఈ లడాదులకు ముగ్ధబోధమున 'కీ-ఖి' మున్నగు సంజ్ఞలు గల్పింపఁబడినవి. లట్=(కీ-ముగ్ధ), ఇది తద్ధర్మాద్యర్థకము. "లిట్=(ముగ్ధ-రీ), లఙ్=(ఘీ-ముగ్ధ), లుఙ్=(టీ-ముగ్ధ)" ఇవి మూఁడును భూతార్థకములు. "లుట్=('డీ'-ముగ్ధ), లృట్=(తీ-ముగ్ధ)" అనునవి రెండు లకారములును భవిష్యదర్థకములు. 'లేట్' అనునది వేదమాత్రప్రసిద్ధము. "లిఙ్"=(ఖీ-ముగ్ధ) అనునది విధ్యాద్యర్థకము. "లిఙ్"=(ఢీ-ముగ్ధ) అనునది యాశీరర్థకము. "లోట్"=(గీ-ముగ్ధ) అనునదియు నాశీరర్థకమె. "లృఙ్"=(ధీ-ముగ్ధ) అనునది చేదర్థ గర్భిత భవిష్యదర్థకము.

"లట్, విధ్యాద్యర్థకలిఙ్, లోట్, లఙ్, లుఙ్" అను నైదును శవర్ణమిద్వర్ణముగాఁగల ప్రత్యయమును (శప్-మొ) సార్వధాతుకములు. ('ర'=ముగ్ధబోధ సంజ్ఞ). తక్కిన వెల్ల 'ఆర్ధధాతుకములు=('అర' ముగ్ధబోధ సంజ్ఞ).

ఆర్ధధాతుకములగు పురుషబోధకప్రత్యయములు వికరణము లేక యే ధాతువుపైని నిల్చును. 'శప్'-మొ. వికరణములు. పకారమిద్వర్ణములేని సార్వధాతుక ప్రత్యయములు 'ఙిత్తు'లనిపించుకొనును. లిట్టును, నాశీరర్థక లిఙ్ఙును పకారేత్తులు కానివియును 'కిత్తు' లనిపించుకొనును.

ర వివ :—లడాది లకారముల సిద్ధరూపోదాహృతులు :-

లట్ :-ప్రథ:-భవతి-భవతః-భవన్తి. మధ్య-భవసి-భవథః-భవథ. ఉత్త:-భవామి-భవావః-భవామః. ఇవి పరస్మైపద రూప

ములు. ఆత్మనేపద:-ప్రథ-భవతే-భవేతే-భవన్తే. (మధ్య)-భవసే-భవేథే-భవధ్వే. ఉత్త-భవే-భవావహే-భవామహే.

లిట్ :-పరస్మైపద:-ప్రథ:-బభూవ - బభూవతుః - బభూవుః. మధ్య-బభూవిథ-బభూవథుః-బభూవ. ఉత్త:-బభూవ-బభూవివ-బభూవిమ. ఆత్మనేపద:-ప్రథ:-బభూవే-బభూవాతే-బభూవిరే. మధ్య:-బభూవిషే-బభూవాథే-బభూవిధ్వే (బభూవిఢ్వే-రూ). ఉత్త -బభూవే-బభూవివహే-బభూవిమహే

లుట్:-పరస్మైపదము -ప్రథ.-భవితా-భవితారౌ-భవితారః మధ్య-భవితాసి-భవితాస్థః-భవితాస్థ. ఉత్త:-భవితాస్మి - భవితాస్వః-భవితాస్మః ఆత్మనేపదము -ప్రథ.-భవితా-భవితారౌ-భవితారః. మధ్య -భవితాసే-భవితాసాదే-భవితాధ్వే. ఉత్త.-భవితాహే-భవితాస్వహే-భవితాస్మహే.

ల్రుట్ :-పరస్మైపదము:-ప్రథ :-భవిష్యతి - భవిష్యతః - భవిష్యన్తి. మధ్య:-భవిష్యసి-భవిష్యథః-భవిష్యథ. ఉత్త:-భవిష్యామి-భవిష్యావః-భవిష్యామః. ఆత్మనేపదము -ప్రథ:-భవిష్యతే-భవిష్యేతే-భవిష్యన్తే. మధ్య.-భవిష్యసే-భవిష్యేథే-భవిష్యధ్వే. ఉత్త:-భవిష్యే-భవిష్యావహే-భవిష్యామహే.

లోట్ :-పరస్మైపదము -ప్రథ:-భవతు (భవతాత్-రూ) భవతామ్-భవన్తు. మధ్య:-భవ (భవతాత్-రూ) భవతమ్-భవత. ఉత్త భవాని-భవావ-భవామ. ఆత్మనేపదము:-ప్రథ:-భవతామ్-భవేతామ్-భవన్తామ్. మధ్య:-భవస్వ-భవేథామ్-భవధ్వమ్. ఉత్త-భవై-భవావహై-భవామహై.

లఙ్ :-పరస్మైపదము -ప్రథ:-అభవత్-అభవతామ్-అభవన్. మధ్య-అభవః-అభవతమ్-అభవత. ఉత్త:-అభవమ్-అభవావ-అభవామ. ఆత్మనేపదము:-ప్రథ-అభవత-అభవేతామ్-అభవన్త. మధ్య.-అభవథాః-అభవేథామ్-అభవధ్వమ్. ఉత్త.-అభవే-అభవావహి-అభవామహి

లిఙ్ విధ్యాద్యర్థకము :-పరస్మైపదము:-ప్రథ:-భవేత్-భవేతామ్-భవేయుః. మధ్య:-భవేః-భవేతమ్-భవేత. ఉత్త:-భవేయమ్-భవేవ-భవేమ. ఆత్మనేపదము :-ప్రథ :-భవేత-భవేయాతామ్-భవేరన్. మధ్య:-భవేథాః-భవేయాథామ్-భవేధ్వమ్ ఉత్త.-భవేయ-భవేవహి-భవేమహి.

లిఙ్ ఆశీరర్థకము:-పరస్మైపదము:-ప్రథ:-భూయాత్-భూయాస్తామ్-భూయాసుః. మధ్య:-భూయాః-మూయాస్తమ్-భూయాస్త. ఉత్త:-భూయాసమ్-భూయాస్వ-భూయాస్మ. ఆత్మనేపదము -ప్రథ.-భవిషీష్ట భవిషీయాస్తామ్-భవిషీరన్. మధ్య -భవిషీష్ఠాః-భవిషీయాస్థామ్-భవిషీధ్వమ్ (భవిషీఢ్వమ్-రూ) ఉత్త:-భవిషీయ-భవిషీవహి-భవిషీమహి.

లుఙ్ :-పరస్మైపదము :- ప్రథ :- అభూత్-అభూతామ్-అభూవన్-మధ్య . అభూః-అభూతమ్-అభూత. ఉత్త :-అభూవమ్-అభూవ-అభూమ. ఆత్మనేపదము :-ప్రథ : అభవిష్ట-అభవిషాతామ్-అభవిషత. మధ్య : అభవిష్ఠాః- అభవిషాథామ్-అభవిధ్వమ్-(అభవిఢ్వమ్-రూ). ఉత్త : అభవిషి-అభవిష్వహి-అభవిష్మహి.

లృఙ్-పరస్మైపదము. ప్రథ . అభవిష్యత్- అభవిష్యతామ్-అభవిష్యన్. మధ్య : అభవిష్యః-అభవిష్యతమ్-అభవిష్యత. ఉత్త -అభవిష్యమ్-అభవిష్యావ-అభవిష్యామ. ఆత్మనేవదము : ప్రథ :-అభవిష్యత-అభవిష్యేతామ్-అభవిష్యన్త. మధ్య .- అభవిష్యథాః-అభవిష్యేథామ్-అభవిష్యధ్వమ్-ఉత్త -అభవిష్యే-అభవిష్యావహి-అభవిష్యామహి.

౫ వివ :-అట్టి సంస్కృతధాతువులు పదివిధములగు వికరణములతో సార్వధాతుకత్వమునఁ బురుషబోధక ప్రత్యయముల నందును. వీనిని దశగణి యందురు వివరణము. శ్లో. "భ్వాద్యదాదీ జుహోత్యాది ర్దివాది స్స్వాదిరేవచ తుదాదిశ్చ రుధాదిశ్చ తన క్ర్యాది చురాదయః" కవికల్పద్రుమగ్రంథమున నిం దొక్కొక్కగణ మొక్కొక

యిద్వర్ణముతోఁ గూడియుండును. తక్కిన ధాతుపాఠములలో నీ ధాతు వీ గణమని వ్రాయఁబడును.

I భ్వాదులకు సార్వధాతుకత్వమున 'శప్' అను వికరణ మగును. ఇందలి 'శ' వర్ణ 'ప' కారము లిద్వర్ణములు. "భూ=సత్తాయామ్" పరస్మైపదము :- భూ+శప్+తి=(భూ-భో-భవ్)=భవతి. భూ+శప్+తే=(భూ-భో=భవ్)=భవతే. "భూ=ప్రాప్తౌ" ఆత్మనేపదము.

II అదాదులకు సార్వధాతుకత్వమునందును వికరణము లేదు. ఇవి ధాతుపాఠమున (కవి కల్పద్రుమమున) లకార మిద్వర్ణము గాఁగలవై యుండును. అద్ లా భక్షణే." అద్+తి=అత్తి-మొ.

III జుహోత్యాదులు. ఇవియు 'అదా'ద్యంతర్గణమే కాన వీనికిని వికరణము లేదు. ఈగణము 'లి' వర్ణ మిద్వర్ణముగాఁగలవై యుండును. "హు (లి) హోమే"-హు+హు + (అభ్యాసకార్యములు చూడు-2 సూ. సం-క్రి. అభ్యాసము)+తి=జుహోతి-మొ.

IV దివాదులు- వీనికి సార్వధాతుకత్వమున 'శ్యన్' వికరణ మగును. ఇందలి శ' వర్ణ నకారము లిద్వర్ణములు. ఈగణము 'యు' కార మిద్వర్ణము గల్గి యుండును. "దివ్ యు" క్రీడాయామ్, విజిగీషాదిషు చ. దివ్+శ్యన్+తి=దీవ్యతి-మొ.

V స్వాదులు- వీనికి సార్వధాతుకత్వమున 'శ్ను' అను వికరణ మగును. ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము. ఈగణము 'న' కారేత్క-మయి యుండును. ధాతుపాఠములో 'షు' అని షకారముతో నున్నను ప్రక్రియాదశలో 'సు' అని సకారముతోనే యుండును. ' షు (నఞ్) బన్ధే." సు+శ్ను+తి=సునోతి-మొ.

VI తుదాదులు- వీనికి సార్వధాతుకత్వమున 'శ' అను వికరణము నిల్చును. ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము. ఈగణము 'శ' వర్ణేత్క-మై యుండును. 'తుదొ (శఞ్) వ్యథే" తుద్+శ+తి=తుద్+అ+తి=తుదతి. మొ.

VII రుధాదులు- వీనికి సార్వధాతుకత్వమున 'శ్నమ్' అను వికరణ మగును. ఇందలి 'శ-ణ' కారము లిద్వర్ణములు. ఈగణము 'ధ' కారేత్కారమై యుండును. 'రుధ్ (ధఞ్) ఆవరణే రుధ్+శ్నమ్+తి=బుణద్ధి. రున్ధః-రున్ధన్తి మొ.

VIII తనాదులు- వీనికి 'శుప్' అనునది సార్వ ధాతుకత్వమున వికరణమై నిల్చును. 'శ-ప' కారము లిద్వర్ణములు. ఈగణము దకారేత్కమైయుండును. 'తను (దఞ్) విస్తారే' తన్+శుప్+తి=తనోతి- మొ.

IX క్ర్యాదులు-వీనికి 'శ్నా' అనునది వికరణముగ సార్వధాతుక పరకత్వమున నిల్చును. ఇందలి 'శ' వర్ణ మిద్వర్ణము. ఈగణము 'గ' కారేత్కమై యుండును. "క్రీ (ఞ్ గ) ద్రవ్యవిపర్యయే" క్రీ+శ్నా+తి=క్రీణాతి- మొ.

X చురాదులు- వీనికి సార్వధాతుక పరకత్వమున 'ఞి' అనునది వికరణ మగును (పాణినీయులు ణి'). ఇందలి 'ఞ' కారమిద్వర్ణము. ఈగణము 'క' కారేత్కమై యుండును. "చుర (కి) స్తేయే" చుర+ఞి+తి=చోర్+(ఇ)=అయ్+తి=చోరయతి- మొ.

సంస్కృతశబ్ద ప్రపంచమునకెల్ల మూలభూతములగు సంస్కృత ధాతువులు పైరీతిని భ్వాదిగణరూపమున విభజింపఁబడి ధాతుపారములలోఁ జేర్పఁబడును. కవికల్పద్రుమమున నెల్లవిషయములకును నిద్వర్ణములు నిల్పఁబడును. అట్టి ధాతువులనుండి ప్రేరణాద్యర్థవిశేషములందుఁ దత్తదర్థబోధకములగుచు 'ఞి' (పాణినీయులు-'ణిచ్ అందురు) మున్నగు ప్రత్యయములు నిల్చి మరల ధాతుసంజ్ఞ గలవగును. పిదప మూలధాతువులవయి వర్తమానాద్యర్థములందు లడాదులు నిల్చినట్లె వీనిపైనిసైతము నిల్చి సంస్కృత తిజంతాదు- లేర్పడును.

'ఞి-సన్-యఙ-కామ్యక్-క్య-క్యఙ్-క్విప్' అను నేడు ప్రత్యయములు తుదినిగల ధాతువులు మరల ధాతు

సంజ్ఞ గలవగును. వీనిపయిని 'శప్' అను వికరణము నిల్చును ౧. (ముగ్ధ-౬౩౧ సూ) (సి-కౌ-౨౩౦౮సూ).

ఇట్లు 'ణ్యంత' 'సన్నం' తాదులకు మరల ధాతుత్వము సంభవించుచుండుటచేత ధాతువులమీఁదవలెనె వీనిమీఁదసయితము లకారాదులును 'తవ్యా'ది కృత్ ప్రత్యయములును నిల్చును. ఉదా:- 'భావయతి'-భావయితవ్యము - బుభూషితవ్యము-బోభూయితవ్యము-పుత్రకామ్యితవ్యము - జ్ఞానీయితవ్యము - కృష్ణాయితవ్యము. మొ. (చూ-౩-౪-౬-౭-౮-౯-౧౬-౧౯-౨౦ సూ)

ప్రేరణార్థమున ధాతువునకు 'ణి' ప్రత్యయమగును. ౨ (ముగ్ధ-౭౭౭ సూ). (సి-కౌ-౨౫౭౬ సూ)

ఇందలి 'ణ్' కార మిద్వర్ణము వృద్ధివచ్చునని తెల్పును. ఇట్లు ధాతువునకు 'ణి' ప్రత్యయము రాఁగా దానికి మరల ధాతుత్వము కలిగెను.

ధాతువు తుదినున్న 'ఇచ్' ప్రత్యాహారవర్ణములకును, నుపధాభూతమగు 'అ'కారమునకును 'ఞి'త్తు గాని, 'ణి'త్తుగాని పరమగునపుడు వృద్ధియగును. ౩. (ముగ్ధ-౫౭౭ సూ) (సి-కౌ-౨౫౪. ౨-౨౮-౨ సూ). (సమా-౩౦ సూ-'వృద్ధి వివరింపఁబడెను).

ఉదా:-"కృ (ఞ్)=కరణే". 'కృ+ణి+శప్+తి=కార్+ణి+శప్+తి" అని యుండఁగా

ధాతువుల తుదినున్న 'ఇక్' ప్రత్యాహారమునకును లఘూపధమునకును గుణ మగును. 'కిత్తు'గాని 'ఙిత్తు' గాని పరమైనచోఁ గాదు. ౪. (ముగ్ధ-౫౪౨ సూ) (సి-కౌ-౨౧౬౮-౨౧౮౯ సూ). (ఈ సూత్రము సామాన్యశాస్త్రము. ౩ సూత్రము దీనికన్న విశేష శాస్త్రము).

"కార్+ఇ" ఇకారమునకు గుణము (సమా-౨౯ సూ. గుణము వివరింపఁబడెను) రాఁగా "కార్+ఎ+అ+తి=కార్+అయ్+

అ+తి=కారయతి" అని సిద్ధించును 'కృ' ధాతువు తనాదులలోని దయ్యును ణ్యంతధాతువు గాన 'శప్' వికరణమే వచ్చును ఇట్లే-భూ=సత్తాయామ్" అను ధాతువునుండి "భావయతి" మున్నగు రూపము లేర్పడును.

ఇచ్ఛార్థమున ధాతువునకు 'సన్' ప్రత్యయ మగును ౫. (ముగ్ధ-౮౦౩ సూ). (సి-కౌ-౨౬౦౮ సూ). (ఇందలి తుది 'న'కార మిద్వర్ణము)

ఇందలి ఇచ్ఛ ధాత్వర్థేచ్ఛ యని యెన్నునది. అట్టి యిచ్ఛ "తుమ్" ప్రత్యయగర్భితమై యుండును. ఉదా:-భవితుమిచ్ఛతి = బుభూషతి. ('అగుట కిచ్ఛించుచున్నాఁడు').

"సన్-యఙ్" ప్రత్యయాంతములగు ధాతువులు ద్విరుక్తము లగును. ౬. (ముగ్ధ-౬౩౨ సూ) (సి-కౌ-౨౩౯౫ సూ).

ద్విరుక్తమందలి పూర్వభాగ మభ్యాస మనఁబడును. ౭. (ముగ్ధ 'ఖి' అనఁబడును) (ముగ్ధ-౫౩౮ సూ) (సి-కౌ-౨౧౭౮ సూ). బుభూషతి=(భూ+భూ+స+అ+తి).

అభ్యాసముయొక్క యాద్యచ్చునకుఁ బరభాగము లోపించును. 'శర్' సమాహార మాదిగను 'ఖయ్' సమాహార మంతముగను (ముగ్ధ'సమాహార'=పాణి. (ప్రత్యాహారము) గల సంయోగము నిల్చియున్నచో నట్టి యభ్యాసముయొక్క యాది హల్లు లోపించును. తద్భిన్నసంయోగమున్నచో దాని తుది హల్లు లోపించును. ౮. (ముగ్ధ-౫౬౭ సూ) (సి-కౌ-౨౧౭౯ సూ) 'సన్' ప్రత్యయ పరకత్వమున 'అద్' ధాతువునకు 'ఘస్'అను నాదేశమగును. అభ్యాసమునందలి "ఝభ్" సమాహారము "జబ్" సమాహార మగును. 'ఖద్' సమాహారము 'చప్ సమాహారం మగును 'హ'కా

రము 'జ'కార మగును దీర్ఘము హ్రస్వ మగును. 'క'వర్గము 'చ'వర్గ మగును. 'ఋ'వర్ణము 'అ'కార మగును. 'సన్' ప్రత్యయ పరకత్వమున నభ్యాసము యొక్క 'అ'కారము 'ఇ'కార మగును. ౯. (ముగ్ధ-౪౪౯ సూ. ౬౮౦ సూ) (సి-కౌ-౨౧౭౯ మొ. ౨౧౫౨ వ. సూ. ౨౩౧౭ సూ)

'అద్=భక్షణే' - ప్రథమపురుషము-జిఘత్సతి-జిఘత్సతః- జిఘత్సన్తి=(తిన నిచ్ఛించు).

ముహురర్థమునందును భృశార్థమునందును ధాతువునకుఁ బరముగా 'యఙ్' ప్రత్యయము నిల్చును. ౧౦. (ముగ్ధ-౫౨౦ సూ) (సి-కౌ-౨౬౨౯ సూ). (ఇందలి ఙకార మిద్వర్ణము. 'ఙిత్తు' ఆత్మనేపదము).

'సం-క్రి-౧ సూ' చొప్పున, ధాతుత్వము వచ్చెను. 'సం-క్రి-౬ సూ' చొప్పున ద్విరుక్తి, రాఁగా "సం-క్రి-౭-౮-౯ సూ" వర్తించును. 'యఙ్' ఙిత్తుగానఁ దదంతము 'ఆత్మనేపద' మగును.

'యఙ్' ప్రత్యయము పరమగునపు డభ్యాసమునకు గుణ మగును ౧౧. (ముగ్ధ-౫౨౨ సూ) (సి-కౌ-౨౬౩౦ సూ.)

(సమా ౨౯ సూత్రమున గుణము వివరింపఁబడెను) "సూచ=పైశున్యే" ప్ర సోసూచ్యతే. సోసూచ్యేతే-సోసూచ్యన్తే. (మిక్కిలిగాఁ గొండెము చెప్పు)

'యఙ్' ప్రత్యయము వికల్పముగా లోపించును. అట్లు లోపించునపుడు 'శప్' అను వికరణమును లోపించును. ధాతువు పరస్మైపద మగును. ధాతువునకు ద్విరుక్తియు నభ్యాసమునకు గుణమును నగును. ౧౨. (ముగ్ధ-౫౩౬ సూ) (సి-కౌ-౨౬౫౦ సూ).

"ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్" అనుచోప్పున ధాతుత్వాదికము కల్గును. ఉదా-బోభోతి-(బోభవీతి)బోభూతః-బోభువన్తి-మొ.

నామమునకుఁ బరముగా నాత్మేచ్ఛార్థమున 'కామ్యక్' ప్రత్యయమగును. ౧౩. (ముగ్ధ-౮౪౭ సూ) (సి-కౌ-౨౬౬౩ సూ.)

ఇందలి తుది 'క' కార మిద్వర్ణము-కిత్తుగాన సం-క్రి-౮ సూత్రము చొప్పున గుణము రాదు. ఉదా - పుత్త్రకామ్యతి-పుత్త్రకామ్యతః-పుత్త్రకామ్యన్తి-మొ. (పుత్త్రుఁడు కావలెనని యిచ్ఛించుచున్నాఁడు)

నామమునకుఁ బరముగా (మాన్తములు నవ్యయములు తప్ప) స్వేచ్ఛార్థమున క్య ప్రత్యయమగును. ౧౪. (ముగ్ధ ౮౪౩ సూ) (సి-కౌ-౨౬౫౭ సూ-౨౬౫౮ సూ) (ఇందలి క' కార మిద్వర్ణము).

జ్ఞానీయతి-జ్ఞానీయతః-జ్ఞానీయన్తి. (జ్ఞానివలెనుండ నిచ్ఛించుచున్నాఁడు) క్రింది ౧౬ సూత్రముచేత 'జ్ఞానీ' అనుచోటి దీర్ఘము సంభవించెను

కర్త్రర్థకమగు నుపమాన వాచకముకంటెఁ బరముగ నాచారార్థమున 'క్య'-క్విప్' అను ప్రత్యయము లగును ౧౫ (ముగ్ధ-౮౪౮ సూ) (సి-కౌ-౨౬౬౫ సూ).

'క్య' ప్రత్యయములోని 'జ'కార మిద్వర్ణము 'క్విప్' ప్రత్యయములోని 'క' కార మిద్వర్ణము-ఈ క్విప్' ప్రత్యయములోని యక్షరములెల్ల లోపించును.

ఆర్ధధాతుకమగు యకారము పరమగుచుండఁగా నజంతమునకు దీర్ఘంబగును. ౧౬. (ముగ్ధ-౫౯౦ సూ) (సి-కౌ-౨౬౭౫ సూ).

క్య ప్రత్యయాంతము జిత్తుగాన నాత్మనేపద మగును. కృష్ణాయతే-కృష్ణాయేతే-కృష్ణాయన్తే-మొ. 'క్విప్' ప్రత్యయాంతః- కృష్ణతి-కృష్ణతః-

కృష్ణతి-మె. (కృష్ణునివలె నాచరించు.) ఇందు 'కృష్ణ' అను నామమె క్విప్ ప్రత్యయాంత ధాతు వగుచున్నది

సన్నంతాదులందు రెండేసి ప్రత్యయముల స్థితి యగపడుచున్నది. "పుత్త్రమివ శిష్య మాచరతి"-(పుత్త్రునివలె శిష్యు నాచరించుచున్నాఁడు) అను నర్థమున 'క్య' ప్రత్యయము వచ్చును. పిదప 'పుత్త్రీయితు మిచ్ఛతి" (పుత్త్రునివలె నాచరించుట కిచ్ఛించుచున్నాఁడు) అను నర్థమున 'సన్' ప్రత్యయము వచ్చును. దాని రూపసిద్ధిలో "యథేష్టం నామ ధాతుషు" (ముగ్ధ-౮౫౯ సూ) (సి-కౌ-౯౭౭ పుట బాలమనోరమా పుస్తకములోని వార్త్తికము) అను చెప్పఁబడిన నాల్గు-ద్విరుక్తి రాఁగా "పుపుత్త్రీయిషతి-పుతిత్త్రీయిషతి-పుత్త్రీయియిషతి-పుత్రీయిషిషతి" అన్నిటికని ద్విరుక్తి రాఁగా "పుపుతిత్త్రీయియిషిషతి" అగును

కర్త్రర్థమందువలెనె కర్మార్థమందును లడాదులు వచ్చును. కర్మార్థక ధాతువునకు సార్వధాతుక పరకత్వమున 'యక్' ప్రత్యయము నిల్చును. కర్మార్థకధాతు వాత్మనేపదమే యగును. ౧౭ (ముగ్ధ-౯౨౦-౯౨౧ సూ) (సి-కౌ-౨౬౭౯ సూ ౨౭౫౬-౨౭౫౮ సూ)

స్తూయతే- స్తూయేతే- స్తూయన్తే. (స్తుతింపఁబడుచున్నాఁడు). (౧౬ సూత్రము చెప్పిన దీర్ఘము.) యక్ ప్రత్యయమునందలి కకార మిద్వర్ణము. కిత్తుగాన గుణము లేదు చికిత్స్యతే-(రోగాపనయనము చేయ నిచ్ఛింపఁబడుచున్నది-మె.) తెలుఁగున సంస్కృత సమాపకక్రియలకుఁ బ్రయోగము లేమింజేసి వానిరూపములు ప్రక్రియ విశేషించి వివరింపఁబడదయ్యె.

ఇది సంస్కృత క్రియల భాగము

---

# బాలవ్యాకరణోద్యోతము

## క్రియాపరిచ్ఛేదము

## తెనుఁగు క్రియల వివరణము

ధాతువునకు_౧ (బా- క్రియా-౧). (వ్యా- సం- ౨౯_౭ విష).

ఇయ్యాది యధికార సూత్రము. ఇంక నెయ్యాది యుపక్రమింపఁ బడు నయ్యాది ధాతువునకుఁ బరముగ నగునని యెఱుఁగునది. 'ధాతువు= క్రియ' అనునవి పర్యాయములు క్రియ వ్యాపారబోధకము. ఉదా:_ చదువు_వండు_తిను_విను_కను_వ్రాయు_పోవు_మొదలగునవి యాచ్ఛిక ధాతువులు తత్సమ ధాతువులు:_రక్షించు_పోషించు_జయించు_అనుభవించు_మొ.

సంస్కృతమున కంగలాదుల కించు క౬-గు. ౨ (బా-క్రి-౬౩ సూ) (వ్యా-సం-3_౨౬ I విష)

సంస్కృత ధాతువులకును గొన్ని సంస్కృత నామంబులకును నంగలాదులగు కొన్ని యాచ్ఛిక (ధాతువులకును) శబ్దంబులకును స్వార్థమునందు 'ఇంచు'గాగమ మగును. అంతటను నపదాది నిత్యస్వరసంధి. (సంధి-౧౧ సూ). ఉదా _సం_ధా:_రక్షించు_పోషించు_జయించు_అనుభవించు_సం_నామ:_శయనించు - నుతించు - స్తుతించు - ఆహారించు - కరుణించు_పల్లవించు_విచారించు_ ఆఘ్రాణించు - కారించు_(పడించు) మొ. సాధారణముగా 'ఇంచు'గాగమమును సిద్ధసమాసములును సంస్కృత శబ్ద మిదియని తెలియుటకు మంచి యాధారములు.

అంగలాదులు:_అంగలించు=(దుఃఖించు). అంగవించు=(ఉత్సహించు). ఆరగించు=(ఆహార-వై.) ఉగ్గడించు=(ఉద్ఘాట-వై.) ఉంకించు=(యత్నించు). ఓసరించు=(తొలఁగు). జాడించు-తులకించు=(ప్రకాశించు). పంకించు(కంప-వై.) పరికించు=(పరీక్షా-వై.) పలవించు=

-ప్రలాప-వై.) అప్పించు=(ఒప్పించు=(అర్పణ-వై.) ఆలించు=ఆలకించు=(ఆలక్ష-వై.) గాలించు (బియ్యమును).

ఆచ్ఛికనామములు :-ఎల్లుఁగించు = (శబ్దించు-పిలుచు). అడకించు=(అడకము=లోపల నడగు). ఇనుమడించు=(రెట్టించు)-(ఇనుమడి). ముమ్మడించు=(ముమ్మడి=మూఁడురెట్లుచేయు). ఉరవడించు=(ఉరవడి). తొలుకరించు=(తొలుకరి) తల్లడించు=(తల్లడము). తురగలించు=(తురగలి=ప్రకాశము).

౧ వివ .-'ఇల్లు=ఇలు'అను నాగమములను జేర్చుటచేత సైతము కొన్ని తత్సమ ధాతువు లేర్పడును. (చూ-క్రియా-౭3 సూ) ఉదా :-సంధిల్లు=సంధిలు-(సంధిల్లఁజేయు=ప్రే=సంధించు) ఘటిల్లు=(సంభవించు) (ఘటించు-ప్రే=కూర్చు). చింతిల్లు=చింతిలు=చింతించు=(విచారపడు) కంపిల్లు=కంపిలు=కంపించు=(వణఁకు). భాసిల్లు=భాసిలు=భాసించు. రంజిల్లు=రంజిలు=(అనురాగపడు). (రజించు=ప్రే=రంజిల్లఁజేయు). భేదిల్లు=భేదిలు=(బ్రద్దలగు) (భేదించు=(ప్రే)=భేదిల్లఁజేయు). ఇందలి 'ప్రే' అను గుర్తునకు "ప్రేరణ"మని యర్థము ప్రేరణ వివరణము ముందుఁ జేయఁబడును. (చూ-క్రియా-౭౨ సూ).

౨ వివ -పైని వివరించిన ధాతువులు యథాప్రయోగముగ గ్రాహ్యంబులు. ఉదా -'ను' అను సంస్కృత ధాతువు నవించు' అను రూపముతోఁ దెలుఁగున వాడఁబడనేరదు. ఇంక 'నుతించు" అను రూపముతో వాడఁబడును. 'రమ్' అను సంస్కృతధాతువు తెల్గున 'రమించు' అను రూపముతోఁ వాడఁబడును. 'రామ' శబ్దమునుండి 'రామించు' అను రూపము గల్గనేరదు.

సంస్కృతధాతువుల తుదినున్న 'ఇ-ఉ-ఋ' అను వర్ణంబుల 'కించుకుఁ-' పరంబగునపుడు వరుసగా (అయ్-అవ్-అర్) నయు గవు గ రుక్కు లగును. 3. (బా-క్రి-౬౮ సూ) (వ్యా-సం-3౨= II విప).

సం-' జి = జయే'' = జయించు జి=జే- (గుణసంధి-చూ-సమా-౭౯ సూ) జయ్- (అయాద్యాదేశసంధి- సమా-3౭ సూ)+ఇంచు= జయించు. ' నీ=ప్రాపణే'' = నీ-నే - (గుణ-సమా-౭౯ సూ) 'నయ్= (అయాద్యాదేశసంధి-సమా-3౭)+ఇంచు=నయించు ద్రు=ద్రవే''= ద్రవించు (ద్రు-ద్రో-ద్రవ్+ఇంచు=ద్రవించు) లూ-లవనే=ఛేదనే = లవించు. (లూ-లో=లవ్+ఇంచు=లవించు) ' ధృ=ధారణే =ధరించు. (ధృ-ధర్+ఇంచు=ధరించు) 'తౄ=తరణే '=తరించు (తౄ-తర్+ఇంచు=తరించు)

నిర్ పూర్వక 'జి ధాతువునకు 'అయుక్కు లేదు ४. (బా-క్రి-౬౫ సూ) (వ్యా-సం-3౭౬ III విష)
నిర్జించు=(నిర్+జి+ఇంచు)=(జయించు).

సంస్కృతధాతువుల యుపధలగు ఇ-ఉ-ఋ' వర్ణం బుల కించుకుక్ పరంబగునపుడు గుణాదేశం బగు (బా-క్రియా-౬౬ సూ) (వ్యా-సం-3౭౬ IV విష)

గుణాదేశ విషయము సమా-౭౯ సూత్రమందును ఉపధా శబ్దార్థము సంజ్ఞ ౧౦-సూ వివరణమందును వివరింపఁబడెను 'ఛిద్= ఛేదే'=ఛేదించు. 'భిద్=భేదనే'=భేదించు 'ఘుష్=ఘోషణే'=ఘోషించు 'పుష్=పోషణే'=పోషించు. వృష్ = వర్షణే' = వర్షించు 'హృష్= హర్షే'=హర్షించు

స్పృశికి గుణంబు విభాష నగు ౬ (బా-క్రి-౬౭ సూ) (వ్యా-సం-3౭౬ V విష)
స్పర్శించు=స్పృశించు

లిఖ-భుజ-రుచ - కృశంబులకు గుణంబు లేదు. ౭. (బా-క్రి-౬౮ సూ) (వ్యా-సం-3౭౬ V వి )
లిఖించు-భుజించు-రుచించు-కృశించు.

సృజికి నిర్మితిని గుణంబు లేదు-౮. (బా-క్రి-౬౯ సూ) (వ్యా-సం-3౭౬ V వి.)

-చతుర్ముఖుఁడు ప్రజలను సృజించె. అతఁడు విషయములను విసర్జించె.

అగతికంబులగు భ్వాదుల కిందుఁ బ్రయోగంబు లేదు.

౯. (బా-క్రి-౧౨౧ సూ) (వ్యా-సం-౩౫౧-౩౭౬ VII వివ.)

'భూ- స్మృ- కృ- రేకృ- లోకృ- లోచ- పచి-లప-' ఇత్యాదులగు భ్వాదులకు (సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధ 'భ్వాదు' లని భ్రమింపరాదు. ఇందలి కృ' సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధ దశగణిలో 'తన్వాదు'ల లోనిది) గతి విరహితంబుల కిభావం బ్రయోగంబు లేదు 'ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-నిర్-దుస్-దుర్-వి-ఆఙ్-ని-అధి-అపి-అతి-సు-ఉద్-అభి-ప్రతి-సరి-ఉప-" అను ప్రాదులును, 'ఊరీ' ప్రభృతిశబ్దంబులును, సాక్షాత్ప్రభృతులును, గతి సంజ్ఞాకంబులు. ప్రాదు లిరువది రెండును క్రియాయోగమున 'ఉపసర్గంబులు' నాఁబడును ('భవించు-సరించు-కరించు' అనురీతిని బ్రయోగింపరాదని యర్థము. ఉదా :-ప్రభవించు- ఆవిర్భవించు- ప్రసరించు- సత్కరించు- భస్మీకరించు- సాక్షాత్కరించు- అతిరేకించు-ఆలోచించు-ప్రపంచించు-ప్రలపించు- ఇత్యాదులార్యప్రయోగంబుల నెఱుఁగునది.

౧ వివ :-' ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యః ప్రతీయతే ప్రహార రాహార సంహార విహార ఉపహారవత్" అని కొందఱందురు. మఱి కొంద ఱుపసర్గ సంబంధము లేకయే ధాతువు లనేకార్థకములనియుఁ గ్రియావాచిత్వమును దెల్పుటకై ప్రసిద్ధార్థము చెప్పఁబడుననియుఁ జెప్పుదురు. 'క్రియా వాచిత్వ మాఖ్యాతుం ప్రసిద్ధార్థః ప్రదర్శితః ప్రయోగతోనుమన్తవ్యా అనేకార్థా హి ధాతవః."

౨ వివ -సన్నంతాదులకుఁ దిజంత రూపములు తెలుఁగున లేవు. సన్నంతనామ:-(చికీర్షా)=చికీర్ష=చేయు నిచ్ఛ. (చికీర్షుః)=చేయు నిచ్ఛ గలవాఁడు=చికీర్షువు. యఙన్తనామ :- జేగీయమానుఁడు = (జేగీయమానః). ణిజన్త :- (స్థాపయతి) = "స్థాపించుచున్నాఁడు. (ఆజ్ఞాప

యతి)=ఆజ్ఞాపించుచున్నాఁడు” అనురీతిని ణిజంతములకుఁ దెల్గునఁ బేరిఁ ణార్థకము లనుచుఁ దిజంతరూపములు గలవు. సన్నంతాదుల కన్ననో తదర్థ బోధక ప్రత్యయములు తెల్గున లేవు-సన్నంత-(చికీర్షతి)=చేయ నిచ్ఛించుచున్నాఁడు యజన్తః-(జేగీయతే)=మాటిమాటికి గానము చేయుచున్నాఁడు

వర్తమానంబున లట్టగు. ౧౦. (బా-క్రి-౨సూ)
(వ్యా-సం-౨౯౭ విష )

వర్తమాన క్రియావృత్తి యగు ధాతువునకు లడ్వర్ణకం బగు- వర్తమానం బనఁగాఁ బ్రారబ్ధా ఉపరిసమాప్తంబు. అనఁగ ఁ కారబ్ధమై యప్పటికి ముగియకుండునది. ఉదా :-రాముఁడు వచ్చుచున్నాఁడు.

౧ వివ :- సంస్కృతమున ‘వర్తమానే లట్’ (3-౨-౧౨3) (సి-కౌ-౨౧౫౧ సూ.) అను సూత్రము చొప్పున నేర్పడునట్టి ‘భవతి- ఏథతే’ మున్నగు లడ్రూపములు పయిని వివరించిన ప్రారబ్ధా ఉపరి సమాప్తి రూప వర్తమానమును దెల్పునుగాని యంతకన్న ముఖ్యము గాఁ దద్ధర్మాద్యర్థములను సయితము దెల్పును ఉదా :- భవతి=అగును- అగుచున్నాఁడు ఏధతే=వర్ధిల్లును-వర్ధిల్లుచున్నాఁడు ‘అగ్ని ర్జ్వలతి’= అగ్ని మండును. ‘విహగా డయన్తే’=పక్షు లెగురును. ఇట్టి తద్ధర్మాద్యర్థ మును బోధించు ప్రత్యేక ‘ల’ కారము సంస్కృతమున లేదు.

భూతంబున లిట్టగు. ౧౧ (బా-క్రి-3). (వ్యా-సం-
౨౯౭ విష )

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు. భూతంబు నా ముందుండి యప్పటికి లేకుండునది అప్పటి కనఁగా వాక్యప్రయోగ కాలమునకని యర్థము.

౧ వివ :-‘లట్-లిట్-ల్రుట్’ మున్నగు ‘ల’ కారములు కొన్ని సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధములగు సంజ్ఞలే కాని ఋంచుక మార్పును గలదు. పాణినీయము నేఁటి భూతమున-“అనద్యతన భూతము-పరోక్ష

నద్యతన భూతము" అను భేదములు గలవు కాని యట్టి విశేషములు సంస్కృత మహాక వ్యాపేక్షితములై యగుటచేత ముగ్ధబోధాది సంస్కృత వ్యాకరణములందే యుపేక్షితము లయ్యెను. కావున నిందు 'లి' ట్టనునది భూతమాత్రమందే యుపయోగింపఁబడెను ఇట్లే భావ్యర్థాదులందును గ్రహింపనగును.

భావిని లృట్టగు ౧౨ (బా-క్రి-౮ సూ) (వ్యా-సం-౨౯-౭ వివ)

భావి క్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకం బగును. భావి యనఁగా నప్పటికిఁ బుట్టకుండునది.

౧ వివ :—లృట్టనునదియు సంస్కృత వ్యాకరణ సంజ్ఞయే. భూతమందువలెనె భావియందును ననద్యతనాది భేదము లుపేక్షితములు. కేవల భావిమాత్రమందే యీ లృట్టు వాడఁబడెను.

తద్ధర్మాదులందు లాట్టగు. ౧౩. (బా క్రి-౫). (వ్యా-సం-౨౯-౭ వివ)

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లా' డ్వర్ణకం బగు. తద్ధర్మ- తచ్ఛీల- సంభావనా- సంప్రశ్న- సాతత్య- వర్తమాన భావ్యాశీరాదులు తద్ధర్మాదులు.

౧ వివ — లాట్టు-లూట్టు-లజీ' అనునవి పాణినీయ సంజ్ఞానుసరణమునఁ గల్పితములగు సంజ్ఞలు. తద్ధర్మాదుల కుదా —తద్ధర్మ= వాని వృత్తి-మొ. కులాలుఁడు కుండలు వానును తచ్ఛీల=ఆవస్తువు స్వభావము —జ్వలనజ్వాల లుప్పరం బెగయును. సంభావన= ఊహము —వాఁడచ్చటి కీపాటికిఁ జేరును. సంప్రశ్నము :—నీవు చదువుదువా? సాతత్యము=ఎల్లప్పుడు నుండునది :—పర్వతములు చలింపకుండును. ఈశ్వరుఁడు సర్వంబున నుండును. వర్తమాన :—నేనిప్పుడు వచ్చెదను. నేనిప్పుడు వత్తును. మేన నిప్పుడు పులకలు పొడమెడును. ఆశీస్సు —నీకు మంగళం బగును నీకుఁ గీడఁగున్ (ఇది శాపము)—మొ.

భూతంబునను లాట్టు గన్పట్టును అన నతఁ డిట్లనున్=(ఇట్లనె నని యర్థము). వద్యర్థములందే కాదు-"విందున్=(వింటిని)' (సభా-౨-ఆ-౧౨౬-౧౬౪.)

౨ వివ.—'వచ్చెదను' (ఎద) అను రీతినె వర్తమానార్థకములనియు, 'చదువుదును' (దు) అను రీతినె భావ్యర్థకములనియుఁ గేతనాదులు చెప్పిరి. అది సరికాదు. (చూ-వ్యా-సం-౧3౨౫-౧3౨౬ పుటలు) విజితేంద్రియుండనఁగ నిమ్మునిఁ బొయక విందును (ఆది ౪ ఆ-30). సద్ధర్మ మార్గంబు సలుపు దయ్య (సభా-౧ ఆ-౨౬) ఈబిలము...చొరుందు దీనిఁ గ స్పెద (ఆది ౮ ఆ 30).

ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు ౧౪.
(బా-క్రి-౬ సూ) (వ్యా-సం-౨౯౭ వి.)

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు లూట్టును నదిఁ గల్పిత సంజ్ఞఁయె. "ఎడుమ-తన్' మొదలగునవి లూడాదేశములు-(చూ-క్రి-33 సూ). ఉదా-నీకు దీర్ఘాయు వయ్యెడుమ నీకుఁ దీర్ఘాయు వగుతన్. నీవు దీర్ఘాయు వగుము-నీ వీపని చేయునది-మొ.

వ్యతిరేకంబున 'లజీ' యగు. ౧౫ (బా-క్రి-౭
సూ) (వ్యా-సం-౨౯౭ విమ.)

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు 'లజీ' వర్ణకంబగు. ఇదియుఁ గల్పితమె. పాణినీయము కాదు. ఉదా-వాఁడు-వండఁడు-మొ.

లకారంబునకు 'డుజ్-రు, వు-రు, ను-ము-ఙ్గు.
౧౬ (బా-క్రి-౮ సూ) (వ్యా-సం-౨౯౮ వి).

లడాది లకారంబులం దొక్కొక్కటికి 'డు' జాదు లాదేశంబులగు. ఇందుఁ దుది 'ఇ' కారంబు ప్రత్యాహారార్థంబు. (చూ-సంజ్ఞా-౧ సూ-వివృతి.)

అందు వరుస రెండేసి ప్రథమ మధ్య మోత్త మంబు లనంబడు. ౧౭. (బా-క్రి-౯ సూ) (వ్యా-సం-౨౯౮ విమ.)

'డుజ్-రు' ప్రథమ పురుషము. 'వు-రు' మధ్యమ పురుషము. 'ను-ము' ఉత్తమ పురుషము.

వానిలో 'రు-ము'లు బహువచనంబులు, పెఱ లేక వచనంబులు. ౧౮. (బా-క్రి-౧౦). నామ యుష్మ దస్మ దర్థంబు లందుం బ్రథమ మధ్య మోత్తమంబు లగు. ౧౯. (బా-క్రి-౧౧)

నామ మనఁగా యుష్మ దస్మ ద్భిన్నము అస్మదర్థము కర్తగాఁ గల క్రియ యుత్తమ పురుషము. యుష్మదర్థము కర్తగాఁగల క్రియ మధ్యమపురుషము తక్కిన యేది కర్తయైయున్నను క్రియ ప్రథమ పురుషము.

అమహాదర్థంబునందు 'డుజ్-రు' లకు 'దు-వు' లగు. ఉన్నాను బంధంబుమీఁద 'ది-వి' యగు. ౨౦. (బా-క్రి-౧౨ సూ). (వ్యా-సం-౨౯౯ విమ)

డు-ఇఙ్' ప్రత్యాహారములోని 'డుజ్-రు' అను ప్రథమపురుష ప్రత్యయములు మహాత్కర్తృకత్వమున నె నిల్చును. అమహాత్కర్తృకత్వమున 'డుజ్జు' చోట 'దు' అనియు, 'రు' చోట వు' అనియు నిల్చును. ఉన్నానుబంధంబు మీఁద డుజ్జు' చోట 'ది' అనియు, 'రు' చోట వి' అనియు నిల్చును.

౧ విమ :—పై ప్రత్యయములకుఁ బురుషబోధక ప్రత్యయము లని పేరు తత్తత్పురుష బోధక సర్వనామశబ్దముల తుదివర్ణములె పై ప్రత్యయములని యెఱుంగునది. ఉదా :- వాఁడు-ఁడు-' 'వారు-రు '-అది-ది-' అవి-వి-' మొ. ప్రాచీనతమ కాలమున 'అది-అవి' అనునవి 'అదు-అవు' అను రూపములతో నుండెడి వనఁదగును. కాన వానిమూలమున 'దు-వు' ప్రత్యయము లేర్పడి యుండును.

మధ్య మోత్తమ పురుషములందు మహదమహత్పక్షములు రెంటనూ 'నీవు-మీరు, నేను-మేము' అనునవే నిల్చును.

ఉదంతంబునకు 'లట్టు' పరమ్బగునపుడు 'ఉన్న' అనునది యనుబంధమగును. ౨౧ (బా-క్రి-౧౩ సూ) (వ్యా-సం-౨౯౯ వివ)

ఉదంతంబయిన ధాతువునకు 'లట్టు' పరంబగునపుడు ఉన్న అను శబ్దం బనుప్రయుక్తంబగు.

౧ వివ :—ధాతువులెల్ల సాధారణముగ 'ఉ' దంతములయియే యుండును. లంగలాదులగు నాచ్ఛికశబ్దములును 'ఇంచు' గాగమముతోఁ గూడి ఉ' దంతములె యగు (క్రియా-౨ సూ). కావున నెల్ల ధాతువులకును వర్తమానమున ఉన్న' అను ననుబంధ మగును. ఒక్క 'కలుగు' ధాతువున కాదేశంబగు 'కల అనునది (క్రియా-౧౦౪ సూ) మాత్రము 'ఉ దంతము కాదు. దానికి 'ఉన్న' అను ననుబంధము రానేరదనుట కిందు 'ఉదంతంబునకు' అను దళము చేర్పఁబడినది.

౨ వివ :—'ఉన్న' అనునది 'ఉండిన' అను భూతార్థక విశేషణమునుండియె యేర్పడిన దనఁదగును అట్లయినను ఉన్న' అనునది వర్తమానార్థకముగా మహాకవులచే వాడఁబడినది. దీనికి భూతార్థకత్వమె మహాకవి ప్రయోగములలో లేదు ఉదా :- వెలిగించుచున్న నృపపూజ్యులు. (ఆది-౮ ఆ-౨౮౭) గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు (ఆది-౮ ఆ-౨౫). ఇష్టు ..యగదేశ్వరుఁడు.... ఉన్నవాఁడు. (సభా-౧ ఆ-౧౬౧) నేఁడు ..రోహిణీయుక్తుఁడై శశాంకుఁడున్నవాఁడు (ఆది-౭ ఆ-౨౮౨). మొ.

ఉన్న శబ్దంబు పరంబగునపుడు 'చు'వర్ణకం బగు.
౨౨. (బా-క్రి-౧౪ సూ) (వ్యా-సం-౨౯౯ వివ).

ఉన్నానుబంధ మనక 'ఉన్న' శబ్దం బనుటచేత (క్రియా ౫౬ సూ) 'ఉన్న' అను వర్తమానార్థక ప్రత్యయము పరమగునపుడును

నీ 'చు' వర్ణక మగునని విశదమగుచున్నది. ఉదా -వండుచున్న యు న్నము-వండుచున్నాఁడు-మొ

'ది-వి' తరంబగు 'దు ఙు పరం బగునపుడు 'ఉన్న' అనెడి యనుబంధంబునకు దీర్ఘంబగు. ౨౩. (బా-క్రి-౧౫) (వ్యా-సం-౨౯౯. వివ).

'డుజ్' మొదలగు ప్రత్యయము లన్నింటికిని 'డుఙ్' అనునది ప్రత్యాహార సిద్ధమగు సంజ్ఞ. అమహదర్థక ప్రథమ పురుష ప్రత్యయములగు 'ది-వి' అనునవి 'దు-వు'ల కాదేశములగుటంజేసి వానిని బృథక్కరింపవలసెను. పయిరీతిగల ప్రక్రియచే నీ క్రింది లక్ష్యరూపము లేర్పడుచున్నవి. ప్రథమ :-వాఁడు వండుచున్నాఁడు - వారు వండు చున్నారు. అమహదర్థ :-అది వండుచున్నది - అవి వండుచున్నవి. మహతీ :-ఆమె వండుచున్నది-వారు వండుచున్నారు. (చూ-ఆచ్ఛి-౬౮ సూ). మధ్యమ :-నీవు వండుచున్నావు-మీరు వండుచున్నారు. ఉత్తమ :-నేను వండుచున్నాను-మేము వండుచున్నాము. ఈ యర్వా చీన సమాపక క్రియా రూపములు విధేయ విశేషణ రూపములుగ గొంత మార్పుతో నన్నయ తిక్కనలు వాడుదురు.

౧ వివ.—పైని సాధించిన రూపములలో "చేయుచున్న వాఁ డను-చేయుచున్న వారము" మున్నగు నన్నయకాలపు రూపములలోని 'డ'కార 'ర కారములు లోపించిన యర్వాచీన రూపములె చేయు చున్నాను మొదలగునవి. ఇవి ప్రాచీన మహాకవి సమ్మతములనికాని చింతామణి సాధ్యములనికాని భ్రమింపరాదు. (చూ-సమా-౭౩ సూ) నన్నయకాలరూపములు- ప్రథ :-వాఁడు చేయుచున్నవాఁడు- వారు చేయుచున్నవారు - అది చేయుచున్నది - అవి చేయుచున్నవి. మధ్యమపురు -నీవు చేయుచున్నవాఁడవు-మీరు చేయుచున్నవారరు. ఉత్తమ :-నేను చేయుచున్నవాఁడను - మేము చేయుచున్నవారము. నన్నయ కాలమున నివే సమాపక క్రియారూపములును విధేయ

విశేషణ రూపములును - తిక్కనాదులకాలమునఁ బయి ప్రాచీనరూపములె కాక తచ్ఛబ్ద 'వ'కారలోపము గలవియు నుండెడివి. ప్రథ :- వాఁడు చేయుచున్నాఁడు-వారు చేయుచున్నారు-అది చేయుచున్నది-అవి చేయుచున్నవి మధ్యమ :-నీవు చేయుచున్నాఁడవు-మీరు చేయుచున్నారు. ఉత్తమ :-నేను చేయుచున్నాఁడను - మేము చేయుచున్నారము. రంగనాథ రామాయణమునఁ బై యర్వాచీనరూపములుండుట దాని వ్యావహారిక భాషోపయోగపరత్వమును నెల్లడించును. అట్టివి ప్రాచీన మహాకావ్యములలో లేవు.

౨ వివ :-పయి రూపముల కెల్ల వ్యస్తరూపములును గలవు:- చేయుచున్ + ఉన్నవాఁడను = చేయుచు నున్నవాఁడను చేయుచున్+ ఉన్నాఁడను=చేయుచు నున్నాఁడను=చేయుచున్నాఁడను చేయుచున్+ ఉన్నాను=చేయుచు నున్నాను=చేయుచున్నాను. మొ (చూ-సంధి-౨ సూ)

లిఙ్లోట్టుల డుజ్జునకు 'ఎను-ను' వర్ణంబు లగు. ౨౪.
(బా-క్రి-౧౬ సూ) (వ్యా-సం-300. వివ).

లిడాదేశంబగు డుజ్జు'నకు 'ఎను' అనునదియు లాడాదేశంబగు డుజ్జునకు 'ను' అనునదియు నాదేశంబు లగును.

భూతంబునం దిగాగమం బగు. ౨౫. (బా-క్రి-౧౭)
(వ్యా-సం-300 వివ)

భూతార్థ వృత్తియగు ధాతువునకు 'ఇ'గాగమం బగు.

లిట్టు వుఙ్షు పరంబగునపుడు 'తి' వర్ణకం బగు.
౨౬. (బా-క్రి-౧౮) (వ్యా-సం-300 వివ).

'ఇకారంబుమీఁది కు-ను-వు' క్రియా విభక్తుల'... (తత్స-౨౬ సూ) అను సూత్రముచే 'రుఙ్షు'నకు 'ఇ'త్వంబు. ప్రథమ -వండెను-వండిరి. మధ్యమ -వండితివి-వండితిరి. ఉత్తమ :-వండితిని-వండితిమి వడినయన్నము-వండినన్-మొ.

౧ వివ :- యకారము తుదినిగల కొన్ని ధాతువుల ప్రథమ పురుషైకవచనమున 'ఎను' అను దానిచో 'అను' అనునది బహుళముగా నిల్చుట కవిప్రయోగదృష్టమగుచున్నది. (చూ-వ్యా-సం-౩౦౦ వివ. ౧౩౬-౨ పుట). చ-ఆ యలె నిజశక్తి నా యనుచు నా పసకుఁ (ఆము-౫ ఆ-౧౩౩) శా-అయ్యో నీ సుతు గ్రద్ద తన్ను కొనిపోయన్ (వేంకట-పంచ-౧ ఆ) మొ.

౨ వివ :- భవిష్యత్సామీప్యము మొదలగు కొన్నియెడల భూతార్థక్రియలు ప్రయోగింపఁబడుట గలదు. ఉదా :- తా వచ్చె సుదర్శనాయుధుఁడు (భాగ-౧౦ స్కం-పూర్వ-క్రియా-౭) మానవపతి నన్నెక్కడి దానవు నీ వనియెనేని (వి-రా-౧ ఆ-౯౦) అదియేల యవగుణ మయ్యెఁ (ఆను-౨ ఆ-౨౧౬) (చూ-వ్యా-సం-౧౩౬-౩ పుట) ఇచట 'అగున్' అని ప్రయోగింపనగును. నిన్నెద్ది గఱపిరి ! నెమ్మికోడ దానిన చేయుట ధర్మువు (ఆది-౮ ఆ-౪౩).

౩ వివ :- భూతకాలిక విధేయ విశేషణరూపములందుఁ బ్రాచీనార్వాచీనాధునాతన రూపముల భేదములు మిక్కిలిగఁ గన్పట్టుచున్నవి. (చూ-సమా-౮౩ సూ) నన్నయకాలమున -చేసినవాఁడను- చేసినవారము. తిక్కన కాలమునఁ బై నన్నయరూపములును తచ్ఛబ్ద వకారలోప రూపములును గలవు. చేసినవాఁడను=చేసినాఁడను చేసినవారము = చేసినారము ధూర్జటినాఁటికి .- చేసినవాఁడను = చేసినాఁడను=చేసినాను. చేసినవారము=చేసినారము=చేసినాము ఇట్లు వకారలోప రూపములె కాక 'డకార-రకార'లోప రూపములును బయల్వెడలినవి. ఆధునిక మధ్యమ:- చేసినావు-(బహు.- చేసినారు). ప్రథమ : చేసినాఁడు-చేసినారు. ఈ ప్రథమ పురుషరూపములు తిక్కనాది సమ్మతములె. అమహత్త్వమందును (అది చేసినది - అవి చేసినవి-) భేదము లేదు సర్వసమ్మతములు 'చేసినాను-చేసినాము-చేసినావు' అనునవి ప్రాచీనసమ్మతములు కావు. (ఒక్క రంగనాథరామాయణము తప్ప)

ప్రియోగ-ఒనరించినాను (కాశి-3 ఆ-౨౧౮) (ఇట్టివి ధూర్జటి సమ్మతములు.) చెఱఁబెట్టినావు (రంగ-రా-యూని-3౦౭ పుట) (చూ-వ్యా-సం-౨౯ వివ ౧3౫౬పుట). ఇవి సమాపకక్రియలవలెఁ జూపట్టును. వర్తమాన భూతార్థములందె విధేయవిశేషణములం దిట్టి భేదము గల్గెను. భవిష్యద్విధేయ విశేషణములం దిట్లు 'చేయఁగలావు-చేయఁగలాము - చేయఁగలాను' అను రూపములను మహాకవు లెవ్వరును బ్రియోగింప లేదు.

కలజ్యనుబధంబు ల్రృట్టు పరంబగునపు డగు. ౨౭.

(బా-క్రి-౧౯) (వ్యా-సం-3౦౧ వివ)

ల్రృట్టు పరంబగునపు డనఁగా భావిని ధాతువునకు 'కలజీ' అనునది యనుబంధంబగు

జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు ౨౮.

(బా-క్రియా-౨౦) (వ్యా-సం-3౦౧ వి)

జీత్తు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

'కలజీ-పడుడు'లు పరంబగునపుడు నుగాగమం బగు ౨౯ (బా-క్రి-౨౧) (వ్యా-సం-3౦౧ వి)

ద్రుతకార్యంబు-ప్రథమ- వండఁగలఁడు- వండఁగలరు- వండఁగలదు-వండఁగలవు మధ్యమ :-వండఁగలవు-వండఁగలరు-ఉత్తమ :-వండఁగలను-వండఁగలము. ఈ భావ్యర్థమందును (కాన్-కన్) శబ్దము లన్ప్రయుక్తములగును. (క్రియా ౧౧౯ సూ) వండఁగాఁగలము-వండఁగఁగలము.

౧ వివ :- పయి నుదాహరించిన రూపములలోఁ గొన్ని యర్వాచీనములు ప్రాచీన సమ్మతములు కావు. సమాపకక్రియలును విధేయవిశేషణములు నని నన్నయ కాలమున 'వండఁగలవాఁడను. వండఁగలవారము- వండఁగలవాఁడవు-వండఁగలవారరు. వండఁగలవాఁడు-వండంగలవారు' అనురీతిని దచ్చ్బద 'వ' కార ఘటితరూపములె యుండెడివి (చూ-సమా-౮3 సూ). తిక్కన నాఁడు పయి

రూపములె కాక 'వ' కార లోపరూపములును-(వండఁగలవాఁడను-వండఁగలాఁడను వండఁగలవారము=వండఁగలారము. వండఁగలవాఁడు=వండఁగలాఁడు' మొదలగు రూపములు) బయల్వెడలినవి 'వెల్వఁగలారు (భీష్మ-౨ ఆ-౧౧). ప్రాపింపఁగలారు (అను-3 ఆ-౭౦ ప) ఎఱ్ఱాప్రెగడ. 'వండఁగలఁడు-వండఁగలరు' అనురీతిని ప్రథమపురుషమునందుఁ బ్రయోగించెను చేయఁగలరు కలికాలమునన్ (ఆర ర ఆ-౭౯3) అమహాత్త్వమున నెల్లరును వండఁగలదు-వండఁగలవు' అనురీతి వానినె వాడిరి. ఇంక 'వండఁగలను-వండఁగలము-వండఁగలవు" అను నివి ప్రాచీనకావ్యములం దెంతమాత్రమును లేవు. (చూ-వ్యా-సం-30౧ వివ ౧3౬౯ పుట) ఇవి కేవలము నాధునిక రూపములు అర్వాచీనమహాకవి ప్రయోగసమ్మతములును గావు

౨ వివ :- కలవాఁడు = కలఁడు కలవారు-కలరు' అను ప్రాప్త్యర్థక కలుగు ధాతురూపములను నన్నయయే వాడెను. కాని యట్టివి భవిష్యదర్థకరూపములలో నెంతమాత్రము ప్రాచీనులు వాడలేదు మగటిమి గలఁడనియెడు న మ్మిగఁ జూచుచు నుండు విమము గ్రమ్మింగిన యేనిన్ (ఉద్యో ౧ ఆ 3౧౫) నీవచ్చుటఁ గలవో లేవో నిక్కము చెపుమా (విరా-ర ఆ ౨౧౧) అనురీతిని 'కలవు' మున్నగునవి యస్త్యర్థకములును వ్యస్తముగాఁ దిక్కనాదులచేఁ వాడఁబడెను గాని భావ్యర్థకరూపములలోఁ 'కలను-కలము-కలవు" అను రూపముల వాడుక యెంతమాత్రము లేదు

లొట్టు రుణ్ణు పరంబగునపుడు దుగాగమంబగు. 30.
(బా-కౌ-౨౨ సూ) (వ్యా-సం-30౨ వివ)

ప్రథమ -వండుదును- వండెదును-వండెడిని-(క్రి-౨ర సూ)- వండుదురు. మధ్యమః-వండుదువు-వండుదురు. ఉత్తమ :-వండుదును-వండుదుము లాడర్థంబులు క్రియా. ౧3 సూత్రము ౧ వివృతిలో నుదాహరింపఁబడెను. రుణ్ణు ప్రత్యాహారము=ప్రథమ పురుషైక వచనేతరములైన తిజ్ ప్రత్యయములు.

లాట్టు రుజ్ఞు పరంబగునపుడు 'ఎద' గాగమంబును, ప్రథమ ను' వర్ణకంబు (చూ-క్రియా ౨౪ సూ) పరంబగునపుడు 'ఎడుక్-ఎడిక్' అను నాగమంబులును బహుళంబుగానగు. 3౧. (బా-క్రి-౨3 సూ) (వ్యా-సం-30౨ వివ)

ప్రథమ - వందును-వందెడును-వందెడిని-(కి)-౨౪ సూ) (బ) వందెదరు మధ్యమ -వందెదవు-వందెదరు. ఉత్తమ-వందెదను-వందెదము. ఎడుగెడిక్కులు కేవల వర్తమానార్థకము లను సూరి యాశయము సరి కాదు (చూ-వ్యా-సం-౧3౭౨-౧3౭౭-పుటలు) ఇతరకాలములందును వాడఁబడును.

౧ వివ -లాట్టు విధేయవిశేషణరూపములు - ప్రథమ-వందు వాఁడు = వందెడువాఁడు = వందెడివాఁడు (చూ-కార- 3౪ సూ) (చూ-క్రియా-౫౫ సూ). వందువారు = వందెడువారు - వందెడివారు. మధ్యమ -వందువాఁడవు = వందెడువాఁడవు=వందెడివాడవు వందువారరు-వందువారు. మొ.

౨ వివ -లాడర్థక రూపప్రయోగములు వ్యా-సం-౧3౭౫ మొ ౧3౭౮ పుటలలోఁ జూడఁదగును ఇందు లాట్టు భూతార్థప్రయోగములును గలవు (చూ-క్రియా ౧3 సూ ౧ వివ.)

లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు. 3౨. (బా-క్రి-౨౪ సూ) (వ్యా-సం-303-303 I వివ)

వండితి = వండితివి వందుదు-వందుదువు-వందెదు = వందెదవు. (వందు+ఎద+(వలోప) ఉ=వందెదు)

౧ వివ .-'చనునె-(అను ప్రయుక్త 'కొను') దొరకొనునె-ఉందునె' అను రూపములకు వర్ణలోపముచేత 'చన్నె-దొరకొన్నె-ఉన్నె' అను రూపాంతరములు గలవు. (చూ-వ్యా-సం-౧3౮౪ పుట) (చూ-సంధి-౨౧ సూ). మునీంద్ర నీకుఁ జన్నె...(ఆది-౮ ఆ ౧౭౯). పుట్టకయున్నె (విరా ౧ ఆ-ప్రౌఢ-క్రియా-౨ సూ).

౨ వివ :_ఉండు ధాతువున కిట్టి వర్ణలోపరూపములు స్థలాంతరములందును గలవు. ఉదా ._ఉండునది=ఉన్నది. సీ_దుర్జనమోధవరుల కడనుండకున్నది (ఆది 3 ఆ ౨౦౬) నమ్మఁదగనివారి నమ్మికయున్నది. (శాంతి 3 ఆ ౨౩౯) ఉండునేనిన్=ఉన్నేనిన్. నడచుచున్నేని (శాంతి 3 ఆ ౨౭౫) రహస్యంబుగాక యున్నేని (అను_౪ ఆ ౪౨౨) ఉన్నన్=ఉండినన్. వర్షము లేక యున్నన్ (ఉద్యో_3 ఆ ౫౨)

తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిఙ్గాట్టుల ప్రథమ పురుష బహువచనమున కేకవచనం బగు. 33. (బా_క్రి_౨౫ సూ) (వ్యా-సం-3౦౨ విష ౧౩౭౯ పుట)

చిలుకల్లు పలికెను చిలుకలు పలుకును. చిలుకలు పలికెడును. చిలుకలు పలికెడిని మేఘములు గర్జిల్లెను. మేఘములు గర్జిల్లును. మేఘములు గర్జిల్లెడును మేఘములు గర్జిల్లెడిని.

౧ వివ _క. కులము గలవాఁడు శౌర్యము గలవాఁడును నధిక సేన గలవాఁడును భూతలమున రాజను నామము విలసిల్లఁగఁ దాల్చు . (ఆది_౬ ఆ_౪౭) ఇట్టి తిర్యగ్జడేతర కర్తృస్థలములందుఁ బ్రత్యేకాన్వయమును జేసి సమర్థించుకొననగును. శ్లో పాఞ్చ జన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ...దధ్మౌ . (మహాభార _ భీష్మ పర్వ_భగవ_౧ అధ్యా) ఇట్టి ప్రత్యేకాన్వయస్థలములు సంస్కృతమునందు సుప్రసిద్ధములు 'చెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోర నరకపంకమునఁ బడుఁ" (ఆది_౧ ఆ ౧౩౭).*

---

* ఈ భారతపద్యము నుదాహరించి త్రిలింగలక్షణ శేషకర్త "మహద్బహుకర్తృ క్రియకు నేకవచనంబు విభాషనగు" (ప్రౌఢ_క్రియ ౬ సూ) అని సూత్రించుట సరికాదు. ముద్రణ సంస్కర్తలు "చెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరక" అని సవరించుటయు సరికాదు.

లూట్టు ప్రథమ 'డుజ్-రు' లకు 'ఎడుమ-తన్' అను వర్ణకము లాశీశ్శాపార్థములం దగును. 3౮ (బా-క్రి-౨౬) (వ్యా-సం-3౦౮-3౦౮ I విష).

ఉదా-పెక్కు తునియ లయ్యెడుమ (సౌ ప్తి-౨ ఆ ౧౨౮) (ఎడుమ, కళ). ప్రసన్నుఁడయ్యెడుమ (శాంతి-౪ ఆ ౨౨౨). సీ. నీబుద్ధి ధర్మైక నిష్ఠ గావుతను (అను-౫ ఆ-౪౭౨) చేయుతన్ (రాఘు-౧ ఆ-౨). (కళా ౧ ఆ ౧) 'ఈవుతన్-పోవుతన్' అనునవి నిరాధారములు 'ఇచ్చుతన్-పోచుతన్' అనునవి సుశబ్దములు. 'నీ ప్రాన్కి బుగ్గగాను' (నీలా 3 ఆ) అనునది బుగ్గి 'గాతను' అనుదాని సంక్షేపరూప మేమో?. వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్ (ఆది ౧ ఆ-౧౦౬) అనురీతివి లాట్టు యొక్క ప్రథమ పురుషైక వచనరూపములని యెఱుంగనగును. †

లూణ్మధ్యమ 'వు-రు' లచో విధి ప్రభృత్యర్థ విశేషములందు ద్రుతపూర్వకమగు అది' శబ్దము నిల్చును. 3౯ (బా-క్రి-౨౭) (వ్యా-సం-3౦౮-3౦౮ I వి).

విధి -ఇచ్చునది ధనము పాత్రునకు (ఆది-3 ఆ ౨౦౮). ప్రార్థనము :-క. ద్వారవతినుండియును నిట యారసి యుండునది దానవాంతక ..(సభా-౨ ఆ ౮౨)- కం ఇమ్మునివరునకు నన్నుఁ బ్రి యమ్మున నిచ్చునది (అర-౨ ఆ-33౨) (వధువు తండ్రితో ననెడి వాక్యమిది.)

---

† సూరి 'లూట్టు డుఙ్షునకు ఎడు-త' వర్ణకంబులు ద్రుతాంతంబులగు (బా-క్రి-౨౬ సూ) అని యిట్లు 'ఎడు' వర్ణకమును విధించుట యవిమర్శమూలకము ప్రాచీన తాళపత్రగ్రంథములందును నాశీరాదులందు 'ఎడుమ' కానవచ్చుచున్నది "డుమ కాతౌ కావుతాద్యాః ..." అని యథర్వణుఁడును వచించెను (వ్యా-సం-3౦౮ విష). "ఎడు-త" ల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు" (బా-క్రి-౨౭) అను మకారవిధి (సూరిగారిది) నిరాధారము

ఏమఱకుండునది (ఆది-౨ ఆ ౧౮౧) (హిత ముపదేశించు నప్పటి వాక్య మిది) మఱచునది (సభా-౨ ఆ ౨౬౫). (ధృతరాష్ట్రుఁడు తనపుత్త్రుల దుండగముల మఱవుమని ధర్మజునితోఁ బల్కినవాక్యము) 'ఉండునది' అనుదాని రూపాంతరము 'ఉన్నది' (చూ-క్రియా-3౨ సూ-౨ వివ)

లుణ్మధ్యమ 'వు-రు' లకు ముడుజ్ఞు లగు 36.

(బా-క్రి-౨౯) (వ్యా-సం-305 I విష)

ఆశీస్సు -నీవు దీర్ఘాయువ వగుము మీరు-దీర్ఘాయుల రగుఁడు. శాపము -రాక్షసుండ వగుము. రాక్షసుల రగుఁడు సంప్రార్థనము - నన్ను రక్షింపుము నన్ను రక్షింపుఁడు. విధి -నా చెప్పినపని చేయుము- నా చెప్పినపని చేయుఁడు. ఇందలి 'ము' వర్ణకమునకు లోపము పాక్షి కము-రక్షింపుము-రక్షింపు (చూ-సంధి-౭౮-౮౫ సూ) ఇందము= ఇంద'=(ఇదిగో పుచ్చికొమ్ము) సూ-రా-నిఘంటువు దీని నవ్యయమ నెను ఇంద' ధాతురూపమనుట యుక్తమని తోఁచును.

ఉభయ ప్రార్థనంబున లూట్టునకు దుగాగమంబును

† దాని యుత్వంబున కత్వంబు నగు 37. (బా-క్రి-

30 సూ) (వ్యా-సం-306 307 I విష).

మనము వందుదము ' ఇత్తరుణిఁ బరిగ్రహింతము (ఆది-2 ఆ- ౨౧౫) చలుపుదమీ నిదాఘ దివసంబులు (ఆది-౮ ఆ-౨3౨).

౧ వివ .-క్రియా-౯౮ సూత్రము చొప్పునఁ పరిగ్రహింతము. మున్నగు చోటులందు త'కారము వచ్చెనని యెఱుంగునది ఉభయ కర్తృకత ల'కారము లన్నిటియందును గలదు ఉదా .-మనము చేయు చున్నాము మొ. లాట్టు దుక్కునకు దీనితో నెక్కుడు సంబంధము గన్పట్టును. మనము చేయుదుము-మనము చేయుదము. మొ "తరుణీ

---

† సూరి ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు" (బా-క్రి-30) అని సూత్రించెను ఈతఁడు ప్రార్థనార్థంబున 'దు'క్కును విధింప లేదు. ప్రార్థనార్థకము లూట్టె కాని లాట్టు కాదుగదా.

మనకీ శాప లేకుండినచో మనమీా సమయమున భోగసక్తులమై యుండు దుము" అనుచో 'యుండుదము' అని నిల్పరాదు.

౨ వివ '—'పోవుదుము-పోదుము-పోదము-పోవుదము' మున్నగు వానిలోని 'ము' ప్రత్యయ ముత్తమ పురుష బహువచన సంబంధి— 'పొమ్ము-పొదము-పదము' మున్నగువానిలోని 'ము' ప్రత్యయము మధ్యమ పురుషైక వచన సంబంధి—ఈ మధ్యమ పురుషరూపములందును వచనద్వయమునందును 'దు'కుట-ను 'అ'త్వమును 'పోవు' ధాతువునకు వెలయుచున్నవి మఱికొన్ని యాచ్ఛిక ధాతువులకును బహుత్వమున నివి మహాకవి ప్రయోగదృష్టము లగుచున్నవి ఈ ద'కార మహిమ చేత మధ్యమ పురుష ప్రార్థన క్రియలయందును నస్మదర్థ సాహిత్యము వెలయుచున్నది నీవు పొదము-మీారు పొదండు' అనువాన్యనుండి నీవు. వెళ్ళుము-మీారు వెళ్ళుండు-నేనును వచ్చెదను (లేదా) మేమును వచ్చెదము' అను నర్థ విశేషము భాసిల్లుచున్నది 'పోవుము-పొమ్ము అను వాని గట్టి యర్థ విశేషభానము లేదు * ఇట్లు పోవు ధాతువునకే కాక వెదకు మున్నగువానికిని బహుత్వమున నిట్టి రూపములు ప్రయోగదృష్టము లగుచున్నవి ఉదా .—వెదకుదండు-చూతండు-మొ (చూ - వ్యా - సం - 30౬ వివ. ౧౮౦౮ పుట) (చూ-క్రియా-౧౦౨ సూ)

3 వివ .—ఈ క్రింది లజీరూపములు వెనుకటి సూత్రములచేతనె సిద్ధించినను నచట నుదాహరింపలేదు. లకారముల వరుస చొప్పున నిట నుదాహరింపఁబడుచున్నవి. క్రియా ౨౭ సూత్రము చొప్పున 'అ'త్వము.

---

* సూరి యిట్టి విశేషమును జూచికొనక "పోవునకు దుజ్ముత్తులు ముజ్జుం బరంబగునపుడు 'వు' లోపంబుం 'బొద-పద'లును విభాష నగు" (బా-క్రి-౯౮) 'పొమ్ము-పొదము' అని కలగాయ పులగముగా నుదాహరించెను. ఇతర ధాతువుల బహుత్వమున నిట్టి రూపములు గలవని యీాతండుగాని ప్రౌఢవ్యాకర్తగాని చూచికొనలేదు.

ప్రథమ -వండఁడు-వండరు  వండదు-వండవు. మధ్యమ -వండవు-వండరు. ఉత్తమ .-వండను-వండము

మధ్యమ ము డుజ్జులు ముజ్జు నాఁబడు. ౩౮ (బా-క్రి-౩౧) (వ్యా-సం-౩౦౭-౩౦౭ I విష)

వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజీ యగు. ౩౯. (బా-క్రి-౩౨) (వ్యా-సం-౩౦౭-౩౦౭ I వి).

నీవు వండకుము - మీరు వండకుఁడు.

౧ విన .- మఱవకుము' అను దానికి బదులుగా 'మఱాకుము' అనియుఁ గవులు ప్రయోగించిరి. చ. అనుపమ సత్య విస్ఫురణ నాడిన మాట మఱాకుమన్న (ఉద్యో-౪ ఆ-౭౦ ప).

సంప్రార్థనంబున ముజ్జునకు 'అ-ఆ-ఇ-ఈ - అయ్యా-అన్న-అమ్మ' మున్నగునవి విభాషఁ ననుప్రయుక్తములగు. ౪౦. (బా-క్రి-౩౩) (వ్యా-సం-౩౦౮-౩౦౮ I వి).

రక్షింపుమ (ఆది-౨ ఆ-౨౧౭). చెపుమా (ఆది-౩ ఆ-౧౩౫). చెప్పుమీ (ఆది-౮ ఆ-౧౧౦) చెప్పకుమయ్య (అర-౩ ఆ-౩౭౭). వినుమయ్య శమథనాగ్రిణి (హరి-నలో-౨ ఆ-౩౬) 'వినుమయ్య' (నలపరార్థము) 'వినుము+అయ్యశమథనాగ్రిణి' (హరిశ్చంద్రపరార్థము).

వ్యతిరేకార్థక క్రియలమీఁద 'ఎ-ఏ-ఒ-ఓ-అయ్యా-అన్న-అమ్మ' మున్నగునవి నిల్చుటచే నవి ప్రార్థనార్థకము లగును. ౪౧. (బాలలో లేదు) (వ్యా-సం-౩౦౮-౩౦౮ I విష)

వేచినయది నన్నుఁ బంపవే ద్వారకకున్ (అశ్వ-౩ ఆ-౩ ప) (యతిస్థలము) రావే యీశ్వర కావవే వరద (భాగ ) పో వన్న కుమార (ఉద్యో-౩ ఆ-౩౪౮) పంపవే=(పంపవు+ఏ)=పంపుము. రావు+ఏ=రావే=రమ్ము కావవు+ఏ=కావవే=కావుము. పోవు+అన్న=పోవన్న=పొమ్ము

'ఎ-ఏ'ల యోగమున వ్యతిరేక ప్రార్థనాద్యర్థక 'ము' వర్ణక 'ము'కారమునకు 'వ'కారాదేశ మగును. ♦ ౪౨ (బా-క్రి-౩౪) (వ్యా-సం-౩౦౮-౩౦౮ I వివ)

ఉదా -వినకుము+ఏ=వినకువే. అడ్డపడకువే (శాంతి-౩ ఆ-౨౯౭) ఒందకుము+ఏ=ఒందకువే (ఉ-హరి-౫ ఆ-౮౭) మదింపకువే (కళా-౩ ఆ-౧౯౫).

౧ వివ:-నామములును క్రియలును యథాప్రయోగముగ 'అదాదుల'తోఁగూడి యర్థవిశేషముల నిచ్చుచుండును. ఉదా -నేనొక బ్రాహ్మణుండనే (ద్రోణ-౫ ఆ-౩౨ ప) మీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె (ఆది-౬ ఆ-౯౦). నీవు చదివెదవా? నీవు బ్రాహ్మణుఁడవా? మొ అదాదులు.-చూడు క్రియా ౪౦ సూ-వివ)

౨ వివ.-అయ్యాదు లేక వచనాంతంబులయ్యు బహువచనాంతములమీఁద సైతము నిల్చును ఉదా -చెప్పుఁడయ్య (ఆది-౭ ఆ-౨౦౭) చూచి వత్తమమ్మ సుదతులార (భాగ-౧౦ పూ భా) (ప్రౌఢ-శబ్ద ౪౪ సూ).

చూచు ధాతు ప్రార్థనాద్యర్థక సంశ్లేషరూపములగు చుమ్ము-చుము=(చూడుము) చుండు-చుఁడు=(చూడుఁడు) అనునవి ఎదాద్యను ప్రయోగమున 'చూవె-చువ్వె=(చూడవె) చూరె=(చూడరె) అను రూపముల నంది యథాప్రయోగముగ నామములమీఁదను క్రియ

---

♦ సూరి ఏయురీతిని సూత్రింపక ప్రార్థనాద్యర్థక ముజ్జునకు ఎదాదు లనుప్రయుక్తమగునపు డేకత్వమున 'వుజే'యు బహుత్వమున 'రుజే'యు నిత్యముగా నగునని సూత్రించి వినవే-వినరే-వినకువే-వినకురే' అని యుదాహరించెను ఈ పక్షమున వినుమయ్య శమధనాగ్రణీ (హరిశ్చంద్రనలో-౨ ఆ-౩౬) మున్నగుచోట్ల 'ముజ్జు' నిల్వనేరదు ఎదాదులలో సూరి 'అయ్య-అమ్మ' అనువానిని బరించెను 'వినకురే' మున్నగు బహువచన ప్రయోగములు కవిప్రయోగములందు లేవు

లమీఁదను నిల్చి యర్థవిశేషబోధకము లగును ౪౩
(బాలలో లేదు) (వ్యా-సం-౩౦౮ II వివ.)

వచ్చెం జూవె-వచ్చెం జూరె-వాఁడుసూనె- వాఁడు సున్వే. (గసడదవాదేశము-చూ-సంధి-౧౪ సూ). ఇట్టి 'చూవె' మున్నగు చోటులు తప్ప మఱెచ్చటను ప్రార్థనాద్యర్థ మధ్యమపురుషముపై ఎ-వ-లు నిల్చుటలేదు చూడుమే- మున్నగు రూపములు లేవని తాత్పర్యము

వచ్చు ధాతు ప్రార్థనాద్యర్థక సంక్షేపములగు 'రా-
ర-రారా-రార=(రమ్ము)' అను శబ్దములు యథాప్ర
యోగముగ నామములపయిని గ్రియలపైని నిల్చి యర్థ
విశేషద్యోతకము లగు ౪౪. (బాల లేదు) (వ్యా-సం-
౩౦౮ III వివ).

ఏమిరకర్ణ (ద్రోణ-౪ ఆ-౨౮౮). కాదురోరి (కాదుర+ఓరి) (భాస్క-యు). బళిరా (కళా-౧ ఆ). ఏరా తమ్ముఁడ. (పాండు-౩ ఆ-౩). (ఏమి-రా=ఏరా) కానీరా (తారా-౩ ఆ-౩౫ పుట) ఔర- ఔరా (ఔను+ర) (ఔను+రా).

౧ వివ :-కోశకారులు "రా - ర" అనునవి యవ్యయములనిరి. ఈ "రా-ర" అనునవి పరమగునపుడు పూర్వస్థిత మధ్యమపురుషముయొక్క 'ఉ'కారము 'అ'కారమగు నందురు ఉదా :- 'చేయరా = (చేయుముర) పాలింపరా (పాలింపుముర) ఉ. 'ఏలర యీ చలం బుడిగి యేలర (ఏలర=ఏలుముర)" అని యుదాహరింతురు. ఇట్టి చోటులనెల్ల బూర్వపదము 'తుమున్నా"ద్యర్థక మనుట లెస్స ఉదా :-(ఏలన్+ర=(రమ్ము)=ఏలర. (పాలింపన్+రమ్ము)= పాలింపరా. సత్యము సుమ్మర కుంతిభాషణంబు (శాంతి-౧ ఆ-౩౯).

మఱికొన్ని శబ్దముల జంటలును బ్రార్థనాద్యర్థ
విశేష బోధకంబు లగు ౪౫. (బాల-లేదు) (వ్యా-
సం-౩౦౮ IV. V వివ)

కానిమ్ము=(కాన్ + ఇమ్ము)=కానీ=కాని ఏను నీ యింతి గాని యెఱుఁగ రన్యు లు . (ఆది-౪ ఆ-౧౦౭) భూమి యీక తక్కిన మఱి కాని ముందొక కీడు దలంపఁడు (ఉద్యో-౨ ఆ-౧౭౦) కానీరా యిటువంటి నీ తకములె (తారా-3 ఆ-3౫ పుట) ఉండనీ=(ఉండ నిమ్ము) (కాశీ-౨ ఆ) కాదా=(కాదు+ఆ)=కదా = కద - కా (కళ). (కద+ఏ)=కదే వినఁగదయ్య=(వినుము) (ఆర-౬ ఆ-౬౪) ప్రసా దింపఁగదే (గద+ఏ)-(ప్రసాదింపుము) (ఉద్యో-3 ఆ-౪౦౮). వచ్చితి విగదా. నేఁడుగదా=నేఁడుగా (వసు-3 ఆ-౫౫). వీఁడేకదా. వచ్చితి వఁటె-వచ్చితిరఁటె (అఁట+ఎ) (అనుట=అంట=అఁట) వచ్చితిరటె (అటు+ఎ). వచ్చితివటయ్య-మొ

కదా-కద' మున్న గువానిపైని వె-రె' అనునవి నిల్చుటయుఁ గలదు. చెప్పఁగదవె=(చెప్పుము). (మనుచ-౨ ఆ-3౯) జయింపఁ గదవయ్య (ఉ రా-౧ ఆ-౭౮) (జయింపుము) కూర్పఁగదయ్య= (సారం-౨ ఆ-౧౭౦). (కూర్పుము) అవధారు=(అవధరింపుము) (కవి ప్రయుక్తము గాన ననింద్యగ్రామ్య మందురు) పొమ్ము=పో=నిశ్చయా ర్థకములు చేయుఁబో=(చేయును) అతఁడెపో (ఆతండే నిశ్చయము) ఆయెలె=ఆయులె=(అయ్యెనుగదా) (ఆము-౫ ఆ)

ట' వర్ణకంబు భావంబునం దగు ౪౬ (బా-క్రి-
3౫ సూ) (వ్యా-సం-3౦౯ I వివ)

భావం బనఁగా ధాత్వర్థంబు వండుట - పండుట - తినుట - కనుట. మొ

౧ వివ '-'ట' ప్రత్యయాదులు కృత్తులలోఁ జెప్పఁదగినవైనను సమాపక క్రియలందు వలెనె వీనియందును ధాత్వర్థీభూత వ్యాపార భానము వెలయుచుండుటచేతను, నివి సమాపక క్రియా ప్రత్యయ ములవలెనె సర్వధాతు సామాన్యములగుటచేతను వీనిని గ్రియా ప్రక రణమునఁ జెప్పుట యుక్తమయ్యెను.

'చేఁత - పోక - ఉంట' మున్నగువానియందును వ్యాపారార్థ భానము వెలయుచున్నను (ఈ "తజ్-క" మున్నగు ప్రత్యయములు) నివి సర్వధాతు సామాన్యములు కామింజేసి కృత్తులలోనె యుపదేశింపఁబడినవి.

౨ వివ:-టవర్ణక పరకత్వమున ధాతువు తుది 'ను' వర్ణము పాక్షికముగా బిందువగుట నన్నయేతర మహాకవి సమ్మతము. ఉ:- అనుట-అంట. తినుట-తింట. వినుట-వింట. మొ.

౩ వివ:-'చేయుకంటెన్' మున్నగువవి 'చేయుటకంటెన్' మున్నగువాని రూపాంతరములని యాధునిక వ్యాకర్తలు సూత్రించినను (ప్రౌఢ-క్రి-౧౪). నది ప్రాచీన సమ్మతము కాదు. అవి 'చేయుదానికంటెన్' మున్నగువాని రూపాంతరములు (చూ-సమా-౭౩ సూ). (చూ-వ్యా-సం-౨౧౦ VIII వివ).

౪ వివ:-'చేయుట' మున్నగువానికి రూపాంతరములుగ 'చేయుడు' మున్నగునవి కొన్ని కవి ప్రయోగములయందగపడుచున్నవి. క. మడరత్ని ధనుర్ధరుఁడు.. ...చేయుడు (ఆది-౭ ఆ-౧౬) (చేయుడు=చేయుట) చ. వడి ..ఓర్చుఁ డొక వావిరి బీరముగాఁ గరంబు చెప్పుడు నది (నన్ని-కు-౧ ఆ-౧౭౭).

౫ వివ:-భావార్థకము సముచ్చయ 'ను' శబ్దముతోఁ గూడి యానంతర్యార్థమును బోధించుట సంప్రదాయము. క. ఈ యగ్ని దేవు డసురకు నోయన 'చెప్పుటయు' (చెప్పినతోడనె) (ఆది-౧ ఆ-౧౩౪). (ప్రౌఢ-క్రియా-౧౨ సూ) ఇట్టి స్థలములందీ భావార్థక 'డు' ప్రత్యయము ధారాళముగ వాడఁబడును. * ఆ ముని యల్గి చూచు

* సూరి పయి విషయమును గ్రహింపక "ఆనంతర్యంబున 'డు' వర్ణకంబు ప్రమతాంతం బగు" (బా-క్రి-౪౨ సూ) "జాబిలి తోఁతెంచుడుఁ గువలయంబులు వికసిల్లె" అని సూత్రించి యుదాహరించుట సరికాదు.

డును- (ఆది-౪ ఆ-౩౮). విరాటుం డాత్మ తనూజుఁ బొగడుడున్ (విరా-౫ ఆ-౩౦౮) (యతిస్థలము). (వ్యా-సం-౧౪౩౫ పుట).

౬ వివ :-'అడ' ప్రత్యయాంతములు 'ఇంపు' ప్రత్యయాంతములును భావార్థకము లరుదుగఁ గలవు. ఉదా -కేరడములు (నరస-౨ ఆ-౭౯). చావడము (ఉద్యో-౩ ఆ-౬౧) ప్రేలడములు- 'కేరడములు-పాళగింపులు'' =(ఒడలు చూపుటలు) (పాండు-౩ ఆ-౪౩). నెలత్రావడములు (హరిశ్చంద్రన-౪ ఆ-౪౩). ఆరగింపు (పర-౪ ఆ-౧౯౯). అడ్డగింపు (ఉరా-౧ ఆ-౨౦౫). తాటింపు (పిన-శకుం-౧ ఆ-౩౯). ♦

వలయ్యాది క్రియలకుఁ గర్తయగు భావంబునందు 'నుజీ' యగు. ౪౭. (బా-క్రి-౧౨౨ సూ) (వ్యా-సం-౩౦౯ I వివ).

వలయ్యాది క్రియలకుం గర్తృభూతక్రియావృత్తియగు ధాతువునకు 'నుజీ' వర్ణకం బగు. ఉదా -వాఁడు చూడవలయు - వారలు చూడవలయు - నీవు చూడవలయు - మీరు చూడవలయు - నేను జూడవలయు - మేము చూడవలయు - మనము చూడవలయు. వలయు-కూడును - కూడదు - చెల్లును - చెల్లదు-తగును-తగదు-అగును-కాదు- ఇత్యాదులు వలయ్యాదులు. 'నాకుఁ జూడవలయు-మాకుఁ జూడవలయు-' అని షష్ఠియు నగును.

---

♦ సూరి ఈ సూత్రముక్రింద ' కజీవర్ణకంబు పూర్వార్థయోగంబున విభావను భావంబునం దగు. (బా-క్రి-౩౬ సూ) వండక మునుపు= (వండుటకు మునుపని యర్థము). మునుపు-ముందు-మున్ను-తొల్లి' అను రీతివి పుర్వార్థకములు'' అని సూత్రించి యుదాహరించెను ఇది సరికాదనియు వ్యతిరేక క్త్వార్థక 'కజీ' కిది భిన్నముకాదనియు ముందు వివరింపఁబడును. (క్రియా-౫౦ సూ-౧-౨-వివరణములు).

౧ వివ :—ఇందలి కర్తృపదము షష్ఠ్యంతమగుట నన్నయ సమ్మతము. కం. పితృసంకల్పము సేయఁగ సుతుల కవశ్యమును వలయు (సభా ౧ ఆ ౯౪ ప). కాన యింక వేడఁగాదు నాకు (సభా-౨ ఆ ౨౬3). భావార్థకమగు 'నుజి'చే నభిహితమైన కర్తకుఁ బ్రథమయు నగును దైవము తోడ్పడన్ వలయు (ఉద్యో 3 ఆ-౭3). వినవలయువాని నెల్లను జననాయక వింటి వీవు (అశ్వ ౧ ఆ-౮ ప) ఈ నుజ్యంతమునకు సయితము 'కాన్-కన్' అనునవి యను ప్రయుక్తము లగును చేయఁగవలయున్ (సభా-౧ ఆ ౯౪ ప) (చూ-క్రియా ౧౧౯ సూ). ఈ నుజ్యంతముతో వలయ్యాదులు వ్యవహితముగా సైత ముండవచ్చును. కం. పితృ సంకల్పము సేయఁగ సుతుల కవశ్యమును వలయు (సభా ౧ ఆ ౯౪). ఈ నుజి ద్రుతమునకు సంశ్లేషమును నగును. దైవము తోడ్పడన్ వలయు (ఉద్యో 3 ఆ ౭3) పెక్కు నుజ్యంతముల కొక్క 'వలయ్యాది' శబ్దము నిల్చుటయుఁ గలదు. క. అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయను జూడరాని యట్టి శుభచరిత్ర (అర ౨ ఆ ౯౧)

౨ వివ .—ఒక్కొకయెడల వలయ్యాది యోగము లేకయె భావంబున నీ నుజి ప్రయోగింపఁబడుటయు నరుదుగఁ గలదు. చ. ఇతనికిఁ గూర్తు రేని ..చేయఁ బాడియే (సభా-౨ ఆ-౧౦ ప) (చేయన్=చేయుట, పాడియే=నీతియా ?)

3 వివ -భావార్థక నుజ్యంతముపైని 'పట్టి' వర్ణకము నిల్చుటయుఁ గలదు. ఉదా :—నీవు గల్గఁబట్టి (అర ౬ ఆ ౬౧) కలుగంగఁబట్టి (కాశీ 3 ఆ ౪౪). దీనిచే నీ భావార్థకముమీఁద నితర విభక్తులు నిల్వవని విశదమగుచున్నది

౪ వివ :—చ. అమలిన తారకా సముదయంబుల నెన్నను-పొందను... ఈదను .. విధాతృనకైనను నేరఁబోలునే (ఆది ౧ ఆ ౧౯) చూ-కార-౧3 సూ) ఇత్యాది స్థలములందు సామర్థ్యార్థక యోగ

చతుర్థిని బోధించు తుమర్థక క్రియలనియు నెఱుంగునది. మాన్పఁ గావను శక్యమె (ద్రోణ ౫ ఆ 3౫౫ప) (మాన్పనుటకును గాచుటకును శక్యమా?)

వ్యతిరేక భావంబున మిజి యగు ౪౮. బా-క్రి-32) (వ్యా-సం-3౧౦-3౧౦ I వివ)

వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు 'మిజి' వర్ణక మగును ఉదా:-వండమి=(వండకుండుట) పండమి=(పండకుండుట) శక్షిం పమి.. (ఆర ౧ ఆ-౧౭౦). మృత్యువమై యెపఁగు నొప్ప మికి ..(హరి-పూ-భా-౪-ఆ-౧౬3) (యతిప్రాసస్థలములు)

సమాన కర్తృకంబులం బూర్వకాలమునందు 'ఇ' వర్ణకంబగు ౪౯. (బా-క్రి-3౮) (వ్యా-సం-3౧౧-3౧౧ I వివ).

సమాన కర్తృకంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలంబగుఁ దద్వాచియగు ధాతువునకు 'ఇ' వర్ణకంబగు. ఇదియే క్త్వార్థంబు నాఁబడు. ఉదా:-వండి-పండి-విని-కని. ఈ సమాన కర్తృకత్వపు నిర్వాహమునకయి పెక్కుచోటులందు "ఉండు" ధాతు రూపము లధ్యాహార్యము లగుచుండును. ఉదా -క రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె (ఆది-౨ ఆ ౧౯) కంఠము దెగి యున్న దేహము ధరణిఁ బడియె' అని సమాన కర్తృకత్వమును గ్రహింపనగును

౧ వివ:-ఈపద్ధతి సంస్కృతమందును గలదు. 'క్రియాణా మేక కర్తృకత్వే ఏవ క్త్వాచ్ స్యాత్...పుత్త్రం దృష్ట్వా సుఖం భవతి. ఇత్యాదౌ స్థిత స్యేత్యధ్యాహా రాదేక కర్తృకత్వే క్త్వాచ్" (ముగ్ధ-దుర్గా-వ్యాఖ్య ౧౧౬౬ సూ) (చూ-వ్యా-సం-౧౪౪౯. ౧౪౫౦ పుటలు) *

---

* సూరి "చైత్రునిచేతఁ గొట్టఁబడి మైత్రుండు మడిసె" మున్నగు చోటులందు సమానకర్తృకత్వము కుదురు పడదనుచూ

౨ వివ :-ఆత్మనే పదార్థక కొను ధాతుక్త్వార్థక రూపమగు (పట్టు)కొని' మున్నగువానికిఁ బర్యాయములుగ 'పట్టుక-పట్టుకు-పట్టుకొ-పట్టుకొన్'' అనురీతివి నిల్చుట గలదు. ఉదా :-మెడఁబెట్టుకొయ్యఁ దిరుగన్ హారంబులే భామినుల్ (శకుం-పరి-౬౦ పుట) (చూ-క్రియా-౬౩ సూ-౬ వివ). ఇట్టి ప్రయోగములు సాధువులని విశ్వసింపఁదగదు.

౩ వివ :-మిక్కిలు ధాతు క్త్వార్థకమగు మిక్కిలి' శబ్దము విశేషణముగ సయితము వాడఁబడు నందురు. (శ. ర) వాని మిక్కిలి చేతులు - మిక్కిలి కన్నుల్ (సభా-౨ ఆ-౫౭). 'మిక్కిలు' అను తద్ధర్మవిశేషణము నె నిల్పుట లెస్స

'కజి' వ్యతిరేక క్త్వార్థంబునం దగు-౫౦-(బా-క్రి-౩౯). (వ్యా-సం-౩౧౨ I వివ).

---

సమానాశ్రయములన్' అని సూత్రించెను. (బా-క్రియా ౩౮ సూ) కాని యీ సూరి సూత్రము నుజ్యంతాదిస్థలములం దతివ్యాప్తమగుచున్నది ఉదా :-చైత్రులచేతఁ గొట్టఁబడఁగా మైత్రుండు మడిసె. చైత్రునిచేతఁ గొట్టఁబడి యున్న మైత్రుండు మడిసె'' అని యిట్లు 'ఉండు' ధాతు రూపాధ్యాహారముచే నేక కర్తృకత్వము గల్గుచునే యున్నది. కాన నిట్టివాని సాధుత్వమునకై ఒక్కొకచో భూతార్థకాసమాపకక్రియ హేత్వర్థకంబు నగు. రాహుకంఠము దెగి దేహము ధరణిఁ బడియె (ఆది-౨ ఆ-౧౯)' (ప్రౌఢ-క్రియా-౧౫ సూ). అని ప్రౌఢవ్యాకర్త సూత్రించిన సూత్రము నిరర్థకము. ఇంక ననర్థకము నగుచున్నది. సీ భీము గదాహతి భూమిఁ గూలి యాతనిచేత సర్వాంగంబులందును గలుగు క్రొన్నెత్తురు కాంక్షఁ ద్రావఁ బడి మఱి తెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుఁడు.. (స్త్రీ-౨ ఆ-౫౫ ప). మున్నగుచోట్లఁ బ్రౌఢవ్యాకర్త చెప్పినట్లు హేత్వర్థకము కుదురు పడదుగదా పడియుండుటకు రక్తము త్రావఁబడుట హేతువుకాదు. గదాహతిచేఁ బడియున్నపిమ్మటనే యాతని రక్తము భీమునిచేఁ ద్రాగఁబడెను.

వండక-పండక-కొట్టక-తిట్టక. "వారు-ఉఱు" ధాతువులు వ్యతిరేకార్థములందె వాడఁబడును. ఉదా -వారని యలజడి (ఉద్యో ౨ ఆ ౭౬) ఉఱఁడు సురేంద్రుఁడైన (ఆది ౬ ఆ ౧౮౫)

౧ వివ.—ఇద క్త్వార్థమునకు వ్యతిరేకమాత్రమె యగుటంజేసి యిందును సమాన కర్తృకత్వాది నియమము లావశ్యకములె. క. సకల...బార్హద్రధికి వని మొనఁగా మార్కొనఁనో పకవలియం బాఱఁడె యీ ముకుందుఁడు (సభా-౨ ఆ ౧౬ ప) (వలియు=సన్నగిలు). ఆ-వె. చదువకయును నాకు సర్వవేదంబులు సంభవిల్ల వలయు (అర-3 ఆ-౨౫౪). 'చదువక' అనుదానికిఁ గర్త 'నేను' శబ్దము సంభవిల్లుటకుఁ గర్త సర్వవేదంబులు. ఇట సమాన కర్తృకతకయి 'చదువక యున్నను సర్వవేదంబులు సంభవిల్ల వలయు' నని యుండు ధాతు రూపాధ్యాహారము చేయుటచే 'ఉన్నన్' అను దానితో సమాన కర్తృకత్వము సిద్ధించినది

౨ వివ.—పయిరీతి నుండు ధాతు రూపాధ్యాహారముచేతనే యీ క్రిందిరీతిగల ప్రయోగములును సిద్ధించును. ఉ. ఇనుండు పశ్చిమాంభోనిధిలోనఁ గ్రుంగకయ మున్న (మనుచ-౨ ఆ-౭౬). ఇట 'క్రుంగకయ మున్న' అనుచో 'క్రుంగకుండుమున్న' అని 'యుండు' ధాతురూపాధ్యాహారముచే సమాన కర్తృకత సిద్ధించుచున్నది. కొన్ని యెడల నిట్లుండు ధాతురూపాధ్యాహార మక్కఱలేకయె యుండు ధాతు ప్రయోగమే వెలయుచున్నది చ. తునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంగకుండు మున్న నరవరేణ్య (ద్రోణ-౨ ఆ-౨౮౧) *

---

* ఇట్లు 'ఉండు' ధాతు రూపాధ్యాహారముచే రూపసిద్ధి కల్గుచుండుటచేత 'కజీ వర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునందగు' (బా-క్రి-౩౬ సూ) అనుసూత్ర మనావశ్యకమయ్యె.-వండకమునుపు=వండకుండు మునుపు. మొ.

తుమర్థ భావలక్షణంబులందు నుజీ యగు. ౫౧.
(బా-క్రియా-౮౦ సూ) (వ్యా-సం-3౧3-3౧3 I వివ).

తుమర్థమందును భావలక్షణమందును ధాతువునకు "నుజీ" వర్ణకంబగు. సంస్కృతమందలి 'తుమ్' ప్రత్యయమున కర్థము తుమర్థము. ఉదా .-తుమర్థము .-చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయెనని యర్థము. భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణ భూతంబగు క్రియ. ఉదా .-చైత్రుండు వండ నతిథివచ్చెను. (సంస్కృత.- 'చైత్రే పచతి సతి అతిథి రాజగామ' దీనిని సంస్కృతమున "సతి సప్తమి" యందురు) ఇట వంట లక్షణము వచ్చుట లక్ష్యము. అతిథి వచ్చుట చైత్రిపచనకాలమని యర్థము సీ. ఈతఁడు వృద్ధని యెఱిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ (సభా-౨ ఆ-౧౧) ఇందు 'ఉండన్' అనునది భావలక్షణార్థముగ నుపచరింపఁజేసికొనవలెను (ఇచట భావలక్షణార్థ మంత స్పష్టముగాఁ దోఁపదని భావము). పై పద్యమున సీసచరణములు నాల్గిటను నిట్టి భావలక్షణార్థకక్రియలె యున్నవి.

౧ వివ .- చాలన్' అనునది చాలు ధాతు నుజ్యంతరూపమై యవ్యయ విశేషణముగా నైతము వాడఁబడుచున్నది 'చాల-చాలా' శబ్దములు విశేషణత్వమునఁ గళలుగా నగపడును. చాలకాలము (పాండు). చాల భరంబుగఁ బూనెన్ (అర-౭ ఆ-౨౦౦). చాల మేలందురు (హరి-పూ-భా-౭ ఆ-౭౮౬) చాలా (చాలన్?) గౌరవమొంద (హరి-పూ-భా-౬ ఆ-౧౮౦) లక్ష్మీనారాయణ కోశమున 'చాల చాలా' విశేషణములుగాఁ జూపఁబడెను.

౨ వివ .-తుమర్థ మనఁగా 'తాదర్థ్యార్థము' ఏ ధాతువు నర్థము రెండవ ధాతువు నర్థమునకుఁ బ్రయోజన మగుచుండునో యా ధాతువు పైని 'నుజీ' నిల్చును. దీనినె తుమున్నర్థక మందురు. తెలుఁగునందలి తాదర్థ్యార్థముసైతము సంస్కృతమునకన్న భిన్నమె (చూ-వ్యా-సం-౧౮౫౭ పుట). 'కృష్ణః భోక్తుం జగామ' =(కృష్ణుఁడు భుజించుట కేఁగెను) అను చోటియందువలెఁ దెల్గున మఱొక క్రియతో నేక కర్తృకత్వ ముం

డవలెనను నియమము లేదు. (పయి సంస్కృత వాక్యమున భుజించుటకును నేఁగుటకును కృష్ణుఁడే కర్త) తెల్గున 'ఈశ్వరుని మాఱొడ్డన నీ శక్యమా'=(నీకు శక్యమగునా ?) అనుచో మాఱొడ్డనుటకు నీవు కర్త. అగుటకు శక్తి కర్త ఇట్లు భిన్నకర్తృకతయుఁ దెల్గున నుండును 'కృష్ణుఁడు విప్రుని నన్నమును భుజింప నిమంత్రించెను' అను తెలుఁగు వాక్యమును సంస్కృతమున "కృష్ణః విప్ర మన్నం భోక్తుం నిమన్త్రయతే" అని వచింపరాదు. ఇది భిన్న కర్తృకస్థల మగుటచే 'తుమ్' ప్రత్యయము రాదు. (విప్రుండు భుజించుటకుఁ గర్త-కృష్ణుఁడు నిమంత్రించుటకుఁ గర్త.) ఇంక 'కృష్ణః అన్నభోజనాయ విప్రం నిమన్త్రయతే'' అని తాదర్థ్య చతుర్థినె నిల్పవలెను పైని వ్రాసిన 'ఈశ్వరుని మాఱొడ్డన నీ శక్యమా'' అను దానివంటి వ్యతిరేక సంక్షేప వాక్యాన్వయమున భిన్న కర్తృకత నియతమై యుండును ధారుణీప్రజకు ..ఉండఁగ, లావే (ఆది-౮ ఆ-౨౮౯). కర్మ విపాకంబు గడవంగ లావె (ఆది-౬ ఆ-౨౫౦).

౩ వివ -"ఎఱిఁగించు = ఎఱుఁగఁజేయు'' మున్నగు ప్రేరణార్థక క్రియలలో ఎఱుఁగుటకుఁ గర్త యస్మదర్థకము. చేయుటకుఁ గర్త ప్రేరకుఁడు. ఇట్టి వెల్ల భిన్నకర్తృకస్థల తుమర్థకములె

> చేదర్థమునందును, నఞర్థమునందును, భూతార్థమందలి భావలక్షణార్థమందును, దృతాంతంబగు 'న' వర్ణకం బగు ౫౨. (బా-క్రి-౮౧)
>
> చేదర్థ యోగంబున భావిని లిట్టు విభాష నగు. ౫౩. (బా-క్రి-౧౧౯) (వ్యా-సం-౩౧౪-౩౧౫ I వివ).

ఇట్టి ప్రత్యయము సంస్కృతమున లేదు. కావుననే 'చేత్-అపి' మున్నగు పదము లీయర్థములందు వాడఁబడును. ఉదా :- చేదర్థ :- క వినినఁ బఠించిన వ్రాసినఁ గొనియాడిన దురిత పీడకుం దొలఁగి (శాంతి-౩ ఆ-౩౮౨) అప్యర్థ :-చ అడిచినఁ దిట్టినన్ మఱి మహా పరుషంబులు వల్కి యల్కతోఁ బొడిచిన నుత్తమ ద్విజులు పూజ్యులు (ఆది-౧ ఆ-

౧౩౯). భూతార్థ భావలక్షణ :_వయోధిరిక్తమై నన్.....కాల కేయులు బయల్పడి త్రోఁచిరి (అర-౩ ఆ-౩౯).

౧ వివ _'నాఁడు_ఏని' యున్నగు శబ్దములును నీ యర్థము లం దుపయోగింపఁబడును. ఆధునికులు 'చోన్_ఎడన్_ఎడలన్' మున్నగు శబ్దములనుసైతము చేదర్థమున వాడుదురు సీ. నేఁడు పోవనినాఁడు నిష్ఫలం బిమ్మహాయత్న మంతయు (ఆది-౧ ఆ-౧౧౫). క....దుశ్చరితుఁడై యహితుఁడగునేనిన్ మఱవక గురునైన ..శాసించునది. (ఆది-౬ ఆ-౧౦౩) భావిని లిట్టు ._గీ కడఁగి సమబుద్ధి వీనికిఁ గల్గెనేని కాదు శాప ఫలం బట్లు గాక బుద్ధి హీనుఁడై గర్వితుండగునేని శాప హవ్యవాహ ఫలంబు వీఁ డనుభవించు (అర-౧ ఆ-౧౦౩) ఇది 'ఏని' శబ్ద ప్రయోగోదాహృతియు నగుచున్నది. కం ఇంతుల గోష్ఠినున్న యతఁ డెంత వివేకము గల్గెనేని య త్యంత మదాభిభూతుఁడగు (ఆది-౭ ఆ-౫౯). *

చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున వర్త మానార్థంబునం దగు. ౨౪ (బా-క్రి-౪౩). (వ్యా-సం-౩౧౪-౩౧౪ I వివ).

చూచుచుం బోవుచున్నాఁడు. చూచుచుం బోయెను. చూచుచుం బోవఁగలఁడు భూతభావులందును 'చూచుచున్' అను పోవునప్పటి పరన వర్తమానక్రియ విరుద్ధము కాదు. క్త్వార్థకాదు లయిదును గ్రియతోనె యన్వయించుఁ గానఁ గ్రియాకాంక్షాసమాపకము లనఁబడును.

౧ వివ :_సంస్కృతమునందలి శతృప్రత్యయము వర్తమానార్థక విశేషణము ఇది సంస్కృతమున విధేయ విశేషణ మగుటచేతఁ గ్రియా

* ఈ సూత్రమునకుఁ దక్షావత సూరి 'ఆనంతర్యంబున 'డు' వర్ణకంబు ద్రుతాంతం బగు" (బా-క్రియా-౪౨ సూ). అని సూత్రించెను. ఇది భావార్థక డు' ప్రత్యయమె యగుటచేత నీ సూరి సూత్రము ప్రామాదికము. ప్రత్యాఖ్యేయము. (చూ - క్రియా - ౪౬ సూ. ౪-౨ వివరణములు).

న్వయంబును దీనికి సంభవించును శ్లో శ్రియః పతిః శ్రీమతి శాసితుం జగ జగన్నివాసో వసుదేవ సద్మని వసన్ దదర్శావతరన్త మమ్బరా ద్ధిరణ్య గర్భాఙ్గ భువం మునిం హరిః (మాఘుకా - ౧ సర్గ - ౧ శ్లో). "హరిః వసుదేవ సద్మని వసన్ మునిం దదర్శ" = (కృష్ణుఁడు వసుదేవుని గృహమున నివసించుచున్నవాఁడై మునిని జూచెను) అని యన్వయము. సంస్కృతమందలి 'వసన్' అను శతృ ప్రత్యయాంతమునకుఁ దెల్గున 'వసించుచున్నవాఁడు' అను వర్తమానార్థక విధేయ విశేషణము పర్యాయము. కాఁగా సంస్కృతమునఁ దెల్గు 'చున్' ప్రత్యయముఁబోలు వర్తమానార్థక లాక్షణి కావ్యమువంటి ప్రత్యయము లేదని చెప్పనగును దీనిని దెల్గున శత్రర్థకమనుట సరికాదు. వర్తమార్థక లాక్షణి కావ్యయ మనఁ దగును ఇది తద్ధర్మాద్యర్థక విధేయ విశేషణము చోట నిల్పఁదగి యుండును ఒక్కరుండ చనువాఁడు=ఒక్కరుండ చనుచు (ఆది_౧ ఆ_౯౪ ప).

తద్ధర్మాద్యర్థక † విశేషణత్వమున 'ఎడు_ఎడి_ఉ'' వర్ణకంబులు పర్యాయంబున నగు ౫౫ (బా-క్రి-౫౪-౫౫ సూ) (వ్యా-సం-౩౧౬ I వివ)

ప్రహరించెడువాఁడు-ప్రహరించెడివాఁడు - ప్రహరించువాఁడు= ప్రహర్తయని యర్థము

౧ వివ:_'డోస్తు భేదకతాపి స్యా' త్తని యథర్వణుఁడు ఎడు' అను దానిని మాత్ర మంగీకరించినను నీక్రింది సోమయాది ప్రభృతుల ప్రయోగములను బట్టి 'డి_ఉ' వర్ణకాంతములును నంగీకార్యములె క. ద్రౌపది నట్టులు పటిచెడిదే (ఉద్యో-౧ ఆ-౩౪౪) నీయట్టివాఁడు నిన్నీ పోయెడిదే (విరా-౫ ఆ-౨౦౬). ( పోయెడునదే' అన్నచో ఛందోభంగ

---

† తచ్ఛీల తద్ధర్మాద్యర్థములందును 'తృన్' ప్రత్యయము వైయాకరణ సమ్మతము. (చూ-ముగ్ధ-వ్యా-౯౯౦ సూ దుర్గా-వ్యాఖ్య). 'తద్ధర్మ . డోస్తు భేదకతాపి స్యాత్' (వ్యా-సం-౩౧౬ వివ ౨౯౬ I వివ)

(క్రి-౫౬ సూ ౧/౫౫ ౧/౫౬ వివ) తద్ధర్మాద్యర్థక విశేషణాదుల యుదాహృతులు మగు) "వారియును వయించు సితకృష్ణ తంతురాజిత తంత్రమది" (ఆది-౧ ఆ-౧౧౯) (వయించు=నేయుచున్న) మనకుఁ జేయు దుండగములు. (జై ౧ ఆ) (చేయు=చేసిన) జనమేజయు చేయు సర్పయాగమున (ఆది-౧ ఆ-౧౩౧). (చేయు=చేయఁగల=చేయనున్న) ఇట్టి తద్ధర్మాద్యర్థక విశేషణములు కాలత్రియబోధకము లగును. (చూ-ప్రౌఢ-క్రియా-౧ సూ). ఇంకను బ్రయోగములు.-ధాత్రిఁ బరిభ్రమించు (ఆది-౧ ఆ-౧౦౮). చ. గొంతి ముద్దుసే యు కొడుకు (విరా-౧ ఆ-౯౮). క కడక మదీయాస్త్రము లని యెడు... (ఆది-౭ ఆ-౧౯౩) ఒక్కరుండ చను వాఁడు (ఆది-౧ ఆ-౯౪ గద్య) (చనువాఁడు=చనుచున్నవాఁడై) ఇట్లె 'చనువాఁడు" (ఆది-౧ ఆ-౧౦౭ ప)

'ఉన్న-కలజీ-న' వర్ణకంబులు భవద్భావి శతృ-క్త్వ దర్థంబులం దగు. ౫౬. (బా-క్రి-౪౬). (వ్యా-సం-౩౧౫ II వివ)

'ఉన్న' వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థమునం దగు. 'కలజీ' వర్ణకము భవిష్యదర్థక శత్రర్థమునం దగు. 'న' వర్ణకంబు 'క్త్వ'దర్థంబునం దగు. ఇవి సత్వాభిధానంబునం దగునని యెఱుంగునది. సుబంత వాచ్యంబు సత్వంబు నాఁబడును. ఇవి ధాతుజ విశేషణములనియు విశేష్యభూత సుబంతమునె యాకాంక్షించుననియు నక్కారణమున నివి నామాకాంక్షాసమాపకక్రియలనియుఁ దాత్పర్యము. ఉదా-వండుచున్న వాఁడు (క్రియా-౨౭ సూ చువర్ణకము సమా-౮౨ సూ-౨ వివ. తచ్ఛబ్దానుప్రయోగము). వండఁగలవాఁడు (క్రియా-౨౮-౨౯ సూ. 'అ'త్వము, నుగాగమమును, సమా-౮౨ సూ-౨ వివ తచ్ఛబ్దాను ప్రయోగము). వండినవాఁడు (క్రియా-౨౫ సూ ఇగాగమము, సమా-౮౨ సూ-౨ వివ. తచ్ఛబ్దాన ప్రయోగము)

౧ వివ.-'ఉండిన' అను భూతార్థకమునుండి యేర్పడినను 'ఉన్న' శబ్దము వర్తమానార్థకముగనే కవి ప్రయోగసమ్మతము (చూ-క్రియా-౨౧ సూ-౨ వివ).

౨ వివ :-చున్న :-వెలిగించుచున్న నృపపూజ్యులు (ఆది-౮ ఆ-౨౮౭). 'ఉండుచున్న' అనరాదు క్రియా-౬౬ చొప్పున ఉండు' ధాతులోపమగు కాన 'ఉన్నవాఁడు' అనవలెను (సభా-౧ ఆ-౧౬౧) (ఆది-౭ ఆ-౨౮౨) (చూ-క్రియా-౧ సూ-౨ వివ) కల-అరంగల దీపమ ట్లతఁడు మండుఁగాక యే నార్చెదన్ (కర్ణ-3 ఆ-౪౯) ఈఁగల వాఁడ నేను (సభా-౨ ఆ-౧౭౪). 'న' వర్ణక :-చిచ్చువెట్టి కాల్చిన యది... (ఉద్యో-౨ ఆ-౧౪ ప).

వ్యతిరేక తద్ధర్మాద్యర్థములందు నిజి' యగు. ౫౭.
(బా-క్రి-౪౭) (వ్యా-సం-3౧౭ I విష)

వండనివాఁడు. (క్రియా-౨౮ సూ-అత్వము, సమా-౮౨ సూ-౨ వివ-తచ్ఛబ్దానుపప్రయోగము).

'ఎడు' ప్రభృతి వర్ణకాంతంబు లేదును నామములతోడనే యన్వయించుఁ గాన నివి ధాతుజ విశేషణములు, క్రియాజన్యవిశేషణములు, నామాకాంక్షాసమాపకములు నసఁబడును

లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మార్థంబులందును నకర్మకంబునకుఁ గర్త్రర్థమాత్రమందును నగు. ౫౮ (బాల-క్రి-౪౮) (వ్యా-సం-3౧౮ విష)

సకర్మకంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు. అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు ఆకాంక్ష యనఁగా వాక్యార్థబోధముకై పదము పదాంతరము నపేక్షించుట తెల్గున నకర్మకములకు భావార్థక తిఙంత రూపము లేదు సంస్కృతమున 'త్వయా-మయా-తేన భూయతే' అని యున్నట్లు తెల్గున'నీచేత-లేదా నాచేత-వానిచేత ఉండఁబడెను-కాఁబడెను' అని యుండరాదు అసమాపక భావార్థకములు తెల్గునందును భావాళము-గా నుండును 'వాఁడుండుట-మీఁరగుట' మున్నగునవి యుదాహృతులు ఇట్టియెడలఁ గర్త యభిహితమగునని యెట్లును జెప్పనగు ననరాదు. క్రియ నిరాశ్రియ ముండనేరదు గాన నిట్టి భావార్థకాదులందును నాభాసకర్త

త్వము నంగీకరించి కర్తకుఁ బ్రాతిపదికార్థ ప్రథమను జెప్పకతీరదు. (చూ-కార-3౨ సూ-3 వివ) (వ్యా-సం-౨౬౫ II వివ).

౧ వివ .—సంస్కృతమందువలెనె తెల్గునందును గొన్నియెడల నర్థముల మార్పుచేత సకర్మకంబు లకర్మకము లగును అకర్మకములు సకర్మకము లగును ఉదా .—సకర్మ :-కన్ను మూయదు నాకున్ (అర-౧ ఆ-౨౭౦). ఆర్యుఁడు జయించుఁగాక =(సర్వోత్కర్షచే వర్తించుఁ గాక)=(జయతు జయ త్యార్యః) అకర్మ :-వేఁటఁ బోయిరి. (అర-౬-ఆ) పోల మేఁగెను (వి-పు-౭ ఆ). (చూ-ప్రౌఢ-కార-౧3 సూ) (చూ-వ్యా-సం-3౧౫ వివ).

పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు ౫౬. (బా-క్రి-౪౬) (వ్యా-సం-3౧౯-3౧౯ I వివ)

కర్మార్థంబునందు ధాతువునకు 'పడు' జ్యనుబంధం బగును. క్రియా-౨౫-౨౬ సూత్రములచే ధాతువుయొక్క 'ఉ'త్వమునకు 'అ'త్వమును నుగాగమంబును నగును ఇందలి తిఙ్ఞుచేతఁ గర్మం బభిహితం బగును గాన నది ప్రాతిపదికార్థ ప్రథమాంతంబును గర్తృవాచకము తృతీయాంతంబును నగును ఉదా .—మెచ్చఁబడునే (ఆది-౭ ఆ-౫౦). రాజును బెద్దవారలును (మనచే) జీర లోలుపఁబడిరి (విరా-౫ ఆ-౨౨౨). క్రియా-౫౫ సూత్రమందలి యాది శబ్దము చొప్పున భావార్థకాదులును గర్మార్థమున వచ్చును. ఉదా -పడయఁబడిన (ఆది-౧ ఆ-౭౨) పడయఁ బడుట-మొ.

౧ వివ :—పడుజ్యనుబంధ పరకత్వమందును 'కాన్-కన్' శబ్దము (క్రి-౧౯౬ సూ) లనుప్రయుక్తము లగును. ఉ -చేకొనంగఁ బడునేని (సభా-౨ ఆ-౧౪౨) దహింపఁగాఁబడి (అర-౧ ఆ-౧౯౫).

౨ వివ :—రెండు మూఁడిటి కొక్కటె 'పడు' జ్యనుబంధము నిల్పుటయుఁ గలదు క వినఁ జూడంబడు నందె ల్లను (శాంతి-౬ ఆ-౨౫౫)

౩ వివ :—"రాఁబడు-చొరఁబడు" మున్నగు నకర్మకస్థలములందలి 'పడు' శబ్దము స్వార్థిక మనఁదగును. (క్రియా-౧౧౩ సూ) (చూ-వ్యా. సం-౧౬౬-౭ మొ. ౧౬౮-౭౨ వ పుటలు ఘటకక్రియలు).

౪ వివ :—సంస్కృతమున స్వార్థ ధాతువు సనాద్యంతమగుచు వివిధ ధాతువు లగుచున్నట్లె తెలుఁగునందును స్వార్థికధాతువు కర్మాత్మనే పద ప్రేరణార్థములచే వివిధ రూపములతో వివిధ ధాతువు లగుచుండును అవెల్ల స్వార్థికధాతువులవలెనె లకారాది రూపముల నందును. స్వార్థిక-వండు-ప్రేరణ-వడించు-ఆత్మనేపద-వండుకొను-కర్మార్థ - వండఁబడు-ప్రేరణాత్మనేపద-వండించుకొను-ప్రేరణకర్మ-వండింపఁబడు - ప్రేరణాత్మనేపద కర్మార్థ-వండించుకొనఁబడు మొ

గురు విరహితంబులయి యయాంతంబులగు నేకస్వర ద్విస్వర సంస్కృత ధాతువుల కించుక్కు పరంబగునపు డును, ద్వి-త్రి-స్వరాచ్ఛిక ధాతువులకు 'ఎ'కారాది ప్రత్యయము పరమగునపుడును ♦ 'ఇయు' డాగమము

---

♦ సూరి 'ఇంచుక్కు' పరమగునపుడును నాచ్ఛిక ధాతువులకు 'ఇయుట్టు' వచ్చునని సూత్రించి నగియించు-నగించు' అని యుదాహరించెను కాని యట్టి రూపమును నిర్వహించు మహాకవి ప్రయోగము లేదు ఇంచుక్కు పరమగునపుడు 'అన్వాదులకు' 'పు'గాగమ మగును. (చూ-క్రియా-౮౧ సూ-౨ వివ) కాన అనిపించు-తినిపించు' అనువానివలెనె 'నగుపించు' అని యగును. (విరా-౪ ఆ-౬౯) (తాళపత్రి మాతృక) ఇచట టిప్పణిలోని నగియించె' ననెడి పాఠాంతరము ప్రక్షిప్తము. ఆచ్ఛికముల కించుక్ పరకత్వమున 'ఇయుట్టు' ప్రాచీన ప్రామాణిక గ్రంథములందు విశ్వసింపఁదగిన ప్రయోగము లేదు 'తెగియించు' అని సూ రా. నిఘంటువున నర్వాచీన కవిప్రయోగముఁ జూపఁబడెను. "తెగి(యి)ంచు-అ-క్రి ..ఉ ఎంతకునేర రంత తెగియించినవా రది యున్నదే కదా (శుక-౪ ఆ-౨౫)' (సూ-రా-ని).

వికల్పముగా నగును. ౭౦ (బా-క్రి-౫౦) (వ్యా-సం-3౨౦-3౨౦ I విమ).

సంస్కృ-ఏకస్వర-భుజియించు=భుజించు. (భుజ్+ఇయ్+ఇంచు)* ద్విస్వర :-గుణించు-గుణియించు=(గుణ+ఇయ్+ఇంచు). ఇట్లె-స్తుతియించు-నుతియించు-మొ. (నన్ని-కు-౨ ఆ-౨3౨ మొ. ౨3౭ వ. పద్యములు). ఇంచు గ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు 'ఎ' కార పరకము లుండనేరవు. 'యాచ్-అర్థ' ఇత్యాది ధాతువులు గురుమంతంబులు గాన వానికి 'ఇయుట్టు' రానేరదు. 'వ్యయా' అనునది యాంతము గాన దానికిని ఇయుట్టు' రానేరదు. యాచించు-అర్థించు-వ్యయించు-మొ. "జి+ఇంచు=జయ్+ఇంచు" (చూ-క్రియా 3 సూ) అనునదియు యాంతంబె ఇట నిత్యంబగుటంజేసి 'అయు'గాగమంబు రాఁగా యాంతంబగుటంజేసి 'ఇయు'డాగమంబు రానేరదయ్యెను. "పరనిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః. కృతాకృత ప్రసఙ్గి నిత్యమ్' అని నిత్యత్వలక్షణ మరయునది. ఇయుడాగమంబు చేసినను జేయకున్నను "అయు"గాగమంబు వచ్చుటకుఁ బ్రతిబంధము లేదనియు, 'అయు'గాగమంబు చేసినపిదప యాంతంబగుటచే 'ఇయు' డాగమంబు రానేరదనియు 'అయు'గాగమ నిత్యత్వమును బరిశీలించునది. ఆచ్ఛికధాతు:-కొనియెను=కొనెను. (కొను+ఎను) కొనియెదను=కొనెదను=(కొను+ఎదను)-ఇట్లె - కొనియెదును=కొనెదును. అనియెదను=అనెదను. అనియెను=అనెను-మొ ఇట్లె-నగియెదను=నగెదను. పడియెను=పడెను. ఇడెదను=ఇడియెదను. (సభా-౨ ఆ-30) (చూ-వ్యా-సం-౧౫౦౭ పుట) క్రుమ్మరియెదను=క్రుమ్మరెదను. త్రిమ్మరి

---

* సంస్కృతమున వ్యంజనపరకము గురువు కాదు. కాన 'భుజ్' అను దానిలోని 'భు'కారము గురువు కాదు. ఇది సంస్కృత ధాతువు గానఁ దెలుఁగు సంప్రదాయము చొప్పున వ్యంజనపరకము గురువని భ్రమింపరాదు. (చూ-ఆచ్ఛి-30-3౧ సూ-౨ విమ). (వ్యా-సం- విస్త-30 IV విమ).

యెడుఁద్రిమ్మరెడు. (ఆది-౭ ఆ-౩౮-౩౯ ప). భారతమున 'కొనెను- అనెను' అనువానివంటి 'ఇయుడా'గ రహిత రూపములు 'న' వర్ణాంత ధాతువులందుఁ గన్పట్టలేదు. 'కనెనఁట' అనునది పిన వీరభద్రుని శృంగార శాకుంతలములోనిది (౯౫ పుట). ఇది నన్నయ భారతము లోని దనెడి యప్పకవి వ్రాఁత (౧ ఆ ౧౨౯ - ౧౩౦) సరికాదు. 'కొనెను' మున్నగువాని నర్వాచీనకవులు ధారాళముగాఁ బ్రయోగించిరి.

౧ వివ :—సంస్కృత ధాతువులు ప్రాది శబ్దపూర్వకము లయి నను వానికి 'ఇయు'డాగమము వచ్చుట గలదు. 'సీ-చదలేఱు ప్రాతె డు జాడ యుత్తరియించి - ఇత్యాది శ్రీనాథాది కవీనాం వచనాని ప్రమాదికాని" (అహో ౮౮౮ పుట) అను నహోబల పండిత వాక్యము సరికాదు. ప్రతిఘటియించు (శృం-నై-౮ ఆ-౯ ప) సంభరియించు (కాశీ-౩ ఆ-౧౭౮) ప్రతివసియించు (కాశీ-౨ ఆ-౧౮).

ఇడ్వాదుల 'న' వర్ణకంబున కత్వంబును గడహల్లు నకు ద్విత్వంబును విభాష నగు. ౬౧ (బా-క్రి-౫౧ సూ) (వ్యా-సం-౩౧౫ IV విశ).

సంధి-౮౩ సూత్రపు పడ్వాదులు వేఱు. ఇందలి పడ్వాదులు వేఱు. కావున నిట పడ్వాదులనక 'ఇడ్వాదు'లనుట లెస్స. ఇందలి 'న' వర్ణక మనఁగా భూతార్థక విశేషణ 'న' ప్రత్యయమును (క్రియా-౫౬ సూ) చేదాద్యర్థక 'న' ప్రత్యయమును (౫౨ సూ). నని యెన్నునది. ఉదా :-ఇడు+ఇ+న=(క్రియా-౨౫ సూ). ఇడ్+డ్+ఇ+అ=ఇడ్డ=ఇడిన. అంతటను సంధి ౧౨ సూత్రము చొప్పున పదాది నిత్యసంధి నెన్నునది. పడ్డను=పడినను. 'ఇడు-పడు-చెడు-అను-కను-కొను-తిను-మను-విను-చను' ఇవి యిడ్వాదులు. ♦ ఇందలి 'పడు'

♦ సూరి పడ్వాదులలో తగు' ధాతువును బఠించెను. "తగ్గ పని" అనురీతి గల వ్యావహారిక ప్రయోగ మాత్రమె దీనికిఁ గలదు గాని మహాకవి ప్రయోగము లేదు గాన దీని నుపేక్షించుట లెస్స.

ధాతువు పతనార్థకమును బ్రాప్త్యర్థకమును నని యెన్నునది పతన :- చెట్టునుండి పడ్డవాఁడు. ప్రాప్త్యర్థ -భయపడ్డవాఁడు-మొ. ఇట్లే అనిన మాట=అన్నమాట. అనినన్=అన్నన్-మొ. దీర్ఘపూర్వక 'ను' వర్ణాంతముల కిట్టి స్థితి లేదు. మానిన-మానినన్-మొ. శరణన్నఁ గాచుచు (ఆది-౧ ఆ-౭) పతిలేఁడనఁ బడ్డ కాంత (కర్ణ-3 ఆ-౨౨౮).

క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొను ధాతు వనుప్రయుక్తం బగు. ౬౨. (బా-క్రి-౫౨ సూ). (వ్యా-సం-3౨౧-3౨౧ I వివ.)

ఇదియే యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు. ఉదా :- వందుకొనుచున్నాఁడు.

౧ వివ :-'౫౯ సూ-౮ వివ' చెప్పిన 'కొను' ధాత్వంతములగు రూపములును లకారాదుల లన్నిటిని నందుచు సమాపకాసమాపక క్రియారూపముల నందుచుండును.

కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగా నగును. ౬౩. (బా-క్రి-౫౩ సూ) (వ్యా-సం-3౨౧-3౨౧ I వివ.)

వండికొనియెన్ = వండుకొనియెన్. వండించుకొనియెన్=వండించికొనియెన్. మాన్చికొనియెన్=మాన్చుకొనియెన్. సీ... తే॥ గీమ దీయ పుత్త్రికుఁడనుచు నెత్తికొని రనఘ. (అను-3 ఆ ౧౫౦) ఇట్టిత్వము రానిపక్షమందలి యతిస్థాన ప్రయోగము ప్రాచీన ప్రామాణిక గ్రంథములందలిది లభింపలేదు. బహుళం బనుటచేత యాంత ధాతువులకు నిత్యంబు-చేసికొనియెన్.

౧ వివ :- అకర్మకంబున కాత్మనేపదార్థక ప్రయోగము లేదు. అట్టియెడల నున్న 'కొను' ధాతువు స్వార్థికమె యని గ్రహింపవగును. (చూ-క్రియా-౧౧౩ సూ).

౨ వివ -కొనుధాత్వనుప్రయోగము లేకున్నను నాత్మనేపదార్థ మరుదుగఁ గన్పట్టుచున్నది. క. ...ప్రత్యక్షము గావించె

న(గ్రతపమునఁ బేర్మిన్ (ఆర ౩ ఆ-౪౮). (కావించెన్=కావించికొనె నెన్.)

౩ వివ :- ఆత్మనేపదార్థమున ననుప్రయుక్తమగు 'కొను' ధాతు క్త్వార్థక రూపములు 'కొని' అనుటకు మాఱుగా "కొన్-కొ-కు-క" అను నాకారములతో నర్వాచీన కవిగ్రంధములందుఁ గనఁబడుచున్నవి. చ. ...పుత్త్రిని వెంటఁ బెట్టుకొ (పట్టాభిరామా-వేంకటరామకృష్ణకవి. ౨ ఆ ౪౫). (శశిరేఖాపరి-వేంకటరంగకవి-౪౩ పుట). క. ఇచ్చిన మచ్చికఁ బుచ్చికొ యచ్చెలి మెచ్చుచు (దశా-౪౫ పుట). మ. ...మెడఁబెట్టు కొయ్యఁ దిరుగన్ (పెట్టుకు+ఒయ్య) (శకుంతలాపరి. ౧౦ పు.) (బాలక. ౧౮౩ మొ ౧౯౦ వ. పుటలు).

౪ వివ :-యాంతధాతువులకు 'ఇ'త్వములేని ప్రయోగములును నర్వాచీనగ్రంధములందుఁ గనఁబట్టును. సీ. బలు తోలు కుళ్ళాయిపై సన్న గొల్సును, జుట్టి జందెంబు వేసుకొని విల్లు ... (శంగ రాట్ షం.)

౫ వివ :-క్త్వార్థమునందే కాక 'ట' ప్రత్యయాంతాది స్థలములందును నిట్టి ప్రయోగ మధునాతన గ్రంథములలో నగపడుచున్నది. ఉ. వ్రాసుటకుం జతుర్భుజవిలాసము......(ప్రాసస్థలము) (రాజరాజ పట్టాభిషేకము. ౫౦౦ పుట. అంగర నృసింహాకవి.) సుందరుఁ డింపుతోడఁ గలసుం బలసూదన...(ద్రౌపదీపరి. అల్లమరాజు రామకృష్ణకవి). (ఆం-భా-అ-ప్రయోగవిశేష ప్ర. ౨౭ సూ). ఇట్టి ప్రయోగములు సామాన్య కవిగ్రంథములందుఁ గనఁబట్టుచున్నను మహాకవు లనఁదగువారి గ్రంథములందుఁ బ్రయుక్తములని విశ్వసింపఁ దగియున్న స్థలములందలి ప్రయోగములలో నగపడమింజేసి యుపేక్ష్యములనఁదగును.

౬ వివ :-ప్రాచీన ప్రామాణికగ్రంథములం దిట్టి ప్రయోగ ములున్నచో నవి ముద్రణ సంస్కర్తలచేఁ బ్రక్షిప్తము లనఁదగును. కవి ప్రయుక్తములని విశ్వసింపఁదగిన ప్రాసాది స్థలములందు మహా కవు లెచ్చటను నిట్టివానిని వాడలేదు. కాన నట్టియెడల 'చు' ప్రత్యయము కవి ప్రయుక్తమని విశ్వసింపఁదగును. 'దిసంతులు గొట్టుకు' అను (ఆము-౬-ఆ ౧౪౮) చో "దిసంతులు గొట్టుచు మోచు చేగుచో" అని కవి ప్రయుక్త మనఁదగును. ఇట్లే 'క. సారి ది క్షకారము గూడుక సరి' అనుచో సారిది క్షకారము గూడుచు సరి' (అనంతుని ఛందో) అని కవిప్రయుక్త మనందగును "కం- చండగతి నేఁగి యీడ్చుక రండిప్పుడు" అనుచో "చండగతి నేఁగి యీడ్చుచు రండిప్పుడు (మార్కండే. ౩౫౧ పు)" అని కవిప్రయుక్త మని విశ్వసింపఁదగును. (చూ-క్రియా ౪౯ సూ ౨ వివ)

ఇంచు కర్తృ ప్రత్యయములు తప్పఁ దక్కిన ప్రత్య యముల మొదటనున్న 'ఇ-ఎ-వ' లు నిల్చునపుడు ధాతువు తుది యకారము సకారమగును. ౬౪. (బా-క్రి-౫౪). (వ్యా-సం-౩౨౨ I వివ).

చేయు :-చేసిరి-చేసి-చేసినది- చేసినఁ- చేసికొను- చేసెడిది- చేసెడునది-మొ. క. చే సితి వారల కిట్లు నికృతి సేయుట లగ్గే. (సభా-౨-ఆ-౧౪౬). క. చే సమరికొంచు... డాసిన...(ఆది-౬- ఆ-౨౦౬). సీ వేసవి వడగాలి నోసిన ..(నన్ని-కు-౩ ఆ-౧౯౭). (నోయు=నొచ్చు) ఇంచు కర్తృప్రత్యయముల కన్ననో :-చేయించు- చేయి-కూయి-వ్రాయి-(అక్షరము)-అలయిక. మొ.

చు వర్ణకంబు పరంబగునపు డన్వాదుల కత్వాలో పంబేని 'ను' స్థానంబున బిందువేని విభావనగు. ౬౫. (బా-క్రి-౫౫). (వ్యా-సం-౩౨౩ I వివ.)

అన్చున్నాఁడు-అంచున్నాఁడు-అనుచున్నాఁడు. (క్రియా ౨౭ సూ). అన్చును-అంచును-అనుచును (క్రియా ౫౭ సూ). 'అను-కను-కొను-తిను-మను-విను' ఇవి యన్వాదులు.

౧ వివ :-'చను' మొదలగునవి యన్వాదులలోనివి గావు. 'చన్చును-చంచున్' అనరాదు.

౨ వివ :-ప్రయోగ .-ఆ. వె. అంచుఁ బ్రీతిఁ గౌఁగిలించికొనియె (సభా-౨ ఆ ౨౯౧). శా. ప్రాంచద్భూషణ... అంచుం దోచె. ...(మనుచ-౨ ఆ-౬౮.)

ఉన్నశబ్దంబు పరంబగునపుడు 'ఉండు' ధాతువ నకు లోపంబగు. ౬౬. (బా-క్రి-౫౬) (వ్యా-సం-3౧౫ III వివ)

ప్రథమ :-ఉన్న వాఁడు = ఉన్నాఁడు, ఉన్న వారు=ఉన్నారు. ఉన్న ది=ఉన్న వి మధ్యమ :- ఉన్న వాఁడవు=ఉన్నాఁడవు ఉన్నావు-ఉన్న వారరు=ఉన్న వారు=ఉన్నారరు=ఉన్నారు ఉత్తమ :-ఉన్న వాఁడను=ఉన్నాఁడను=ఉన్నాను. ఉన్న వారము=ఉన్నారము=ఉన్నాము. (క్రియా-౨౧-౨3 సూ ౧ వివ. ౫౭-౫౬ సూ) (సమా-౮3 సూ)

౧ వివ :-'ఉన్న' శబ్దపరకమగు 'ఉండు' ధాతులోపము నిత్యమగుటచేత 'ఉండుచున్న వాఁడు-ఉండుచున్నాఁడు' మున్నగు రూపము లసాధువులు. విధానసామర్థ్యముచేత 'ఉండు' ధాతువు లోపించినను దానిమీఁది 'ఉన్న' అను ననుబంధము లోపింపదయ్యెనని యెఱుంగునది.

చేదాద్యర్థ నాంతంబయిన 'ఉండు' నకు 'ఉన్న' దేశంబు విభాషనగు. ౬౭. (బా-క్రి-౫౭) (వ్యా-సం-3౧౫ III వి)

ఉన్నను=ఉండినను. క ఇంకెంతకాలమున్నను మనక య్యెడు లాభమేమి ? (ఆది-౭ ఆ-౨౯). (చూ-క్రియా ౨౧ సూ ౨ వివ)-'ఉండుచుండినను=ఉండుచున్నను' అనునవి అపశబ్దములు.

> 'తి-దు-ట' లు పరంబులగునపు డన్వాదుల 'ను' స్థానంబున నెఱసున్నయు, నుండు 'దు' లోపంబును విభాషనగు. ఉ౮. (బా-క్రి-౫౮ సూ) (వ్యా-సం-3 ౨౮ I విశ.)

అందురు=అనుదురు. అంట=అనుట. ఉందురు=ఉండుదురు. ఉంట=ఉండుట. ఇత్యాది. 'తి' వర్ణకి పరకత్వ ముత్తరసూత్రమున నుదాహరింపఁబడును.

౧ విశ :- అన్వాదులలోనివి కామింకోసి 'చను' పూను మున్నగు ధాతువులపట్ల నిట్టి విధులు గల్గనేరవు-చనుదురు-చనుట-మొ. 'చందురు-చంట' అని యుండనేరవు. 'అను-కను-కొను-తిను-మను-విను' అనునవి యన్వాదులు (చూ-క్రియా-౬౫ సూ). ఉ... చుత్తురో మందురో మానవేశ్వరా (ఆది ౧ ఆ ౮౬)క...విందు (ఆది ౭ ఆ ౫౬). ఆ. వె ..చే కొందురయ్య (ఆది-3 ఆ-౧౯3) 'ఉంట' అనురూపమును దిక్కయజ్వ వాడెను గాని నన్నయ వాడఁడు. ఉ. బంటుతనంబు...అడ్డమాడ రా కుంట...(ఉద్యో-3 ఆ-౫౯). సున్న రానపుడు-అనితిని-జనితిని-మున్నగురీతినె యుండును. అట్లె ఉండితిని' అనియే యుండును.

> ఇట బిందువుమీఁది 'త-ద' లకు నిత్య వైకల్పికంబులై 'ట-డ' లగు. ఉ౯. (బా-క్రి-౫౯) (వ్యా-సం-3 ౨౮ II విశ.)

అంటివి=అనితివి. అందురు=అండురు. ఉంటివి=ఉండితివి. ఉందురు=ఉండురు. 'ఇట' అనుటచేత నీ విధి ప్రకృత 'తి-దు-ట' పరకత్వమందు మాత్రమె చెల్లును. 'పంతము-అందము-పోషింతురు' మున్నగు నితర స్థలములందు వర్తిల్లదు. నిత్య వైకల్పికంబులై యనఁగా 'ట'త్వము నిత్యముగాను, 'డ'త్వము వికల్పముగాను నగునని యర్థము.

౧ వివ :—నన్నయ 'ఉండు' 'డు'లోపమును బ్రయోగింపఁడు. 'ఉండితిని-ఉండుట' అనియే ప్రయోగించును. 'ఉందురు' మున్నగు చోట్ల 'ఉండురు' అనురీతిని బాక్షిక 'డ'త్వమును (అందురు=అండురు. విందురు=విండురు-మొ) నన్నయ ప్రయోగింపఁడు 'ఉండు' ధాతుజమగు 'ఉంటిని' అనురీతి గల 'ట'త్వమును దిక్కన గ్రంథములందును బ్రాసాదిస్థలములందుఁ గానరాదు. వెనుక నుదాహరించిన 'ఉంట' అను చోటి 'డు' లోపమును మాత్రము తిక్కన ప్రాసస్థలమునఁ బ్రయోగించి యున్నాఁడు. 'ఉందురు' మున్నగుచోట్ల 'ఉండురు' అనురీతిగల పాక్షిక 'డ'త్వమును దిక్కన ధారాళముగాఁ బ్రాసాదిస్థలములఁదుఁ బ్రయోగించెను. ఉ. ఎండకు ..ఆ కొండును...(విరా-౧ ఆ-౧౩౫). క దండము కాషాయంబు ...ఎ ట్లుండేని...(శాంతి-౬ ఆ-౧౭౮). తే. గీ విందు నారాయణ పరాయణుండు (అను-౪ ఆ-౩౭౪) (అండేని=అందువేని. విందును=విండును). (చూ-వ్యా-సం-౧౫౨-౨౬ పుట).

౨ వివ :—'ఉండుదురు' మున్నగువానిలోని 'దు' లోపించిన 'ఉందురు' అనురీతి గల ప్రాసాదిస్థల గతప్రయోగము తిక్కన భారతమందును లభింపలేదు గాని యాతఁడు 'ఉందురు' అను దానినుండి యేర్పడిన 'ఉండురు' అనుదానిని బ్రయోగించుటచేత నట్టి తిక్కయజ్వ 'ఉందురు' అను 'డు' లోప రూపముల నంగీకరించె ననక తీరదు. ఉండురు" విదుర యుయుత్సు (ఆశ్ర-౧ ఆ-౩) ఏయుచుందు(ను)-(భీష్మ-౩ ఆ-౩౧౧) ఇట్టి వానిలో 'ఉండురు' అను రీతిని సవరించినను 'ఉందురు' అను రీతిగల రూపముల నాతఁ డంగీకరించెనని యైనఁ జెప్పకతీరదు. 'ఉందురు'అను రీతిగల రూపములనుండికదా 'ఉండురు' అనురీతిగల రూపము లేర్పడవలయును. ద్విపద. ఉందురె ..! సందేహా...(రంగ-రా-కిష్కిం-౨౫౪ పుట యూని-ముద్ర) అందుపై... ఉందు రాచోటుల (రంగ-రా-కిష్కిం-౨౫౫ పుట-యూని-ముద్ర.)

౩ వివ:—'ను' వర్ణాంత ధాతువులందు (అన్వాదులందు) మాత్రము నన్నయ తిక్కనాదులెల్ల సున్న మీఁది 'తి' వర్ణమును 'టి' వర్ణముగా నిత్యముగా వాడిరి క మంటి హరుదేహ మంటం గంటి (ఆర-౧ ఆ-౩౩౮). క. వింటే... కంటే... (అను-౧ ఆ-౧౪౭).

ముజ్జు పరంబగునపుడు 'కొ' శబ్దంబు కొనునకు బహుళంబుగా నగు ౨౦. (బా-క్రి-౬౦) (వ్యా-సం-౩౧౪ వివ)

బహుళం బనుటచేత దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది అనఁగా ముజ్జు పరమగునపుడే కాక జీత్తులలోని వ్యతిరేకార్థకములు నుజ్యంతములు మున్నగునవి పరమగునపుడును యథాప్రయోగముగ నీ యాదేశము విభాష నగునని తాత్పర్యము భారతేతర గ్రంథములందే యిట్టి యాదేశ మగునని యెఱుంగునది. ఉ॥ 'తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్ము' అనుచో నన్నయ 'కొ' అను నాదేశమును బ్రయోగించె ననరాదు అచట "తుది రాజ్యమ్ముఁ గొమ్ము" అనునది కవిప్రయుక్తము. శబ్దాలంకారప్రియులగు సంస్కర్తలట్లు ప్రక్షిప్తము చేసిరని యెఱుఁగునది. "ము-డుజ్జు"లు ముజ్జు నాఁబడు (చూ-క్రియా-౩౭ సూ).

ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మామిడియు నగును. ౨౧ (బా-క్రి-౬౧) (వ్యా-సం-౩౧౪ వివ).

ఆత్మనేపదార్థకస్థలములందును శబ్దపల్లవస్థలములందును కొను ధాతువునకు వ్యస్తస్థలములందువలెనె యికార్యంబులు గల్గునని యెఱుంగునది ఉదా:—ఆత్మనే.—చదివికొమ్ము=చదివికొనుము=చదివికొన్ము. చదివికొండు=చదివికొనుఁడు (సంధి-౨౨ సూ అరసున్న రాదు). శబ్దపల్లవ:—కైకొమ్ము—కైకొనుము—కైకొన్ము. కైకొండు—కైకొనుఁడు. చేకొండు (బసవ-౭ ఆ-౫౯౭). వ్యస్తస్థల—కొనుము=కొమ్ము=కొన్ము.

కొనుఁడు=కొండు. గీ. ఏఁడు గొమ్మని (ఉ హరి-౫ ఆ-౧౪౯) కొండని వేడ్కతో (శృం-నై-౧ ఆ-౫౧). అతిచారము :-కాముం జీరికిఁ గోక (హరి-౪ ఆ-౩౨). ముదిమి కోఁజాలము (విష్ణు-౬ ఆ-౧౭౭) (గాణ-క్రియా-౩౯-౨ కారి-౫౦ వివ) ద్వి. కర్మంబు త్రొక్కు దాఁ గట్టికోఁదగునే (బసవ-౧ ఆ-౪౩౪).

౧ వివ :-కొను ధాతుస్థలమందే కాక స్థలాంతరములందును నీ విధి వర్తిల్లును (తే-రా-కా-మొ) తెమ్ము-తెండు-రమ్ము-రండు-కమ్ము-కండు-మొ. (చూ-క్రియా-౯౫ మొ)

౨ వివ :- వ్యతిరేక ప్రార్థనస్థలమునందు 'కొనునకు' 'కో' కన్పట్టదు. కొనకుము-కొనకుఁడు-చేకొనఁకుము-మొ

రు వర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది 'త-ద-డ'ల యుత్వంబునకు లోపంబు విభాష నగు. ౭౨ (బా-క్రి-౬౨) (వ్యా-సం-౩౨౪ III విష)

పోషింతుర్=పోషింతురు కొందురు=కొందుర్. కొండురు=కొండుర్: (క్రియా-౬౯ సూ). తత్సమములందును నీ విధి వర్తిల్లవలయును గాన 'అచ్ఛి-౨౯ సూత్రముచే నిది పునరుక్తముకాదు

సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు. ౭౩. (బా-క్రి-౭౦) (వ్యా-సం-౩౨౬ VI విష).

వండు-ప్రే-వండించు. పండు - ప్రే - పండించు మున్నగు రీతి నాచ్ఛికములపై నెట్లును ప్రేరణార్థమున 'ఇంచుక్కు' నిల్చును. 'వచించు-ఆవులించు' మున్నగు స్వార్థేంచుగంతములమీఁద (క్రియా-౨ సూ) సైతము ప్రేరణార్థమున 'ఇంచుక్కు' నిల్చునవుట కయి సూత్రమున 'సర్వంబునకు' అను దళము నిల్పఁబడెను. 'ద్వాదశారచక్రంబుం బరివర్తింపించుచున్న (ఆది-౧ ఆ-౧౦౯ గద్య) (స్వార్థేంచుక్కు పరివర్తించు) (ప్రేరణేంచుక్కు పరివర్తింపించు. సంస్కృత సమధాతువు). (చూ-క్రియా-౨౭ సూ).

౧ వివ :-ధాత్వర్థ భూత వ్యాపారము నొకరు జరుపునట్లు వేఱొకరు ప్రేరించుట ప్రేరణార్థ మనఁబడును. ఉదా :-రాముఁడు వాక్యమును వచించెను. (వచ్-(సంస్కృ-ధా)+ఇంచు=వచించు) గురువు రాముని (లేదా-రామునిచేత) వాక్యమును వచింపించెను. (వచించు+ఇంచు=వచింపించు) అప్రేరణకర్త ప్రేరణమునఁ గర్మంబగును. అప్రేరణమునఁ గర్తృవాచి యగు 'రాముఁడు' అనునది ప్రేరణవాక్యమున 'కర్మం' బయ్యెను ఈప్రేరణ వాక్యమున 'గురువు' అను ప్రేరణకర్త యేర్పడెను. ఇట్టి ప్రేరణార్థక వాక్య విశేషములు వెనుక వచింపఁబడెను (కార-3 సూ)

౨ వివ -ప్రేరణ ప్రత్యయములగు 'ఇంచు'గాదులు చేరకున్నను ప్రేరణార్థము నిచ్చు ధాతువులు 'అంతర్గత ప్రేరణార్థకములు' అనఁబడును. ఉదా :-కురియు=కురిపించు. దేవతలు పుష్పవృష్టిని గురిసిరి=దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. ఇది యప్రేరణార్థకమును నగును. ఉదా :-వర్షము కురిసెను. ఇట్లె-కరఁగు=కరఁగించు కరఁగు=ద్రవించు. మెఱయు=మెఱయించు. మెఱయు=ప్రకాశించు. ఆఁగు=ఆచు. ఆఁగు=నిల్చు-ము. ప్రయోగ-క 'శితశర పరంపరలు గురిసె...(విరా-౫ ఆ-౧౭౫)

3 వివ :-ధాతువు నుజ్యంతముపైని 'చేయు' ధాతువును నిల్పినచో నది ప్రేరణార్థము నిచ్చును. ఉదా :-కొల్చు-ప్రేర:-కొల్వఁజేయు=కొల్పించు. చ......నిన్నుఁ గొల్వఁ జే-యుదునని పూని (ఉద్యో-3 ఆ-౨౮౦ ప)

రంజాదుల యించు (స్వార్థ) క్చకారంబునకు సబిందు
కంబున కప్రేరణంబున ద్విరుక్త లకారం బగు ౭౮. (బా-
క్రియా-౭౧) (వ్యా-సం-3-౨౭-3-౨౭ I వివ).
రంజిల్లు=(అనురాగిల్లు) భేదిల్లు=(బ్రద్దలగు) సంధిల్లు=(కూడు) *

* నన్నయ 'కంపిల్లు=(కదలు) కంపించు=కంపిల్లఁజేయు' అను రీతి నియమమును జేసికొన్నను నన్నయేతరు లట్టి నియమమును బాటింపలేదు. కావున 'కంపిల్లు' మున్నగువానిని రంజాదులలోఁ జేర్పలేదు కం ముంచినఁ జప్పుడు విని కంపించు శరీరములు (నన్ని-కు-౧ఆ3-౨౯).

ఈ యాదేశపు యోగమున భిదాదు లకర్మకంబు లగును. రాజు పాలనమున జనులు రంజిల్లిరి. ప్రే-రాజు పాలనముచే జనులను రంజించెను=రంజిల్లఁజేసెను. గోడ భేదిల్లెను ప్రే-పిడుగు గోడను భేదించెను=భేదిల్లఁజేసెను 'భిద్' ధాతువు సంస్కృతమున సకర్మకమె యయ్యుఁ దత్సమత్వమున నకర్మకమయ్యెను.

ప్రేరణేంచుకుఁ పరంబగునపుడు రంజాదుల 'ఇంచుకు'నకు లోపం బగు. ౨౫ (బా-క్రి-౨౩) (వ్యా-సం-౩౭౭-౩౭౭ I విష).

లాదేశమున కపవాదము. రంజించు=(రంజిల్లఁజేయు) భేదించు=(భేదిల్లఁజేయు) సంధించు=(సంధిల్లఁజేయు) ఇట "రంజింపించు' అని కాని 'రంజిల్లించు' అని కాని యుండనేరదని భావము

౧ వివ :-అప్రేరణమున 'రంజిల్లు' అనియుఁ బ్రేరణమున 'రంజించు' అనియుఁ నుండెడి నియమము మిక్కిలి యరుదు తఱుచుగా 'ఇల్లు=ఇంచు' అను వానిని బర్యాయములనుగాఁ వాడుదురు. నియమము-నన్నయ :-క. వల్లెయని .. దిశల్ భే దిల్లఁగ గర్జిల్లి ..(ఆది-౬ ఆ-౬౫). క. తన సుతులు పాండు సుతులని మనమును భేదింపక... (ఆది-౫ ఆది-౧౬౨). నియమమును వీడి 'వర్తిల్లు=వర్తించు' అనునవి పర్యాయములుగా వాడుట- సీ. నిషధాద్రియం దనిమిషపతిప్రచ్ఛన్న సంచరణమున వర్తించుటయును (విరా-౧ ఆ-౫౪). గీ...మందడీల కెల్ల నూఁటట యగుచు వర్తిల్లనేర్తు (విరా-౧ఆ-౯౫). తిక్కన 'వర్తించు' అనుదానిని బ్రేరణార్థమున 'వర్తిల్లఁజేయు' అను నర్థమున వాడకపోలేదు. సీ పదపడి విప్రులు...... అధ్వరాదిక సత్క్రియల్ ప్రవర్తింపక... (శాంతి-౨ ఆ-౮౯). (ప్రవర్తింపక=ప్రవర్తిల్లఁజేయక)

౨ వివ .-'వర్తిల్లు' మున్నగువానికిఁ పర్యాయముగ 'వర్తిలు' అను నేక లకారఘటితరూపములను తిక్కన ప్రయోగించెను. ♦

---

♦ సూరి 'పాటిలు' మున్నగు నేక లకారఘటితరూపముల నేల యుదాహరింపలేదో తెలియదు. "తత్రోభయోర్భవే దేకో లకార ఇతి కేచన" అని యథర్వణుఁడును నద్దానిని సూత్రించియున్నాఁడు. బాలప్రకీ-౭ సూ. చే లకారలోపము రాకపోదు.

ఆ-వె పాటిలినఁ జూచి పెద్ద వలచి యైన (అను-౨ ఆ-౨౩౧ ప).

3 వివ :-'మూర్ఛిలు' మున్నగువానికిఁ బర్యాయముగ 'మూర్ఛించు' మున్నగు 'ఇంచు' గంతముల ప్రయోగము కానరాదు అట్లె వర్షించు-ఉదయించు-అస్తమించు" మున్నగువానికిఁ బర్యాయములుగ వర్షిల్లు-ఉదయిల్లు-అస్తమిల్లు" మున్నగు ప్రయోగములును గానరావు.

'చు'గాగమం బాచ్ఛికంబున కసంయుక్త 'న-ల-
డ-రాం'తంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు
౭౬. (బా-క్రి-౭౩) (వ్యా-సం-3౨౭ I విష)

పూను-పూనుచు=పూనించు తేలు-తేలుచు=తేలించు. మగుడు-మగుడుచు=మగిడించు. కుదురు-కుదురుచు=కుదిరించు "విను-వినుచు-వించు' వక్ష్యమాణ (క్రి-౭౧ సూ) పుగాగమంబు-వినిపించు. బాహుళకంబుచేఁ గొన్నిటికి 'చు'గాగమంబు లేదు అను-అనిపించు. తిను-తినిపించు. కను-కనిపించు. దీని యత్వంబునకు దీర్ఘంబు నగు :-కానిపించు

౧ వివ -'కాంచు' అనునదియు 'కను' ధాతు ప్రేరణరూప మనుట యుక్తము 'కాన్పుము' (ఉద్యో-౧ ఆ-౨౭౦). 'రాముఁడు గృష్ణుని గాంచెను'. అనుచో 'కాన్పుము' అను చోటియందు వలెనె 'కృష్ణుఁడు తన్నుఁ గాంచునట్లు రాముఁడు చేసెను' అని ప్రేరణార్థము నెన్నునది. (చూ-వ్యా-సం-౧౫౭౦ పుట).

౨ వివ :-"అ-ప్రే-విదురు=(రాలు) ప్రే-విదురుచు=(రాలఁజేయు) అ. ప్రే-పదురు = (త్వరపడు). ప్రే-పదుర్చు=(త్వరపడఁజేయుచు)" అను రెండును బ్రేరణార్థకములు. ప్రకృత సూత్రమునకు లక్ష్యములె. ఆచ్ఛిక శబ్దముల పయిని 'చు' వర్ణకమును నిల్పినచో నవి కొన్నియెడల ధాతువు లగును (చూ-క్రియా-౨ సూ) ఉదా.-ఎదురు=(ఎదుటివాఁడు) ఎదురుచు=(ఎదిరించు) (వ్యా-సం-౧౫౭౭ పుట-చూ).

చెమరు=(చెమట) చెమరుచు=(చెమటపట్టు) చిగురు-చిగురుచు=(చిగిరించు) కొన్ని ధాతువులకు స్వార్థమందును 'చు' వర్ణకము చేరును ఉదా:-తనరు=తనరుచు-మొ 'అదురు=అదురుచు' అనునవి పర్యాయ రూపములు ఇందలి 'చ' కార మూవయవికము కావుననె యది ముత్పరకత్వమున 'వ' కార మగును † అదువన్ (ఆది-౫ ఆ-౧౨౮) 'అదిర్చు' అనునదియు నప్రేరణరూపమే యని తోఁచును. 'మిన్నదిర్చెక్' (ద్రోణ-౫ ఆ-3౭౭) 'పఱచు'=(పరుగెత్తు) అను దానిలోని 'చ' కారమును నావయవికమె కావుననె 'వారణ వ్రాతము లుజ్జగించి పఱవన్' (హరి-పూ-3 ఆ-౧౨౬) అని యిట్లు ముత్పరకత్వమున వకారము వచ్చెను. 'పడు' ధాతు ప్రేరణ రూపమగు (క్రియా ౮౫ సూ) 'పఱుచు' ధాతువునకు రూపాంతరముగఁ గోశకారులు వాడిన 'పఱచు' అనుదానిలోని 'చ' కారము 'చు' గాగమ సంబంధి. కావుననె 'పఱపకుమయ్యా'=(పొందింపకయ్యా) (అరణ్య-౫ ఆ-౧33 ప).

అట్లు పుగాగమంబును మాన్వాదులకగు ౭౭. (బా-కి-౭౮ సూ) (వ్యా-సం-3-౨౮ II విష).

అట్లు=ఆరీతిగా ననఁగా నాచ్ఛికంబునకుఁ బ్రేరణంబున బహుళంబుగా 'చు'గాగమంబును 'పు'గాగమంబును నగునని సూత్రార్థము. ఉదా:-మాను-మానుపు=మానుచు మను-మనుపు=మనుచు బాహుళకం బగుటచేత 'మను' ధాతువునకు 'ఇంచు'గాగమము లేదు. 'మాను' ధాతువునకు 'ఇంచు'గాగమ రూపంబును గలదు. మానించు మానింపఁగ (కర్ణ-3 ఆ-౧౮౦). 'మేలుకనుపు=మేల్కనుపు (భాస్క-బాల-

---

† 'అదురుచు=అదుర్చు' అను చోటి (బా-ప్రకీ-౨౦ సూ). చకారమును బ్రేరణార్థక 'చు'గాగమ సంబంధిగా 'పదుర్చు-విదుర్చు' అను వాని లోని చకారము వంటిదానినిగా సూరి సూత్రించుట సరికాదు 'అదుర్చు'లోని చకార మావయవికము. "పద్రుచు-విద్రుచు' లలోనిది ప్రేరణార్థకము. "ఎదుర్చు"లోనిది స్వార్థిక 'చు'గాగమము

33౮). మేల్కొలుపు = మేలుకొలుపు" అను వానియందు 'పు'క్కు-నిత్యము 'చుక్కు-ను-ఇంచుగాగమమును" లేవు.

'చుక్-పుగ్వ'ర్ణకంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు ౭౫. (బా-క్రి-౭౪) (వ్యా-సం-3-౨౮ III విష).

అవ్యవహిత పూర్వస్థోకారమునకే యని తెలియవలెను. ఉదా:- బిగియు-బిగుచు కలియు-కలుపు-మొ

అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు నగుచో వానికడ వ్రాలు లోపించును ౭౯ (బా-క్రి-౭౬) (వ్యా-సం-3-౨౮ III విష)

అట్లు=అచ్ఛికంబునకుఁ బ్రేరణంబున బహుళంబుగా నగును, అడంగ్వాదులకు 'చు'క్కును మాయ్వాదులకు 'పుక్కు'ను నగుననియు వాని తుది వర్ణము లోపించుననియు నర్థము. అప్రే-అడఁగు-ప్రే-అడఁచు=అడగించు అప్రే-మాయు-ప్రే-మాపు=మాయించు. 'అడఁగు-కరఁగు-కలఁగు-నలఁగు-బిగియు-' ఇత్యాదు లడంగ్వాదులు 'మాయు-ఉడుగు-కడగు-కుడుచు-' ఇత్యాదులు మాయ్వాదులు 'ఆఁగు' ప్రభృతు లుభయగణంబులు ఆఁగ్వాదులకును నంత్యలోపం బగునని యెఱుంగునది. బాహుళకంబునం జేసి కొన్నిటి కించుక్ చుక్ పుగాగమంబులు మూఁడును, గొన్నింటి కందు యథాప్రయోగంబుగ రెండును, గొన్నింటి కొక్కటియు నగునని యెన్నునది ఆఁగు=ఆఁచు=ఆఁపు=ఆఁగించు. 'ఆఁగు' ధాతు వంతర్గత ప్రేరణార్థకమును గలదు. రేఁగు=రేఁచు=రేఁపు=రేఁగించు పాయు=పాచు=పాపు. విఱుగు-విఱుచు. చూచు-చూపు. నేరుచు-నేరుపు మేయు-మేపు. లేచు-లేపు కలియు-కలుపు. తడియు-తడుపు. తెలియు-తెలుపు. ఇత్యాదు లెఱుంగునది.

౧ వివ :-'కలుచు' = (వలచు = ప్రేమించు) అనునది వేఱొక ధాతువు. అందలి 'చ'కార మావయవికము. కాన 'కలఁగు' ధాతు

ప్రేరణ రూపమగు 'కలఁచు' ధాతువున కభిన్నమని భ్రమింపరాదు. చ. కలుచుట దోసమే మగలఁ గల్వక యాండురు తొల్లి యాండురం గలూతురె ..(నన్ని-కు-౮ ఆ-౧౫౧).

ఇంచుక్-చుక్-పుగాగమంబులు పఠంబులగునపు డా
గమాదేశ లోపంబులు పెక్కు తెఱంగులం గానంబడి
యెడి ౪౦. (బా-క్రి-౭౭) (వ్యా-సం-౩-౨౮ V వి)

ప్రాను-ప్రే-ప్రానుచు=ప్రాన్చు-ప్రాంచు పూర్ణబిందువు విశేషము. క. కాంచన... ప్రాంచిన ..(విరా-౪ ఆ-౪౫). అగు-ప్రే-కావించు-వచ్చు-ప్రే-రావించు=రప్పించు (ముత్పరకత్వము లేనపుడును "శా-రా" దేశములు-'వ-ప'లును) విన్నపము-విన్నవించు (అంగలాదుల లోనిది) (క్రియా-౭ సూ). ('విన్నవించు-ఆలించు-పలవించు' అనునుదాహృతులనుబట్టి స్వార్థేంచుక్పరకత్వమందును బ్రకృత సూత్రము వర్తిల్లు ననఁదగును). మోకాలు-మోకరించు-మోకాళ్ళించు (అంగలాదులలోనిది). (మోకటించు-శ-ర). కేక - కేకరించు = (కేకాధ్వనులు చేయు). పలవ=(ప్రలాప)-పలవరించు=పలవించు. (అంగలాది) ఆలక-(ఆలక్షు) ఆలకించు=ఆలించు (అంగలాది) వ్రక్క-వ్రక్కలించు (అంగలాది). నొచ్చు-నొంచు=నొప్పించు ఉండు-ఉంచు డిగు-డించు=డిగించు. "మే దినికి డిగింపఁగాఁ గొని (హరి-పూ-౩ ఆ-౪౦). పెరుఁగు-పెనుచు=పెంచు (పెరింగిన-మార్క-౦-౩ ఆ) (పెరుంగ (పాండు-౫ ఆ) (శ-ర) (సూరి దీనిని నిర్బిందువుగా నుదాహరించెను) తునుఁగు-తుంచు. (బాల వ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందును నిది ఖండబిందుశూన్యముగ నేయున్నది 'తునింగ్ కాళ్ళు'(అచ్చ-రా-ఆరణ్యా-శ-ర). తునియు-తునుచు (తునిచి-యయా-౨ ఆ-౮౪. సూ-రా-వి) (శ-ర-లో లేదు) మునుఁగు-మునుచు=ముంచు మొగుడు-మొగుడుచు=మొగుచు=మోడుచు=మొగిడించు. చొచ్చు-చొనుపు=చొప్పించు చినుఁగు-చించు=చింపు త్రెగు-త్రెంచు=త్రెంపు తిరుగు-త్రిప్పు. చచ్చు-

"చంపు నిలుచు-నిలువరించు=నిలుపు. కొను-కొలుపు. 'కొలిపెను భగదత్తుమీదఁ గ్రూరగజము.' (భీష్మ-3 ఆ ౧౫౧). చీకటుల్ గొలుపన్ (హరి-ఉ-భా 3 ఆ ౧౧౦). 'వెలకుఁ దీయు' అను నర్థమున "కొనిపించు" అను వాడుక గలదు. శబ్ద పల్లవస్థలములందును 'పురి కొలుపు' మున్నగురీతి నెఱుంగునది. పోవు-పుచ్చు. అను ప్రయుక్తమగునపుడును 'మోసపోవు-మోసపుచ్చు' అనియె యుండును. "పనుచు-పంచు-పనుపు-పంపు" అనునవియు, వీని యాద్యక్షరలోపమున నేర్పడిన వనఁదగిన "అనుచు-అంచు-అనుపు-అంపు" అనునవియు 'పోవు' ధాతు ప్రేరణరూపములె యనియు వీనికి 'ఆజ్ఞాపించు' అను నర్థమును గౌణముగఁ గల్గుననియు సూరి యాశయము. కాని వీని కేమియు నాకారసామ్యము లేదు. 'పని' శబ్దమునుండి 'చు' వర్ణకయోగమున (చూ-క్రియా-౭౬ సూ-౨ వివ). (క్రియా ౨ సూ) 'పనుచు' మున్నగునవియు వాని యాద్యక్షరలోపమున 'అనుచు' మున్నగునవియు నేర్పడియుండునని యూహించు టుచితము. వంగు-ప్రే-వంచు=వాంచు. ఓడు-ప్రే-ఓడించు=ఒడుచు.

అన్వాదుల కించుక్కు పరంబగునపుడు 'పు' గాగమం బగు-మానునకు విభాషనగు ౮౧. (బా-క్రి-౭౮). (వ్యా-సం-3-౨౮ VI విష.)

అను-అనిపించు. 'అను-కను-తిను-విను' అను నాల్గిటికే పుగాగమము నిత్యము మాను' అనునది 'అన్వా'దులలోనిది కాదు. దానికి విభాషయని వేఱుగ వచింపఁబడెను. మాను-మానిపించు

౧ వివ.—అన్వాదులు క్రియా ౭౫ సూత్రమునఁ బేర్కొనఁబడెను. వానిలో 'కొను-మను' ధాతువు లిందు విడువఁబడెను. ఏలయనఁగా :-'మను' ధాతువున కించుక్కు లేదనియు, 'మనుచు-మనపు' అను రెండురూపములు మాత్రమే దాని ప్రేరణరూపము

లనియు క్రియా ౭౭ సూత్రము వివృతిలో వచింపఁబడెను. 'కొను' ధాతువునకు 'కొలుపు' అనునది ప్రేరణార్థకరూపమనియు, 'కొని పించు' అనునది వ్యావహారికరూపమనియు క్రియా ౮౦ సూత్రము వివరణమున వ్రాయఁబడెను. అను-అనిపించు-కను-కనిపించు-కొని పించు-తిను-తినిపించు-విను-వినిపించు. వీనిలో 'అను-కను-తిను' అనువానికి 'చుక్కు' లేదు. 'పుక్కు' విధానమే లేదు. (క్రియా-౭౬ సూ). 'విను' ధాతువునకు 'వినిపించు' అని ప్రకృతసూత్రమున సిద్ధించును. "వినుచు(క్రియా ౭౬)వించు(క్రియా ౮౦)" అనియు నుండును.

౨ వివ :-'చను' ధాతువునకు 'చనఁజేయు' అని మాత్రమే ప్రేరణరూపముండును. 'నగు' ధాతు ప్రేరణరూపము 'నగుపించు'. (చూ-క్రియా-౬౦ సూ-టిప్పణి) "నగి (గు) పించు" స-క్రి ..నగిపించెన్ (కళా-౫ ఆ-౫౯). (సూ. రా. ని ) నగుపించె నచటి యబలాజనమున్ (విరా ౪ ఆ ౩౯). నిను నగుపింపఁగా (శాంతి ౬ ఆ-౨౧౭). వయి ప్రయోగముల చొప్పున 'నగు' ధాతువును 'అన్వాదు'లలోఁ జేర్చి దానికిని 'పు'గాగమ మగునని గ్రహింపవలయును.

> అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు 'గు' గాగమంబగు. నప్పాదులకు విభాషనగు. ౮౨ (బా-క్రి-౭౯ ) (వ్యా-సం-౩౨౮ VII వివ.)

అడ్డము-అడ్డగించు. "అడ్డ (ము)-ఓర-(ఒరగు)-పంత (ము) పెల్ల-బోర-మట్ట (ము)=(తగ్గించు)" ఇత్యాదు లడ్డాదులు. అప్ప-అప్పగించు=అప్పించు. అప్ప=(అర్పణ) ఒప్ప=(అర్పణ)-పల్ల(ము)=పల్లగించు. (గుట్టిమువిూఁద నాస్తరణము వేయు). ఇత్యాదు లప్పాదులు. (ఈ సూత్రపు లక్ష్యములకుఁ గ్రియా-౨ సూ. చొ. ఇంచు క్కగును. అడ్డాదులు నప్పాదులును నంగలాదులలోనివని యెన్ను

(క్రి-౧౩ సూ.) 'చిత్తగ' మున్నగు సంస్కృతములు. 'ఆడు-ఓడు' ప్రే 'కూరు' ధా. పది.) * ప్రకృతసూత్రమున 'ఇంచుకు' అనుటచేత నిది స్వార్థేంచుకుగాని ప్రేరణేంచుకుగాని కావచ్చును. 'ఇల్లు-ఇలు' అను రూపములతోను 'ఇంచు'గాగమ ముండవచ్చును. స్వార్థ.—...ఓలగిలఁగఁ బెల్ల గిల్లఁ దల్లడపడ...(భీష్మ ౧ ఆ ౨౬౮). ప్రేరణార్థ:-బోరగించు=(బోరగిల్లఁ జేయు) మొ. 'మేళగించు' అను దాని రూపాంతరము మేళవించు:-గీ పీరశృంగారములు మేళవించినట్టి (జై-౫ ఆ-'శ-ర') ఇట్లే-పెల్లగించు=పెల్లగిల్లఁజేయు మొ.

ప్రేరణార్థక 'షు' కు పరంబగునపుడు "ఆడు-ఓడు" అనుధాతువుల 'డ' కారమునకు రేఫాదేశమగు. ౧౩ ♦ (బా-క్రి-౧౦) (వ్యా-సం-౩౨౪VIIIవి.)

---

* సూరి అద్దాదులలో "చిత్తము-మేళము" అను శబ్దములను నప్పాదులలో 'కోపము' అను శబ్దమును బఠించెను. కాని 'ఆచ్ఛిక' మాత్రవిషయకమగు నీ 'గు' గాగమము సంస్కృతశబ్దములపై నిల్పుట సరికాదని తలఁచి వాని నీగగణములలోఁ బంధింపలేదు. "గీ కీడు మేలేమి యును జిత్తగింపకుండు" (అశ్వ-౧ ఆ-౧౧౬) మున్నగు ప్రయోగములను "చిత్తగ=(చిత్తమును బొందు). కోపగ=(కోపమునందు). మేళగ=(మేళము నొందు)" అను సంస్కృత శబ్దములపైని క్రియా-౨ సూ. చెప్పిన 'ఇంచు' గాగమము నిల్పి "చిత్తగించు - కోపగించు - మేళగించు" అనురూపములను సమర్థించుకొనవగును.

♦ బాలవ్యాకరణమున ఆడోడుకూడుల'నుచు సిద్ధద్వంద్వమునఁ బరరూపసంధి చేయుట ప్రామాదికము. మఱియు 'కూరు' అను రేఫాంతధాతువే యుండుటచే 'కూడు' అనుదానికి రేఫాదేశము చేయుట పునరుక్తము. క ఈ రస మెత్తి ..నీమదిం గూరిన నొవ్వు...(ఉద్యో-౩ ఆ-౭౮). క. వారని సంక్లేశంబులఁ గూరు నరుఁడు...(శాంతి-౬ ఆ-౨౪౨ ప)

ఆర్చు=ఆడించు (ఆడు+చు. ఆడు+ఇంచు). (స్నానమాడించు-ఆటలాడించు). క. ఆర్పఁగ బొమ్మలు కడంగి... వేర్పడ... (శాంతి ౧ ఆ-౨౮౩). మఱుమాట లార్తు (విరా-౨ ఆ ౩౧౦) (ఆర్తున్=ఆడింతును). మజ్జన మార్ప (వరాహ-౭ ఆ-౮౯). వహ్ని నార్ప (సభా-౧ ఆ-౧౯౩). రాజుల నోర్చి (ఆర ౧ ఆ ౩౭౮). అకృతారంభుల నోర్చు నెంత యధికుల నైనన్ (సభా-౧ ఆ ౧౨౩.)

> చెడునకుం జుక్పు గాగమంబులును డా కలసు రేఫంబు నగు. ౨౭౮. (బా-క్రి-౮౧) (వ్యా-సం-౩౨౮ IX వి)

చెఱుచు=చెఱుపు=(చెడు+చు). చుక్పుగాగమ మాత్ర విధానముచే దీనికి 'ఇంచుక్కు' లేదని యెఱుంగునది 'చెఱచు-చెఱపు' అను 'అ' కార మధ్యములు కోశములందుఁ జూపఁబడెను గాని వానిని నిర్వహించు ప్రయోగములు చూపఁబడలేదు. ఉకార మధ్యము 'చెడు' ధాతున కర్థము గీ ఎఱిఁగి వాని తపము చెఱుపఁబనిచె. (ఆది ౫ ఆ ౧౮౫). 'చెఱుచు' అనుదాని 'చెర్చు' అను రూపాంతరము గలదు. 'యజ్ఞమేటికిఁ జెర్చె' (పండితా-వాద. ౨౦౫ పుట. సూ-రా-ని).

> పడునకుం జుక్కును డా కలము రేఫంబు నగు. ౨౭౯. (బా-క్రి-౮౨)(వ్యా-సం-౩౨౮ X విమ.)

పఱుచు=(పడు+చు)=(పొందించు) భయపఱిచె 'భయాపఱుపు' లేదు. (భయము+పఱిచె-సంధి-౮౩ సూ). ఇది ప్రాప్త్యర్థక పడు ధాతు ప్రేరణరూపము. ఈయర్థమున 'అ' కార మధ్యమును గలదు. క. ..తో అంగుట తప్పి తడంబఱచి పురుషులకున్ (కళా-౭ ఆ-౨౨౮.) దీని (పఱుచు) కించుక్కును 'పు' గాగమంబును రూపాంతరములు లేవు. "పఱపు"=(బాణమును బ్రయోగించు) అనుదానిని సయితము పతనార్థక 'పడు' ధాతు ప్రేరణరూపముగ గోశకారు లుదాహరిం

చిరి. బాణమును బడునట్లు చేయుటయేకదా బాణమును బ్రయోగించుట. 'పఱచు'=(పఱుపుమీఁద దుప్పటిని బఱచుట) అనుదానిని సయితము పతనార్థక 'పడు' ధాతుప్రేరణముగ 'శ-ర' కర్తయుదాహరించెను. పఱుపుమీఁద దుప్పటిని బడునట్లు చేయుటయని ప్రేరణార్థము నరయునది

శబ్ద పల్లవంబగు పడున కించుక్క విభాష నగు.
అగుచో డాకు లఘు రేఫంబగు. ౬౬. (బా-క్రి-౬౪)
(వ్యా-సం-3 ౫౭ X వివ).

వెలువడు-ప్రే-వెలువరించు=(బయలుదేఱు). 'వెలువఱుచు' అనియు నగును. ఇట్లె చొప్పడు-ప్రే-చొప్పరించు=చొప్పఱుచు. ఏర్పరించు=ఏర్పఱుచు. మొ.

౧ వివ :-ముద్రిత భారత పుస్తకములలో 'పశువరించు = పశువఱుచు'' అని 'శ'వర్ణ ఘటితముగా నుండుట ప్రామాదికము. మిశ్రమున రేఫాదేశము చుక్క వచ్చుట యసంభవము. కాన పసువరించు-పసువఱుచు''=(యజ్ఞపశుత్వము నొందించు) అని యుండవలయును.

ప్రేరణంబునం దించుక్కమీఁద నించుక్క లేదు.
౬౭. (బా-క్రి-౬౮) (వ్యా-సం-3౫౯-3౫౯ I వివ).

ఇట్లనుటంజేసి ప్రేరణార్థంబయిన యించు గ్భిన్నాగమంబు పయిని బ్రేరణార్థేంచు గాగమము నిల్వనగునని యెఱుంగునది. ఉ.- నొచ్చు-ప్రే-నొంచు. పునః ప్రేరణము-నొంపించు. చచ్చు ప్రేరణము-చంపు. పునః ప్రేరణము-చంపించు. ఇట్లె స్వార్థేంచుక్కపయిని బ్రేరణార్థేంచుక్క నిల్వవచ్చును. ఉదా :-పరివర్తించు-ప్రేర-పరివర్తింపించు (ఆది-౧ ఆ-౧౦౯-౧౧౭). (చూ-క్రియా-౬౯-సూ. పత్వము) (క్రియా-23-ప్రేరణేంచుక్క). రక్షించు-ప్రేర-రక్షింపించు. 'చదివింపించు' అనరాదు. 'చదివింపఁజేయు' అనవలయును.

ఇత్వంబుగాని 'ఎ'త్వంబుగాని కూడుచో ననాద్యం బయిన 'ఉ'త్వంబునకు 'ఇ'త్వంబు బహుళంబుగా నగు. ౮౮. (బా-క్రి-౮౫) (వ్యా-సం-౩౩౦ విమ).

నిగుడు-నిగిడి-నిగిడెన్. నిగిడించు-చదువు-చదివితిని - చదివించెను- వెనుకటి 'కనిపించు-వినిపించు' మున్నగున వెల్ల దీనికి లక్ష్యములె. అనాద్యం బనుటచేత "కుదురు-కుదిరించు-కుదిరెను-కుడుచు-కుడిచెను" మున్నగు చోటులందెల్ల మొదటి 'ఉ'కారము 'ఇ'కారము కానేరదు. బహుళంబనుటచేత నీ సూత్రము ప్రయోగానుసారముగ, వర్తిల్లు ననఁదగును. శబ్దరత్నాకరమునఁ పురుటియాలు-పురుటిల్లు-పురుడించు-మున్నగు శబ్దము లుదాహరింపఁబడెను. అది యట్లుండఁగా "సీ. ఆలోన గదఁ బూన్చి యభ్రమా తంగంబు కుంభపీఠంబు పగుల్చి యసుర" (హరి-పూ-౮ ఆ-౧౫౮) అను మహాకవి ప్రయోగమును గలదు. (యతిస్థానము)

ప్రేరణేంచుక్కు పరంబగునపుడు చకారంబునకు 'ప'కారం బగు. ౮౯ (బా-క్రి-౮౭) (వ్యా-సం-౩౩౧-౩౩౧ I విమ).

చకారము ధాత్వవయవమైనను నాగమ సంబంధియైనను నీ పత్వము కల్గును. అవయవిక :-సీ...పృథివీపతుల విడిపించి చెఱలు (సభా-౧ ఆ-౨౧౫-౧౧౮ గద్య) ఆగమచకార :-పరివర్తింపించు (ఆది-౧ ఆ-౧౦౯ ౧౧౮ గద్య). ద్విరుక్తచకార :-క. తెప్పించి తొడుగు మీవని యొప్పించి . (విరా-౪ ఆ-౩౯). బహుళమనుటచేత సీ...మె చ్చించిన యా జగజ్జెట్టి యితఁడె (ఉద్యో-౩ ఆ-౧౭౫) ద్విత్వస్థలములందు విభాషను ప'త్వ మగును. మెప్పించు' అని కోశములందుఁ గలదు గాని యట్టి పత్వమునకు యతిప్రాసాదిస్థలగత ప్రయోగము లభింపలేదు. 'హెచ్చు-హెచ్చించు' ఇత్యాదులందు 'ప'త్వము లేనేలేదు. "ఇచ్చు-ఇప్పించు-తెచ్చు-తెప్పించు" ఇత్యాదు-

-(క్రి-౯౦-౯౧ సూ ) ప్రే పరకత్వమున 'ప'త్వము బహుళము-ముత్పరకత్వమున 'ప-వ'

లందు నిత్యము. "వచ్చు-రప్పించు=రావించు. నొచ్చు-నొంచు-నొప్పించు. చొచ్చు-చొనుపు-చొప్పించు" ఇత్యాదులందు విశేష రూపాభావపక్షమున నిత్యమె.

ముజ్జీత్తులు ముత్తు నాఁబడు. ౯౦. (బా-కి)-౮౬)
(వ్యా-సం-331 I విష).

ముదుజ్జులును, జి' ఇద్వర్ణముగాఁ గలవియు 'ముత్తు' అను సంజ్ఞ గలవగును.

ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు 'ప-వ' లగు. ౯౧ (బా-కి)-౮౮)

ఆగమ :-పచింపఁడు-పచింపక-పచింపని - పచింపమి - పచింపకుము-పచింపుము-పచింపుఁడు-పచింపన్-పచింపఁగల - పచింపఁబడు-పచింపకుఁడు. ఆచ్ఛిక ధాతువులందును నిట్లె అడచు-అడవఁడు-అడఁపక-అడఁపని-అడఁపమి-అడఁపుము-అడఁపుఁడు-అడఁపన్-మొ. అన్య చకార-ఆవయవిక :-పిలువఁడు-పిలువక-పిలువని-పిలువమి-పిలువుము-పిలువుఁడు-పిలువకుము-పిలువకుఁడు-పిలువన్ - పిలువఁగల - పిలువఁబడు-మొ. అద్విరుక్తములనుటచేత "శా...రాజు మెచ్చం గెళీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ" (భీష్మ-౨ ఆ-౩౦౪) అను రీతిని 'ప'త్వము లేదు. ఇట్లె-గుచ్చు-గుచ్చన్-పుచ్చు-పుచ్చన్ - వాకుచ్చు-వాకుచ్చన్-మొ. 'శ-ర, సూ-రా-ని" కారులు "గువ్వన్-పువ్వన్-వాకువ్వన్" అనురీతిని వత్వమును నిరాధారముగ వాడిరి. అట్టి వత్వమును నిర్వహించు ప్రయోగ మొక్కటేని కానరాదు. "తిగుచు=తివుచు=తివువన్=తివ్వన్=తివన్" అనుచో ద్విరుక్త చకారమునకు వచ్చిన 'వ'త్వము కాదు. "నొవ్వఁ బల్కుదు సభలోనఁ జివ్వకొల్ల" (ఉద్యో-౪ ఆ-౨౭౮). అను చోటి 'నొవ్వన్' అనెడి 'వ'త్వము ద్విరుక్త 'చ'కారమునకు వచ్చినది కాదు. నొచ్చునకు 'నొ

వు' అనియే ముత్పరకత్వమున నగును (చూ-క్రియా-౯౦ సూ) ఇట్లు 'నోవన్' అని యేర్పడినపిదప 'వ'కార ద్విత్వమయ్యెను. (చూ-అచ్చు-3౬ సూ)

౧ వివ :- కవిత్రియాదీతర కవి ప్రయోగంబులందుఁ గొన్నియెడల "ను జ్యంతాదులు పరంబులగునపుడు 'ప'త్వము విభాషనగు. క. ఊహించ నొక నాల్గు గడియల సంచారము (కళా-3) (ప్రౌఢ-క్రియా-౧౬ సూ) చ తీర్చుము వెసఁ బొమ్ము నమ్మిమనుచున్ (కళా-౬ ఆ- ) (ప్రౌఢ-క్రియా-౧౬ సూ).

౨ వివ :-'విడుచు = విడునట్లుచేయు' అను ప్రేరణార్థమున విడుపన్' అనవలెను. విడుచు=త్యజించు' అనుచో విడువన్' అని యర్వాచీనముగా నేర్పడెను ఒలుచు-ఒలుపన్. సాధువు ఒలువన్' సరికాదు. (ఒలియు-ప్రేరణ-ఒలుచు) విఱుచు-విఱుపన్- సాధువు విఱువన్' వ్యావహారిక రూపము "ఇచ్చు-ఈయన్=ఇయ్యన్-ఈన్ సాధురూపములు 'ఇవ్వన్' వ్యావహారికరూపము 'ఎగుచు-ఎగుపన్' సాధురూపము 'ఎగువన్' వ్యావహారికరూపము తాలు ధాతు ప్రేరణము. తాల్పన్ (తాల్పఁగ సభా-౧ ఆ-౭౯) వ్యావహారిక వాసనచే ఇవ్వన్-ఒలువన్-విడువన్ - విఱువన్ - ఎగువన్" అను రూపములు హితముగా వినఁబడును. కాని యట్టిచోటి వ త్వమునకు మహాకవి ప్రయోగప్రామాణ్యము లేదు.

ఖండ బిందువుమీఁది సిద్ధ చ'కారంబునకు ముత్తు
పరంబగునపుడు 'ప'కారంబు ప్రాయికంబుగా నగు
౯౨ (బా-క్రి-౦౯ సూ) (వ్యా-పం-33౧ III వివ).

తలఁపక-తేఁపక (తేఁచు-ధా) (ఉద్గారించు). సైఁపక=(సహింపక). తోఁపక. 'ఏఁచు'నకు వైభాషికంబు .-ఏఁపక=ఏఁచక. నోఁచు'నకుఁ గలుగదు. నోఁచక. ఏఁచునకు విభాష :-చ ..ఏఁపనగునె యైన నీదయిన పంపెదఁ గైకొని (విరా-౨ ఆ-౨౬3).

(చూ-వ్యా-సం-౧౬౨-౨౨ పుట). శా. కం జాత వ్రతము మాటు చేర నవి యేఁచన్ సాగె (వసు-౩ ఆ-౧౦౧). వెనుకటి క్రియ-౯౧ సూ. చొప్పున వకారము రానేరదు. ప్రకృత సూత్రము 'వ'త్వము ప్రాయికముగా విధించుచున్నది.

కవిత్రయా దీతర ప్రయోగములందు వర్తమానార్థక 'చు' వర్ణక పరకత్వమునందును నాగమ 'చ' కారము నకు 'వ' త్వము విభాషగనగును. ౯-౩. (ప్రౌఢ-క్రి-౧౭) (వ్యా-సం-౧౬౧౨-౧౬౧౩ పుటలు. ౩౩౧ విష.)

చ. కపటపు...మోవిఁ జే రుపుచును...(కళా-౭-ఆ-౧౬౨ప). ఉ. కంపిత...గర్జింపుచునున్న...(జై-౨ ఆ-౪౬) * ఇట్టివి ప్రాచీన కవి సమ్మతములు కావు- ఉ ఇంచుక...దుఃఖించుచు...(అశ్వ-౪ ఆ-౭౩.)

తద్ధర్మార్ద్యర్థకము నుభయ ప్రార్థనాద్యర్థకము నగు 'దు' కృతోఁగూడ నాగమ తద్భిన్న 'చు' వర్ణములు రెండును 'తు' వర్ణముగా మారును

ఇట్టియెడల ద్విరుక్త 'చు' వర్ణంబు ద్విత్వ 'తు' వర్ణంబగును. కవిత్రయాదీతర ప్రయోగములందు ''చుదు'' అను దానితోఁ పాటుగ 'యుదు' అనునదియు వైకల్పికముగా 'తు' వర్ణంబును బూర్ణముమీఁది 'చుదు'

* ఇట్టి యర్వాచీన కవి ప్రయోగములను జూచి కావలయు నహోబలపతి నన్నయ చింతామణిచే నిట్టి 'వ'త్వరూపములను సాధించి తన కవి శిరోభూషణమున 'నుతింపుచున్నాఁడు-పోషింపుచున్నాఁడు" అని ప్రామాదికముగా నుదాహరించెను దీనిని బట్టి ముద్రణసంస్కర్తలు ప్రాచీనగ్రంథములందును నిట్టి ప్రయోగములను బ్రక్షిప్తములను జేయుచున్నారు.

వైకల్పికముగా 'పుదు' అనునదియు నగును. ౯౪.
(బా-కి)-౯౦-౧౦౭) (వ్యా-సం-33౨ I వివ)

ద్వివిధ 'చుదు' లును 'తు' అగుటకు :-రక్షించు+దు+రు=రక్షింతురు. గెలుచు+దు+రు=గెలుతురు. ఉభయప్రార్థన :- రక్షించు+దు+అ+ము=రక్షింతము. గెలుచు+దు+అ+ము=గెలుతము. క. నివేదింతురు తల్లికి...(ఆది-౬ ఆ-౨౪౦). పడయంగవలతో (అర-౨ఆ-3౫౧). ద్విత్వ — క. పోయి మనము వత్తు మెల్లి... (భీష్మ ౨ ఆ-౨౫౨) నన్నయ :-ఏమి సేయుదు సుతులార (ఆది ౭ ఆ 3౦౪) యుదు=తు: ప్రోడఁ జేతువో (కవిక-3 ఆ ౫౫) కం. చేతురె యకట (దశా-3౪౫ పు) నన్నయయే కాక తిక్కనాదులును 'చేతురు' మున్నగురీతిని 'తు' వర్ణమును బ్రయోగించిరనుట పొరపాటు. అట్టి పాఠములు ప్రక్షిప్తములు. (చూ-వ్యా-సం-౧౬౨౭-౧౬౨౯ పుటలు) 'ంచుదు=ంపుదు' ప్రయోగము :-కం. తుద బహువచనమునకు నిం పుదురును నింతురును నయ్యెఁ బుడమి యెడల నిం చుదురును గలుగు... (కావ్యాలం-౯ ఉల్లా-౧౬౦) 'పూజింపుదుము' (అర-౨ ఆ ౨౯౬) అని నన్నయ ప్రయోగించెననుట కల్ల. అచట "పూజింతుము రుద్రునిం దనుచు వేడ్క" అనియే నన్నయ ప్రయోగించినపాఠము. అర్వాచీను లట్టివానిని బ్రయోగించిరి .- గీ. వచింపుదురు నరుస మూఁడటంచు నందుల నధర్మ...(వరాహ-2 ఆ-౧౧౦) (బాలక-23-24 పుటలు.)

౧ వివ :-కావింపుట-కోపింపుట-మున్నగునవి కేవలము నపశబ్దములు తిమ్మకవ్యాదు లిట్లు 'ట' వర్ణక పరక 'చ' కారమునకు 'ప' త్వము గలదనుట మిక్కిలి పొరపాటు. అట్టి ప్రయోగము లశ్రుతచరములు.

అగు-వచ్చు-చొచ్చు-చూచులకు ముత్తు పరంబగునపుడు 'కా-రా-చొరు-చూడు' లగు. ౯౫. (బా-కి)-౯౧) (వ్యా-సం-333 వివ).

అగు :-కాఁడు-కమ్ము-కాఁగల-కాన్-కఁ-మొ. వచ్చు:-రాఁడు-రమ్ము-రాన్-రాఁగల-మొ. చొచ్చు :-చొరఁడు- చొరుము- చొరన్-చొరఁగలఁడు-మొ. చూచు :- చూడఁడు-చూడుము-చూడన్-చూడఁబడు. (చూ=చుమ్ము-చుమ్వో-క్రి-౪౩ సూ) మొ

౧ వివ :-ముత్పరకత్వము లేనిచోటఁ బై యాదేశముల నాధునికులు ప్రయోగించుట భ్రాంతి మూలకము. 'చొరి' శ్రీకృష్ణ భారతము ౯ ఆ-౨౭౨) (చూ-బాలక-౮౧ పుట) ఇందిట్టివి పెక్కు గలవు.

ముత్తు పరంబగునపుడు 'ఇచ్చు' అనుదానికి 'ఈ' అనునది సర్వాదేశ మగును. జీత్తు పరమగునపుడు 'ఈయ-ఇయ్య' అను నాదేశములును నగును. ౯౬ (బా-క్రి-౮౨) (వ్యా-సం-౩౩౪ వి)

ముజ్జు పరమగునపుడు :-ఇమ్ము=ఈ. బహు=ఇండు కానిమ్ము=కానీ. మొ. జీత్తు పరమగునపుడు :- ఈయకుము=ఇయ్యకుము-ఈకుము. ఇయ్యకుఁడు=ఈకుఁడు. ఈయఁడు=ఇయ్యఁడు=ఈఁడు ఈన్=ఈయక్=ఇయ్యన్. మొ.

౧ వివ :-ద్విపద :- వనరాశి త్రోవయివ్వక...(రంగ-రా-బాలకాం ౮ పుట) ఇది వ్యావహారిక రూపము రంగనాథ రామాయణము నందలి వ్యావహారికరూపములలో నిది యొకటి ప్రామాణికకవు లెవ్వరును గిట్టివానిని బ్రయోగింపరు.

౨ వివ :- ఈవుతన్'=(ఇచ్చుతన్) అను రూపము 'సూ-రా-ని'' ఘంటువున నుదాహరింపఁబడెను. ఇందలి 'వ' త్వము నిరాధారము. దీనిని నిర్వహించు మహాకవిప్రయోగము లేదు.

'తే-తేరు'లు తెచ్చునకగు. ౯౭ (బా-క్రి-౯౩) (వ్యా-సం-౩౩౫ విష)

తెమ్ము=తే=తేరుము=తేరు. తెండు=తేరుఁడు తేఁడు=తేరఁడు. తేఁ-తేరఁ. తేవలయు (ఆది-౨ ఆ-౧౦౫) తేరఁ గడఁగె (ఆర౩ఆ౭౬).

"చావు-నోవులు" "చచ్చు-నొచ్చు"ల కగు ౯౮.
(బా-క్రి-౯౪) (వ్యా-సం-౩౩౬ విమ.)

చచ్చు:-చావఁడు-చావుము. బహు-చావుఁడు. నొచ్చు:-నోవఁడు-నోవుము-బహు- నోవుఁడు-ద్విత్వము-నొవ్వఁడు- నొవ్వుము-(అచ్ఛి-౩౬ సూ)

జీత్తు పరంబగునపుడు వాని 'వు' వర్ణంబు విభాషను లోపించును ౯౯. (బా-క్రి-౯౫) (వ్యా-సం-౩౩౬ విమ.)

చచ్చు:-చాక=చావక. చాకుము=చావకుము. చాకుఁడు=చావకుఁడు. నొచ్చు:-నోక=నోవక నోకుము=నోవకుము. ముజ్జు పరంబగునపు డీ 'వు' లోపము లేదు. 'నొచ్చు' అనుదానికిఁ బర్యాయముగా 'నోయు' ధాతువు గలదు దాని కీ యాదేశాదులతోఁ బ్రసక్తి లేదు. కం ఆయాసపడుటఁ గనుఁగొని నోయుదు... (శాంతి-౩ ఆ-౩౩౦).

అగున-కను-కనులకు ముజ్జీత్తులు పరంబు లగునపుడు 'కా-నా-కాన' లు విభాష నగు. ౧౦౦. (బా-క్రి-౯౬) (వ్యా-సం-౩౩౭ విమ)

ఈ సూత్రము యథాసంఖ్యాన్వయమున మూఁడువాక్యము లగుచున్నది. I అగునకు ముజ్జు పరంబగునపుడు 'కా' దేశము విభాష నగును (క్రియా ౯౫ సూత్రముచే వచ్చు నిత్య 'కా' దేశమున కిది యపవాదము) II 'అను' ధాతువునకు జీత్తు పరంబగునపుడు 'నా' అను నాదేశము విభాషనగును. III కనుధాతువునకు జీత్తు పరంబగునపుడు 'కాన' అను నాదేశము విభాషనగును. ఉదా - I అగు:-కమ్ము=అగుము=అవుము (అచ్ఛి-౭౯ సూ) = ఔము (క్రియా-౧౦౭ సూ). కండు=అగుఁడు=అవుఁడు=ఔఁడు II అను:-నాఁడు=అనఁడు. నారు=

అనరు. నాక్=అనక్. నాక=అనక. నాని=అనని. III కను :- కానఁడు= కనఁడు. కానన్=కనన్. కానక=కనక. మొ.

నేరుచునకు లాట్టునందును భూతార్థక రూపములందును † 'రు' వర్ణము బహుళముగా లోపించును. ముత్తు పరంబగునపుడు దీని తుది 'చు' వర్ణము వైకల్పికముగా లోపించును ౧౦౧. (బా-క్రి-౯౭) (వ్యా-సం-33౯ విష.)

లాట్టు :-నేచును=నేరుచును. నేర్తును=నేతును. కం. ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్. (విరా ౧ ఆ ౧౯౬) భూతార్థ - నేచెను=నేరిచెను. నేచిన=నేరిచిన. నేచి=నేరిచి. మొ బహుళగ్రహణముచేత- "కం. నీచేఁ దా రాద్యంతము నేచుకొనం గలరు" (వరాహ-౧-౨-ఆ-22) మున్నగునవి సాధ్యములు. ముత్తు :-నేరఁడు=నేరువఁడు. నేరము=నేరువము. విధాత్రునకైనను నేరఁబోలునే (ఆది ౧ ఆ ౧౯). నేరువన్=నేరన్-మొ

పోవునకు 'దుజ్ముత్తు'లు పరంబు లగునపుడు 'వు' లోపంబు విభాషనగు ౧౦౨ (బా-క్రి-౯౭). (వ్యా-సం-33౯ విష.) ♦

---

† సూరి భూతార్థములలో లిట్టునందు మాత్రమె 'రు' లోపము బహుళమని సూత్రించెను ఆ పక్షమున నీక్రింది భూతార్థక రూపములు సాధ్యములు కానేరవు 'నేచినయట్లు (మానల ౧ ఆ ౨౧౫) నేచియు నేరకుండియును (దశకుమార-3 ఆ ౧౪౦) (కేతన.)

♦ సూరి ' పోవునకుం'' దుజ్ముత్తులు ముజ్జుం బరంబులగునపుడు 'వు' లోపంబుం 'బొద పదలు' విభాషనగు " (౯౮ క్రియా) అని సూత్రించెను. 'పొద-పద' అనువానిలో నస్మదర్థ సాహిత్యమును గలదని క్రియా-32 సూత్రమున వివరింపఁబడుటచే నిందు 'పొద-పద' లయాదేశమును మరలఁ జెప్పలేదు

దుక్కు :-పోవుదురు=పోదురు పోవుదుము=పోదుము. ముత్తు:-పోవఁడు=పోఁడు. పోవన్=పోన్. పోవఁగలఁడు=పోఁగలఁడు. పోవకుము=పోకుము పోవుదము=పోదము. (ఉభయప్రార్థ). పోవుము=పొమ్ము=పో. పోవుఁడు=పొండు. "పదము=పద=పోదము=పోద" అనునవి "పొమ్ము" అనుదానికిని, 'పోదఁడు' అనునది 'పొండు' అనుదానికిని బర్యాయములు కావు 'పోద-పద' మున్నగునవి క్రియా-3౭ సూత్రమున విస్తరించి చెప్పఁబడెను.

౧ వివ :-అర్వాచీనకవులు 'తి' (భూతార్థక) వర్ణకము పరంబగునపుడును 'వు' లోపము ననఁగా యిలోపమును (చూ-క్రియా ౧౦౩ సూ) బ్రయోగించిరి. ఉదా :-పోయితివి=పోతివి. పోయితిరి=పోతిరి. 'మనమే యమ్ముడు పోతిమో యితనికిన్ (వరాహ ౧౦ ఆ 3౭ ప) (వ్యా-సం-౧౬౪౪-౧౬౪౫ పుటలు. చూ)

అగు-పోవుల కడవ్రాల కిద్వక్రింబులు పరంబు లగునపుడు య కారం బగు. ౧౦౩. (బా-క్రి-౯౯) (వ్యా-సం-3౪౦ వివ.)

అగు :-క్రియా ౧౦౭ సూత్రము చొప్పున 'అయి'కి పాక్షికముగా ఐ' వచ్చును. అయి=ఐ అయిన=ఐన. పోవు :-పోయిన-పోయి-పోయిరి-పోయెను-పోయెదు-పోయెడి-మొ క అయినది నలువురు శార్ఙకు లయు మోక్షణము . (ఆది ౮ ఆ ౨౯౪). ఈ యున్న పొష్యు ప్రోలికిఁ బోయి...(ఆది-౧ ఆ ౧౧౭)

౧ వివ :-కడవ్రాల కనుటచేత 'అగు' ధాతు 'గ' కారమునకే 'య' కార మయ్యె ననవచ్చును గాని యాపక్షమున-అవితిని' మున్నగు ననిష్టరూపములు దుర్వారములగును గాన 'అచ్చు ఉ౯' చొప్పున వకారముచేసి దానికి 'య' కారము చేయనగును.

అగునకు వక్రిఁబు గూడుచో దీర్ఘం బగు ౧౦౪. (బా-క్రి-౧౦౦) (వ్యా-సం-3౪౦ వివ.)

౪ (క్రి-౧౦౫-౧౦౬ సూ) పిలుచు 'చు' లోపము. ముత్పరకత లేకున్నను 'కా' దేశాదులు.

ఆయెను=అయ్యెను (అచ్చి ౩౬ సూ. చొప్పున ద్విత్వమును, సమా-౭౬ సూ. చొప్పున హ్రస్వమును గలైను. ఇట్లె-ఆయెడు=అయ్యెడు మొ క. వెఱ గయ్యెడు... కయ్యెము...(ద్రోణ-౩ ఆ-౨౩౭)

పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగు నపుడు
కడవ్రాయి బహుళంబుగ లోపించు. ౧౦౫ (బా-క్రి-
౧౦౧) (వ్యా-సం-౩౮౧ I విష)

పిలఁడు=పిలువఁడు పిలుము=పిలువుము. పిలన్=పిలువన్ పిలఁ గలఁడు=పిలువఁగలఁడు. బహుళగ్రహణంబుచే 'లేచు' నకు ముజ్జు పరం బగునపుడు 'చు' లోపంబు నిత్యంబు. లెమ్ము=లే-లెండు 'పిలుచు-నిలుచు-తలఁగు- తొలఁగు- గెలుచు- వెఱచు- ఇత్యాదులు. పన్నిదము చఱము (ఆది ౨ ఆ ౩౭) చఱచు+ము=చఱము

౧ వివ:-బా-గు-వ్ర. 'తలఁగు' నకు మాఱుగా 'తలఁచు' అను దానిని నిల్పుట పొరపాటు 'తలఁచు'నకు 'చు' లోపమే లేదు. తలఁగు:- క. బల్లిదులు తలఁడు తలఁడని .. (భాగ-౧౦ స్కం-పూ-౧౩౬౭-సూ-రా-ని). క . ముం గల నడచి కంచుకులు నుం దల తలమనఁ బఱియుఁ జతురతరముగ నడచెఁ (నిర్వ-౮ఆ-౬౪).ఇట్టివి విరోధించును.

లాంతిచో సహితము 'కా' దేశాదులు కానఁబడి
యెడి. ౧౦౬. (బా-క్రి-౧౦౨) (వ్యా-సం-౩౮౨ వి)

లాంతిచో=ముత్తు కానివి పరమగు నపుడును. కావుతన్-కాతన్-(చూ-క్రియా-౩౮ సూ) అగుట=కావుట. (ఆది-౧ ఆ ౧౩౯. సిద్ధము కావు బెఱింగి) కానన్=కావునన్-అనుడును-అనవుడును-నావుడును-మొ.

౧ వివ :- 'రావించు = రప్పించు-కావించు' మున్నగువోట్ల నిత్యము ఇవి క్రియా ౮౦ సూత్రముచేతనె సిద్ధించును.

౨ వివ -చా బిడ్డ = (బసవ-౭ ఆ-౩౧౦) = (కడుపులోఁ జచ్చిన బిడ్డ). చా పరువు-(మనుచ-౪ ఆ-౪౫)=(చావునకుఁ దెగించిన పరుగు )

3 వివ :-'కావునన్=కానన్' అని ద్రుతప్రకృతికములె న్యాయ్యముగాఁ గావలయును. 'కాన్+అ=కాన' అను వ్యుత్పత్తి చొప్పున భారతమున నిది కళగానె కన్పట్టుచున్నది మ ధృతరాష్ట్రుండును ..కా న తగం బొందుట (ఉద్యో-౧ ఆ-3౫౮) భారతమున ద్రుతప్రకృతికతను నిర్వహింపఁజాలు ప్రయోగ మగపడదు. "క. ౨సభావా ద్వ్యపనిబద్ధ రసములు గానన్" (నరస ౫ ఆ ౨3౦) అనురీతి నర్వాచీనులు దీని ద్రుతాంతముగా వాడిరి.

ఆచ్ఛికంబులందు 'అయి-అవు' అనువానికి * వరుసగా "ఐ-ఔ" అనునవి బహుళంబుగా నాదేశము లగును. ౧౦౭. (బా-కౌ-౧౦3) (వ్యా-సం-3౮౭-3౮౭ I విమ.)

అయిరి = ఐరి అయి = ఐ. అయితిరి=ఐతిరి అవును=ఔను. అవుట=ఔట, మొ. శబ్దఖండములందును నిట్లగును. అయిదు=ఐదు. అయిరేని=ఐరేని=(బచ్చెన పనిచేసిన పెండ్లికుండలు). అవుడు=ఔఁడు (పెదవి క్రిందిచోటు). గవుసెన=గౌసెన మొ.

౧ వివ -'ఐ-ఔ' లకు 'అయి-అవు' అనునవి యాదేశము లగుటయుఁ గలదు. ఉదా :-కైక=కయికా దైవమ్-తద్భవ-(దై+అము=దయియము)=దయ్యము యౌవనమ్-తద్భవ-(జౌవనము=జవువనము)=జవ్వనము. ఇట్టిపద్ధతి మిక్కిలి యరుదనఁ దగును.

౨ వివ :-ఆచ్ఛికంబులం దనుటచే నీపద్ధతి సంస్కృతసమములందు వర్తిల్లదు ఉదా :-దైవమ్-యౌవనమ్-దయిత (భార్య)-జైన ముని. భవుకము=(మంగళము) కవులు-కైకయి-మొ

---

* 'అయి యవులకు' అను సూరిగారి సిద్ధద్వంద్వము సంహితా యకారమును బాధిమాదికములు.

అస్త్యర్థకంబును ప్రాప్త్యర్థకంబును (సకర్మక) *
నగు 'కలుగు' ధాతువునకు 'కల' అను నాదేశము
లట్పరకత్వమున నిత్యముగా నగు. ౧౦౮. (బా-కి)-
౧౦౪) (వ్యా-సం-౩౪౪ వి.)

లట్టు-ప్రథ :-కలఁడు-కలరు. (కలవాఁడు=కలాఁడు=కలఁడు. కలవారు=కలారు=కలరు). కలదు-కలవు. మధ్య :- కలవు-కలరు. (కలవాఁడవు=కలాఁడవు=కలవు-మొ.) ఉత్త :-కలను-కలము. (కలవాఁడను-కలాఁడను=కలను-మొ) (ప్రాప్త్యర్థకత్వమందు- 'కలవు-కలను-కలము' అనునవి ప్రాచీనభాషలో లేవు. క్రియా ౨౧-౨౨ సూ: చొప్పున నుదంతము కామింజేసి "చు-ఉన్న" అనునవి రావు. క్రియా ౨౦ సూ. చొప్పున 'ఉన్న' లేదు గాన "ది-వి" అనునవి రానేరవు. లట్పరకత్వమున 'కలా' దేశము నిత్యమగుటంజేసి "ధనలాభము గలుగుచున్నది" మున్నగుచోటులందు 'కలుగుచుక్+ఉన్నది' అనురీతిని వర్తమానార్థక 'చు' వర్ణక ద్వారమున రూపసిద్ధి నరయునది.

౧ వివ.-అస్త్యర్థకత్వమున "కలవు-కలను-కలము" అను వానిని దిక్కనాదులు ప్రయోగించిరి. "నీ వచ్చుటఁ గలవో లేవో నిక్కము చెప్పుమా" (విరా-౪ ఆ ౨౧౧) ఇట్లు తిక్కన 'డ'కార

* సూరి అస్త్యర్థక 'కలుగు' ధాతువునకు మాత్రమె 'కల' అను నాదేశమును (బా-కి)-౧౦౪) విధించెను. కాఁగా ప్రాప్త్యర్థక 'కలుగు' నకీ క్రిందిరీతి రూపములు-సాధ్యములు కానేరవు. 'ఎఱుకఁ గ్గలరె మగువలెందు (ఆది ౨ ఆ ౩౪). ఇది వడిఁ గలదు మనము కంటె గాడ్పుకంటె (ఆది ౧ ఆ ౧౧౫). జ్ఞానముఁ గలఁ డేనిన్ బ్రాల్మఁడైనఁ గడు వృద్ధు మహిక్ (అర-౩ ఆ-౨౪౦) మగటిమిఁ గలఁడనియెడు నమ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగిన యేనిన్ (ఉద్యో ౧ ఆ ౩౧౫).

రేఫ లోపములను (కలవాఁడవు=కలాఁడవు=కలవు) సైత మంగీకరించెను. ప్రాప్త్యర్థమునందు సైతము 'కలవు-కలను-కలము' అను రూపములను సంస్కర్తలు ప్రక్షిప్తములను జేసిరి. కాని యా యా చోటులందు 'కలదు' అను సాధురూపమే కవిప్రయుక్తము. ఉదా:-
క. నేరుపుఁ గల ననుచు నహం కారంబున (హరి-పూ-౫ ఆ ౨౪౭). ఇచట 'నేరుపు గలదనుచు' అనునదే కవిప్రయుక్తము. (చూ-వ్యా-సం-౧౬౫౭ పుట) బీరముఁ గలవేని (ఆర ౧ ఆ ౩౦౯). ఇట 'బీరము గలదేని' అనునదే కవిప్రయుక్త పాఠము. ప్రాచీనులు "కలవాఁడను=కలాఁడను. కలవాఁడు=కలాఁడు=కలఁడు" మున్నగురీతిని దచ్ఛబ్ద 'వకార-వాకార' లోపమును (సమా-౮౩ సూ) ప్రయోగింతురేకాని ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతుస్థలమున "కలాఁడను-కలాను=కలను. కలారము=కలాము=కలము. కలాఁడవు=కలావు=కలవు" అనురీతిని డకార రేఫ లోప రూపములను ప్రయోగింపరు.

> తద్ధర్మాద్యర్థక విశేషణస్థలమునందును నర్థద్వయమునందును 'కలుగు' ధాతువునకు "కల" అను నాదేశము విభాష నగు. ౧౦౯. (బా-క్రి-౧౦౫) (వ్యా-సం-౩౪౪ విశే.)

కలవాఁడు=కలుగువాఁడు = కలిగెడువాఁడు= కలిగెడివాఁడు. కలాదేశము మీఁద 'ఎడ్యాదు' లు నిల్వావు ♦

అస్త్యర్థమందు 'కలుగు'-త్రర్థమున :- ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁడు-(ఆది-౩ ఆ-౧౧౨). కొడుకులు గలవాఁడు

---

♦ సూరి 'కలుగు' అనుదానిపైని సయితము 'ఎడ్యాదు' లు నిల్వవని వచించుట పొరపాటు. క. ఏర్పడ జగములు గ్రమ్మఱఁ గలిగెడు నప్పుడు (ఆర-౪ ఆ ౨౩౭). సూరి ప్రాప్త్యర్థక కలుగు ధాతువునకును దద్ధర్మాద్యర్థకత్వమున 'కలా' దేశమును దిక్కన ప్రయోగించెనని చూచుకొనలేదు.

(ఆది-౮ ఆ-౨౫). ప్రాప్త్యర్థమందును 'కలా', దేశము -క. తిరమైన నడవడిం గల పరిణత చిత్తుండు (శాంతి-౫ ఆ ౧౮౯).

'కలుగు' నకు "లజీ-మిజీ-కజీ-నిజీ-వడి" ప్రత్యయములు పరమగునపుడు 'లే' అనునది సర్వాదేశమగు ౧౧౦. (బా-కి-౧౦౬). (వ్యా-సం-౩౮౮ వి.)

(క్రియా-౧౫ సూ-లజీ. క్రియా-౪౮ మిజీ. క్రియా-౫౦ కజీ. క్రియా-౫౭ నిజీ. కృత్-౨౨. వడి. చూ). ప్రాప్త్యర్థకత్వమున వ్యతిరేకమునందు "లేవు-లేను-లేము-లేవడి" అను రూపములు లేవు. తక్కిన యన్నియెడలఁ బ్రాప్త్యర్థమందును నస్త్యర్థమున నంతటను వ్యతిరేకమున 'లే' అను నాదేశ మగునని యెఱుంగునది. అస్త్యర్థ వ్యతిరేక :-ప్రథ-లేఁడు-లేరు. లేదు-లేవు. మధ్య :-లేవు-లేరు. ఉత్త-లేను-లేము తక్కిన :-లేమి-లేక-లేని-లేవడి. నీవచటఁ గలవో లేవో (విరా ౪ ఆ ౨౧౧). ప్రాప్త్యర్థ వ్యతిరేక :-మధ్యమ-బహు- లేరు- ప్రథ-లేఁడు-లేరు * లేదు-లేవు మిప్రభృతి :-లేమి-లేక-లేని. మాయందు లేని గుణములు (ఆర ౧ ఆ ౮) సామర్థ్యం గెలువలేమి (భీష్మ ౨ ఆ ౩౫౨).

౧ వివ -ప్రాప్త్యర్థకత్వమందును 'లేవు-లేను-లేము' అను వానిని గొన్నియెడల ముద్రణసంస్కర్తలు ప్రక్షిప్తములు చేసిరి. అట్టియెడల నెల్ల 'లేదు' అనునదే కవి ప్రయుక్తపాఠము ఉదా .- అంత యెఱుఁక లేనె (లేనిదాననె) (ఆర ౧ ఆ ౨౩౧). ఇట "అంత యెఱుక లేదె' అనియే కవి ప్రయుక్తపాఠము.

---

* సూరి ప్రాప్త్యర్థకత్వమున వ్యతిరేకమందు 'లే' అను నాదేశమే లేదనుకొనుట కేవలము పొరపాటు క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు మతి లేరైరి (భీష్మ ౩ ఆ ౨౨౭) లావు లేరైరి (ఆశ్రమ ౨ ఆ ౧౫౨.)

వ్యతిరేకంబునందు 'వలచు' నకు 'ఒల్ల' విభావ నగు. ౧౧౧. (బా-క్రి-౧౦౭) (వ్యా-సం-౩౮౬ వివ.)

ప్రథ :-ఒల్లఁడు-ఒల్లరు. ఒల్లదు-ఒల్లవు. మధ్య :-ఒల్లవు-ఒల్లరు. ఉత్త :-ఒల్లను-ఒల్లము. ఒల్లమి-ఒల్లక-ఒల్లని-ఒల్లాదే శాభావ పక్షమున :- ప్రథ- వలవఁడు- వలవరు మొ. క్రియా ౯౧ సూ. చొప్పున 'వలచు' ధాతు సిద్ధ 'చ' కారమునకు 'వ' కారాదేశము. ఆ. వె....జముఁడు వట్టికొన్న వానినైనఁ గావ వలతురు వలచిన। నొల్లకున్న (ద్రోణ ౨ ఆ ౨౯౦).

౧ వివ :-వ్యతిరేక భావార్థమున 'ఒల్లమి' అనుదానికిఁ బర్యాయము 'ఒల్లఁబాటు' అనునది యగునందురు. కాని 'ఒల్లఁబాటు' శబ్దములోని పూర్వావయము "ఒల్లన్" అను భావార్థక నిపాతమనుట యుక్తము. (చూ-సంధి-౨౬). గీ. ప్రాణములు నర్థములు నొల్లఁ బాటుసేసి (భీష్మ ౧ ఆ ౧౮౨)

౨ వివ :- వలవదు=వలదు' అనునవి పర్యాయరూపములుగా నగపడును. కాని 'వలవదు' అనునది 'వలచు' ధాతు వ్యతిరేక రూపము. 'వలదు' శబ్దము వలయు' ధాతు వ్యతిరేకరూపము. చేయవలయు-చేయవలదు. 'వలదు' శబ్దమునుండి "వలదు=వల్దు=వద్దు" అనురీతిని రూపము లుప్పతిల్లును.

స్వార్థవ్యతిరేకములందలి కొన్ని క్రియల తుదిని జేరిన 'అగు-పోవు' మున్నగువాని స్వార్థిక వ్యతిరేక రూపములు వివిధములగు నర్థ విశేషములకు ఘటకము లగును. కావునవె యవి ఘటకక్రియ లనఁబడును. అట్టి జంటలందు వివిధములగు నాగమాదేశ లోపాదులును గల్గును ఇట్టిజంట లీవఱకును గొన్ని సందర్భాంతరములందు సూత్రింపఁబడెను. ఇంకను సూత్రింపఁబడును. ౧౧౨. (బా-క్రి-లేదు) (వ్యా-సం-౩౮౭ వివ. ౧౬౬౩ పుట మొ. ౧౬౬౭ పుటలు).

ఉదా:-నమ్మనేర నయ్యెదన్. (ఆది-౪ ఆ-30). మనఁ బోవక పోవఁగ రాదు. (ఉద్యో-3 ఆ-౪౬). వృష్టిలేదవుర (ఆది-౪ ఆ-౨౪౯) పుట్ట దయ్యెనే-పుట్టరైరె. (ఆది-౬ ఆ-౬౦). నాకుఁ బనిసేయ దయ్యె నేనిన్ (ఆది-3 ఆ-౧3౨). ఈఁజాల నయ్యెదన్ (ఆర-2 ఆ-3౬౪). రాక పోఁడు-ఉండక పోఁడు. (మనుచ-3 ఆ- ) చేయనే చేయఁడు. చేసెనా చేయును. చేయ నిమ్ము. చేయ నగును. చేయ-రాదు. చేయఁ దగును చేయఁ దగదు=చేయ రాదు. చేయఁ గూడదు. (క్రియా-౪2 సూ వివరింపఁబడెను.) తెలియఁ జేసెను. ఒనరఁ జేసెను. (క్రియా-23 సూ-3 వివ). పండఁ బాఱిన పొల మెండఁ బాఱెను. (ప్రారంభార్థక ములు. పండ నారంభించిన పొల మెండుట కారంభించెను) (మనుచ 3 ఆ-౧౨౯). చేయ నున్నాఁడు=చేయఁ బోవును=(ఇవి భావ్యర్థమునే యిచ్చును- ధాతువు నుజ్యంతముపైని 'ఉండు-పోవు' ధాతు రూప ములు నిల్చి భవిష్య దర్థబోధకము లగును). చేయఁగలఁడు (భావ్యర్థ మున నుజ్యంతముపైని 'కల్గు ధాతువు చేరును. క్రియా-౨2 సూ) (ఇట్టిదె సామర్థ్యార్థకము నగును). చేయుచున్నాఁడు (వర్తమానార్థ మున చువర్ణాంతముపైని 'ఉండు' ధాతురూపములు నిల్చును). (క్రియా-౨౨౧ సూ). చేయఁబడును (ధాతువు నుజ్యంతముపైని 'పడు' ధాతురూపములు నిల్చును). (క్రియా-౪౯ సూ) చదువు కొనును (క్రియా-౬౨ సూ) (ఆత్మనేపదార్థకము) చేయఁ జూచెను (యత్నార్థకము=చేయ యత్నించెనని యర్థము) చేయ రైరి-చెప్ప నయితిని-(క్రియా-౧౧౮) చేయరా-ఏమిర-వచ్చెంజుమా-చదువవె-చదువవయ్యా - చనుదెంచెను - (గమనార్థకములు 'తెంచు' యోగ మున 'ఆగమనా'ర్థకము లగును) (క్రియా-౧౧౬) తెల్లగాన్-లెస్స గాన్-చేయఁగన్-చెప్పఁగాన్ (౧౧౯-క్రియా) - ఫండుకొనెను-చొరఁ బడెను- (క్రియా-౧౧3 సూ) మొ.

౧ వివ :-ఇట్లు ధాతువులేకాక కొన్ని నామముల జంటలును నర్థవిశేషబోధకము లగును. ఉదా :-తీయవిలుకాఁడు=తీయువిల్తుఁడు=

పచ్చ విలుకాఁడు = పచ్చవిల్తుఁడు = చెఱకు విల్కాఁడు = (మన్మథుఁడు) మొ-

వడుఁజీ కొను లోకానోకచో స్వార్థంబునం దనుప్రయుక్తము లగు. ౧౧౩. (బా-క్రి-౧౧౯) (వ్యా-సం-౩౮౭ I విశ).

క్రియా - ౫౯ - ౬౨ సూత్రముల చొప్పున నకర్మకములు కర్మార్థకములు నాత్మనేపదార్థకములును కానేరవు కాన నట్టియెడ నిల్చు 'పడు-కొను'లు స్వార్థికము లనఁగును ఉదా -చొరఁబడెను= (చొచ్చెను) (క్రియా-౯౫ సూ. చొరు). నిలువఁబడును=(నిలుచును). కూడఁబడును. పండుకొనును-మొ.

తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు. ముత్తు పరంబగునపుడు 'తెంచు'నకు 'తే-తేఱ' లగును. ౧౧౪. (బా-క్రి-౧౧౦) (వ్యా-సం-౩౮౭ IV విశ).

అగు-నెగయు-పోవు-చొచ్చు-పుచ్చు-కోఁచు-నడచు-పఱచు-మొలచు-పీచు-అరుగు-ఏఁగు-చను-ఇత్యాదు లగ్వాదులు. చనుదెమ్మనుము (ఉద్యో-౧ ఆ-౧౭౬)

ఉత్వంబుపైని "తెంచు" 'త'కారను 'ద'కారం బగు. ౧౧౫. (బా-క్రి-౧౧౦) (వ్యా-సం-౩౮౭ IV విశ).

అగుదెంచు-(కావచ్చు-పూర్తికావచ్చు). నెగయుదెంచు= (జలాదులనుండి పైకి లేచు) పోవుదెంచు=(సమాప్తి కావచ్చు). అగుదేన్=అగుదేరన్-మొ. ఏనేఁడు లగుదెంచె (ఆర-౪ ఆ-౩ ప). మునిశాపదినములు పోవుదెంచె (ఆది-౭ ఆ-౧౯౯).

అరుగ్వాదులకు 'తెంచు" పరంబగునపుడు 'గు' లోపంబు విభాష నగు. వీనిని ప్రాచీను లాగమనార్థ

మందె వాడుదురు. ౧౧౬. (బా-కౌ-౧౧౧). (వ్యా-
సం-౩౮౭ IV వి).

అరుగుదెంచు=అరుదెంచు=(వచ్చు). ఏగుదెంచు=ఏతెంచు=(వచ్చు) (గులోపము రాఁగా 'ఉ'కారాంతత్వము లేమింజేసి 'ద'త్వము రాదయ్యె) చనుదెంచు=(వచ్చు) ప్రీతి నరుదెంచి కనిరి. (అర-౩ ఆ-౧౫౯). మీ రిందుల కందఱుఁ జను దేరఁగ (ప్రసక్తలము) (సభా-౨ ఆ-౧౩౯). అర్వాచీనుల 'వెళ్ళు' అను నర్థము :-పురికేగుదెంచి...ఏమని విన్నవించెదర (జై-౨ ఆ-౭౩) (ఏగుదెంచి=వెళ్ళి). చంచలలోచన యెం దరుదెంచెనొ (రసిక-౬ ఆ-౮౮). (జై-౮ ఆ-౧౨౨). ఎట్లు మింటఁ జనుదేరఁగ (పోవుటెట్లు).

'తెంచు' పరంబగునపుడు 'పీచు' ప్రభృతుల తుది 'చు'వర్ణంబు లోపించు. ౧౧౭. (బా-కౌ-౧౧౨) (వ్యా-సం-౩౮౭ IV విమ).

పీచు+తెంచు=పీతెంచు=(గాలి విసరు). మొలతెంచు (మొలచు+తెంచు)=(అంకురించు). పఱతెంచు=(పఱచు+తెంచు)=(పరుగిడి వచ్చు). తోఁతెంచు (తోఁచు+తెంచు)=(ఉదయించు-మొ). (సూ-రా- నిఘంటువున నిది నిర్బిందువుగా 'తోతెంచు' అని యుదాహరించుట ప్రమాదికము. చూ-వ్యా-సం-౧౬౭౧ పుట). (పుచ్చు+తెంచు)=పుత్తెంచు=(పంపు). చొత్తెంచు=(చొచ్చు+తెంచు)=(చొరఁబడు). తదలు చకారముతో సంధించునపుడు ద్విత్వ తకార మేర్పడుట కవి ప్రయోగసిద్ధము. సీ...పు త్తెంచెఁ గాకున్న నేరఁ డితఁడు (అర-౧ ఆ-౫౫). (పుచ్చు+తెంచు) ఆ-వె-ఇత్త మెల్ల భంగి నిత్తున్వె (నిర్వ-౩ ఆ-౧౧౭) (ఇచ్చు+ద+ము=ఇత్తము).

భూతంబున లఱికి భూత తద్ధర్మా * ద్యర్థకం బగు 'అగు' ధాతు వనుప్రయుక్తం బగు. ౧౧౮. (బా-కౌ-

---

* సూరి 'లిడంతంబగు 'అగు' ధాతువుమాత్రమె యను ప్రయుక్తమగునని సూత్రించెను. అపట్టున 'నమ్మనేరనయ్యెదను (ఆది ౮ ఆ ౩౦) మున్నగు ప్రయోగములు సంగ్రహింపఁబడవు.

౧౧౪) (వ్యా-సం-౩౮౭ V వి).

౬౭౫-వ్యతిరేకార్థక క్రియకు:- ఉదా :-భూత :-ప్ర. వాఁడు రాఁడయ్యెను. వారు రారయిరి. అది రాదయ్యెను. అవి రావయ్యెను. మధ్య :-నీవు రావయితివి. మీరు రారైతిరి. ఉత్త :-నేను రానయితిని మేము రామయితిమి. తద్ధర్మాద్యర్థ :-నేను రానయ్యెదను-నమ్మనేరనయ్యెదను (ఆది-౪ ఆ ౩౦) (చూ-క్రియా-౧౧౨ సూ.)

అగు ధాతు నుఙ్యంతరూపమగు 'కాన్' అనునది వికల్పముగ హ్రస్వము నందును ఇవి (కాన్-కన్) క్రియా విశేషణములకును విధేయ విశేషణములకును నుఙ్యంతములకును బరముగా విభాషను నిల్చును. కొన్నిట నివి యన్వితము లగును. కొన్నిట వ్యర్థములై యనుప్రయుక్తము లగును. ఇవి ప్రథమమీఁద నిల్చునపుడు 'గ' కారాదేశము నిత్యము. (చూ-సంధి-౧౪ సూ) ౧౧౯. (బా-క్రి-౧౧౫-౧౧౬) (వ్యా-సం-౩౮౭ VI విష.)

క్రియయందలి విశేషమును దెల్పునది క్రియా విశేషణము. ఉదా :-అది వేగముగా వచ్చెను-వాఁడు లెస్సగాఁ బల్కెను. నామమందుండు విశేషమును దెల్పుచు ననఁగా నామవిశేషణమగుచుఁ గ్రియతో నన్వయించునది విధేయవిశేషణము. ఉదా :-వాఁడు పల్కినది న్యాయ్యముగా నున్నది ఇట్టియెడల కాన్-కన్' శబ్దములు వాక్యమున నన్వితములై యగుచున్నవి. * నుఙ్యంతములమీఁద

*సూరి క్రియా విశేషణములకు నిత్యముగా ననుప్రయుక్త మగు నని సూత్రించుట సరికాదు. క్రియా విశేషణములపైని సైతము నిల్వకపోవచ్చును. ఉదా -పెల్లు దొరఁగు నెత్తురునై (భీష్మ-౧ ఆ-) (చూ-ప్రౌఢ-క్రియా-౨౨ సూ) లెస్సగాఁ బల్కె ననుచో లెస్సయగునట్లు పల్కెనని కాన్' శబ్ద మన్వితమగుచుండుటచే దాని ననుప్రయుక్త మనరాదు. ఇది విధేయ విశేషణములకు పయిని నిల్చును. "బాహుబలగర్వ మఖర్వముగా" (కర్ణ-౨ ఆ-౧౦౫).

నివి యనుప్రియుక్తములె యనఁదగును. ఉదా:-నేను వినఁజెప్పను-నేను వినఁగాఁ జెప్పను. క్రియావిశేషణ విధేయవిశేషణములమీఁద నివి నిల్వకపోవచ్చును. పెల్లుదొరగు నెత్తురునై -(భీష్మ-౧ ఆ-). పరీక్షితున్,...కృతాంత నికేత నాతిథిని జేసె (ఆది-౧ ఆ-) ఇట ద్వికర్మమన్నను సనవచ్చును. (చూ-వ్యా-సం-౧౬౭ పుట). ఇవి భావ్యర్థకాదులందు నిల్చుటయుఁ గలదు. చదువఁగఁగలఁడు=చదువఁగలఁడు. చదువఁగఁబడెను = చదువఁబడెను. వినఁగావలయు = వినవలయు-మొ. (క్రియా-౯౫ సూ. 'కాఁ' సిద్ధించును).

౧ వివ :-ఉ:-కావున నీకు నప్రియముఁ గౌరవరాజునకుం బ్రియంబునుం గా విధి మెచ్చ బాహుబల గర్వ మఖర్వము గాఁగ లక్ష్మికిం జేవయుఁ గీర్తి కున్నత విజృంభణముం గలుగన్ ముకుంద గాండీవులఁ దాఁకి గెల్చెదఁ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్ (కర్ణ-౨ ఆ-౧౦౫). ఇందు వివిధములైన 'కాన్-కన్' శబ్దముల వాడుకల నరయవలయును.

౨ వివ :-'కానున్నది' మున్నగు చోటులందును 'కాన్' అను దానికి హ్రిస్వము గల్గుట గలదు క సవతి కయ్యెము...కనున్నది. (కళా ౧ ఆ-). నీకు నాథుఁడు గనున్న (కళా-౫ ఆ-). క ...కృతకృత్యుఁడుగ వలయు... (అను-౪ ఆ-౨౬) అధీశుఁడు గఁగోరు. (నన్ని-కు-౬ ఆ-౭౨౨) (చూ-వ్యా-సం-౧౬౮ ౨ పుట)

3 వివ .-'భుగుల్ భుగుల్ గాఁ గ్రక్కె' (ఉ-హరి-౪ ఆ-౩౩౧). (భుగుల్ భుగు లనునట్లుగాఁ గ్రక్కెనని యర్థము). నీకుఁగా నని సేయుట (భీష్మ-౧ ఆ-౧౫౭)=(నీకై =నీపక్షమున యుద్ధము చేయుట) ఇట్టి వాడుకలును గలవు. మఱియు 'మొదలుగాన్' అనుదానిని "మొదలుగాఁగల" అను నర్థమున వాడు సంప్రిదాయమును గలదు మత్తకోకిల అంబుధిశుఁడు లోనుగా సురలు (అర-౪ ఆ-౨౬౮) ద్రోణాచార్యుఁడు మొదలు గాఁగఁ నని కొల్లనివా రై (ఉద్యో-౩ ఆ-౨౫౦) (ద్రోణాచార్యుఁడు మొదలుగాఁ గలవారని యర్థము )

పూర్వావయవము ప్రథమా ద్వితీయాన్యతర విభక్తిగ
నుండు నామమయి యుండ నుత్తరావయవము ధాతు
వగు జంటశబ్దము శబ్దపల్లసంజ్ఞగల దనఁదగును. ౧౨౦.
(బా-క్రి-౧౧౮) (వ్యా-సం-౩౮౮ విష)

ఇట్టి సంజ్ఞను జేయుటచేతఁ దక్కిన ద్వ్యవయవములగు జంటశబ్దములను (౧౧౭ మొ. ౧౧౯ వఱకు క్రియా) శబ్దపల్లవములనుట సంప్రదాయము కాదనియు వానిని ద్వ్యవయవక్రియలనియే వాడవలయుననియు నెన్నఁదగును (చూ-ప్రౌఢ-క్రియా-"శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవక్రియలును సమాప్తంబులై ...(౨౫)"

పూర్వావయవము ప్రథమాంత మగునపు డాశబ్దపల్లవ మకర్మకమగును. ఉదా:-రూపఱు (రూపుచెడు-నశించు) పెంపఱు=(నశించు). అలవడు=(వశపడు). చొప్పడు=(జాడపడు). వెలువడు=(బయలుదేఱు) ఆపోవు=(ఆదట పోవు-) విజయంచేయు-మొ

పూర్వావయవము ద్వితీయాంత మగునపు డా జంట సకర్మము కావచ్చును అకర్మమును గావచ్చును. ఉదా:-అకర్మక:-చిందులాడు-

♦ సూరి వికృతివివేక టీకానుసారియై "ధాత్వాదులకు ధాతువులనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు" అని సూత్రించెను ఇందలి విలక్షణార్థాభిధాయకత్వమొక శబ్దపల్లవా సాధారణధర్మము కాదు జంటశబ్దములలో నర్థవిశేషము సాధారణముగఁ గల్గుచుండును. శబ్దపల్లవములలోని యుత్తరావయవమును దాని (శబ్దపల్లవముయొక్క) యర్థములోఁ గొంతభాగము గలదై యుండును గాన నది యర్థములేనిది కాదు. కాన దాని ననుప్రయుక్త మనరాదు. మఱియు శబ్దపల్లవములలో నాద్యవయవము ధాతువై యుండరాదు క్త్వార్థకాదికమును గాదు. అట్టివి ద్వ్యవయవక్రియ లనిపించుకొనునేకాని శబ్దపల్లవము లనిపించుకొనవు. (చూ-వ్యా-సం-౩౮౮ విష ౧౬౮౨-౧౬౮౩ పుటలు).

(నర్తించు) చెట్టవట్టు (వీఁపు మీఁదిభాగము చెట్ట) నాట్యమాడు=(నర్తించు) రక్కొను=రెక్కొను=(రేకుకొను)=(వర్ధిల్లు). కోల్పడు=(చెడు) మేలుకొను=మేలుకను (నిదర లేచు). వాసపోయు-మొ సకర్మక -చేకొను-త్రోదుకొను=త్రోడ్కొను=త్రోకొను. ఈకొను=ఈయకొను=ఇయ్యకొను=(అంగీకరించు). తలపోయు=(తలపులను బోయు=ఆలోచించు)

ద్వ్యవయవశబ్దములు -కూరుచుండు (కూరుచు+ఉండు) నిలుచుండు=(నిలుచు+ఉండు). పన్నుండు=పరుండు=(పడు+ఉండు) త్రెక్కొను=(త్రెంచు+కొను=చంపు) ఏఱుపడు=ఏర్పడు = (ఏఱు=క్రిందనున్న గింజల నేఱు) మొ.

౧ వివ :-శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవక్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబులగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు. ఆ లలితాంగిఁ దోడ్కొని చనుదెమ్ము తే నను వ్రుచ్చుకొనుమ్మని పక్షమందు (భోజ-3 ఆ-) ఇలకుం దివికిం జననిచ్చు-నిచ్చి (భాస్క-ర-ఆరణ్యకాం-౨ ఆ) (ప్రౌఢ-క్రియా-౨౫ సూ).

ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగు. ౧-౨౧.
(బా-క్రి-౧-౨౦) (వ్యా-సం-3౫౧ వివ).

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె తాను శబ్దార్థమె యభిహితంబు కానిచో "రాముండు సీతయుం బుష్పకారూఢులయి యేతెంచిరని యుండును. సీ ధర్మతనయుఁ డనుజులుఁ దానును జనుదెంచె (ఆది-౮ ఆ-౬3) (చూ-వ్యా-సం-౧౬౯ ౧౭౦౦ పుటలు).

౧ వివ -ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాష నగు. ఉదా:-విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్ (ఆది-౨ ఆ).
క. మన శాస్త్రుఁడు సంజయుఁడు......అ తనిఁ బొందిన బ్రిదుకు దీవు

436(క్రి-౧౨౨ సూ ౨/౧ ౨౧ ౧-౨/౧-౨౨ వివ)యుష్మదస్మద్భిన్నకర్తృకము.

తమ్ములు సుతులుఁ (ఉద్యో-౨ ఆ-) నేను నా సేనయు దాడివెట్టెద విశృంఖలతన్ (హరి-ఉ-౩ ఆ-౯౪ ప) (ప్రౌఢ-క్రియా-౨౬ సూ).

౨ వివ -యుష్మదస్మద్భిన్నకర్తృక మగునపు డనేక కర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు కం. ఏ వాని బంధుమిత్రులు జీవధనంబులును డప్పిఁ జెందును గృశునిం గా వాని నెన్నఁ గాఁదగు (శాంతి-౧ ఆ-) (ప్రౌఢ-వాక్య-౧౫ సూ)

సకర్మకంబులకు కొను-పడు' అనెడి యనుబంధము లుండవచ్చును గాన స్వరూపమున నాల్గును, ప్రేరణమున నాల్గును నెనిమిది రూపంబు లేర్పడును. ౧౨౨. (బా-సూత్రసంఖ్య లేదు) (వ్యా-సం-౩౫౩ విష)

౧ వివ -స్వరూప - స్వరూప-౧ + కొను చేరినది ౧ + పడు చేరినది ౧ + 'కొను-పడు'లు రెండును జేరినది ౧ = నాల్గగును. ప్రేరణ -ప్రేరణము- ౧ + దానిపయి కొను చేరినది ౧ + పడు చేరినది ౧ + కొను పడులు రెండును జేరినది ౧ = నాల్గగును

౨ వివ -స్వరూప - ౧ మైత్రుఁడు వంటకమును వండెను. ౨ మైత్రుఁడు వంటకమును వండికొనియెను-ఆత్మనేపదార్థకము. ౩ మైత్రునిచేత వంటకము వండఁబడియెను-కర్మార్థకము. ౪ మైత్రునిచేత వంటకము వండికొనఁబడియె-ఆత్మనేపదకర్మార్థకము.

ప్రేరణ :-౧ చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను-ప్రేరణము ౨ చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించికొనియెను-ప్రేరణాత్మనేపదార్థకము ౩ చైత్రునిచేత మైత్రుని వంటచేత కము వండింపఁబడియెను-(ప్రేరణకర్మార్థకరూపము). ౪ చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించికొనఁ బడియెను-(ప్రేరణాత్మనేపద కర్మార్థకము)

అకర్మకధాతువుల కప్రేరణంబున నాత్మనేపద కర్మార్థము లుండనేరవు గాన నకర్మకర్వమున నొక భేదమును

ప్రేరణార్థమున నాల్గును గల్పి యైదు రూపంబు లుండును. ౧౨౩.

అకర్మకముల కప్రేరణంబున:-మైత్రుఁడు మనియెను. అకర్మకములకుఁ బ్రేరణమున:-౧ చైత్రుండు మైత్రుని మనిచెను-(ప్రేరణార్థకము) ౨ చైత్రుండు మైత్రుని మనిచికొనియెను-(ప్రేరణాత్మనేపదార్థకము). ౩ చైత్రునిచేత మైత్రుఁడు మనుపఁబడియెను-(ప్రేరణకర్మార్థకము). ౪ చైత్రునిచేత మైత్రుఁడు మనిచికొనఁబడియె-(ప్రేరణాత్మనేపద కర్మార్థకము).

౧ వివ:-వెండియుం బ్రేరణంబునం దించుగాగమము గల్గినచో సకర్మకంబునకుం బండ్రెండును నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులు గల్గునని యూహించునది.

— ఇది క్రియాపరిచ్ఛేదము —

---

# బాలవ్యాకరణోద్యోతము

## కృదంతపరిచ్ఛేదము

౧ వివ:-క్రియా ౧. 'ధాతువు' అను నధికారసూత్రమును కృదంత పరిచ్ఛేద సమాప్తివఱకును నన్వయింపవలయును. ధాతువునకుఁ బరముగా విహితములగు ప్రత్యయములలో "డుబ్బును (క్రియా ౧౬ సూ) ఇంచుకుఁను (క్రియా ౨ సూ-౭౩ సూ) చుక్కును (క్రియా ౭౬ సూ) పుక్కును (క్రియా ౭౭ సూ) పడ్వానుబంధమును (క్రియా ౫౯ సూ) 'కొను' శబ్దంబును (క్రియా ౬౨ సూ)" అనునవి తప్పఁ దక్కిన యీావలి కుపదేశించిన 'ట-' మున్నగు (క్రియా ౪౬ సూ-మొ-౫౭ సూ-వ) ప్రత్యయములును నిటపైని జెప్పఁబడు

'క' ప్రత్యయాదులును "కృత్తు" లనఁబడును. * ఇంచుగంతములు-మొదలయినవి ధాతువులె యనఁబడును. తద్ధితాంతములకువలెనె కృత్ ప్రత్యయాంతములకును కార ౧ సూ ౧ వివరణము చొప్పునఁ బ్రాతిపదికత్వము కల్గును. దానిపయిని వాక్యాన్వయ యోగ్యములగు విభక్త్యాదులు నిల్చును.

అట్టి కృత్తులు రెండువిధములు I ఆచ్ఛికకృత్తులు :- "ట-అమి-ఇ-అక-మొ చేయుట-చేయమి-చేసి-చేయక-చేయన్-చేయుచున్-చేసినన్-చేయుచున్న-చేయఁగల-చేసిన-చేయని-చేయు-చేసెడు-చేసెడి-చేయన్ (వలయును)" మొదలగునవి యీవల నుపదేశించినవి. వక్ష్యమాణములు. క-ఇమి-మొ. ఎఱుక-పూనిక-కలిమి-కూరిమి-చేఁత-కూఁత-మొ. II సాంస్కృతికములు :-అన-తవ్య-మొ. అన :-కృ+అన=కరణము. భూ+తవ్య=భవితవ్యము. ఇట్లె భవనము-గన్తవ్యము-మొ.

ఆచ్ఛికకృత్తుల యర్థములు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు ౧ (బా-కృ-౧ సూ) (వ్యా-సం-౩౫౫ I విష).

ఒక్కొక్క ప్రత్యయమె వివిధార్థంబుల నగుచుండును. మొలక (ఇది కర్త్రర్థకము). కానుక (ఇది కర్మార్థకము).

ఇటం గృత్ "క-గ-త-వ వేములు (వ+ఇమి)" పరంబు లగునపుడు ధాతువు తుదినున్న "క-గ-చ-య-వ" లకు లోపం బగు-౨ (బా-కృ-౨) (వ్యా-సం-౩౫౬ విష).

ఆచ్ఛిక కృత్సంబంధులగు కాదులు పరంబు లగునపుడు ధాతువు తుది 'క-గ-చ-య-వ' లకు వానిమీఁది యచ్చులతోఁగూడ లోపం

---

* "ధాతువునకు విహితంబయిన 'తిఙ్' భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు" అని సూరి వచించెను. ఈపక్షమున 'ఇంచుక్' మున్నగునవియుఁ గృత్తులను భ్రాంతి గల్గును.

బగునని యర్థము. 'ఇట' అనుటచేత నీవిధి యీ యాచ్ఛిక కృత్పరిచ్ఛేద మందు మాత్రమె వర్తిల్లునని యెఱుంగునది కాన "కలుగు+క= (క్రియా ౨౦ సూ)=కలుగక" మున్నగు క్రియాపరిచ్ఛేదోక్త కృత్ప్రయముల యెడల సయితమీవిధి వర్తిల్లనేరదు. ఉదా:-ఆఁగు+క (ఆచ్ఛి-కృత్-3 సూ) ఆఁక. మురియు+వ=(ఆచ్ఛి-కృ-౯ సూ) మురిపము. కలుగు+ఇమి (ఆచ్ఛి-కృత్-౨ సూ)=కలిమి ఈ యాచ్ఛిక కృత్సూత్రములలో నెల్లవియు నాకృతి గణఘటితములై ఇందలి 'ఇమి' అనునది 'ఇడి' మున్నగువాని కుపలక్షణము (చూ-కృత్తు ౨౨ సూ).

'క' వర్ణకం బలుగ్వాదుల కగు. 3. (బా-కృ-3 సూ) (వ్యా-సం-3౫౭ విష.)

అలుగు+క=అలుక=(క్రోపము-భావా) ఆఁక=(ఆఁగు+క)=(నిరోధము-భావా). ఎఱుక = (ఎఱుఁగు+క) = (ఎఱుఁగుట-భావా). (ఇట బిందు లోపంబు-ఇట్లు గొన్నిట నెఱుంగునది) (దీనికి 'జ్ఞానము-సోదె-జ్యోతిశ్శాస్త్రము' అనునవి యర్థమగునపు డిది కరణార్థకము' (సాధనమగునని యర్థము) కడఁక=(కడఁగు+క)=(పూనిక-భావా). కలఁక=(కలఁగు+క)=(సంక్షోభము-భావా). కాఁక=(కాఁగు+క)=(తాపము-భావా). తునుక=(తునుఁగు+క)=(ఖండము=ముక్క-కర్తృ) నడక=(నడచు+క) = (గమనము-భావా) నలక = (నలఁగు+క) = (నలఁకువ-భావా). పోక=(పోవు+క)=(పోవుట-భావా) మడఁక=(మడఁగు+క)=(ధౌతవస్త్రము-కర్తృ). మలఁక = (మలఁగు+క) = (మెలిక-భావా) మునుక = (మునుఁగు+క)=(మునుఁగుట-భావా) మూఁక=(మూఁగు+క)=(సంఘము-కర్తృ). మొలక=(మొలచు+క)=(అంకురము-కర్తృ). రాక = (వచ్చు+క. వచ్చునకు 'రా')=(ఆగమనము-భావా) వంక=(వంగు+క) = (వంకర-కర్తృ). వీఁక=(వీఁగు+క)=(విఱ్ఱవీఁగుట-ఓడుట-భావా). కానుక=(కను+క) ఇక-క-పు' అనునవి పరంబు లగునపుడు 'కను' నకు దీర్ఘంబు) (ఉపాయనము-కర్మా) కినుక=(కినియు+క)=

(కోపము-భావా) ముదుక=(ముదియు+క)=(వృద్ధు-కర్తరి) ఇత్యాదు లలుగ్వాదులు.

'ఇమి' వర్ణకంబు కలుగ్వాదులకు. ర. (బా-కృ-ర)
(వ్యా-సం-౩౪౭ విష).

కలిమి=(కలుగు+ఇమి)=(కల్గుట-భావా). ('సంపద' అర్థమగుచో నధికరణార్థకము). ఓరిమి=(ఓరుచు+ఇమి) (భా) కూరిమి=(కూరుచు+ఇమి-) (కరణా-దీనిచేతఁ బ్రీతిని గూర్తురు). నేరిమి=(నేరుచు+ఇమి)=(భా). వేలిమి=(వేలుచు+ఇమి-భావా). (హోమము) ('వ్రేలుచు' అను దానికి 'హోమముచేయు' అను నర్థము లేదు). బడిమి=(బడియు+ఇమి)=(దిగఁబడుచుట-భావా). బ్రదిమి=(బ్రదుకు+ఇమి)=(జీవనము-భావా) ఒడ్డిమి=(ఒడ్డు+ఇమి) (పందెమున నొడ్డఁబడిన ధనాదికము-కర్మా) తాలిమి=(తాలు+ఇమి)=(ఓర్మి)-('తాలు' ధాతుజమన్న యెడల భావార్థకము 'తాల్చు'ధాతుజమన్న పక్షమున నధికరణార్థకము దీనియందు ధైర్యము తాల్తురు) ఇత్యాదులు-

'తజ్' వర్ణకము చేయ్వాదుల కగు. ౫. (బా-కృ-౫)
(వ్యా-సం-౩౫౬ విష).

చేఁత=(చేయు+త) (చేయుట-భావా) ('కృత్యము=పని' అర్థమగునపుడు-కర్మార్థకము-చేయఁబడునది) (జేత్తు గాన బిందుపూర్వకము చూ-తత్స-౧౯ సూ) ('డాయు-దాయు-కలయు' మున్నగువానికి రానేరదు. కాని నిది భావార్థక 'ట' ప్రత్యయము (క్రియా-౭౬ సూ) వంటిది గాదు). అలఁత=(అలయు+త) (అలయుట-భావా). కూఁత=(కూయు+త)=(భావా) ('మొఱ్ఱ' అను నర్థమునఁ గర్మార్థకము కూయఁబడునది) కోఁత=(కోయు+త)=(భావా). గీఁత=(గీయుట-భావా). నేఁత=(నేయు+త)=(భావా), పూఁత=(పూయు+త)=(చందనాదిచర్చ-కర్మా-పూయఁబడునది). పోఁత=(పోయు+త-భావా) మూఁత=(మూయు+త)=(మూఁకుడులో నగునది-కర్త) మేఁత=(మేయు+త) (మేయుట-భావా).

(పశ్వాదుల యాహార మర్థమగునపుడు - కర్మార్థకము). మ్రోఁత = (మ్రోయు+త) (ధ్వని-భావా). రోఁత=(రోయు+త)=(జుగుప్స-భావా). (రోఁతలు=తిట్లు-కర్మా). లాఁత=(లాయు+త) (ఉద్రేకించుట-భావా). వ్రాఁత=(వ్రాయు+త)=(వ్రాయుట-భావా). ('లేఖ్యము' కర్మా-వ్రాయఁబడునది) వ్రేఁత=(వ్రేయు+త)=(వ్రేయుట-భావా). (వ్రేఁత=దెబ్బ-కర్మా వ్రేయఁబడునది) ఈఁత=(ఈఁదు+త) ('దు' లోపము) (నీటిపైఁ దేలుట-భావా). మడఁత=(మడఁగు+త)(ధౌతవస్త్రము-కర్త) కలఁత=(కలఁగు+త)=(సంక్షోభము-భావా) ఇత్యాదులు-

'కువ' వర్ణకం బడంగ్వాదుల కగు. ౬. (బా-కృ-౬) అడఁకువ=(అడఁగు+కువ-భావా) (రూ-అణఁకువ. ఆచ్ఛి-౪౦ సూ) ఎఱుకువ=(ఎఱుఁగు+కువ)=(తెలివి. కరణా. దీనిచేతఁ దెలియఁబడును). (ఇది నిర్బిందుక శబ్దము) కలఁకువ=(కలఁగు+కువ)=(సంక్షోభము. భావా). నలఁకువ=(నలఁగు+కువ) (ఆపద-వ్యాధి-భావా). (నలఁకువ=శ్రమ-కరణా. దీనిచేత శ్రమ గల్గును). పెనఁకువ=(పెనఁగు+కువ). (పెనఁగుట-భావా) (పెనఁకువ=యుద్ధము. అధికరణార్థకము. దీనియందుఁ బెనఁగులాడుదురు.) పొలకువ = (పొలయు+కువ)= (జాడ. భావా). (పొలకువ=మార్గము-అధికర-దీనియందుఁ బొలయుదురు=సంచరింతురు). మఱకువ=(మఱచు+కువ) (అజ్ఞానము-కరణా. దీనిచే మఱపు గల్గును). మెలఁకువ=(మెలఁగు+కువ)=(జాగరూకతతోడి వర్తనము-భావా) (మెలఁకువ=మేల్కొనుట-అధికర. దీనియందు మెలఁగుదురు). లోఁకువ=(లొంగు+కువ) = (లొంగుబాటు-భావా). వేకువ=(వేగు+కువ)=(ప్రాతఃకాలము-అధికర) (దీనియందు వేగును-తెల్లవాఱును). ఇత్యాదులు-

'ట' వర్ణకం బాడ్వాదుల కగు, నగుచో నంత లోపంబగు. ౭. (బా-కృత్-౭ సూ) (వ్యా-సం-౩౬౧ విష).

(అచ్ఛి-కృత్-౫-౯ సూ) 'ట' ప్రత్యయోదాహృతులు, 'టు-వ' ప్రత్యయములుం

ఆట=(ఆడు+ట-భావా). ఊట=(ఊఱు+ట-కర్త్రి) (ఊఱిన ద్రవము). ఊఱట=(ఊఱడు+ట) (ఊరడిల్లుట-భావా). (ఊఱట= సహాయము-కర్త్రి.) ఏఁకట=(ఏకరు+ట) (అపేక్ష-భావా). ఓట= (ఓడు+ట. భావా-రూపా-ఓటము-ఓటమి-). తివుట=(తివురు+ట)= (కాంక్ష-భావా). తేట=(తేఱు+ట)=(మీఁదికిఁ దేఱునది-కర్త్రి). త్రిమ్మట=(త్రిమ్మరు+ట)=(పర్యటనము-భావా). వంట=(వండు+ట) (భావా). పాట = (పాడు+ట) (గానము-కర్మా-పాడఁబడునది). మంట=(మండు+ట) = (జ్వాల-కర్త్రి). వంట=(వండు+ట-భావా). వేసట=(వేసరు+ట) (విసుగు-భావా). అను ప్రయుక్తమగు 'ఆట' శబ్దము ప్రాయికముగాఁ గ్లీబసమంబు. కోలాటము-పోరాటము= 'పోరాట' అనియుఁ గలదు. 'నీటి పోరాటం దోటమి పాటు" (భాగ- గజేంద్రో). మండ్రాటము=(సంతాపము ) 'కొనియాట' అనియే యున్నది-ఇత్యాదులు.

'టు' వర్ణకంబు పడ్వాదుల కగు ; నగుచో నవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబు నొందు. ౮. (బా-కృత్-౮). (వ్యా-సం-౩౬౨ వి.)

పాటు = (పడు+ట)=(పడుట-భావా) (పాటు=ఆపద-అధికర. దీనియందు శ్రమపడుదురు.) చేటు=(చెడు+టు) (చెడుట-భావా). (చేటు=ఆపద-అధికర-దీనియందుఁ జెడుదురు) ఆటు=(అడుచు+ టు) = (హతి-దెబ్బ-భావా). కాటు = (కఱచు+టు). (భావా). ('కఱచు=అభ్యసించు' అనుదాని కీప్రత్యయము రాదు. అది 'కఱవు' అగును) పోటు = (పొడుచు+టు)-(భావా). వాటు=(వయిచు+టు)= (వైచుట-భావా). ఏటు=(ఏయు+టు)=(బాణాదులను బ్రయోగించు- భావా). ఓటు=(ఓడు+టు) (భావా). వ్రేటు=(వ్రేయు+టు)=(కొట్టు- భావా) (రూపా-వేటు) ఇత్యాదులు.

'వ' వర్ణకంబు తిరియ్వాదుల కగు-౯. (బా-కృత్ ౯.) (వ్యా-సం-౩౬౩ వివ).

తిరిపము=(తిరియు+ప)=(భిక్షము-భావా). (ఈ పవర్ణ కాంత ములు ప్రాయికముగా నపుంసకలింగ సమములు). తిరిపఁడు=(భిక్షించువాఁడు-కర్త్రి) (రూపా-తిరిపకాఁడు తిరిపరి). కలియు=కలయు+ప=కలపము=(లేపన ద్రవ్య విశేషము-కర్మా-పరిమళద్రవ్యములతోఁ గలపఁబడినది) (లేదా-అధికరణార్థకము-పరిమళద్రవ్యములు దీని యందుఁ గలియును). పొలపము=(పొలయు+ప) = (వ్యాపనము-భావా). మురిపము=(మురియు+ప)=(నడకయందలి కులుకు-భావా). (రూపాం-మురిపెము). వలిపము = (వలియు+ప) = (సన్నగిల్లునది-కర్త్రి). ఇత్యాదులు.

త వర్ణకం బావులించు లోనగువాని కగు-౧౦.

(బా-కృత్-౧౦) (వ్యా-సం-3౬౮ విమ.)

ఆవులింత=(ఆవులించు+త)=ఇవెల్ల భావార్థకములె. అంగలాదులలోనివి గాన వీనికి స్వార్థమునం దించు కగు ((క్రియా-౫ సూ). వీనికి 'త' వర్ణక పరకత్వమునఁ దుది చు' వర్ణము లోపించును. ఇగిలింత=(ఇగిలించు+త) ఓకిలింత=(ఓకిలించు+త) కుళ్ళగింత=(కుళ్ళగించు+త) కుసిలింత=(కుసిలించు+త)=(అతృప్తిచే ఖేదపడు) కొక్కిరింత=(కొక్కిరించు+త)=(పరిహసించుట). కొవ్వరింత=(కొవ్వరించు+త)=(విజృంభణము). గిలిగింత=(గిలిగించు+త)=(చక్కిలిగింత=కితకితలు పెట్టుట). ఇత్యాదులు.

పు వర్ణకంబు మాయ్యాదుల కగు. ౧౧. (బా-కృత్-౧౧). (వ్యా-సం-3౬౯ విమ),

మాపు=(మాయు+పు) (భావా) (మాపు=రాత్రి-అధికర-దీనియందుఁ గన్నులు మాసిపోవును) మేపు=(మేయు+పు)=(మేఁత=భావా). (మేపు=పశ్వాద్యాహారము కర్మార్థకము. మేయఁబడునది). అడుపు=(అడుచు+పు)=(దెబ్బ = భావా). (అణుపు-రూపా-అచ్చి-౪౦ చూ). ఇంపు=(ఇంచు+పు) (భావా). ఏఁపు=(ఏఁచు+

పు)=వేఁచుట భావా) (ఏచు+పు)=(వృద్ధి-భావా). కానుపు=(కను+పు) (చూ-కృత్తు-3 సూ)=(ప్రసూతి-వీక్షణము-భావా). కాపు=(కాచు+పు) (కాయలు కాచుట-రక్షించుట-భావా). (కాపు=రక్షకుఁడు-కర్త్రి). చూపు=(చూచు+పు)=(వీక్షణము. భావా). తలఁపు=(తలఁచు+పు)=(తలఁచుట-భావా) (తలఁపు=వాంఛ-ఇచ్ఛ-కర్మా-తలఁపఁబడునది). తోఁపు=(తోఁచు+పు)=(తలంచుట-భావా.) త్రేఁపు=(త్రేఁచు+పు)=(ఉద్గారము-భావా.) త్రోపు=(త్రోచు+పు)=(త్రోయుట-భావా.) పూఁపు=(పూఁచు+పు)=(బండికెడ్లనుఁ బూఁచిన పూఁపు-భావా.) పెనుపు=(పెనుచు+పు)=(పెంచుట-భావా.) పొలుపు=(పొలుచు+పు)=(ఒప్పిదము-భావా.) ప్రోపు=(ప్రోచు+పు)=(రక్షణము-భావా.) మెప్పు=(మెచ్చు+పు)=(శ్లాఘ-భావా.) మోపు=(మోచు+పు)=(గడ్డి లోనగువాని కట్ట-భావా.) (లేదా-కర్మా-మోయఁబడునది.) వలపు=(వలచు+పు)=(కోరిక = వాసన-కర్మా-వలవఁబడునది ) వాపు=(వాచు+పు)=(ఉబ్బు-భావా.) వేలుపు=(వేలుచు+పు)=(వేల్వఁబడునది-కర్మా)-ఇత్యాదులు.

"రక్షింపు=(రక్షించు+పు)=(రక్షణము-భావా)" అను రీతిని దత్సమ ధాతువులపైని 'పు' వర్ణకము నిలుచు (రక్షించుట మొదలగు వానివలె) వాడుక కలదు. ఇట్లె బోధింపు-పోషింపు-మేళగింపు-మొ. "క్వచి దింప్వన్తతాం కేచి దూచిరే నహి మే రుచిః" అని యధర్వణుఁ డనెను. వ్యా-సం-3౦౯-3౦౯ I వివ). 'ఆరగింపు' (పర-ర ఆ-౧౯౯) (చూ-క్రియా-ర౬ సూ. ౬ వివ).

'ఇక' వర్ణకం బంజ్యాదుల కగు. ౧౨. (బా-కృత్ ౧౨ సూ) (వ్యా-సం-3౬౬ వివ).

అంజిక=(అంజు+ఇక)=(భయము-భావా). అమరిక=(అమరు+ఇక)=(ఒప్పిదము-భావా). అరయిక = (అరయు+ ఇక) = (అరయుట-భావా). అలయిక = (అలయు+ఇక) = (అలయుట-భావా). ఆడిక = (ఆడు+ఇక)=(నింద-భావా). ఓడిక=(ఓడు+ఇక)=(ప్రవహించునది-

కర్త్రి),. ఓపిక=(ఓపు+ఇక)=(ఓపుట-భావా). కానిక = (కను + ఇక-దీర్ఘము-చూ-ఆచ్ఛి-కృత్తు-౩ సూ) = (ఉపాయనము-కర్మా=గౌరవముగాఁ జూడఁబడునది). కూడిక=(కూడు+ఇక)=(కూడుట-భావా). కోరిక=(కోరు+ఇక)=(వాంఛితము-కర్మా. కోరఁబడునది,. పొందిక=(పొందు+ఇక)=(ఒప్పిదము-భావా). పోలిక=(పోలు+ఇక)=(పోలుట-భావా). తూనిక=(తూఁగు+ఇక). (తూఁగునకు-తూన్వాదేశము = (తూఁచు-అధికర-దీనియందు సరిగఁ దూఁగును) ఇత్యాదులు—

'వీచు' ప్రభృతులకు 'నజీ' యగు. ౧౩. (బా-కృత్-౧౩) (వ్యా-సం-౩౬౭ వివ).

వీవన=(వీచు+నజీ. నజీ జిత్తుగాన క్రియా-౨౮ సూ చొప్పున 'ఉ'కారమునకు 'అ'త్వమును, క్రియా-౯౦-౯౧ సూ. చొప్పున చకారమునకు 'వ'త్వము నగును). (వ్యజనము = కర్త్రి - విసరునది విసనకఱ్ఱ). దట్టన=(దట్టించు+నజీ) (తర్జనము-దట్టించుట-భావా) * ఇత్యాదులు-

౧ వివ :—'దట్టించు' లోనగువానికి 'నజీ' పరమగునపుడు 'దట్టన-దట్టనము' మున్నగు రూపము లేర్పడును. ఉదా :-దట్టించు+నజీ=దట్టన. దీవించు+నజీ=దీవన (రూపా-దీవెన) (భావా). పాటించు+నజీ=పాటన=(ఆదరణము-భావా). ఇత్యాదులు-

---

* సూరి 'అప్పాదులకు 'నజీ' యగు (బా-కృత్-౧౩) అని సూత్రించుట సరికాదు. అవి కృదంతము లనరాదు. అవి 'అర్పణ' మున్నగు ప్రకృతుల వైకృతము లనుట యుక్తము. సంస్కృ-అర్పణమ్-వైకృ. అప్పన=అప్పనము. (రూపాం-ఒప్పన=ఒప్పనము). సంస్కృ-ఉజ్ఝనమ్=వైకృ. ఉజ్జన=ఉజ్జనము=(విడుచుట). సంస్కృ-ఘట్టనా-ఘట్టనమ్=వైకృ. గట్టన=గట్టనము. సంస్కృ-గణనా-లేదా-ఘటనా-ఘటనమ్=వైకృ-గడన=గడనము. సంస్కృ-మాననా=మాననమ్=వైకృ-మన్నన=మన్ననము-మొ.

బడి యేల్వాదుల కగు. ౧౭. (బా-కృత్-౧౭,. (వ్యా-సం-౩౬౮ వివ).

ఏలుబడి=(ఏలు+బడి-భావా). కట్టుబడి=(కట్టు+బడి)=(పన్ను-కర్మా=కట్టఁబడునది) కనుబడి = (కను + బడి) = (రాజులు తీసికొను పన్ను-కర్మార్థకము=రాజులచేఁ గనఁబడునది). కొనుబడి = (కొను+బడి-భావా). గిట్టుబడి=(గిట్టు+బడి)=(కొనుటలోని గిట్టుపాటు-భావా) చెల్లుబడి=(చెల్లు+బడి) = (మాట చెల్లుట-భావా). చేరుబడి = (చేరు+బడి)=(సమీపము-కర్త్రి-సమీపించునది). తగులుబడి = (తగులు + బడి)=(కొనుబడి మున్నగువానిలోని తగులుపాటు-భావా). తీఱుబడి=(తీఱు+బడి)=(అవకాశము-భావా). పెట్టుబడి=(పెట్టు+బడి)=(వ్యాపారమున ముందుగఁ బెట్టు ధనాదికము-కర్మా. పెట్టఁబడునది). పోబడి=(పోవు+బడి)=(వులోపము-పోవుట-భావా). మ్రొక్కుబడి=(మ్రొక్కు+బడి)= (దేవతాదికమునకు మ్రొక్కుకొనుట-అధికరణా. దీనియందు ధనాదికముతో మ్రొక్కుదురు). వచ్చుబడి=(వచ్చు+బడి)=(ఇతరుల నుండి వచ్చునది-కర్త్రి). (రూపాం-రాబడి). సాగుబడి = (సాగు+బడి) = (కృషి-అధికర = దీనియందు సాగు = యత్నముచేయుదురు). ఇత్యాదులు-

'గడ' చేర్వాదుల కగు. ౧౫ (బా-కృత్-౧౫) (వ్యా-సం-౩౬౯ వి).

చేరుగడ=(చేరు+గడ)=(సమీపము-కర్త్రి) (సమీపించునది) (చేరుగడ=శరణము - కర్మార్థ=ఆర్తులచేఁ బొందఁబడునది). తిరుగడ=(తిరుగు+గడ-గులోపము)=(మఱచేతఁ దిరుగునది-కర్త్రి). తీఱుగడ=(తీరు+గడ)=(తీఱిక-భావా). తేలుగడ=(తేలు+గడ)=(తేటపడుట-భావా) క్రేగడ=(క్రేఁచు+గడ-చులోపము) (బిందులోపము)=(ఉద్గారము-భావా) మనుగడ=(మను+గడ)=(మనుట-భావా). మనుగడ-జీవనోపాయము-కరణార్థకము. దీనిచేత జీవింతురు). విడుగడ=(వీడుగడ=విడు+గడ)=(విడుపు-భావా). ఇత్యాదులు-

'ఇకి కోర్యాదుల కగు. ౧౬. (బా-కృ-౧౫)
(వ్యా-సం-౩౭౦ వివ).

కోరికి=(కోరు+ఇకి)=(ఇచ్ఛ-భావా). పూనికి=(పూను + ఇకి)=(పూనిక-భావా). పోలికి=(పోలు + ఇకి) = (పోలిక-భావా). మనికి=(మను+ఇకి)=(జీవించుట-భావా). (మనికి=నివాసస్థానము-అధికర-దీనియందు మనుదురు) వినికి=(విను+ఇకి) = (వినుట-భావా). చూడికి=(చూచు+ఇకి-చూచునకు ముత్పరకత్వమందువలె 'చూడు' ఆదేశము)=(చూపు-భావా) ఇత్యాదులు-

'వు' వర్ణకంబు మన్వాదుల కగు ౧౭. (బా-కృత్
౧౭) (వ్యా-సం-౩౭౧.)

మనువు=(యను+వు)=(జీవనము-భావా). కావు=(కాచు+వు)=(రక్షణముచేయు, బొట్టు-కర్త)) (దృష్ట్యాదిదోషములను గాచునది). కొలువు=(కొలుచు+వు)=(సేవ-భావా). చావు = (చచ్చు+వు-వర్ణలోపాది వికృతి)=(మరణము-భావా). తడవు = (తడయు+వు)=(ఆలస్యము-భావా). నిలువు=(నిలుచు+వు =(నిల్చుట-భావా). నోవు=(నొచ్చు+వు) (రూ నొవ్వు) (నొచ్చునకు నో' వచ్చును)=(నొప్పి-భావా). పూవు=(పూచు+వు) (రూపా-పువ్వు)=(పుష్పము-కర్మార్థ-పూయఁబడునది). ((పువ్వు=((పుచ్చు+వు- 'చ' ద్వయమునకు వ' ద్వయము,=(పురుగు=పురువు. కరణా=దీనిచేతఁ (బుచ్చును.) పుట్టువు=(పుట్టు+వు)=(జన్మము-భావా). తొడరువు = (తొడరు+వు)=(యత్నము-భావా). ఇత్యాదులు.

'అ' వర్ణకంబు గీత్వా (ర్వా) దుల కగు. ౧౮.
(బా-కృత్-౧౮) (వ్యా-సం-౩౭౨ వివ). (స్పష్టార్థము త్వా).

గీఱ=(గీఱు+అ)=(గీఁత-భావా). ఊఁద=(ఊఁదు+అ)=(ఉబ్బు-భావా). ఎండ=(ఎండు+అ)=(సూర్యాతపము కర్త)-అంతర్గత (ప్రేర

ణార్థకము-ఎండించునది). కాయ=(కాయు+అ)=(శలాటువు-కర్మార్థ-చెట్టుచేఁ గాయఁబడునది). చదియ=(చదియు+అ)=(నలఁగుడు-భావా). తునియ=(తునియు+అ)=(ఖండము-కర్త్రి-తునిసినది). పరియ=(పరియు+అ)=(బీఁట-భావా). పాయ=(పాయు+అ)=(నది చీలిక-కర్త్రి-ఒక వస్తువునుండి పాయునది). పిడుచ=(పిడుచు+అ)=(అన్నము-లోనగువాని ముద్ద-కర్మార్థ-పిడువఁబడునది). మీట=(మీటు+అ)=(ఏతము మున్నగువాని కీల-కర్త్రి-మీటునది). ముడియ=(ముడియు+అ)=(మూట-కర్మార్థ-ముడియఁబడునది). వదర=(వదరు+అ)=(ప్రేలరి-కర్త్రర్థ-వదరు వాఁడు). వ్రయ్య=(వ్రయ్యు+అ)=(ఖండము-కర్త్రి-వ్రయ్యునది). ఇత్యాదులు.

'అక' వర్ణకంబు మాఱ్వా (ర్వా) దులకగు-౧౯.
(బా-కృ-౧౯) (వ్యా-సం-323-వివ).

మాఱకము=(మాఱు+అక)=(మార్పు-భావా). 'అక' ప్రత్యయాంతములెల్ల నపుంసకసమములు. అమ్మకము=(అమ్ము+అక)=(అమ్ముట-భావా). అంపకము=(అంపు+అక)=(ప్రేషణము-ప్రేరణా-భావా). (చూ-క్రియా-౮౦ సూ). పంపకము=(పంచు+అక)=(చకారమునకు 'ప' త్వము). (విభాగము-భావా). (పంపు+అక-క్రియా-౮౦ సూ) పంపకము=(ప్రేషణము-భావా). వంటకము=(వండు+అక. డ' కారమునకు 'ట' కారాదేశము)=(అన్నాదికము-కర్మార్థ-వండఁబడునది) త్రోమకము=(త్రోము+అక)=(త్రోముట-భావా) ('త్రోము' అను శేషమున కాధారమగపడదు. శ-ర-లో 'త్రోమక' మనియే యున్నది). అద్దకము=(అద్దు+అక)=(వస్త్రములకు వేయు రంగు-కర్మార్థ-అద్దఁబడునది).

'డు' వర్ణకం బాఱ్వా(ర్వా)దులకగు, నగునపుడు
పకారంబు 'చ-య' ల కగు. ౨౦. (బా-కృ-౨౦.)
(వ్యా-సం-328 వివ).

ఆఱుడు=(ఆఱు+డు) = (నిర్ద్రవమగుట-భావా). అమ్ముడు=(అమ్ము+డు)=(అమ్మకము-భావా). అల్లుడు=(అల్లు+డు) = (అల్లిక-భావా) (ఇది నిర్బంధుకము-జామాతృర్థకము కాదు.) (ప్రాఁకు-అధికరణ-లతాదికము దీనియం దల్లుకొనును). ఎక్కుడు=(ఎక్కు+డు)=(ఎక్కుట-భావా). (ఎక్కుడు-వాహనము-అధికరణ-దీనియం దెక్కుదురు). క్రుమ్ముడు=(క్రుమ్ము+డు)=(క్రుమ్ముట-భావా). చోఁపుడు=(చోఁపు+డు) = (కలఁత-భావా). (చోఁపు = కలఁచు-తరుము-మొ). త్రొక్కుడు=(త్రొక్కు+డు)=(ఆపద-భావా). త్రోఁపుడు=(త్రోఁచు+డు)=(త్రోపు - భావా) దంపుడు=(దంచు+డు)=(దంపుట - భావా). దాఁపుడు=(దాఁచు+డు)=(దాఁచుట - భావా). దిగుడు=(దిగు+డు)=(పల్లము-కర్త్రి-దిగునది). దోఁపుడు=(దోఁచు+డు)=(కొల్ల-భావా). పెంపుడు=(పెంచు+డు)=(కర్మార్థ-పెంపఁబడునది) ప్రేఁపుడు-(ప్రేఁచు+డు-భావా. అధికుఁడని యర్థము) ప్రాఁకుడు=(ప్రాఁకు+డు)=(ప్రాఁకుట-భావా) మాపుడు=(మాయు+డు)=(ముటికి-భావా) రాపుఁడు=(రాచు+డు)=(రాచుట-భావా) ఇత్యాదులు

'ఉ' వర్ణకిం బడుకాద్యాదుల కగు ౨౧ (బా-కృ-౨౧) (వ్యా-సం-౩౭౫ విస)

అడుకు=(అడుకు+ఉ) = (దొంతి-కర్మా-దొంతిగ నిల్పఁబడినది.) (అడుకులు=చిపిటములు) (అటుగులు వ్యావహా నిత్యబహువచనము-దీని కీధాతువుతో సంబంధ మగపడదు). అంటు=(అంటు+ఉ) =(ఆశౌచము-అపాదానా-అంటుటవల్లఁ గల్గునది) (అంట్లు-బహు-వండిన పాత్రలు-కర్త్రి-మసి యంటునవి) ఒప్పు = (ఒప్పు+ఉ) = (ఒప్పిదము - భావా). ఒఱుగు=(ఒఱుగు+ఉ) = (ఒఱుగుట-భావా) ('ఒఱగు' అనియు నన వచ్చును. నిర్ణాయక ప్రయోగము లేదు) ఒసఁగు=(ఒసఁగు+ఉ)=(ఈవి-కర్మా-ఒసఁగఁబడునది). ఇత్యాదులు-ఆదిశబ్దముచే చదువు=(చదువు+

ఉ=విద్య) అడలు (అడలు+ఉ. దుఃఖము). పలుకు=(పలుకు+ఉ మాట). ఒడ్డు=(ఒడ్డు+ఉ. పందెము). కఱపు=(కఱపు+ఉ) (కఱచు-ప్రేర-కఱపు) (బోధనము). ఎఱుకు=(ఎఱుఁగు+ఉ. గకారము కకార మగును-స్తోదె చెప్పువాఁడు). పుట్టు=(పుట్టు+ఉ)=(జన్మము) హెచ్చు=(హెచ్చు+ఉ. ఆధిక్యము). ఉబ్బు=(ఉబ్బు+ఉ. ఉబ్బిపోవుట) చెప్పు=(చెప్పు+ఉ చెప్పిన మాట). కుడుపు=(దీని 'చ'కారము 'ప'కార మగును) (కుడుచు+ఉ. కూడు=అన్నము)" మొదలగువానిని గ్రహింపవలెను

వడి ప్రభృతులు నిల్లెఱుంగునది. ౨౨. (బా-కృత్-౨౨). (వ్యా-సం-౩౭౬ విష.)

వడి :-కొలువడి=(కొలుచు+వడి)=(కొలంత-భావా). గెలువడి=(గెలుచు+వడి)=(గెలుపు-భావా). నడవడి=(నడచు+వడి) = (ప్రవర్తనము-భావా). లేవడి=(కలుగు వ్యతిరేకము-లే+వడి)=(చూ-క్రియా-౧౧౦ సూ). (దీని పర్యాయము-లేమి-క్రియా. ౧౧౦). (లేమి+ఇడి=లేమిడి-ఇది తద్ధితాంతము.)

వి -విరివి=(విరియు+వి)=(విస్తృతి-భావా). తెలివి=(తెలియు+వి)=(వివేకము-కరణా-దీనిచే నెల్లయుఁ దెలియును). అవు -తగవు=(తగు+అవు)=(బహుమతి-కర్త్రి-తగి యుండునది). (తగవు=అభియోగము-అధికర-దీనియందు న్యాయము తేలును) నగవు=(నగు + అవు) = (నవ్వుట-భావా). ఇః-వ్రాయి=(వ్రాయు+ఇ)=(అక్షరము-కర్మార్థ-వ్రాయఁబడునది). చేయి=(చేయు+ఇ) = (కర్త్రి-పనులుచేయునది). కలి :- కనుకలి=(కను+కలి) = (చూపు-భావా). వినుకలి=(విను+కలి) = (వినికి-భావా). ఇత్యాదులు.

డయ్యు-దయ్యు-నొచ్చు-పుచ్చులకు 'ఇ' వర్ణకంబగు, నగుచో వాని కడ హల్లు 'ప' కారంబగు. ౨౩. ((ప్రౌఢ-కృత్-౧) (వ్యా-సం-౩౭౭ విష).

డప్పి=(డయ్యు+ఇ)=(డప్పి-భావా). దప్పి=(దయ్యు+ఇ)=(డప్పి-భావా). నొప్పి=(నొచ్చు+ఇ)=(బాధ-భావా). పుప్పి=(పుచ్చు+ఇ)=(భావా).

రాచున కిడి వర్ణకంబగు-౨౮. (ప్రౌఢ-కృత్-౨ సూ)

రాయిడి-(కృత్తు ౨ సూ-'చు'లోపము) (రాచు+ఇడి)=(ఉపద్రవము-భావా). (రాచు ధాతువునకు కృత్తు ౧౧ సూ చొప్పున 'పు' రాఁగా 'రాపు' అగును. కృత్తు-౨౦ సూ-చొప్పున 'డు' రాఁగా 'రాపుడు' అగును 'రాచు' చకారము పకారమగును. చూ-కృత్తు-౨౦ సూ. 'రాచు' నకు 'ఇడి' ప్రత్యయము చేరఁగా 'రాపిడి' అగును. ఇందును 'చ' కారము 'ప' కార మగును)

ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించులకైన వర్ణకం బగు. అగుచో 'ఈర్చు-ఉబ్బు'ల 'చ'కార 'బ'కారములు 'వ' కార మగును. 'వడ్డించు' అనుదాని 'ఇంచు' లుప్తంబగు ౨౫ (ప్రౌఢ-కృత్తు-3 సూ) (వ్యా-సం-326 విష)

ఈర్పెన=(ఈర్చు+ఎన)=(ఈళ్ళ దువ్వెన-కర్త్రి-ఈరుల నీర్చునది). ఉప్పెన=(ఉబ్బు+ఎన)=(చూ-కృత్-౨౧ సూ)=(సముద్రాదుల పొంగు-అధికర-దీనియందు సముద్రాదు లుబ్బును). కందెన=(కందు + ఎన)=(మసి-కరణా-దీనిచే బండి యిరుసు నల్లనగును) దువ్వెన=(దువ్వు+ఎన)=(కంకతిక = కేశప్రసాధని = (పన్నె). కర్త్రి-తల చిక్కును దువ్వునది) వడ్డెన=(వడ్డించు + ఎన) = (భోజ్యపదార్థములను భోజనపాత్రములందుఁ బెట్టుట-భావా)

'పుర' వర్ణకంబు కాచు-దాఁచు-దాయ్యాదుల కగు. ౨౬. (ప్రౌఢ-కృత్-౪ సూ) (వ్యా-సం-326 విష).

కాఁపురము = (కాఁచు+పురము) = (సంసారము-కర్త్రి - కాఁగఁ జేయునది. సంసారము జనులను గాఁగఁజేయు నని భావము). ((కాఁగు-ప్రే-కాఁచు-కాఁగు-ప్రే-కాఁచు. ఇట్లగుటచేత దీనికి "కాచు=రక్షించు"అను

నది మూలము కాదు). దాఁపురము=(దాఁచు+పురము)=(దాఁచుట-భావా). దాపురము=(దాయు+పురము)=(సమీపము-కర్త్రి-సమీపించునది).

ఎక్కు-దిగులకుం శ్రైరణార్థంబున "మతి" వర్ణకం బగు. అగుచో 'ఎగు' అనునది "ఎక్కు"న కాదేశం బగు. ౨౭. (ప్రౌఢ-కృత్-౫ సూ) (వ్యా-సం-౩౭౬ వి).

ఎగుమతి = (ఎక్కు+మతి)=(భావా). దిగుమతి = (దిగు+మతి-భావా). (చూ-కృత్-౩౧).

'వు' వర్ణకం బులియ్యాదుల కగు. ౨౮. (ప్రౌఢ-కృత్-౬ సూ) (వ్యా-సం-౩౭౬ విష).

ఉలివు=(ఉలియు+వు)=(ధ్వని-భావా). మొ-

'కాచు-వీచు'లకు 'వలి' వర్ణకం బగు. ౨౯. (ప్రౌఢ-కృత్-౭) (వ్యా-సం-౩౭౬ విష).

కావలి=(కాచు+వలి)=(రక్షణము-భావా). వీవలి=(వీచు+వలి)=(గాలి-కర్త్రి-వీచునది).

ఒదుగు ప్రభృతులకు 'ఇలి' యగు. ౩౦. (గాణ) (వ్యా-సం-౩౭౬).

ఒదిగిలి = (ఒదుగు+ఇలి). పాక్కిలి = (పాక్కు+ఇలి). చెక్కిలి=చెక్కు+ఇలి).

'వ' వర్ణకంబు తెగ్వాదుల కగు. ౩౧. (గాణ)

తెగువ=(తెగు+వ)=(సాహసము). ఎగువ=(ఎక్కు+వ=ఎక్కునకు ఎగు-చూ-కృ-౨౭ సూ).

అరుగ్వాదులకు 'దల' యగు. ౩౨. (గాణ) (వ్యా-సం-౩౭౬ విష).

అరుగుదల=(అరుగు+దల). విడుదల=(విడు+దల). మొ-

'వచ్చు-పోవు-నిలుచు'లకు 'కడ' వర్ణకం బగు. ౩౩. (గాణ) (వ్యా-సం-౩౭౬).

రాకడ=(వచ్చు+కడ-వచ్చునకు-'రా'). పోకడ=(పోవు+కడ-పోవు 'వు'లోపము). నిలుకడ=(నిలుచు+కడ).

తెలియునకు 'విడి'యు, కొనునకు 'కోలు' నగు. ౩౮.

తెలివిడి=(తెలియు+విడి). పొగడికోలు=(పొగడు+కొను). విల్చుకోలు=(విల్చు+కొను).

ఇట్లే-ఉక్కివము=(ఉక్కు + ఇవము)=(ముష్కరత్వము). అలుగులము=(బాధ)=(అలుగు). పని=(పన్ను+ఇ). మొదలగువాని నెఱుంగునది. కృత్తు లనంతములు. వానిని సాకల్యముగా నుపదేశింప శక్యము కాదు-

— ఇది కృదంత పరిచ్ఛేదము - ఆచ్ఛికము —

---

# బాలవ్యాకరణోద్యోతము
## సంస్కృతకృదంతము

౧ వివ :-సంస్కృత కృదంత పరిచ్ఛేదాదిని సంస్కృతకృత్తుల స్వభావము కొంత వివరింపఁబడును.

కృత్తులును వాని యర్థములును సాధారణముగాఁ బ్రయోగవేద్యములె.

శ్లో. "కృతో యే యత్ర విహితా స్తత్ర నూనం భవన్తి తే కృద్ధ్వోః క భావ ఇత్యుక్తే రన్యత్రాపి ప్రయోగతః". (ముగ్ధ ౯౬౫ సూ) (ధు=ధాతువు. క=కారకము. ముగ్ధబోధసంజ్ఞలు). "చెప్పఁబోయెడి ప్రత్యయము కృత్సంజ్ఞ గలది. అయ్యది ధాతువునకుఁ బరముగ నగును. అది కారకమందును భావార్థమందును నగును" అని పయిశ్లోకమునకు భావము. ఇట్లు వోపదేవుఁడు "కృద్ధ్వోః క భావే" అను సూత్రముచే వచించి యున్నాఁడు. వోపదేవుఁ డిట్లు కారకమం దనేకాని కృతుల

కర్తనిర్ణయము చేయలేదు కృత్ప్రత్యయములను సాకల్యముగాఁ జెప్ప శక్యముగాదు.

శ్లో. కృత్తద్ధిత సమాసానా మభిధానం నియామకమ్ లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞాన సూచకమ్'' (ముగ్ధ-౧౧౮౩ సూ). పాణినీయులును నిట్లె చెప్పుదురు. "ఉణాదయో బహుళమ్'' (3-3-౧) (సి-కౌ-3౧౬౯ సూ) 'ఉణ్' మొదలగు కృత్ప్రత్యయములు ధాతువునకుఁ బరముగ బహుళముగా నగును. ఈ బాహుళ్య మిట్లు వివరింపఁబడెను. "కేచి దవిహితా అప్యూహ్యాః-''సంజ్ఞాసు ధాతు రూపాణి ప్రత్యయాశ్చ తతః పరే కార్యా ద్విద్యా దనూబన్ధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు'' అని మహాభాష్యమున వ్రాయఁబడెను.

౨ వివ :-కృత్తులు ధాతువులపై నె నిల్చును. కృదంతములు నామములె యగును.

'తవ్య-అనీయ-య' అను ప్రత్యయములు కర్మార్థమునందును (ముగ్ధ-'థ') భావార్థమునందును ధాతువులపై నిల్చును. ౧. (ముగ్ధ-౯౬౭ సూ) (సి-కౌ-౨౮౩౪-౨౮౩౨ సూ).

ఈ తవ్యాది ప్రత్యయములను "కృత్య'' ప్రత్యయములనియుఁ బాణినీయులు (ముగ్ధ-'ల్య' సంజ్ఞ) వాడుదురు. ' ఇవి సకర్మకములకు గర్మార్థమునందును సకర్మ కాకర్మకములకు భావార్థమునందును నగును.

భావార్థవివరణము :- తద్ధిత ప్రత్యయములందలి భావము :- "ప్రకృతిజన్య బోధమునందుఁ బ్రకారంబు భావంబు నాఁబడు". ఉదా :- ఘటత్వము-నైల్యము-నీలత్వము-నీలత. మొ. ఘటత్వావచ్ఛిన్నము=ఘటత్వవిశిష్టము=ఘటము మొ.

క్రియలయందలి భావము :-భావము=భావన=ఉత్పాదన. ఉత్పాదనానుకూల వ్యాపారము భావమని యర్థము. అనఁగా ధాత్వర్థము=భావము.

తిఙ్వాచ్యభావమున లింగ వచనాది భేదము లేదు. ఉదా:-త్వయా యుష్మాభి ర్మయాస్మాభీ రామేణ రామై ర్ఘటేన ఘటై ర్వా భూయతే= ('నీచేతను, మీచేతను నాచేతను మాచేతను రామునిచేతను రాముల చేతను ఘటముచేతను ఘటములచేతను' అని యేది కర్తగానున్నను నకర్మకములకు "భూయతే" అనియే సమాపకక్రియ సంస్కృతమున నుండును. తెలుఁగున నిట్టి భావార్థక సమాపకక్రియకుఁ బ్రయోగము లేదు. (క్రియా ౫౮ సూ). తెల్గున సకర్మకక్రియలకే కర్మార్థక సమాపకక్రియా ప్రయోగము గలదు.

కృద్వాచ్యభావమున లింగవచనములు తెల్గునందును నుండును. ఉదా :- కర్తవ్యము- కర్తవ్యములు- కృతము- కృతములు- నీచేత నని యర్థము. మొ.

"అవ్యయ కృతో భావే" అనుచోప్పున నవ్యయములందు వాచనికమగు భావ ముండునేకాని లింగ వచనాదిక ముండదు. ఉదా:-చేసి-చేయన్ మొ. అట్లని యవ్యయములకు లింగవచనార్థబోధము లేకపోలేదు. ఉదా :-స్వః పతతి=(స్వర్గమునుండి పడుచున్నాఁడు-మొ.)

"అవస్థే ద్వే క్రియాయాః స్థః సాధ్యతా సిద్ధతాపిచ సాధ్యతా త్యాది (తిఙ్వాచ్యా), వాచ్యా స్యాత్ సిద్ధతా ద్రవ్యవ ద్భవేత్ । ద్రవ్యవత్త్వే ఘఞాదిః స్యాత్ యోగో లింగేన సంఖ్యయా (సంఖ్యా=వచనమ్). (ముగ్ధ-౧౧౩౪ సూ. గిరిశచంద్ర వ్యాఖ్య).

ఔదిత్తులు కానట్టి ధాతువులకుఁ బరమగు నార్ధధాతుకములగు 'వన్' సమాహార (ప్రత్యాహార) వర్ణములకు 'ఇ'మాగమము (పాణి-ఇడాగమము) వచ్చును. ౨. (ముగ్ధ-౫౪౪ సూ) (సి-కౌ-౨౧౮౪-౨౨౮౬ సూ) (సం - క్రియా - 3 విప్ర - సార్వధాతు కార్ధధాతుక వివృతి-చూ).

తవ్యాదు లార్ధధాతుకములు గాన 'ఇమ్' ఆగమము ప్రాప్తించునుగాని 'చి' మున్నగు ధాతువులకు రాదని సూత్రించుచున్నాఁడు.

'శ్వి' మొదలగు కొన్నిధాతువులు తప్ప నేకాచ్కములగు "అద న్తములు-ఇ న్నాంతములు-ఉదంతములు-

బుదంతములు" నగు ధాతువులకు 'ఇమా'గమము రాదు.

3. (ముగ్ధ-౫౮౭ సూ)

ఈసూత్రము చొప్పున 'చి' ధాతువునకు (అనిట్టు గాన) 'ఇమా' గమము రాదు. "చిఞ్ చిత్యామ్"=(పోగుచేయు=కూడఁబెట్టు). (సం-క్రియా-౪ సూత్రముచే గుణము). కర్త్రార్థః చేతవ్యము-చయనీయము (చి-చే-చయ్+అనీయ). చేయము=(చి+య). భావార్థ :-"భూ = సత్తా యామ్" (౧గు) భూ+ఇ+తవ్య=(సం-కృత్-౭ సూ. ఇమ్)=భూ (భో-భవ్)+ఇ+తవ్య=భవితవ్యము. భూ+అనీయ=భవనీయము. భూ+య-(అచ్ కార్యము-సం-కృ-౪ సూ)భో+భవ్+య=భవ్యము=(కాఁదగినది).

'ఓ-ఔ' అను నచ్చులకుఁ బరమగు కృత్సంబంధియైన 'య'కారమునకును, 'క్య-జ్య' ప్రత్యయముల (ముగ్ధ-౮౪3-౮౫౧ సూ) యకారమునకును నచ్చువంటి కార్యము గల్గును. ౪. (ముగ్ధ-౪౭3 సూ) (సి-కౌ-౬3-౬౪ సూ) (చూ-సం-తద్ధి-౫ సూ).

భూ+య+(భో-భవ్) = భవ్యము = (కాఁదగనది). ఇవి భావార్థములు గాన నపుంసకలింగము లగును.

శ్లో॥ అనామ్ని కారకే వాచ్యే వాచ్యలిఙ్గః కృదుచ్యతే భావే ల్యర్థ ఖలర్థాన్తాః అనటాద్యాః (ల్యుట్ ప్రత్యయాంతములు)నపుంసకాః। క్త్యాద్యన్తాశ్చ స్త్రియాం జ్ఞేయాః పుంస్యధుజ్ఞ ఇతొతథా।అన్యేషాంతు కృతాం లిఙ్గం వేదితవ్యం ప్రయోగతః (ముగ్ధ-౯౬౭ సూ. గిరిశచంద్ర వ్యాఖ్య). (ల్యర్థ = తవ్యాదులు. 'క్తి' = ప్రత్యయము. 'అథు' ప్రత్యయము).

తవ్యాదులు పరమగునపుడు వివిధములగు వ్యాకరణ కార్యము లగును. ౫. (ముగ్ధ-౯౬౯ మొ. ౯౮౯ వ. సూ) (సి-కౌ-3-౧-౯౫ సూ. మొదలుగ)

ఖేయము=(అగడిత) (''ఖను=విదారే'') (ఖను+య). దేయము=(ఇయ్యఁదగినది). ('దా=దానే') (దా+య). భావ్యము=(అవశ్యము కాఁదగినది) ('భూ=సత్తాయామ్') (భూ+(భో-భావ్)య). కార్యము=(చేయఁదగినది) ('కృఞ్ = కరణే'). కృత్యము = (చేయఁదగినపని) (కృ+య). త్యాజ్యము=(విడువఁదగినది) ("త్యజ్=హానౌ"). (త్యజ్+య). అమావాస్య=అమావస్య=(ముప్పదవతిథి) ('వస్=నివాసే')(అమ= చంద్రుని మొదటికళ దానితో నాదినమునఁ జంద్రుఁడు రవితోఁగూడ నుండును) (అమా+వస్+య). 'కేళిమ' ప్రత్యయమును 'కృత్య' ప్రత్యయములలోనిదె. పచేళిమము=(దానంతట నదే పండినది) (పచ్=పాకే) (పచ్+కేళిమ).

౧ విన :-తవ్యాదులు 'శక్త్యార్హ ప్రేష్యానుజ్ఞాద్యర్థములందును నగును. శక్య:-వోఢవ్యము=(వహింప శక్యమైనది) ('వహ్=ప్రాపణే') (వహ్+తవ్య). అర్హ:-స్తోతవ్యుఁడు=(స్తుతింపఁదగినవాఁడు). (ష్టు=స్తుతౌ) మొ. ధాతుపాఠములో షకారాదిగనున్న వెల్లఁ బ్రక్రియలో 'స' కారముతోనె నిల్చును. ఇట్లె ణ కారాదిగ నున్న వెల్ల 'న' కారముతోఁ బ్రక్రియలో నిల్చును.

ధాతువునకుఁ గర్త్రర్థమున 'తృన్-ణక' ప్రత్యయము లగును. ౬. (ముగ్ధ-౯౯౦ సూ) (సి-కౌ-౩౯౯౫ సూ.)

తృన్:-(కర్త=చేయువాఁడు) ('కృఞ్=కరణే') (కరోతీతి=కర్తా) (కృఞ్+తృ=కర్+తృ=కర్తా). 'తృన్' ప్రత్యయము తద్ధర్మ తచ్ఛీలాద్యర్థములందును నగును. ణక:-కారకుఁడు=(చేయువాఁడు) ("కృఞ్=కరణే") (కృ+ణక=(సం-క్రి-౩ సూ. వృద్ధి)=కార్+అక). (కరోతీతి కారకః). స్త్రీత్వమున-తృన్:-కర్త్రి (సం-కర్త్రీ). ణక:-కారిక=(సం-కారికా).

'గ్రహా'ది ధాతువులకు 'ణిన్' ప్రత్యయమును, 'నన్ది' మున్నగు ధాతువులకు 'అన' ప్రత్యయమును, 'పచ్' మున్నగు ధాతువులకు 'అన్' ప్రత్యయమును కర్త్రర్థమున నగును. ౭. (ముగ్ధ ౯౯౩ సూ.) (సి-కౌ ౨౮౯౬ సూ.)

'ణిన్' ప్రత్యయములోని 'ణ' కారమును, 'అక్' ప్రత్యయములోని 'న' కారమును నిద్వర్ణములు. ణిన్:-గ్రాహీ=(గ్రహించువాఁడు) ('గ్రహ్=ఉపాదానే') = (గృహ్ణాతీతి= గ్రాహీ-(సం-క్రియా-౩ సూ-చో-వృద్ధి) "గణాశ్చ ప్రయోగానుసారేణ బోధ్యాః" అను (ముగ్ధ-౯౯౩ సూ. దుర్గా-వ్యాఖ్య) చొప్పునఁ గృత్తులలోని గణములు ప్రయోగైకవేద్యములు.

ఞిత్తగునట్టియు, ణిత్తగునట్టియుఁ గృత్ ప్రత్యయము పరమగునపుడు 'ఆ' దంత ధాతువులకుఁ బరముగ 'యున్' అనునది నిల్చును. ౮. (ఇందలి నకార మిద్వర్ణము.) (ముగ్ధ ౯-౨౮ సూ) (సి-కౌ-౨౭౬౧ సూ.)

స్థాయి=(స్థిరముగా నుండునది) ('స్థా=గతినివృత్తౌ')=(తిష్ఠతీతి=స్థాయీ). (స్థా+ణిన్=స్థా+య్+ఇన్=స్థాయీ).

'ఆలు-ఇష్ణు-ఇత్ను' మున్నగు కొన్ని ప్రత్యయములు తప్పఁ దక్కిన యే 'కృత్' ప్రత్యయము పరమైనను ప్రేరణార్థకధాతువు తుది ఞి ప్రత్యయము లోపించును. ౯. (ముగ్ధ-౬౪౧ సూ) (సి-కౌ-౨౩౧౩ సూ.)

ణ్యంతములు ధాతువులె కాన (సం-క్రియా ౧ సూ) దానిపై 'కృత్తు' నిల్చునని తాత్పర్యము. "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్" అను న్యాయము చొప్పున (సం-కృత్-౭ సూ. చొప్పున) 'అన' ప్రత్యయము వచ్చును. ఉదా:-నందనుఁడు=(సంతోషింపఁజేయువాఁడు=కమా

రుఁడు) ("నది=సంతోషే")=(నన్దయతీతి=నన్దనః)=(నన్ద్+ఇ+అన=నన్ద్+అన=నన్దనః). నది ధాతువు తుది 'ఇ' కార మిద్వర్ణము. ఇదిత్తులగు ధాతువులకు నుమ్మగును (ముగ్ధ ౫౬౮ సూ) (సి-కౌ-౨౨౬౦ సూ). కావుననే ముగ్ధబోధకర్త 'నన్ద' అనియే సూత్రించెను. మధుసూదనుఁడు=(మధువను రాక్షసుని జంపినవాఁడు=విష్ణువు.) ("షూద=మారణే") (మధుం సూదయతీతి=మధుసూదనః) అలంటి ధాతువులు తప్పఁ దక్కినవెల్ల ధాతుపాఠమున 'ష' కారాదులుగను ణకారాదులుగను బఠింపఁబడును. కావుననే యవి షోపదేశములు ణోపదేశములు నని వాడఁబడును. ప్రక్రియాదశలో నవి సాదులుగను నాదులుగను వర్తించును. (ముగ్ధ ౫౭౦ సూ) (సి-కౌ-౨౨౮౪ సూ) సూదధాతు ణ్యంత రూపము 'సూది' అగును. (సూదయతి). లవణుఁడు=(ఒక రాక్షసుఁడు). (లూ=ఛేదనే) (లునాతీతి=లవణః). ఇది ణ్యంతము కాదు. 'అన' ప్రత్యయము 'ణ్యంత' ములకే వచ్చునని తలంపరాదు. తపనుఁడు=(సూర్యుఁడు) ('తప=ఉపతాపే'). (తపతీతి=తపనః-తప్+అన=తపనః). క్రోధనుఁడు=(కోపము గలవాఁడు). ('క్రుధ=కోపే'=(క్రుధ్యతీతి=క్రోధనః)=(క్రుధ్+అన=క్రోధనః).

పచాద్యుదాహృతి:- దేవుఁడు=(దేవత) ('దివ్=క్రీడా విజిగీషా ప్రభృతిషు') (దీవ్యతీతి=దేవః-దీవ్యన్తీతి దేవాః) (దివ్+అ=దేవ్+అ=దేవః) (సం-క్రి-౮ సూ. చో-లఘూపధము గాన గుణము) చరుఁడు=(చారుఁడు) (చర్=గతౌ). (చరతీతి=చరః, చర్+అ=చర). చోరుఁడు=(దొంగ) ('చుర=స్తేయే' స్వర్ణాద్యపహరణే) (చోరయతీతి=చోరః. లఘూపధము గాన గుణము (సం-క్రి-౮ సూ) వచ్చినది.

"ణిన్-అన-అన్-ణక" అను ప్రత్యయములు పరమగునపుడు వివిధములగు వ్యాకరణకార్యములగును.

౧౦. (ముగ్ధ ౯౯౮ మొ. ౧౦౦౮ వ. సూ.)

ణిన్:-ద్రోహి=(ద్రోహముచేయువాఁడు) ("ద్రుహ=అనిష్టచిన్తనే") (ద్రుహ్యతీతి=ద్రోహిన్=ద్రోహీ). ద్వేషి=(ద్వేషించువాఁడు)

("ద్విష=వైరే"-ద్వేష్టీతి=ద్వేషిన్=ద్వేషీ). పితృఘాతి=(తండ్రిని జంపిన వాఁడు)-(హన=వధే" పితరం హన్తీతి=పితృఘాతిన్=పితృఘాతీ.)

అనః-గాయనుఁడు=(పాటపాడువాఁడు) ('గై=గానే' గాయతీతి=గాయనః. స్త్రీత్వే-గాయనీ.) హాయనము=(సంవత్సరము) ("హా=త్యాగే" జహాతి ఋతూన్, భావంవా=హాయనః) హాయనము=(వ్రీహి) (హా=త్యాగే. జహాత్యుదకం=హాయనః).

అన్:-ఘనాఘనము=(వర్షాకాలపు మేఘము=తాపమును బోఁగొట్టునది) (హన=హింసాగత్యోః) (నిపాతము. వదావదుఁడు=(వక్త)=("వద=వాక్యే." వదతీతి వదావదః. నిపాతము) (ముగ్ధ ౯౯౮ సూ). ప్రియుఁడు=(సంతోషపెట్టువాఁడు)=('ప్రీ=తర్పణే' ప్రీణాతీతి=ప్రియః). భూరుహము=(చెట్టు) (రుహ=ఉద్భవే. భువి రోహతీతి=భూరుహః). కామదుఘ=(కామధేనువు=కోరికలనిచ్చునది)=('దుహ=దోహే'=కామం దోగ్ధీతి=కామదుఘా) పంకజము=(పద్మము)=('జన=ఉద్భవే' పఙ్కా జ్జాయత ఇతి=పఙ్కజమ్). ద్విపము=(ఏనుఁగు). ('పా=పానే' ద్వాభ్యాం ముఖ శుణ్డా భ్యాం పిబతీతి=ద్విపః). నగము=(కొండ (లేదా) చెట్టు)=('గమ్=గతౌ' న గచ్ఛతీతి=నగః). గిరిశుఁడు=(శివుఁడు) ('శీ=శయనే'-గిరౌ శేతఇతి=గిరిశః). గోవిందుఁడు=(విష్ణువు). ('విద=లాభే'-గాం విన్దతీతి=గోవిన్దః) దావము=(దవాగ్ని). ('దు=ఉపతాపనే'-దునోతీతి=దావః=దవః). (దు+అ=దో+అ=దవ్+అ). (సం-క్రియా-౭ సూ చొప్పున గుణము వచ్చును) జ్వాలము=(మంట) ["జ్వల=దీప్తౌ. జ్వలతీతి=జ్వాలః=జ్వలః-(సూ)(జ్వాలా) శ్వాసము=(ఊపిరి)('శ్వస=ప్రాణనే'. శ్వసితీతి=శ్వాసః. ఉత్పశ్యుఁడు=(మీఁదికిఁ జూచువాఁడు) ('దృశ్=చాక్షుషజ్ఞానే' ఊర్ధ్వం పశ్యతీత్యుత్పశ్యః). పాపఘ్నుఁడు=(పాపమునుఁ బోఁగొట్టువాఁడు). ('హన=వధే'-పాపం హన్తీతి=పాపఘ్నః). జంగముఁడు=(మిక్కిలి నడచు శక్తిగలవాఁడు)-('గమ్=గతౌ'-గమ్-యఙ్-లుక్=గమ్+గమ్=అ=జఙ్గమః).

ణక :- నర్తకుఁడు = (నాట్యముచేయువాఁడు). ('నృత్ = నర్తనే' నృత్యతీతి = నర్తకః. స్త్రీత్వే - నర్తకీ). గాయకుఁడు = (గానము చేయువాఁడు) ("గై - గానే" గాయతీతి = గాయకః = గాయనః (యు).) జీవకుఁడు = (జీవించువాఁడు). ('జీవ = ప్రాణధారణే' జీవతాదితి = జీవకః. ఆశీరర్థకః). ఇట్లే - నందకుఁడు - వర్ధకుఁడు - మొ.

ఆశీరర్థమున మఱికొన్ని కృత్ ప్రత్యయములును నగును. దేవరాతుఁడు = (పరీక్షిన్మహారాజు) ('రై = శబ్దే' దేవాయ రాయాదితి = దేవరాతః) దేవదత్తుఁడు = (ఒకని పేరు). ('దా = దానే' దేవాయ దేయాదితి = దేవదత్తః). వీరభువు = (వీరుఁడు వీనికిఁ బుట్టుఁగాక). ('భూ = సత్తాయామ్' వీరోఽస్య భూయాదితి = వీరభూః = వీరభూ+క్విప్). అగ్నిభూతి = (అగ్ని వీనికిఁ గల్గుఁగాక). ('భూ = సత్తాయామ్' అగ్నిరస్య భూయాదితి = అగ్నిభూతిః).

కొన్ని ధాతువులపైని 'అ-ఇ' (ఖస్-ఖి) అను ప్రత్యయములు నిల్చును. అట్టి ధాతువులు ద్వితీయాంత నామములతోఁ గొన్నియెడల సమసించును. కొన్ని నామములపైని 'మ'కారము నిల్చును. వివిధములగు వ్యాకరణకార్యములును జరుగును. ౧౨. (ముగ్ధ-౧౦౦౯ మొ. ౧౦౩౭ వ. సూ) (౧౦౧౪ (ముగ్ధ, ఖిత్తులకు) 'మన్' వచ్చును).

కుంభకారుఁడు = (కుమ్మరవాఁడు) ('కృఞ్ = కరణే' కుమ్భం కరోతీతి = కుమ్భకారః). పాపఘ్నము = (పాపమును హరించునది) ('హన = వధే' పాపం హన్తీతి = పాపఘ్నః). సామగుఁడు = (సామవేదమును గానముచేయువాఁడు). ('గై = శబ్దే' సామ గాయతీతి = సామగః). యశస్కరము = (కీర్తిని జేయునది) ('కృఞ్ = కరణే' యశః కరోతీతి = యశస్కరః. స్త్రీత్వే - యశస్కరీ). ఫలేగ్రహి = (యోగ్యకాలమున ఫలించునది = వృక్షము). ('గ్రహ = గ్రహణే' ఫలం గృహ్ణాతీతి = ఫలేగ్రహిః - 'ఏ'కారాగమశ్చ). దేవాపి = (ఒకరాజు) - ('ఆప = వ్యాప్తౌ' దేవమాప్నోతీతి = దేవాపిః). ఇట్లే 'వాతాపి' మొ. 'మ'కారాగమము :- కుక్షిమ్భరి = (తన కడుపును మాత్రము నింపు

కొనువాఁడు) ('భృ=భరణే' కుక్షిం బిభర్తీతి=కుక్షిమ్భరిః). ఇట్లే-ఉదర మ్భరి-ఆత్మమ్భరి-మొ. జనమేజయుఁడు=(పరీక్షిత్తు కొడుకు) ('ఏజ= కమ్పనే-దీని ణ్యంతము:-ఏజి-జన మేజయతీతి=జన మేజయః)= (జనులను గంపింపఁజేయువాఁడు). పండిత మ్మన్యుఁడు=(తన్నుఁ బండితునిగాఁ దలం చువాఁడు). ('మన=బోధే' ఆత్మానం పండితం మన్యత ఇతి=పణ్డితమ్మన్యః) పుష్పం ధయము =(తుమ్మెద) 'ధేట=పానే' పుష్పంధయతీతి=పుష్పం ధ యః). పాణింధమము=(కొలిమితిత్తి) ('ధ్మా=శబ్దాగ్ని సంయోగయోః- పాణిభ్యాం ధమతీతి=పాణింధమః). నాడింధముఁడు=(కమసాలి) = (నాడీ భ్యాం ధమతీతి = నాడింధమః) =(నాడులను బూరించి యూఁదువాఁడు). విధుంతుదుఁడు=(రాహువు). ('తుద=వ్యథనే' విధుం తుదతీతి=విధుంతు దః). ఇట్లే-అరుంతుదుఁడు (అరుస్సు=మర్మస్థానము) లలాటం తపము- (లలాటమును దపింపఁజేయు) అసూర్యంపశ్యా=(ఘోషాస్త్రీ) నఖంపచ ము=(గోరునకు వేఁడి గలుగు)-(నఖం పచతీతి=నఖంపచః-"'పచ=తాపే' (చూ.శబ్దార్థ-చిం) మున్నగువానిని సాధించునది.) భయంకరము=(భయ మును జేయునది) ('కృఞ్=కరణే' భయం కరోతి=భయంకరః) తురంగ మము=(గుఱ్ఱము-త్వరితముగాఁ బరుగెత్తునది)('గమ్=గతౌ' తురంత్వరితం గచ్ఛతీతి= తురంగమః) (తురంగ. రూ). అరిందముఁడు = (శత్రువులను దమింపఁజేయువాఁడు)('దమ=శమే' అరిం దమయతీతి=అరిందమః). మొ.. 'అనట్'=(పాణిని ల్యుట్) ప్రత్యయాంతములందును నిట్టి 'మ'కారాగ రూపములు గలవు. అంధంకరణము=(శోకము)=(అనన్ధః అన్ధః క్రియ తే=అన్ధం కరణమ్). ఇట్లే సుభగం భావుకము. సుభగం భవిష్ణువు మున్నగురూపములను సాధించునది.

కార్యవిశేషములకును, నుచ్చారణార్థకముగను, వర్ణ విశేషముల రూపముతో "క్విప్-విణ్" మున్నగు ప్రత్య యములు ప్రయోగానుసారముగా ధాతువుల పయిని విధింపఁబడును. ఈ ప్రత్యయములలో నేవర్ణమును నిలు

(సం-కృత్-౧౨ సూ) క్విబాదులు. వీనిలో నన్నియు నిద్వర్ణములె. 

వను. అన్ని వర్ణములును లోపించును. ధాతు మాత్రమె నామముగా నేర్పడును. అట్టియెడల వివిధములగు వ్యాకరణ కార్యములును గొన్నిటనగును. ౧౨ (ముగ్ధ-౧౦౨౮ మొ. ౧౦౩౨ వ. సూ-౧౦౩౫ మొ. ౧౦౪౯-వ. సూ).

ఈప్రత్యయములందలి 'క'కారము గుణాభావమును దెల్పుటకును 'ణ'కారము వృద్ధి వచ్చునని తెల్పుటకును నిద్వర్ణములు నిల్పఁబడెను.

ప్రాచి=(తూర్పుదిక్కు) (చూ-తత్స ౮౯ సూ) ("అఞ్చు=గతి పూజనయోః". ప్రకర్షేణ అఞ్చతీతి = ప్ర+అఞ్చ్+క్విప్ = స్త్రీత్వే-ప్రాచీ) ప్రతీచి=(పడమర దిక్కు) ('ప్రత్యఞ్చతీతి=ప్రతి+అఞ్చ్ + క్విప్=ప్రతీచీ). 'అఞ్చు' ధాతువు తుదినున్న 'ఉ'కారేద్వర్ణము దాని స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును. (చూ - తత్స ౮౯ సూ). ("యుజ్యతఇతి యుక్-"యుజ=యోగే"యుజ్+క్విప్=యుక్). (యునక్తీతి=యుజ్. యుజ్+క్విప్=యుజ్). (ఇట్లే" ప్రాక్-ప్రాఙ్. ప్రత్యక్-ప్రత్యఙ్") (ప్రాఙ్-ప్రాఞ్చౌ-ప్రాఞ్చః. ప్రత్యఙ్-ప్రత్యఞ్చౌ- ప్రత్యఞ్చః- యుక్-యుజౌ - యుజః - యుఙ్ - యుఞ్జౌ - యుఞ్జః) ఆంధ్రవిభక్తియోగము లేదుగాని "క్రూరయుగ్గ్రహము. ప్రాగ్దిశ - ప్రత్యగ్దిశ" మున్నగు రీతిని వానికి సమాస పూర్వావయవస్థితి యుండును. (తత్స-౧౦౭ సూ). సుఖభాక్కు=(సుఖము నందువాఁడు) ("భజ-సేవాయామ్" సుఖం భజతీతి=సుఖ+భజ్+విణ్=సుఖభాక్ - సుఖభాజౌ-సుఖభాజః) :(చూ-సమా ౩౭ సూ). తురాసాహుఁడు=(ఇంద్రుఁడు=వేగమును సహించు వాఁడు) = ("షహ=క్షమాయామ్" తురాం (వేగమును) సహతేఇతి= సహ్+విణ్=తురాషాట్-తురాసాహౌ-తురాసాహః.(ద్వితీ)తురాసాహం తురాసాహౌ-తురాసాహః) (చూ-సమా ౪౦ సూ) అనడ్వాహము= (ఎద్దు)=(వహ్=ప్రాపణే" అనః=శకటమ్=వహతీతి=అనస్+వహ్+విణ్= అనడ్వాన్-అనడ్వాహౌ-అనడ్వాహః. (ద్వితీ) అనడ్వాహమ్-అనడ్వాహౌ -అనడుహః). సోమపుఁడు=(యజ్ఞ సోమ లతారస పానము చేసినవాఁడు)

('పా=పానే' సోమం పిబతీతి-పా + విచ్ =సోమపాః-సోమపౌ-సోమపాః)-విశ్వపుఁడు=(ప్రపంచమును రక్షించువాఁడు)-( పా=రక్షణే' విశ్వం పాతి రక్షతీతి=విశ్వ+పా+విచ్=విశ్వపాః-విశ్వపౌ-విశ్వపాః) కృధ=(కోపము)-('కృధ్-కోపే' కృధ్యతతి=కృధ్+క్విప్=కృధా) వీరుధము=(లత) ( రుహ-ఉద్భవే' విశేషేణ రోహతీతి=వి+రుహ+క్విప్ = వీరుధ్ =వీరుత్-వీరుధౌ-వీరుధః) (సమా ౪౦ సూ). ('వీరుధా' అను టాబంతమును సాధువె).-మార్గాంతరము :-(విస్తృతం ఋణద్ధీతి=వి+రుధ్+క్విప్ = రుధ్-ఆవరణే'-వీరుధ్=వీరుధా) ఉపానహము=(పైజారు=చెప్పుజోడు) ('నహ=బన్ధనే' ఉప=(పాదప్రాన్తదేశమ్)-ఆసమన్తాత్ నహ్యతీతి=ఉప+ఆ+నహ+క్విప్ = ఉపానహ = ఉపానత్ - ఉపానహౌ - ఉపానహః) (చూ-సమా ౪౦ సూ). వాక్కు=వాకు=వాచ = (వాక్యము-వాగింద్రియము). ('వచ్=కథనే' ఉచ్యతఇతి=వచ్ + విణ్=వాచ్=వాక్-వాచౌ-వాచః) దిశ - (దిక్కు=ప్రాచ్యాది దిక్కు) ('దిశ=దానే'-దిశత్యవకాశ మితి=దిశ్+క్విప్=దిశ్.దిక్-దిశౌ-దిశః). (చూ-సమా ౩౮ సూ) మధులిహము=(తుమ్మెద-పుష్పాసవమును త్రాగునది) ( లిహ=ఆస్వాదనే'-మధు లేఢిఇతి=మధు+లిహ్+క్విప్=మధులిహ్. మధులిట్-మధులిహౌ-మధులిహః) (చూ-సమా ౪౦ సూ). తాదృశుఁడు=(అట్టివాఁడు) ( దృశ్ =చాక్షుషజ్ఞానే ' స ఇవదృశ్యత ఇతి=తద్ + దృశ్ + క్విప్=తాదృశ్ తాదృక్-తాదృశౌ-తాదృశః) ఇట్టె భవాదృశుఁడు (భవత్ =నీవంటి) సదృశుఁడు. (సమాన-స) సమానమైన వాఁడు), ఈదృశము-(ఇదమ్=ఈ ఇట్టివాఁడు), కీదృశుఁడు (కిమ్-కీ, ఎట్టివాఁడు) అమూదృశుఁడు (అదస్=అమూ ఇట్టివాఁడు) మొ.

ధాతువునకుఁ బరముగ "త్ర-అస్-ఇస్-ఉస్-మన్-క్వనిప్" అను ప్రత్యయములు కారకవిశేషములందును భావార్థమునందును నిల్చును ౧౩ (ముగ్ధ-౧౦౩౬ సూ).

త్ర:-నేత్రము=(కన్ను-కవ్వపు త్రాడు). ( ణీ=ప్రాపణే". నయతి-నయతే అనేన వా ఇతి=నీ+త్ర=నేత్రమ్). దంష్ట్రము=దంష్ట్ర=(పెద్దపల్లు=

కోఱ) ('దన్ శ్=దంశనే' దశ్యతే అనయేతి=దన్ శ్+త్ర = దంష్ట్రా). నద్ధ్రి=(గుఱ్ఱపు నడ్డిమీఁది యాస్తరణము కదులకుండఁ గట్టెడి వాఱు= చర్మము) ("ణహ్=బన్ధనే". నహ్యతే అనయేతి=నహ్+త్ర=నద్ధ్రీ)) స్తోత్రము=(స్తుతి) ("ష్టు=స్తుతౌ" స్తూయతే అనేనేతి=స్తు+త్రి+స్తోత్రమ్). దాత్రము=(కొడవలి) ('దా=ఛేదనే". దాతి=ఛినత్తి అనేనేతి=దా+త్రి= దాత్రమ్). పాత్రము=(భోజ నాద్యపుత్రము) ("పా=పానే". పిబ త్యనే నేతి=పా+త్రి=పాత్రమ్). పాత్రము=పాతుఁడు=(పాపమునుండి రక్షించు వాఁడు) ('పా=రక్షణే". పాతి రక్షతీతి=పా+త్రి=పాత్రమ్)

అస్:-రజము = (పుష్పాడి-ముట్టురక్తము). ("రన్ జ=రాగే". రజ్యతే అనేనేతి=రన్ జ్+అస్=రజస్=రజః). వేధ = (బ్రహ్మ-సృజించు వాఁడు) ('విధ=విధానే'. విధతి=సృజతీతి=విధ+అస్=వేధాస్=వేధాః).

ఇస్:-సర్పి=సర్పిస్సు=(నేయి) ("సృప=గతౌ' సర్పతి=వ్యాప్నో తీతి=సృప్+సర్ప్+ఇస్=సర్పిస్=సర్పిష్=సర్పిః) హవి=హవిస్సు=(నెయ్యి-హోమముచేయునది) (హు = హోమే'. హూయతే అనేనేతి = (హోమము చేయఁబడు)=హు=హవ్+ఇస్=హవిస్=హవిః).

ఉస్:-చక్షువు=చక్షుస్సు = (కన్ను)-("చక్ష=కథనే". చష్టే= వస్తు స్వరూపం వక్తీతి=చక్ష్+ఉస్=చక్షుస్=(చక్షుష్)చక్షుః). ధనుస్సు= ధనువు=(విల్లు) ("ధన=రవే". ధనతీతి=(శబ్దించును)=ధన+ఉస్=ధనుష్= ధనుః).

మన్ :-శర్మము=(సుఖము) (శౄ = హింసాయామ్" శృణాతి (అశుభములను హింసించునది)=శౄ=శర్+మన్=శర్మన్=శర్మ).

క్వనిప్ :-పారదృశ్వ=(పారంగతుఁడు) ("దృశ్=చాక్షుష జ్ఞానే". పారం దృష్టవాన్=పార+దృశ్ + క్వనిప్ = పారదృశ్వన్ = పారదృశ్వా). యజ్వ=(యాగముచేసినవాఁడు) ("యజ్=దేవపూజనే". యజతేస్మ= యజ్+వనిప్=యజ్వన్=యజ్వా).

ధాతువునకుఁ బరముగా భూతార్థమునందలి కర్మార్థమునందును భావార్థమందును 'క్త' ప్రత్యయము నిల్చును భూతార్థమునందలి కర్త్రర్థమున 'క్తవతు' ప్రత్యయము నిల్చును ౧౮ (ముగ్ధ-౧౦౫౦ సూ) (సి-కౌ-౩౦౧౨-౩౦౧౩ సూ)

వీనిలోని క'కారము గుణ భావము దెల్పు నిద్వర్ణము. క్తవతు ప్రత్యయములోని తుది 'ఉ కారము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము (చూ-తత్స-౮౯ సూ)

క్తవత్' ప్రత్యయాంత రూపములు భవచ్ఛత్రాదులలోఁ వగుటచేత (తత్స-౧౦౭ సూ) వీనికిఁ దెలుఁగు విభక్తియోగము లేదు. వీనికి స్త్రీత్వమున ఈ కారము వచ్చును అట్టి స్త్రీలింగ రూపములు తెలుఁగున నుండవచ్చును గాని సమాస పూర్వావయవ క్తవత్ ప్రత్యయాంత రూపములు తెనుఁగు విభక్తులనందిన ఈ' ప్రత్యయాంత రూపములును గవి ప్రయోగములలోఁ గానరావు

కర్మార్థక క్త' -స్తుతుఁడు-స్తుత-స్తుతము=(స్తుతింపఁబడిన) ("ష్టు= స్తుతౌ స్తు+క్త=స్తుతః-స్తుతమ్-స్తుతా) ఇవి విశేషణములు గాన మూఁడు లింగములు నగును

భావార్థక 'క్త' -స్నాత -స్నాతా-స్నాతమ్ (స్నానము చేయఁబడిన) ( స్నా=శోధనే స్నా+క్త=స్నాతః-స్నాతమ్-స్నాతా)

క్తవత్ కర్త్రర్థక -స్తుతవద్భక్తులు=(స్తుతించిన భక్తులు) స్తుతవతి= (స్తుతించినది) ('ష్టు=స్తుతౌ స్తు+క్తవత్ = స్తుతవాన్-స్తుతవన్తౌ-స్తుతవన్తః స్త్రీ-స్తుతవతీ-స్తుతవత్యౌ-స్తుతవత్యః)

తనాది గణ ధాతువులయొక్కయు, వనధాతువుయొక్కయు ఇమ్' రాని ధాతువులయొక్కయు దుదియను నాసికమునకు తిక్' ప్రత్యయేతర కిత్తులును జిత్తులును నగు ఝున్' సమాహార వర్ణములు పరమగునపుడును

(సం-కౌ-౧౫-౧౬ సూ)ధాత్వంత్యానునాసిక లోపము. 'త' కారమునకు 'న' కారాదేశం

యప్రత్యయము (క్త్వా ప్రత్యయాదేశము) పరమగు నపుడును లోపము గల్గును ౧౫ (ముగ్ధ-౬౭౬ సూ) (సి-కౌ-౨౪౨౫ సూ)

గతము=(గతించిన) (గమ్=గతౌ". గమ్+క్త=గతః-గతా-గతమ్) హతము=(చంపఁబడిన) (హన=వధే). హన్+క్త=హతః-హతా-హతమ్).

క్షీ-డీ-దీ-దూ-లీ-లూ-సూ" మున్నగు ధాతువుల కంటెను, ఓ'కార మిద్వర్ణముగాఁ గల ధాతువులకంటెను, దకారాంత ధాతువులకంటెను, 'య-ర-ల-వ' లతోఁ గూడిన సంయోగముగల ఆ' వర్ణాంత ధాతువులకంటెను, గొన్ని బూాదన్త ధాతువులకంటెను బరములగు క్త-క్తవత్" ప్రత్యయముల 'త'కారమునకు 'న'కారాదేశ మగును. అట్టియెడలఁ గొన్ని వ్యాకరణకార్యము లగును ౧౬ (ముగ్ధ-౧౦౫౨ సూ) (సి-కౌ-౩౦౧౬ మొ ౩౦౧౯ వ సూ)

క్షీణుడు (త్రిలిం). ("క్షి=క్షయే' క్షి+క్త=క్షీణః-క్షీణా-క్షీణమ్) దీని కిట్లు దీర్ఘము వ్యాకరణకార్య మయ్యెను డీనము=(త్రి). (ఎగురఁబడిన) (డీ=నభోగతౌ డీ+క్త=డీనః-డీనా-డీనమ్). దీనుఁడు=(త్రి) (దుఃఖితుఁడు) (దీ=క్షయే' దీ+క్త=దీన -దీనా-దీనమ్) దూనము=(త్రి) (సంతప్తము) ('దూ=ఖేదే' దూ+క్త=దూనః-దూనా-దూనమ్) లీనుఁడు=(త్రి) (భన్నుఁడు) (లీ=శ్లేషణే ద్రావణే" లీ+క్త=లీనః-లీనా-లీనమ్) లూనము=(త్రి) (భిన్నము) (లూ=ఛేదనే". లూ+క్త=లూనః-లూనా-లూనమ్) సూనము=(త్రి) (ప్రసూతము=పుష్పము) (సూ=ప్రసవే' సూ+క్త=సూనః-సూనా-సూనమ్)

ఓదిత్తులు -రుగ్ణము=(త్రి) (రోగాన్వితు). (రుజో=భఙ్గే' రుజ్+క్త=రుగ్ణ-(త్రి) భుగ్నము=(త్రి)=(రోగాదులచేఁ గుటిలమైనది) ('భుజో=

కౌటిల్యే'' భుజ్+క్త-భుగ్నః-)దా_ త్త-భిన్నము-(విదారిత) (త్రి)=(''భిద-ద్విధాకరణే''-భిద+క్త=భిన్నః (త్రి)) య-ర-ల-వ' సంయుక్తావర్ణాత్తః శ్రాణము=(పక్వము). ( శ్రా=పాకే . శ్రా+క్త=శ్రాణః-(త్రి)).

ఋూదత్త -కీర్ణము=(త్రి)=(విక్షిప్తము) ( కౄ=విక్షేపే''. కౄ+క్త=కీర్ణ-త్రి)) జీర్ణము (త్రి)=(ముదిసినది) ( జౄ=జరాయామ్''. జౄ+క్త=జీర్ణః-(త్రి) శీర్ణము=(త్రి)=(శుష్కము) ( శౄ=హింసనే''. శౄ=క్త=శీర్ణః-(త్రి)) )

'నిర్వాణము-ఋణము-పుల్లము-విత్తము-క్షీబము-కృశము-ఉల్లాఘుఁడు అనునవియు (ముగ్ధ-౧౦౬౫సూ) 'క్షుబ్ధము - స్వాంతము - ధ్వాంతము - కష్టము - లగ్నము-మ్లిష్టము - పరివృఢుఁడు - అభ్యర్ణము'' అనునవియు (ముగ్ధ-౧౦౭౪ సూ) దాంతుఁడు-శాంతుఁడు-పూర్ణము స్పష్టము-ఛన్నుఁడు'' అనునవియు (ముగ్ధ-౧౦౭౭ సూ) (ఈ తుదివి వికల్పగా ఇ ప్రత్యయము లోపించినవి-సం-కృ-౯ సూ) నిపతితములగు 'క్త'ప్రత్యయాంతములు ౧౭.

నిర్వాణము=(మోక్షము) ( వా=గమనే-హింసనేచ'' నిర్+వా+క్త=నిర్వాణః). ఋణము=(అధమర్ణదేయ ధనము)=(''ఋ=గతౌ''. ఋ + క్త = ఋణమ్) ఫుల్ల=(వికసితపుష్పము) ( 'ఫుల్ల = వికసనే''. ఫుల్ల+క్త=ఫుల్లః త్రిలిం) విత్తము=(ధనము) (' విద=లాభే'' విద+క్త=విత్తమ్ ) క్షీబము=(మదించిన) ( క్షీబ=దర్పే'' క్షీబ+క్త=క్షీబమ్-త్రిలిం) కృశము=(కృశించినది) ( కృశ=తనూకరణే'' కృశ+క్త=కృశ. త్రిలిం) ఉల్లాఘుఁడు=(రోగ నిర్ముక్తుఁడు)( లాఘ=సామర్థ్యే'' ఉత్+లాఘ+క్త=ఉల్లాఘః) క్షుబ్ధము=(ఆలోడితము) (' క్షుభ=సఞ్చలనే'' క్షుభ్+క్త=క్షుబ్ధ. త్రిలిం) స్వాంతము=(మనస్సు) ( స్వన=శబ్దే' స్వన+క్త=స్వాన్తమ్). ధ్వాంతము=(చీకటి) ( ధ్వన=శబ్దే''. ధ్వన+క్త=ధ్వాన్తమ్.) కష్టము=(పీడ) ('కష=వధే' కష+క్త=కష్టమ్) లగ్నము=(సక్తము) ('లగ=

సజ్జే". లగ్+క్త=లగ్నమ్-త్రిలిం) మ్లిష్టము=(అస్పష్టవాక్యము) (మ్లేచ్ఛ=దేశోక్తౌ' మ్లేచ్ఛ+క్త=మ్లిష్టమ్) పరివృఢుఁడు=(ప్రభువు) (వృహ=వృద్ధౌ" పరి+వృహ+క్త=పరివృఢః) దృఢము=(కఠినము) (దృహ=వృద్ధౌ" దృహ+క్త=దృఢమ్) అభ్యర్ణము=(సమీపము)( అర్ద=పీడాయామ్". అభి+అర్ద+క్త=అభ్యర్ణః) క్షామము=(క్షీణించిన) (క్షై=క్షయే' క్షై+క్త=క్షామః త్రిలిం) (ఇవి కర్త్రర్థక క్త ప్రత్యయములు) శుష్కము=(ఎండినది) (శుష=శోషే శుష్+క్త=శుష్క- త్రిలిం, పక్వము=(పరిణతము) (పచ్=పాకే' పచ+క్త=పక్వమ్ త్రిలిం) దాంతుఁడు=(ఇంద్రియ నిగ్రహము గల) (దము=శమే' దము+ఇ+క్త=(ఇలోప సం-కృ-౯ సూ) దాన్తః-త్రిలిం) శాంతుఁడు=(శాంతి గల) (శమ=శమే". శమ+ఇ+క్త=(ఇలోపము సం-కృ-౯ సూ) శాన్తః-త్రిలిం) పూర్ణము=(నింపఁబడినది) ('పూర్=పూర్తౌ పూర్+ఇ+క్త=పూర్ణః త్రిలిం). స్పష్టము=(వ్యక్తమైనది) (స్పశ=గ్రన్థ-బాధయోః' స్పశ+ఇ+క్త=స్పష్టః - త్రిలిం) ఛన్నము=(ఆచ్ఛాదితము) (ఛద=సంవరణే" ఛద+(స్వార్థిక) ఇ+క్త=ఛన్న -త్రిలిం) వీని కర్తృకర్మాదులు యథాసంభవ గ్రాహ్యములు

> గత్యర్థాకర్మక ధాతువులమీఁదను శీ-స్థా' మున్నగు కొన్ని ధాతువులమీఁదను భావ కర్మ కర్త్రర్థములందు 'క్త' ప్రత్యయ మగును వ్యాపారారంభార్థమునందును గర్త్రర్థమున క్త ప్రత్యయ మగును ౧౮ (ముగ్ధ-౧౦౯ ౨-౧౦౯౩ సూ) (సి-కౌ-౩౦౫౩-౩౦౮౬ సూ).

క్త ప్రత్యయము కిత్తు గాన గుణములేదు గత్యర్థ -స గఙ్గాం గతః=(వాఁడు గంగాగతుఁ డయినాఁడు) (గమ్=గతౌ గమ్+కర్త్రి-క్త=గతః స గఙ్గాం గతః) వాఁడు కృష్ణునిఁ బ్రాప్తుఁ డయినాఁడు ('ఆప్=వ్యాప్తౌ' ప్ర+ఆప్+కర్త్రి-క్త=స కృష్ణం ప్రాప్తః') కర్మార్థ -వానిచే కృష్ణుఁడు ప్రాప్తుఁ డయినాఁడు=( ఆప్=వ్యాప్తౌ ప్ర+ఆప్+కర్మార్థ

క్త=తేన కృష్ణః ప్రాప్తః) విష్ణువు శేషునం దధిశయించినాఁడు. ("శీఙ్ = శయనే. అధి+శీ+కర్తృ-క్త=శేష మధిశయితః విష్ణుః). విష్ణువు వైకుంఠము నధిష్ఠించినాఁడు (ష్ఠా=గతినివృత్తౌ' స్థా+కర్తృ-క్త=విష్ణు ర్వైకుణ్ఠ మధిష్ఠితః). వ్యాపారారంభ -వాఁడు గడియము చేయ నారంభించినాఁడు ("కృఞ్=కరణే పరి+కృ+కర్తృ-క్త=పరికృత స్స కటమ్).

నిశ్చలార్థకములకంటెను గత్యర్థములకంటెను భోజనార్థకములకంటెను బరముగా నధికరణమున భావ కర్మ కర్త్రర్థములందు 'క్త ప్రత్యయ మగును. ౧౯ (ముగ్ధ-౧౦౯౪ సూ) (సి-కౌ-౩౦౮౭ సూ)

అధికరణ-నిశ్చలార్థ -కృష్ణుఁడు పీఠమం దాసితుం డయినాఁడు. (ఆస=ఉపవేశనే ఆస+కర్త్రర్థక-క్త=కృష్ణః పీఠే ఆసితః). గత్యర్థ :- కృష్ణుఁడు మధురను యాతుఁ డయినాఁడు (యా=యానే యా+కర్త్రర్థక-క్త=కృష్ణః మధురాం యాతః) భోజనార్థ -కృష్ణుఁడు యజ్ఞమ దన్నమును భుక్తుం డయినాఁడు=('భుజ=భక్షణే' భుజ+కర్త్రర్థ-క్త కృష్ణో యాజ్ఞికాన్నం భుక్తః) కర్మార్థ - కృష్ణునిచేఁ బీఠ మాసితము (ఆస=ఉపవేశనే' ఆస+కర్మార్థ-క్త=కృష్ణేన పీఠ ఆసితః భావార్థ- కృష్ణునిచే ఆసితము (ఆస=ఉపవేశనే". ఆస+భావార్థ-క్త=కృష్ణేన ఆసితమ్)

జ్ఞానార్థకములకంటెను బూజార్థకములకంటెను నిచ్ఛార్థకములకంటెను శీలాది ధాతువులకంటెను భూతార్థమందేకాక వర్తమానార్థమందును క్త ప్రత్యయ మగును ఇట యథాసంభవముగాఁ గర్తృ కర్మాద్యర్థముల నెన్న నగును ౨౦ (ముగ్ధ-౧౦౯౫ సూ) (సి-కౌ-౩౦౮౮-౩౦౮౯ సూ)

జ్ఞానార్థ -విదితుఁడు శివుఁడు - (తెలియఁబడుచున్న శివుఁడు) ('విద=జ్ఞానే విద+వర్తమానార్థక-క్త=విదితః శివః)

పూజార్థ -పూజితుడగుచున్న శివుఁడు ( పూజ = పూజనే పూజ+వర్త-కర్మా-క్త=పూజిత శ్శివః)

ఇచ్ఛార్థ - వాంఛితుఁడు=(కోరఁబడుచున్నవాఁడు శివుఁడు.) ('వాఞ్ఛ=కామే'. వాఞ్ఛ+వర్తమాన-కర్మార్థక-క్త=వాఞ్ఛిత శ్శివః) ఇద్ధుఁడు=(దీపించుచున్నవాఁడు శివుఁడు ('ఇన్ధీ=దీప్తౌ'. ఇన్ధీ+కర్త్రి వర్త-క్త=ఇద్ధః) శీలితుఁడు=పరిశీలింపఁబడుచున్నవాఁడు ( శీల=సమాధౌ' శీల+వర్త-కర్మార్థ-క్త=శీలితః) ఇవి వర్తమాన క్తాంతములె కాక భూతార్థ క్తాంతములును గావచ్చునని యెన్నునది. (చూడు-ముగ్ధ-దుర్గా-వ్యాఖ్య) అట్టి కవిప్రయోగములును గలవు.

వర్తమానార్థమునఁ బరస్మైపదిధాతువులకుఁ బరముగ శతృ' ప్రత్యయమును నాత్మనేపదిధాతువులకు శాన' ప్రత్యయమును నగును శాన ప్రత్యయము అ' కారముపై మాన' అని నిల్చును తక్కినయెడల ఆన' అనురూపముతో నిల్చును ౨౧ (ముగ్ధ-౧౧౦౦-౧౧౦౧ సూ) (సి-కౌ-౩౧౦౦ మొ ౩౧౦౩ వ సూ)

శతృశాన ప్రత్యయములలోని శ-ఋ వర్ణము లిద్వర్ణములు శవర్ణ మిద్వర్ణమగుటచే నివి సార్వధాతుకము లగును (సం-క్రియా-౩ వి) ఋవర్ణము స్త్రీత్వమున 'ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పును (తత్స ౮౯ సూ) శత్రంతములు భవచ్ఛతాది సూత్రముచేతఁ దెనుఁగు విభక్తుల నందవు (తత్స ౧౦౭ సూ)

సార్వధాతుక పరకత్వమునఁ గర్త్రర్థమందు ధాతువునకు శప్' ప్రత్యయమగును ౨౨ (ముగ్ధ-౫౮౧ సూ) (సి-కౌ-౨౧౬౭ సూ).

ఇందలి శవర్ణ పకారము లిద్వర్ణములు శిత్తుగాన నిది సార్వధాతుక సంజ్ఞ గలది.

472 (సం-కౌ-౨౩-౨౪-౨౫ సూ) 'శతృ' ప్రత్యయాదేశములు

అకారముగాని ఏ-ఓ-ఐ-ఔ' లు గావి పరమగు నపుడు అ' కారమునకు లోపము గల్గును ౨౩ (ముగ్ధ ౫౪౩ సూ) (సి-కౌ-౧౯౧ సూ)

కర్త్రర్థ -పచన్-పచన్తౌ-పచన్తః-(వండుచున్న) (దీని కాంధ్ర విభక్తి యోగము లేదు) ("పచ్=పాకే పచ్+శప్+శతృ=పచ్+అ+అత్=పచత్-స్త్రీ-పచన్తీ) (తత్స ౧౦౭ సూ) పచద్దేవదత్తుఁడు=(వండుచున్న దేవదత్తుఁడు) పచంతి=(వండుచున్న స్త్రీ) 'పచ్' ధాతు వుభయపదము గాన దీనికి శతృ శాన' ప్రత్యయములు రెండును నగును. పైనెల్ల శతృంతములు

శాన -(పచ్+శప్+మాన=పచమానః స్త్రీ-పచమానా.) పచ మానుఁడు=(వండుచున్నవాఁడు) పచమాన (వండుచున్న స్త్రీ).

కర్మార్థ -పచ్యమానము = (వండఁబడుచున్న) = (పచ్+యక్+శాన=పచ్యమానః-స్త్రీత్వే-పచ్యమానా)

విద్' ధాతువుమీఁద శతృప్రత్యయమునకు 'క్వసు' అను నాదేశము వికల్పముగా నగును ౨౪ (ముగ్ధ-౧౧౦౩ సూ) (సి-కౌ-౩౧౦౫ సూ)

ఇందలి ఉ కార క' కారము లిద్వర్ణములు ఉకారము స్త్రీత్వమున ఈ' ప్రత్యయ మగునని తెల్పును కిత్త్వము గుణాభావమున దెల్పును విద్వాంసుఁడు=(పండితుఁడు) విదుషి = (పండిత)-( విద్=జ్ఞానే విద్+(శతృ) క్వసు=విద్వస్-విద్వాన్-విద్వాంసౌ విద్వాంస స్త్రీత్వే-విదుషీ) క్వసు రానిపక్షమున శతృంతమె నిల్చును. (విద్ శతృ=(విదత్) - విదన్-విదన్తౌ-విదన్తః-స్త్రీ-విదన్తీ-విదన్త్యౌ-విదన్త్యః) విదత్ అను శతృంతమునకుఁ దెల్గునఁ (తత్స ౧౦౭ సూ) విభ యోగములేదు స్త్రీత్వమున-విదంతి=విదుషి.

శక్త్యర్థమునందును, వయోఽర్థమునందును తాచ్ఛీల్యార్థమునందును శతృ' ప్రత్యయము చోట 'మాన-

ఆన' ప్రత్యయము లగును (పాణిని-చానశ్)అకారముపై 'మాన' అనియుఁ దక్కిన యెడల 'ఆన' అనియు నిల్చు నని యెఱుంగునది ౨౫ (ముగ్ధ-౧౧౦౪ సూ) (సి-కౌ-౩౧౦౯ సూ)

నిఘ్నానుఁడు=(శత్రు)వును జంప శక్తుఁడు) ( హన్=వధే ' ని+హన్+(శప్ లోప అదాదిః) ఆన=నిఘ్నానః) వయోఽర్థ -బిభ్రాణుఁడు=(కవచమును భరించువాఁడు. యౌవనవంతుఁడని తాత్పర్యము) ( భృ=భరణే''_జుహోత్యాదిః. (చూ-సం-క్రి-౫ వివ. ౮౯-సూ-అభ్యాస కార్య ) భృ+(శప్ లోప) ఆన=బిభ్రాణః) తాచ్ఛీల్యార్థ -భుంజానుఁడు=(భోగ శీలుఁడు)( భుజ=భక్షణే భుజ్+(శప్ లోప-అదాది)ఆన=భుఞ్జానః) (ఇట్లె లసమానుఁడు' మున్నగు పరస్మైపదములు 'శాన' ప్రత్యయాంతములు కావచ్చును.) శబ్లోపమున నివి అ'కారాంతములు కావు గాన వీనిమీఁద ఆన' అనునది నిల్చినది

భవిష్యదర్థమునఁ గర్త్రర్థమునందుఁ బరస్మైది ధాతువునకు స్యతృ' ప్రత్యయమును నాత్మనేపది ధాతువునకు 'స్యమాన' ప్రత్యయమును నగును ౨౬ (ముగ్ధ-౧౧౦౫ సూ) (సి-కౌ-౩౧౦౭ సూ)

స్యతృ' అను ప్రత్యయములోని ఋకారము స్త్రీత్వమున ఈ' ప్రత్యయము వచ్చునని తెల్పు నిద్వర్ణము. (చూ-తత్స-౮౯ సూ) ఈ 'స్యతృ' ప్రత్యయము భవచ్ఛత్రాది విషయమె కాన (తత్స-౧౦౭ సూ) దీని కాంధ్ర విభక్తియోగము లేదు కాన కరిష్య త్కావ్యము' (చేయనున్న కావ్యము) అను రీతినె దీనికిఁ దెల్గునఁ బ్రయోగమని యెఱుంగ నగును కరిష్యమాణము=(చేయనున్న)( కృఞ్=కరణే". కృ+స్యమాన=కృ+ఇ+స్యమాన=కరిష్యమాణమ్)

ఇష్యంతములకన్నను భ్రాజ-భూ - సహ - అలంకృ మున్నగు కొన్ని ధాతువులకన్నను దద్ధర్మ తచ్ఛీలాద్యర్థ

(పం-కృ-౨౭-౨౮ సూ) ఇత్యస్త్రాదులపై 'ఇష్ణు-ష్ణు-స్ను మున్నగు ప్రత్యయములు

ములందుఁ గర్త్రర్థమున ఇష్ణు ప్రత్యయ మగును ౨౭
(ముగ్ధ-౧౧౦౬ సూ. సి-కౌ-౩౧౧౬ సూ)

కారయిష్ణువు=(చేయించు నిచ్ఛగలవాఁడు) (డు-కృఞ్ = కరణే కృ+ఇ+ఇష్ణు=కారయిష్ణుః) (సం-కృత్-౯. సూ చౌ ఇలోపము లేదు) భ్రాజిష్ణువు=(ప్రకాశించు స్వభావము గల) (భ్రాజ=దీప్తౌ భ్రాజ్+ఇష్ణు=భ్రాజిష్ణుః) భవిష్ణుఁడు=(ఆయెడి స్వభావము గల) (భూ=సత్తాయామ్' భూ-భవ్ + ఇష్ణు = భవిష్ణుః) సహిష్ణుఁడు = (సహించు శీలము గలవాఁడు) (షహ=క్షమాయామ్ సహ+ఇష్ణు=సహిష్ణుః) అలంకరిష్ణువు=(అలంకరించుకొను స్వభావము గల) (డు-కృఞ్=కరణే అలమ్+కృ-కర్+ఇష్ణు=అలంకరిష్ణు")

(ష్ణుక్)=ష్ణు-స్ను-ను=(క్ను)-ఉక=(ఉక)-ఆక=(ష్ణాక)-
ఆలు-రు-మర=(క్మర)-ఉర=(ఘుర-కుర)-ఊక-వర-ర-
ఉ-ఆరు-అస్త్ర-ఇత్ను-ఇత్రి' మున్నగు ప్రత్యయములు
తచ్ఛీలాద్యర్థములందుఁ గొన్ని కొన్ని ధాతువులపైని
గర్త్రర్థమున నిల్చును అట్టియెడలఁ గొన్ని వ్యాకరణ
కార్యములు నగును ౨౮ (ముగ్ధ-౧౧౦౨ మొ ౧౧౩౩
వ. సూ) (సి-కౌ-౩౧౧౯ మొ ౩౧౬౬ వ కొన్ని
ఉణా' దులును)

జిష్ణువు = (జయశీలుఁడు = అర్జునుఁడు) (జి=జయే జి+ష్ణు=జిష్ణుః) స్థాస్నువు=(స్థితి శీలుఁడు), స్థా=గతి నివృత్తౌ". స్థా+స్ను=స్థాస్నుః) ధృష్ణువు = (ప్రగల్భుఁడు) ('ధృష్=ప్రాగల్భ్యే' ధృష్+ను=ధృష్ణుః) ఘాతుకుఁడు = (హింసుకుఁడు) ('హన=వధే హన్+ఉక=ఘాతుకః). భావుకము=(మంగళము) (భూ=సత్తాయామ్ భూ-భవ్+ఉక=భావుకమ్). లుంటాకుఁడు=(దోఁచుకొనువాఁడు) ('లుణ్ట=అవజ్ఞాయామ్". లుణ్ట+ఆక=లుణ్టకః) వరాకుఁడు=(అధముఁడు) (వృ=సేవాయామ్". వృ+ఆక=వరాకః స్త్రీ-వరాకీ) పతయాలుఁడు=(పతనశీలుఁడు) (పత్=

గతౌ ' పత్+ఇ+ఆలు=పతయాలుః) స్పృహయాలుఁడు = (కోరెడు శీలము గలవాఁడు) ( స్పృహా=ఇచ్ఛాయామ్ ' స్పృహా + ఇ + ఆలు= స్పృహయాలు॰) శత్రువు=(విరోధి) ( 'శద్=శాతే (శీర్ణ) ' శద్+రు=శత్రు ) భీరువు=(భయ శీలుఁడు)( భీ=భయే ' భీ+రు=భీరుః) ఘస్మరుఁడు= (భక్షణ శీలుఁడు) ( ఘస=భక్షణే'' ఘస్+మర=ఘస్మరః) భాసురము= (ప్రకాశ శీలము గల) ( భాస=దీప్తౌ భాస్+ఉర=భాసురం) మేదురము= (దట్టమైనది) (' మిద=స్నేహే మిద+ఉర=మేదుర ) భంగురము= (వంకరైనది) ( భఞ్జ=వక్రీభావే భఞ్జ్+ఉర=భఙ్గురః) భిదురము= (వజ్రము) ( భిద=ద్విధా కరణే బిద్ + ఉర = భిదురః) విదురుఁడు= (తెలిసినవాఁడు) (''విద్=జ్ఞానే విద్+ఉర=విదుర॰) ఛిదురము=(ఛేదన శీలము) ( ఛిద్=ద్విధా కరణే ఛిద్+ఉర=ఛిదురః) జాగరూకుఁడు= (అప్రమత్తుఁడు) ( జాగృ=జాగరణే జాగృ+ఊక=జాగరూకః) భాస్వరము=(ప్రకాశించునది) ( భాస్=దీప్తౌ భాస్+వర=భాస్వరః) స్థావరము=(చలింపనిది=వృక్షాదికము) ( ష్ఠా=గతి నివృత్తౌ స్థా+వర=స్థావరః) ఈశ్వరుఁడు=(అష్టైశ్వర్యములు గల)(' ఈశ=ఐశ్వర్యే ' ఈశ్+వర= ఈశ్వరః) జిత్వరుఁడు=(జయశీల) ( జి=జయే జి+వర=జిత్వరః స్త్రీ- జిత్వరీ) అజస్రము=(ఎల్లప్పుడు) (' జస్+మోక్షణే ' నఞ్+జస్+ర= అజస్రమ్, నమ్రుఁడు=(వినీతుఁడు) ( ణమ్=నతౌ' నమ్+ర=నమ్ర ) శంభువు=(శివుఁడు) (''భూ=సత్తాయామ్ శమ్(శమ్=మంగళ)+భూ+ఉ= శమ్భు ) ఇట్లే విభుఁడు-ప్రభువు-స్వయంభుఁడు-మొ వందారుఁడు = (వందన శీలుఁడు) ( వది=ను త్యభివాదయో॰ వన్ద్+ఆరు=వన్దారుః). జయంతుఁడు=(ఇంద్రుని కొడుకు) (' జి=జయే ' జి+అన్త=జయన్తం). స్తనయిత్నువు=(మేఘము) ( స్తన=మేఘశబ్దే స్తన+ఇ+ఇత్ను=స్తనయిత్నుః) (అదంతధాతు చురాది సం-కృత్-౯ సూ ఇలోపాభావము) లవిత్రము=(కొడవలి) ( లూ=ఛిది లూ+ఇత్ర=లవిత్రమ్) చరిత్రము= (చరిత్ర) ( చర=గతౌ'' చర్+ఇత్ర=చరిత్రమ్) పవిత్రము=(పరిశుద్ధము=

(శ్రాద్ధపవిత్రము) పూఞ్=శోధే". పూ+ఇత్ర=పవిత్రమ్) భిక్షువు= సన్యాసి) ( భిక్ష=లాభే'. భిక్ష+ఉ=భిక్షు ) ఆశంసువు=(చెప్పు నిచ్ఛగలకథయిత) ('శన్స్=స్తుతౌ" ఆ+శన్స్+ఉ=ఆశంసు') ఇచ్ఛువు=(ఇచ్ఛతోనుండు) ( ఇష్=వాఞ్ఛాయామ్" ఇష్+ఉ=ఇచ్ఛుః-నిపాత) బిందువు=(సున్న=నీటిబొట్టు) ('విద్=జ్ఞానే' విద్+ఉ=బిన్దు -వబయో రభేదః-నిపాత). ఇట్లు మఱికొన్నియు సాధ్యములు

కర్మాదికారకములందును భావార్థమునందును ధాతువుమీఁద ఘఞ్-అల్-అనట్' అను ప్రత్యయములగును ౨౯ (ముగ్ధ-౧౧౩౪-౧౧౩౫ సూ) (సి-కౌ-౩౧౮౪-౩౧౯౬-౩౨౩౧-౩౨౯౦-౩౨౯౩ సూ)

ఘఞ్' లోని ఘ కార ఞ'కారములును (సం-క్రియా-౩ చూ. వృద్ధిని ఞకారము తెల్పును) అల్ ప్రత్యయములోని 'ల'కారమును 'అనట్' ప్రత్యయములోని ట'కారమును ఇద్వర్ణములు భావార్థకములు నపుంసక లింగము లగును ఈ అనట్ ప్రత్యయమునే పాణినీయులు ల్యుట్' ప్రత్యయ మందురు క్విప్-ఘఞాది పరకత్వమున నుపసర్గమునకుఁ బహుళముగ దీర్ఘం బగు (సి-కౌ-౧౦౪౪-౧౦౪౫ సూ). ప్రాకారము-ప్రాసాదము-నీహారము-నీవారము - ఇట్టివి ఘఞంతములు. ఇట దీర్ఘము నిత్యము క్విబంతములు -వీరుధము=(పొద) మొ ఉపసర్గస్య దీర్ఘత్వం క్విబ్ ఘఞాదౌ క్వచి ద్భవేత్" (ముగ్ధ-౧౧౩౪ సూ. దుర్గా).

కర్మాద్యర్థ ఘఞ్ —

ప్రాకారము=(కోఁట గోడ)( కౄ=విక్షేపే" (ప్ర+కౄ+ఘఞ్=ప్రాకారః) లేదా .- కృఞ్=కరణే" ప్ర+కృ+ఘఞ్=ప్రాకారం.) పాదము=(చరణము) ('పద=గతౌ". పద్+ఘఞ్=పాదః)=(దీనిచేత నడువఁబడును.) (కరణార్థ) దాసుఁడు =(సేవకుఁడు) ( దాస=దానే'.దాస+ఘఞ్=దాసః-సంప్రదాన) = (వీనికొఱకు పని యీఁబడును ) ఉపాధ్యా

యుఁడు=(గురువు) ('ఇఙ్ = అధ్యయనే' ఉప+అధి+ఇఙ్=ఏ=అయ్+ఘఞ్=ఉపాధ్యాయ'-అపాదాన)=(దగ్గఱకుఁబోయి యీతనినుండి యధ్యయనము చేయఁబడును.) ప్రసాదము=(దయ) ('షద=గతౌ' ప్ర+సద్+ఘఞ్=ప్రసాదః-అధికరణ) (దీనియందు మనసు నిర్మల మగును)

భావార్థ ఘఞ్ -సమాజము=(పశు భిన్న మనుష్యాది సంఘము) ('అజ=గతౌ సమ్+అజ+ఘఞ్=సమాజ')

కర్మాద్యర్థ 'అల్' ప్రత్యయము — నిలయము=(ఇల్లు) ('లీ=శ్లేషే ని+లీ+అల్=నిలయః అధికరణ) (దీనియందు నివాసము చేయఁబడును) కరము=(చేయి) (కృఞ్=కరణే కృ+అ=కరః కరణ కారకమ్) (దీనిచేతఁ బనులు చేయఁబడును)

భావార్థకమగు 'అల్' ప్రత్యయము నుదాహృతులు — సమజము=(పశ్వాదుల సంఘము) (అజ్=గతౌ సమ్+అజ్+అల్=సమజః)

అనట్' ప్రత్యయోదాహృతులు కర్మాద్యర్థకము -(ల్యుట్ పాణిని) ఛేదనము=(కత్తి) (ఛిద్=ఛేదే\ద్వైధీకరణే' ఛిద్+అనట్=ఛేదన) (కరణ కారకము) (దీనిచేత ఛేదింపఁబడును)

భావార్థకమగు అనట్'=(ల్యుట్ పాణినీయులు)

శయనము=(ప్రక్క- పరుండుట) (శీ=శయనే' శీ+అనట్=శయనమ్)

సన్నంతముపైని కర్త్రర్థమున ఉ ప్రత్యయము నిల్చును. ౩౦ (ముగ్ధ ౧౧౨౩ సూ) (సి-కౌ-౩౧౮౮ సూ)

హల్లునకుఁ బరముగ నున్న ధాతువు తుదినున్న అకార య' కారములకు శిద్ భిన్నము పరమగునపుడు లోపము కల్గును ౩౧ (ముగ్ధ ౭౭౪ సూ) (సి-కౌ-౨౩౦౮. ౨౬౩౧ సూ)

ఇమ్' ప్రత్యయము రానట్టి సన్' ప్రత్యయము పరమగుచుండఁగాఁ గొన్ని ధాతువుల అ' కారమునకు

(సం-కౌ-3-౨-33 సూ) ఈ ప్రత్యయోదాహృతి ఊక ప్రత్యయ యఙ్ లు గుదా

ఇస్ అనునది యగుటయు నభ్యాస లోపమును గల్గును సంయోగాదిస్థ సకారము లోపించును 3౨ (ముగ్ధ-౮౧౧-౨౧3 సూ) (సి - కౌ - ౨౬౨౦ - ౨౬౨3-3౮౦ సూ)

పయి సూత్రములచే ప్పున సన్నంతము లకు ఉ ప్రత్యయమును, సన్నంత స కారోపరిస్థమగు అ కారమునకు లోపమును నభ్యాస లోపమును ఇస్ అనునది వచ్చుటయు దీని సంయోగాది స' కారలోపము రాఁగా లిప్సు' మొదలగు రూపములు గల్గును

లిప్సువు=(లాభము ను బొందఁ గోరువాఁడు) (లభ్=లాభే లబ్ధుమిచ్ఛుః=లభ్+సన్+ఉ=లిప్సు ) (లాభమును బొందుట కిచ్ఛించువాఁడు) జిగీషువు=(జయేచ్ఛ గలవా డు) ( జి=జయే జేతు మిచ్ఛు=జి+స+ఉ= జిగీషు ) (జయించుట కిచ్ఛ గలవాఁడు) చికీర్షువు = (చేయ నిచ్ఛించు వాఁడు) ( కృఞ్=కరణే కర్తుమిచ్ఛు -కృ+స+ఉ=చికీర్షుః)

యఙంతములగు(లోపించినను) కొన్ని ధాతువులపైని ఊక-ఇ =(కి) అను ప్రత్యయములు కర్త్రర్థమున నిల్చును యఙంతములు కాకున్నను 'ఆదంతములు ఋదంతములు ఉపధాలోపులు నగు ధాతువులకు ( కి )= ఇ ప్రత్యయమగును అపుడు ధాతువు ద్విరుక్తి నందును 33 (ముగ్ధ-౧౧౧౭-౧౧౧౮-౬౧౧ సూ), (సి-కౌ-3౧౮౬-3౧౫౧ ఇందలి వార్తికము) (మూ-సం-క్రియా-౬-౧౧-౧౨ సూ)

యాయజూకుఁడు=(పున పున ర్యజ్ఞ శీలుఁడు) ( యజ్=పూజనే యజ్+యఙ్ లుక్ (సం-కి-౧౨ సూ )+ఊక=యాయజూకః)

దందశూకము=(పాము) (' దశ-శ=గర్హా దంశనే-దంశనేచ' దన్శ్+యఙ్ లుక్+ఊక=దన్దశూకః) (మాటిమాటికి గర్హముగ గఱచునది

వావదూకుఁడు=(వక్త ( వద్=వాచి ' వద్+యఙ్ లుక్+ఊక వావదూక ) (పున పున ర్వక్త)

చాచలి=(మిక్కిలి చలించునది) ('చల గతౌ'' చల్+యఙ్ లుక్+ఇ=చాచలిః )

యఙన్తములు కానివాని యుదాహృతులు .—

దాది=(ఇచ్చువాఁడు) ( దా=దానే'' దా+ఇ=దా+దా+ఇ=దాదిః) (ఇది ఆ' దంతోదాహృతి) జఘ్ని=(చంపువాఁడు) హన్=వధే'' హన్+ఇ=హన్+హన్+ఇ=జఘ్నిః) (ఇది ఉపధాలోపి)

'డు అనునది (ధాతు పాఠమున) యిద్వర్ణముగాఁ గల ధాతువునకుఁ దద్ధాత్వర్థమునుండి పుట్టిన యను వర్థమునందు 'త్రిమక్ అను ప్రత్యయ మగును ౩౪. (ముగ్ధ ౧౧౪౩ సూ) (సి-కౌ-౩_౨౬౬-౩౫౭౦ సూ)

కృత్రిమము=(అస్వాభావికము=ఒకరిచేఁ జేయఁబడినది) ( డు-కృఞ్=కరణే'' కృ+త్రిమక్=కృత్రిమః) పక్త్రిమము=(పండించినది)=( 'డు పచిష్=పాకే పచ్+త్రిమక్=పక్త్రిమః )

ఈ ప్రత్యయము భావార్థకము కాదనియు విశేషణమువంటి దనియు ముగ్ధబోధకర్తయగు వోపదేవుని యాశయము

శిన-అథు-నఙ్-కి-క్యప్-అ'' అను ప్రత్యయ ములు కొన్ని కొన్ని ధాతువులకు భావార్థమునం దగును. అట్టియెడల కొన్ని వ్యాకరణకార్యములు నగును ౩౫ (ముగ్ధ-౧౧౪౦ మొ ౧౧౫౬ వ సూ) (సి-కౌ-౩_౨౧౫ మొ )

సాంరావిణము = (కోలాహలము = బజారులోని కలకల ధ్వని) ణిన' అను నీ కృదంతముపైని 'ష్ణ' అను తద్ధితము నిల్వఁగా నేర్పడి నది.) ( రు=ధ్వనౌ'' సమ్+రు+ణిన+ష్ణ=సాంరావిణమ్). వేపథువు=(కంపము) (వేప=కమ్పే'' వేప+అథు=వేపథుః) యత్నము=(ప్రయత్నము) (యత్+నఙ్=యత్నః) యజ్ఞము=(అధ్వరము) ( యజ్=దేవపూజనే'' యజ్+నఙ్=యజ్ఞః) యాచ్ఞ=(ప్రార్థనము) ( యాచ్=

(సం-కృ-౩౨-౩౬ సూ) ణినాది ప్రత్యయోదాహృతి-సన్నంతములమీఁది అ ప్రత్య

యాచనే యాచ్+నజ్=యాఞ్ఞా) ఆది=(మొదటిది) ( దా=దానే
ఆ+దా+కి=ఆది ) అంతర్ధి=(అంతర్ధానము-వ్యవధానము) ( ధా=ధార
ణే అన్తర్+ధా+కి=(అన్తర్ధి ) ఇట్లు ప్రాదులకంటెను అన్తర్ అను
నవ్యయముకంటెను బరమైన ద-ధ లాదిని గల ధాతువులపైని కి
ప్రత్యయము నిల్చును

శయ్యా=(పాన్పు) ( శీ=శయనే శీ+క్యప్=శయ్యా) విద్యా=
(చదువు-జ్ఞానము) (విద=జ్ఞానే విద్+క్యప్=విద్యా) క్రియ=(కార్య
ము) ( కృఞ్=కరణే కృ+క్యప్=క్రియా) ప్రశంస=(స్తుతి) ( శన్స్=
స్తుతౌ ప్ర+శన్స్+అ=ప్రశంసా) పూజ=(అర్చ) ( పూజ్=పూజనే .
పూజ్+ణి+అ=పూజా) (సం-క్రి-౯ సూ చెప్పిన ణి లోపము )
త్రప=(లజ్జ) ( త్రప్=లజ్జాయామ్ త్రప్+అ=త్రపా) శ్రద్ధ=(స్పృహా)
(ధా=ధారణే శ్రత్+ధా+అ=శ్రద్ధా శ్రత్=శ్రద్ధా-అవ్యయ)

ఇట్లుగ క్యప్ ప్రత్యయాంతములును అ ప్రత్యయాంతము
లును స్త్రీలింగములె యగును

సనాది ప్రత్యయాంతములపైని భావార్థమున అ
ప్రత్యయము నిల్చును అ ప్రత్యయాంతములెల్ల స్త్రీ
లింగములె యగును ౩౬ (ముగ్ధ ౧౧౫౩ సూ) (సి-
కౌ-౩-౨౯ సూ )

దిదృక్ష=(చూచెడి యిచ్ఛ) (దృశ్=చాక్షుష జ్ఞానే దృశ్+
సన్+అ=దిదృక్షా) (సం-క్రియా-౬-౭-౮ సూ-చూ) జిగీష=(జయేచ్ఛ)
జి=జయే జి+సన్+అ=జిగీషా (చూ-సం-క్రి-౬-౭-౮ సూ )

కర్త్రాదికారకములందును భావార్థమునందును
ధాతువులకు క్తి ప్రత్యయ మగును కొన్నియెడల
దానిచోట ని అనునది నిల్చును. ఇవి తుదిని గల
శబ్దములు స్త్రీలింగములు ౩౭ (ముగ్ధ ౧౧౪౭ సూ)
(సి-కౌ-౩-౨౭-౨ సూ )

కృతి=(చేయఁబడిన పని) ("కృఞ్=కరణే" కృ+కర్మార్థ-క్తి=కృతిః). కృతి=(చేయుట=కరణము) ("కృఞ్=కరణే" కృ+భావార్థ-క్తి=కృతిః). బుద్ధి=(మతి) ("బుధ్=జ్ఞానే" బుధ్+కరణార్థ క్తి=బుద్ధిః) (బుధ్యతే అనయా.) స్మృతి=(స్మరణము) ("స్మృ=స్మరణే" స్మృ+క్తి-(భావార్థ)=స్మృతిః). హాని=(క్షతి) ("హా=గతౌ" హా+భావార్థ-క్తి=హానిః).

"ఈషత్-దుర్-సు" అనువానికంటెఁ బరమై యున్న ధాతువుపైని "అ(ఖల్)-అన" ప్రత్యయములు భావ కర్మార్థములందు నిల్చును. 3౮. (ముగ్ధ-౧౧౬౧ సూ) (సి-కౌ-33౦౫ సూ).

ఈషత్కరము=(ఈష త్ప్రయాస సాధ్యము) ("కృఞ్=కరణే" ఈషత్+కృ+(ఖల్) అ=ఈషత్కరః). (ఖత్త్వమువలనఁ గొన్నియెడల 'మన్' వచ్చును. అథ్యంభవము- (సం-కృత్-౧౧ సూ). దుష్కరము=(అతి కష్టముతోఁ జేయఁబడు పని) ("కృఞ్=కరణే" దుర్+కృ+(ఖల్)=అ=దుష్కరః). సుగమము=(సుఖముగాఁ జేరఁబడు పది) ("గమ్=గతౌ" సు+గమ్+(ఖల్) అ=సుగమః). సుయోధనుఁడు=(కురు రాజు) ("యుధ్=యుద్ధే." సు+యుధ్+అన (కర్మార్థ)=సుయోధనః)=(సుఖముగా వీనిచే యుద్ధము చేయఁబడును.) దుశ్శాసనుఁడు=(కురు యువరాజు) ("శాస=శాసనే" దుర్+శాస్+కర్మార్థ అన=దుశ్శాసనః.) (వీనిచే దుష్టముగా శాసింపఁబడును).

ణ్యంతములపైని 'విద్' మున్నగు కొన్ని ధాతువులపైని 'అన' ప్రత్యయము నిల్చును. తదంత నామము స్త్రీలింగ మగును. 3౯. (ముగ్ధ-౧౧౫౮ సూ) (సి-కౌ-3౨౮౭. దీని క్రింది వార్తికమును) (దీనిని పాణినీయులు 'యుచ్' ప్రత్యయ మందురు.) (నపుంసక మగు 'అన' ప్రత్యయాంతమును ల్యుడంతమందురు.)

కారణ=(యాతన) ("కౄ=హింసాయామ్" కౄ+ణి+(లోప)+అన=కారణా). వేదన=(దుఃఖానుభవము) ("విద్=లాభే" విద్+అన=వేదనా). "లాభార్థా ద్విదే ర్యుచ్. వ్యాఖ్యానాత్. "విద=జ్ఞానే" ఇత్యస్యతు వృత్తిః. "విద=వేద నాఖ్యాన నివాసేషు" ఇతి చురాదేస్తు ణ్యాసశ్రన్థ ఇతి యుచి వేదనేత్యపి" (సి-కౌ-బాలమనోరమా వ్యాఖ్య-౧౧౫౨ పుట.) శబ్దస్తోమ మహానిధిలో 'ల్యుట్=అన' వచ్చు జ్ఞానార్థక ధాతువుపైనే 'యుచ్' ప్రత్యయము నిల్పి "వేదనా" అను పది సాధింపఁబడెను.

ఇంక "తుమ్-క్త్వా=యప్ ణమ్" అనునవి యవ్యయము లగుటచేఁ దెల్గున వానికిఁ బ్రయోగ ముండదు. అయినను సుప్రసిద్ధములును ననుకరణాది ప్రయోగార్హములును నగుటచే నవి యిటఁ జెప్పఁబడుచున్నవి.

సమాన కర్తృకములగు రెండు క్రియలలో నేది రెండవదానికిఁ బ్రయోజన మగునట్లు వాడఁబడునో యట్టి ధాతువుపైని భవిష్యదర్థమున భావార్థము వాచ్య మగుచుండఁగా "తుమ్" ప్రత్యయమగును. ౮౦. (ముగ్ధ ౧౧౬౮ సూ) (సి-కౌ-౩౧౭౪ సూ).

'కృఞ్=కరణే' (కృ=కర్+తుమ్=కర్తుమ్). "కర్తుం యాతి=(చేయుట నిమిత్తము వెళ్ళుచున్నాఁడు. ఇట వెళ్ళుటకుఁ జేయుట ప్రయోజనము గానఁ 'చేయు' అను నర్థముగల 'కృఞ్' అను ధాతువుపైని 'తుమ్' ప్రత్యయము నిల్చినది.

సమాన కర్తృక క్రియలలోఁ బూర్వకాలిక మగు ధాతువుపైని 'క్త్వా' ప్రత్యయము నిల్చును. ఇది పర మగునప్పుడు "గుణము 'ఇమ్' ప్రత్యయము" అనునవి వచ్చుట మొదలగు వ్యాకరణ కార్యములును బ్రయోగానుసారముగ నగును. ౮౧. (ముగ్ధ-౧౧౬౬ సూ. మొ) (సి-కౌ-౩౩౨౦ మొ).

ఇందలి 'క' కారము గుణాభావమును దెల్పు నిదర్శము.

శయిత్వా యయౌ=పరుండి వెళ్ళెను.) ("శీ=శయనే". శీ=శే=శయ్+ఇ+త్వా=శయిత్వా) (ఇచట 'ఇమ్' అనుదానికి గుణము కిత్త్వముచే లేదు). "శ్రు=శ్రవణే". శ్రు+క్త్వా=శ్రుత్వా యయౌ=(విని వెళ్ళెను).

సమాసమున 'నఞ్' భిన్నమగు నవ్యయము మీఁది ధాతువుపై నున్న 'క్త్వా' ప్రత్యయమునకు 'యప్' అను నాదేశ మగును. ౪౨. (ముగ్ధ-౧౧౭౬. మొ.) (సి-కౌ-333౨. మొ.)

ఇందలి 'ప' కారము హ్రస్వముమీఁద 'త' కార మగునని తెల్పు నిదర్శనము. ("కృఞ్=కరణే". ప్ర+కృ+త్+య=ప్రకృత్య) (ప్రకృష్టగఁ జేసి). ('నఞ్' మీఁద 'య'ప్పు రాదు. "అకృత్వా=(చేయక వచ్చెను . ("హన్=వధే". ని+హన్+యప్=ని+హ(న్)+త్+య=నిహత్య యయౌ). (సం-కృ-౧౫. సూ. చొప్పున ననునాసిక లోపము). ఆదాయ, ఇట 'త్' కారము రాలేదు- ఆదంత ధాతువు.

'మాటిమాటికి' అను నర్థము వాచ్యమగుచుం డఁగా భూతార్థమున 'ణమ్' ప్రత్యయము వికల్పముగా నగును. ౪3. (ముగ్ధ-౧౧౮3 సూ) (సి-కౌ-33౪3-౨౧౪౦ సూ).

'ణ' కార మాద్యచ్చునకు వృద్ధియగునని తెల్పు నిదర్శనము. "స్మృ=స్మరణే". స్మృ=స్మార్+అమ్=స్మారం స్మారం నమతి=స్మృత్వా స్మృత్వా నమతి=(స్మరించి స్మరించి నమస్కరించు చున్నాఁడు).

ఇది సంస్కృత కృత్ప్రకరిచ్ఛే

గ్రంథము ముగిసెను.

— 16,030

# గుణవద్గణాగుణవద్గణములు

శ్లో॥ ప్రథమై వచన తుల్యం సర్వత్ర హలన్త మగుణవత్ ప్రకృతి
గుణవద్గణే ద్వితీయై క వచన తుల్యోభవే ద్విశ్రుతౌ

శ్లో॥ ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వా ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్
అగుణవతాం సర్వహలాం స్యాల్లోపో గుణవతాం డుమూ ప్రాగ్వత్

అని హలంతములు సంస్కృతములు తెలుగునకు వచ్చెడివిధి నన్నయ చెప్పెను. దీని తాత్పర్యమును వివరించెదను

హలంతములగు సంస్కృతములు తత్సమములగునపుడు గుణవద్గణము నగుణవద్గణమునని ద్వివిధముగ వచ్చును. గుణవద్గణము గానిది యగుణవద్గణమని తాత్పర్యము. ఇది మహదమహత్తులకు వ టది. అగుణవద్గణము సంస్కృత ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికముగను గుణవద్గణము సంస్కృత ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికముగను నుండును

అగుణవద్గణ గతములలో దుదిని హల్లుగల్గినచో నాహల్లు హ్రస్వపూర్వక మగునేని నిత్యముగను దీర్ఘపూర్వకమగునేని వైకల్పికముగను ద్విత్వమునందును - వానిమీద ఉకారము నిల్చును. ప్రాతిపదికము తుదిని హల్లులేనియెడల నజంతములవలె రూపసిద్ధినొందును. గుణవద్గణగతముల తుదిని నిల్చిన మకారము లోపించును. ఎదప నది యజంతమైయగును గాన దాని రూపసిద్ధియు నజంతములవలెనే కల్గును. అగుణవద్గణ గతములలో దుదిని హల్లునిల్చునపుడు చర్త్వరూపమే ప్రాతిపదికమగును అనగా ఖరములు దుదినిగలవి ప్రాతిపదికములగును. ఇట్లుగ ఉకారము వచ్చుశబ్దములకు ప్రథమైకవచనమగు సు ప్రత్యయము లోపించును. పుంలింగరూప మున్నపుడు దాని యితర లింగములందును నా పుంలింగ ప్రాతిపదికమే దానికగును. ఉదా విద్వాంసుడు - విద్వాంసము మొ

సంస్కృత ప్రథమైకవచనమున టాంతములగు జాంతములును ఉదా రాట్టు మొ చాంత శబ్దములును సంజ్ఞావాచకములగు తాంతశబ్దములును నాంత శాంతములును నగుణవద్గణములో జేరును. సంస్కృత ప్రథమైకవచనమున కాంతములగు జాంతములును తాంత దాంత ధాంత హాంతములును విద్వస్ మున్నగు వస్వంతములును గుణవద్గణములో జేరును

ద్విరదగతిరగడ నిండు చందురుడు నీసెమ్మొగమ్ము సుహృత్తు
గండుగోయిల ఫణితి కలభాషలకు తొత్తు
ప్రభావతీ ప్రద్యుమ్నము ౪-ఆశ్వా ౧౫౭

కం॥ ఆద్యంత ప్రాసంబుల " అను రగడల నియమముచొప్పున నిందలి "సుహృత్తు" అనునది మార్పరాదు. అట్లయినను మహాభారతవిరుద్ధమగుటచేత నిది ప్రామాణికము కాదు. వ్యావహారిక పదమేయని గ్రహింపవలెను

కం॥ సృంజయ కే కయ యదు పాంచాలు రాదగా గల సుహృదుల్
ఆరణ్య-౧ ఆ ౨౪౯ ప

క॥ అలఘులు రైభ్య భరద్వాజులు దనులా సుహృదులై విశుద్ధ తపోనిశ్చలిత... ...
(అరణ్య-3 అ-౨౯౨ ప)

క॥ ... ... మోదం బొసఁగ వెలిఁచెన్ సుహృన్మిత్ర పుణ్యాహ్వయనగరిన్
(ఆది-౫ ఆ-3౨ ప)

ఇట్లు దాంతమగు సుహృచ్ఛబ్దము గుణవద్గణములోనిది యని భారతప్రయోగములవలన సిద్ధమగుటచేత నీ శబ్దంగళి సూరకవి మహాకవియైనను నితని ప్రయోగము గ్రాహ్యముకాదనియు వ్యావహారికమే యనియు గ్రహింపవలెను. దీనినిబట్టి దాంతములై యగుటచేత "ఉపనిషత్తులు - ఆంధ్రసాహిత్య పరిషత్తు - ఆంధ్ర విశ్వకళాపరిషత్తు" మొదలగునవెల్ల వ్యావహారికపదములే యనియు "ఉపనిషదము - ఆంధ్రసాహిత్య పరిషదము - ఆంధ్ర విశ్వకళా పరిషదము" అని యుండవలెననియు విశదమగుచున్నది. ఇవి స్త్రీలింగములైనను మహద్ధులలోనివి. భారతమున దాంతములెల్ల గుణవద్గణములుగనే ప్రయోగింపఁబడియున్నవి. ("ప్రథ-సుహృత్-సుహృద్-సుహృదా-సుహృదః-ద్వితీ. సుహృదమ్-సుహృదా-సుహృదః" ఇట్టి తక్కినవి గ్రహించునది.)

చ॥ "ఉడిగి సభాసదుల్ వల్కకుండిరి ... ... ..." (సభా-౨ ఆశ్వా ౩౧ ప)

సీ॥ శాస్త్రోక్త ప్రవరుల బ్రహ్మవిదుల ... ... ... (సభా-౨-ఆ ౧౨౧)

చ॥ ధర్మసుత విదురుల నున్న యాచితవిధుల వంశము నేఁడధర్మసంపద నతిసాద్యమయ్యె ... ... ... (సభా-౨ ఆశ్వా ౨౧౯ ప)

గీ॥ ... ... ... ... ధర్మసుతవిదురుఁడవు (సభా-౨ ఆ ౨౮౦ ప)

చ॥ ... ... ... విధాత్రసంపదయును ... ... ...
(ఉద్యోగ-౮ ఆశ్వా ౨౮౬ ప)

క॥ ... ... ఎట్టి యున్నతజల సంపదులైన జీవులును నా యెదురను ... ...
(అర-౮ ఆశ్వా ౧౧౦ నన్నయడే)

కం॥ ఆపద గడచం బెట్టఁగ నోపి... ... ... ..

క॥ ... ... ఆపదగా కవ్విధము సుఖావహ్యమగు నే (శాంతి ౮ ఆశ్వా 3ప)

మ॥ మద మాతంగ... ... సంపద లోలిన్... ... (సభా-౧ ఆ ౧౯ ప)

ఇట్లు నన్నయ తిక్కన లిద్దఱును ప్రయోగించిరి. ఒక్కటనైన "సంపత్తు" అని యగుణవద్గణముగాఁ బ్రయోగింపలేదు.

క॥ నారాయణి మమసు నీ సారాఖ్యానంబు వినినఁ జదివిన సంపత్తారోగ్యాయు స్సద్గతు లేరికి... ... ..." అని ముద్రిత పుస్తకములలో నున్నను తాళపత్రమాతృకలలో "సంపత్తారోగ్యాయు స్సద్గతు లేరికి... .. అని యున్నది. ఇదియే కవి ప్రయుక్తపాఠమనఁదగును.

## శ్రీనాథాది మహాకవి ప్రయోగములు.

సీ॥ ప్రణవ పంచాక్షర బ్రహ్మ విద్యా మహా, పనిషత్తు నీపాణి పల్లవాగ్రము ... ... ...
(కాశీ ౨ ఆశ్వా-౬౯ ప)

సీ పరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీయోపనిషత్తు నభ్యుపగమించు

(కాశీ ౨ అశ్వా-౧౫౧)

వీనిని సవరింపనగును కాన వీనిని శ్రీనాథుడు ప్రయోగింపలేదేమో ?

సీ ప్రణవ పంచాక్షర బ్రహ్మవిద్యా మహోపనిషద మీమాంసిపల్లవాగ్రము

సీ పరిపాటి ముండకం బురియాడి తాపనీయోపనిషదము నభ్యుపగమించు

అని శ్రీనాథుఁడు ప్రయోగించెనేమో? ఇట్లె

గీ "శైవ పరిషత్తు గూడి వైష్ణవులనవ్వ" (కాశీ 2 అశ్వా ౨33 పద్య)

అనుచోట "శైవపరిషదమునను వైష్ణవులనవ్వ" అని ప్రయోగించెనేమో ? ఇట్లె

సీ॥ "ప్రత్యయంబు తనూనపాత్తు బాడబులకు అనుచోట (కాశీ-3అశ్వా-౨౦౬ప)

"ప్రత్యయంబు తనూనపాతుడు ద్విజులకు . . " అని శ్రీనాథుడు ప్రయోగించెనేమో?

- శ్రీనాథుఁడు ప్రయోగించెనని ఉపనిషత్తులు" మొదలగువాని నొప్పుకొన్నను నవి వ్యావహారిక పదములెయనియు నగ్రాహ్యములెయనియు చెప్పవచ్చును దాంత తాంతములు గుణవర్ణము లోని యనియొకదా భారతప్రయోగములున్నవి

కం భవ జ్జనకుఁ బరీక్షితుఁ భుజగబాల్కుఁడు

ఆది ౧ ఆ ౧౨౧ ప)

~~అని శ కారాంతములును గుణవర్ణంబు ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికము ననియొకదా భారత~~ ప్రయుక్తము.

శ్రీనాథుని యీక్రిందిప్రయోగ మంగీకరింపరాదని యొప్పికొనక తీరదుగదా

సీ విడువంగవచ్చునే విఘ్నాంధకారార్కుఁ డుంఠి విఘ్నేశు మందూక జరఠ

(కాశీఖండము ౨ అశ్వా ౧౧౨ ప)

సీ॥ కంఠాగ్ర కరిరాజు డుంఠి విఘ్నేశుండు

(కాశీ పీఠిక-౧ అశ్వా ౨ ప)

ఈశ్రీనాథుని ప్రాసప్రయోగము నాశ్రయించి తరిగొప్పుల మల్లన్నకవియు బ్రయోగించెను

శా కంఠేకాల పదారవిందములపైఁ గైవ్రాలి లోలార్కునిన్

ధుంఠీశున్ వికటించి (చంద్రభానుచరిత్రము 3 అశ్వా ౭౨ప)

వీని నుదాహరించి శ్రీ సూర్యరాయ నిఘంటువునం దిట్లు వ్రాయఁబడెను

"ఢుంఠి సం-వి-ఇ-పుం కాశిలో వాయవ్య దిక్కుననుండు విఘ్నేశ్వరుండు

కాని డుంఠి శబ్దమె యగపడదు (శ్రీ-సూ-రా-ని)

శ్లో "ధుణ్ఢాన్వేషణ ఇత్యేకో ఢకారాన్తః ప్రకీర్తిత "

(కవికల్పద్రుమ ధాతు పాఠము)

సంస్కృత ప్రామాణిక కోశములలో "ధుంఠి" శబ్దమే లేదు "ధుణ్ఢి" శబ్దమే యగపడు చున్నది.

ఢుణ్ఢి -పు-గణేశే (సర్వశబ్ద సంబోధిని) ఢుణ్ఢి -ప్ర-గణేశ్వర విశేషే. యథా - "అన్వేషణే ఢుంఢిరయం ప్రథితోస్తి ధాతు స్సర్వార్థ ఢుణ్ఢిత తయా తవ ఢుణ్ఢి నామా కాశీ ప్రవేశమపి కో లభతేఽత్ర దేహీ తోషం వినా తవ వినాయక ఢుణ్ఢిరాజ" ఇతి కాశీ ఖణ్డే గణేశం ప్రతి శివవాక్యమ్" (శబ్దార్థచింతామణి కోశము)

ఇట్లే "వాచస్పత్యము" శబ్దకల్పద్రుమము" అను కోశములందు నుదాహరింపఁబడెను గ్రంథ విస్తర భీతిచే వాని నుదాహరింపలేదు

ప్రసంగవశమున శ్రీనాథుని డుంఠి శబ్దము విమర్శింపఁబడినది గాని యది ప్రస్తుతము కాదు ప్రకృత మనుసరింతము

సీ ఋత్విజుండని విచారించి పూజింతే (సభా-౨ ఆ ౧౧ ప)

మత్తకోకిలము స్నాతకుండును ఋత్విజుండును (సభా ౨ ఆశ్వా-౪ ప)

సీ ఋత్విజుండుగఁ గ్రతువొనర్చుచు నుండ .. (శాంతి 3 ఆ ౧౧౬ ప)

అని భారతమందెచ్చటను ఋత్విజుండు అనియే యుండుటచేత "ఋత్విక్కుల వెతిచి ఋత్విక్కుల బాధించి" (వరాహపురాణము ౫ ఆశ్వా-౧౧౫) అను ఘంట సింగయ్య వరాహపురాణ ప్రయోగములోని ఋత్విక్కులు" అనునది వ్యాకరణవిరుద్ధమె యని గ్రహింపఁదగును

ప్రథమైకవచనమున కాంతము లగు జాంతములెల్ల గుణవర్ధనకములుగానే భారతమునఁ బ్రయోగింపఁబడెను

మత్తకోకిలము సంయముండును బూజనీయులు (సభా ౨ ఆశ్వా ౪ ప)

మత్తకోకిలము దో ష్షోద్ధతిన్ రజలుద్భవింపఁగ... (స్త్రీపర్వ-౧ ఆ ౪౧ ప)

గీ "భుక్పదమునకు భుజుండగు భూభుజుండు" (ఆం-భూ ౪౦ ప)

అని ప్రాచీనుఁడగు కేతన వచించియున్నాఁడు కాన వరాహపురాణ ప్రాసప్రయోగము కావ్యభాషలో గ్రాహ్యము కానేరదు గుణవర్ధనములోఁ జేరినది యగుణవర్ధనములోఁ జేరదనియు నట్లే యగుణవర్ధనములోఁ జేరినది గుణవర్ధనములోఁ జేరనేరదనియు నన్నయభట్ట సిద్ధాంతమని యీవఱకు వ్రాసి యున్నాను ఈ సిద్ధాంతము కవిశిరోభూషణకర్తకుఁ గొంత దెలియునని చెప్పవలసియున్నది

"గుణవర్ధన వ్యతిరిక్తం హలంతం ప్రథమైకవచనతుల్యం స్యాత్" అని "అగుణవర్ధన శబ్దమున కర్థము వ్రాసియున్నాఁడు (880 పుట-కవిశిరోభూషణము) ఋత్విజుఁడు "ఋత్విజుండని విచారించి పూజింతే" ఇత్యాచార్యః - సుహృదుఁడు - వేదవిదుఁడు" (కవిశి - 3౭౫ పుట) అని యుదాహరించెను అతఁడు "ఋత్విక్కు - సుహృత్తు - వేదవిత్తు" అనురూపముల నుదాహరింపలేదు కాని "పరీక్షితుఁడు" అని యుదాహరించియు (కవిశి-3౭౬ పు) "మరుత్తు" (కవిశిరో 3౭౬ పు) అనురూపము నుదాహరించుట "ఋత్విజుఁడు" అని యుదాహరించియు "ప్రత్యక్కు-అస్పృక్కు" అని యుదాహరించుట (కవిశిరో-3౭౭ పుట) సరయఁగా నీ నన్నయ సిద్ధాంతమును సరిగాఁ దెలిసికొనలేదని తోఁచుచున్నది

ఇంతియకాక సూరిగారి ఒకానొకచో మహత్త్వంబునందు మత్తుప్తకారంబుఁ నానాదేశంబు విభాషనగు" ననుసూత్రమున కాధారములుగ "భగవానుఁడు-హనుమానుఁడు" (కవిశిరో 3౭౫ పుట)

# కౌముదీ రజతోత్సవ సభాధ్యక్షోపన్యాసము

అను రూపముల నుదాహరించుటయే కాక "ప్రీతానుఁడు" (కవిశిరో ౩౮౨ పుట) అనియు నుదాహరించెను "ప్రీతానుఁడు-ప్రథమై వచన తుల్యత్వం దీర్ఘాత్పరత్వా న్న ద్విత్వమ్ (కవిశిరో ౩౮౨ పుట) అను నీతని వ్రాఁతనుబట్టి అగుణవతాం సర్వహాలాం సో ర్లోపః" అను చింతామణిసూత్రము నెట్లు వ్యాఖ్యానించెనో తెలియకున్నది ఉగాగమము వచ్చుటచేత ను అను ప్రథమైకవచనమునకు లోపము చెప్పియు వానికి డు ప్రత్యయము నెట్లుచేసెనో తెలియకున్నది ఈవ్రాఁతకు నాధారముగా నీక్రింది ప్రయోగమున్నది చ గొనకొని హేమచారు మణికుండల మండితమైన యింద్రజిత్తుని తల తత్‌క్షణంబునన త్రుంచి (భాస్కరరామా - యుద్ధకాం - ౧౩౭౮-అయ్యలార్యునిది) (వ్యా - సం ౬౨౭ పుట) డు మంతముకానిచో దీనికి ని గాగమ మెట్లువచ్చును? ఈ ప్రయోగము వ్యవహారస్థమునుగాదు

కొన్ని యలంతిపదములకుఁ బ్రథమైక వచనతుల్య ద్వితీయైకవచనతుల్య ప్రాతిపదికములు రెండును నుండునని సూరి "ఋత్విక్కు ఋత్విజుఁడు నీవృత్తు-నీవృతము అని యుదాహరించి ఋత్విగాదు లాకృతిగణమని చెప్పుటచేత బాలవ్యాకరణ వ్యాఖ్యాతలగు (కీ శే॥) బ్రహ్మశ్రీ కల్లూరు వేంకటరామశాస్త్రులుగారనేక పదములను ద్వైరూప్యము గలవానినిగాఁ బ్రయోగములు చూపకయే యుదాహరించిరి

"వణిక్కు=వణిజుఁడు పుష్పముక్కు=పుష్పముచుఁడు వేదవిత్తు=వేదవిదుఁడు పాలితకకుప్పు=పాలితకకుభుఁడు ఘృతస్పృక్కు=ఘృతస్పృశుఁడు సురద్విట్టు=సురద్విషుఁడు అమృతలిట్టు=అమృతలిహుఁడు, త్వక్కు=త్వచము, తటిత్తు=తటితము జలముక్కు=జలముచుఁడు, మధులిట్టు=మధులిహము కకుప్పు=కకుభము ప్రావృట్టు=ప్రావృషము, ఆపత్తు=ఆపద, త్విట్టు=త్విష, సంపత్తు=సంపద క్షుత్తు=క్షుధ దృక్కు=దృశ, దిక్కు=దిశ రుక్కు=రుజ" బా-గు-ప్ర ౧౩౪౭-౧౩౪౮ పుటలు) ఆకృతి గణములో నున్నదనుటకుఁ బ్రయోగము చూపవలదా?

శబ్దరత్నాకరాది కోశకర్తలును బ్రయోగములను జూపకయే యెవ్వరికిఁదోఁచిన రూపములను వారుదాహరించిరి దిఙ్మాత్రము నుదాహరించెదను.

ఋత్విజుఁడు శ-ర) ఋత్విజుఁడు=ఋత్విక్కు (సూ-రా-ని) నీవృత్తు (శ-ర) నీవృత్తు=నీవృతము (సూ-రా-ని) ఆపద (శ-ర) ఆపత్తు=ఆపద (సూ-రా-ని) కకుప్పు (శ-ర) కకుప్పు=కకుభ్ఖ (సూ-రా-ని) (కకుభము అకారాంతము) కకుత్తు- శ-ర-సూ-రా-ని) (కకుదము అకారాంతము)

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమునందును బాలవ్యాకరణోద్ద్యోతమునందును "సత్యజిత్ ఇంద్రజిత్" అను శబ్దములకును తకారాంత మహన్మహతీవాచకములకును భారత ప్రయోగానురోధమున ద్వివిధరూపములును నుండనగునని చెప్ప బడెను కాని వానికిని ద్వివిధరూపములుండునని యంగీకరింపనక్కఱలేదు (బాలవ్యాకరణోద్ద్యోతము ౧౨౭ పుట)

సత్యజి చ్ఛబ్దమునకు ద్వివిధరూపము లుండునని చెప్పనేల? ఆ పై సత్యజిత్తుమేన సాయకదళకంబు" (భార ద్రోణ ౧౪-౨౮౭ ప) అనచోటఁ దిక్కయజ్వ "సత్యజితుని మేనసాయకదళకంబు" అనియె ప్రయోగించి యుండునని చెప్పనగును అప్పుడది తక్కిన తాంతములవలెనె గుణవర్ధనములోనె చేరియుండును

ఉ నీకొడు కింద్రజిత్తు రజనీచర నాయక

(భాస్కరరామా యుద్ధ ౧౦౬3) అను మంత్రి భాస్కరమహాకవి ప్రయోగమున నది యగుణవద్గణముగా నంగీకరింపఁబడినదే యైనను తక్కినతాంతములెల్ల (పరీక్షితుఁడు మొ) ద్వితీయైకవచన ప్రాతిపదికములై గుణవద్గణములో మహాభారతమునఁ బ్రయోగింపఁబడుటచేత (భారత విరుద్ధమై యుండుటచేత) నగ్రాహ్యమై వ్యావహారిక పదమె యగుఁదగున మహన్మహాతీ వాచకము లగు సాంతములు గుణవద్గణములోనివే యనవగును అట్లయిన తే గీ ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ డూర్ధ్వ రేతుఁడైన కణ్వమహాముని (ఆది-౪ఆ-3౨) మున్నగు భారతప్రయోగములు విరోధిం పవా యని శంకింపఁజనదు నన్నయ విరచితమగు నాంధ్రశబ్దచింతామణిలో "సాన్తాదపయాః ప్రభృతేః స్లోపో న్వేషాంచ వాలుగన్తస్య" అని చెప్పఁబడుటచేత ఊర్ధ్వరేతుఁడు' మున్నగు మహన్మహాతీ ప్రాతిపదిక శబ్దములకు సాన్తములకుఁ బాక్షికముగా సకారలోపమును జేయవలయును కాఁగా రామ శబ్దమునకు వలెనె సకార లోపానంతరమున నుత్వాదులు రాఁగా "ఊర్ధ్వరేతుఁడు మున్నగు రూపములు సిద్ధించును తే గీ "తపన తేజ సరస్వతి దక్షిణమున " (ఆర ౨౫-౨౧౯ ప) అప్సరది మొదలగు స్త్రీలింగములకు సకారలోపానన్తరమున రమాశబ్దమువలె వలెనె రూపసిద్ధి యగును గాన తపన తేజ మున్నగురూపములు సిద్ధించును ఇవి ద్వితీయైక వచనాంతతుల్య ప్రాతిపదికములు గాన "ఊర్ధ్వరేతసుఁడు తపనతేజస" మున్నగు రూపములు సిద్ధించును

కం [illegible] తేజులందఱును నూర్ధ్వరేతసు [illegible]

"హలంతస్తస్య అను సీమాత్రమునందలి వా శబ్దము వ్యవస్థావాచిగాన నపుంసకలింగములగు 'మనస్' మున్నగువానికి (ద్వితీయైక వచనాంతతుల్య ప్రాతిపదిక వత్త్వమే లేదు కాన మనసము మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు సకారలోపము పక్షమున మనము మున్నగురూపములు సిద్ధించును - వాశబ్ద వ్యవస్థావాచిత్వము చేతనే వానికి మనస్సు-మనసు మున్నగురూపములు గలుగును అనఁగా సకారమునకు ద్విత్వోత్వములును బాక్షికతయుఁ గల్గువని చెప్పనొప్పును

కోడుగంటివారివీధి
విజయనగరము
14-9-1960

ఇట్లు సుజనవిధేయుఁడు,
వఝల చినసీతారామస్వామిశాస్త్రి

